చిలకమర్తి లక్ష్మీనృసింహకవి

# సంపూర్ణ గ్రంథావళి



## షష్టిపూర్తి ముద్రణము

## ౮-వ సంపుటము—జీవితములు

సిద్ధార్థచరిత్రము - నానకుచరిత్రము - గురుగోవిందుచరిత్రము

రామకృష్ణపరమహంసచరిత్ర - నందచరిత్ర - మహాపురుషులజీవితములు.



షష్టిపూర్తి సంఘకార్యదర్శి:

పాలకోడేటి గురుమూర్తిగారిచే

ప్రకటితము.

1927

 [ Price Rs. 3




## పీఠిక.

సర్వజగన్మాన్యుఁడైన గౌతమబుద్ధదేవుని చరిత్రము వచనరూపమున రచియించి యాంధ్రమహాజనులకు సమర్పింపవలెనని నాకుఁ జిరకాలమనోరథము గలదు. దానికివలయు గ్రంథసాధనసామగ్రి సుకరముగ లభింపనందున మనోరథసిద్ధి తడవయ్యెను. ఎట్టకేలకు నాకోరిక సఫలముచేసినందుకుఁ బరమేశ్వరునకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడను. ఈగ్రంథరచనమునందు నాకాంగ్లేయభాషలో రచియింపఁబడినయనేక బుద్ధచరిత్రములు తోడుపడినవి. కాని సకలగ్రంథములసారమని చెప్పఁదగిన మన్మథనాథశాస్త్రిగారిచే రచియింపఁబడిన బుద్ధచరిత్రము మిక్కిలి ప్రశస్తమగుటచే నేను విశేషముగ దానినే యనుసరించితిని. మఱియుఁ దమతమగ్రంథముల మూలమున నాకత్యంతసహాయము చేసిన రీసుడేవిడ్సు, మన్మథనాథశాస్త్రి, రమేశచంద్రదత్తు మొదలగు బుద్ధచరితాసముద్రపారంగతులకు నేను కృతజ్ఞతాపూర్వకముగ ప్రణామము లాచరించుచున్నాఁడ. బుద్ధునకు మొట్టమొదట తల్లిదండ్రులుపెట్టిననామము సిద్ధార్థుఁడగుటచే గ్రంథమునకు నేను సిద్ధార్థచరిత్రమని పేరు పెట్టితిని.

ఇట్లు,

చిలకమర్తి లక్ష్మీనరసింహం.



# సిద్ధార్థచరిత్రము

## ప్రథమాధ్యాయము.

జ్ఞానదారిద్ర్యముచేతను ధనదారిద్ర్యముచేతను ధర్మపథభ్రష్టులై యధఃపతితులై నిరంతరదుఃఖ మనుభవించుచుండు మానవులఁ జూచి జాలినొంది పాపపంకమునుండి వారిని సముద్ధరించుటకై తమ దేహబలమును మనోబలమును సంపదను విజ్ఞానసంపదను విలువగలకాలమును నవసరమైనపట్లఁ బ్రాణమును ధారవోసి లోకోపకారపరాయణులై కృతార్థులైన మహామహులు యుగయుగంబున దేశదేశంబునఁ గలరు. ఈవిషయమున భరతఖండము తక్కిన దేశముల కెంతమాత్రముఁ దీసిపోవునది కాదు. ఈవిషయమున నితర దేశములకన్న మన దేశము మిన్నయని గూడ చెప్పవచ్చును. ఆత్మలాభపరాఙ్ముఖులై పరోపకారదీక్షాపరతంత్రులై లోకోత్తరచరిత్రులై వెలసిన యనేకపురుషరత్నములకు భరతవర్షము గొప్పగనియయ్యెననుట యతిశయోక్తిగాదు. కాని మనపూర్వులు చరిత్రలు జీవితములు వ్రాయుట కాకిపండ్లు లెక్కపెట్టుటవంటి నిరర్థకప్రయోజనమని భావించి చరిత్రరచనమునెడ ననాదరము జూపుటచే నట్టి యుదారశీలుర పవిత్రచరిత్రములు చదువుకొనుభాగ్యము మన కబ్బదయ్యెను. ఆంగ్లేయసాంప్రదాయముల ననుసరించి యీనాఁటి బుద్ధిమంతులు విరచించుచున్న దేశచరిత్రములు జీవచరిత్రములు గొన్నిదక్క మనప్రాచీనులు రచించినచరిత్రలు మనభాషలో లేనే లేవని చెప్పవచ్చును. సంస్కృతమునం

దు రాజతరంగిణి మొదలగు కొన్ని దేశచరిత్రములు హర్షచరిత్రము విక్రమాంకదేవచరిత్రము మొదలగుకొన్ని జీవచరిత్రములు కలవు. కాని యవి యథార్థవిషయముల కునికిపట్లు గాక యతిశయోక్తులకాలవాలములయి యలంకారముల కాటపట్లులై శ్లేషకవిత్వాదులకుఁ దానకములై విశ్వసింపరాని విపరీత కథలతోడను వర్ణనలతోడను నిండియుండును. వేయేల? ఆగ్రంథముల కుండవలసిన చరిత్రరూపములకు మాఱుగ నద్భుత కథల వాలకములు వచ్చియున్నవి. మన ప్రాచీనులకు యథార్థచరిత్రరచనాకుతూహలము లేకపోవుటచేతనే గదా వ్యాసవాల్మీకి ప్రముఖ మహాకవులయొక్కయుఁ గాళిదాసభవభూతిప్రభృతికవిసార్వభౌములయొక్కయుఁ గపిలకాణాదపాణినిపతంజలులాదిగాఁ గల శాస్త్రకర్తలయొక్కయు బుద్ధదేవ శంకర రామానుజాచార్యాది ధర్మసంస్థాపకులయొక్కయుఁ జంద్రగుప్త విక్రమాదిత్య హర్ష భోజముఖ్యులగు మహీపాలకుల యొక్కయు జరిత్రములు మనకుగగనారవిందములై దుర్లభములై యుండవలసివచ్చెను. ఈచరిత్ర దారిద్ర్యముచేతనేగదాజగజ్జేగీయమానయశోవిశారదుఁడై మానవజాతికిమండనమైనక్షత్రవంశమున కలంకారమై భారతవర్ష తిలకమై స్వార్థత్యాగులలో నగ్రగణ్యుఁడై భూతదయాళువులలో మొట్టమొదటివాఁడై జితేంద్రియులలో శ్రేష్ఠుఁడై జగదానందమే తనయానందమనియు జగత్పీడయె తనపీడ యనియు భావించి నిర్హేతుకజాయమానకృపతోఁ గేవలము మానవలోకము నుద్ధరించు తలంపునఁ దాను రాజకుమారుఁడయ్యు నాగర్భశ్రీమంతుఁడయ్యు సింహాసనాధిరోహణకాలము సమీపించుచున్నవాఁడయ్యు సవిమెల్ల విడిచి జగన్మోహనాకారిణియగు భార్యను విడిచి యప్పుడే జన్మించి 'కావుకావు' మని యేడ్చుచున్నకుమారుని విడిచి నగరము రోసి నట్టడవి నపేక్షించి స్వర్ణకిరీటము రోసి జటాజూటము ధరింప నిశ్చయించి చీనిచీనాంబరములకు మాఱు

కాషాయవస్త్రంబుల నాశించి మేడల మిద్దెల వసియించుతలంపు విడిచి కొండలగుహల వసియింపఁగోరి బంగరు పళ్ళెరముల భుజియించునిచ్ఛమాని మంటిమూఁకుడులలోఁ దినుట కిచ్చగించి హంసతూలికాతల్పంబులఁ బవళించుట భారమని వగచి కటికిరానేల సెజ్జలు సుఖప్రదములని భావించి ఖడ్గముధరించుహస్తమున దండము నెలకొల్పి హారంబులకు మాఱుగఁ గంఠమున రుద్రాక్షమాలలు గీలించి యంగరాగంబునకు మాఱుగ బూడిదఁ బూసికొని మలయమారుతస్పర్శమువలన సుఖియించునెమ్మేను పంచాగ్నులగాఁకలకు శుష్కింపఁ జేసి సత్యము గ్రహించి నిజముగ మానవచక్రవర్తియై తనమతమును ద్వేషించినవారిచేత సయితమీశ్వరావతారముగఁ బరిగణింపఁ బడి కృతకృత్యుఁడైన గౌతమబుద్ధదేవుని పావనచరిత్రము వేయింట నొకని కైనను సరిగఁ దెలియకపోవునంతటి దుర్దశసంప్రాప్త మైనది. మనదేశస్థులలో నాంగ్లేయభాష నభ్యసించినవారు హిందూదేశచరిత్రముఁ జదువునపుడు గౌతమబుద్ధుని చరిత్రము వారికి సంగ్రహముగఁ దెలియుచు వచ్చెను. అవి చదువకమునుపు మనవారు బుద్ధదేవుఁడన నెవ్వరో యెఱుంగక బౌద్ధుఁ డనుపేరు పరమనాస్తికునకుఁ బాపకర్మునకు నీచవర్తనునకు నింద్యకర్మునకుఁ బర్యాయపదములుగ వాడుచువచ్చిరి. ఆమహాత్మునిచరిత్ర మాయనమతములోఁ జేరినవాఁ డగు నశ్వఘోషుం డనునతఁడు గీర్వాణభాషలో రచించెను. మఱియు బౌద్ధులచేతనె విరచింపఁబడిన కొన్నిగ్రంథములు సంస్కృత సారస్వతమునఁ గలవు. అవి యాంధ్రీకరింపఁబడక పోవుటచే మనదేశంబున నీజ్ఞాననిధియొక్క చరిత్రము వెల్లడి కాకపోయెను. గౌతమబుద్ధుఁడు ప్రపంచమునందు మనమిప్పుడు వినుచున్న మతసంస్కర్త లందఱికంటె మిక్కిలి ప్రాచీనుఁడు. ఏసుక్రీస్తు పుట్టి యిప్పటికి రమారమి పందొమ్మిదివందల సంవత్సరములైనది. మహమ్మదు జన్మించి యిం

చుమించుగఁ బదమూఁడువందలయేం డ్లయినది. శంకరాచార్యుఁడు ప్రభవించిన సంవత్సరము దెలియలేదు. సరిగదా యాతనింగన్నతలిదండ్రుల పేళ్లవలెనే యాతఁ డుదయించిన శతాబ్దముగూడ విద్వాంసులకు మృగ్య మయ్యెను. శంకరుఁడు క్రీస్తుశకము తరువాత నెనిమిదవశతాబ్దమున జన్మించెనని కొందఱు ప్రథమశతాబ్దమున జన్మించెనని కొందఱు హేతువులపై హేతువులు చెప్పి యూహలుపై యూహలు పన్ని తమతమ వాదంబుల బలపఱచుకొనుచున్నారు. కాని యిదమిద్ధమని యిప్పటికి నిశ్చితము కాలేదు. రామానుజ మధ్వరాయప్రముఖులును నానకు చైతన్య ప్రభృతులును గడుంగడు నవీనులనుట నిర్వివాదాంశము. గౌతమబుద్ధుఁడు జన్మించి యిప్పటికి రమారమి రెండువేల యైదువందల సంవత్సరములకంటె నధికకాలమైనది. ఈయన జన్మసంవత్సరముగూడ సందేహాస్పదముగ నున్నది కాని క్రీస్తుశకమునకు ముం దేడవశతాబ్దముయొక్క కట్టకడపట నతఁడు జన్మించెనని విద్వాంసులనేకులు సిద్ధాంతీకరించియుండిరి. ఆతని జన్మసంవత్సరమేదైనను శంకరునికంటె క్రీస్తుకంటె మహమ్మదుకంటె నతిప్రాచీనుఁడనుమాటనెల్లవారు నైకకంఠ్యముగ నొప్పుకొనవలసిన విషయము. కాలవిషయమున నెల్లమతసంస్కర్తలలో మొట్టమొదటివాఁ డగుటయే గాక వైరాగ్యవిషయమునను విజ్ఞానవిషయమునను గూడ మొట్టమొదటివాఁ డని చెప్పుట పక్షపాతము కాదు. విశేషముగ నైశ్వర్యము లేక సంసారయాత్ర నెట్టెటో గడపుచున్న సామాన్యమనుష్యుఁడు సయితము లోకోపకారార్థము స్వార్థత్యాగముఁ జేయుమన్నఁ జేయఁడు. తనకు సొత్తేమియు లేకపోయినను సన్యసింపుమన్న సన్యసింపఁడు. ఆలుబిడ్డలఁ బాయుమన్న బాయఁడు. ధర్మము సలుపు మన్న సలుపఁడు. అట్టిచో నైశ్వర్యమునందె పుట్టి భోగములయందె పెరిగి సౌఖ్యములతోడను సల్లాపములతోడను గల

మ్ము గడపి యుద్యానవనములవిహరించి యున్నతసౌధములవసియించి యెండకన్నెఱుఁగక వెన్నెలను వడదాఁకునట్టి సౌకుమార్యము గలిగి లోకముమాట దీనులయవస్థ నెన్నఁడుఁ దలంపనియొక మహాభోగి సర్వసంగపరిత్యాగియై లోకోద్ధరణమునిమిత్తమై సన్యసించుట ప్రపంచచరిత్రములో మహాద్భుతముగాదా? ఏసుక్రీస్తు మిక్కిలిపేదవాఁడు. ఒక వడ్రంగి కుమారుఁడు. అతఁడు మనుష్యుఁడే యని మన మెంచితిమా యతఁడు విడిచిన మహైశ్వర్యము గనఁబడదు. చేసినస్వార్థత్యాగము పొడకట్టదు. మహమ్మదుగూడ భాగ్యవంతుఁడు కాఁడు. జీవనము నిమిత్తము సార్థవాహులతోఁగలిసి విదేశములకేగి కొంతకాలమాయనగూడ కాయకష్టము పడినవాఁడే. అందుచేత నాతఁడు గూడ లోకమునిమిత్తము చేసిన స్వార్థత్యాగ మంతగఁగాన్పించదు. శంకరాచార్యుఁడు గూడ పేదబ్రాహ్మణబాలకుఁడు. సిరులతో జన్మించినవాఁడు కాఁడు. అట్లే హిందూదేశమున జన్మించిన మతసంస్కర్త లనేకులు పేదలు. కావున వారైశ్వర్యవిషయమునఁజేసిన స్వార్థత్యాగము లేదు. అందుచేత నేసుక్రీస్తు మహమ్మదు శంకరరామానుజ ప్రముఖులగు మహానుభావులయెడ నాకనాదరణముగాని తిరస్కారభావము గాని యున్న దని పాఠకులు తలంపకుందురుగాక! పరమభక్తులలోఁ బ్రథమగణ్యుఁడగు ఏసుక్రీస్తుయొక్క పాదారవిందములకు నేను నమస్కరించెదను. మహనీయుఁడగు మహమ్మదుయొక్క మాన్యచరిత్రమును మనస్సున నిల్పి యాయన కభివాదము సేయుదును. మూర్తీభవించిన బ్రహ్మజ్ఞాన మని చెప్పఁదగిన శంకరభగవానుల యెడల నెంతటిమూర్ఖుఁడును ధిరస్కారభావముఁ జూపఁడు. అట్లే పూజనీయు లయిన రామానుజప్రభృతులయెడ నాకధిక భక్తి గలదు. అగర్భశ్రీమంతుఁడై యవ్వారిగ సౌఖ్యంబుల ననుభవించిన పురుషుఁడు నంచులో రాజకుమారుఁడు జోగియై మతసం

స్కరణముఁ జేయఁ దలఁచి కష్టములపా లగుట యశ్రుతపూర్వ మదృష్టపూర్వ మనియు సామాన్యసంసారులు వైరాగ్యముఁ బూని సన్యసించుట సులభ మనియుఁ జెప్పుట కట్లనవలసివచ్చె. తన నిర్మలబోధామృతరసము గ్రోలలేక యది విష మని భావించి తన దేశస్థులు తన్నొక సిలువమీఁదఁ గొరతవేయునపుడు సయితము వారియెడ ద్వేషభావముఁ జూపక వారట్టి దుష్కార్య మొనర్చుచున్నందుకు వారియెడ దయఁబూని క్షమింపవలసిన దని పరమేశ్వరు నంతఃకరణశుద్ధిగ వేఁడుకొన్న కారుణ్యరత్నాకరుని సౌజన్యనిధిని ఏసుక్రీస్తును వందనపురస్సరముగ స్మరియింపనివాఁ డెవ్వఁ డుండును. మతభేదజనిత ద్వేషమున శాత్రవుఁడు తనపై కుఱికి చంపనుంకించి నీకిప్పు డెవ్వఁడు దిక్కని హుంకరించి యడిగినప్పుడు సయితము నాకు సర్వేశ్వరుఁడే దిక్కని నిశ్చలముగ నిర్భయముగఁ బలికి యాపగతునకు వెఱపుఁ గొలిపిన పరమభక్తచూడామణిని మహమ్మదును దలఁచి చేతులు జోడించి నమస్కరింపనివాఁ డెవ్వఁ డుండును. అట్లే బ్రహ్మసూత్రభాష్యకర్తలై వేదాంతరహస్య విజ్ఞాతలై బ్రహ్మజ్ఞానబీజంబులు దేశమందంతట వెదజల్లిన మహనీయులగు శంకరరామానుజాచార్యుల ఫాలభాగమునఁ జేదోయి గీలించి యెవఁడు నమస్కరించి వినుతింపఁడు. అందఱువంద్యులె అందఱు లోకహితైకదీక్షితులే. అందఱు ధర్మసంస్థాపనాపరులే. అయినను బూవులలో సంపెంగవలెను మణులలో వజ్రమువలెను లోహములలో సువర్ణమువలెను గ్రహములలో సూర్యుఁడువలెను మతసంస్కర్తలలో గౌతమబుద్ధుఁడు ప్రథమగణ్యుఁడు. జగదుపకారపరాయణుఁ డైన యీమహాత్ముఁడు బ్రాహ్మణుఁడై యుండవచ్చు నని యాతని చరిత్రము చదువకమున్న చదువరులూహించుట సహజము. కాని యీతఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. క్షత్రియుఁడు. దురాచారపీడితులై సంతుష్టియన్న దెన్నఁ డెఱుంగక

మహీకాంక్షాపేరితులై జగజ్జనులను హింసించు క్షత్రియులలో నేమి యిటువంటి మహాత్ముఁడు జనించుటేమియని యనేకులక్కజం పడవచ్చును. అట్టి యక్కజంబునకుఁ బనిలేదు. క్షత్రియులలో సాధువు లనేకులుగలరు. బ్రహ్మజ్ఞానసంపన్ను లనేకులుగలరు. భారతఖండము క్షత్రియులవలన వన్నెకెక్కినది. క్షత్రియులవలనఁ బావనమైనది. విఖ్యాతమైనది. స్మృతికర్తలలో మొట్టమొదటివాఁడై వర్ణాశ్రమధర్మ విభాగమ్ము చేసినమనువు క్షత్రియుఁడు. వేదముల కోంకారమాది మైనట్లు రాజుల కతఁడాదిపురుషుఁడని కాళిదాసు వచియించి యున్నాఁడు. అతఁడొక్కఁడే కాఁడు. ఆగమపురాణేతిహాసంబుల శ్రద్ధతోఁ జూచితిమేని దాని కనేకోదాహరణంబులు గానంబడును. ఎవ్వాని నామధేయము భారతఖండమందలి యిరువది కోట్ల మహాజనులు ముముక్షువు లగుటకు ధ్యానించి స్మరియించి జపియించుచుందురో యెవనినామము వారణాసీనగరంబున మృతినొందు మానవులకే గాక సమస్తజంతువులకు మహేశ్వరుండు ప్రసన్నుఁడై తారకమంత్రముగఁ జేసి యుపదేశించునో యెవ్వాని నిర్మల చరిత్రమును వాల్మీకి మహాముని మహాకావ్యముగ రచించి తనజన్మము చరితార్థము జేసికొనె నని మనీషావంతులెల్ల భావించుచున్నారో, యెవ్వాని పేరు తమ బిడ్డలకుఁ బెట్టుకొని తన్మూలమునఁ బలుమాఱు స్మరణము నేసి తరించుచుంటి మని మన దేశీయులు సంతసించుచున్నారో యెవ్వాని పేర నాసేతుహిమాచల మగు భరతఖండమునందు గణనాతీతములగు నాలయంబులు నిర్మింపఁబడినవో యెవ్వాని కథలను కావ్యములుగ ప్రబంధములుగ రూపకములుగ యక్షగానములుగ వచనములుగ రచియించి కవులు ప్రఖ్యాతులైరో యెవ్వాని నివాసముచేత సాధుజనంబులు వసియింపరాని దండకారణ్యమునకుఁ బేరుకలిగెనో, యెవ్వాఁడు పితృవాక్యపరిపాలకుఁడై యేక పత్నీవ్రతస్థుఁడై

భ్రాతృవత్సలుఁడై ధర్మమార్గ ప్రవర్తకుఁడై ఘహావీరుఁడై దుష్టని గ్రహశిష్టపరిపాలనా దీక్షితుఁడై యనేకసహస్రవర్షంబులనుండియార్య మహాజనులచేత గౌరవింపఁబడు చున్నాఁడో యట్టి దశరథరాముఁడు క్షత్రియుఁడేకదా! యదుకులోద్భవుఁడు గీతామృతరసము వర్షించిన. కాలమేఘము పాండవపక్షపాతి ధర్మసంస్థాపన పరాయణుఁడు హరి నారాయణాంశాసంభూతుఁ డని మహర్షుల చేతఁ గొనియాడఁబడి రఘు రాముని తో సమానముగఁ గొన్ని యెడల నంతకంటె నధికముగ గౌరవార్చనలఁ బడయుచున్న వాసుదేవుఁడు క్షత్రియుఁడే కదా? ఎవ్వనినామంబును స్మరియించిన మాత్రమున సమస్తకలిదోషము లడఁగు నని మనవారు నమ్మెదరో యట్టినలుండును ఋతుపర్ణుండును క్షత్రియులే కదా. ఏ రాజచూడామణి తా నఖండ మహీమండల మేలుచక్రవర్తి యయ్యు సత్యవ్రతానుష్ఠానము నిమిత్తము తన భార్యను బ్రాహ్మణునకు దాసిగ విక్రయించి తాను కడజాతిమాల నికమ్ముడు వోయి మహాపత్సమయమునందైన ధర్మము వీడక జగ దద్భుతంబుగఁ బ్రవర్తించినహరిశ్చంద్రుఁడు క్షత్రియుఁడే కదా. అనేకవర్షములు నిరుపమానదీక్షతోఁ దప మొనర్చి యాకాశగంగను మాహీమండలమునకుఁ గొని తెచ్చి తనపేరిట నది భాగీరథీ యని జనులచే వ్యవహరింపఁబడునట్లు చేసిన భగీరథుఁడు క్షత్రియుఁడే కదా, ఏ రాజర్షి పేర మన దేశము భరతఖండమని భరతవర్షమని వ్యవ హరింపఁబడుచున్నదో యా భరతుఁడు దుష్యంతభూపాలునకు శకుం తలాదేవికి జనియించినవాఁ డగుట క్షత్రియుఁడు. అనుదినమ్మును నిష్ఠాగరిష్ఠులై మనవారు పారాయణము సేయురామాయణము క్షత్రియుల చరిత్రము. పంచమవేదమై పరఁగుభారతము క్షత్రియుల చరిత్రము పురాణము లన్నియుఁ దరుచుగ రాజర్షివంశానుశాను చరిత్రములతోనిండి యుండుటంజేసి క్షత్రియచరిత్రములె. బ్రహ్మ

జ్ఞానములలో మేటి యను పేరు వడసినవిదేహరాజు జనకుఁడు క్షత్రియుఁడు. ఏ నారీరత్నములు మన దేశపుటంగనలయినందుకు మనము గర్వించుచుందుమో, యెవ్వరిపవిత్రచరిత్రము లగ్నిహోత్రములవలెఁ బాపపుంజంబుల భస్మపటలము జేయు నని మనవారు విశ్వసింతురో యా మహాపతివ్రత లగుసీత దమయంతి చంద్రమతి లోపాముద్ర సావిత్రి మున్నగుకాంతలందఱు క్షత్త్రియజాతలె. బ్రహ్మజ్ఞాన సంపాదకు లని యుపనిషత్తులలోఁ బేర్కొనఁబడిన బ్రహ్మదత్తుఁడు మొదలగువారు క్షత్త్రియులు. లోకానుగ్రహార్థము సర్వముఁ బరిత్యజించిన గౌతమబుద్ధుఁడు క్షత్రియుఁడు. ఇట్లనుటచేత బ్రాహ్మణులు పూజనీయులుగా రని నా యభిప్రాయము గాదు. వారివలన భరతఖండమునకు మేలు గలుగలేదని నేననుటలేదు. తమకంత పేటికలయందు నాలుగు వేదంబులను యుగయుగంబులదాఁచి యవి దుష్టుల పాలఁబడి నశియింపకుండ రక్షించినమహాత్ములను భిక్షాటనముచేత శిలోంఛవృత్తిచేతఁ దమ మేనులు నిలుపుకొని కోరికలనెల్ల జంపుకొని సర్వకాలము భగవత్ప్రీత్యర్థమై తమ మేనులు ధారవోసిన బ్రాహ్మణులు వందనీయులు కారని వాదించుట కెవ్వరు సాహసింతురు? క్షత్త్రియులు ప్రాచీనకాలమున బ్రాహ్మణులతోఁ దుల్యులుగ నుండిరనియుఁ గొన్ని యెడల వారికంటె నధికులుగ నుండిరనియు క్షత్త్రియులచరిత్రములె మనకుఁ బవిత్రగ్రంథము లయ్యె ననియు వారివలననే దేశము పేరుప్రతిష్ఠలఁ బడసెననియుఁ జెప్పుట సాహసము కాదు. క్షత్త్రియులు మొట్టమొదటనుండియు బ్రాహ్మణులతో సమానముగఁ బారలౌకికవిషయములను జర్చించుటచేతనె గౌతమబుద్ధునివంటి మహనీయుఁ డా జాతిలో నుద్భవించుట కవకాశము గలిగెను.

---

## ద్వితీయాధ్యాయము.

గౌతమబుద్ధునిచరిత్రము సరిగాఁ దెలిసికొనుటకు భారతఖండ మతస్థితిగతు లాతని జన్మకాలమునాఁటి కెట్లున్నవో తత్పూర్వ మెట్లున్నవో సంగ్రహముగఁ దెలుపుట యావశ్యము. అందుచేత నార్య జాతియొక్కవృద్ధి యొకింత సంక్షిప్తముగ మనము తెలిసికొనవల యును. ఆర్యజాతియొక్క జన్మస్థానమునుగూర్చి పలుచర్చలుగలవు. ఎన్నో భిన్నాభిప్రాయములు గలవు. పరస్పర విరుద్ధసిద్ధాంతములు గలవు. ఆర్యు లాసియాఖండముయొక్క మధ్యస్థానమునుండి వచ్చిరని కొందఱు వక్కాణించిరి. యూరపుఖండమునుండి వచ్చిరని మఱికొం దఱు వ్రాసిరి. సూర్యరశ్మి నెఱుఁగని యుత్తరసముద్రతీరమునుండి యేతెంచిరని వేఱొకకొందఱు లిఖించిరి. ఎక్కడనుండియు రాలేదు. భరతఖండమె వారినివాసస్థాన మని కొందఱు చరిత్రవేత్తలు దలం చిరి. ఆచర్చలతో మనకుఁ బనిలేదు. ఋగ్వేదరచనాకాలమున నా ర్యులు సింధునదీతీరమున నుండిరన్నమాట సత్యము. శతధ్రు మొద లగుపంచజీవనదులు వారి పాదములయొద్దఁ బ్రవహించుచు వారికి వారిసస్యములకు వారి పశువులకు జీవన మొసంగుచుండెను. ఆకాల మున గోధనమె వారి ప్రధానద్రవ్యము. వారు ప్రకృతి కన్నకొడు కులై పరిశుద్ధములైన వర్చస్సులతోడను దృఢము లైనకాయముల తోడను నిర్మలములైన యంతఃకరణములతోడను కౌటిల్య మెఱుఁగని మనస్సులతోడను నేల దున్ని పండించుకొని పశువులను మేఁపి పాలు పిదికికొని ప్రకృతిసౌందర్యము చిత్తము నాకర్షించినపుడు మహానం దరసమగ్నులై భూతములను స్తవము జేయుచు హాయిగఁ గాలక్షేప ము చేయుచుండిరి. ఆకాలమున వారిదైవతములు పంచభూతములు.

ట్టుపగ లాకాశమున సహస్రకిరణములను దిగంతములయందుఁ బ్రస రింపఁజేసి దేదీప్యమాన ప్రభలతో వెలిగి యంధకారంబును పటా పంచలుగఁ దోలి మాలిన్యమును నశింపఁజేసి నేత్రము లున్న ఫలమున సార్థకము జేసినసూర్యమండలమును జూచినప్పుడును, ప్రాతఃకాలము సూర్యోదయమునకు ముందు వాచామగోచరమైన సౌందర్యముతో ననుభవైకవేద్యమైనశృంగారముతో వెలయుచుండిన యుషస్సును గాం చినప్పుడును, పగ లెండవేఁడిమిచేత నవసినశరీరములకు వెండియు నఖండచైతన్యముగొలుపునట్లు నిశాసమయములయందుఁ జల్లదనము వెదజల్లుచు బ్రహ్మాండమంతయు వెండిబరిణివలెఁజేసి జంతుజాలమును సంతోషతరంగములనియెడి నుయ్యెలలో నూఁచఁగలశరత్కాలసంపూ ర్ణచంద్రమండలమును గనుఁగొన్నప్పుడును, నాకసంబను నీలంపు మేలుపట్టుమీఁద దాఁపడము జేసిన వజ్రములవలె ధగధగలాడుచు మెఱయు ననంతకోటినక్షత్రముల వీక్షించినప్పుడును, శిఖలనియెడి నాలుకలు సాచి దూరమందలి మహారణ్యంబులనైన భస్మపటలము జేయుచు సకలజంతుభయంకరమైన జాజ్వల్యమానాగ్నిహోత్రము నవలోకించునప్పుడును, చండతరమై గ్రీష్మకాలపు టెండ తాఁకున వసి వాళ్ళువాఱిన భూతకోటికి వర్షధార లనియెడు గొట్టంబులద్వారం బున మరల జీవనంబు బోయుచున్న కాఱుమబ్బులను దిలకించినప్పు డును, పర్వతంబుల భేదించుకొనియు నడవుల ఛేదించుకొనియు మ హోత్తుంగ వృక్షంబులను నిర్మూలించియు వర్ణనాతీతమైన వేగముతోఁ బ్రవహించు మహానదుల దర్శించినపుడును, వారు మహాశ్చర్యరసమ గ్నులై యగ్నికొక దేవతను వానకొక యధిష్ఠానదేవతను జలమున కొక దేవతను మనంబున భావించుకొని ప్రాణాధారము లైనయగ్ని వాయువునకు నింద్రుని వరుణుని బ్రధానదైవతములుగ స్వీకరించి కొలుచుచుండిరి. వారి స్తవములె ఋక్కులు. ఋక్కులతో నిండినదే

ఋగ్వేదము. ఆ స్తవము చేయునప్పుడు వారి మనస్సులలో గర్భిత మైనకవితాసక్తి వారిచే నొకానొకప్పుడు మిక్కిలి హృదయంగమము లై యున్నతము లైనవాక్యములను బలికించుచుండెడిది. ఉషఃకాలవర్ణము వేదమునందు వర్ణింపఁబడినంత బాగుగ మఱియేగ్రంథమునందును వర్ణింపఁబడలేదని యనేకు లభిప్రాయపడుచున్నారు. ఉషస్సుకన్యకగా నొకచోటను గుఱ్ఱముగానొకచోటను మిక్కిలి చమత్కారముగా వర్ణింపఁబడినది. వర్షమున కధిష్ఠానదేవతగ వా రింద్రుని భావించుకొని తమ పంటలను గోవులను వృద్ధిచేయుమనియు శత్రువులను నాశనము చేయుమనియు వేడికొనినట్లు వేదములలో ననేక స్థలములయందుఁ గలదు. వర్షకాలమున నాకాశమున నానావర్ణములతోఁ గనఁబడు రేఖ యింద్రుని ధనుస్సుగాను మేఘ మింద్రుని వాహనముగాను వారు భావించిరి. ఇట్లు బహువిధములఁ దమగృహములయందు నుపయోగకరములుగానున్నయగ్ని ననేకఋక్కులలోఁ గొనియాడిరి. అవి యగ్నిసూక్తము లనంబడును. ఇత్తెఱంగున నార్యులు పంచభూతములను, నందు ముఖ్యముగ నింద్రాగ్నివాయుమిత్రావరుణులను సేవించుచు వారిని బ్రీతులం జేయుటకు నానావిధము లైనయజ్ఞము లారంభించిరి. ఈదేవతలకుఁదోడుగ వేల్పు లనేకులు బయలుదేఱిరి. యజ్ఞములలో హోమములు ప్రధానము లగుటచేత హోమము లగ్నిలో వేల్చవలసినవగుటచేత నార్యుల కగ్ని ముఖ్యదైవతమయ్యెను. ఈయాగములయందుఁ జదువవలసినమంత్రము లనేకములు కల్పితము లయ్యెను. దేవతాస్తవము గానపూర్వకముగఁ జేయుట దివ్యులకు మనుష్యులకుఁ గూడ శ్రవణానందకరమగుటచే సామవేదము గల్పింపఁబడెను. కర్మకాండ మిక్కిలి విస్తారమయ్యెను. రోగభూయిష్ఠము కాని దేశమున నిర్మలవాయువు స్వచ్ఛజలము పరిశుద్ధాహారము లభించుటచే నార్యులు దినదినాభివృద్ధినొంది క్రమక్రమముగ సంఖ్యలోఁ బెరిగిరి. పెరి

[illegible]లఁది మునుపున్న భూములు చాలక క్రొత్తభూము లాక్రమింప వలసివచ్చెను. ఆభూములలో నంతకుమున్నె గాఁపురమున్న యనార్యులు తమ కెన్నోతరములనుండి భుక్తమగుచున్న దేశ మన్యాక్రాంత మగుట కోర్వఁజాలక యుద్ధసన్నద్ధు లైరి. ఈకలహములు వేదములయం దెన్నిస్థలములనో సూచింపఁబడినవి. ఆయనార్యులతోఁ బోరాడుటకు వీరపురుషులు గావలసివచ్చిరి. నానాఁటికి జ్ఞానాభివృద్ధి యగుటచే వారిపోషణమునిమిత్తము కృషి.వాణిజ్యగోరక్షణాదులు చేయవలసినవారు గూడ నెక్కువమంది కావలసివచ్చిరి. కేవల మైహికవ్యవహారపరతంత్రులై దేవతలమొగములఁ జూడక యజ్ఞాదులు మానినపక్షమున దేవతల కాగ్రహము గలుగు ననుభయమున వేదములు పరంపరగ వల్లించువారు, క్రతువులు మొదలగు కర్మలు చేయించువారు గావలసివచ్చిరి. ఈకారణములచేత నార్యులు ముత్తెగలుగ విభజింపఁబడిరి. వేదాధ్యయనమె ప్రధానవృత్తిగ శ్రౌతకర్మలు నిత్యకృత్యములుగఁ గలవారు బ్రాహ్మణులైరి. లోకకంటకులగు శత్రువులను సంహరించుటకై తమనెత్తురు ధారవోసి పోరాడు వీరులు క్షత్రియులైరి. కృషీవాణిజ్యగోరక్షణాదులు జరుపువారు వైశ్యులైరి. క్షత్రియులచేత యుద్ధమున జయింపఁబడి లోఁబడిన యనార్యులు పైమూఁడుతెగలవారికి సేవకులై శూద్రాభిధానులైరి. ఇట్లనుటచే బ్రాహ్మణు లొక్కరే కర్మానుష్ఠాతలైరనియు క్షత్రివైశ్యులు కర్మబాహ్యులైరనియుఁ దలంపఁగూడదు. క్షత్రియు లనేకులు బహుయాగంబులఁ జేసిరి. వైశ్యులుగూడ నక్కడక్కడఁ గొన్ని యాగములు చేసిన ట్లున్నను వారిలో నీకర్మకాండ తక్కువైనది. అందుచేత వేదంబులఁ దమపుక్కిటఁ బట్టి కర్మకాండ తమయధీనము జేసికొని నిరంతరవేదఘోషలచేత దిక్కులు ప్రతిధ్వను లెసఁగఁజేయు బ్రాహ్మణులయెడలను ఖడ్గధారణము జేసి యర్థప్రాణములను దేశ

మును గాపాడుమహావీరులైనక్షత్రియులయెడ్లను బరమవిధేయులై వైశ్యులు భయభక్తులుగలిగి మెలంగుచుండిరి. ఆర్యజాతివారైనవారే యట్లుండ నాలవజాతిమాట చెప్పనేల? క్షత్రియులలో నెక్కువపలుకుబడి గలిగి పెద్దలై సేనాపతులైనవారు క్రమముగఁ దాముజయించిన దేశముల కధిపతులై రాజులు మహారాజులు సార్వభౌములు చక్రవర్తులు ననుబిరుదులధరించి నేల యేలఁజొచ్చిరి. బ్రాహ్మణులు గురువులై పురోహితులై ధర్మశాస్త్రకర్తలై మంత్రులై ధర్మాధికారులై వేదములను కర్మలను దన్మూలమున దేవతలను స్వాధీనము జేసికొని యుండిరి. కొంతకాల మైనతరువాత బ్రహ్మక్షత్రియులకుఁ బరస్పరమత్సరము గలిగెను. అమూల్యమైన తమశరీరరక్తము ధారవోసి శత్రునాశనము జేసి ప్రజలం గాపాడుచున్నపుడు తమమాటయె ముఖ్యముగఁజెల్లవలయునని వారభిప్రాయపడిరి. జ్ఞానపేటికలై ధర్మసంస్థాపనపరులై తక్కినవర్ణములకు మన ముత్తమగతులు కల్పించుచున్నపుడు మనమాట యేల చెల్లఁగూడదని బ్రాహ్మణు లహంకరించిరి. ఉభయులకు నెన్నోపోరాటములు జరిగినట్లు గూడఁ బురాణములవల్లఁ దెలియవచ్చును. కొందఱు క్షత్రియు లస్త్రసన్యాసము జేసి స్వాధ్యాయపరులై కర్మనిరతులైరి. ఇందుకు విశ్వామిత్రుఁడు తార్కాణము. కొందఱు బ్రాహ్మణులు వేదంబునకుఁ దోడు ధనుర్వేదము నధిగమించి వీరకర్మ ముపక్రమించిరి. పరశురామద్రోణాచార్యు లిందు కుదాహరణములు. అనేకసంవత్సరపర్యాప్తములైన బ్రాహ్మణక్షత్రియవైరములకు భార్గవరాముని చరిత్రమే నిదర్శనము. జ్ఞానధనసంపన్ను లగుటచే మొత్తముమీఁద బ్రాహ్మణులగౌరవము నిలిచెను. క్షత్రియులు వారిని మన్నించిరి. కర్మకాండ క్రమక్రమముగ మేరమీఱి పెచ్చుపెరిగెనని యిదివఱకె వ్రాసియుంటిమి. బ్రాహ్మణాదివర్ణములు నేఁటికాలముననున్నట్లు దుష్కరనియమ

ఖ్యద్ధములై లేకపోయినను గొన్ని కట్టుబాటులకు లోఁబడియుండెను. ఆకట్టుబాటులె ధర్మశాస్త్రములు. అవిస్మృతులనఁబడఁజొచ్చెను. స్మృతుల ననుసరించి చేయుకర్మలు స్మార్తకర్మలు, శ్రౌతకర్మలకు స్మార్తకర్మలుతోడై గృహస్థునకు రెండవపనిజేయుటకవకాశ మియ్య కపోయెను. అందుచేతఁ గ్రిమక్రిమమునఁ గర్మలు క్షత్రియులను విడిచి బ్రాహ్మణులపాలఁ బడియెను. విక్రమశాలురగు రాజులుమా త్రము మహీకాంక్షచేతను జిగీషుచేతను రాజసూయాశ్వమేధంబుల నప్పుడప్పుడుఁ జేయఁజొచ్చిరి. ఇట్లుకొంతకాలము నడచునప్పటికిఁ గొందఱి మనంబులలో నొకమార్పుపుట్టెను. ఆమార్పు ముఖ్యముగ బ్రాహ్మక్షత్రియులలోఁ బొడసూపెను. "నేనెవ్వఁడను. జీవము శరీర ముతో సరియా లేక మరణానంతరమునఁ గూడ నేదేని యుత్కృష్ట జీవన మున్నదా? ఈసృష్టిస్థితిలయములకు హేతువేదేని గలదా? అట్టి హేతు వేది. దేహముకంటె భిన్నమై శాశ్వతమైనవస్తువేదేనికలదా?" యను సందియంబులు మనంబున నంకురించెను. అంతట జిజ్ఞాసప్రా రంభమయ్యెను. కర్మకాండయందు జిజ్ఞాసువులగు మహాత్ములు కొం దఱకుఁ గ్రమక్రిమముగ నమ్మిక చెడియెను.

ఆయగ్నిష్టోమము లాపశువధము లామంత్రపాఠము లాదీక్ష లాయాచారములు వారిమనంబులకు నచ్చలేదు. శరీరము పెరుఁగుట రుగ్మతలచే విఱుగుట ముదిమిచే శిథిలమగుట నంగవైకల్యాదిబాధచే జన్మప్రభృతి పలువురు బాధలుపడుట దారిద్ర్యపీడచే సంసారయాత్ర చేయఁజాలక గృహస్థు లెన్నెన్నొ సిలుగులపాలగుట ప్రత్యహము వారు కన్నులారఁ జూచినప్పు డాదుఃఖపరంపరనుండి శాశ్వతముగా విముక్తి నిచ్చుమార్గము నన్వేషించుటయందే వారిదృష్టి ప్రసరించెను ఈకర్మకాండ యట్టి విమోచనము గలిగింపఁజాలదని వారికిఁదోఁచెను. తోఁచినతోడనే కర్మలు గట్టిపెట్టి జగదుత్పత్తిస్థితిప్రళయకారణంబు

లను శరీరబంధమోక్షణ సాధనంబులను జిజ్ఞాస జేయుటకై బహుప్రతిబంధకభూయిష్టములై జనసమ్మర్దముగల పట్టణంబులను పల్లియలను విడిచి నిర్జనములై నిర్మలములై యుండునరణ్యంబులకుఁ బోవఁజొచ్చిరి. జ్ఞానహారము నిమిత్తమై నిరీక్షించుచుఁ బేరాఁకలిఁగొని యున్న వారిగంభీరమనస్సుల కామహారణ్యంబులు గావలసినయాహార మర్పించెను. శరీరధారణమునకు మాత్రము వారు భౌతికాహారము స్వల్పముగ గ్రహించి జ్ఞానభోజనము విశేషము సేయుచుండిరి. ఆకులు కాయలు దుంపలు పండ్లు మొదలగునవి భక్షించి మేనఁ బ్రాణములు నిలుపుకొనుచుండిరి. ఆ కారడవులలో వారి కంటికగపడిన ప్రతిపదార్థము వారి మనస్సులలో జ్ఞానసూర్యోదయకారణమయ్యెను. అప్పుడు బ్రహ్మ మనుపదార్థ మొకటి కలదని వారికి పొడగట్టెను. ఆబ్రహ్మపదార్థము మహోన్నతములై శృంగజిహ్వలచేత గగనమును నాకుచున్న యుత్తుంగపర్వతములయందును విశాలనదీప్రవాహములయందును నానావర్ణదేహములఁ గలిగి శ్రావ్యముగాఁ గూయుపక్షులయందును బక్షుల కాశ్రయములైనవృక్షములయందును సకలజంతువులయందును భూమియందును నాకాశమందును నగ్నియందును నిండి సర్వవ్యాపకమై సర్వకాలాబాధితమై దేశకాలపరిచ్ఛేదరహితమై యాదిమధ్యాంతరహితమై జగత్కారణమై సజాతీయవిజాతీయ స్వగతభేదశూన్యమై యేకమై యద్వితీయమై సర్వజ్ఞమై సర్వవక్తియుతమై నామరూపశూన్యమై యచ్యుతమై యనంతమై యున్నట్లుకనబడెను. పలుమాటలేల? భూమిలోనున్న ప్రతిపరమాణువు నాకాశముమీఁదనున్న ప్రతినక్షత్రము వృక్షముమీఁదనున్న ప్రతిపర్ణము జలములోనున్నప్రతిబిందువు బ్రహ్మమయమనియు బ్రహ్మముకంటె భిన్నమైన పదార్థమువేఱు లేదనియు వారు నమ్మిరి. నమ్మి యానమ్మికను వచనరూపముగను శ్లోకరూపముగను రచియించి గానముఁ జేసిరి. ఇవి

యరణ్యములలోనుండఁగ వ్రాయఁబడుటచేత నారణ్యము లను పేరం బరఁగుచున్నవి. వేదములకొట్టకొననివి వ్రాయఁబడుటచేత వేదాంత మనునామము గలిగియున్నవి. ఇవేయుపనిషత్తులు. ఈయుపనిషత్తులు బ్రహ్మజ్ఞానపూరితములై యున్నవి. కర్మకాండ మోక్షసాధనము కాదనియు జ్ఞానమె మోక్షసాధనమనియు నీయుపనిషత్తులుబోధించు చున్నవి. తత్వవేత్తలై కవులై యీయుపనిషత్తులు వ్రాసినమహాత్ములు బ్రహ్మవాదులను పేరం బరఁగుచుండిరి. ఈవిచారణ మింతతో నిలువలేదు. జిజ్ఞాసువులు బయలుదేఱిరి ఈయుపనిషత్తులు ప్రధానము గూడ కొందఱికి సంతుష్టి గలిగింపలేదు. అదిగాకయుపనిషత్తులు యాదిమములైనవి కొన్నిమాత్రమె యుండఁగా నుపనిషత్తులమీఁద జనులకుగౌరవము కలిగియున్న కారణమున వెఱ్ఱివెఱ్ఱిసిద్ధాంతములు చేయఁదలఁచినవారందఱు దమసిద్ధాంతము లుపనిషద్రూపమున రచియించినచో జనసమ్మతము బడయునని నమ్మి తమకు సేవ్యములైన దేవతల నుద్దేశించి తనకిష్టములైన ధర్మమున నెలపికొని యుపనిషత్తులు రచియించి వానిగౌరవమును జెడఁగొట్టిరి.

ఉపనిషద్రచనానంతరమున నూతనసిద్ధాంతము లాఱు బయలుదేఱినవి. అవిషడ్దర్శనము లనఁబడును. అందు మొదటిది పూర్వమీమాంస. ఇది జైమినిమహాముని రచియించెను. వేదచోదితములైన యజ్ఞాదికర్మలు, నిత్యనైమిత్తికములుఁ దప్పక యనుష్ఠింపవలసినదనియుఁ గర్మమే బ్రహ్మమనియు నదియె మోక్షసాధన మనియు గర్మముకంటె వేరుపదార్థము లేదనియు నీపూర్వమీమాంసాశాస్త్రము చెప్పుచున్నది. రెండవ దుత్తరమీమాంస దీనికె బ్రహ్మమీమాంస.యని పేరు బ్రహ్మపదార్థ మొకటికలదనియుజగత్తుయొక్క సృష్టిస్థితిలయములు దానివలన నుండియె సంభవించుచున్న వనియు దేహమందుండుజీవాత్మయు బ్రహ్మమగు పరమాత్మయు నొక్కటే

యగ్గియు సరస్సులో సూర్యబింబము బ్రతిఫలించియాకాశము మీఁది సూర్యబింబమునకు భిన్నముగా నున్నట్లు కనఁబడినను నిజముగా దానికంటె వేఱుగాకయున్నట్లే యుపాధిభేదముచేతఁ బరమాత్మశరీరమునందున్నపుడు మాయచే వేఱుగఁ గనఁబడినను నిజముగ వేరు కాదనియు జగము మిథ్యయనియు బహ్మమే సత్యమనియు బ్రహ్మము కంటె బిన్నమైన పదార్థము లేదనియు నీయుత్తరమీమాంసాశాస్త్రము బోధించుచున్నది. ఈశాస్త్రకర్త బాదరాయణుఁడను నామాంతరముగల వేదవ్యాసుఁడు. ఈయాఱుశాస్త్రములు మాత్రములుసూత్రరూపములుగ నున్నవి. ఈ రెండుశాస్త్రములు వేదములుపరమప్రమాణముగ నంగీకరించుచున్నవి. తక్కిన నాలుగుశాస్త్రములు వేదాధారము కలవి కావు.

మూఁడవది సాంఖ్యశాస్త్రము ఇదిరచియించినవాఁడు కపిలుడు ఈగొప్ప శాస్త్రము రచియించుటచేతనే కాఁబోలు కపిలుఁడు నారాయణాంశసంభూతుఁడని భాగవతాదిగ్రంథములలో నున్నది. ఇతఁడు నిరీశ్వరవాది. అందుచేత నితనిశాస్త్రము నిరీశ్వరసాంఖ్యమనఁబడును. ఇతనిగ్రంథము పూర్వోదాహృతము లైన రెండుశాస్త్రములకంటె భిన్నముగా నున్నది. ఏయేపదార్థములుగూడి ప్రపంచమైనదో యిఇతఁడుచెప్పి దుఃఖపరంపరనుండి దేహి మోక్షమునొందుటకు సాధనములఁజూపియున్నాఁడు. మహదాదులైన యిరువదినాలుగు తత్వములతోఁ బ్రపంచము నిర్మితమైనదని ఇతనియభిప్రాయము. నాలుగవది యోగశాస్త్రము. ఇది పతంజనిమహాముని రచించెను. ఈశాస్త్రముగూడ సాంఖ్యమనుపేరనే వ్యవహరింపఁబడుచున్నది. ఇతఁడీశ్వరుఁడు కలఁడని యొప్పుకొనుటచే నీశాస్త్రము కపిలశాస్త్రమువలె నిరీశ్వరసాంఖ్యముగాక సేశ్వరసాంఖ్యమనఁబడును. చిత్తవృత్తుల నిరోధించి కొన్ని నియమముల ప్రకార మీశ్వరధ్యానముఁ జేసినపక్షమున

దేహికి మోక్షప్రాప్తియగునని యీశాస్త్రము తెలియఁజేయుచున్నది. అయిదవది న్యాయశాస్త్రము. ఈశాస్త్రము గౌతముఁడు రచియించెను. ఇదియు నిరీశ్వరశాస్త్రమె. దీనిలోనుండియె తర్కశాస్త్రము పుట్టినది. ఇతడు ప్రపంచమును బదియాఱుభాగములుగ విభాగించి దేహికి మోక్షసిద్ధియగుటకుమార్గములఁ జెప్పియున్నాడు. ఆఱవది వైశేషికశాస్త్రము. ఇది కణాదుఁడు రచియించెను. ప్రపంచము పరమాణువులచేత నైనదనియుఁ బరమాణువు చైతన్యముగలిగియుండు ననియు నిదిచెప్పుచున్నది. ఇదియు నాస్తిక శాస్త్రమె. ఆస్తికులైనవారుఁ నాస్తికులైనవారుగూడ మొత్తముమీఁద దేహిదుఃఖపరంపరనుండి విముక్తుఁడగుటకుఁ దమచిరకాలజిజ్ఞానచేతఁ దాముకనిపెట్టిన సాధనంబుల జగదుపకారార్థము గ్రంథములుగ రచియించి తెలియఁజేసియుండిరి. ఈ శాస్త్రములలో లోకవిరుద్ధమైనదికాని నీతిబాహ్యమైనదికాని యేమియు లేదు. నాస్తికవాదము చేసినను వీరు ధర్మమార్గమును విడువలేదు. జిజ్ఞాస యింతటితో నైన నిలువలేదు. షడ్దర్శనరచనానంతరమున లోకాయతమతము పుట్టినది. ఈమతదర్శిష్ట చార్వాకుఁడు. ఇతడు కర్మకాండను జ్ఞానకాండను గూడ నధిక్షేపించినవాఁడు. ఇతనిమత ప్రకారము వేదము లప్రమాణములు. యజ్ఞాదికర్మలు చేయువారు మూర్ఖులు. ఇతఁడు పరమనాస్తికుఁడు. తక్కినశాస్త్రములవారు దేవుఁడులేఁడన్నను మనజీవాత్మయొక్కటున్నదని యొప్పుకొనిరి. ఇతనిసిద్ధాంతప్రకారము జీవాత్మలేదు. పరమాత్మలేదు. స్వర్గములేదు. నరకము లేదు. సుఖజీవనమె పరమానందము. మరణమే మోక్షము. పశువులనుజంపి యాగములఁజేయువారిని చార్వాకుఁడీ క్రిందివిధముగ నధిక్షేపించెను. "యజ్ఞములోఁ జంపఁబడిన పశువునకు స్వర్గప్రాప్తి యగునని మీరు చెప్పుచున్నారుగదా. ఆపశువునకు నిజముగ మోక్షసిద్ధియగునెడ మీ తండ్రినె యీ పశువుగఁజేసి దుర్లభమైన మోక్ష మతనికి

సిద్ధింపఁజేయరాదా? మృతిఁబొంది దగ్ధాంగులైన తలిదండ్రులకు బంధు వులకు మీరు శ్రాద్ధముబెట్టి యా శ్రాద్ధాన్నమును వారు భుజింతురని మీరునమ్ముచున్నారు. క్రిందయన్నముబెట్టి మేడమీఁదనున్నవానిని భక్షింపుమన్న భక్షించునా?" ఈచార్వాకమతము వేదములను ధర్మశాస్త్రములను బురాణములను వేదములనాధారముచేసికొని యున్న సకలగ్రంథములను సకలకర్మలను సకలసిద్ధాంతములను నిరసించి యపహాస్యము జేసెను. ఇదిగాక యిట్టిమతములు నూతన సిద్ధాంతములు ననేకములు తలయెత్తెను. ఈమతస్థితినిబట్టి సంఘస్థితిగూడ కొన్నిమార్పులు చెందెను. నాస్తికసిద్ధాంతములు బయలుదేఱినకొలఁది వైదికకర్మకాండ మునుపటికంటె విస్తారమై చూచువారికి నాచరించు వారికిగూడ భయంకరమయ్యెను. కర్మకాండ హెచ్చినకొలఁది మూఢవిశ్వాసములు బలమయ్యెను. క్షత్రియ వైశ్య శూద్రులు బ్రాహ్మణాధికారమునకు లోఁబడిరి. బ్రాహ్మణులు కాలానుసారముగఁ గ్రొత్తక్రొత్త స్మృతులు నిర్మించిరి. ఎల్లస్మృతులలో బ్రాహ్మణులు మాననీయులుగ వర్ణింపఁబడిరి. వారు దేవతలకు భూలోకప్రతినిధులైరి. బ్రాహ్మణప్రీతి దేవప్రీతియనియు బ్రాహ్మణతిరస్కారము దేవతాతిరస్కారమనియు స్పష్టముగ వ్రాయఁబడినది. బ్రహ్మహత్య మహాపాతకములలో నగ్రగణ్యమైనది. "బ్రాహ్మణో నహంతవ్యః" యను సిద్ధాంతము బయలుదేఱెను. అనఁగా బ్రాహ్మణుఁడు నరహత్య జేసినను శిరచ్ఛేదము సేయఁదగినమరియేపాతకము జేసినను వానికిమరణదండన విధింపఁగూడదు. బ్రాహ్మణులమాటయె ధర్మశాస్త్రమయ్యెను. వారియధికారము నిరంకుశమయ్యెను. అన్యజాతివాఁడు చేసినపాతకములకు దండములు మెండు. బ్రాహ్మణులుచేసిన పాతకములకు దండములుస్వల్పములు. దండవిధాయకులైన రాజులుసయితము బ్రాహ్మణవిధేయులు. వారుగీచినగీటు దాఁటకుండుటచె జనసామా

న్యమువారియధికార భారమున గుఱింగిపోయి మొఱనాలించువారు లేమి నోరెత్తక యూరకుండవలసినవారైరి. అందుచేత జనసామాన్యమునకు బ్రాహ్మణులయెడలను వైదికమతమునెడలను సంపూర్ణముగ దిరస్కారభావముజనించెను. అది యగ్నిపర్వతగర్భమున మఱుగుచుండిన యుష్ణద్రావకమువలె నడఁగి చిరకాలముండి యుండి యుద్గారసమయమును నిరీక్షించుచుండెను. జనులు నాగరకతాశూన్యులైనపక్షమున నిరంకుశాధికారమునకు లోఁబడియుందురు, కాని నాగరకత హెచ్చినపిదప జిజ్ఞాసాసామర్థ్యము ప్రతిమనుష్యునకు నలవడినపిదప జంతువులవలె నెల్లబాధలుసహించి యూరకుండుట మానవస్వభావవిరుద్ధము. ఆర్యులు నాగరకతయందుఁ గూడ నాకాలపు జాతులనెల్ల మించిరి. వారు పట్టణంబులు నిర్మించుకొనిరి. మేడలు మిద్దెలు గట్టుకొనిరి. సువర్ణములతోడను రత్నములతోడను వింత వింతనగలు చేసికొననేర్చిరి. బహుశాస్త్రములయందుఁ గృషిచేసి విజ్ఞానము సంపాదించిరి. సంఘమునకుఁగావలసినకట్టుబాట్లు నేర్పఱచుకొనిరి. రాష్ట్రములు స్థాపించిరి. రాజధానులునిర్మించిరి. మహాసైన్యసమేతులై రథములెక్కి యేనుఁగులెక్కి గుఱ్ఱములెక్కి యుద్ధములు జేయ నేర్చిరి. ఇట్టిస్థితిలో నున్న వారు కారణాంతరముల చేతఁ గొంతకాలము బ్రాహ్మణుల నిరంకుశాధికారభారమున నడఁగి, నోరులేక యూరకుండినను దగిన సమయమువచ్చినపుడు చెలరేగకుందురా? అందుచేతనే గౌతమబుద్ధుఁడు పొడసూపి వేదవిరుద్ధమతమును బోధించినతోడనే వర్ణాశ్రమ భేదశూన్యమై సర్వజనభ్రాతృత్వబోధకమై కర్మకాండవిహీనమైన యాతనిమతమునజనులు గుంపులు గుంపులుగ జేరిరి.

—oo—

# తృతీయాధ్యాయము

హిమాలయపర్వతమునకు దక్షిణమున రోహిణి యనుచిన్న నది ప్రవహించుచుండును. దాని కిరువంకల రెండు తెగలవారు కాపుర ముండిరి. నదికుత్తరమువైపున శాక్యులుండిరి. వారికి ముఖ్యనగరము కపిలవస్తుపురము. శాక్యులకు నాయకుఁడు శుద్ధోదనుఁడు. రోహిణీ నదికి దక్షిణమున మఱియొక తెగవారు గాఁపుర ముండిరి కోలీపట్టణము వారికి ముఖ్యస్థానము. కోలీరాజకుమారికలగు మాయాదేవి యుఁ బ్రజావతియు శాక్యనాయకుఁడగు శుద్ధోదనుని వివాహమాడిరి ఆయక్కసెల్లెండ్రు సవతులయ్యు మచ్చరంబు లేక యన్యోన్యానురాగము గలిగి మెలఁగుచుండిరి. శుద్ధోదనుఁడు సంతానము లేక తనజన్మము దుఃఖభాజన మని చింతించెను. ఎట్టకేలకు మాయాదేవి నలువదియైదుసంవత్సరములయీడు గలదైనప్పుడు సంతానము నిమిత్తము నోము లెన్నో నోచి, వ్రతము లెన్నో సలిపి, నియమము లెన్నో నెఱపి, యేడుదినము లుపవసించి యున్న పిదప నొకనాఁటి రేయి యామె వింతయైన కలఁ గనెను. స్వప్నములో దేవత లామె నూర్ధ్వలోకంబునకుం గొనిపోయి రఁట. తెల్లనియేనుఁగు గర్భమునం దుఁ బ్రవేశించె నఁట. మాయాదేవి యామహాస్వప్నమును భర్త కెఱిఁగింప నతఁడు స్వప్నశాస్త్రవేత్త లగునైదుగురు బ్రాహ్మణులం బిలిపించి, స్వప్నఫల మెఱిఁగింపు మని కోరెను. ఆకల విని యావిప్రులు మాయాదేవిగర్భమునఁ గుమారుఁ డుద్భవించు ననిన యతఁడు వసుంధరాచక్రమంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలించు చక్రవర్తియో, లేక నజ్ఞానాంధకార మడంచి, తనజ్ఞానతేజమువలనఁ బ్రపంచమునుండి పాపములు నిర్మూలము సేయఁజాలు మహాబుద్ధుఁడో యగు

ననిచెప్పిరి. సిద్ధార్థునిజన్మవృత్తాంత మంతయు నద్భుతపరంపరలతో నిండి యుండును. పురాణములలో శ్రీమన్నారాయణావతారము వర్ణించునప్పుడును, మఱి యితరపురుషుల యావిర్భావములఁ దెలుపు నప్పుడును వ్యాసాదిమహర్షులు దిక్కులు ప్రసన్నములైనట్లు, వృక్షలతాదులు నవకిసలయపుష్పఫలసమృద్ధము లైనట్లు, నదీ నదంబులు నిర్మలజలప్రవాహశోభితము లైనట్లు, నిఖిలజగములయందు నిర్వ్యాజానందము నెలకొనినట్లు, దివ్యులు సంతోషపరవశులై దుందుభినాదంబుల మ్రోయించి కుసుమ వర్షముఁ గురిసినట్లు, సర్వజంతుసుఖప్రదముగా వాయువువీచినట్లు, బ్రహ్మాదిదేవతలు స్తవములు జేసినట్లు మనము తెలుచుగాఁ జదువు చుందుము. ఇందుకు భాగవతమునందలి వామనావతారఘట్టమును శ్రీకృష్ణావిర్భావఘటమునుముఖ్యోదాహరణములు. సిద్ధార్థునిచరిత్రములు వ్రాసినవారిలో ననేకు లాయన భక్తులగుట చేతను, మహాపురుషులఁ గూర్చి మహాద్భుతము లైనకథ లెన్నో లోకమునవ్యాపించి యుండుటచేతను, బూర్వకాలమున నట్టియద్భుతముల నెల్ల విశ్వసించుట మనుష్య సామాన్యమునకు సహజ మగుటచేతను, గతానుగతికముగా లోకమున వ్యాపించియున్న చిత్రకథల నెల్ల సంగ్రహించి, యవియెల్లనిక్కములనియు సిద్ధార్థునిమహిమలనియుఁ జరిత్రకారులు లిఖించిరి అంతియ కాక మహాత్ముఁడైన తమగురువును లోకాతీతపురుషుఁడుగా వర్ణింపక సామాన్యునట్లు వర్ణించినపక్షమున లోకమునందు నతనియెడ గౌరవ ముండదని వారినమ్మకము. అతనిని సత్ప్రవర్తనముగల సామాన్య మనుష్యునిఁగా వర్ణించినయెడలఁ బురాణేతిహాసములలోఁ జెప్పఁబడిన శ్రీకృష్ణరఘురామాదులకుఁ దమనాయకుఁడు దీసిపోవు ననియు వ్యాసవాల్మీకి ప్రముఖులకుఁ గలుగు యశస్సు దమకుఁ గలుగ దనియు, నందుచేత నద్భుతమైనమహిమలుండి తీరవలెననియు వారు నమ్మి

జీవచరిత్రలు వ్రాసిరి. ఇట్లు వ్రాయుటచేతనే సిద్ధార్థుని సత్యచరిత్ర ముమహామాసముద్రమునమునిఁగిపోయినది. అట్టియద్భుతములంగొన్నిఁటిఁ బేర్కొనుటసముచితము. సిద్ధార్థుఁడుగర్భస్థుఁడుకాఁగానేముప్పది రెండునిమిత్తములుజగంబునవ్యక్తములయ్యెనఁట. పదివేలలోకములు మహాతేజముతోనిండెను. గ్రుడ్డివాండ్రు చూడఁగలిగిరి. చెవిటివాండ్రు వినఁ గలిగిరి. మూఁగవాండ్రు మాటలాడఁ గలిగిరి. వక్రాంగులు సమదేహులైరి. కుంటివాండ్రునడువఁగలిగిరి. కారాబద్ధులువిముక్తులైరి మహీమండలమంతయు నవనవోన్మేషంబుఁ దాల్చివిలసిల్లెను. అఖిలభూతములుమహానందభరితములయ్యెను. మహారణ్యములందలికారుచిచ్చులుసయితము మారిపోయెను. మందభాగ్యుల మహాదుఃఖములు మటుమాయములయ్యెను. అతఁడు మాతృగర్భములో నున్న పదిమాసములలో నతని విగ్రహము చూపరులకుఁ గానఁబడియెను. ఆకాలమున నతఁడు పద్మాసనము వైచికొని కూర్చుండి, తన్నుఁ గొలుచు నిమిత్తము దివ్యదేహములు ధరించి చుట్టుపక్కల సంచరించు దేవతలకుఁ దల్లికి నొప్పి కలుగకుండఁ గుడిచేయిఁజాచి, సాభినయముగా బోధించుచుండెను. మాసములు నిండినతర్వాత మాయాదేవి ప్రసవము నిమిత్తము పుట్టినింటికి బయలుదేరెను. జన్మస్థానమగు కోలీగ్రామమునకు నత్తవారియూరగు కపిలవస్తుపురమునకును నడుమ నొకయడవి యుండెను. దానిపేరు లంబినీవనము. తన ప్రియురాలు పుట్టినింటికిఁ బోవఁదలంచినప్పుడు శుద్ధోదనుఁడు వలయు ప్రయత్నములఁ జేసెను. రెండూళ్ళనడుమ నున్న భూమి నిమ్నోన్నతముగా నుండుటచే నది నిండుచూలాలగు దనయిల్లాలికిఁ గమనయోగ్యముగా నుండదని సమభూమిగాఁ జేయించెను. దారి కిరుప్రక్కలఁ బచ్చనితోరణములు గట్టించి, యరఁటిచెట్లు నాటించి, కనుపండువౌనటు లలంకరింపఁ జేసెను. నిర్మలజలపూరితములగు పాత్రములు

మ్మార్గమధ్యమున నొండొంటికి నాతిదూరమునఁ బెట్టించెను. ఆమె కూర్చుండుటకుఁ బ్రత్యేకముగ నొక సువర్ణ-పీఠముఁ జేయించెను. ఆమె వెనుకఁ దనసంస్థానమందలి ప్రధానపురుషు లందఱుఁ బోవలె నని యాజ్ఞాపించెను. వారిననుసరించి తన రాణులెల్లఁ గదలిపోవం బనిచెను. ఆమె లంబినీవనమునఁ గొంతద వ్వరిగినఁ బిదప నొక సరోవరమధ్యమునుండి యైదు తామరపువ్వులు కాడలనుండి విడి, యద్భుతముగ నామెపై పుష్కువచ్చెను. మహీరుహశాఖలకు నలంకారములుగ నున్నపక్షులు కంఠము లెత్తి యవ్యక్త మధుర స్వనములతోఁ గూసెను. దేవలోకమున నుండు వృక్షముల కెంతమాత్రమును దీసి పోనివై యా వనభూజములు సయితము బుద్ధుని యవతారజ్ఞానము గలిగి సంతసించుచున్నవో యనునట్లు పుష్పఫలభరితములై, శోభావంతము లై, నయనోత్సవకరములై యుండెను. నేత్రానందకరమును మనఃప్రమోదావహమునగు వృక్షసంతానమును జూడఁగనే కొన్ని చెట్లకడకుఁ బోయి, స్పృశియింపవలయు నని మాయాదేవికిఁ గుతూహలము జనించెను. జనించినతోడనే యనుచరు లామెను వన మధ్యమునకుఁ దోడ్కొని చనిరి.

మాయాదేవి తనచెల్లెలగు ప్రజావతితోఁ గలిసి రథముమీఁద గూర్చుండిఁ యా వనమధ్యమునకుం జని, మనోజ్ఞపుష్పములతోడను జక్కని కెంజిగురాకులతోడను నేత్రోత్సవముఁ జేయు నొకవృక్షముం జేతితోఁ జూపి, తన్ను దానికడకుఁ గొనిపొమ్మని కోరెను. అనుచరులు వెంటనే యామెకోర్కెఁ దీర్చిరి. రథ మావృక్షము క్రిందికి జనినతోడనే మాయాదేవి లేచి, నిలువంబడి, యెడమచేయిఁ దనచెల్లెలిమెడకుం బెనవైచి, కుడిచేయిఁ జాచి, తక్కిన కొమ్మలకన్న నెక్కుడు సొగసు మీరి హృదయంగమమైన యొకకొమ్మను బట్టి విరువఁదలఁచెను. అంత నక్కజముగఁ జెట్టున నున్నకొమ్మ లన్నియుఁ దమంతట వంగి, "మమ్మ

గ్రహింపుము. మమ్ము గ్రహింపు" మని యామెను వేఁడుకొను చందమున నామెహస్త మందుకొనుటకు సులభముగా నుండెను. అంతట నారాజపత్ని ముద్దులు మూటగట్టుచున్న యొకకొమ్మవిఱిచి, చేతఁబట్టుకొనెను. ఏదో యద్భుతమైన మహాశక్తివల్ల వాయువు లా సమయమున మందమందములుగ వీచి రాణి కాహ్లాదముఁ గలిగించెను. అ రథమువిూఁద నిలువంబడి మాయాదేవి యావనసౌందర్యము నెద మెచ్చి చూచుచుండఁగనే యామెకు నొప్పులువచ్చెను. పరిజనులు తక్షణమే మగవాండ్రనెల్ల నావలకుం బోవఁబనిచి, నలుప్రక్కలఁ దెరలు గట్టిరి. కొంతసేపటి కామె బ్రసవించెను. కుమారుఁడు జనియించెను. అతఁడు మాయాదేవిగర్భమునం బ్రవేశించినప్పు డెన్నివింతలు పుట్టెనని వర్ణింపఁబడియెనో జననమందినప్పుడు గూడ నన్నివింతలు పుట్టినట్లు వ్రాయఁబడియెను. పుట్టినతోడనే యాకుమారుని నలువురు బ్రాహ్మణులు బంగరువలలో వైచి, తల్లి యెదుటఁ బెట్టి. "ఓ దేవీ! నీవు మహానందము నొందుము. మహాద్భుతమైన నీ గర్భఫల మిదుగో!" నని ప్రశంసించిరట. ఆబ్రాహ్మణహస్తములనుండి నలుగురుదేవత లాబాలకుని గ్రహించి యాశీర్వదించి, పిమ్మట సేవకులచేతి కిచ్చి రఁట. పిమ్మట సేవకులు తెల్లని వస్త్రము లాబాలకునికిఁ గప్పిరఁట. గాని సర్వజనంబులు నివ్వెఱపడి చూడ నాబాలకుండు నేలపై నిలువఁబడి, తూర్పుదెస చూచుటయు వేయిలోకంబు లతని దృష్టిపథంబునఁ బడియె నఁట. ఆలోకముల యందు వసించుదివ్యులు పుష్పవర్షంబులు గురిసి, "మహాపురుషుఁ డవతరించె; అతనికి సమానుఁడు లేఁడు. అతని కధికుఁడు లేఁ"డని యుచ్చైస్స్వనములతోఁ బలికి రఁట. అనంతరము బుద్ధుఁడు తక్కిన మూఁడుదెసలం జూచి, యాకసమువంకఁ జూచి, నేలవంకఁ జూచి, తనకు సమానుఁడగుపురుషు నెందుఁ గానకపోయెను. సకలభూతముల

కన్నఁ దానేయధికుఁడన్ను నాత్మజ్ఞానము గలుగుటచేత నా బాలకుఁ డేడడుగులదూరము గంతువైచి, దుమికి, "ఇదియే నా కడపటి జన్మము. పునర్జన్మము నాకిఁక లేదు. ఎల్లభూతములకంటె నేనధి కుఁడ." నని గంభీరస్వరముతోఁ బలికి సుస్థిరముగా నేలపై నడువ సాగెనఁట. వేయేల! భూమ్యాకాశంబులు వానికి విధేయములయ్యెను. దేవతలు, దేవతానాథులు వానికి గులాములై విధేయులై కైవార ములఁ జేసిరి. జగంబునెల్లెడ వ్యక్తములైన మహాద్భుతముం గని యదివఱ కనేక సంవత్సరములనుండి హిమాలయ పర్వతంబున తపంబు జేసికొనుచున్న యొక మహర్షి యెవఁడో మహానుభావుఁ డవతరించి యుండవచ్చు నని నిశ్చయించి, యాతఁడున్నచోటు వెదకి కొనుచు వచ్చివచ్చి కడకుఁ గపిలవస్తు పురంబుఁ జేరెను. శుద్ధోదనుఁడు కుమా రుని మహర్షి పాదములపై వైచి దీవనలు బడయఁదలఁచి బాలకు నతని సన్నిధికి రావించెను. బాలుని మహర్షి పాదములపైఁ బడ వైవఁ దలఁచుచుండఁగా బాలునిపాదములు మంతంతటవి బహుజటా జూటములతో నిండిన మహర్షి శిరముపై నిలిచెను. సభాసదు లందఱు మిక్కిలి యక్కజము నొందిరి. మహర్షి యక్కజంపడవలదని వారిని వారించి, "ఈ బాలుఁడు బుద్ధుఁడగు" నని చెప్పి, "అయ్యో! యీ తఁడు బుద్ధుడగునందాక నేను జీవింప" నని చింతించెను. ఆతఁడు జనియించిన యైదవనాఁడు నామకరణముఁ జేయించుటకు నిశ్చయించి శుద్ధోదనుఁడు వేదత్రయపారగులైన నూటయెనమండ్రు బ్రాహ్మ ణోత్తములనురావించి భూరిదక్షిణల సంతర్పణము జేసెను. వారిలో నెనమండ్రు జ్యోతిశ్శాస్త్రమునందు మిక్కిలి ప్రవీణులు ఆ యెన మండ్రిగురలో నేడ్వురు బాలకునిమేన నున్న సర్వశుభలక్షణములఁ బరిశీలించిచూపి రెండువ్రేళ్ళఁ బైకెత్తి, చూపి యిట్లనిరి "ఇతఁడు మహీమండల మంతయు నేకచ్ఛత్రముగాఁ బరిపాలించు మహాచక్ర

వర్తియైన నగుఁ లేదా! లోకోద్ధారకుఁ డగుబుద్ధుఁడైన నగుఁ ఎనిమిదవ బ్రాహ్మణుఁ డగు కౌండిన్యుఁడొక్క వ్రేలు మాత్రమే పైకెత్తి "ఈ తఁడు తప్పక బుద్ధుడే యగును. ఇతడు జగంబునుండి యాజ్ఞానాంధ కారముఁ దొలగించి పాపములు రూపుమాపునని నిశ్చలముగాఁ బలికెను బ్రాహ్మణులతనికి సిద్ధార్థుఁడని పేరుఁ బెట్టిరి ఇతఁడు గౌత మగోత్రుఁ డగుటచేఁ దలుచుగా గౌతము డనియును వ్యవహరింపఁ బడుచుండును.

సర్వసంగపరిత్యాగము జేసి జీవన్ముక్తుఁడైన పిదప బుద్ధుఁడను పేరుగలిగెను. ఇవిగాక భక్తులు వారివారి భక్తినిఁ బట్టి సర్వజ్ఞుఁడు, సుగతుఁడు, ధర్మరాజు, తథాగతుఁడు, సమంతభద్రుఁడు, భగవా నుఁడు, మారజిత్తు, లోకజిత్తు, జినుఁడు; మొదలగు నామధేయంబుల నిడిరి. శాక్యులలో నగ్రగణ్యుఁ డగుటచే శాక్యసింహాభిదానముఁ గలిగెను. మఱియుఁ దండ్రింబట్టియుఁ దల్లింబట్టియు మఱియుఁ గొన్ని పేళ్ళుగలవు. నామకరణోత్సవమునకు నలుదెసలనుండి యెనుబదివేల మంది చుట్టములు వచ్చిరి. వారందఱు సుందరాంగుఁడైన యా బాలుం జూచి, బ్రాహ్మణులు పలికిన పలుకులు విని యాబాలుఁడు మహాచక్రవర్తియై శాక్యులఖ్యాతి దిగంతముల వెలయింపఁ జేయునని మహానందభరితులైరి. కాని యా మహానంద మంతయు రెండు దినములలో మహాదుఃఖమయ్యెను. బుద్ధునివంటి మహానుభావునిఁ గన్న యాడుఁది తన గర్భమున మఱియొకనిగనఁ గూడ, దనితలంచి యీశ్వరుఁడు దీసికొని పోయెనో యన్నట్లు మాయాదేవి ప్రసవిం చిన యేడవదివమున మృతినొందెను. శుద్ధోదనుఁడు కుమారుని నిమి త్తము దాదులు కావలిసి కోలి, కపిలవస్తు గ్రామములలో నున్న రాజబంధువుల నాఁడువాండ్ర నందఱఁ బరిశీలించి శుభలక్షణములు గలచక్కనిముద్దియల నూఱుగుర నేర్చి బిడ్డను వారికప్పగించెను.

బాలుఁడు రెండుమూఁడు నెలలవాఁడై యుండఁగా నాగళ్ళ పండుగ వచ్చెను. అనఁగాఁ బ్రతిసంవత్సరము మొదట నాగళ్ళతో నేల దున్నునప్పు డొక యుత్సవము జరుగును. ఆ యుత్సవసమయమున రాజు ప్రధానపురుషుఁడై యుండును. అపుడు రాజు తనకుమారునిఁ గూడ దీసికొని పోయెను. పండుగ సందడిలోఁ బరిజనులు బాలునిమాట మఱచిరి. అయినను బాలుఁడు లోకసామాన్యశిశువులవలె రోదనము సేయక పద్మాసనము వైచికొని కూర్చుండి, ధ్యాననిష్ఠలో నుండెను సూర్యగతిచేత నెల్ల చెట్ల నీడలు వేఱొకదెసకుఁ దిరిగి యుండఁగా నితఁడు కూర్చుండి యుండినచెట్టునీడ రెండవప్రక్కకుం దిరుగక యతని మహామహిమచేతఁ బ్రకృతివిరుద్ధముగా నతనికి గొడుగుఁ బట్టినట్లుండెను. ఇసుక పాతరవలె నెంతకుం దఱుగని మహాద్భుతము లిట్టివెన్నో కలవు. ప్రాచీనుల కవి విశ్వాసముఁ గలిగించి యుండ వచ్చును గాని యీనాఁటివారి కవి విశ్వాసపాత్రములు కావు.

---

## చ తు ర్థా ధ్యా య ము.

తన కుమారుఁడు మహీమండలాఖండలుఁ డగుచక్రవర్తి కావలయునని శుద్ధోదనుఁడు కోరుచుండ, నట్టి లక్షణములు గలపురుషుఁడు సంసారబంధములఁజిక్కి సంకటములు బడు చుండక, సకల జగజ్జనవంద్యుఁ డగుబుద్ధుఁడగునని దైవజ్ఞులు నిశ్శంకముగాఁ జెప్పిరి. అదివినినతోడనె కుమారునిపై నెంతో యాసఁ బెట్టుకొనియున్న శుద్ధోదనునకునింతింతనరానివిషాదము పొడమెను. అరదంబులతో, ద్విరదంబులతో, హయంబులతో, భటచయంబులతో, గొప్పకోటలతోఁ, బూ

వుద్యోఁటలతోఁ, గాంతాజనముతో, సాటిలేని వైభవ మనుభవించుచుసా మంతనృపులు గులాములై జోహారులు సేయుచుఁ దన్నుఁ గొలువ, మూర్ధాభిషిక్తుఁడై, పసిఁడిగద్దెనెక్కి భారతవర్షమంతయు నేకచ్ఛత్రముగ నేలునట్టి దశఁదొలంగి ప్రియపుత్రుఁ డిల్లువిడిచి, యాలుబిడ్డల విడిచి సన్యాసి యయి భిక్షాపాత్రఁ జేతఁ బూని చెట్లనీడల నట్టడవులఁ జరియించు తలంపు మనంబునఁ జారినయంతనే శుద్ధోదనుని పదవిలో నున్నవానికి మనోవేదన గలుగుట యక్కజము గాదు. సిద్ధుఁడగుటకంటె బుద్ధుఁ డగుటకంటె నందనుఁడు సంసారబద్ధుఁడై చక్రవర్తి యనుపేరఁ బ్రసిద్ధుఁడై యుండవలయునని శుద్ధోదనుని సంకల్పము. ఏకపుత్రవిషయమగుటచేత నతనివిషాదము నూఱుమడుఁగులయ్యెను. కుమారుఁడు జననమొందిననాఁట నుండియు నతని విషయమై మనంబుఁ బెంచిన సంకల్పశతము వ్యర్థ మగుననియు సకల సౌఖ్యభాజన మగు తన జన్మము దుఃఖభాజన మగు ననియుఁ దలంచి శుద్ధోదనుఁడు కుమారునకు నిరంతరము సంసారముమీఁదనే తమకముండునట్లును, వైరాగ్యముమీఁద రోఁత బుట్టునట్లును జేయ సమకట్టి, "ఎట్టిసమయమున నాకుమారుఁడు సర్వసంగ పరిత్యాగి యగు" నని జ్యోతిష్కుల నడిగెను. నలువురను జూచిన పిదప విరాగియై పోవు నని కార్తాంతికులు జెప్పిరి. "ఏనలుగురను జూచివిరాగియగు" నని మఱల శుద్ధోదనుఁడడిగెను. అడుగుటయు వారిట్లనిరి. "ఒకవృద్ధునిఁజూచి, యొకరోగినిఁ జూచి, యొకమృతిని జూచి, యొకసన్యాసినిఁ జూచి, పిదప నితఁడు సంసారపరిత్యాగము చేయు" ననిరి. ఆపలుకులు చెవిం బడినతోడనే కుమారుఁడు విరాగి గాకుండఁ జేయుసాధనము తనచేతఁ జిక్కెనని భావించి, శుద్ధోదనుఁ డట్టిపురుషుల నెన్నఁడేని తనకుమారుని సమీపమున రాకుండఁ జేయ వలయు ననియుఁ దనకుమారునిచేత నఖిలమహీమండల మేలింపవలె

ననియు సంకల్పించి, కుమారుఁడుండుచోటికి నలుప్రక్కల శ్రద్ధాళువు లగుబంట్లను నిలిపి, వృద్ధులను, రోగులను, సన్యాసులను, శవములను దనకుమారుని సమీపమునకు రానీయ వల దని గట్టిగా శాసించెను. చండశాసనుఁ డగునతనియాజ్ఞ శిరముఁ దాల్చి, బంట్లు జాగరూకత తో మెలఁగుచుండిరి. పుత్రుఁడు నిరంతరభోగపరాయణుఁడై యుండు నటుల లోకమందలి దైన్యమువానిమనోవీథినిఁ బ్రాపింపకుండునటుల మానవుఁ డెన్నిప్రయత్నములు జేయఁగలఁడో యెన్నివ్యూహములు పన్నఁగలఁడో యెన్నితంత్రములునిర్మింపఁగలఁడో యన్నిప్రయత్నములఁ జేసి, యన్నివ్యూహములఁబన్ని, యన్నితంత్రముల నిర్మించి శుద్ధోదనుఁడు కృతకృత్యుఁడు కాఁదలఁచెను. అంతకుముందు నందనునకు నివాసయోగ్యము లగు మూఁడు మేడలఁ గట్టించెను. ఆ సౌధములలో మొదటిది తొమ్మిదియంతస్థులు గలది. రెండవది యేడంతస్థులు గలది. మూఁడవదై దంతస్థులు గలది. అంతతో నిలువక యెల్లసమయములయందుఁ జివురుజొంపములతో నలరుగుత్తులతోఁ బచ్చనియాకులతో స్వాదుఫలములతో వెలయు నానాభూరుహంబులుగల యుద్యానవనములనిర్మించి కుమారు నందు విహరింపఁ జేయుచుండెను. కుమారుఁడుజవ్వనంబుఁబ్రాపించినయంతనె కోలీరాజపుత్రికయు, నందమునకు, జాణతనంబునకుఁ బేరుగాంచినదియు నగుయశోధరను సిద్ధార్థునకు వివాహముఁ జేసెను. నిరుపమానలావణ్యవతి యగుకళత్రమునకుందోడుగ నలువదివేలమంది నాటకస్త్రీలను భోగభార్యలుగఁ బుత్రునకు శుద్ధోదనుఁడు సమకూర్చెను. ఈసంఖ్య యతిశయోక్తియై యుండవచ్చునని నిశ్చయింప వచ్చును.నలువదివేలమంది గాకపోయినను గొన్నివందలమందినైన భోగభార్యలను శుద్ధోదనుఁడు సమకూర్చి యుండవచ్చును. ఈయాటకత్తియలు కులాంగనకు సులభసాధ్యములుగాని హావభావప్రకటనములచేతను విశేషశృంగార చేష్టల

చేతను మనఃపారశ్యముఁ గలిగించు మృదుగానముచేతను జమత్కా రసంభాషణలచేతను నీతనిమనము నిరంతరానందమగ్నముగఁ జేసి, వైరాగ్యదేవతను వారియంతఃపురముల సమీపమునకైన రానీయ కుందురని శుద్ధోదనుఁడు తలంచి, యీవ్యవస్థఁ జేసియుండవచ్చును. సిద్ధార్థుఁడు దివ్యకాంతలఁబోలు నయ్యంగనలచేతం బరివేష్టింపఁబడి భూలోకస్వర్గసుఖము ననుభవించు చుండెను. శుద్ధోదనుఁడు యశోధరను సిద్ధార్థునకు ధర్మపత్నిగఁ బట్టపుదేవిగఁ జేసి కొడుకుం గోడలి వెండిపీఠముపైఁ గూర్చుండఁ బెట్టి, వారిశిరస్సులపైఁ గిరీటములఁ బెట్టి, పట్టాభిషేకముఁ జేసి, తన రాజ్యమును, సర్వాధికారమును, ధనకనకవస్తువాహనములను వారి కర్పించెను. అనంతరమతఁడు సామంతు లగుదొరలను, రాజబంధువులను రావించి, 'మీరందఱు మీపుత్రికలనుఁ దీసికొనివచ్చి, సిద్ధార్థున కుపభార్యలుగఁ జేయు' మని, శాసించెను.

అనవుడు వారు తమయేలిక యగుశుద్ధోదనున కిట్లనిరి. "అయ్యా! సిద్ధార్థుఁడు చిన్నవాఁడు. కోమలశరీరుఁడు. రాజపుత్రుఁడయ్యు నొక్కశాస్త్రమైన నేర్వలేదు. ఒక్కకళయైన నధిగమింపలేదు. ధనుర్వ్యాపార మేమో యెఱుఁగనెఱుఁగఁడు పగతుఁ డెవ్వఁడైనఁ దనపై నెత్తివచ్చె నేని యితఁడు వాని నెదుర్కొనియెట్లుపోరాడఁ గలఁడు? మాపుత్రికల నితఁడు మానప్రాణములఁ గాపాడి, రక్షింపఁ జాలఁడు. రాజకుమారలక్షణములయం దొకటియైన లేని యీభోగపరాయణునికి మాకుమారికల నిచ్చి వివాహము జేయఁ జాలము." ఈపలుకులు సిద్ధార్థుఁడు విని, తనయస్త్రశస్త్రవిద్యానైపుణ్యము నెల్లవారికిఁ బ్రదర్శింపఁ దలఁచియావార్తలోకమున నెల్లెడ నెఱుఁగునటుల చాటింపఁబంచెను. సిద్ధార్థునిసామర్థ్యముఁ గనఁగోరువారందఱు రాజాంతఃపురముకడకు రావలసిన దని భటులు

చాటిరి. పేక్షకుల నిమిత్తము గొప్పపందిరి వేయఁబడెను. నియమిత దినమున వేన వేలు జనులా పందిరిలో గుమిగూడిరి. లక్షయు నలుపదివేలమంది చుట్టము లచ్చటఁ జేరిరి. వారు గాక యచ్చటఁ జేరినయితరజనమునకు లెక్కయేలేదు. అప్పుడు సిద్ధార్థుఁడొకవిల్లు తెమ్మని యాజ్ఞాపించెను. ఆవిల్లు వేయిమందిజనులు మోసి తెచ్చిరి. ఆమహాధనుస్సు సిద్ధార్థుఁడు కుడికాలిబొటనవ్రేలి గోటిమీఁద నిలిపి, కూర్చున్నచోటినుండి లేవకయె తనవ్రేలిగోటితో నావింటినారి నవలీలగా లాగెను. అంతచులకనగ నతఁడు నారిలాగి నను ధనుష్టంకారధ్వని బ్రహ్మాండ మంతయు నిండి సహస్రయోజన దూరము వినఁబడెను. జంబూద్వీపవాసులందఱు ప్రళయకాలమేఘగ ర్జనమువంటి యామహానాదము విని వర్షకాలము గాకపోయినను యిటులుఱుముటకుఁ గారణ మేమని విచారింపఁ జొచ్చిరి. అటులు విల్లు గోటమీటి పిదప సిద్ధార్థుఁడు నాలుగరఁటిచెట్లు వరుసగా నాటించి వానిదెస నొకయమ్మువిడిచెను. ఆబాణము నాలుగరఁటిబోదెల దూసి కొని యావలకుంబోయెను. పట్టపగ లనంటికంబములు దూసిపోవునట్లు బాణ మేయుటయతనికొక గొప్పకార్యముకాదు. అంధకారబంధుర మగునర్ధరాత్రమందు సయితె మతఁడు గుఱిఁ దప్పకుండఁ జలవెం ట్రుక నైన రెండుముక్కలుగ భేదింపఁ గలఁడు. ఇట్లు ధనుర్విద్యా ప్రౌఢిమఁ జూపుటతోఁ దనివి నొందక సిద్ధార్థుఁడు గురుశుశ్రూషఁ జేసి నేర్చుకొనక పోయినను దన కష్టాదశ శిల్పములయందుఁ గల నిరుపమానపాండిత్యమును బ్రకటించి చూపఱకు మహాశ్చర్యముఁ గలిగించెను. మనము మఱల మహిమాసముద్రమునఁ బ్రయాణముఁ జేయుచున్నాము.

విల్లు వేయిమంది మోయుటయు, దానిఁగాలివ్రేలిగోట మోపుటయుఁ, జేతివ్రేలిగోట మీటుటయు, ధ్వని సహస్రయోజన వ్యాప్త

మగుటయు, జంబూద్వీపమదరుటయుఁ గవిచాతుర్యము లని చదువరు లెఱుంగకపోరు. గురుశిక్ష లేకయే యతఁడు ధనుర్విద్యాపారంగతుఁ డగుటయు నతిశయోక్తియే. మహాభక్తితత్పరులైన కొందరు చరిత్రకారు లతనికి గురు వున్నాఁడనుట యగౌరవ మని తలఁచి గురువుం దీసివైచి, సహజపండితుఁ డనిరి. మఱికొందఱు చరిత్రకారులు సిద్ధార్థున కైదుగురు గురువులుండిరని వ్రాసిరి. సుదంతుఁడను నతఁడు మొదటిగురువని యొకరు వ్రాసిరి: సుదంతునివెనుక సుబ్బమిత్రుఁడు గురువయ్యెనని మఱికొందఱువ్రాసిరి. శుద్ధోదనుఁడు సిద్ధార్థుని నుదకధారాపూర్వకముగ సుబ్బమిత్రున కప్పగించె నని యొకానొకరువ్రాసిరి. ఈయుదకధార కర్థ మేమి? "బాలుని సంపూర్ణముగా నీ కప్పగించితిని. నీయిచ్చవచ్చినతెఱంగున విద్దెలం దిద్దు" మని శుద్ధోదనుఁడు సుబ్బమిత్రునింగోరెనని దీని యర్థము. మొత్తముమీఁద నతఁడు గురుశుశ్రూషఁ జేసి శిల్పకళలు, ధనుర్వేద రహస్యములు నేర్చియుండవచ్చునని నిశ్శంకముగఁ జెప్పవచ్చును.ఎంత మేధావంతునకైన గురుశిక్ష లేక విద్యలు తమంత రావు. అలోకసామాన్య మగు ధనుర్విద్యాకౌశలముఁ జూచి సామంతులు, రాజబంధువులు సిద్ధార్థుఁడు సామాన్యమానవుఁడు కాఁడని తెలిసికొని తమతమకన్యల నతనికుపభార్యలుగ నుండుట కంతఃపురమున కంపిరి. ఇదియు నతిశయోక్తియై యుండవచ్చును. సిద్ధార్థునకు యశోధర యొక్కతయే భార్య యని యనేకులు వ్రాసిరి. గోపయనునాపెయు నతని యిల్లాలే యని మఱికొందఱు వ్రాసిరి. కాని గోప యను పేరు యశోధర కపరనామ మని యనేకుల యభిప్రాయము. మఱియు మనోహరయనుభార్యయు మృగయ యనువేఱొకయింతియు సుభద్రిశంసన యనునామెయు సిద్ధార్థునిభార్యలని కొందఱువక్కాణించిరి. కాని యివియెల్ల యశోధరకు మారుపేరులని చరిత్రకారులనేకులు నిశ్చయించిరి కావున యశోధర యొక్కతయే సిద్ధార్థుని ధర్మపత్ని.

---

## పంచమాధ్యాయము.

ఇట్లుకొంతకాలము గడచినతర్వాత సిద్ధార్థగౌతముఁడొక్క నాఁ డుద్యానవనమునవిహరింప నభిలాష వొడముటయు సారథిం బిలిచి రథమాయత్తముఁజేయుమని చెప్పెను. అట్లకాక యని యతఁడు నాలుగు గుఱ్ఱంబుల నలంకరించి తెచ్చియరదము సిద్ధముఁజేసెను, సిద్ధార్థుఁడురథమెక్కి, సుందరోద్యానమునకుఁ బయనమైపోయెను. కొంతదవ్వరిగినపిదప కడువృద్ధుఁడొకఁడతని కంటఁబడియెను. ఆముసలి వాఁడు దేహమునందెంతమాత్రము దార్ఢ్యము లేమి యడుగుఁదీసి యడుగువెట్టలేక మిక్కిలి శ్రమపడు చుండెను. ఆవృద్ధునిఁజూచి సిద్ధార్థుఁడు చలితహృదయుఁడై సారథి నిట్లడిగెను. "ఓచెన్నా! మిక్కిలి దుర్బలుఁ డగునీతఁ డెవఁడు? ఇతనికి శరీరములో రవంత మాంస మైన లేదు. ఎముకలు, నరములు పైకిఁగనఁబడు చున్నవి! దంతము లూడిపోయినవి. తల నెరసినది. నడుము వంగినది చేతికఱ్ఱ నూఁతఁజేసికొని యడు గడుగునకుఁ దడఁబడుచు నెట్టెటో నడుచుచు న్నాఁడు అనవుడుసారథి యగుచెన్నఁ డిట్లుత్తరముఁ జెప్పెను. "అయ్యా! ఇతఁడు వృద్ధుఁడు. ఇతని శరీరము శిథిలమైనది. ఇంద్రియములు వికలములైన వి. ఇ తఁ డు దు ర్బ ల త్వ ము న నే ప నిం జే య జాలఁడు. ఎండుచెట్లను విహంగమములు విడిచినట్లు బంధుమిత్రు లీతని విడుచుటచేత నిస్స్పృ డసహాయుఁడై యున్నవాఁడు." అప్పలుకులువిని సిద్ధార్థుఁడు వైక్లబ్యమునొంది సారథి కిట్లనియె. "చెన్నా! ఇది యీ మందభాగ్యున కొక్కనికే సంభవించినదా లేకమనుష్యసామాన్యమున కంతకు నిట్టివయస్థ సంభవించునా? ఇందుకుఁ గారణమేమి? తద్విష యమై నేను జిజ్ఞాసఁ జేయవలయుఁ గాన సత్వరమ చెప్పుము." అని యడుగుటయు సారథి యిట్లనియె. "అయ్యా! ఇది ప్రకృతిధర్మము.

ప్రతిపురుషుఁడు ప్రతిస్త్రీ చరమావస్థలో నిట్టిదశం బ్రాపించును. మీతల్లిదండ్రులు, మీచుట్టములు, నీవు, నీప్రియురాలగు యశోధర చిరకాలము జీవింతురేని దప్పక నిట్టియవస్థ నొందవలసినదే" ఆమాటలు శ్రవణగోచరము లగుటయు "సీ! జీవనము వ్యర్థ మని రథము మరలుపు" మని సారథి కానతిచ్చి యుద్యానవనసందర్శనము మాను కొని గృహాభిముఖుఁడై పోయెను. కుమారుఁ డుద్యానవనమునకుంబ యనమై కడముట్టఁజనక మార్గమధ్యమునుండి, మరలి, యంతిపురి జేరె నని విని శుద్ధోదనుఁడు తత్కారణ మేమి యని యరసి వృద్ధపురుష సందర్శనమున విషాదసంభరితచేతస్కుఁడై కొడుకు గృహాభిముఖుఁ డయ్యెనని తెలిసికొని "హా! మీరు నన్ను నాశనముఁ జేయఁదలఁచు కొన్నారు. ఈక్షణమే నాటకంబులు, నృత్యగానములు సిద్ధముఁ జేయుడు. అంగనాసహవాసము గలిగి వేడుకలందగిలి యున్నంతసేపు మా వాఁడు సంసారత్యాగముఁ జేయఁ" డని పలికెను. అనంతరము కొంత కాలమునకు సిద్ధార్థుఁడు వెండియు నుద్యానవనముఁ జూడ నభిలషించి రథ మెక్కి బయలు దేఱెను. అత్తరి నొకరోగియతనికంటఁబడెను. అతఁడు మార్గమునకుఁ బ్రక్కగా వట్టి నేలం బండుకొని యెను. ఉపచారముఁ జేయుట కెవ్వరు దగ్గఱలేరు. ఆతనిఁ గనుంగొని రాజకుమారుఁడు రథచోదకు నిట్లడిగెను. "సారథీ! ఈతఁ డెవ్వఁడు? శల్యచర్మావశిష్టుఁడై తనమల మూత్రములలోఁ దొరలుచు మిక్కిలి బాధపడుచున్నాఁడు." అన వుడు రథికునకు సారథి యిట్లు బదులు చెప్పెను. "స్వామీ! ఇతఁడు రోగపీడితుఁడై మరణమునకు సిద్ధముగ నున్నాఁడు. ఈరోగము కుదురదు. ఎంతమాత్రమును జీవితాశ లేదు. నేఁడో ఱేపో యతఁడు మృతి నొందును." ఆవచనంబులు కర్ణగోచరము లగుటయు రాజకుమారుఁ డు చింతాక్రాంతమనస్కుండై వివర్ణవదనుఁడై గిరుక్కున రథము మరలించి యంతఃపురమున కరిగెను. పిమ్మటఁ గొంతకాలమునకు

సిద్ధార్థుఁ డొకనాఁడు పూఁదోఁట జూడస్యందనారూఢుఁడై మరలఁ జనుచుండ నెట్టయెదుటఁ గొందఱుమనుష్యులు శవమును మోసికొని పోవుచుండిరి. అది చూచి సిద్ధార్థుఁడు సారథినిట్లడిగెను. "ఓయీ! ఏమిది? కొందఱుమనుష్యులు మఱియొక మనుష్యుని మంచముమీఁద వైచి యేల మోసికొని పోవుచున్నారు? వెంటఁ జనుమనుష్య లేల వెండ్రుకలు విరియఁబోసికొని దుఃఖపీడితులై బొమ్మ్మ మోఁదుకొని యేడ్చుచున్నారు?" అనవుడు "స్వామీ! మంచముమీఁదనున్న మనుష్యుఁడు మృతినొందినాఁడు. అతఁ డీక మీఁద నెన్నఁడుఁ దనతలిదండ్రులఁగాని యాలుబిడ్డలఁగాని బంధుమిత్రులఁగాని చూడఁజాలఁడు. అతఁడీప్రపంచమునుండి లేచిపోయినాఁడు!" అది విని రాజకుమారుఁడు నిట్టూర్పువిడిచి యిట్లనియె "సీ! వార్ధకదశలోఁ గూలఁద్రోయు నీయౌవనమేల? బహురోగభూయిష్టమగు నీశరీరమేల? భోగపరాయణుఁడైన విద్వాంసునిజన్మము వ్యర్థము వ్యర్థము." అని సత్వరంబుగ నంతఃపురమున కరిగి గొన్నిదినములదనుక నేరిం జూడనొల్లక యొరులతో సంభాషింప నొల్లకయుండెను. తరువాతఁ గొన్నినాళ్ళకు సిద్ధార్థుఁడు వెండియుఁ బ్రమదావనవిలోకనకుతూహలంబు జనియింపఁ దన తేరెక్కి పోయెను. ఆసమయమున నతని కొకసన్యాసి కనఁబడెను. ఆతనిఁజూచి గౌతముఁడు సూతు నిట్లడిగెను. "సారథీ! ఇతఁ డెవ్వఁడు కాషాయవస్త్రములు ధరించినాఁడు. ప్రశాంతభావమున నడచుచున్నాఁడు. కన్నెత్తి చూడఁడు. ఎవ్వరితో మాటలాడఁడు." అడుగుటయు సిద్ధార్థునకుఁ జెన్నఁ డిట్లనియె. "స్వామీ! ఈతఁడు సన్యాసి. బిచ్చమెత్తి బ్రతుకును. అతఁ డింద్రియముల జయించినాఁడు. ప్రపంచసంబంధము వదలినాఁడు అతఁడు సర్వసమానుఁడు" ఆమాటల కలరి యారాజనందనుఁ డిట్లనియె. "ఆహా! ఈయాశ్రమము నాకిష్టము విద్వాంసు లీయాశ్రమమును గడుంగడుఁబ్రశంసింతురుగదా? ఇది

మిక్కిలి సుఖప్రదమగు నాశ్రమము" అని సారథిని రథము మరలుప మని కోరి స్వగృహంబునకుఁ జనియెను. పూర్వోదాహృతపురుష చతుష్టయంబును నిశ్చయముగా సిద్ధార్థుఁడు చూడలేదనియుఁ జూచి నాఁడని వ్రాయుట కవికల్పన మనియు లోకానుభవమువలనను నిరంతర తత్త్వజిజ్ఞాసవలనను గౌతముఁడు యౌవనంబు బాణవేగతుల్యం బనియు సౌందర్యంబు విద్యుల్లతవలె క్షణభంగురం బనియు శరీరము రోగభూయిష్ఠం బగుట వినశ్వరంబనియు భోగంబు లస్థిరంబులనియు సంసార మాశాపరివర్ధకం బనియు సంసారసాగర ముత్తరించుటకు ముక్తిఁబడయుటకుఁ బ్రశాంతమై సంతుష్టికి నిధానంబైన సన్యాసంబే పరమసాధనంబనియుఁ దెలిసికొనెనని కొందఱుపండితు లభిప్రాయపడు చున్నారు. ఈయభిప్రాయ మేనిశ్చయమై యుండవచ్చును. లేదా యట్టి పురుషు లతనికిఁ గనఁబడి యుండవచ్చును. ఉద్యానవనములనుఁ జూడఁబోయినపుడెల్ల నతనికట్టి విపరీతదర్శనములు గనఁబడుట యాశ్చర్యకరమేమైనను మనజీవితములో నప్పుడప్పుడు గతిలేనిరోగులను దిక్కుమాలినవృద్ధులను మనము చూచుచుండుటయు మనమనంబుల యందు వైరాగ్యభావములు తోఁచుచుండుటయు ననుభవసిద్ధమే. తఱుచుగా నట్టిదీనులను జూచునట్టి మనకే యొక్కొక్కదీనుంజూచి నప్పుడు వైక్లబ్యవైరాగ్యములు కలుగుచుండఁగా నెన్నఁడు నిఱుపేదలను రోగులను శవములనుఁ జూచి యెఱుంగక దైన్యము విని యెఱుంగక దుఃఖము కలనైనఁ గనియెఱుంగక తారామండలమధ్యస్థుఁడగు చంద్రుఁడువలెఁ గాంతాజనపరివేష్టితుఁడై సౌఖ్యంబు లవ్వారిగఁ గాంచినరాజకుమారున కట్టిభయంకరదర్శనములు విషాదము బుట్టించుట యాశ్చర్యముకాదు. ఈకథ సరిగా నిందున్నట్లు జరుగక పోవచ్చును. కాని యట్టిపురుషుల నతఁ డప్పుడప్పుడు చూచి యుండవచ్చు నని భావించుటయు నసంభవముగాదు. కథయొక్క యాథార్థ్య మెట్లు

న్నను మనఃష్యపరికృతి లోకవృత్తమును నిరంతరము పరిశీలించుటచే నతనికి వైరాగ్యోదయ మయ్యె నన్నమాట సత్యము. భోగముల నతఁడు తుదముట్ట ననుభవించుటచేత నవి నిస్సారంబులని యతఁడు తెలిసికొని వానిపై నభిమానము విడిచి యుండవచ్చును.

---

## షష్ఠాధ్యాయము.

ఒకనాఁడు సిద్ధార్థుఁడుద్యానవనమున కరిగి యచ్చోట కొంతసేపుండి గృహంబునకుంబోవ మిక్కిలి శృంగారింపఁబడినయరదంబు నెక్కుటకు సిద్ధముగనుండెను. బ్రాహ్మణులు స్వస్తి జెప్పిరి. గాయకులు తమతమప్రజ్ఞానుసారముగ మధురగానముఁ జేసిరి. తక్కువ వర్ణములవారు మహోత్సాహముతో నతనిచుట్టుం జేరి తమయానందమును వెల్లడించిరి.ఆసమయమున మందిరమున యశోధర కుమారుని గనియెను. వంశపారంపర్యము నిల్పుహేతువుఁడు జనియించినందున శుద్ధోదనుఁడు మహానందభరితుఁడై యుద్యానవనమున నున్నకుమారున కాశుభవార్త తెలియఁజేయవలసినదని బంట్ల నంపెను. అప్పుడే సిద్ధార్థుఁడు రథమెక్కఁబోవుచుండెను. శ్రవణానందకరమైన యావార్తవినఁగానే సిద్ధార్థుఁడు సంతోషపూరితమనస్కుఁడగుటకుమాఱు "ఇది యొకరాహులము (యాటంకము) నూతనబంధ మొకటి ప్రభవించినది" యని యతఁడు నిరుత్సాహముగఁ బలికెను. శుభవార్త దెచ్చిన యాబంట్లు తిరిగి యంతఃపురమున కరిగినపిమ్మట శుద్ధోదనుఁడు వారినిఁ బిలిచి యీవార్తవిని నాకుమారుఁ డేమన్నాఁడని

యడిగెను. సిద్ధార్థునినోట వెడలినమాటలు వారాయనకు సరిగఁ దెలిపిరి. అవి విని శుద్ధోదనుఁ "డట్లయిన నామనుమనిపేరు రాహులుఁడగు గాక" యని పలికెను. సిద్ధార్థుఁడు రథమెక్కి విచారగ్రస్థుఁడై దీర్ఘాలోచనాపరుఁడై యంతిపురికి వచ్చెను. కులవిస్తారకుఁడగుమనుమఁడు తమతేని కుదయించినందుకుఁ బురవాసులు నిరుపమానందము నొందిరి. ఆనందాతిశయమున వారు రథారూఢుఁడై యేగుచున్న సిద్ధార్థుని జయజయధ్వనులుచేసి సన్మానించి తమ యానందమును వెల్లడించిరి. ఆజయజయధ్వనులలో నతనికి శ్రోత్రపర్వమై యొకమాట వినఁబడెను. సిద్ధార్థునిజ్ఞాతియు నవివాహితయు గుణసంపన్నయు నైన కిసగౌతమి యనునామె రాజకుమారుని జూచుటకుఁ దనసౌధముయొక్క కట్టకడపటియంతస్తు నెక్కెను. ఎక్కి యాయువతి సిద్ధార్థునిఠీవియు సాటిలేని సౌందర్యమును కన్నులం జూచికొని మిక్కిలి సంతోషించి యానందపారవశ్యమున నీక్రింది గీతము పాడెను.

కం. ఈతనయునిఁ గని పెంచిన
యాతలిదండ్రు లతిధన్యు లవనిజనులలో
నీతని భర్తగఁ బడసిన
యాతరళాక్షి యతిధన్య యంగనలందున్.

ఈగీతము విని రాజకుమారుఁడు తనలో నిట్లని తలంచెను. "ఏమీ! కిసగౌతమి యేమన్నది. ఇటువంటి కుమారునిఁ గన్నతల్లి ధన్యురాలా? తండ్రిధన్యుఁడా? భార్య ధన్యురాలా? ఇదియేకదా యామె పాడినగీతములోని యర్థము. ధన్యులనఁగా సౌఖ్యవంతులు. ఆధన్యత్వ మెట్లుకలుగును? ఆసౌఖ్య మెట్లుకలుగును? చిత్తపరిశాంతి యెట్లు లభించును? ఈగీతముయొక్క పరమార్థము మిక్కిలి మధురమై నాకు ప్రబోధమును గొల్పుచున్న" దని చర్చించి లక్ష

వర్హాలు విలువగలహారమును దనమెడలోనుండి తీసి యామెకు కానుకగఁబంపెను. ఆకానుక నందుకొని మిక్కిలి సంతసించి సిద్ధార్థుఁడు నామీఁద వలపునిలిపియుండును. లేకున్న నీహార మెందు కంపునని యామె తలంచెను. కాని సిద్ధార్థుఁ డామెను మరల చూడ లేదు. అనంతరము సిద్ధార్థుఁడంతిపురి కరిగెను. మందిరంబున నతఁడు సుఖాసీనుఁడై నపిదప నానావిచిత్రాంబరంబులుగట్టి యథోచితాలంకారములు గైకొని చక్కదనంబున నచ్చరలేమలనుమించుమించు బోఁడులు హస్తముల వీణియలు దాల్చి మనోజ్ఞమగు గానముఁ జేసి నృత్యంబులు చేసిరి. కాని సిద్ధార్థునిమనస్సు పరాయత్తమై యుండుటచే నతఁడు మునుపటివలె గానమున కలరక నృత్యంబు నెదమెచ్చక నిద్రవోయెను. నిద్రితుఁడైన యాతనిఁజూచి యావిలాసవతు లిట్లను కొనిరి. “ఎవనినిమిత్తము మనమీ నృత్యగానంబులు నెఱపుచుంటిమొ యతఁడు నిద్రవోయెను. మనము గూడ నిద్రవోవుదము” అని తమవీణియలు నేలఁబెట్టి పండుకొనిరి. అర్ధరాత్రిమున సిద్ధార్థునకు మెలఁకువ రాఁగా నతఁడు మేలుకొని కూర్చుండెను. సుగంధతైలపూరితములైన దీపములు మిక్కిలి ప్రకాశించుచుండెను. ఆదీపముల వెలుఁగున నతఁడు నిద్రించుచున్న యాయువతులఁజూచెను. ఆసందర్శన మతనికెంతో నేవయు విరక్తియుఁగలిగించెను. అతఁడు చూచునప్పటి కాయంగనలు శ్రమము లేక గదిలో నిచ్చటచ్చటఁ బండుకొనిరి. వారికొప్పులు విడిపోయెను. తలవెండ్రుకలు చెదరియుండెను. కొందఱి శరీరముల వస్త్రములు తొలఁగెను. కొందఱు నోళ్లు తెఱచిరి. కొందఱు పలువరించిరి. కొందఱు పండ్లుకొఱుకసాగిరి. కొందఱినోట చొంగ కారెను. కొందఱావులించిరి. కొందఱు లోలో నేమో గొణుగుకొనిరి. అంతకుమున్న తఁడు చూచినపు డాయంగనలు సింగారించుకొని లోపంబులఁ గప్పిపుచ్చికొని బంగారుబొమ్మలటుల మెఱుపు

దీఁగలట్లు నయనోత్సవము జేసిరేకాని యీవిధముగ విలక్షణములతో వికృతచేష్టలతో ననహ్యరూపములతో ననుచితవేషములతో నతనికిఁ గనఁబడలేదు. అలంకారములులేని సహజరూపముతో నతఁడంగనలం జూచుట కదియె మొదటిసారి. మోహపరవశుఁడైనకాలమున నంగనలు సమ్మోహనాస్త్రములట్లు కనఁబడుచుండిరి. కాని వారినిజస్వరూపములు చూచినప్పుడుకన్నులు కన్నులే కాని కలువ రేకులు కావనియు, శ్రవణంబులుశబ్దగ్రాహులగురంధ్రంబులే కానిచక్కిలంబులుకావనియు,నధరంబులు పెదవులే కాని దొండపండ్లు కావనియు, కురులు తలవెంట్రుకలే కాని గండుతుమ్మెదలు కావనియు, నాసిక యుచ్ఛ్వాసనిశ్వాససాధనమైన యవయవములేకాని సంపంగిపువ్వు కాదనియు శరీరముఁ గోలు తిత్తియె కాని కనకలత గాదనియుఁబరిజ్ఞాతయగు తత్వవేత్తకుఁదోచకపోదు.ఎంతో మనోహరమైన యాభవనమతనికంటికిఁబీనుఁగుపెంటవలె గనబడెను. మోహమయమైన యీప్రపంచమునజీవించుటనాలుగుచూరులంటుకొన్నయింట నుండుట యని యతనిమనస్సునకు దట్టెను. ఆయ సహ్యదర్శనానంతరమున నతనినోట నప్రయత్నముగ నీకిందిమాట వెడలెను. "ఇదియెల్ల నన్ను వేధించుచున్నది. ఇది దుస్సహముగ నున్నది." ఆపలుకులు వెడలినతోడనె యతఁడు దిగ్గున లేచి ద్వారము కడకుఁబోయి యెవఁడక్కడ యని కేకవైచెను. ప్రక్కగదిలో నిద్రించుచున్న చెన్నఁడు మేలుకాంచి "స్వామీ! నేను చెన్నఁడ"నని బదులుచెప్పెను. అతనికి సిద్ధార్థుఁడిట్లనియె. "చెన్నా! నేను సంకల్పించిన సర్వసంగపరిత్యాగము నేఁడు చేయుటకు నిశ్చయించితిని. జీనువైచి యొకగుఱ్ఱమును దీసికొనిరా." అట్టిప్రయత్నము వలదని చెన్నఁడతనితోఁ జెప్ప మొదట యత్నించెను. కాని, సిద్ధార్థునినిశ్చయముఁజూచి యాతనితో వాదముసేయుట నిష్ప్రయోజనమని తెలిసికొని తిన్నగా గుఱ్ఱాలసాలకుఁ బోయి తాను గొంపోయిన దీపపు

వెల్పుగున సాలలో నొకమూల నిలిచియున్న కంటక మనుహయరత్నము జూచెను. ఈగుఱ్ఱమునకు నేనుజీనువై వవలయునని నిశ్చయించుకొని దానిపై జీను పఱచి సిద్ధముచేసెను.

సిద్ధార్థుఁడు గృహమును ధర్మపత్నిని నందనుని సకలసౌఖ్యములను విడిచి సర్వసంగపరిత్యాగముఁజేసి కాననాంతరముల కరుగుటకుఁ గారణ మే మని మనము విచారింపవలెను. వృద్ధపురుషుని, జాడ్యపీడితుని, శవమును, సన్యాసినిజూచినంతమాత్రముననె యట్టివైరాగ్యముదయించి యుండునా? అనుదినము, నెందఱువృద్ధుల విలోకించుట లేదు? జాడ్యపీడితులఁ జూచుటలేదు? శవముల నవలోకించుటలేదు? సన్యాసుల సందర్శించుటలేదు? అందఱకు నట్టిచిత్తవిక్షోభము గలిగినదా? కలుగుటలేదు. అది కానియెడల కిసగౌతమి పాడినగీత మతని మనస్సును విరక్తిమార్గమునకుఁ ద్రిప్పియుండునా? అగీత మెందఱు విని యుండలేదు. ఆగీతము విన్నవారికందఱకు వికారము గలిగించెనా? నిద్రితలైన యంగనల వికృతచేష్టారూపములఁ జూచినప్పుడతనిమనస్సు మాలిన్యరహితమై రాగపరాఙ్ముఖమైన దందురా? అదియొక్కటె యంతబలమైనకారణముగాదు. అట్లైన నేది బలత్తరమైనకారణమై యుండును? అతఁడు ప్రకృతిచేతనే తత్వజిజ్ఞాసుఁడై యుండును. అట మీఁట నాకాలమునందు లభ్యములైన శాస్త్రవిద్యలు, కళలు నతఁడు నేర్చియుండును. గౌతమన్యాయసూత్రములు, కాణాదునివైశేషిక సిద్ధాంతములు సిద్ధార్థుఁడు చదివియుండవచ్చును. కపిలుని నిరీశ్వరసాంఖ్యము, పతంజలివిరచితసేశ్వరసాంఖ్య మనియెడు యోగశాస్త్రము మొదలగు తత్వవిచారణగ్రంథములయందు సిద్ధార్థునకుఁ బ్రవేశము గలిగియుండును. సహజముగా జిజ్ఞాసపరాయణమైన మనస్సు సాంసారికదుఃఖవిమోచనార్థమయి విశ్వహితకారులగు మహాత్ములచేత రచియింపఁబడినతత్వశాస్త్రసిద్ధాంతములతోఁ గలిగినప్పుడు వానికలయిక

చేత వైరాగ్యబీజములు మొదట సముత్పన్నములు కావచ్చును. ఆబీజములు వృద్ధపురుషాదిసందర్శనమువలనఁ గ్రమక్రమముగఁ బెరుగ వచ్చును. కిసగౌతమీగానము కాంతలవికృతరూపవేషసందర్శనము వెంటనేఫలముగలిగించుదోహదములై యుండవచ్చును. విరక్తిమార్గమునఁబడినమనస్సునకు దృష్టిగోచరమగుప్రతిపదార్థమునందును శ్రీణ గోచరమగు ప్రతిగీతమునందును నేదో కొంతవిశేష మున్నట్లు తోఁచుచుండును. మన కొకనిమీఁద ద్వేష మున్నపుడు వాఁడు మంచి యుద్దేశముతోఁ బలికినపలుకులు సయితము ద్వేషమును గ్రక్కుచున్నట్లు మనకు తోఁచవచ్చును. కామమోహితునకుఁ దన ప్రియురాలుచేసిన పనులెల్ల శృంగారచేష్టలుగానె తోఁచవచ్చును. ప్రపంచ మంతయు నీశ్వరమహిమ యని తలంచువానికిఁ బ్రతిస్వల్పవస్తువునందు నీశ్వర చైతన్యము నీశ్వరకారుణ్యముఁ గానఁ బడుచుండును. నాస్తికున కట్టి చైతన్యాదులు కనఁబడవు. అట్లై మొదటి జిజ్ఞాసువై ప్రపంచము యొక్క పౌర్వాపర్యములు విచారించువానికి మొట్టమొదట నది వినశ్వర మని తోఁచును. అది తోఁచిన తరువాత రోగము, వార్ధకము మొదలగునవస్థలకు లోనై మరణమే పరమావధిగాన యీశరీరము శాశ్వతము కాదనియు శరీర మనుభవించుభోగము లన్నియుఁ బరిత్యాజ్యములనియుఁ దప్పక తోఁచును. క్రమక్రమముగ వానిపై నేవ పుట్టును. నాశనము లేక స్థిరమయి శాశ్వతమయియుండు పదార్థమును వెదకుట కిష్టము పుట్టును. మునుపెంతో ప్రేమాస్పదులై పంచప్రాణములకంటె నెక్కుడుప్రియములై తోఁచినకళత్రసంతానాదికము తన కాప్తవర్గము కాదనునూహ పుట్టును. వేసఁగి బీరెండచేత మిక్కిలి శుష్కమయి యున్నసమిధలను రవంతయగ్నికణమే ప్రజ్వలింపఁజే యునట్లు చిరజిజ్ఞాసచేఁ బరిపక్వ మయినయతని మనస్సునఁ గిసగౌతమీ గానము, వెలఁదుల వికృతరూపదర్శనము మున్నగునవి నిమిత్తమాత్ర

ములై మహావైరాగ్యోదయమును గలిగించెను. ఒకకారణముతో మఱియొక కారణముచేరి బలపడి యతనికి వైరాగ్యము వృద్ధిచేసెను. సిద్ధార్థుఁడు బుద్ధుఁడైన తరువాత నీవిషయమయి యతఁడొకనాఁడు శిష్యులతో నిట్లు పరిసంగించెను. "శిష్యులారా! నాకుఁ గావలసినంత ధనముండెను. నేను మహావైభవముతో జీవించుచుంటిని. అప్పుడు నాలో నీతలంపులు తోఁచెను. తనశరీరముగూడ వార్ధకావస్థకు, దౌర్బల్యమునకు లోనై యున్నదని తెలిసియు నరుఁడు ముసలివాని జూచినప్పు డేలభయపడి రోఁతం జెందవలయునో యారోఁతకొంతకాల మయినతరువాతఁ దనమీఁదనె పడుననుమాట నెఱుఁగఁడా? నాశరీర ము వినశ్వర మయినదె. నాకును ముసలితనము రాక మానదు. అట్టి యెడ నేను మఱియొక ముసలివానినిఁ జూచి వెఱఁగొందుట న్యాయమా? నేనీవిధముగ విచారము చేసినకొలఁదిని యౌవనమునకు సహజ మయి నయుల్లాసము నామనమునుండి పోయినది. ఇట్టివిచారము నేను చేయు చున్నపుడు జీవితమునందుండవలసిన చైతన్యము నశించినది."

పూర్వోదాహృతమయిన యుపన్యాసమునబట్టి సిద్ధార్థునకు వృద్ధపురుషసందర్శనాదికములే ప్రధానవైరాగ్యకారణములు కావని యు యతనిమనస్సముద్రము జిజ్ఞాసమహావాయుప్రేరితమయి మితి మీఱినసంక్షోభముఁజెంది యుండెననియు నతని వైరాగ్యము చిరజిజ్ఞా సాఫలము కాని తాత్కాలికహేతుప్రేరితము కాదనియు మనము తెలిసికొనవచ్చును. దీనింబట్టి కిసగౌతమీగానము మొదలగునవి లేవని నిరాకరించుట లేదు. అవి శుష్కేంధనమును దరికొల్పుతాత్కాలిక కారణవిస్ఫులింగములని యిదివరకె చెప్పియుంటిమి. ఇల్లువాకిలివిడిచి యాలుబిడ్డలవిడిచిసంసారపరాఙ్ముఖుఁడై సన్యసించినవారిలో సిద్ధార్థుఁ డె మొట్టమొదటివాఁడుకాఁడు. సంసారసంబంధమయినగాథనిద్రనుండి మేల్కాంచిన్న వారదివఱకనేకులుకలరు. జ్ఞానచంద్రికలచేతనజ్ఞానాంధకా

రముఁబటాపంచలుగఁదోలినమహనీయులనేకులు కలరు. ఇందుకుమనపు
రాణములలోననేకోదాహరణములున్నవి. మహారాజకుమారులనేకులు
పిత్రార్జితమయిన రాజ్యమునువిడిచి తపోనిరూఢులై యరణ్యముల
కరిగినట్లు మనపురాణములలో నెన్నోచోట్లఁ జదువు చుందుము. శంత
నునియన్నయైన దేవాపి తండ్రికి జ్యేష్ఠపుత్రుఁడయ్యు రాజ్యకాంక్ష
విడిచి తపోవనంబున కరిగెను. దేవవ్రతుఁడైన భీష్ముఁడు తండ్రియభి
మతముఁ దీర్చుటకుఁ దాను వివాహమును మానుకొని రాజ్యము
విడిచెను. ఇట్టివనేకములు కలవు. అవియెల్ల సిద్ధార్థునకుఁ దెలిసియుం
డును. అందుచేత వైరాగ్యోదయ మయినప్పుడు వివేకులెట్లు నడిచిరో
యట్లే నడువ వలయు నని కృతనిశ్చయుఁడై సంసారశృంఖలాచ్ఛేదన
మునఁ గానిమనోరథసిద్ధిగాదని యతఁడు గృహమునుండి వెడలఁ దలఁ
చెను. భోగములు విడిచి యోగసక్తులై సన్న్యాసు లైనవా రతనికి
ప్రాచీనులలోనె గాక సమకాలికులలోఁ గూడ నుండిరి. ఆయాచార
మె యతఁ డవలంబించెను.

---

## సప్తమాధ్యాయము.

---

అశ్వముందోడి తెచ్చుటకు సేవకుఁడగుచెన్నఁడులాయమునకుఁ
బోయి యున్నసమయంబున సిద్ధార్థుఁడు తనయిల్లాలినిఁ గుమారు
నిఁ గట్టకడపటిసారి మనసారఁ జూచికొన వలయునని బుద్ధిపుట్ట యశో
ధర పండుకొన్న గదికడకుఁ బోయి తలుపు నిశ్శబ్దముగఁ దెఱచి
చూచెను. ఆమె పువ్వులపాన్పుపైఁ బండుకొని పిల్లవానిపైఁ జేయి
వైచికొని గాఢముగ నిద్రించుచుండెను. ఒకసారి బాలకు నెత్తుకొని

ముద్వాడవలయునని కోరిక యతనికి జనించెను. కాని పిల్లవానిం దీసి కొనుటకై యతనిమీఁద నున్నయామెచేయి తొలఁగింపవలెను. హస్తము తొలఁగింపఁబడెనా యశోధర తప్పక మేల్కొనును. మేల్కొనెనా యామె లేచి బాష్పపూరితనేత్రయై పాదములపైఁ బడి తన్ను విడిచి పోవలదనిప్రార్థించిహృదయముకరగించి యుద్యమము మాన్పింపక పోదు. అందుచేత నతఁడు లోని కరుగక గుమ్మముమీఁద నిలిచి తనసంకల్ప మేమో యెఱుఁగక నిండువిశ్వాసముతో నిర్మల హృదయముతో నిసువుపైఁ జేయి వైచికొని నిదిరించు చున్నయిల్లాలిని, దండ్రిని యెఱుఁగక తండ్రియుద్యమ మంతకుమున్నె యెఱుఁగక కన్నులైనఁ దెఱవక పొత్తిళ్ళలోఁ బండుకొని యున్న పసిపాపను గట్టకడపటిసారి కన్నులకఱవుఁదీర మనస్సంతుష్టిగఁజూచివెనుకకుమరలి యంతఃపురచదుకమునకుఁ బోయెను. పోవునప్పటికిఁ జెన్నఁడు కంటకమనుహయమును పల్యాణంబు వైచి సిద్ధము చేసి తెచ్చెను. తెచ్చుటయు సిద్ధార్థుఁడు కృతార్థుఁడై మనోరథ మెక్కినట్లె యాతురంగము నెక్కి యర్ధరాత్రమున జనమంతయు నిద్రాసక్తమై యున్నపుడు పట్టణమును విడిచి పోయెను. చెన్నఁడుమాత్ర మతనిని విడువక వెంటఁ బోయెను. అనోమానదీతీరమునకుఁ బోవువఱకు నతఁడు మార్గమధ్యమున నెచ్చట నాగలేదు. అక్కడ కరిగినతరువాత నతఁడు తనశరీరమందున్న సకలాభరణములును గుఱ్ఱమును జిరకాలమునుండి తన్ను గొలుచుచున్న ప్రియసేవకుఁ డగుచెన్నని కిచ్చి పురంబునకుఁ బొమ్మని వాని కానతిచ్చెను. కాని చెన్నఁడు యజమానునకుఁ దగినసేవకుఁడె కనుక సంసారత్యాగముఁ జేసి సిద్ధార్థునకు శుశ్రూష, జేయఁ గోరి తనయభిమతమెఱిఁగించెను. సిద్ధార్థుఁడు వానికోరిక మెచ్చి యదిసమయము కాదని చెప్పి కాలాంతరమున వానిమనోరథసిద్ధిఁ జేయుట కొడంబడి యప్పుడు తప్పక పురంబున కరుగు మని నొక్కి చెప్పెను.

చెన్నఁడందుకు సమ్మతించెను. చెన్నఁడు ప్రయాణోన్ముఖుఁ డైన పుడు సిద్ధార్థుఁడు వానితో నిట్లనియె. "చెన్నా! నీవు పోయి మాతండ్రి శుద్ధోదనునితోడను మాతల్లియైన ప్రజాపతితోడను నాభార్యతోడను బురజనులతోడను నేఁ సన్న్యాసినైతి నని చెప్పుము. నావిషయమై విచారింపవలదని పలుకుము."

అప్పలుకులు విని జాలిగుండె గల చెన్నఁడు వెక్కివెక్కి యేడ్చెను. సిద్ధార్థుఁడు వాని నూరడించి ధైర్యము చెప్పి బుజ్జగించి పట్టణమున కంపెను. చెన్నఁ డేడ్చుచుఁ బోయెను. అనంతర మారాజకుమారుఁడు తనచేతిఖడ్గముతో శిరోజములు ఖండించుకొని దారిం బోవుచున్నయొక పేదవానికి విలువ గలతనయుడుపుల నిచ్చి వాని కడనుండి పేదబట్టలు గ్రహించి యవి దాల్చి సన్న్యాసియై మగధదేశ రాజధానియైన రాజగృహం బనునగరంబునకుఁ బోవ సాగెను. అప్పటి కతనిమనస్సు ప్రశాంత మయ్యెను. ఆగర్భశ్రీమంతుఁ డైనయతనికి వైరాగ్యోదయ మైనతరువాత ప్రత్యక్షసన్న్యాసము స్వీకరించువఱకు గృహము కారాగృహ మయ్యెను. చంద్రశాలలు చెఱసాలలయ్యెను. కాంతాసక్తి నశించి ముక్తికాంతాసక్తి మనంబున నుదయించెను. పూలపాన్పుమీఁద రోఁత పొడమి రాలసెజ్జలపై భ్రాంతి వొడమెను. మనోహరములగు సుందరోద్యానవనములు సింహశార్దూలాదిఘాతుక మృగసంకులము లగుమహావనముల ట్లతనికంటికిఁ బొడకట్టెను. నయనోత్సవము లగు నంగనల మొగములు పిశాచ వదనము లై యతనికేవ గలిగించెను. అంగనలదీర్ఘ శిరోజములు పరిశుద్ధమనంబును బంధించునినుపసంకెళ్ళవలె నతనికిఁ దోఁచెను. మెత్తనియాసనంబులమీఁదఁ గూర్చుండినను ముండ్లమీఁదఁ గూర్చుండిన ట్లతనిమనస్సు పరితాపమునొందఁ జొచ్చెను. హృదయాకాశమున దేదీప్యమానప్రభలకోడ జ్ఞానసూర్యోదయ ముదయించినపిమ్మట నట్టి తేజఃపుంజము ముందర

నజ్ఞానాంధకారము నిల్వలేక పంచబంగాళ మయి పరుగులెత్తిన తరువాత, మనం బాశాబంధనములను ద్రెంచినతరువాత, సంసారస్నేహరజ్జువులు తెగినతరువాత హారంబులు భారంబు లగుట కిరీటంబులు కూపరంబు లగుట సుఖములు పాపసఖము లగుట నగలు పగ లగుట యాశ్చర్యము కాదు. ఎప్పుడు కపిలవస్తునగరంబు విడుతు, నెన్నఁడు రాజ్యపరిత్యాగము సేతు, నెన్నఁడు దారపుత్రుల విడచి దూరము పోదు, నెన్నఁడీమేడలుమిద్దెలు విడిచి హాయిగ నట్టడవులఁ జెట్లనీడలఁ దపముచేసికొందు నని యతనికిఁ దలంపులు తోఁచెను కాని పురంబున నుండవలయు నని దారపుత్రులతో సుఖింప వలయు నని రాజ్యమేలవలయు నని తలం పాయనకు జనింపలేదు. ఆయన కప్పుడు వెనుకటిచుట్టములు చుట్టములట్లు తోఁచ లేదు. జటాధరు లైనయోగులు తపోధను లైనమహర్షులు శిరోముండనముఁ జేసికొన్న సన్యాసులు దగ్గరచుట్టములైరి. పర్వతగుహలు ప్రియమందిరము లయ్యెను. కొండ లున్నతసౌధము లయ్యెను. జగద్విజయార్థమయి యాశలు జయించి కోరిక పోయి యింద్రియజయార్థమయి యాశలుజయించ కోరిక బలసుయ్యె. బాహ్యశత్రువర్గమును జయించుటకంటె నంతశ్శత్రువర్గమును జయించుట ప్రధానకర్తవ్య మని యతఁడు తెలిసికొనెను. అట్లు తెలిసికొని చిరకాలమనోరథ మయినసన్యాసాశ్రమము నధిగమించి వనంబులు వసతులుగ, మఠంబులు మందిరములుగ, వృక్షచ్ఛాయలు విలాసభవనంబులుగఁ బండ్లు దుంపలుఁ గాయ లాహారములుగ నిర్మలనదీజలంబులు పానీయంబులుగ విశ్వప్రపంచ మిల్లుగ మానవకోటి భ్రాతృవర్గముగఁ బరమతపోధనులు గురువులుగ జీవితశేషంబు నతఁడు గడపఁ దలంచెను. అతఁడప్పుడు హాయిగ నూపిరి పుచ్చుకొనెను. గృహము వెడలివచ్చి సన్యసించినపుడు సిద్ధార్థుఁడు తానే బుద్ధుఁడై జగద్గురుఁడై యుండవలసివచ్చునని యెన్నఁడుఁ దలఁపఁడు. కామక్రోధంబుల

జయించి యింద్రియంబుల నిగ్రహించి తపంబుచేసి మోక్షమార్గము కనుఁగొనవలయు నని యితనియభిప్రాయము. వార్ధకమునకు రోగమునకు వశము కానియవస్థలో నుండవలయు నని యతనియాశయము. సంసారబంధములం ద్రెంపి సుఖించు తెరవు గనుఁగొన వలయు నని యతని సంకల్పము.

సిద్ధార్థుని కాలమున మగధరాజ్యమునకు రాజధాని రాజగృహం బనునగరము. మగధరాజ్యము పాండవులకాలమునుండియు మిక్కిలి బలిష్ఠ మయినరాజ్యమని మహాభారతమువలన మనము తెలిసికొన వచ్చును. భారతకాలమున బృహద్రథనందనుఁ డగు జరాసంధుఁడు మగధరాజ్యమును బాలించు చుండెను. అతనికాలమున గిరివ్రజమనుపురము మగధకు రాజధానియై యుండెను. గిరివ్రజమనఁగాఁ బర్వతములగుంపు. ప్రకృతి కట్టినరాతికోటవలె నున్నపర్వతము లైదు పురముచుట్టు నుండుటంజేసి యావీటికి గిరివ్రజ మనుపేరు కలిగె నని పురాణజ్ఞులు వచియింతురు. గోరథము, ఋషభము, వైహారము, ఋషిగిరి, చైత్యకము, ననునవియ యాయైదుగిరులు. పూర్వపు గిరివ్రజమే. సిద్ధార్థునికాలమున రాజగృహం బనుపేరం బఱఁగెనని కొందఱియభిప్రాయము. గిరివ్రజముకాలక్రమమునఁ బాడు పడిన దనియు దానిసమీపమున రాజగృహం బనుపట్టణము నిర్మింపఁబడిన దనియుఁ గొందఱియభిప్రాయము. మౌర్యులు మగధరాజ్యము నాక్రమించినప్పుడు రాజధాని రాజగృహమునుండి పాటలీపురమునకు మార్చఁబడియెను. రాజగృహము నేఁటికిని రాజఘర్ నామమున విహారదేశమున విహారపట్టణమునకు నెనిమిదిక్రోసులదూరమున నున్నది. దీనిచుట్టుపట్ల ననేకక్రోశములవఱకుఁ బాడుపడినచోటులు విశేషముగఁ గన్పడు చుండును. వానింబట్టి పూర్వమిది మహోన్నతదశలో నున్న గొప్పపట్టణ మని యూహింప వచ్చును. ఫాహియా నను చీనాదేశస్థుఁడు భరతఖండమునకు

వచ్చి చూచినప్పుడు రాజగృహము పాడుపడి జనశూన్యమయి యుండెను. ఇప్పుడు జనసమేత మయిన చిన్న గ్రామముగ నున్నది. హిందువులకు జైనులకు నిది పుణ్యక్షేత్రమయి యున్నది. అందు జైనులనేక దేవాలయములు నిర్మించిరి. మగధదేశ మిటీవల విహారదేశమను పేరం బఱగి యిప్పుడు బీహారను పేర వ్యవహరింపఁబడు చున్నది.

---

## అ ష్ట మా ధ్యా య ము.

ఆ కాలంబున మగధదేశమునకు బింబిసారుఁడను నతఁడు రాజు. సిద్ధార్థుఁడు రాజధాని యగు రాజగృహంబునకుఁ జనియెను. ఆనగరంబున కరుగుటలో నతనియుద్దేశ మచ్చట సుఖజీవనము జేయుటకాదు. ఆనగరోపాంతమున నున్న పంచపర్వతములమీఁద జ్ఞానలతల కాలవాలము లని చెప్పఁ దగినవిద్వాంసులు బ్రాహ్మణు లనేకులు నివసించుచుండిరి. వారి నాశ్రయించి జ్ఞానము సంపాదనము జేయ వలయు నని యతఁడు సంకల్పించి వచ్చెను. పురప్రవేశము జేసినతోడనె వందల కొలఁదిజను లతనిచుట్టు మూఁగిరి. బూడిదలోఁ బొలిపినను రత్నము ప్రకాశించుచునే యుండును. అట్లే సన్యాసివేషములో నుండినను సిద్ధార్థునిశరీరమునందు ప్రతిభాగము రాజకళల నీనుచుండెను. అతనిం జూచి జనులు "తప్పక యితఁ డింద్రుఁ" డని యొండొరులతోఁ జెప్పుకొనిరి. "కాదు. కాదు. ఇంద్రుఁడైన యెడల నైరావత మేది. వజ్రాయుధ మేది. ఇతఁడు మహాబ్రహ్మ" యని కొంద ఱనిరి. ఎవఁడో దివ్యపురుషుఁడు పట్టణమునకు వచ్చి యున్నాఁ డనిభావించి పౌరులావార్త రాజున కెఱింగించిరి. రాజు సిద్ధార్థుఁనిజూడవచ్చి యతని ....

రూపలేఖవిలాసముల కచ్చెరుపడి నీ వెవఁడ వని యడిగెను. సిద్ధార్థుఁడు తనపూర్వాశ్రమవృత్తాంతము నెఱిఁగించుట కిష్టములేక "యయ్యా! నేనొకభిక్షుకుఁడ" నని బదులు చెప్పెను. "నాయంతిపురమున కురమ్ము కావలసినంతద్రవ్యము నీకిచ్చెద" నని రాజు పలికెను. సమస్తధనవ్యము వదలివచ్చిన వానికి మరల ద్రవ్య మెందుకు. రాజుకోరిక నిరాకరించి సిద్ధార్థుఁడు రాచనగరమునకుఁ జనక తత్సమీపమందున్న గిరులకరిగి యందున్న బ్రాహ్మణులలో నగ్రగణ్యుఁడైన యలరుండనువానికి శిష్యుఁడై యతఁడు నేర్పఁగలవిద్య యంతయు నేర్చెను. ఆవిద్యయతనికి సంతుష్టి నొసంగనందున నుద్రకుఁడను మఱియొక బ్రాహ్మణునాశ్రయించెను. ఉద్రకుఁడు సిద్ధార్థునకు వేదవేదాంత శాస్త్రములు తక్కినదర్శనములు సమగ్రములుగ నేర్పెను. ఆతత్వశాస్త్రములుగూడ సిద్ధార్థునికి సంతుష్టి నొసంగఁజాలనయ్యెను. అప్పుడతఁడు జ్ఞానకాండమునువిడిచి తపఃకాండ ముపక్రమింపఁ దలఁచెను. ఆకాలంబున సంసారవిముఖులైన మహాపురుషు లనేకులు బ్రహ్మచర్యదీక్షాధురీణులై దారపుత్ర పరిత్యాగులై పరమతపోనిరూఢులై సింహశార్దూలాదిఘాతుకమృగాకీర్ణంబు లగువనంబులకరిగి తపంబుఁ జేయుచుండిరి. కొందఱు జటాధరులు, కొందఱు శిరోముండనప్రియు లగు సన్యాసులు, కొందఱు కాషాయాంబరధారులు, కొందఱు దిగంబరులు, కొందఱు నిరాహారులు, కొందఱువాయుభక్షకులు, కొందఱు జలభక్షకులు, కొందఱు కందమూలాశనులు, కొందఱు పర్ణాశనులు, కొంద ఊర్ధ్వ బాహులు, కొందఱు పంచాగ్నిమధ్యస్థులు, కొందఱు కంటకశయ్యాగతులు నైఘోరతపంబు చేయుచుండిరి. అట్టితపోనియమము దానుగూడ వహించి శరీరముశుష్కింపఁజేసి యింద్రియంబులపొగ రడంచి దివ్యజ్ఞానమును నమానుషశక్తులను బడసి తద్ద్వారమున ముక్తుఁడు గావలయు నని సిద్ధార్థుఁడు సంకల్పించి యు

రువేలమహావనంబున కరిగెను. ఈవనమిప్పుడు బుద్ధగయకు సమీపమం దున్నది. ఆవనంబున కరిగి యతఁడు భయంకర నియమంబులఁబూని యాఱుసంవత్సరములు ఘోరతపంబు చేసెను. అతనిశరీరము శుష్కిం చెను. రక్తమాంసము లెండిపోయెను. ఆతపము జేయునపు డతని యొద్ద నైదుగురుశిష్యులు చేరిరి. ఆమహాతపము వారికిఁగూడ వెఱపు బుట్టించెను. ఒక్కకబళమాహారముకన్న నెక్కువతినఁగూడ దనుకొని నియమము జేసికొని దేహమునకు బలమిచ్చుపదార్థము లెల్లవర్జించి జలము మొదలగు దుర్బలపదార్థములను భుజించుచుశుష్కదేహుఁడ య్యెను. అందువలన నేనుఁగుబలముగల యతఁడు లేచినిలువఁ బడఁజాల కపోయెను. శరీర మంతయు నల్లబడెను. అతనిమేన మున్ను కనఁబడు చువచ్చిన ముప్పదిరెండు కల్యాణలక్షణము లదృశ్యము లయ్యెను. ఎట్టకేల కొకనాఁడు రాత్రి తెల్లవాఱుజామున శరీరదౌర్బల్యముచేత న తఁడుమూర్ఛిల్లెను. అప్పుడతఁడు తపంబువలనను దేహశోషణాదిఘోర కర్మంబులవలనను బ్రయోజనము లేదని తెలిసికొనెను. ఈతపంబులవ లన దనజీవితమున నాఱుసంవత్సరములకాలము వ్యర్థమయ్యె నని యుమహాతపశ్చరణానంతరమున సయితము తప మారంభింపకముందు దానెట్టిస్థితిలో నుండెనో యట్టిస్థితిలోనే యుండవలసివచ్చె ననియున తఁ డెఱిగెను. తపశ్చరణము వలన మోక్షము లేదని యతఁడు భావిం చెను. అతఁ డన్నములేక చావునకు సిద్ధమైయున్న యాసమయమున నొకపల్లెటూరికాఁపువానికూఁతురు సుజాతయనునది యాతని కన్నము బెట్టి ప్రాణము నిలిపెను. ఆమె చేసినయుపకారము సిద్ధార్థుఁడుజన్మాం తరమువఱకు మఱువ లేదు. మరణసమయమున సయితముసిద్ధార్థుఁ డామెచేసిన యుపకారమును స్మరించి సుజాతపెట్టినయన్నముఁ దిన్నత రువాతఁ దనకుబుద్ధత్వము సంప్రాప్తించినందున నామె పెట్టినయన్న మే యన్నమని కొనియాడెను. కొంచెము దేహదార్ఢ్యము కలిగినత

రువాత సిద్ధార్థుఁడు ఘోరతపంబులు మాని వెనుకటివలె సన్యాసియై కాషాయాంబరములు భిక్షాపాత్రము ధరించెను. శుశ్రూషఁ జేయుచున్న శిష్యులైదుగురు "సిద్ధార్థుఁడు ధర్మపథభ్రష్టుఁడై చెడిపోయినాఁడు. నాస్తికుఁడైనాఁ" డని జెప్పుకొనుచు నాతనివిడిచిపోయిరి. మనుష్యసహాయము కావలసినదుర్బలస్థితిలో నమ్మినయాప్తు లాయనను విడిచిచనిరి. శిష్యులుపరిత్యజించి పోయిననాఁటియుదయము సిద్ధార్థుఁడు నిరంజననదీతీరమున నతఁడు మెల్లమెల్లఁగా సంచరించుచుండ సుజాతకనఁబడి యతనిఁ దోడ్కొనిపోయిమధ్యాహ్నభోజనముఁబెట్టెను. అతఁడాకూఁడు నొకమఱ్ఱిచెట్టుక్రిందఁ బెట్టుకొని కూర్చుండి తినెను. నాఁటినుండియావృక్షమునకు జ్ఞానవృక్షమని పేరు కలిగెను. ఏల యన నీవృక్షముక్రిందఁగూర్చుండితత్త్వవిచారము సేయుచుండసిద్ధార్థునకు జ్ఞానోదయ మయ్యెను. నిరంజననది కిప్పుడు ఫల్గునది యని పేరు. ఆవటవృక్షమున్న దేశమునకు బుద్ధగయ యనిపేరు. బుద్ధగయలో నిప్పుడొకవటవృక్ష మున్నది. ఇది బుద్ధదేవాలయమునకుఁ జేరి వెనుక ప్రక్కనొకమంటపము పైభాగమున మొలిచి యున్నది. ఈవృక్షముక్రిందఁ గూర్చుండియే సిద్ధార్థుఁడు బుద్ధుఁడయ్యెనని బౌద్ధులు నమ్ముదురు. రెండువేలయైదువందలసంవత్సరములనాఁటి వృక్షమిప్పటికి నున్నదని నమ్ముట దుర్లభము. వెనుకటివృక్షమంతరించు చుండ మరల దానిప్రక్కను మొలక నాటి మనవారు పెంచుచుండిరని యనేకులూహించుచున్నారు. ఆవృక్షము, తత్పరిసరభూములు, దానిదగ్గఱనున్న దేవాలయము బౌద్ధులకే గాక హిందువులకుఁ గూడ నేఁడు సేవ్యములై పుణ్యక్షేత్రములై యున్నవి.

ఆవృక్షముక్రిందఁ గూర్చుండినప్పుడు సిద్ధార్థునిమనస్సు వెండియు సంక్షుభితమయ్యెను. అతఁడు సంసారపరిత్యాగముఁ జేసి సుప్రసిద్ధులైనపండితుల నాశ్రయించి వేదాంతవిద్య నేర్చెను. ఆవిద్యయ

తనికక్కఱకురాలేదు. తత్వశాస్త్రంబు లతని నొకదరిఁ జేర్పలేదు. కేవలము విద్యాభ్యాసమువలనఁ బ్రయోజనము లేదని యతఁడు నియతుఁడై యుగ్రతపంబులఁ జేసెను. భయంకరతపమువలన ఫలము లేదని యతఁడు గ్రహించెను. అందువలన దేహము శుష్కించెను. ప్రాణములు కంఠగతము లయ్యెను. ప్రయోజనము లేదని తపశ్చరణము మానెను. శిష్యు లతనిని నాస్తికుఁడని ధర్మభ్రష్టుఁడని నిందలు మోపికూర్చున్నచోటునుండి కదలలేనియవస్థలో విడిచి పోయిరి. ఆతఁడసహాయుఁడై కర్తవ్యము నిశ్చయింపలేక పరిపరివిధముల విచారింపఁదొడఁగెను. అట్టి యవస్థలో మరల గృహంబునకుఁ జని పితృహస్తంబునుండి రాజ్యంబు స్వీకరించి దేశంబు బరిపాలించుచు సకలోపభోగంబులననుభవించుచు హాయిగ నుందునా! ఏల యీకష్టము లనుభవింపవలయు నను నాలోచన యతని మనంబునకుఁదట్టెను. ఈతలంపులను దవ్వుగఁ దోలుటకు నాభోగంబుల నుండి మనస్సును మరలించుటకు మనంబున గొప్ప యుద్ధము జరుగ వలసి వచ్చెను. ఈదురాలోచనము లన్నియు మారునివలనఁ గలిగెనని సిద్ధార్థుఁడు నమ్మెను. చరిత్రకారులు నట్లె వ్రాసిరి. మారుఁ డనఁగా సామాన్యార్థము మన్మథుఁడు. దుర్బుద్ధులకెల్ల నధిష్ఠానమగు దేవతయని యిక్కడియర్థము. కొందఱి మతమున మారుఁడనఁగా మృత్యుదేవత. మానవుని మనంబునఁగలుగు దుశ్చింతలన్నియు నేదో యొకానొక దేవతవలనఁ గలిగెనను నమ్మకమైన నుండవచ్చును. లేదా తత్కాలమునఁ గలిగిన మనోవికారములను మహాకవులు చాతుర్యాతిశయమున మూర్తిమంతములుగఁ జేసి యాలంకారికముగ వర్ణించియుండవచ్చును. ఏది యెట్లున్నను జరిత్రకారులు వ్రాసిన విషయములుకొన్ని యిందుదాహరింపఁబడు చున్నవి. ఆసమయమున మారుఁడు ప్రత్యక్షమై సిద్ధార్థున కిట్లనియె. "ఓక్షత్రియా! లేలెమ్ము. నీకు

మరణము సన్నిహితమైయున్నది.” కాని సిద్ధార్థుని హృదయమునిశ్చలమైయుండెను. పిఱికితన మతనిచెంతకు రాఁజాలకపోయెను. అంత టమారుఁడు వజ్రసమానములయిన తన బాణముల నతనిపైఁ బ్రయోగించెను. కాని సిద్ధార్థుఁడు వానిని లెక్కసేయలేదు. అంతట మారుఁ “డింక నా సైన్యంబుల నెల్లఁ గూర్చుకొని యీతని బలిమిం గెలువవలయు” నని మనంబున నిశ్చయముఁ జేసుకొని తన మూఁకలనెల్లఁ జేర్చియుద్ధమారంభించెను. కొందఱు బల్లెములఁదాల్చిరి. కొందఱు కత్తుల పూనిరి. కొందఱు చెట్లు పెఱికికొనివచ్చిరి. కొందఱు దారుణములైన వజ్రపుగదలు ధరించిరి. ఇట్లు నానాయుధపాణులైవచ్చిన యామార సైనికులలోఁ గొందఱు పందితలలవారు, కొందఱు చేఁపతలలవారు, కొందఱు గాడిదెతలలవారు, కొందఱు గుఱ్ఱపుతలలవారు, కొందఱు సర్పాకారులు, కొందఱువృషభ రూపులు, కొందఱు వ్యాఘ్రమూర్తులు, కొందఱు సింహశిరస్కులు. కొంద ఱనేకశిరస్కులు. తక్కినవారనేక మృగాకారులు. కొందఱికు శిరస్సు లనేకములుండియు నొక్కటే దేహముగలిగి యొక్కటే కన్నుగలిగి మొట్టమొదట కనఁబడి వెంటనే యెన్నెన్నో కన్నులు గలిగి కనఁబడిరి. కొందఱు బక్కపలుచగ నుండిరి. కొందఱు మహోదరులు. కొందఱు దీర్ఘకాయులు. కొందఱకుదరములె లేవు. కొందఱు దీర్ఘపాదులు. కొందఱు మహాజానులు. కొందఱు నాట్యమాడిరి. కొందఱు కీచుమని ధ్వనిచేసిరి. కొందఱు రెండుపాదములు దగ్గఱగఁబెట్టి దుమికిరి. కొంద ఱొండొరులను మోఁదుకొనిరి. కొందఱొకచెట్టుమీఁదనుండి యొకచెట్టుమీఁది కుఱికిరి. కొందఱు చెట్ల సందున నెగిరిరి. కొందఱు భూమిని గంపింపఁజేయుచుఁ దప్పటలు చఱచుచు నక్కలవలె నఱచుచు బిగ్గరగ నఱచుచు నానావిధవికృతచేష్టలు చేయుచు నావృక్షముచుట్టుం జేరిరి. కొందఱు సిద్ధార్థుని

మేను ముత్తునియలుగ ఖండింప నెంచిరి. కొంద తేకముగ మ్రింగి వైవఁ దలంచిరి. కాని యీభయంకరరూపము వలన నీవికృతచేష్టల వలన సిద్ధార్థుని తలమీఁది వెండ్రుకయైన కదలలేదు. తమయట్టహాసమునకు సిద్ధార్థుఁడించుకేనియుఁ జలింపమిమారునిమూఁకలు మిక్కిలి విషాదము నొందెను. అంతటమారుఁడు సిగ్గుపడి చిన్నవోయి నిజనివాసమునకరిగెను. భగ్నమనోరథులై పరిజనులు వానిననుసరించిరి. సిద్ధార్థుని మనస్సు నిర్మలమై పరిశాంతమైయుండెను. జగదేకరక్షకుఁడగు సిద్ధార్థునకును మూర్తీభవించినపాపమని చెప్పఁదగిన మారునకును సంగ్రామము జరుగునప్పుడు మహాద్భుతములైన నిమిత్తములనేకములు పుట్టెను. అనేక నక్షత్రములు భయంకరములై నేలపై రాలెను. ఆకాశము మేఘచ్ఛన్నమయ్యెను. అంధకారము గ్రమ్మెను. భూమి చైతన్యములేనిదయ్యు మహాసముద్రములతోడను పర్వతములతోడను చైతన్యముగలదానివలెఁ బ్రియునికౌఁగిటనుండి బలాత్కారముగ లాగివైవఁబడిన పెండ్లికూఁతురువలె మహావాతమున గంపించు ద్రాక్షలతవలె మిక్కిలి కంపించెను. ఈభూకంపమువలన సముద్రము సంక్షుభితమయ్యెను. నదులు సాగరగాములు కాక జన్మస్థానములపై నెదురు ప్రవహించెను. అనేకవర్షములనుండి పెరిగినవృక్షములతోఁ గలిసి పర్వతశృంగములు పెళపెళ విఱిగి నేలఁ గూలెను. ఝంఝామారుతము వీచెను. గొప్ప తుపానుపుట్టెను. మహాధ్వనియొకటి భయంకరమై పొడమెను. చీఁకటి భానుమండలమును గ్రమ్మెను. తలలులేని భూతములు కోటానకోటులు నభోమండలమావరించెను.

ఈ మార్గసందర్శనమును గూర్చి, సిద్ధార్థుఁడు బుద్ధుఁడైనవెనుక తన శిష్యులతో నొకసారి యిట్లు చెప్పెను. "నిరంజననదీతీరమున నిర్వాణమార్గము నన్వేషించుచు నామనంబు నిరంతరధ్యాననిష్ఠనుండ మారుఁడు నాయెదుటనిలిచి నావిషయమై యెంతో జాలిపడి

యిట్లనియె. "నీవు మిక్కిలి చిక్కితివి. మందభాగ్యుఁడవై తివి. నీకు మరణమాసన్నమై యున్నది. వెయ్యిపాళ్లు నిన్ను మరణము గ్రమింగివైచినది. ఒక్కపాలుమాత్రమే జీవనమున్నది. ఓమాననీయా! ఏదోవిధముగ బ్రతికిన మంచిది! బ్రతికియుంటివా నీవెన్నో మంచి కార్యములు చేయఁగలవు. నీవు నిష్ఠాపరుఁడవై హోమాదికర్మములు నెఱపుదువేని నీకనేకశుభములు గలుగును. ఈ ధ్యానమార్గము నీకెందుకు? ఆమార్గము దుర్గమను దుష్ప్రవేశనము." అప్పుడు మారునితో నేనిట్లంటిని. "ఓరీ దుఃష్టుడ! సోమరిపోతుల చెలికాఁడా! నీవిక్కడ కేలవచ్చితివి? పో పో శుభములు నాకేల? నాకు రాఁదగిన శుభములేవో నీవే చెప్పుము. నిర్వాణమార్గము బ్రవేశింపఁగల నను విశ్వాసము నాకుగలదు. శక్తిగలదు. దహనశక్తిగలదు. అట్టిసాధనములు నేను చేయుచుండ సుఖజీవనముఁ జేయుమని నీవు నన్నేల పురికొల్పెదవు? ఈవేఁడిగాడ్పు నదీప్రవాహములనైన శోషింపఁజేయఁగలదు. అట్టిది క్రమక్రమమున నామేనసున్న నెత్తురునుమాత్రము శోషింపఁజేయదా? నెత్తుఁరెండిపోవుచుండ పిత్తశ్లేష్మములుగూడ నెండిపోవును. ఇటుల రక్త మాంసములు హరింప నామనసు ప్రశాంతమగును. అంతట నాబుద్ధి నాధ్యానము నాశ్రద్ధ సుస్థిరములగును. ఇట్లు పరమార్థముల నిమిత్తము బ్రయత్నించుచున్న నా కిందిబ్రియ సుఖములమీఁద మనస్సు చొరదు. ఇట్టి నే నెంత పరిశుద్ధుఁడనగుదునో చూడుము. భోగము నీమొదటిసేవ. అసంతుష్టి నీరెండవదళము. తృష్ణాబుభుక్షులు నీమూఁడవసైన్యము. కామము నాల్గవప్తతన. మాంద్యము నీయైదవరథిని. పిఱికితనము నీయాఱవమూఁక. సందేహము నీసప్తమబలము. కాపట్యము మయిమఱపు లాభము కీర్తి గౌరవము మఱియు నధర్మమువలన సంపాదింపఁబడిన ప్రసిద్ధి మొదలగునవి నీయష్టమసైన్యము. పరదూషణములను జేసి యెవ్వఁడాత్మస్తుతులఁ బ

రితుష్టినొందునో యతఁడు నీకు ప్రియుఁడు. ఇదియెల్ల మలినవర్తనుఁడ వగు నీబలగము.

బుద్ధుని శిష్యురాండ్రలో నొకర్తయగు రాధయనున దొకసారి యతని నిట్లడిగెను. "స్వామీ! మారుఁడు మారుఁడని జనులు చెప్పుకొందురు. ఆమారభూత మెక్కడ నుండును?" దానికి బుద్ధుఁడిట్లనియె. "రాధా! శరీరమెక్కడనుండునో యక్కడ మారుఁడుండును. చంపెడువాఁడు మారుఁడు. చచ్చెడువాఁడు మారుఁడు. కాఁబట్టి దేహమే మారుఁడని నమ్ము. రోగము వ్రణము గాయము మాలిన్యము మలినవర్తనము మొదలగునవన్నియు మారరూపములె. ఇదెఱిఁగినవాఁడు మారు నెఱిఁగినవాఁడె."

ఈసంభాషణమును బట్టి మారుఁడని వేఱొకపురుషుఁడు లేఁడనియు బుద్ధదేవుని మనస్సునఁ బుట్టినవికారములే యీరూపమున వర్ణింపఁబడినవనియు మనమూహింపవచ్చును. శరీరశోషణము మొదలైనవి యేలచేసికొనవలయు నను నాలోచనము మొదట బుట్టి యుండవచ్చును. తన మనోబలముచే వానిని దానే పరిహరించుకొని యుండవచ్చును. ఇదియె యీసంభాషణయొక్క సారము.

---

## నవమాధ్యాయము.

సిద్ధార్థుఁడు మారుని జయించునప్పటికి సూర్యాస్తమయము కాలేదు. పదియవహోర యగునప్పటి కతఁడు బుద్ధుఁడయ్యెను. అనంతము లైన బ్రహ్మాండములయందుఁ గలసమస్తచరాచర వస్తువులయొక్కయు స్థితిగతులనెఱుంగుటకుఁ దగినజ్ఞాన మతని కుదయిం

చెను. పండ్రెండవహోర యగునప్పటి కతఁడు బ్రహ్మాండములయం దున్న సమస్త విషయములను దనదాపుననున్న పదార్థములనుజూచు నట్లె జూడఁగల దివ్యదృష్టి సంపాదించెను. అనంతరము మానవులకు జన్మాంతరము లేలగలుగుచున్నవో యాకారణంబులఁ దెలిసికొను జ్ఞానమును నట్టికారణంబుల మొదటినుండి తుదవఱకుఁ దుదనుండి మొదటివఱకు నరసి శోధింపఁ గల జ్ఞానమును నతనికిఁ గలిగెను. మఱియు నారాత్రి చతుర్గాశ్రిమంబుల ఫలంబుల నతనికిఁ బ్రాపించెను. మరు నాఁడరుణోదయ మగునప్పటికి సిద్ధార్థునియందుఁగల సమస్తపాపసంచిక చింతలు నశించెను. నశించుటయు ననంతకోటిబ్రహ్మాండములలో నున్న సమస్తజంతువులు మున్నెన్నఁడుఁ గని విని యెఱుంగని పరమబుద్ధుని సందర్శించి ధన్యతఁ జెందెను. అంతట బుద్ధదేవుని శరీరమునుండి యాఱురంగులుగల కిరణములు బయలుదేఱి యాజంతువులపైఁ బ్రసరించెను. అంతట నా కిరణములు నిమిషమాత్రమైనను నొకచోటనిలువక యొకప్రాణిమీఁదినుండి మఱియొక ప్రాణిమీఁదికిఁ బ్రసరించుచుఁ దమచేతఁ దేజోవంతములైన భూతముల నలరించుచు నొకసారి నీలమేఘమువలెను, వేఱొకసారి కొండగులాబి వలెను, మఱియొకసారి తెల్లదువ్వలువ వలెను, నింకొకసారి యెఱ్ఱపూవులదండవలెను, మఱియొకతూరి తేజోవంతమగు స్తంభమువలెను, నానావర్ణములు దాల్చుచుఁ జూపర కద్భుతమావహిల్లఁ జేసెను. అవి చూచినవారందఱు నహహా యెట్టివర్ణములని ప్రశంసించిరి. అట్లు ప్రశంసించుటచే వారు ధన్యులైరి. ఆ ధన్యత్వముచేత జన్మవిముక్తి వారికిఁ గలిగెను. అతఁడు గర్భస్థుఁడైన కాలమునను జన్మకాలమునను గనఁబడిన ముప్పదిరెండు మహాద్భుతములు నాఁడు మరల కనఁబడెను. అప్పుడు బుద్ధునకు సమర్పింపఁబడిన వెలలేని కానుకలని లక్షనాలుకలైన వర్ణింపఁజాలవు. అప్పుడు కలి

గిన మహాద్భుతములను మరల జెప్పఁజాలము. సిద్ధార్థుఁడు బుద్ధుఁడై నతోడనే యమృతపూరభాండమువలె నుండెను. అతనిమనస్సు ధర్మామృతముతో నిండియుండెను. ఆసమయమున నతఁడానంద్రాతిశయమున నీక్రిందివిధమున బలికెను: "నే నెవనికొఱకు వెదకుచున్నానో యానిర్మాతను జూడకపోయిన పక్షమున ననంత జన్మపరంపరాపరిభ్రమణముల నేను చేయవలసినవాఁడనె. పునర్జన్మములత్యంత బోధకములు. ఆజన్మనిర్మాతను నేను కనులారఁ జూచి యిట్లంటిని. "నానిమిత్తము నీవు వే ఱొకగృహము కల్పింపఁ జాలవు. నీదూలములు భగ్నములైనవి. నీవాసములు చెదరిపోయినవి. ప్రాపంచిక పదార్థములనుండి నామనస్సు విడిచిపోయినది. నేనిప్పుడు నిష్కామస్థితిని బ్రాపించితిని" ఇటులుసిద్ధార్థగౌతముఁడు వటవృక్షచ్ఛాయనుగూర్చుండి సకలకామపరిత్యాగము జేసి జగద్వంద్యుఁడై బుద్ధుఁ డయ్యెను. మరణశూన్యమై శోకవివర్జితమై బాధాంతకమై పునర్జన్మరహితమై రోగదూరమై వార్ధక్యాభావమై కామ క్రోధనాశక మైనయవస్థను బొందుటకై యెన్నిమార్గములు కలవో యన్నిమార్గములయందు నతఁడు నడచెను. కాని యతఁడు గమ్యస్థానమును జేర లేదు. ఆనాఁటి విద్వాంసు లందఱు మోక్షోపాయమని దేని నగ్గించి యనుసరించి శిష్యులకు బోధించిరో యామార్గంబుల నతఁడు నడిచి విసికి భగ్నమనోరథుఁడై గమ్యస్థానముఁ జేరలేక మరణావశిష్టుఁడై యెట్టకేల కావృక్షచ్ఛాయఁ జేరి దిన మంతయుఁ బరమధ్యానాంతరంగుఁడై కూర్చుండి మనఃపరిభవములైన యనేక సంకటములకు లోనై యిటుల విచారింపఁ దొడఁగెను. "ఆలుబిడ్డల విడిచి సన్యసించి జపంబులు తపంబులుచేసి మరల గృహాభిముఖుఁడనై పోవలయునా? మరల సంసారినగుదునా? వెండియు భోగపరాయణుఁడను గావలయునా? జన్మపరంపర నుండివిమోచనముఁ గలిగించు మోక్షోపాయము లేదా?" అటుల వి

చారించుచు నతఁడు గాఢసమాధిలోనుండ మెఱపువలె నతని మనంబున నాకస్మికముగ నఖండజ్ఞానోదయమయ్యెను. నిర్వాణమునకు నిజమైన దారి యతనికిఁ బొడకట్టెను. అతఁడు బుద్ధుఁడయ్యెను. అట్టిపరమావధి నతఁడు పొందినను నతనికిఁ గష్టము తప్పలేదు. అతని సంకల్పము విఘ్నముఁ జేయుటకు మారుఁడతనికి మరలఁ గనఁబడెను. నాఁడు తనకుమారునకు జరిగిన సంభాషణమును బుద్ధుఁడు శిష్యులతో నీక్రిందివిధముసఁ జెప్పెను. "అప్పుడు దుష్టాత్ముఁడైనమారుఁడు నాకడకు వచ్చెను. వచ్చి నాప్రక్క నిలువఁబడెను. నిలువంబడి నన్ను జూచి యిట్లనియెను. "ఓమహాపురుషా! ఓసిద్ధసంకల్పా! నిర్వాణముఁ బ్రవేశింపుము. నిర్వాణముఁ బ్రవేశింపుము." అనవుడు దుష్టాత్ముఁడైన మారునకు నేనిట్లంటిని "ఓరి దుష్టుఁడ నేను నిర్వాణముఁ బ్రవేశింపను. జ్ఞానులును బోద్ధలు నగుశ్రమణులను నేను శిష్యులుగఁ జేరువఱకు వారి ధర్మమును శ్రద్ధతో నాలకించి నాసిద్ధాంతముల పరిచయము గలిగి యనుభవశాలురై ధర్మమార్గమున నడచుచు సూత్రములయందు సంపూర్ణప్రజ్ఞ గలిగి నామతమును బోధించి వ్యాపింపఁ జేయువఱకు గురుముఖంబునఁ దాను విన్న దంతయు వెలిబుచ్చి లోకసంరక్షణార్థ మెల్లయెడల సంచరించి తమ జ్ఞానముచేత విరుద్ధవాదములను దుర్జనుల వలనఁ గలుగు నాటంకములను దొలఁగించు వఱకు నేను నిర్వాణమునఁ బ్రవేశింపను. ఓదుర్మార్గుఁడా! నేను చూపినపవిత్రజీవనము జయమంది జనసమ్మతి వడసి మానవజాతియంతటనువ్యాపించి సిద్ధాచారమై యెల్లరకుఁ దెలియువఱకు నేను నిర్వాణమునఁ బ్రవేశింపను."

మారునకునుబుద్ధునకునుజరిగినట్లువర్ణింపఁబడినయీసంభాషణముయొక్క భావ మేమైయుండు నని మనము ప్రశ్న జేసికొని విచారింపవలెను. శిష్యులకు భక్తిపారవశ్యము గలిగినప్పుడు గురువులయం

దు మహామహిమలు ప్రొడగట్టును. అనంతకోటిబ్రహ్మాండములు చరా చరములు మొదలైన వగుపడుటయెల్ల మహిమలలోని భాగమె. మారోత్పత్తిగూడ మనోవికారము కవిచాతుర్యము, నని యిదివఱకే వ్రాయఁబడినది. ఈమార్గదర్శమును గూడ నట్టిదే. మారుఁడుతన్ను నిర్వాణముఁ బ్రవేశింపుమని యనఁగా మరణము నొందుమని యుపదేశించినట్లును, దానికిఁదానియ్యకొనకపోయినట్లును బుద్ధుఁడుశిష్యులతోఁ జెప్పినాఁడు. దానిసార మిదియై యుండవచ్చును. చిరకాలము నుండి తానపేక్షించినబుద్ధత్వము తనకు సంప్రాప్తించియుండుటచేనభీష్టఫలసిద్ధి యైనది కదా యింక నీతుచ్ఛజీవితముతోఁ బ్రయోజనమేల? రోగభూయిష్ఠమైనయీశరీర మెందుకు? నిర్వాణ మేఁప్రవేశింపఁగూడదను నాలోచన మతనిమనంబునఁ దోఁచి యుండవచ్చును. జన్మపరంపరారహితమైనశాశ్వతపదవి కప్పుడే పోవఁదలఁచి ఘటమునాశముచేయఁ దలంచుకొని యుండవచ్చును. ఈచెడ్డతలంపే మారసాక్షాత్కారము. ఆతలంపును దనజ్ఞానఫలముచే నడంచుటే మారవిజయము. మహైశ్వర్యము. సంసారముఁ బరిత్యజించి ఆకులుఁ గాయలు దుంపలుఁ దిని పడరానిసిలుగులం బడి ప్రాణనాశమున కైననోర్చి సంపాదించినయాభవ్యజ్ఞానము పాపాంధకారమునం బడి మ్రగ్గుచున్న లోకమున కుపకరింపకుండఁ దనతో నంతమై పోవుట యనుచితమను మంచితలం పాసమయమున జనియించి యుండవచ్చును. ఆత్మహత్యఁ జేసికొన్నపక్షమునఁ దనవైరాగ్యముఁ దనతపము వెయ్యేల, తా నీలోకమున జన్మించుట, వ్యర్థము లని యతనికిఁదోఁచి యుండవచ్చును. ఇట్లు తోఁచినపిదప నతఁ డాత్మహత్యకు దిగక యుండె నని మన మూహింపవచ్చును.

అనంతరము గాఢసమాధినిష్ఠుఁడైనయాబుద్ధునిమనంబున మఱియొక యాలోచన ప్రభవించెను. అది యీక్రిందివిధముగ నుండె

ను. "తెలిసికొనుటకుఁ గనిపెట్టుటకు దుర్లభమైనగొప్పసత్యమును నే నీదినమునఁ గనిపెట్టితిని. ఇది శాంతిపరిమము, గంభీరము. బుద్ధీంద్రియములకతీతము. విద్వజ్జనగేయము. పరమార్థము. మానవుఁడు బాహిమిమీఁదనె చరియించుచున్నాఁడు. భూగోళమునందె వ్యాపారములు సేయుచున్నాఁడు. భూగోళమునందె సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు. అట్టివాఁడు భావాతీతములైన కారణసూత్రములను గార్యకారణధర్మములను గ్రహింపఁ జాలఁడు. అంతియెకాదు. అట్టివాడు జన్మపరంపరావినాశము ప్రాపంచిక వ్యవహారవిముఖత సర్వకామవినాశము నిరీహత్వము నిర్వాణప్రవేశము మొదలగు దురవగాహవిషయములను గ్రహించు టరిది. అట్టివారికి నే నీపరమధర్మము బోధించితినా మానవజాతి గ్రహింపకపోవుట తటస్థించును. అందువలన నేను పరిశ్రాంతుఁడ నగుదును. నాకనేకబాధలు కలుగును. నే ననేకబాధలుపడి సంపాదించిన యీపరమార్థము నేల ప్రపంచమునందు వెల్లడి చేయవలయును? కామక్రోధ పరవశుఁడైనవానికి సత్యము కనఁబడక దాగి యుండును. అసత్యము కలిసిన మనస్కున కెన్నఁడు వశముకాదు. అది గంభీరము. మహాద్భుతము. దుస్సాధ్యము. ప్రాపంచిక వ్యవహారముమీఁద మగ్నుఁడైనవాఁడు దానిని గ్రహింపఁ జాలఁడు."

ఆయాలోచనలు స్ఫురించినప్పుడు బుద్ధుఁడు తన సిద్ధాంతముల నెవరికి బోధింపక నిర్మలముగ నెచ్చటనో యొకచోట ధ్యానము జేసికొనుచుండవలయు నని సంకల్పించెను. ఆసంకల్పమం దతఁడు నెఱవేరెనా చిరపరిశ్రమముచేతఁ గనిపెట్టఁబడిన పరమార్థము ప్రపంచమున కప్రియమై గూఢమై సముద్రగర్భితమైన రత్నమువలె భూగర్భితమైనసువర్ణమువలె దుర్లభమై యుండునుగదా. అట్టియెడసురముఖ్యుఁడైనబ్రహ్మ బుద్ధునికడకువచ్చి యాసత్యము లోకమునకు బోధింపుమని యానతిచ్చెనఁట. బ్రహ్మ ముమ్మారు నొక్కి చెప్పినంగాని

బుద్ధుఁ డియ్యకొనఁడయ్యె. అత్తఱి బుద్ధుఁడు జ్ఞాననేత్రముతో విశ్వమంతయు నొక్కమాఱు పాఱఁజూచెను. అప్పు డతనిదృష్టికిఁ బరిశుద్ధాత్మలు మలినాత్మలు సాధుస్వభావులు దుష్టస్వభావులుగ గనఁబడిరి. అప్పుడు బుద్ధుఁడీక్రిందివిధమునఁ బలికెను "నా కేదో యాపద సంభవించు ననుకొని నేను కనిపెట్టినసత్య మింతవఱకు లోకమునకుఁ బ్రచురింపలేదు. ఈముక్తిమార్గద్వారము సమస్తజనులకుఁ బ్రవేశింపఁదగినదై తెలియఁబడియుండుఁగాక! వీనులున్నవారు వినఁదగిన యీపదార్థము విని విశ్వసించి తరింత్రుగాక!"

---

## దశమాధ్యాయము.

ఇత్తెఱంగున సిద్ధార్థుఁడు బుద్ధుఁడై బహుపరిశ్రమలబ్ధమైన పరమధర్మము లోకమునకు బోధింపవలయు నని సంకల్పించి మొట్టమొదట "నే నీధర్మ మెవరికి బోధింతును. ఎవ్వరు దీనిని సులభముగ గ్రహింపఁ గల" రని తనలో వితర్కించెను. అలరకాముఁడు మిక్కిలి తెలివి గలవాఁడు; విద్యావంతుఁడు. గావున నతఁడు తన సిద్ధాంతమును గ్రహింపఁ గలసమర్థుఁ డని భావించి యతఁ డాపరమార్థము వానికి బోధింపఁ దలఁచెను. అలరుఁ డనునతనికే యలరకాముఁ డను పేరు గలదు. సిద్ధార్థుఁడు సన్యాసము స్వీకరించినవెంటనే విద్యాభ్యాసముఁ జేయుట కలరు నాశ్రయించెను. అలరుఁ డెక్కడ నున్నాఁడని యతఁ డడుగ మృతినొందె నని చెప్పిరి. అనంతర మతనికి మహాపండితుఁడైనయుద్రిక రామపుత్రుని పేరు స్ఫురణకువచ్చెను. ఉద్రిక రామపుత్రుఁ డనఁగా నుద్రకుఁడే. అలరునియొద్ద విద్య చాలించినపిదప

సిద్ధార్థుఁడు జ్ఞానసంపాదననిమిత్త మితనియందుఁ జేరెను. ఈతఁడును దన సిద్ధాంతము నశ్రమంబునం గ్రహింపఁగలఁడని యతఁడు తలంచెను. కాని యుద్రకుఁడు గూడ కాలధర్మము నొందె నని తెలిసెను. అనంతరమతనికి మున్ను తాను కఠోర తపంబు సేయుచుండఁ దనకు విధేయులై శుశ్రూష జేసి తాను తపము చాలించిన పిదప దన్నువిడిచి పోయిన యైదుగురుశిష్యులు జ్ఞప్తికివచ్చిరి. వారత్తరి వారణాసీ నగరమునఁ దపంబు సేయుచుండిరని విని వారిం గలసికొనుటకు బుద్ధుఁ డక్కడకుఁ బయన మయ్యెను. ఉపకుం డనుదిగంబరయోగియొకఁడు వారణాశికిఁ బయన మయిపోవుచున్నసిద్ధార్థుని గనుంగొని యిట్లని యెను. "మిత్రుఁడా! నీశరీరచ్ఛాయ స్వచ్ఛమై మెఱయుచున్నది. నీముఖము జ్ఞానద్యోతకమై యున్నది. ఎవని సిద్ధాంతమును నమ్మి నీవీప్రపంచమును బరిత్యజించితివి? నీగురు వెవ్వరు? ఎవని ధర్మము నీవవలంబించితివి?" అనవుడు బుద్ధుఁ డిట్లుత్తరము చెప్పెను. "అయ్యా! నే నెల్లశత్రువుల జయించితిని. నేను బుద్ధుఁడను. నేను సర్వవిధముల నిష్కళంకుఁడను. నేను సర్వముఁ బరిత్యజించితిని. కోరికను నాశనము జేసి నేను ముక్తివడసితిని. స్వయముగానె జ్ఞానసంపాదనముఁ జేసికొన్న నేను నా కొకఁడు గురువు కలఁడని యెట్లు చెప్పఁగలను? నాకు గురువులేఁడు. నాకు సముఁడు లేఁడు. ఈమనుష్యప్రపంచము నందును దేవతాప్రపంచమునందును మత్తుల్యుఁడు లేఁడు. ఈప్రపంచమునందు నేనే పరిశుద్ధుఁడను. నేనే పరమగురువును. నేనే లోకాతీతుఁడైన సంబుద్ధుఁడను. నేను శాంతిని నిర్వాణమును బడసితిని. ధర్మరాజ్యసంస్థాపనముఁ జేయుటకుఁ బుణ్యనగరమైన వారణాశికిఁ బోవుచున్నాఁడను. మాయాంధకారబంధుర మయిన యీప్రపంచమున నమృతత్వ మనుమహాభేరిని నేను మ్రోయించెదను." అని బుద్ధుఁడు మహోత్కృష్టము లైన వాక్యములు పలుక "నట్లయిన నద్వితీయుఁడు

పరమపావనుఁడు నగుజినుఁడవా" యని యుపకుఁ డడిగెను అతనికి
మహాత్ముఁడైన బుద్ధుఁడిట్లు బదులుచెప్పెను. "కోరికల నడంచిన జను
లందఱు నావంటివారె. నేను సమస్తపాపముల జయించితిని. కాఁబట్టి
జినుఁడను నేనే" 'అట్లు కావచ్చు' నని పలికి యుపకుఁడు తలయూఁచి
మఱియొకమార్గమునఁ బోయెను. అనంతరము బుద్ధుఁడొకచోటనుండి
మఱియొక చోటికిఁ బ్రయాణములుచేసి తనకు గమ్యస్థానంబును వేద
శాస్త్రనిలయంబును సర్వజనసేవ్యంబును బరమపవిత్రంబును సిద్ధజన
నివాసంబును గంగాప్రవాహాభిశోభితంబును నగు గాశికానగరంబుఁ
బ్రవేశించెను. ప్రవేశించి మృగద్వనంబు సొచ్చి యచ్చోటఁ దపోని
రూఢులైన పూర్వశిష్యపంచకమును జూచెను. వా రతనిని ముందు
గా డాదవ్వులం గని తమలోఁ దా రిట్లనుకొనిరి. "అదిగో! గౌతమశ్ర
మణుఁడు వచ్చుచున్నాఁడు. ఈతఁడు తపంబుచాలించి హాయిగ సుఖ
ము ననుభవించుచున్నాఁడు. మన మాసనములనుండి లేవవద్దు. అత
నికి నమస్కరింపవద్దు. అతనిచేతనుండి శాటీకమండలము లందుకొని
గౌరవింపవద్దు. కాని మన మిక్కడ వానినిమిత్త మొకయాసనము
వైచి యుంచుదము. ఇష్టమయినయెడల నతఁడు దానిమీఁదఁ గూ
ర్చుండుఁగాక !" ఇట్లువారు కృతప్రతిజ్ఞులై బుద్ధునియెడ ననాదరణ
ముఁ జూపఁదలంచిరి. కాని, తమప్రతిజ్ఞా ప్రకారము జేయుట వారి
శక్య మయినది కాదు. బుద్ధుఁడు తమ్ము సమీపించిన తోడనే తదీ
య తేజఃప్రభావనిర్జితులై యయ్యైవురుఁ బ్రతినల నెఱవేర్చుకొనఁ
లేక యప్రయత్నముగ దిగ్గునలేచి యామహాత్మున కెదురుగాఁ
జని తోడ్కొనివచ్చిరి. అం దొకఁ డాయనచేతనుండి శాటీకమం
డలము నందుకొనియెను. ఒకఁ డాసనము వైచెను. ఒకఁడు పాద
పీఠ ముంచెను. ఒకఁడు పాదప్రక్షాళనమున కుదక మందిచ్చెను.
ఒకఁడు కాళ్ళు తుడుచుకొనుట కంగవస్త్రము సమర్పించెను. బుద్ధుఁ

డు కూర్చుండి పాదప్రక్షాళనము జేసినపిదప 'మిత్రమా! గౌతమా! నీ వెందుండి వచ్చుచున్నా' వని వారడిగిరి. అడుగుటయు బుద్ధుఁ డిట్లనియె. "ఓ యోగులార! తథాగతుని వెనుకటిపేరఁ బిలువఁ గూడదు. మితుఁడనఁ గూడదు. తథాగతుఁ డనఁగా నెవ్వఁ డనుకొన్నారు! పరమపావనుఁ డయినసంబుద్ధుఁడు. నేను చెప్పునది వినుండు. నే నమృతత్వముఁ బడసితిని. ఆసిద్ధాంతము నేను మీకుఁ గఱపెదను. నేను చూపెడుమార్గమున మీరు నడతురేని సత్యమును మీరే తెలిసికొని ముఖాముఖిఁ జూచి సిద్ధిఁబొందఁ గలరు.' అనవుడు నా యోగు లేవురు తథాగతుని వాక్యములందు నమ్మిక లేక యిట్లనిరి. 'మితుఁడా! గౌతముఁడా! నాఁడు నీవు తాల్చిన యామహానియమముల వలనను సలిపిన దుర్భర తపంబులవలనను నాచరించిన కఠోరవ్రతంబుల వలనను మనుష్యాతీతములయిన శక్తులను నీవు బడయఁ జాలవైతివి. సంపూర్ణజ్ఞానాంతర దృష్టులవలనఁ గలుగు నుత్కృష్ట దశను బ్రాపింపవైతివి. అట్టి తపోనియమములు సలిపిన నీకు సిద్ధి గలుగునపుడు నేఁడు తపంబు చాలించి భోగముల ననుభవించుచు హాయిగఁ దిరుగుచున్నపుడు మనుష్యాతీతశక్తులు నీ కెట్లు కలుగును. జ్ఞానలబ్ధ మగునుత్కృష్టదశ నీకెట్లు సంప్రాప్తించును?' ఆప్రశ్నమునకు బుద్ధుఁ డిట్లుత్తరము చెప్పెను. 'తథాగతుఁడు భోగముల ననుభవించుట లేదు. అతఁడు ధర్మసాధనముల విడిచిపెట్ట లేదు. అతఁడు ప్రుష్కల జీవనమువంక జన లేదు. ఓజోగులారా! నే నిదివఱ కెన్నఁడయిన మీతో నిట్లు మాటాడితినా.' 'లేదు. లేదు. నీ వెన్నఁ డిట్లు మాటాడలే' దని వారు బదులు చెప్పిరి. అనవుడు నతఁ డీ క్రిందివిధమున వారి కుపదేశము జేసెను. 'అట్లయిన నో యోగులారా నాచెప్పునది వినుండు. ప్రపంచముఁ బరిత్యజించిన మనుష్యుఁ డనుసరింపఁ దగని యుత్కృష్టపద్ధతులు రెం డున్నవి. ఇంద్రియముల నాకర్షించునట్టియు

ముఖ్యముగ భోగానుభవమునకు దారిచూపునట్టియుఁ గార్యముల నాచరించుట మొట్టమొదటిది. ఇది పరిహరిథమమునఁ బరిత్యజింపఁ దగినది. ఇట్టివానిచే మానవుండు సంతుష్టి గనుట మిగుల నింద్యము, ననర్హము; నిష్ప్రయోజనము. ప్రాపంచిక విషయములయందుఁ దగుల్కొన్నవానికి మాత్రమె యది తగును. తపోనిష్ఠ పేరుపెట్టియాత్మ బాధ గలిగించుకార్యముల నాచరించుట రెండవది. ఇదియు దూరముగఁ బరిత్యజింపఁ దగినదె. ఇయ్యదియు ననర్హమె నింద్యమె నిష్ప్రయోజనమె. ఈరెంటికి మధ్యమార్గము మఱియొకటి యున్నది. అది తథాగతుఁడ నయిననేను కనిపెట్టినాను. అది జ్ఞానప్రదమై కన్నులు తెఱపించును. మనస్సునకు శాంతి నొసంగును. అత్యున్నత జ్ఞానమునకు దారిచూపును. సంపూర్ణబుద్ధత్వమునకుఁ దోడుపడును. ఆమధ్యమార్గ మేది యని మీరడుగవచ్చును. ఆమార్గ మష్టవిధము. సదభిప్రాయము, సదాలోచనము, సత్సంభాషణము; సద్వర్తనము, సజ్జీవనము, సత్ప్రయత్నము, సన్మనస్కత, సన్మననము. జన్మము దుఃఖకరము. క్షీణత్వము దుఃఖకరము. రోగము దుఃఖకరము. మరణము దుఃఖకరము. అనిష్టపదార్థసంగమము దుఃఖకరము. ఇష్టపదార్థవియోగము దుఃఖకరము, రాగజనితములై నభావము లన్నియు దుఃఖకరములు. దుఃఖానుభవమును గూర్చి చెప్పఁదగినయథార్థ మిదె. దుఃఖసముత్పత్తిని గూర్చి చెప్పుచున్నాను వినుఁడు. కోరిక నశింపక స్థిరమై యుండుటయె దుఃఖమునకు ముఖ్యకారణము. ఆకోరిక పునర్జన్మహేతువు. అది భోగములపై నాస గొలుపును. ఒకనూ తాపని చేసి ఒకమాఱీసని జేసి యాకోరిక సంతుష్టిఁ గనుచుండును. ఒకమాఱు మఱియొకజన్మ మెత్తవలయు ననుతలంపు గలిగించుచుండును. ఒకానొకప్పు డీజన్మమునందె మెళ్లైన సిద్ధిబొంది మనోరథసిద్ధిఁ బడయ

వలయు ననుసంకల్పము గలిగించు చుండును. దుఃఖము నాశనము జేయుటను గూర్చి చెప్పఁదగిన పరమార్థ మిదిగో వినుండు. తృష్ణను ముందుగా నాశనము జేయవలయును. అనఁగా మనుష్యుఁడు ముందు కోరికను నాశనము జేయవలయును. అది నాశన మైనయెడల నింద్రియసుఖమే నశించును. ఈతృష్ణను దూరముగాఁ దోలవలయును. దానిని బరిత్యజింప వలయును. ఒక్క నిముసమైన దానిని మనస్సులో నిలువనియ్యఁ గూడదు. ఈదుఃఖనాశనమునకుఁ దగినసాధనములం గూర్చి చెప్పఁదగినపరమార్థ మే దన నెనిమిదివిధములైన సన్మార్గముల నడచుటయె. దుఃఖమును గూర్చియు దుఃఖకారణముం గూర్చియు దుఃఖకారణ నాశనముం గూర్చియు దుఃఖకారణనాశనసాధనములం గూర్చియు నెట్టిసిద్ధాంతములును మనకుఁ బ్రాచీనులిచ్చి యుండలేదు. కాని యట్టివానిని గనిపెట్టుటకు నాలో నంత ర్నేత్రము బయలు దేఱెసది. తదీయ స్వభావ జ్ఞానము పొడమినది. తత్కారణ పరిజ్ఞానము సముద్భవిల్లినది. ప్రశాంత మార్గమును గనిపెట్టుటకుఁ దగినయాత్మజ్ఞానము సముత్పన్నమైనది. అంధకారమును బటాపంచలు చేయఁగలజ్ఞానజ్యోతి వెలింగినది. ఆనాల్గువిషయములం గూర్చియు నాజ్ఞానము నాయంతర్దృష్టియు విశదములుగ నెంతకాలము లేవో యంతకాలమును నేను శ్రమణులకును బ్రాహ్మణులకును మనుష్యులకును దేవతలకును దురాప్యమైన యాజ్ఞాన మార్గమునఁ బ్రవేశించితినో లేదో నిశ్చయముగ నెఱుఁగఁ జాలనైతిని. ఆనాల్గువిషయములం గూర్చియు నాజ్ఞానము నాయంతర్దృష్టియు విశదము లెప్పుడైనవో యప్పుడే నేను శ్రమణులకు బ్రాహ్మణులకు మనుష్యులకు దేవతలకు దురాప్యమైన యాజ్ఞాన మార్గమునఁ బ్రవేసించితి నని నిశ్చయముగ నెఱిఁగితిని. ఇప్పుడీజ్ఞానము నీయంతర్దృష్టియు నాలోనుద్భవించినవి. నేనుబడసినముక్తి నిశ్చల

మైనది. ఇదియే నాకడపటి జన్మము. ఇఁకమీఁద నాకుఁ బునర్జన్మము లుండవు". ఈబోధ మాహైదుగురిమనస్సులమీఁద సమృతవర్షమువలెఁ బడెను. అదివఱకు వా రెన్నో పుణ్యనదులలో స్నానము జేసిరి. సాంగముగ వేదము నధిగమించిరి. కర్మానుష్ఠాన తత్పరులైరి. ఉగ్రతపములనాచరించిరి. శరీరము శుష్కింపఁ జేసిరి. ఎన్ని చేసినను నిష్కంటకమమయిన మార్గము వారికిఁ బొడ కట్టలేదు. కుంభవృష్టివంటి యీబోధామృతము కురిసినతోడనె చిర కాలమునుండి వారిమనస్సుల నంటియున్న మాలిన్యము కడిగివైవఁ బడెను. వారి మనోనేత్రములకుఁ జక్కనిదారి పొడగట్టెను. ఆయేవురి లో వయోవృద్ధుఁడైన కౌండిన్యుఁడు మొట్టమొదట నీనూతనధర్మ మున ననుసరించి బుద్ధునిశిష్యుఁ డయ్యెను. తక్కిననలువురుఁ గలిసియు వే రువేరుగను బిమ్మట నతనితోఁ గొన్నిసారులు వాదములు నెఱపి సంది యంబులఁ దొలంచుకొని శిష్యులైరి. అట్టిమహాపత్సమయమున నతనిం బరిత్యజించి ధర్మభ్రష్టుఁడని యతని నధిక్షేపించి యతనియెడ ననాదరణముఁ జూపవలెనని సంకల్పించినవారె యతని బోధామృ తాస్వాదనముఁ జేసి పూర్వ మనుసరించిన మూఢమార్గమువిడిచి మం చిదారిం బడి బుద్ధదేవుని ప్రథమశిష్యులైరి.

ఈయేవురితరువాత బుద్ధధర్మమును స్వీకరించినవాఁడు వారణా సీపురవాసియు మహాధనవంతుఁడు వడ్డివ్యాపారమువల్ల జీవించువాఁడు నగునొకవర్తకునికుమారుఁడు. అతనిపేరు యాసుఁడు. అతనికి మూఁడు మహాభవనములు కలవు. అందొకటి శీతకాలముకొఱకు. మఱొకటి వర్షకాలమునిమిత్తము. వేఱొకటి గ్రీష్మకాలముకొఱకు. ఏమందిర మేకాలమునిమిత్త ముద్దేశింపఁబడినదో యామందిరమున నాకాలమున నతఁడు వసియించు చుండును. ఆమందిరంబులయందు నిరుపమాన సౌందర్యము గల విలాసవతులు తమపాటలచేత నాటలచేత రూపముల

 

చేత నతనిని మెప్పించి సుఖింపఁ జేయు చుందురు. ఒకనాఁడు యాసుఁడా మందిరంబులలో నొకదానియందుఁ బవ్వళించి నిదురించెను. ఉవరాంగ్రగునతని ప్రియురాండ్రును మయి మఱచి నిదురవోయిరి. తొల్లి గౌతమబుద్ధునకుఁ దటస్థించినయవస్థయె నాఁటి రేయి సంపన్నుఁడైనయావణిక్కుమారునకు సంభవించెను. దైవవశమున యాసున కంగనలకంటెముందు మెలకువవచ్చెను. వచ్చుటయు వారివికృతాకారము లతని కంటఁ బడెను. ఒకతె వాయించుచున్న మద్దెల మెడక్రిందఁ బెట్టుకొని పండుకొనియెను. ఒకతె మ్రోయించుచున్న గానయంత్రము బాహుమూలమునఁ బడెను. ఒకతె కొప్పు విడిపోయెను. ఒకదానినోటినుండి లాలాజలము గారెను. వాండ్రింద తేమేమో నిద్రాపారవశ్యమున గొణుగుకొనసాగిరి. అత్తరి నాయవస్థఁ జూచినవారికిఁ బలుపీనుఁగులనడుమ నున్నట్లు తోఁచకపోదు. యాసుం డది చూచినతోడనె హేయమయిన యతనిజీవనము కన్నులఁ గట్టినట్లగపడెను. అగపడుటయు నతఁడు భయశోకాన్వితుఁడై "హా! యెంతదుఃఖ మెంత యపాయ" మని పలికెను. అట్లుపలికి యతఁడు తత్క్షణమె ప్రియాంగనలను మందిరంబులను విడిచి వైరాగ్య ప్రేరితుఁడై బుద్ధదేవ నిలయమయిన మృగదావకాననమున కరిగెను. మహానుభావుఁడైన శాక్యసింహుఁడు గౌతముఁడు నిర్వాణమార్గముం గనిపెట్టి పతితులను బావనులఁ జేయుచున్నాఁడని యంతకుమున్నె యతఁడు విని యుండుటం జేసి యచ్చోటికిఁ బోయెను. ప్రాపంచిక బాధలనుండి మానవుని రక్షింపఁ గలసమర్థుఁడతఁ డొక్కఁడే యని యతనికిఁ దోఁచెను. యాసుఁ డతఁ డున్న తావునకుఁ జని యతనిం గాంచి "హా! యెంతదుఃఖ మెంతయపాయ" మని మరల పలికెను. "ఇక్కడ దుఃఖము లేదు. ఇక్కడ నపాయము లేదు. మిత్రుఁడా! యిటు వచ్చి కూర్చుండుము. నేను నీకు సత్యధర్మ ముపదేశించెదను. రారా." యని బుద్ధుఁడు సాదరముగ నతనికిఁ బ్రత్యుత్తరమిచ్చెను.

అప్పలుకులు శ్రవణగోచరములగుటయు యాసుఁడు మేరమీఱినయా నందము నొంది యతనిసామీప్యమునకరిగి కడువినయంబున నమస్క రించి దాపునఁ గూర్చుండెను. అంతట బుద్ధుఁడతనికిఁ బరమార్థముప దేశించెను. బిచ్చము పెట్టుటవలనఁ గలుగుఫలమును ముందుగాఁ జెప్పి, పిమ్మట నతఁడు మానవధర్మములు, నీతి, స్వర్గము, దురాచారములు, గర్వము, పాపము, తృష్ణ మొదలగువానిని గూర్చి యుపన్యసించి యవ్వలఁ గోర్కెల జయించుటవలనఁ గలుగు లాభములనుగ్గడించెను. యాసునిమనస్సు ధర్మోపదేశమునకుఁ దగినస్థితిలో నున్న దని తెలి సికొన్నపిదప భగవానుఁడైనబుద్ధుఁడు తనసిద్ధాంతము నుపదేశిం చెను. అనగా దుఃఖము దుఃఖకారణము దుఃఖకారణనాశనము నిర్వా ణమార్గసాధనము మొదలగుమార్గముల నుపదేశించెను. ఉపదేశానం తరము నసిద్ధమనుస్కుఁడైనయాసుఁడు భిక్షు వయ్యెను. బుద్ధుఁడుబోధిం చిన నిర్వాణధర్మము సంపూర్ణముగ ననుసరించినవారు భిక్షువు ల నంబడుదురు. వారుప్రపంచసంబంధము విడిచిపెట్టవలెను. దారపుత్రు లను బంధువులను గృహమును బాసి పోవలెను. ఆయాశ్రమంబునకు సత్ప్రవర్తనము దారిద్ర్యానుభవము ననునవి ముఖ్యలక్షణములు. అ తఁడు బిచ్చమెత్తికొని జీవింపవలెను. ఊరు బైటనె గాని జనపదంబు ల నుండఁ గూడదు. ఇట్లు నడుచుకొన్న వాఁడు కాలక్రమంబున భి క్షువగును. యాసుఁడాశ్రమము స్వీకరించినయచిర కాలముననె యా తని తండ్రియుఁ దల్లియు భార్యయు బుద్ధధర్మము నంగీకరించి గృహ స్థశిష్యులైరి. యాసుని ముఖ్యమిత్రులలో నలుగురు విమలుఁడు సు బాహుఁడు పున్నజీయు గగుర్పతి ననువారు తమమిత్రునిమార్గమున ననుసరించి బుద్ధధర్మము స్వీకరించి భిక్షువులైరి. బుద్ధుఁడు ధర్మబోధ మారంభించిన మూఁడుమాసములలో నేఁబదిమంది శిరోముండనముఁ జేసికొని కాషాయవస్త్రముః ధరించి భిక్షువులైరి. మఱికొన్నినాళ్ళ లో నఱువదిమంది యర్హాతులైరి. భిక్షువులకె యర్హాతు లని పేరు.

## ఏకాదశాధ్యాయము.

అట్లుచేరినయఱువదిమందిభిక్షుకులతోడ ధన్యాత్ముఁడైనబుద్ధ డొక్కనాఁడిట్లనియె. "ఓభిక్షుకులారా! దైవికములు మానుషములు నగుసకలబంధములనుండియు నేను విముక్తుఁడ నైతిని. మీ రింక వెళ్ళుఁడు. దేవతలయొక్కయు మనుష్యులయొక్కయు మేలునకు లాభమునకు క్షేమమునకు దేశమంతయుఁ దిరుగుఁడు. ఒకఁడుపోయినదారి నొకఁడు పోవలదు. ఆదియందు మహితమై మధ్యమందు మహితమై యంత్యమందు మహితమై వెలయునట్టియాసిద్ధాంతమును బోధింపుఁడు. కొన్ని యెడల మూలములో నున్న దున్నట్లే తూచా తప్పకుండబోధింపుఁడు. కొన్ని యెడలసారముమాత్రమే బోధింపుఁడు. సంపూర్ణమైన పవిత్రజీవనమే ప్రధానమని సాటింపుఁడు" ఈవిధంబున నాజ్ఞప్తులై యామహాప్రభువు యొక్క శిష్యులు మతబోధకులై దేశదేశంబుల కరిగిరి. యాసుఁడు కాశీలోనేయుండెను. బుద్ధుఁడుమాత్రి ము ర్వేలవై పునకుం జనెను. శిష్యులు గురువునకు దూరముగా నుండుటచే నొకయిబ్బంది తటస్థించెను. ఈబోధకులు క్రొత్తగ మతములో నెవ్వరి నైనఁ గలిపినప్పుఁడు వానికి ధర్మోపదేశము జేసి యాశ్రమ మిచ్చునట్టి యధికారము వారికి లేదు. అట్టియధికారము బుద్ధునకుమాత్రిమే యుండెను. అందుచేత బోధకులు క్రొత్తగమతములోఁ గలిసినవానిని వెంటఁ బెట్టుకొని బుద్ధునివెదకికొనుచుఁ దిరుగవలసి వచ్చెను. ఈయిబ్బంది కనిపెట్టి బుద్ధుఁడుశిష్యులతో నిట్లనియె. "ఓభిక్షుకులారా! యీవిషయమై మీ కధికారమిచ్చుచున్నాను. నేఁడు మొదలుకొని మీరునానా దేశములలో మతస్వీకారము చేసి భిక్షుకులు కాఁదలఁచినవారికి మీరే "ఉపసంపద" నొసంగుఁడు. ఉపసంపద యనగ భిక్షుకులుగాఁ జేర్చుకొనుట. అదియీవిధముగా నొసంగుఁడు.

భిక్షుకుఁడుగాఁ దలఁచు కొన్నవాఁడు ముందుగా శిరోముండనము చేయించుకొనవలె నని చెప్పెఁడు. అనంతరము కాషాయవస్త్రములు ధరింపు మనుఁడు. పైయుత్తరీయ మొకభుజము కప్పునట్లు వైచికొమ్మ నుఁడు. తనయెదుట నున్నభిక్షుకులపాదములకుఁ దనతల సోఁకునట్లు సాష్టాంగనమస్కారముచేయు మనుఁడు. పిమ్మట మోఁకాళ్ళమీఁదఁ గూర్చుండు మనుఁడు.తరువాతహస్తములు మోడ్చి యిట్లుపలుకుమనుఁ డు."నాకు బుద్ధుఁడే శరణము. నాకుధర్మమేశరణము. నాకుసంఘమే శరణము." ఇది ముమ్మాఱుపలుకుమనుఁడు. ఈయుపదేశము విని బిక్షుకులు నానాభాగములకరిగిరి. బుద్ధుఁడు మగధదేశము వైపున కరిగి క్రమక్రమముగా నుర్వేలఁ జేరెను.

ఆ కాలమందు మగధదేశమున ముప్వురు మహాపురుషులుండిరి. అందుఁ బ్రథముఁడు కశ్యపుఁడు. ఉపాతికుఁడు ద్వితీయుఁడు. సరిపుత్రు ఁడు తృతీయుఁడు. ఈముప్వురుపురుషులు గొప్ప యోగులు, మహాపండి తులు, మహోపాధ్యాయులు. ఒక్కొక్కనికి వందలకొలఁది శిష్యులు కలరు. అందుఁ గశ్యపులు ముప్వురుసోదరులు. అందు జ్యేష్ఠుఁడు "ఉ రువేలజటిలకశ్యపుఁడు. రెండవయతఁడు నదీకశ్యపుఁడు. మూఁడవయ తఁడు గయాకశ్యపుఁడు" ఉర్వేలజటిలకశ్యపుఁడనఁగా నుర్వేల గ్రామమున వసించుచున్నవాఁడు. జడలు గలవాఁడని యర్థము. ఇతఁడుమహాయోగియై జటాధారియై తపముఁ జేసికొనుచుండును. నదీ కశ్యపుఁ డనఁగాఁ నదీతీరమందుండువాఁడని యర్థము. గయాకశ్యపుఁ డనఁగా గయలో నున్నవాఁడని యర్థము. బుద్ధుఁడు జటిలకశ్యపునిదగ్గ ఱకుఁబోయి శీతకాలమంతయు నతనితోఁగడిపి తననూతనసిద్ధాంతమత నికి బోధించెను. ఆసిద్ధాంతములు మనస్సునకు నచ్చుటచే జటిలకశ్య పుఁడు తనపూర్వధర్మము విడిచి బుద్ధధర్మస్వీకారము చేయఁదలఁచి భిక్షుకాశ్రమ మిప్పింపుమని బుద్ధుని వేఁడెను. అప్పుఁడు బుద్ధుఁడుతన

కిట్లనియె. "ఓకశ్యప! అయిదువందలజటిలులకు నీవు నాయకుఁడ వయి బోధకుఁడ వయిప రమగురువ్వైై యున్నావు. కావున ముందుగా నీవు నీశిష్యులకడకుఁబోయి నీవు చేయఁదలఁచినపని వారితోఁజెప్పి తమ యిష్టము వచ్చినట్లు చేయుమని వారితోఁ జెప్పుము" అనవుఁడు వల్లె యని జటిలకశ్యపుఁడు తనశిష్యులయొద్దకుఁబోయి "అయ్యలారా! నేను శ్రీమణగౌతమునియొద్ద శిష్యుఁడనై యతనిమతము స్వీకరింపఁదలఁచు కొన్నాను. మీరు మీయిష్టము వచ్చినటులు జేయవచ్చు." నని పలికెను. అనవుఁడు వారందరైకకంఠ్యముగ నిట్లనిరి. "మీరు గౌత మశ్రమణునియొద్ద శిష్యులై మతస్వీకారము జేయఁ దలఁచుకొన్న యెడల మేమును నాయనకు శిష్యులమై మతస్వీకారముఁ జేసెదము." అట్లు పలికి కశ్యపసమేతులై వారందఱు జడలు గడ్డములు మీసము లు గొరిగించికొని యగ్నిహోత్రములను దత్సంబంధము లగునుప కరణములను నీటిలోఁ బాఱవైచి ధన్యాత్ముఁడైనబుద్ధదేవునిసన్నిధి కరిగి యాతని సందర్శించి "స్వామీ! పరివ్రాజకోపసంపదలను నా శ్రమములను మాకుఁ బ్రసాదింపుఁ" డని వేఁడుకొనిరి. ఆవేడికోలువిని బుద్ధుఁడు "భిక్షులారా! రండు, రండు. పవిత్రజీవనము సేయుఁడు. అంతట మీకు బాధానాశన మగును." ఇత్తెఱంగునఁ బరమప్రాజ్ఞు లగు నామహాపురుషు లందఱు బుద్ధధర్మస్వీకారముఁ జేసిరి. అచిరకా లములోనే నదీకశ్యప గయాకశ్యపులును దమతమ శిష్యబృందము లతో నగ్రసోదరునిమార్గ మనుసరించిరి. ఈకశ్యపత్రయము తన్ననుస రించుటచే బుద్ధదేవుఁడు వేయిమందికంటె నధికులయినశిష్యులకు స్వ ల్పకాలములో నాయకుఁ డయ్యెను. ఈభిక్షుకమండలము దన్నుఁ బరి వేష్టించి వెంటరా బుద్ధదేవుఁడు మహావైభవముతో మగధరాజధాని యైన రాజగృహంబునకుం జనియెను. ఉపాతిశుఁడు, సరిపుత్త్రుఁడు ననుమహాపండితులు రాజగృహంబునందె వీరిద్దఱు నివసించుచుండిరి.

మతధర్మములందు నిధులు. అధిక మేధావంతులు. అసాధారణప్రజ్ఞా దక్షులు. నిరుపమానసామర్థ్యము గలిగియు వారు సంజయుండను మహావిద్వాంసునియొద్ద నప్పటికిని శిష్యులయి స్వతంత్రముగఁ బాఠశాలనుస్థాపించి పాఠములఁ జెప్పుట లేదు. అయినను సంజయునిశిష్యులకెల్ల వారే పాఠములు చెప్పుచువచ్చిరి. వీరుండుటచేతనే సంజయునియొద్ద ననేకశిష్యులున్నారని ప్రతీతి కలిగెను. వీరిశిష్యులే సంజయుని శిష్యులని లోకులు చెప్పుకొనఁజొచ్చిరి. సరిపుత్త్రుఁడొక్కనాఁడు బుద్ధశిష్యులలో నొకఁడగు భిక్షుకునింగలిసికొని యిట్లనియె. "అయ్యా! నీదేహచ్ఛాయ స్వచ్ఛమై మెఱయుచున్నది. మిత్రుఁడా! నీవెవ్వరిపేరఁ బ్రపంచమునకుఁ బరాఙ్ముఖుఁడ వైతివి? నీయుపదేష్ట యెవ్వఁడు? నీ వెవ్వరిధర్మ మనుసరించినాఁడవు?" అనవుడు నాభిక్షుకుఁ డిట్లనియె. "అయ్యా! శ్రమణగౌతముఁ డని యొకమహాత్ముఁడు కలఁడు. అతఁడు శాక్యముని. నేనతనిపేర నీప్రపంచమునకుఁ బరాఙ్ముఖుఁడ నైతిని. అతఁడే నాగురువు. ఆమహానుభావునిధర్మమే నే నవలంబించినాఁడను." అనవుడు సరిపుత్రుఁడు "మీగురువు కనిపెట్టి నీకుపదేశించిన యాసిద్ధాంతమేది" యని యడిగెను. అనవుడు నాభిక్షుకుఁ డిట్లనియె. "మిత్రుఁడా! ఆయనకు నేనొకచిన్నశిష్యుఁడను. ఈనడుమనే నే నాశ్రమస్వీకారముఁ జేసితిని. ఈసిద్ధాన్తమును శిక్షను నేను క్రొత్తగా నేర్చుకొనుచున్నాఁడను. కాఁబట్టి యామహా సిద్ధాంతము వివరముగాఁ జెప్పఁజాలను గాని సంగ్రహముగాఁ జెప్పెద వినుము" అనవుడు సరిపుత్రుఁడు "మిత్రుఁడా! నీవు సవిస్తరముగాఁ జెప్పినను సరె, సంగ్రహముగాఁ జెప్పినను సరె. ఆసిద్ధాంతసార మేదో చెప్పు" మని యడిగెను. అడుగుటయు నాశ్రమణకుఁ డిట్లనియెను. "కారణమునుండి బయలుదేరు సమస్త కార్యములకు మహాత్ముఁ డగునతథాగతుఁడు విమోచనముఁ గనిపెట్టెను. ఇదే పరమసిద్ధాంతము" అది విని

సరిపుత్రుఁడు తనమిత్రుఁడైన యుపాతిశునికడ కరిగి తాను గౌతమశ్రమణకులలో నొకనిం గలసికొనుటయుఁ దనకు నతనికి సంభాషణ జరుగుటయు నెరింగించెను. అనంతరము వారిరువురు గౌతమశ్రీమణకునియొద్దకరిగి యాతని సిద్ధాంతముల నేర్చికొనవలయు నని నిశ్చయించిరి. వారు కాషాయాంబరధారులై బుద్ధశిష్యులు కాఁగానే వారిగురువైన సంజయునియొక్క శిష్యగణమెల్ల వీరిననుసరించి బుద్ధుని శిష్యగణమయ్యెను. సంజయశిష్యులు చేరఁగానె బుద్ధుఁడు వేనవేలు శిష్యులకు గురువై జస్తివనమున నుండెను. వేనవేలు శిష్యులతో నుపాతిశసరిపుత్రులు బుద్ధధర్మము స్వీకరించి రనువార్త వెల్లడియైనతోడనే మగధరాజ్యమునందు, ముఖ్యముగా రాజగృహమునందు గొప్పసంక్షోభముపుట్టెను. సన్యాసులు యోగులు విద్వాంసులైనబ్రాహ్మణులు గృహస్థులు ధనవంతులు దరిద్రులు పెద్దలు పిన్నలు జస్తివనమందున్న బుద్ధుని దర్శనము చేయ నభిలషించిరి.

బుద్ధుని పేరు మగధదేశమం దంతటను మ్రోఁగఁజొచ్చెను. మగధదేశాధీశుఁడైన బింబిసారుఁడే స్వయముగా వచ్చి యాతనిదర్శనముఁ జేసెను. మగధేశ్వరుఁడు వేనవేలు బ్రాహ్మణులతోఁ గలిసి సిద్ధార్థునిదర్శనమున కరిగెనఁట. అట్లరిగి వినయపూర్వకముగా నమస్కరించి భక్తితత్పరుఁడై యాతనిపరిక్కను గూర్చుండెను. ఉరువేలకశ్యపుఁడును బుద్ధుఁడును నొక్కనెలవుననే కూర్చుండుటంజేసి బింబిసారునివెంట నరిగినబ్రాహ్మణులు, జటిలకశ్యపుఁడు గౌతమశ్రీమణుని శిష్యుఁడయ్యెనా, గౌతమశ్రీమణుఁడే జటిలకశ్యపునిశిష్యుఁడయ్యెనా యని సంశయాకులాత్ములయిరి. ఆవిప్రులమనంబులో నట్టిసందియంబు వొడమె నని బుద్ధుఁడు తనమనంబున నెఱింగి జటిలకశ్యపునుద్దేశించి "మహాతపంబులకుఁ బ్రసిద్ధికెక్కిన నీవు నీతపంబుల నగ్నిహోత్రంబుల విసర్జించుటకు నేమికారణ మనియడిగెను. అనవు

డు జటిలకశ్యపుఁ డిట్లు బదులు చెప్పెను. "తపంబులవలన యాగంబుల వలన దృశ్యమాన పదార్థంబును మధురశబ్దంబులు రుచులు మహానందములు యువతీజనంబులు మున్నగునవి మాత్రమే లభించును. కనఁబడుచున్నదంతయు నసత్య మనియు మాలిన్యమనియుఁ దెలిసికొని యాగాదికర్మములు నేను మానితిని." వెండియు బుద్ధుఁడు కశ్యపు నిట్లడిగెను. "దృశ్యమాన పదార్థములయందును, మధురశబ్దములందును నీమనస్సున కానందము గలుగనిపక్షమున, నీమానవప్రపంచమున నీమనస్సున కిప్పుడేది యానందకరముగానున్నది?" అనవుడు నురువేలకశ్యపుఁ డిట్లుత్తరము చెప్పెను. "ఎద్దానివలన ననంతజన్మోపాధులును సంపూర్ణత్వవిఘ్నకారణములును నశించునో యాపరిశాంతమయిన నిర్వాణమార్గము నేను జూచితిని" అని పలికి యంతనిలువక జటిలకశ్యపుఁడు తనయాసనంబుననుండి దిగ్గునలేచి యుత్తరీయ మొకభుజమును కప్పున ట్లమర్చుకొని బుద్ధదేవునిపాదములు తనతల సోకునట్లు సాష్టాంగనమస్కార మొనర్చి "నాగురువు నాస్వామియు మహాత్ముఁడైనతథాగతుఁడే" యని పలికెను. అనంతరము బుద్ధుఁడు ధర్మోపన్యాసము చేసెను. అటమీఁద మగధరాజు శిష్యగణసమేతముగ బుద్ధునిఁ దననగరున కాహ్వానముచేసి వారిని సగౌరవముగఁ దోడ్కొనిపోయి బుద్ధునకును భిక్షుకులకును స్వహస్తములతో మృష్టాన్నంబిడెను. బుద్ధుఁడు భోజనముచేసి తనహస్తంబులను భిక్షాపాత్రంబును గడిగికొని శుద్ధుఁడైనపిదప బింబిసారుఁ డతనిపరిక్రంగూర్చుండి "స్వామీ! బుద్ధులును శిష్యులును నివసించుటకై నా వేలువనోద్యానము సమర్పించుచున్నాఁడ" నని మనవి యొనర్చెను. బుద్ధుఁ డాదానము గ్రహించెను. ఇది జరిగినతరువాత క్రమక్రమముగా జనుల యుత్సాహ మడఁగెను. ఉపాతిశసరిపుత్రులు శిష్యసమేతులై యాశ్రిఘుస్వీకారము జేసినతరువాత మఱియెవ్వ రీనూతనధర్మ మనుసరింప

 

లేదు. మహాత్ముఁడైన యొకానొక మతబోధకుఁడు పొడసూపినతో డనే జనులమనంబులలో మహాతరంగమువలె నింతంత యనరాని యుత్సాహము పొడమును. ఆబోధకుని మతంబు స్వీకరించుటచేతఁ గొండఱకును వానిని సంకర్షించుటచేత మఱికొందఱకును వానితో సంభాషణ చేయుటచేత నింకకొందఱకును గలిందుకొన్న యుత్సాహముఁ జిందుపడును. బుద్ధదేవునివిషయమునఁగూడ మొట్టమొదట నట్లె యయ్యెను. ఆయుత్సాహము మందగించినకొలఁది బౌద్ధశ్రమణులయెడఁ దొల్లింటిగౌరవము క్రమక్రమముగ నశించి దానిస్థానమున ననిష్టమునెలకొనెను. ఈనూతనధర్మము గృహస్థులకున్న యాధారముల నశింపఁ జేసి దేశము జనశూన్యముగఁ జేయునని మగధదేశస్థులగు నాగరజానపదులు శ్రమణులను జూచినచోటనెల్ల నపహసించుచు నిందించుచు నగౌరవింపఁ జొచ్చిరి. తమయవస్థ యీవిధంబున నున్నదని శ్రమణులు బుద్ధునితో నప్పుడప్పుడు మొఱలుపెట్టుకొనఁజొచ్చిరి. మాగధుల కింత కోపము వచ్చుటకు ముఖ్యకారణ మొకటి కలదు. గొప్పకుటుంబములయందు జనించి యెంతో యక్కఱకు రావలసినపడుచువాండ్రనేకులు బుద్ధధర్మ మవలంబించి భిక్షువు లయిరి. అదివినినతోడనే జనులు సణుగుకొని గొణుగుకొని యేవపడి కోపించి ద్వేషభావమూని యిట్లనఁ జొచ్చిరి. శ్రమణగౌతముఁడు తండ్రుల బిడ్డలఁ గనకుండఁ జేయుచున్నాఁడు. పుణ్యస్త్రీలందఱు వితంతువు లగునట్లు వంశములు నాశనము లగునట్లుగూడ సలుపుచున్నాఁడు. ఇదివఱకే యనేకులను సన్యాసులను జేసి తనశిష్యులుగఁ జేసికొన్నాఁడు. సంజయుని శిష్యులలో రెండువందలయేఁబదిమంది యతనిశిష్యులయినారు. మగధదేశమందలి సుప్రసిద్ధవంశస్థులగుపడుచువాండ్రతనికడ మతధర్మములనేర్చుకొనుటకై సంసారములు విడిచి పోయిరి."

ఈభిక్షుకులు తమ యిండ్లపరిక్క నడచునప్పుడు పౌరు లీక్షిం

దివిధముస వానిని బరిహసింపఁ జొచ్చిరి. "ఊరూరు పయనము చేసి యీమహాభిక్షువు చిట్టచివరకు మామగధ రాజధాని చేరినాఁడు. కొండమీఁదఁ గూర్చుండినట్టె గూర్చుండి సంజయుని శిష్యుల నందఱను బరిగ్రహించినాఁడు. ఇంక నెవ్వని గాలుపఁ దలఁచుకొన్నాఁడో చూతము." జనాభిప్రాయము తమకు విరుద్ధముగ నున్నదని శిష్యులవలన విని బుద్ధుఁడు శిష్యుల కిట్లానతిచ్చెను. "శిష్యులారా! ఈయు ద్రేకము చిరకాల ముండదు. కాని, వారు మిమ్ముఁ బరిహసించినప్పుడు మీరిట్లుత్తరము చెప్పుఁడు. సర్వజ్ఞులయి మహాధీరులు సత్యముప దేశించి మనుష్యులను నూతనమతములలోఁ గలుపుదురు. సత్యబలము చేతనే జనులను దనమతమునఁగలుపుచున్న బుద్ధునియందుదోష మున్నదని యెవరనఁగలరు? ధర్మకార్య ప్రారంభమున మహానుభావుఁడైన బుద్ధునకుఁ గలిగిన యిబ్బంది యిది యొక్కటేకాదు. సంజయునకు సుప్రాతిశునకు బుద్ధుఁడు శిష్యకోటిలో నున్నతస్థానమిచ్చెను. అట్లు చేయుట ప్రాఁతశిష్యులకుఁ గొందఱ కసూయ గలిగించెను. అదియెఱిఁగి బుద్ధుఁడు శిష్యులనందఱ నొక్కచోటఁ జేర్చి బౌద్ధులమోక్షసాధనముం గూర్చి కొంతవఱ కుపన్యసించి తుద క్రిందిపద్యములోని యర్థమువచ్చు శ్లోకముతోఁ దన యుపన్యాసము ముగించెను.

ఆ- వె. దురితకర్మములకు దూరంబు తొలఁగుట
హృదయశుద్ధి గలిగి యెసఁగుచుంట
సాధుకర్మములను శ్రద్ధతో సలుపుట
బుద్ధమతము సుండి పూజ్యులారా!

ఆకాలమునందే బౌద్ధసంఘములు నిమిత్తము ప్రథమధర్మములు నేర్పఱిచిరి. మిక్కిలి సూక్ష్మమయిన యాధర్మసూత్రమునకు ప్రతిమోక్షము అని పేరుపెట్టిరి. అటులు కూడిన యాసభకు "సేవకసమిపాత" మని పేరువచ్చెను.

# ద్వాదశాధ్యాయము.

—०‡०—

సిద్ధార్థుఁడు రాజగృహసమీపమున వేలువనమునందు భిక్షుకవారితముతో నసియించుచున్న కాలమున జనకుఁడగు శుద్ధోదనుఁడు కపిలవస్తుపురమున కాయనను రమ్మని వర్తమాన మంపెను. ఆ సందేశముఁ దెచ్చినదూత శుద్ధోదనునిమాటల నీ విధముగా బుద్ధునితోఁజెప్పెను. "నేను నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడను. కాఁబట్టి వచ్చి నన్ను జూచిపొమ్ము. నీవు కనిపెట్టినధర్మముయొక్క లాభము పరులకే గాని నీతండ్రికి నీప్రియబంధువులకుఁ గలుగఁగూడదా? మేము నిన్ను జూచి యేడుసంవత్సరము లైనవి."

వృద్ధుఁడగు జనకునిసందేశము కపిలవస్తుపురమునకుఁ బోవ బుద్ధుని బురికొల్పెను. అతఁడు బయలుదేరునప్పటికి నతనివెంట నంగమగధదేశస్థులగు భిక్షుకులు పదివేలమందియు గపిలవస్తుపురమునుండి వచ్చిన సన్యాసులు పదివేలమందియు నుండిరి. ఈమహాభిక్షుకసైన్యముతో నతఁడు దినమున కెనిమిదిక్రోసులు ప్రయాణము చేసెను. కపిలవస్తుపురంబునకును రాజగృహనగరంబునకును నరువది యామడల దూరము గలదు. ఆదూరమంతయు బుద్ధుఁడు రెండుమాసములలోఁ బయనముఁ జేసెను. బుద్ధునిబసనిమిత్తము శుద్ధోదనుఁడు కపిలవస్తుపురమునకు సమీపమున నున్న నిగ్రోధవనమును బాగుచేయించి శుద్ధపఱిచెను. బుద్ధుఁడు పురసమీపమునకు రాఁగానే నతని నెదుర్కొని సన్మానముచేయుటకు శుద్ధోదనుఁడు పండ్రెండుసంవత్సరములు వయస్సుగల యైదువందలమంది రాజకుమారులను, రాజపుత్రికలను నలంకరించి బారులుగా నిలువంబెట్టెను. ఆబాలురవెనుక హస్తములయందుఁ బుష్పములును సుగంధద్రవ్యములును ధరించిన

పదియాఱువేలమంది పరిజనులతోడను బంధుజనులతోడను శుద్ధోద నుఁడు నిలిచెను. బుద్ధుఁడు నిగ్రోధవనమును జేరి యిరువదివేలమంది భిక్షుకులు పరివేష్టింప నొకగద్దియపయిఁ గూర్చుండి నిండోలగంబుం డెను. మఱునాఁడు రాజబంధువులు పరిజనంబును సిద్ధార్థుని రాక కయి పరమానందభరితులయియుండి యతనికన్నము పంపవలెనన్న మాట మరిచిపోయిరి. బుద్ధుఁ డుదయముననె లేచి కాల్యకృత్యముల నిర్వర్తించుకొని స్నానముచేసి కొంతసేపు ధ్యానసమాధినిష్ఠుఁడయ్యె ను. అది ముగిసినవెనుక భోజనకాలము సమీపించినందున బుద్ధుఁడు భిక్షాపాత్రిము చేతఁబూని యిరువదివేలమంది భిక్షుకులు వెంటరాఁ బట్టణముఁ బ్రవేశించి యింటింటికరిగి భిక్ష మడిగెను. జనకుఁడును రా జును నగు శుద్ధోదనుఁ డావార్త విని యతిత్వరితంబునఁ గుమారుఁ డున్నతావున కరిగి యిట్లనియెను.

"కుమారా! ఏల నీవు నన్నిట్లవమానించెదవు. నీవు జంబూ ద్వీపమునందుఁగల సకలరాజులతోఁ గూడి వచ్చినను సపరివారముగ వారికందఱకు నేను షడ్రసోపేతమగు మృష్టాన్నముఁ బెట్టఁజాలు దునుగదా. అట్టియెడ నీకును నీయిరువదివేలమంది బిక్షుకులకును గా వలసినయన్నము నేను పెట్టలేకపోతినా? ఏల నాకనులముందరనే భిక్షమెత్తెదవు?" అనవుడు "ఇది నావంశాచారము. తప్పు లే" దని బుద్ధుఁ డుత్తరము చెప్పెను. "ఎట్టెట్టు! ఇది నీవంశాచారమా? నీవు మహాశమంతుని వంశమున జనించితివి. నీవంశస్థు లెవ్వరు మున్నిట్లు చేసి, యెఱుఁగరు. నీపూర్వులలోఁ గొందఱు తమకు భోజనపదా ర్థములు కావలసివచ్చినప్పుడు తమకాలితో నేల దన్నుచు వచ్చిరి. అప్పుడు వారికిఁ గావలసినసమస్త పదార్థములు వచ్చిపడుచుండెడి" వని శుద్ధోధనుఁడు బుద్ధునితో ననెను. అప్పలుకులు విని బుద్ధుఁ డిట్ల నియె. "అయ్యా! నేను మహాశమంతునివంశముమాట చెప్పుటలేదు.

నావంశాచారమనఁగా బుద్ధులవంశాచారము. బుద్ధులందఱు నావిధముగానే బిచ్చమెత్తి జీవించిరి. భూమియందు దాఁగియుండిన నిక్షేపము తనయునకు లభించినప్పు డా యమూల్యాభరణాదులు లభించిన వార్త తండ్రి కెఱింగించి యవి వానికిఁ జూపుట తనయునకు విధి. కాఁబట్టి నేను కనిపెట్టిన ధర్మఖనిఁ దెలిచి మీకుఁ జూపుచున్నాఁడను. నాధర్మము విన్నవాని కభ్యుదయపరంపరలు గలుగు" నని చెప్పి యతఁడు తనధర్మము తండ్రి కుపదేశించెను. ఆబోధామృతాస్వాదనము జేసి శుద్ధోధనుఁడు శుద్ధాంతఃకరణముతో నూతనధర్మము స్వీకరించెను.

అనంతరము శుద్ధోదనుఁడు బుద్ధుని సందర్శింపఁ దలఁచుకొన్న పక్షమునఁ బోయి చూడవచ్చునని కోడలగు యశోధరకు వర్తమానమంపెను. "నే నించు కేనియు గౌరవంబునకు భాజనంబనైతి నేని యామహాత్ముఁడే ముందుగ నిందు దయచేసి నన్నుఁజూచి సమాశ్వాసించుఁగాక! అప్పుడె నేనాయనపాదముల నర్చింపఁగల"నని యశోధర ప్రతివర్తమాన మంపెను. శుద్ధోధనుఁ డాసందేశ మెఱిఁగింప బుద్ధుఁడు యశోధరను జూడ నామెయంతిపురమునకుఁ బయనమైపోవుచు దారిలో మగ్గలానుఁడు మొదలగు భిక్షుకులతో నిట్లనియె.

"ఆరాజపుత్రిక కోరికల జయింపలేదు గాని నే నెల్లదుష్కామంబుల జయించితిని. చిరకాలమునుండి నన్నామె జూచి యెఱుఁగదు గావున మిక్కిలి శోకించుచుండును. ఆదుఃఖజలము ప్రవహించుట కెడ మిచ్చినంగాని యామెగుండె పగిలిపోవును. ఆమె నాయడుగులం బట్టుకొని వదలదు. మొత్తముమీఁద నీసమావేశముయొక్క ఫలితమిది. ఈమె తక్కిన రాజపుత్రికలతోఁ గూడ నాధర్మ మవలంబించి సన్యాసిని యగును." బుద్ధుఁడు నిన్నుఁజూడవచ్చుచున్నాఁడని విన్నప్పుడు యశోధర జలపూర్ణమగు భాండమువలె నత్యంతప్రేమ

భరిత యయ్యెను. బుద్ధుని సందర్శింపఁగానె తానొక సామాన్యస్త్రీ యెగాని యామహాత్మునకు భార్య కాదన్నమాటయు, బుద్ధుఁడు తొల్లివలెఁ దనప్రాణనాథుఁడు గాక జగన్నాథుఁ డయ్యెననుమాటయు మఱచి స్త్రీస్వభావసులభమైన దుఃఖమునకుఁ దావలంబయి యాతని యడుగులం బడి తద్దయు శోకించెను. అట్లు కొంతసేపు వగచునప్పటికి మామగారైన శుద్ధోధనుఁ డచ్చటనున్నవాఁ డన్నమాట జ్ఞప్తికి రాఁగా నామె సిగ్గుపడి యాతనిపాదములు విడిచి లేచి యొకప్రక్క కొదిగి నిలువఁబడెను. మహాబ్రహ్మకైన నంటరాని యాతని పవిత్రపాదములను యశోధర యంటినందుకు శుద్ధోదనుఁడు వగచి క్షమింపు మని బుద్ధుని వేఁడుకొని యిట్లనియె. "పాప మీదుఃఖ మామె ప్రేమాతిశయమువలనఁ బొడముచున్నది. ఇది తాత్కాలికమైనది కాదు. నీ వామెను విడిచిపోయిన యేడుసంవత్సరములనుండియు నామె నీనిమిత్త మిట్లే శోకించుచున్నది. నీవు శిరోముండనముఁ జేయించుకొంటి వని వినినయాక్షణమె యామెయు శిరోముండనము చేసికొనెను. నీవు ప్రాఁతగుడ్డలు గట్టితి వని వినినప్పుడు తానును ప్రాఁతగుడ్డలు కట్టెను. నగలను నాణెములను సుగంధద్రవ్యములను బరిత్యజించితి వని విన్నప్పు డామెయు వానిని బరిత్యజించెను. నీవలెనె యామెయు మితాహారిణి యయ్యె. నీవలెనె మట్టిమూఁకుడులో నన్నము దినుచున్నది. నీవలెనే గద్దియలపైఁ గూర్చుండుట మానుకొనినది. కావున నామెను క్షమింపుము" బుద్ధుఁడు తండ్రిపలుకుల కలరి యశోధర నాశీర్వదించి భిక్షుకబృందము విడిచియున్నతావున కరిగెను.

శుద్ధోధనునికి ద్వితీయభార్య మాఁగుమహాప్రజావతి దేవివలన నొకకుమారుఁడు గలఁడు. ఆతని పేరు నందుఁడు. మహాప్రజాపతి దేవి మాయాదేవికి సోదరి యగుటచే బుద్ధునకు సవతితల్లి మాత్ర

మేగాక పినతల్లిగూడ నయ్యెను. అందుచే నందుఁడు బుద్ధునకు సవతి తమ్ముఁడే గాక పినతల్లికొడుకుగూడను. శుద్ధోధనుఁడు నందుని యువ రాజుంజేయ వలయు ననియు నతనికి వివాహము జేయవలయుననియు నతనిని బ్రత్యేకముగా నొకమేడలోఁ బ్రవేశపెట్టవలయు ననియు సంకల్పించి యామూఁడుకార్యముల నొక్కనాఁడె ముహూర్త మేర్ప అచెను. బుద్ధుఁడు యశోధరతో మాటలాడి వెళ్ళినదినమే యాసుము హూర్తదినము. ఆసుముహూర్తమునకు శుద్ధోదనుఁడు బుద్ధునిఁగూడ నాహ్వానము చేసినందున కతఁడు తనభిక్షుకసమాజముం గలసి యామహోత్సవమున కరిగెను. అరుగుటలో నమ్మహోత్సవ మునగనుల పండువుగాఁ జూచుటే తన తలంపు గాదు. తన త మ్ముఁడైన నందునిజన్మసంబంధమైన దుఃఖము నుండి విముక్తుని జేయుటయే యాతని ముఖ్యోద్దేశము. బుద్ధుఁడు తన నిమి త్తము సిద్ధము చేయఁబడిన మహాసనముమీఁదఁ గూర్చుండి యీ క్రింది పద్యములోనియర్థము వచ్చు నొకశ్లోకముం జదివెను.

తే. గీ. చెడ్డతలఁపులు నశియింపఁజేయు చుంట
బ్రహ్మచర్యంబు గొనుట ధర్మములు నాల్గు
నెఱిఁగి నిర్వాణపథమందు దృష్టి నిలిపి
యుంట, యనునివి నరునకు నుత్సవములు.

ఆ శ్లోకము జదువఁగానె నందుఁడు బుద్ధుఁడు చేయునట్టి యుప దేశమునం దాసక్తి గలవాఁడై యాతని సమీపమునకు వచ్చెను. ఆ సమయమున నందుఁడమూల్యములైన వస్త్రాలంకారములు ధరించి యుండినను, నవవధూసమాగమమున కెదురు చూచుచుండినను బుద్ధుఁడు మనంబున నించుకేనియు సంశయింపక తన భిక్షాపాత్రి మాతని చేతిలోఁ బెట్టెను. నందుఁ డాపాత్రిమును గ్రహించెను. అనంతరము బుద్ధుఁడు తన పీఠమునుండి లేచి తనబస కరిగెను. సకల

బాంధవగణము న్విడిచ్చి నందుఁ డాతనివెంటఁబడెను. ఆతఁడు వివాహ మాడఁ దలఁచిన కన్యయగు జనపదకల్యాణి బుద్ధుని వెంటఁ బోవుచున్న యా రాజకుమారుని గవాక్షమునుండి చూచి మీరెందుఁ బోవు చున్నారని యడిగెను. అడిగెను గాని నందుఁ డామెకుఁ బ్రత్యుత్తర మీయకయే తల వంచుకొని పోయెను. గమ్యస్థానముఁ జేరినతరు వాత బుద్ధుఁడు నందు నుద్దేశించి "వత్సా! చక్రవర్తి పదవివలనఁ గలుగు గౌరవంబును నీవు సరకు చేయకుము. నావలె సన్న్యాసినివి గమ్మని యుపదేశించెను. నిగ్రోధవనమున కరిగిన కొంత సేపటి వఱకు నందుని యాలోచనలు కేవలవైరాగ్యముమీఁదనే నిలువక తాను పాణిగ్రహణముసేయఁదలఁచిన ప్రియురాలి మీఁదను రాజ్య వైభవముమీఁదను సంచరింపఁ దొడఁగెను. బుద్ధుఁ డితని మనో వైకల్యములం దెలిసికొని తనబోధామృత ధారలచేత నాతనిమనంబు నావరించిన చెడ్డతలంపుల నెల్ల దూరముగాఁ దోలెను. అంతట నందుఁడు మంచితలంపులు గలిగి పరిశుద్ధుఁడై యుండ మెగ్గలానుఁ డతనిని భిక్షుకునిఁ జేసెను.

కపిలవస్తు పురమునకు బుద్ధుఁడు వచ్చిన యేడవనాఁడు యశో ధరకుమారుఁడైన రాహులుని వెల లేనివస్త్రములతోడను మహా భరణములతోడను రాజకుమారుని కేవికిందగినట్లలంకరించి మేడపైఁ గూర్చుండఁ బెట్టుకొని బిచ్చము నిమిత్త మాదారినిఁ బోవుచున్న బుద్ధునింజూపి యిట్లనియె. "మహాబ్రహ్మవలెఁ గనఁబడుచున్న యీ భిక్షుకుఁడు నీతండ్రి. ఈయనయొద్ద నాలుగుధననిక్షేపము లున్నవి. ఈయన వెడలి పోయిన నాఁటనుండియు నాకవికనఁబడ లేదు. తండ్రి యార్జించిన విత్తము ననుభవింపఁ గుమారుఁ డర్హుఁడు గావున నీవా మహానుభావునికడ కరిగి యా నాలుగుధననిక్షేపములను జక్రవర్తుల కుండవలసినతక్కిన ధననిక్షేపములను నీకిమ్మని కోరుము." అనవుడు

రాహులుఁ డిట్లనియె. "అమ్మా! శుద్ధోదన మహారాజు తప్ప మఱియెవ్వరిని నేనెఱుఁగను. ఆయనయే తండ్రియని యనుకొనుచున్నాను. నా తండ్రి వేఱొకఁ డున్నాఁడా?" అనుటయు యశోధర కుమారుని గవాక్షముకడకుఁ దీసికొని పోయి "నాయనా! యాభిక్షుకుఁడె నీ తండ్రి" యని వ్రేలితోఁ జూపెను. వెంటనె రాహులుఁడు బుద్ధుఁ డున్న చోటికిఁబోయి యాతని మొగమువంక తేరిపాఱఁజూచి శంకలేక ప్రేమాస్పదముగా "నాయనా నాయనా" యని పిలిచెను. అత్తరి బుద్ధుఁడు భోజనము చేయుచుండెను. భోజనముచేసి బుద్ధుఁడు తన కన్నము పెట్టినవారిని దీవించి రాహులుని వంక జూడకయె న్యగ్రోధవనమున కరుగఁజొచ్చెను. అతఁడు తనవంక జూడక పోయినను దన్నుఁ బలుకరింపకపోయినను రాహులుఁడు నాయనా నాయనా నాకు నిక్షేపము లిమ్మని యాతని వెనువెంటఁ బడెను. తనవెంట రావద్దని బుద్ధుఁ డాతని నివారింపలేదు. పౌరులు గాని భిక్షుకులు గాని యంతకంటె నివారింప లేదు. ఎట్టకేలకు బుద్ధుఁడు తన బస కరిగి సుజాతునిం జూచి యిట్లనియె. "నా కుమారుఁడు తనకు రావలసిన దాయభాగ మిమ్మని యడుగుచున్నాఁడు. జన్మపరంపరాదుఃఖములు గల దాయమాతనికి నే నియ్యఁదలఁచుకొనలేదు. బుద్ధత్వసంబంధమైన దాయమిచ్చెదను. అది నాశనము లేనిదికదా. సుజాత! ఈబాలకుని శిరస్సు ముండనముచేసి భిక్షుకునిఁ జేయుము" రాహులుఁ డేడుసంవత్సరముల ప్రాయము గలతల్లిచాటు బిడ్డఁడనియైన శంకింపక మేన నున్న యమూల్యవస్త్రాలంకారములం దీసి పాఱవైచి శిరోముండనమును జేయించి కాషాయవస్త్రములు మీఁదఁ గప్పి దీవించి సన్న్యాస మిప్పించెను. రాహులుఁడు బాలుఁడగుటచే నతనిని మొట్టమొదట బుద్ధుఁడు శిష్యుఁడుగా గ్రహించెను. యుక్తవయస్కుఁడైన తరువాత రాహులుఁడు సంపూర్ణభిక్షుకుఁ

డమ్యెను. ఆవార్త విని శుద్ధోదనుఁడు మిక్కిలి శోకించెను. సిద్ధార్థుఁడు విరాగియగుటవలనఁ దనయనంతరము గద్దెనెక్కి రాజ్యముం బరిపాలింపఁ గలకొడుకు పోయెను. నందుఁడు సన్యాసి యగుటవలన రెండవ కుమారునియెడఁ గూడ నాసలు పోయెను. నిజవంశాంకూరమై తన యాసలకెల్ల నిలయమైన ముద్దుల మనుమఁడు గూడ సన్యాసి యగుటచే నతని మనోరథములెల్ల భగ్నములై పోయెను. అగుటయు శుద్ధోదనుఁడు గాఢవిషాదపరితప్త మనస్కుఁడై బుద్ధున కడకరిగి శోకించి యది మొదలుకొని తల్లిదండ్రుల యనుమతి లేక కుమారుని, దనమతమునం గలుపుకొనకుండునట్లు కోరెను. బుద్ధుఁడా ప్రకారము సేయుదునని మాట యిచ్చెను. అనంతర మతఁడు కపిలవస్తు నగరము విడిచి పయనమై పోయెను. పోవుచుఁ ద్రోవలో నతఁ డనోమానదీతీరమున నున్న "అనుప్రీయ" యను గ్రామ మునసమీపమున నున్నయొక మామిడితోఁటలో బసచేసి కొంతకాల మాగెను. అతఁడు మహావైరాగ్య మవలంబించి యంతఃపురము విడిచి చెన్ననితోఁ గలిసి చాలదూరము పయనముచేసి యేస్థానమునఁ జెన్నని వెనుకకుఁబంపి వైచెనో యాస్థానమునకు సమీపమందె మామిడితోఁట యుండెను. అచ్చటనుండఁగా నతని జ్ఞాతులుఁ దదితరబంధువులు జాలమంది యతనిమతమునం గలిసిరి. వారిలో ముఖ్యులు నలువురు. ఆనందుఁడు మొదటివాఁడు. దేవదత్తుఁడు రెండవ వాఁడు. ఉపాలి మూఁడవవాఁడు, అనిరుద్ధుఁడు నాలవవాఁడు. ప్రథముఁడైన యానందుఁడు సిద్ధార్థునకుజ్ఞాతి, అతఁడు బుద్ధుని యందుఁ బరమభక్తి గలిగి మెలంగెను. దేవదత్తుఁడు గూడ నతనికి జ్ఞాతియె గాని కాలక్రమమున నతనికి విరోధియయ్యెను. మూఁడవవాఁడైన యుపాలి శుద్ధోదనునియంతఃపురమునందు మంగలి. అతనికి మొదటినుండియు మతమునం దభినివేశము విశేషముగ నుండుట

చేతను బుద్ధి మంచిదగుటచేతను నతఁడు బుద్ధశిష్యులలోఁ బ్రధానుఁ డయ్యెను. నాలవవాఁడైన యనిరుద్ధుఁడు బౌద్ధతత్త్వశాస్త్రమునకుఁ గర్త యయ్యెను.

---

## త్రయోదశాధ్యాయము.

---

అనంతరము మహాత్ముఁడైన బుద్ధదేవుఁడు మతబోధ చేయుటలోను భిక్షుకశిష్యులను గృహస్థశిష్యులను జేర్చికొనుటలోను మానవజాతికి ధర్మములను సాధుభావములను నేర్పుటలోను గడిపి ధర్మసంస్థాపనముఁ జేసెను. ఏసంవత్సర మెక్కడెక్కడ నివసించియెంతెంతపని జేసెనో తెలిసికొనుటకుఁ దగినయాధారములు లేవుగానికొన్ని బౌద్ధగ్రంథములఁబట్టియతఁడు బుద్ధుఁడయినది మొదలుకొని యిరువది సంవత్సరములవఱకు జరిగిన చరిత్రము సంగ్రహముగాఁ దెలిసికొనుటకు మనకు వీలుగా నున్నది. అందు మొదటిది మూఁడుసంవత్సరముల చరిత్రము వెనుకటి యధ్యాయములలోఁ జెప్పఁబడినది. తక్కిన పదియేడేండ్ల చరిత్ర మీక్రింద వివరింపఁ బడు చున్నది. అతనికి బుద్ధత్వము ప్రాప్తించిన నాలుగవ సంవత్సరమునం దుగ్రసేనుఁ డను నటుని దనమతంబునం గలిపెను. ఇతఁడు త్రాటిమీఁద మిక్కిలి సుందరముగా నాట్యమాడి జీవనము సేయుచుండువాఁడు. ఇతనిని శిష్యునిఁగా స్వీకరించిన పిదప బుద్ధుఁడు భాగీరథీనదిని దాఁటి వయిశాలీపురమున కరిగి తత్సమీపమున నున్న మహావనమనుతోఁపులో నివసించెను. అక్కడ నుండఁగా శాక్యులకును వారి బంధువులకును సరిహద్దులలో నున్నకోహణనదీజలమును గూర్చి వివాదములు వచ్చిన

ట్లతఁడు విని కపిలవస్తుపురమున కరిగి వారికలహము లుడిపి సంధి చేసి వెండియు మహావనంబునకుఁ జని వర్షకాల మచ్చటఁ గడిపెను. ఐదవసంవత్సరమున నతనితండ్రి యగుశుద్ధోదనుఁడు మరణమునకు సిద్ధముగ నున్నాఁడని తెలిసినందున నతఁడు వెండియుఁ గపిలవస్తుపురమునకుఁ జని జనక నిర్యాణకాలమున సన్నిధినుండెను. శుద్ధోదనుఁ డప్పుడు తొంబదియేడు సంవత్సరముల ప్రాయమువాఁడు. మృతుఁ డయిన జనకునిదేహమునకు యథావిధిగ నగ్నిసంస్కారములు చేయించి చుట్టముల సమాశ్వాశించి బుద్ధుఁడు మరల మహావనంబునకుం జనెను. అతఁ డచ్చట నుండఁగా నతనిసవతితల్లి యయి నప్రజాపతీదేవియు భార్యయయిన యశోధరయు బంధువు లయిన మఱికొందఱుస్త్రీలును నతని కడకుఁ బోయి తమచేత మతస్వీకారము చేయింపవలసిన దనియు శిష్యురాండ్రుగఁ జేర్చికొనవలసిన దనియు వేఁడుకొనిరి. ఆఁడువాండ్రం జేర్చికొనుట బుద్ధున కెంత మాత్ర మిష్టము లేకపోయినను శిష్యుఁడయిన యానందుఁడు వారిపక్షము వహించి వాదించి పట్టుపట్టుటచే నేవోవిధముగ బుద్ధుఁడు సమ్మతించి స్త్రీల కవసరము లైనకొన్ని నియమముల నేర్పఱిచెను. ఈవిషయమై యీక్రిందికథ బౌద్ధగ్రంథములలో నున్నది. శుద్ధోదనుని మరణానంతరమునఁ బ్రజాపతీదేవి బుద్ధునిసందర్శించి 'నాభర్త మరణము నొందెను. ఏకపుత్రుఁ డైననందుఁడు నీశిష్యుఁడయ్యెను. మనుమఁడయిన రాహులుఁడుఁ గూడ నీమార్గమె యనుసరించెను. ఇంక నెవ్వరిం జూచుకొని యిచ్చట నుందును? కావున నన్నును యశోధరను దక్కిన యంతఃపురాంగనలను నీమతమునం జేర్చికొని యుద్ధరింపు' మని వేఁడుకొనెను. అనవుడు 'స్త్రీలను నామతమునఁ జేర్చికొనుట కిష్టము లేదు' దని బుద్ధుఁ డుత్తరము చెప్పెను. "ఎట్లయినఁ జేర్చికొనవలసిన' దని యామె ముమ్మారు వేఁడెను. బుద్ధుఁడు ము

మ్మారు వారికోరిక నిరాకరించి కపిలవస్తుపురమును విడిచి వైశాలీ పురమునకుం జనెను. అప్పుడు ప్రజాపతిదేవి తక్కినయంగనలం జూచి యిట్లనియె "మనలను దనమతమునం జేర్చికొమ్మని మనము ముమ్మారు వేడినను బుద్ధుఁడు మనకోర్కె నిరాకరించెను. మన యంతట మనమె యాతనియొద్దకుఁ బోవుదము. అప్పు డతఁడు తప్పక మనలం జేర్చుకొనును" ఆమెయుపదేశము మిక్కిలి సమంజస ముగా నున్నదని యంతఃపురాంగన లెల్ల సంతసించి యట్లు చేయుద మని యొడఁబడి శిరోముండనములు చేసికొని యలంకారములు తీసి వైచి కాషాయాంబరములు ధరించి మంటిమూఁకుడులు భిక్షాపాత్రి ములుగా హస్తముల ధరించి యంతఃపురము విడిచి బయలుదేరిరి. సూర్యరశ్మి యెట్టిదో యెఱుఁగని యంగనలు కాలినడక యెట్టిదో యెఱుఁగని యంగనలు పట్టపగటిబీరెండలోఁ గాలినడకం బైలు దేరి కపిలవస్తుపురమునుండి వైశాలికిం బోవఁ దొడఁగిరి. కపిలవస్తు పురమునకు వైశాలికి దూర మేబదియామడ. బౌద్ధమతధర్మమం దలి యత్యంతాసక్తిచే వారింతదూరముఁ గాలినడకం బోయిరి. పుష్పసుకుమార లైనశుద్ధాంతకాంతలు శిలాకంటకావృతములైన మా ర్గంబుల నడుచునప్పుడు వారు పడుశ్రమ యింతింత యని యెవరు వర్ణింపఁ గలరు? కాని మతావిష్టులైనవారిని సూర్యతాపముకాల్పదు. చలి వారిం జలియింపఁ జేయనేరదు. వానలచేత వారిశరీరములు తడిసినను మనసులు తడియవు. మతాసక్తి మేను మరపించు నన్న మాట యతిశయోక్తి కాదు. అసూర్యంపశ్య లగునీ రాజాంగనల నింతదవ్వు దోడ్కొనివచ్చినది మతాసక్తికాక మఱి యేది? కడు దవ్వు కాలినడకం బయనము సేయుటచే వారిపాదములు పొక్కు లెక్కెను. పుండ్లుపడెను. ఆనందుఁడు వారిపాదములఁ జూచినప్పు డతనికన్నుల నీరు బొట బొట గారెను. "మీరేల యింతశ్రమపడి

వచ్చితిరమ్మా" యని యతఁ డెంతో నొచ్చుకొనెను. "జగద్గురువైన బుద్ధునిమతము స్వీకరింపఁ దలఁచి సన్యాసినుల మైతిమి. కావున నిచ్చటకునచ్చితిమి" అని ప్రజాపతిదేవి యుత్తరము చెప్పెను. ఆనందుఁడు వారి నచ్చటనుండుమని తాను బుద్ధుని సన్నిధికరిగి ప్రజాపతి యశోధరమున్నగునంగనలుభిక్షుణీవేషముతోవచ్చియున్నా రని తెలిసినాకి నిజేర్చుకొనవలసినదని ప్రార్థించెను. "ఆనంద! ఆఁడువాండ్ర నిందుఁ జేర్చికొనవ" ద్దని బుద్ధుఁడు బదులు చెప్పెను. ఐనను మానక యానందుఁడును మఱి కొందఱు శిష్యులును మిక్కిలిపట్టుపట్టి బుద్ధుని బలవంతము పెట్టుటచే నతఁ డెట్టెటో యొకవిధముగా నంగీకరించెను. నాఁడు మొదలుకొని స్త్రీలకుఁ బ్రత్యేకాశ్రమ మేర్పఱుపఁబడెను. భిక్షుణీమండలికెల్ల మొట్టమొదటఁ బ్రజాపతిదేవి యధికారిణియై యుండెను. ఆమె నిర్వాణపదవిఁ బ్రాపించినపిదప బుద్ధునిభార్యయగు యశోధర యాస్థాన మధిష్ఠించెను. కాని యశోధరయు బుద్ధుని కంటెఁ జాలకాలముముందె నిర్వాణ మొందెను. అనంతరము బుద్ధుఁ డచ్చటనుండి కౌశాంబీనగర సమీపమునను న్న మాకులపర్వతమున కుం జనియెను. కౌశాంబీనగర మిప్పుడు లేదు. ప్రయాగకు సమీప మున నిది పూర్వము వత్సరాజగు నుదయనునకు రాజధానిగా నుం డెడిది. ఆఱవసంవత్సరపు వర్ష కాల మంతయు బుద్ధుఁడుమాకులపర్వత గుహలలోఁ గడపి వాన లుడిగినపిదప రాజగృహనగరమునకుం జని యెను. అక్కడనున్న కాలములో మగధరాజగు బింబిసారమహారాజు యొక్క ధర్మపత్నియైన క్షేమాదేవి యాతనిమతమును స్వీకరించెను. ఆకాలముననందె యాతనిశిష్యులలో నొకఁడు తనమహామహిమవలన నద్భుతమైన భిక్షాపాత్రము సంపాదించితినని దానిం దెచ్చి చూపెను. మహిమలు చూపుట ప్రజలను మోసపుచ్చుట యని బుద్ధుఁడు మహిమప్రదర్శనము నిషేధించి బుద్ధుఁ డాపాత్రను పగులఁగొట్టిం

చెను. అతఁడు స్రావస్తిపురసమీపమందున్న జేతువనమునం దేడవ సంవత్సరము గడపెను. ఆకాలమునందు మాయలమారియైన చించ యనుసన్యాసినిని బుద్ధునివిరోధులు చేరఁదీసి తన్ను బుద్ధుఁ డుంచుకొన్నాఁ డని యామెచేత నల్లరి చేయించుటకుఁ బ్రయత్నించిరి గాని మెట్టకేలకు వాని మోసము బయలుపడినది. ఈవిషయమై యీక్రిందికథ చెప్పఁబడుచున్నది— గౌతమబుద్ధుఁ డుపదేశించుధర్మములను మిక్కిలి తమకముతో వినుటకుఁ బ్రతిదినము వందలకొలఁది జనులు గుంపులుగూడి యతఁ డెచ్చట నున్న నచ్చటికిఁ బోవుటఁ జూచి యసూయాప్రేరితులై యాతనివిరోధులు కొందఱాజనులతో నిట్లనిరి. "మీ రేమిసేయుచున్నారు? గౌతముఁ డొక్కఁడేనా బుద్ధుఁడు? ప్రపంచమున మఱి బుద్ధులు లేరా? మేము మాత్రము బుద్ధులము కామా? అతఁడు నిర్వాణపథము మీకుఁ బ్రసాదింపఁ గలిగనేని మేముమాత్రము మీకది యనుగ్రహింపలేమా?" అని వారి మనస్సులు బుద్ధునిమీఁదనుండి మరల్చుటకు వారు బహుప్రయత్నములు చేసిరికాని యవియెల్ల నిష్ఫలమయ్యెను. అందుచేత వారు మాయోపాయ మేదైనఁ బన్ని జనుల కాతనిమీఁదఁ గల గౌరవముఁ దగ్గింపవలెనని యెంచి నీచమైనపన్నుగడ నొకదానిని బన్నిరి.

ఆకాలమున 'సీవట్ట' మనుగ్రామమున చించ యను నొక సన్యాసిని యుండెను. ఒక్కనాఁడది బుద్ధునిపగతు రగు తీర్థకులయొద్దకుం జని వారి నారాధించెను. ఆయారాధనను స్వీకరించి వా రామెతో నేమియుం బలుకక మౌనము ధరించియుండిరి. వారిమౌనము జూచి చించ తాను వారి కేదోయపచారము గావించియుండుటం జేసి వారు తనపై నాగ్రహము బూని రని మిక్కిలి భయంపడి ముమ్మారు వారి నారాధించి తాను జేసిన యపరాధ మేమొ తెలియఁ జేయ

వలసినదని వేఁడుకొనెను. అనవుడు నాతీర్థకులు "మాకు నీపై నా గ్రహ మేమియు లేదు. మేము బుద్ధుని గొప్పతనమునకు భంగముఁ గలుగఁ జేయుట కుపాయము వెదకుచున్నాము. ఆవిషయమున నీ సహాయము కావలసియున్నది. చేయుదువా?" యని యడిగిరి. ఏవిధ ముగాఁ జేయవలయునని యామె ప్రశ్నించెను. ఆవిధాన మేదో సవిస్తరముగా వా రామెతోఁ జెప్పిరి. అదియు నట్లు జేయుటకొడం బడెను. చించ మాయాసముద్రముయొక్క పారముఁజూచినది. నీవట్ట గ్రామమందలి జను లనేకులు ప్రతిసాయంకాలము గౌతముని ధర్మో పదేశములు వినుట కాయనకడకుఁ బోవుచుందురు. ఆసమయమునం దె నామాయలమారియుఁ గుసుంబవస్త్రములు గట్టి కొప్పునఁ బూలు ముడిచి చందన మలందుకొని పరిమళద్రవ్యములు మేనఁ బూసికొని బుద్ధుఁ డున్న నెలవునకుఁ బయనమయ్యెను. "ఇట్టివేళ నిట్టివేషము వేసికొని నీవెక్కడి కరుగుచున్నా" వని బుద్ధ సందర్శనమున కరుగు చున్న జనులు దాని నడిగిరి. "నాజోలి మీ కెందుకు? మీ దారిని మీరు పొం" డని యది యుత్తరముఁ జెప్పెను. ఆరాత్రి యామె బుద్ధుని నెలవునకు సమీపమున నొకచోట గడిపెను. మఱునాఁడు బుద్ధుని యుపదేశముల నాలకింపవలెనని కొందఱు తెల్లవాఱు జాము ననె బయలుదేరి గ్రామమునుండి వచ్చుచుండ నీవగలాఁడి మరల గ్రామమునకుఁ బయనమై పోయెను. 'నీవెక్కడనుండి వచ్చుచున్నా' వని యాజనులు దాని నడిగిరి. 'నేను రాత్రి బుద్ధునిగదిలోఁ బండు కొని వచ్చుచున్నా' నని యది ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్లుచేయుట తోఁ దనివినొందక యొకనాఁడు బుద్ధుఁడు శిష్యుల పెక్కండ్రం జేర్చి ధర్మోపన్యాసము జేయుచుండ నాదురాత్మురాలు చెక్కిన కఱ్ఱపలక యొకటి గర్భస్థానమున నిముడ్చుకొని నిండుచూలాలైనట్లు నటించి మెల్లవారు వినుచుండ బుద్ధు నుద్దేశించి యిట్లనియె. "నేను నీవలన

నీగర్భముఁ దాల్చితిని. నేను ప్రసవించుటకుఁ దగిన తావు చూపితివి కావు" అని బిగ్గరగాఁ బల్కెను. ఆపల్కులు విని యెల్లవారు విస్మితు లగుచుండ నంతలో గాలి విసరెను. ఆగాలికి దానివస్త్ర మెగిరిపోవ దారుఖండము క్రిందఁబడెను. అక్కడఁ జేరిన జనులందఱుఁ బవిత్రుఁ డైన బుద్ధునిచరిత్రము మలినము చేయుటకును లోకమునం దతని గౌరవము తగ్గించుటకును దురాత్ములా లీపన్నగడ పన్నినదని తెలిసి కొని దానిని నిందించి కాళ్ళుచేతులుఁ బట్టుకొని దాని నావలకు లాగి పాఱఁదోలిరి.

గౌతముఁడు బుద్ధుఁడైనపిదప, అష్టమవర్షమును శింశుమార పర్వతముమీఁదఁ గడపెను. ఈగిరి కపిలవస్తుపురమునకు సమీపమం దుండెను. మొగ్గలిగ్రామ వాసుఁడైన నకులుఁడనునాతనితలిదండ్రు లను బుద్ధుఁ డిచ్చటనే తనమతములోఁ జేర్చికొనెను. బుద్ధుఁడు చమత్కారములయిన చిన్నకథలు జెప్పియు నుదాహరణములం జెప్పియు మానవుల జ్ఞానవంతులఁ జేసి స్వమతములోఁ గలుపుచుండెను. అట్టిచమత్కార పరిసంగ మిచ్చట నొకటి కలదు. కిసగౌతమి యను నొకచిన్నది కలదు. ఆబాలిక యొకమహాసంపన్నుని కుమారునకు మహావైభవముతో వివాహము సేయఁబడెను. ఆమె కొకకుమారుఁడు కలిగెను. వాఁడు మిక్కిలి చక్కనివాఁడు. ఆట లాడుకొనుచున్న యీడున వాఁడు కాలధర్మమునొందెను. కిసగౌతమి మిక్కుటమగు పుత్త్రస్నేహంబున బాలకునివిడువక భుజముమీఁద వైచికొని తన్నుఁజూచి దుఃఖించుచున్న బంధుమిత్త్రులగృహములకరిగి 'నాబిడ్డ కేదైన మందిచ్చి బ్రతికింపుఁ'డని వేఁడెను. అటు లామె యిల్లిల్లుఁ దిరుగుచు నొక బౌద్ధభిక్షుకునికడకుఁ బోయి యడుగ నతఁ డిట్లనియె "అట్టిమందు నాయొద్ద లేదు. కాని యట్టియౌషధ మొకని యొద్ద నున్నది. ఆయన నే నెఱుఁగుదును."

'అయ్యో! ఆయనపేరు చెప్పు నాయనా' యని కిసగౌతమి ప్రార్థించెను.

'బుద్ధుఁడట్టిమందు లియ్యఁగలఁడు. ఆయనకడకుఁ బొ' మ్మని ప్రత్యుత్తరమిచ్చెను. ఆతఁడు చెప్పినచొప్పున నామెయు ద్దరాలు బుద్ధుని కడకుం బోయి 'దేవా! నాబిడ్డ కుపయోగించు నౌషధ మేదైన మీ రెఱుఁగుదురా? యనియడిగెను. 'ఆహా! అట్టిమందు నేనొక టెఱుఁగుదు' ననిబుద్ధుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. 'ఏమి యౌషధులు కావలెను స్వామీ'యని కిసగౌతమి మరల బుద్ధు నడిగెను. 'ఆవ గింజలు కావలె'నని బుద్ధుఁడు పలుక నామె యవి సులభముగాఁ దెచ్చుట కయి పోవుచుండ బుద్ధుఁడంతలో నిట్లనియెను. "ఏయింటిలో మగఁడు గాని, తలిదండ్రులుగాని, బిడ్డలుగాని, సేవకులుగాని చచ్చియుండరో యట్టియింటినుండి నీవావగింజలు తీసికొని రావలెనుగాని ప్రతిగృహము నుండి తీసికొని రాఁగూడదు."

మంచిది స్వామీ! అట్లే తెచ్చెద నని పాప మాబాలిక చచ్చినపుత్రుని భుజముమీఁదనే వైచికొని యింటింటికిఁ బోయి యావగింజ లడిగెను. 'ఇవిగో! ఆవగింజలు తీసికొ'మ్మని యింటివారు పట్టుకొనివచ్చి యియ్యఁబోఁగా 'అమ్మ! మీయింట మగఁడుగాని బిడ్డలుగాని తలిదండ్రులుగాని చనిపోలేదుగదా' యని యడుగుచు వచ్చెను. అడుగుటయు నొకరు 'ఇదేమిటమ్మ! పిచ్చిమాట లాడు చున్నావు. లోకములో బ్రతికియున్నవారే తక్కువమంది. చచ్చిన వారే యెక్కువమంది' యని పలికిరి. ఒకతె తనయింటఁ దనబిడ్డ మృతినొందెనని చెప్పెను. వేఱొకతె భర్తకాలధర్మము నొందెనని చెప్పెను. ఒండొకతె తలిదండ్రులు గతించెనని యెఱింగించెను. సేవ కులు జీవము బాసెనని వేఱొక యిల్లాలుపలికెను. ఎవ్వరును మృతి నొందని యిల్లొక్కటియైన గ్రామమున లేకపోవుటచే నామె తిరిగి

తిరిగి విసికి వేసారి వితర్కాధీనమనస్కయై యుండ జ్ఞానమంకురించెను. అంకురించుటయు నది వ్యర్థపరియాసమని యెఱింగి పుత్రికళేబర మడవిలోఁ బాఱవైచి యామె బుద్ధునికడకుఁ బోయి యతని శరణంబు వేఁడెను. ఆవగింజలు దొరకినవా యని యతఁ డామెను బ్రశ్నించెను. "స్వామీ అవి నాకు దొరకలేదు. చచ్చినవారే యెక్కువమందియనియు బ్రికియున్నవారే తక్కువమంది యనియు జనులు చెప్పుచున్నారు" అప్పుడాయన పదార్థములెల్ల నస్థిరము లని యామెకుపన్యసించెను. ఆయుపన్యాసము విన నామెకు నిర్మలజ్ఞానముదయించెను. అన్నిసందియము లడుగంటెను. ఆమె బుద్ధమతము స్వీకరించి ధర్మమార్గ మనుసరించెను. అనంతరము బుద్ధుఁడు ప్రియాగకు సమీపముననున్న కౌశాంబీపురమున కరిగెను.

తొమ్మిదవయేట మొగ్గలియను నతఁడు బుద్ధునిమీఁద ద్వేషభావముఁ బూని వైరము సాధింపఁజొచ్చెను. ఆనందుఁ డనుశిష్యుఁడు మొగ్గలిని మఱియొకచోటికిఁ బొమ్మని బహువిధములఁ జెప్పెనుగాని యతఁ డతనిమాట నిరాకరించెను. శిష్యగణములు రెండు తెగలైరి. బుద్ధుఁడు రెండుతెగలవారిం బిలిచి యైకమత్యము, శాంతము, పరస్పర ప్రేమ గలిగి యుండుఁ డని పలుతెఱంగుల హితోపదేశముఁ జేసెను. కాని, యాతని బోధలు నిష్ప్రయోజనము లగుటచే నతఁడు విచారించి శిష్యులను విడిచి పారిలీయక మనుచోటికి నొక్కఁడె బోయెను. అచ్చోట గ్రామవాసులు కట్టించిన యొక కుటీరమున నధివసించి పదివర్షములు గడపెను. మున్ను ద్వేషభావము వహించిన భిక్షుకులు పశ్చాత్తాపమనస్కులై తమకావించిన యపరాధముఁ దెలిసికొని గురు వెందున్నవాఁడో యని యూరూరు వెదకికొనుచు నెట్టకేలకు నాయనం గనుంగొని క్షమియింపుమని వేఁడిరి. గురువు శిష్యుల నత్యంతప్రీతితో నాదరించి తప్పులు క్షమించి యిట్లనియె. "వస్తువుల

సూక్ష్మభావ మెఱుఁగని మూర్ఖులు తమలోఁ దాము కలహింపవచ్చు ను. కాని జ్ఞానముగల మీరిట్లు కలహింపవచ్చునా? మనుష్యుఁడు తాను మంచితలంపులు గలవాఁడై నపక్షమున వివేకము యుక్తాయు క్తవివేకము జ్ఞానము గలమిత్రులతోఁ గలిసి యుండవచ్చును. కాని, యజ్ఞానులతోఁ గలసి మెలసి యుండుటకంటె నేకోరికలులేక పాపరహి తుఁడై యేనుఁగువలె నొక్కఁడై యసహాయుఁడై తిరుగుట మంచిది" యని యుపదేశించి పశ్చాత్తాపము నొందినశిష్యులను స్రవస్తిపురము నకుఁ బొమ్మని యానతిచ్చి యాతఁడుమగధదేశమున కరిగెను.

పదునొకండవయేట మగధరాజధానియగు రాజగృహంబునకు సమీపమందున్న నొకపల్లియలో భరద్వాజుం డనుబ్రాహ్మణుని బుద్ధుఁడు కృషీవలుని సామ్యము జెప్పి స్వమతమునం గలిపెను. ఆసా మ్యమిది—భరద్వాజుఁడను బ్రాహ్మణుఁడు సంపన్నుఁడు. అతఁడు సేద్యము చేసి పంటపండించును. పొలములోఁ బండినధాన్య మతఁ డింటఁ బోయించుకొనుచుండఁగా నొకనాఁడు బుద్ధుఁడు భిక్షాపాత్రి ముం బూని భిక్ష మిమ్మని యాతనిగుమ్మమునొద్ద నిలిచెను. కొందఱు జనులాయనకు నమస్కరించి భక్తితత్పరులయి యుండిరి. కాని భరద్వాజుఁడు కోపించి "శ్రమణకా! నేను దున్ని విత్తులుచల్లి సేద్యము చేయుదును. కష్టపడి పండించుకొని యన్నము తినుచు న్నాను. నీవుఁగూడ నావలెనే దున్ని విత్తులు చల్లి సేద్యము చేసి కొనుట మంచిది. అప్పుడు నీకుఁ దినుటకుఁ గావలసినంత యన్న ముండు' నని తిరస్కారభావముతోఁ బలికెను.

'బ్రాహ్మణుఁడా! నేనును దున్ని విత్తులు చల్లి సేద్యము చేయుచున్నాను. అట్లు పంటపండించియే నేనును భుజించుచున్నాను.'

"ఏమి! నీవును గర్షకుఁడవేనా? ఆజాడలేమియుఁ గనఁబడవే? నీయెద్దు లేవి? విత్తనము లేవి? నాగలియేది?" యని భరద్వాజుఁ

డుత్తరమిచ్చెను. అనవుడు బుద్ధుఁ డిట్లనియె.

"నేను జల్లు విత్తనము భక్తి సత్కార్య పరంపర దానిని వృద్ధిబొందించి పండించువాఁడ. జ్ఞానవినయములు నాగలి కిరువంకలు. నామనస్సు దాని నడుపునట్టి ముఖ్యసాధనము. ధర్మమనియెడు పిడి నేను జేతఁబట్టుకొని నడపించుచుందును. శ్రద్ధ నాయెద్దు. ఈవిధముగా సేవ్యముచేయుచు నేను మాయ యను కలుపు దీయుచుందును. ఇట్లుండున్నటవలన సమస్తదుఃఖములు నశించును. నిర్వాణఫలామృతమే యిందుఁ బండుపంట." ఈసామ్యమువలన భరద్వాజుని మనఃక్షేత్రమున బుద్ధమతబీజములు చక్కఁగా నాటుకొనన, నాఁటనుండి యతఁడతనిశిష్యుఁ డయ్యెను. వర్షకాల మచ్చటఁ గడిపి యతఁడు కోసల దేశంబున కరిగి "సతియాభిమా" యను పట్టణంబునకుం బోయెను. పండ్రెండవయేట నతఁ డచ్చటనుండి విరంజయనుపురమున కరిగి యాయూర వానకాలముఁ గడపెను. అనంతర మతఁ డదివఱకెన్నఁడుఁ జేయని దీర్ఘప్రయాణముఁ జేసెను. ఈప్రయాణమున నతఁడు మంతలవఱకుఁ బోయెను. అచ్చటనుండి యతఁడు కాశీవైశాల పురములమీఁదుగాఁ గోసలదేశమం దున్న స్రివస్తికిఁ బోయెను. తాను బోయిన ప్రతిపట్టణమందు మతబోధ సేయుచు శిష్యులం జేర్చుకొనుచువచ్చెను. స్వనివాసమునకు మరల వచ్చిన పిదప నతఁడు కుమారుఁడయిన రాహులునకు మహారాహులసూత్రి ముపదేశించెను.

పదమూఁడవయేఁట నతఁడు చాలియదేశమున కరిగి ప్రావృట్కాల మచ్చట గడిపి వెండియు స్రివస్తినగరముఁ జేరెను. పదునాలుగవయేట బుద్ధుఁడు తనకుమారుఁ డయిన రాహులునకు శ్రవస్తి పురమందున్న జేతువనవిహారములో రాహులసూత్రిముఁ జెప్పి యతనిని భిక్షుకుని జేసెను. అచ్చటనుండి యతఁడు కపిలవస్తున కరి

గెను. పదియేనవయేఁ డతఁడు కపిలవస్తుపురసమీపమునందలి నిగ్రోధ వనమునఁ గడిపి తనజ్ఞాతియగు మహానామునకు ధర్మోపదేశముఁ జేసెను. శుద్ధోదనునిమరణానంతరమున, శాక్యనాయకుఁడయిన భద్రుని తరువాత మహానాముఁడు శాక్యాధిపత్యము వహించినవాఁడు. కపిల వస్తువునుండి మరల నతఁడు జేతువనవిహారమున కరిగెను. బిచ్చములు పెట్టుట మొదలయిన దానములకంటె, సత్ప్రవర్తనము జితేంద్రియ త్వము మొదలయిన ధర్మలక్షణములు గలిగియుండుట శ్రేష్ఠమని యతఁ డచ్చట నుపన్యాసము చేసెను. పదియాఱవయేట నతఁ డాలవి యనుగ్రామమున కరిగి యొకరాక్షసునకు ధర్మ ముపదేశము చేసి యతనిని స్వమతములోఁ గలిపెను. ఆరాక్షసుఁడు పరిసరదేశంబులఁ గల శిశువులనెల్ల బట్టి చంపి తినుచుండెడివాఁడఁట. పదియేడవసంవత్స రపు వర్షకాల మతఁడు రాజగృహంబునఁ బుచ్చెను. అక్కాలంబు న నతఁడు శ్రీమతియను రాజాంతఃపురపరిచారికయొకర్తు మృతినొంద న త్తరుణిమరణముఁగూర్చి యుపన్యాసము చేసెను. వసంతకాలమున నతఁడు స్రావస్తిపురము మీఁదుగా నాలవిగ్రామమునకుఁ బోయెను. ఎందుఁబోయిన నందు ధర్మబోధ చేయుటయే యతనిపని. ఆలవిలో నొకమనుష్యుఁడు పేరాఁకలిచేత బాధపడుచుండఁగా నతనిం గడుపారఁ గుడిపించంగాని యచ్చట ధర్మబోధ చేయనని చెప్పి, పురవాసు లతనికి మృష్టాన్నముబెట్టి సంతుష్టునిఁ జేసినపిదప ధర్మోపదేశముఁ జేసెను. అష్టాదశాబ్దమున నతఁడు స్రావస్తిసమీపముననున్న చాలియగ్రామ ములో వర్షకాలము గడపెను. అచ్చట నుండఁగా నొక సాలెవాఁడు పొరపాటునఁ దనకూఁతునిఁ జంపి దుఃఖోపహతుఁడు కాఁగా సామవా క్యోపదేశంబుల నతని మనోవైక్లబ్యముందీర్చి బుద్ధుఁ డతని ననుగ్ర హించెను. అవ్వల గౌతముఁడు రాజగృహంబునకుఁ జనియెను. పం ద్రొమ్మిదవయేట సిద్ధార్థుఁడు క్రొక్కాఱు వేలువనవిహారంబునం జరిపి

తా నరిగిన యూళ్ళయందెల్ల ధర్మబోధచేయుచు గౌతముఁడు మగధ దేశమునకుఁ బోయెను. ఒకనాఁడు వేఁటకాని వలలో నొక జింకచిక్కి తప్పించుకొనుమార్గము లేకయుండ బుద్ధుఁ డావలనుండిదానిని విడిపించి పరిక్కనున్న యొక చెట్టుమొదటఁ గూర్చుండి సమాధినిష్ఠుఁడయి పర వశుఁడయి యుండెను. తనవలంజిక్కిన మృగము తనకుఁ దక్కకుండ విడిపించి తన కపకారముఁగావించినందుకు మృగయుఁడు కనలి బుద్ధునిఁ జంపఁదలఁచి వింట నంబు దొడిగివయిచెను. కాని యది గుఱితప్పిపో యెను. సమాధినుండి లేచి బుద్ధుఁడు వానిసంరంభముఁదెలిసికొని వానిని సమాదరంబుగాఁ బిలిచి వానికి వానికుటుంబమునకు ధర్మోపదేశముఁ జేసెను. ఆయుపదేశమువలన వారు బుద్ధునిశిష్యు లయిరి. అతఁడచ్చ టనుండి సవిస్తికిం జనియెను. ఇరువదియవసంవత్సరమున బుద్ధుఁడా సవిస్తిపురమందే వర్షఋతువు బుచ్చెను. తనభిక్షాపాత్రిము మోయు నట్టి భిక్షుకులు రెండుసారులు తన్నుగౌరవంబు దొరంగి తిరస్కార భావములతోఁ జూచుటంజేసి యానందుఁడను మఱియొక ప్రియశిష్యుని దనకు నిరంతర సహచరుఁడుగా భిక్షాపాత్రివాహకుఁడుగా నియమిం చెను. అనంతర మతఁడు చాలీయపుర సమీపమున నున్నయొక య రణ్యసమీపమునకుఁబోయి చౌర్యమునకు మిక్కిలి పేరుపడిన యం గుళీమాలుఁ డను నొకచోరుని దన కృపారసంబునం గెలిచి వానిని శ్రమణకునిఁ జేసెను. అంగుళీమాలుని వృత్తాంత మీక్రిందివిధమునఁ జెప్పఁబడినది.

కోసలరాజుపురోహితునకు నొక కుమారుఁడు కలఁడు. అతఁడు బ్రాహ్మణుఁ డయ్యు దైవదుర్విపాకంబున దుష్టజనసాహచర్యంబునం జేసి గొప్ప దొంగయై దారింబోవువారినెల్ల దోఁచుకొని వారివ్రేళ్ళ నతికి యావ్రేళ్ళు దండగాఁగుచ్చుచుండెను. అందుచేత వాని కంగు ళీమాలుఁడనుపేరుకలిగెను. ఆకాలంబున బుద్ధుఁడుజితువనవిహారంబున

నివసించుచుండెను. ఆచ్చోటుకాసి యతఁడు పయనమయి పోవలసి వచ్చెను. దారిలో నంగుళీమాలుఁడు వసించునరణ్యముండెను. ఆ దారిని మనుష్యులు నలువదిమందిగాని యేఁబదిమందిగాని గుంపుగూడి పోవలయునేగాని యొంటిగా నెవ్వఁడును బయనము సేయఁ గూడదని యు గుంపులుగాఁ బోయినను బలువూ అపాయములు గలుగుచుండు ననియు నందుచేత నాదారిం బోవలదనియుఁ బసులకాపరులు బుద్ధున కు విన్నవించిరి. వారిమాటలు సరకుచేయక బుద్ధుఁ డాదారినేపోయె ను. అంగుళీమాలుఁ డాయనంజూచెను. చూచి యాయనం గలిసికొన వలెనని మిక్కిలివేగముగ నడచెను. నడచుటయేగాదు. పరుగెత్తెను. ఎంత పరుగెత్తినను నాదురాచారుఁడు బుద్ధుని గలసికొనలేక పోయె ను. "అయ్యో! నేనేనుఁగులవెంటఁ బరుగెత్తువానిం బట్టుకొంటిని. లేళ్ల వలెఁ బరుగెత్తు గుఱ్ఱములవెంటఁ బరుగిడి యందుకొంటిని. ఎన్నోరథ ములఁ గలిసికొంటిని. కాని యీభిక్షుకుఁ డెవఁడో నాకందకున్నాఁడు. ఇదేమి చిత్రమో" యని మన బునం దలపోసి యాగజదొంగ యెలుఁ గెత్తి బుద్ధునింబిలిచి నిలువుమని కేకవేసెను. సరేయని బుద్ధుఁడచ్చట నిలిచి తనసమీపమునకు రావలదని చోరు నాజ్ఞాపించెను. చోరుఁడు సమీపమునకు రాక వాఁడున్నచోటనే యుండెను. అంతట బుద్ధుఁడు సమస్త జంతువులయెడల దయావంతులై యుండవలసినదనియు నట్లు న్నయెడల నరకంబునకుఁ బోవక యుండవచ్చుననియు దొంగకు గం భీరభాషణంబులతో ధర్మోపన్యాసముఁ జేసెను. అమృతధారలవంటి యతనిమాట లాదురాచారుని మనస్సున కెంతనచ్చెనోగాని వాఁడు వెంటనే బుద్ధునియడుగులపయిం బడి పశ్చాత్తప్తుండయి యతనిమత ములోఁ జేర్చికొమ్మని వేఁడెను. అప్పుడు బుద్ధుఁ డాతనిని భిక్షుకునిం జేసెను. అతఁడు బౌద్ధశ్రమణకులలోఁ బరమపావనుఁడై, యహింస కుఁడై సుప్రతిష్ఠం గాంచెను.

పూర్వోక్తప్రకారంబున గౌతముఁడు బుద్ధుఁ డయినతరువాత నిరువది సంవత్సరములవఱకు జరిగిన వృత్తాంతము సంక్షేపముగా మనకు లభించినది. ఇరువదియొకటవసంవత్సరమునుంచి మరణమువఱకు జరిగిన వృత్తాంతము క్రమముగాఁ జరిత్రకారులకు లభించినదికాదు.

---

## చతుర్దశాధ్యాయము.

---

### మిత్రులు.

ఈప్రపంచమున జన్మించిన ప్రతిమహాపురుషునకు మితిలేని మిత్రులు లెక్కలేని విరోధులుగూడ నుందురు. మహాత్ముఁడైన బుద్ధునకుఁగూడ నట్లే శత్రువులు మిత్రులుండిరి. వేనవేలు స్త్రీలు పురుషు లాయనను గౌరవించి పూజించుచుండిరి. వేనవే లాయనయెడ నసూయఁబూని యపవాదంబులు మోపి నిందించి పలుమాఱులు హానిచేయుటకు యత్నించిరి. ఆయనయం దత్యంతాభిమానముగల మిత్రులలో నిరువురు ముఖ్యులు కలరు. ఆయిర్వు రెవ్వరన శ్రావస్తి నివాసుఁడైన యనత్పిండుఁ డనువణిజుఁడు మొకటివాఁడు; వైశాలీ నగరవాసిని యైన వైశాఖయను భాగ్యవంతురాలు రెండవది. శత్రువులలో ముఖ్యుఁడు దేవదత్తుఁడు. ఈతఁడు గౌతమునకు దగ్గఱచుట్టము. మొట్టమొదటఁ బ్రధానశిష్యుఁడు. ఈతనివలె బుద్ధునియెడ గాఢద్వేషము వహించినవాఁ డింకొకఁడు లేఁడు. ఈయధ్యాయములో నాతని మిత్రులం గూర్చియే చెప్పఁబడును.

మగధరాజధానియగు రాజగృహాపురంబున మిక్కిలిసంపన్నుఁడగు నొక వణిజుఁడు కలఁడు. శ్రావస్తినివాసుఁడైన యనత్పిండుఁ డా రాజగృహావణిజున కాప్తమిత్రుఁడు. అనత్పిండుఁడు ప్రతిసంవత్సరము

రాజగృహంబునకుఁబోయి తనప్రాణమిత్రుని సందర్శించుచుండును. రాజగృహవణిజుఁడు మిత్రునిం దోడితెచ్చుటకెన్నో క్రోసులదూరము పోవుచుండును. అనత్పిండుఁ డొకనాఁడు మునుపటియట్ల రాజగృహంబునకు మిత్రసందర్శనార్థము వచ్చెను. కాని వెనుకటియట్ల మిత్రుఁ డెదురుగావచ్చి పురంబునకుం దోడ్కొనిపోలేదు. అతఁడు పురముఁ బ్రవేశించెను గాని యతనికి స్వాగత మిచ్చుట కెవ్వరుఁ గనఁబడరైరి. అతఁడు మిత్రునిగృహంబునకుఁ బోయెను. మిత్రుఁ డచ్చటనే యుండెను గాని వెనుకటియట్లు, మిత్రుఁ డతనిని సమాదరింపక సంక్షేపముగాఁ గుశలప్రశ్న మడిగెను. కాని నాఁటిరాత్రి యావణిజుఁడు తన మిత్రుఁడైన యనత్పిండుఁడున్న నెలవునకుఁ బోయి వెనుకటియట్లు సన్మానము చేయకపోవుటకుఁగల కారణ మెఱిఁగించెను. మఱునాఁడు తనగృహంబునకు భిక్షుస్వీకారము సేయుటకు బహుశ్రమణకులతోఁ గలసి బుద్ధుఁడు వచ్చుననియు వారి కాతిథ్యమిచ్చుటకుఁ దగు నేర్పాటులు చేయుచుండుటచేతఁ దన కెంతమాత్రము నవకాశము లేమి వెనుకటియట్లు సన్మానము చేయలేదనియు నది యగౌరవముగా భావింపవలదనియుఁ జెలికానిని వేఁడికొనెను.

అనత్పిండుఁ డది విని బుద్ధుని సందర్శింప నిశ్చయించుకొని తనలో నిట్లనుకొనెను. 'మేము బుద్ధులముఁ బుద్ధులమని చెప్పుకొనునట్టివా రనేకు లీనాఁడు గలరు. అట్టి వారిచేత నేను వంచింపఁ బడవచ్చును. కాఁబట్టి నేను బుద్ధునిఁ జూచెదను. చిన్ననాఁడు నా తలిదండ్రులు నాకు సుదత్తుఁడని పేరు పెట్టిరి. అది నాతలిదండ్రులకు నాకే గాని యన్యులకుఁ దెలియదు. ఈగౌతమబుద్ధుఁడు నాతొల్లింటిపేరు చెప్పఁగలిగెనేని నే నాతనియందు విశ్వాస ముంచెదను. మఱునాఁ డుదయమున బుద్ధుఁడే ముందుగా ననత్పిండునిఁ జూడఁబోయి యతఁడు కంటఁబడినతోడనే సుదత్తా యిటు రామ్మని పలుకరించెను. అతఁడు

తన ప్రథమనామధేయంబును జెప్పినతోడనే యనత్పిండున కాయన యందు గాఢమైనవిశ్వాసము కుదిరెను. కుదురుటయు నాజన్మాంతము బుద్ధదేవునిధర్మము ననుసరింతు నని యతఁడు శపథము జేసి తనయింటికి వచ్చి యొకసారిగృహపావనము జేయవలయునని బుద్ధుని వేఁడుకొని మరల శ్రవస్తికిం బోయెను. అట్లే వత్తునని బుద్ధుఁడుపలికి యాతని నంపెను. అనత్పిండుఁడు స్రవస్తికిం జనినతోడనే నగరోపకంఠంబుననున్న మంచియుద్యానవనములలో నొకటి విశేషధనమిచ్చి యాతఁడు కొని యచ్చోట నొకవిహారముఁ గట్టించెను. ఆవిహారము చుట్టును శ్రమణులకు వాసయోగ్యము లైన గృహము లుండెను. పగటివేళ నుపయోగ్యములగు భవనములు నిశాసమయోపయోగ్యములగు మందిరములుఁ బెక్కులు గలవు. అంతియేగాక తేటనీటికొలంకులు, మంచి పండ్లతోఁటలు, పూఁదోఁటలు, నేత్రోత్సవకరములై యుండెను. దానికంతకుఁ జుట్టు నాలుగువేలుమూళ్ళపొడవును, బదునెనిమిదిమూళ్ళ యెత్తునుగల గొప్ప గోడ యుండెను. ఆవిహారనిర్మాణమునకు నెన్నోకోట్ల సువర్ణము లయ్యెనఁట.

అదియెల్ల సిద్ధమైనపిదప ననత్పిండుఁడు బుద్ధుని సవినయముగా నాహ్వానము చేసెను. బుద్ధుఁడు రాజగృహంబునుండి బయలుదేఱి దినమున కెనిమిదిక్రోసుల వంతున నడచి నలువదియయిదు దినములలో స్రవస్తినగరముఁ జేరెను. అతఁడు నగరసమీపమునకు రాఁగానే గొప్పయుత్సవ మతని నెదుర్కొనెను. ఆయుత్సవములో నెన్నో మనుష్యులగుంపు లుండెను. ఒక్కొకగుంపులో నెనిమిదివందల మనుష్యులుండిరి. వారు సమయోచితము లయినపాత్రలుధరించి యమూల్యములగు వస్త్రాలంకారములు ధరించి బుద్ధుని సన్మానించిరి. అందొకగుంపునకు ననత్పిండునిపుత్రిక లిరువు రగ్రియాయినను లయిరి. అనత్పిండుఁడు బుద్ధుని విహారంబునకుఁ దోడ్కొనిపోయి యావిహార

మెవ్వరి కర్పణము సేయఁదగు నని యడిగెను. బౌద్ధసంఘమున కియ్యవలసిన దని బుద్ధుఁ డానతిచ్చెను. అతం డందుకు సమ్మతించి నలుదెసలనుండి వచ్చుశ్రమణుల యుపయోగము నిమిత్త మది యర్పణము చేయుచున్నానని చెప్పి బుద్ధునిహస్తములలో నతఁడు సువర్ణకలశోదకము ధారపోసెను.

అనత్పిండుఁ డవ్విధమున బౌద్ధసంఘమున కిచ్చినయావిహార మునందు బుద్ధుఁ డనేకసంవత్సరములు వసియించెను. అనత్పిండుఁడు తనయపార ధనసంచయంబులను బౌద్ధమతవ్యాప్తికొఱకు వ్యయము చేసెను. మహాత్ముఁడైన బుద్ధదేవుని మతము ప్రపంచంబున నెంత కాల ముండు నంతకాలముఁ బరమభక్తుఁడైన యనత్పిండుని పేరు గూడ నంతకాలము నుండితీరును.

అనత్పిండుఁడు తరువాత బుద్ధున కాప్తమిత్రమును, మతసం రక్షకురాలు వైశాఖ యనునామె. ఆమె మిక్కిలి భాగ్యవంతురాలు. బిడ్డలు, మనుమలు, మునిమనుమలు గలిగి యైశ్వర్యముగలిగి యామె పేరెన్నిక గాంచెను. ఎవరింట నే శుభకార్య మయినను నే వైదిక తంత్రి మైనను ముందుగా వైశాఖను బిలిచి యామెకు సంతుష్టిగా భోజన మిడినపక్షమునఁ దమకు శుభములు గలుగు నను నమ్మిక యాపురవాసుల కుండుటచే నెల్లవా రామెను బహువిధముల గౌరవిం చుచుండిరి. స్రవస్తినగరమునకు వచ్చునట్టి బుద్ధశిష్యులకుఁ గావలసిన పదార్థములన్నియు సమకూడునట్లు గొప్పయేర్పాటులు మొట్ట మొదటఁ జేసిన దీవైశాఖయేయని చరిత్రకారులు చెప్పుచున్నారు.

ఒకనాఁడు బుద్ధుఁడు విశాఖయొక్కగృహమున శిష్యగణము తోఁగలిసి విందారగించుచుండఁగా విశాఖ భక్తితత్పరయై యాతని యెట్టయెదుట నిలిచి "దేవా! దేవరవారు నా కెనిమిదివరము లియ్య వలెనని కోరెను. కోరుటయు బుద్ధుఁడు 'విశాఖా! సిద్ధార్థుఁడు నీవు

కోరినవరములనెల్ల నీయఁజాలఁడని తలంచెద' నని యుత్తరము చెప్పెను. అనవుడు విశాఖ 'మహాత్మా! నాకోరికలలో నేదియనింద్య మైనదో యేది యియ్యఁదగినదో యదే యిమ్మని ప్రార్థించుచున్న దాన' నని పలికెను. పలుకుటయు బుద్ధుఁడు 'విశాఖా! నీకేమివర ములు కావలెనో చెప్పు' మని యడిగెను. అడుగుటయు విశాఖ యిట్ల నియె—"నేను జీవించియున్నంతకాలము నాబౌద్ధసోదరులకు వర్ష కాలమునకుఁ గావలసిన వస్త్రములు నీయవలె ననియు, నీపట్టణమునకు వచ్చునట్టి క్రొత్తభిక్షుకుల కన్నము పెట్టవలె ననియు, నీయూరిదారిని బోవునట్టి బాటసారులగుభిక్షుకుల కన్నము పెట్టవలె ననియు, రోగు లకు మందు లియ్యవలె ననియు, రోగుల కుపచారము చేయువారి కన్నము పెట్టవలెననియు, నాయక్క సెల్లెండ్రగు సన్యాసినులకుఁ బ్రతిదినముఁ గావలసిన యన్నము పెట్టి స్నానముచేయువేళ వారు ధరియించుటకుఁ దగినవస్త్రము లియ్యవలె ననియు, నేను కోరు చున్న దానను." అనవుడు గౌతముఁ డామెం జూచి 'యీవరము లిమ్మని నన్నడుగుటలో నుద్దేశమే' మని యామెను బ్రశ్నించెను. ఆయనకు విశాఖ యిట్లుత్తరమిచ్చెను.

"పరదేశమునుండి యిచ్చటికి వచ్చెడు భిక్షుకుఁ డీనగరమందలి వీథులను, సందులను నెఱుఁగక భిక్షాటనమున కరిగి మిక్కిలి యలసి పోవును. భిక్షుకుఁడు రాఁగానే నేను సమర్పించినయన్నము దినెనేని నేడ రేపటి యీపురమందలి వీథులు, సందులు, గొందులు నెమ్మదిగాఁ దెలిసికొని పిమ్మట ననాయాసముగా బిచ్చమునకుఁ దిరుగవచ్చును. దేవా! యిదే నాయుద్దేశము. ఈయుద్దేశముతోనే నేను జీవించి యున్నంతకాలము భిక్షుకులకు నాచూపినకొలఁది యింతయన్నము పెట్టఁ దలఁచికొన్నాను. మఱియుఁ బయనము సేయునట్టిభిక్షుకుఁడు నిజోదరపోషణార్థము భిక్షమున కిందందుఁ దిరుగుచుండునేని వెనుకఁ

బడి తన బిడారముసు గలిసికొనలేకపోవుచు. ఒకవేళఁ గలిసికొన్న ను మిక్కిలి యాలస్యముగాఁ గలిసికొనును. మార్గమున మిక్కిలి యలసి నడువలేక కాళ్ళీడ్చుకొనుచుఁ బోవును. నేను సమర్పించునట్టి యన్నముఁ దిన్నపక్షమున భిక్షుకుఁడు తనసార్థవాహునకు వెనుకఁ బడఁడు. విశ్రమింపఁ దలంచుకొన్నస్థలమున కాలస్యముగాఁబోఁడు. కాళ్ళీడ్చుకొనుచు నడువక నేఁడేఁటే సుఖముగా నడుచును. దేవా! యిదియే నాయుద్దేశము. ఈయుద్దేశముతోనే నేను జీవించియున్నంత వఱకు నీనగరముదారిని బోవునట్టిభిక్షుకుల కన్నము పెట్టఁదలఁచు కొన్నాను. మహాత్మా! అసిరవతీనదిలో బౌద్ధసన్యాసినులు దిగంబ రలై కులటలు స్నానముచేసెడు రేవులలో వాండ్రతోఁగలిసి స్నానము చేయుచున్నారు. పరమపావనచరిత్రలగు భిక్షుణీమతల్లికలను జూచి యాకులటలు పరిహాసము చేసి 'నెఱజవ్వన మున్నంతకాలము మీకీ నెట్టివెట్టి నియమము లెందుకు? ఇప్పుడు హాయిగా భోగము లనుభ వించి ముసలితనము వచ్చిన తరువాత సన్యాసినులై పవిత్రజీవనము చేయఁగూడదా? అందువల్ల నిహపరములు రెండును మీకుఁ దక్కు' నని యనరానిమాట లనిరి. ఆకులట లట్లు దమ్ముఁ బరిహాసము చేయుటంజేసి భిక్షుణీజనము మిక్కిలి యాగ్రహము దాల్చెను. దేవా! ఆఁడుది దిగంబరయై యుండుట మిక్కిలి యనర్హము, అసహ్యము. అనుచితము, అకృత్యము. కావున నేను జీవించియున్నంత వఱకు భిక్షుణీజనమునకు స్నానవస్త్రముల నీయఁదలంచుచున్న దానను.'

ఆమె యుద్దేశములు విని భగవానుఁడగు బుద్ధదేవుఁ డిట్లనియె.

'బాగు! విశాఖా! బాగు. నీయుద్దేశము మంచిది. నీవు లోక హితము చేయుటకై వరములను గోరితివి కావున నే నావరముల నిచ్చితి' నని మెచ్చి యొక గీతమును బాడెను.

---

# పంచదశాధ్యాయము.

బుద్ధుఁడు మిక్కిలి మంచివాఁడైనను నట్టిమహానుభావునకుఁ
గూడ శత్రువులు లేకపోలేదు. అట్టి శత్రువులలో దేవదత్తుఁడు ము
ఖ్యుఁడు. అతఁడు బుద్ధునకు దగ్గఱచుట్టము. బుద్ధుఁ డప్పటికి వృద్ధుఁ
డయ్యెను. దేవదత్తుఁడు దురాశాపాశబద్ధుఁడై బౌద్ధసంఘమునకెల్ల
దాన యధికారి నై పరిపాలనము సేయఁగోరి బుద్ధునిస్థాన మాక్ర
మింపఁ దలఁచెను. బుద్ధుఁ డందుకు సమ్మతింపకపోవుటచే దేవదత్తుఁ
డు మగధరాజకుమారుఁ డయిన యజాతశత్రునితోఁ గలిసి కృత
కృత్యుఁడు కాఁదలంచెను. అప్పుడు మగధరాజ్యమును బింబిసారుఁ
డనురా జేలుచుండెను. అజాతశత్రుఁడు తండ్రిని రాజ్యభ్రష్టుని జేసి
తాను సింహాసన మెక్కఁ దలంచెను. బుద్ధుని పదభ్రష్టుని జేసి యా
పద మధిష్ఠింపఁదలఁచిన దేవదత్తుఁడును, బింబిసారుని బదభ్రష్ఠుని జేసి
యాపద మధిష్ఠింపఁదలఁచినయజాతశత్రుఁడును సమాన సంకల్పు లగు
టచే మైత్రి త్వరలోఁ గుదిరెను. కాని వారు పన్నినపన్నుగడ లెల్ల
నిష్ఫలము లయ్యెను. వారు బుద్ధుని జంపుటకుఁ గూడఁ బ్రయత్నిం
చినట్లు కనఁబడుచున్నది. లోకాతీతము లయిన మహాద్భుత కర్మము
లవలన బుద్ధుఁడు వారిబాఱిఁ బడకుండఁ దప్పె నని చరిత్రకారులు చె
ప్పుచున్నారు. అజాతశత్రు దేవదత్తులు బుద్ధుని వధియింపుమని పం
పిన నరహంతలు చేయఁదలఁచినపనిలో నెఱవేఱక పరాజయము నొం
దుటయేగాక భయకంపితులై జ్వరపీడితులయిరి. చంపుటకై వారు బు
ద్ధుని సమీపమునకు వచ్చినప్పు డాయన వారిని సాదరముగాఁ బిలిచి
నెమ్మదిగామాటలాడి ధర్మబోధము సేయ వా రాయన వాక్యామృత
మాస్వాదించి సాధువులై యాయనమతములోఁ గలిసిరి. దేవదత్త
ప్రేరితులయిన దుష్టులు మఱికొందఱు గౌతమునిఁ దెగటార్చుటకై

గొప్పరాయి విసర నదియామహాత్మునకుఁ దగులక యాయన పాద ములపైఁ బడెను. సిద్ధార్థుఁ డొకసందులోనుండి బోవుచుండ శత్రు ప్రేరితులయి కొందఱు దురాచారులు మదపుటేనుఁగు నొకదానినా యన మీఁదికిఁ దోలిరి. అది మహావేగముతో నాతని సన్నిధికిఁ బోయి యాయన జోలికిం బోక నిశ్చేష్టమై యెట్టయెదుట నిలిచి యొక్క నిముసంబున గిరుక్కున వెనుకకు మరలెను.

ఈవిధముగా జగద్గురు వయినబుద్ధుని నాశనము చేయఁదలంచి తనపరియత్నమునఁ గృతకృత్యుఁడు కాలేక దేవదత్తుఁడు మఱియొక తె అంగునఁ దనమనోరథము సాగింపఁ జూచెను. దేవదత్తుఁ డప్పటికి బౌద్ధుఁడ నని చెప్పుకొనుచుండుటంజేసి యొకనాఁడు బుద్ధుఁడు నివసించుచున్న వేలువనమున కరిగి ధర్మములయం దత్యంతాసక్తి కలవాఁ డుంబోలె నటించి యాతఁడు బోధించినధర్మముపరికారము సరిగా నెల్లవారు నడచుకొనుట లేదనియు నటు లెల్లవారు ధర్మమునుండితొలఁగకుండఁ గఠినముగా శాసింపవలయునని యుఁ గోరెను. అతనికోరిక లలో ముఖ్యమైన వివి—

1 భిక్షుకులు పట్టణముల సమీపములందు నివసింపక యూరుబైట నివసింపవలయును.

2 మనుష్యులు పాఱవైచిన చినుగుగుడ్డలు పేలికలు మొదలయినవి ధరింపవలయునే గాని వస్త్రములు ధరింపఁగూడదు.

3 భిక్షుకు లిల్లిల్లుఁదిరిగి భిక్షమెత్తి యుదరపోషణము చేసికొనవలయునే కాని గృహస్థులిండ్లకుఁ బోయి విందు లారగించుట, విహారములకుఁ బంపఁబడిన యన్నము దినుట, మాంసభక్షణముఁ గూడదు.

పూర్వోక్త ధర్మముల నుదాహరించుటలో దేవదత్తుఁడు బుద్ధునిఁగూడ నధిక్షేపించెను. బుద్ధుఁడు శిష్యులయిండ్ల విందు లారగించుట, పట్టణసమీపములయందు వసించుట మొదలగునవి కొన్ని చే

యునుండెను. అధిక్షేపణ గర్భములైన యాతనివాక్యముల నాలకించి బుద్ధుఁడు వాని కిట్లనియె. "ధర్మములు నెచ్చటనైన ననుష్ఠింపవచ్చును. గుడ్డపేలికలె కట్టుకొని భిక్షాటనమువల్ల జీవించి యూరుబైటనే వసించి ధర్మము కఠినముగా ననుష్ఠించు మహానుభావు లున్నపక్షమున నా కాటంకము లేదు. సంతోషమే కాని యెల్లవారికి నట్లు చేయ నవసరము లేదు. అదియునుఁగాక బాలురు, వృద్ధులు, సుకుమారశరీరులు నంతకఠినముగా ధర్మాచరణము చేయలేరు. ధర్మ మవలంబించినవారు తమతమ దేశములలో నేయే యాహారము తినుట వాడుకయో యా యా యాహారము భుజింపఁదగును. కాని, వారాఁకలి యైనప్పుడు మితభోజనముమాత్రము చేయవలెను. మనుష్యుఁడు చెట్టుమొదటఁగూర్చుండియుఁ బవిత్రుఁడు కావచ్చును. గృహమునందుండియుఁ బవిత్రుఁడు కావచ్చును. గృహస్థుఁడిచ్చిన వస్త్రములు కట్టినను సిద్ధుఁడు కావచ్చును. గుడ్డపేలికలు కట్టినను సిద్ధుఁడుకావచ్చును. మాంసము దిన్నను సాధువై యుండవచ్చును. ఎల్లవారు తినకపోయినను సాధువై యుండవచ్చును. నిర్వాణము బడయుట నాముఖ్యసంకల్పము. ఎల్లరకు నేకవిధమైనకఠిన ధర్మము శాసించుటవలన నిర్వాణమార్గాన్వేషకులు మిక్కిలి కష్టపడుదురు." బుద్ధునిపలుకులువిని దేవదత్తుఁడు భగ్నమనోరథుఁడై యచ్చోటువదలిపోయి యజాతశత్రునిసహాయమువలన నూతనసంఘమొకటి స్థాపించెను. క్రమక్రమముగా దానిలోఁగూడ బలువురు చేరిరి.

ప్రాచీనచరిత్రకారులు దేవదత్తునిచరమావస్థ నీవిధముగా వర్ణించిరి—

అత్తెఱంగున బుద్ధునిచేఁ దిరస్కరింపఁబడి దేవదత్తుఁడు గయకు సమీపంబుననున్న వనవిహారంబున కరిగెను. అచ్చట నతనిశిష్యులు నలుగురునతనిం గలిసికొనిరి. క్రమక్రమమున ననేకు లాయనం జేరిరి.

శిష్యగణము కాలక్రమమున నైదువందలయ్యెను. దేవదత్తుని బలగము నానాటికి వృద్ధియగుటఁ జూచి వారినెల్లఁ దనశిష్యులుగాఁ జేసికొనవలసినకాలము వచ్చిన దని తెలిసికొని బుద్ధుఁడు తనశిష్యులలో నగ్రగణ్యులగు సరిపుత్రుని, మగ్గలానుని పిలిచి దేవదత్తునివిహారము కడకుఁ బోయి యావచ్ఛక్తిని వినియోగించి యతని శిష్యులెల్ల నతని విడిచివచ్చునట్లుఁ జేయుమని చెప్పిపంపెను. అట్లగుఁగాకయని వారుపయనమై దేవదత్తునివిహారమునకుఁ బోయిరి. వారు పోవునప్పటి కతఁడు శిష్యగణపరివేష్టితుఁడై బుద్ధుఁడు బోధించినట్లే వారికి ధర్మబోధ సేయుచుండెను. ఆయిరువుర నతఁడు చూచి బుద్ధునితో విరోధపడి వారు తన్నుఁ జేరుటకు వచ్చియుందు రని భ్రమపడి లోపలికి రమ్మని యానతిచ్చెను. కాని దేవదత్తునిశిష్యులలోఁ బ్రధానుఁ డగుకోకిలకుఁడు వారు లోపలఁ బ్రవేశించుట కిష్టపడక వారు నేదేని యపాయము సేయుటకై వచ్చియుండవచ్చును గావున వారిని రానియ్యవలదని గురువుతోఁ జెప్పెను. కాని యాతనిమాట వినక దేవదత్తుఁడు వారిని రానిచ్చి తన కుడిప్రక్క సరిపుత్రుని, నెడమప్రక్క మగ్గలానుని గూర్చుండఁబెట్టుకొని బుద్ధదేవుఁడు ధర్మబోధ సేయునప్పుడన్యకౌండిన్యుఁడను శిష్యు నేస్థానమందు గూర్చుండఁ బెట్టుకొనునో యాస్థానమునందుఁ గోకిలకుని గూర్చుండఁ బెట్టుకొని యెల్లవిధముల బుద్ధు ననుసరింపవలె నని ధర్మోపదేశ మారంభించెను. అట్లు కొంతవఱకు దేవదత్తుఁడు బోధించినపిదప సరిపుత్రుఁడు దేవరవారలసినట్లున్నారు. నేను గొంతసేపు బోధించెద నని చెప్పి యాతని నూరకుండఁ బెట్టి తాను బోధనము చేయఁజొచ్చెను. అంతలో దేవదత్తుఁడు నిద్రబోయెను. అతనికి మెలకువ వచ్చునప్పటికి సరిపుత్రులయొక్క బోధమువలన నయిననేమి, మగ్గలానుని ప్రయత్నములవల్ల నయిననేమి దాదాపుగా శిష్యగణ మెల్ల నతనిని విడిచి పోయెను. శూన్యమయిన

తనవిహారము జూచి కోకిలకుఁడు చేసినహితోపదేశము వినసందుకుఁ దద్దయు విచారించి బెంగపెట్టుకొని దేవదత్తుఁడు జబ్బుపడెను. ఆరోగముచేత నతఁడు తొమ్మిదిమాసములు పీడింపఁబడెను.

అనంతర మతఁడు బుద్ధదేవుని సందర్శించి తనకావించిన దుష్కార్యముల సైరించి తనను వెండియు శిష్యుని జేసికొమ్మని ప్రార్థింపఁదలంచెను. బుద్ధుఁడు క్షమింపఁడు. వెళ్ళవద్దని శిష్యు లెంత చెప్పినను వినక బుద్ధుఁడు తనయెడల నెంతమాత్రము ద్వేషము వహింపలేదని స్పష్టముగాఁ జెప్పి తనమనోనిశ్చయమును మార్చికొనకపోయెను. అతఁడు దృఢనిశ్చయుఁ డగుటంజేసి శిష్యులు వాని నొకపల్లకిలోఁ గూర్చుండఁబెట్టి జతువనవిహారమునకుం గొనిపోయి పల్లకి నొకసరోవరతీరంబునంబెట్టి తాము స్నానముచేయుటకై చెలువులో దిగిరి. అదివఱకుఁ గొన్నిదినంబులనుండి మంచముమీఁదనుండి లేవలేకపోయినను దేవదత్తుఁడు బుద్ధుని సత్వరముగాఁ జూడవలె ననునాత్రముచేతఁ బల్లకినుండి క్రిందికిదిగి లేచి నడువఁ బోయెను. అతఁడు నేలపై నడుగు బెట్టఁగానే చుట్టుప్రక్కల నున్నకొండలమీఁద నుండి యగ్నిజ్వాల లెగసి వచ్చి యాతని శరీరము నాహుతి జేసికొనెనఁట. ఆమంటలు తన్నుఁ గబళించునప్పుడు దేవదత్తుఁడు "ఓబుద్ధుఁడా! నేను నీయెడల నపచారము చేసినను నాచుట్టరికమునుబట్టియైన నన్నురక్షింపుము రక్షింపు" మని వేఁడుచుఁ బ్రాణము విడచెనఁట. కొండల మీఁదనుండి యగ్నిజ్వాలలు ప్రసరించి వానిని గాల్చుట యతిశయోక్తియై యుండవచ్చును. బుద్ధుని జూడవలె నను మహాత్రముతో నతఁడు దుర్బలస్థితిలో నడిచి యుండవచ్చును. అందువలన మృతి నొంది యుండవచ్చును. బుద్ధునియెడలఁ దాను గావించిన మహాపచారములు జ్ఞప్తికిఁ దెచ్చికొని పశ్చాత్తప్తమనస్కుఁడయి కట్టకడపట బుద్ధునే శరణము వేఁడియుండవచ్చును.

## షోడశాధ్యాయము.



సిద్ధార్థుఁడు బుద్ధత్వము ప్రాపించినపిదప నేవిధంబునఁ బ్రత్యహముఁ దనజీవితముఁ గడపెనో తెలిసికొనుటకుఁ జదువరులలో ననేకులకుఁ గుతూహల ముండవచ్చును. అందుచేత నతని ప్రతిదినచర్య దొరికినంతవఱకు వ్రాయఁబడుచున్నది. బుద్ధుఁడు మతవ్యాప్తిచేయుటకయి దేశాటనము చేయునప్పుడు భక్తితత్పరులయిన యుపాసకులు ప్రీతిపూర్వకముగా సమర్పించిన విహారములయందు నివసించుచుండును. ఆవిహారములలో ముఖ్యమైనవి రెండు కలవు. అందు మొదటిది వేలువనవిహారము. ఇది మగధరాజధాని యగురాజగృహనగర సమీపమం దున్నది. మగధరాజగు బింబిసారుఁడు దీనిని బుద్ధునకు సమర్పించెను. రెండవది శ్రావస్తినగరమందలి జేతువనవిహారము. ఇది భక్తుఁడయిన యనత్పిండుఁడు సమర్పించినది. ఈరెండువిహారములు బుద్ధునకు మిక్కిలి ప్రీతికరములైనవి. ఈవిహారములయందే యతఁ డొకానొకప్పు డొంటిగాను మఱియొకప్పుడు శిష్యగణసమేతముగాను నివసించుచుఁ జాలకాలము గడపెను.

బుద్ధునిజీవితకాలము రెండుభాగములుగా విభాగింపఁబడవచ్చును. కొంతకాలము దేశాటనము చేయుట; కొంతకాలము విశ్రాంతి నొందుట. మహీమండలము నంతను దీవ్రాతపములచేఁ గాల్చునట్టి ప్రచండ గ్రీష్మముయొక్క యవసాన దశయందుఁ గ్రొక్కాఱుమబ్బులు నభోవీథి నావరించి ధణంధణధ్వానములతో నుఱుము సమయమున దేశములు సంచారయోగ్యములు కావని బుద్ధుఁడు వర్షాకాల మేదో యొక్కవిహారమునఁ గడుపఁదలఁచి యచ్చటికరుగుచుండును. ఆవర్షాకాలము తమగురుని సన్నిధానమునఁ గడుపవల

యు ననుకుతూహలమున శిష్యులు వందలకొలఁది యతఁడున్న విహారమునకుఁ బోవుచుందురు. ఇప్పటివలెఁ గాక పూర్వపువర్ష కాలము మిక్కిలి భయంకరమైయుండెను. ఇప్పటివలెఁ జక్కని బాటలు గాని పడవలు నడుచునట్టి కాలువలు గాని లేకపోవుటచే వానకాలమునఁ బ్రయాణములు దుస్సాధ్యములు. వానలుకూడ నిప్ప టివలెఁ గాక సంతతధారగాఁ గురియుచుండును. అందుచే భిక్షుకులు సన్యాసులు మొదలగువారు వానసావినాలుగునెలలు చాతుర్మాస్య లను పేరుపెట్టి యేదోయొక నెలవునఁ గడుపుదురు. ఆసాంప్రదాయ మునుబట్టియే నేఁడుసైతము సన్యాసులు చాతుర్మాస్యదినములలో నొకచోటినుండి మఱియొకచోటికిఁ గదలఁ గూడదని నాలుగుమా సము లొక్కగ్రామముననే పుచ్చుచుందురు. ఈనియమముయొక్క యుద్దేశము మిక్కిలి మంచిది. సన్యాసులకు నివసించుటకు గృహ ములు గాని వస్త్రములు తడిసినప్పుడు కట్టుకొనుటకు మాఱుబట్టలు గాని వర్షమునుండి కాపాడుటకు గొడుగులుగాని లేకపోవుటచే వర్ష కాలదినములు వారికి ముఖ్యముగా సంచారయోగ్యదినములు కావు. ఇది చక్కఁగాఁ బర్యాలోచనము చేసి బుద్ధుఁ డీనియమ మేర్పఱచి యుండవచ్చును. అదే మనధర్మశాస్త్రకర్తలుకూడ నవలంబించియుం దురు. బౌద్ధసంఘము నిమిత్త మేర్పడినవిహారములలో వానకాలమున బుద్ధదేవునిచుట్టుఁ జేరిన శిష్యగణమునకును గురువునకును నానాలుగు నెల లాతిథ్యమిచ్చుట గొప్పగౌరవమనియు నది యదృష్టవంతులకే గాని లభింపదనియు భావించి మహైశ్వర్యవంతులును మహారాజాధి రాజులును, బుద్ధుఁడు మా కతిథికావలె మాకతిథికావలె నని పంత మాడుకొని తద్గౌరవము నిమిత్తమై బహుప్రయత్నములు సేయుచు వచ్చిరి.

వానకాలము ముగిసినతోడనే మరల సంచార మారం

భమగును. బుద్ధుఁడొకగ్రామమునుండి మఱియొకగ్రామమునకు నొక పట్టణమునుండి మఱియొక పట్టణమునకు బహుశిష్యగణములు సేవించుచుండఁ బయనము చేయుచుండును. ఆయన తఱచుగా సంచరించిన దేశ మార్యావర్త మందలి తూర్పుభాగ మని చెప్పనచ్చును. తూర్పుభాగ మనఁగాఁ గాశీ కోసల మగధదేశములు. ఈ దేశములు నేఁటికాలమున నయోధ్య బిహార్ దేశము లని వ్యవహరింపఁబడుచున్నవి. ఈపరిమాణములలో బుద్ధదేవుని శిష్యులను సంపన్నులయిన గృహస్థులు తరుచుగా విందునకుఁ బిలుచు చుందురు. ఎవరయినను వచ్చి లేన్న భోజనమున కాహ్వానము చేసినప్పుడు బుద్ధుఁడు వారికుత్తరము చెప్పక మౌనము ధరించి వారి యాహ్వాన మంగీకరించి తన కావినిలువుటంగిఁ దొడుగుకొని భిక్షాపాత్రము చేతఁబూని వారియింటికరుగుచుండును. భోజనానంతరమున గృహయజమానుని విందునకు వచ్చిన బంధుమిత్రులను నొకచోఁ జేర్చి ముక్తిమార్గబోధకములు, నీతిపరిదర్శకములు నగు ధర్మముల నుపదేశించుచుండును. తన్నెవరు భోజనమునకుఁ బిలువనప్పుడు తాను చేసిననియమముల ప్రకారము భిక్షాపాత్రము చేతఁబూని బిచ్చమునిమిత్తము గ్రామమంతయుం దిరుగును. అట్లు తిరుగుటలోఁ బ్రతిగృహంబునకుంబోయి భిక్షాపాత్రము చేతఁబట్టుకొని యింటివారొక్క కబళమన్నముఁ దెచ్చి వేయువఱకు మౌనము ధరించి గుమ్మము ముందఱ నిలుచును. భోజనమైన తరువాత నతఁడు సాధారణముగా విహారములో నొకగదిలోఁగాని మఱ్ఱిచెట్టునీడను గాని కూరుచుండి కొంతసేపు ధ్యాననిష్ఠుఁడై యుండును.

బుద్ధదేవుఁడు నిర్వాణపథము బ్రోధించువఱకు నీవిధముగానే ప్రతిసంవత్సరముఁ గడుపుచుండును.

బుద్ధుఁడు గ్రంథములేవియు వ్రాయలేదు. మతబోధమైనను

వాగ్రూపకముగాఁ జేసెనేగాని లిఖితరూపకముగాఁ జేయలేదు. మత బోధ జేయునప్పు డాయన సంస్కృతభాష నుపయోగింపక తాను సంచరించుచున్న దేశములలో నేభాష వ్యవహారములోనుండునో యాభాషలోనే ధర్మములు బోధించుచుండును. మన మతగ్రంథము లయిన వేదములు, తదంగములు, స్మృతులు, సూత్రములు మొద లగు శాస్త్రములు, పురాణములు, గీర్వాణభాషలోనే యున్నవి. అవి పండితగ్రాహ్యములే గాని పామరగ్రాహ్యములు కావు. వాని నభ్య సింపఁ దలఁచువారికి వారి కుపాధ్యాయులు గీర్వాణభాషలోనే వాని నుపదేశించుట యాచారమై యుండెను. దేశభాషలో సర్వజనసుల భమైన శైలిలో మతధర్మములు మనపాచీను లెన్నఁడుఁ జేయ లేదు. మన దేశములో మతబోధకులే లేరు. దేశభాషలో జేయువా రు మొదలేలేరు. మొట్టమొదట దేశభాషలో జనసామాన్యమునకుఁ దెలియునట్లు మతము బోధించిన మహానుభావుఁడు మతబోధకుల నే ర్పఱచి నానాభాగముల కంపిన మహాశయుఁడు ప్రపంచమున బుద్ధదే వుఁడే యని చెప్పుట యతిశయోక్తి కాదు. బుద్ధదేవుని తరువాత నాసియాఖండమున గొప్ప మతబోధకుఁ డని చెప్పఁ దగిన జీససు క్రైస్తు మతబోధకులను నియమించి పంపెను గాని యతఁడును గౌ తమునిమార్గ మనుసరించె నని చెప్పుట సత్యమునకు గౌరవమునకు దూరముకాదు. ఏలయన జీససుపుట్టినప్పటికే పాలస్టైన్ దేశమునందును దాని పరిసరంబులనుండు దేశములందును బౌద్ధమతము వ్యాపించి యుండెను. బుద్ధమతబోధకు లచ్చటచ్చటనుండిరి. జనుల మాతృభా షలో ధర్మములు బోధింపఁబడినపక్షమున నవి జనులకుసులభగ్రాహ్య ములయి మనంబున నాటి వారి మనస్సులను ధర్మపరాయణములుగఁ జేయునను గొప్పరహస్యమును మొట్టమొదటఁ గనిపెట్టినచతురమతి గౌతమబుద్ధదేవుఁడే. బుద్ధుఁడు తఱుచుగా నుపయోగించినభాష పాలీ

భాష. ఇది యీయన మాతృభాషయై యుండవచ్చును. లేకయాయన సంచరించిన కాశీ కోసల మగధాదిదేశములం దాకాలమున వ్యవహరింపఁబడిన భాషయైనఁ గావచ్చును. ఈయననోటనుండి వెడలిన సమస్తధర్మోపదేశములను శిష్యులు జ్ఞాపక ముంచుకొని పాలీభాషలో వ్రాసిచూచినందున నతఁడు సంచరించినదేశములలో నదేభాష వ్యవహరింపఁబడిన దని మన మూహింపవచ్చును. ఆమహాత్ముఁడు కావించిన బోధనలలోఁ గొన్ని పాలీగ్రంథములలోఁ గనఁబడుచున్నవి. అందొక టిక్రింద నుదహరింపఁబడుచున్నది.

"ఓశిష్యులారా! ప్రతివస్తువు దగ్ధ మవుచున్నది. దగ్ధమగుచున్న వస్తువేది? కన్ను దగ్ధమగుచున్నది. ఆకంటిచేఁ జూడఁబడువస్తువు దగ్ధమగుచున్నది. దృశ్యమాన పదార్థజ్ఞానము దగ్ధమగుచున్నది. దృశ్యమానపదార్థసంబంధముగూడ దగ్ధమగుచున్నది. దృశ్యమానపదార్థసంబంధమువలనఁ గలుగు మనోవికారము సంతోషముగాని, బాధగాని, సంతోషముగాకపోనీ, బాధగాకపోనీ, యెదియైనను సరె యదికూడ దగ్ధమగుచున్నది. అది యేయగ్నిచేత దగ్ధమాచున్నది? కామాగ్నిచేత, క్రోధాగ్నిచేత, మోహాగ్నిచేత నదిరవులుకొనుచున్నది. అంతియేగాదు. అది జన్మముచేత ముదిమిచేత మరణముచేత బాధచేత రోదనముచేత దుఃఖముచేత విచారముచేత నిరాశచేత నది రవులుకొని మండుచున్నది. ఆలాగుననే మనచెవికూడ దగ్ధమవుచున్నది. శ్రవ్యమానదెల్ల దగ్ధమగుచున్నది. శ్రివ్యపదార్థజ్ఞానము కూడ దగ్ధమగుచున్నది. శ్రివ్యపదార్థసంబంధముకూడ దగ్ధమగుచున్నది. శ్రవ్యపదార్థసంబంధము వలన గల్గుమనోవికారము సంతోషముగాని బాధకాని సంతోషము గాకపోనీ బాధగాకపోనీ యేదియైననుసరే యదికూడ దగ్ధమగుచున్నది. అది యేయగ్నిచేతదగ్ధమగుచున్నది. కామాగ్నిచేత, క్రోధాగ్నిచేత, మోహాగ్ని

చేత, నిది రవులుకొనుచున్నది. అంతియేగాదు. అది జన్మముచేత, ముదిమిచేత, మరణముచేత, బాధచేత రోదనముచేత దుఃఖముచేత విచారముచేత నిరాశచేత నది రవులుకొని మండుచున్నది."

ఆయనమతములోఁ జేరుటకుఁ గాని యాయన సిద్ధాంతము లేవో తెలిసికొనుటకుఁగాని యెవ్వఁడయినవచ్చి యాయన దర్శనము చేసినప్పుడు బుద్ధుఁడు వానిం బిలిచి లోకవ్యవహారమందు దయా ధర్మములుగలిగి ఋజుమార్గమునఁ బ్రవర్తింపుమని వానినిముందుగ హెచ్చరించుచుండును. ఇహమున మంచివర్తనముగలిగి పరివర్తించు వానికిఁ బరమున నక్షయమగుసుఖము గలదని యాయన నొక్కి చెప్పుచుండును. తనమాటలు వానిమనస్సున నాఁటి కొంతపనిచేసిన వని తోఁచినప్పు డాయన వానిమనస్సు పరిపక్వమైనదని తెలిసికొని బుద్ధులసిద్ధాంతమైన జన్మపరంపరామోక్షమునుగూర్చి యుపన్యసించు చుండును. ఇది యాయనబోధలో రెండవపద్ధతి. ఇదికాక సంభాష ణములవల్లను, బరిశోత్తరములవల్లనుగూడ నతఁడు నిజసిద్ధాంతము ల బోధించుచుండును. ఇది మూఁడవ పద్ధతి. అందు కీ క్రిందిదొక యుదాహరణము.

"ఒకనాఁడు బుద్ధుఁడు భిక్షాటనము సేయుచుఁ దనకుఁ బ్రియ శిష్యుఁడుఁ బరమభక్తుఁడైనయనత్పిండుని గృహమునకు వచ్చెను. అక్కడ నతనికి నొకవిధమైన కయ్యము, బిగ్గరగా మాటలాడుట మొదలైనవి వినఁబడ నతఁడు గృహయజమానునిఁజూచి "యేమి! నీ యింట రోదనధ్వని వినఁబడుచున్నది. బెస్తవాండ్రు బుట్టలో నుండి చేపలు దొంగలింపఁబడినప్పుడు పోడమునంతకలకలము పోడము చున్నది" యని యడిగెను. అనవుడు బుద్ధునితో గృహస్థుఁడిట్లనియె "స్వామీ! భాగ్యవంతుఁడైన గృహస్థునికోడ లిక్కడికి వచ్చెనది. ఆమె మగనిమాట మన్నింపదు. అత్తమామల కడకువ సేయదు.

అంతియె కాదు. బుద్ధుని యెడఁగూడ వినయమును జూపనొల్లదు." అప్పలు కలువిని బుద్ధుఁ డాబాలికం బిలిచి "బిడ్డా! సుజాతా! యిటురా" యని పిలిచెను. చిత్తము స్వామీ! యని యామె యగ్గరకుఁ బోయెను. పిమ్మ టయు నామె కతఁ డిట్లనియె. బాలికా! మగవాని కేడు తెఱఁగుల యిల్లాండ్రుందురు. ఆయేడుగు రెవ్వ రంటివేని విను. ఒకతె హంతకు రాలువంటిది. రెండవది దొంగవంటిది. మూఁడవది యుంపుడుకత్తె వంటిది. నాల్గవది తల్లివంటిది. ఐదవది తోఁబుట్టువువంటిది. ఆఱవది మిత్రినువంటిది ఏడవది దాసివంటిది.

సుజాతా! మగవానికుండునట్టి యేడు తెఱంగులకళత్రములివి. నీ విందులో నే తెఱఁగులో జేరినదానవు? అనవుడు సుజాత యతని సాన్నిధ్య విశేషముచేతనో వచోమాధుర్యముచేతనో యెందుచేతనో తొంటి మొఱకుఁదనము విడచి వినయభావమున నిట్లని విన్నవించె.

"స్వామీ! దేవరవారు సంగ్రహముగా సెలవిచ్చిన విషయ ములు నాకు బోధపడలేదు. కావున దేవరవారు సంగ్రహముగాఁ జెప్పిన విషయములే నాయందనుగ్రహించి నాకు సవిస్తరముగాఁ దెలియునట్లు జెప్పవలె" నని వేఁడుచున్నాను.

అనుటయు బుద్ధుఁ డామెయందు దయగలిగి యా యేడు తెఱఁ గుల యిల్లాండ్రను వర్ణించిచెప్పి యాయేఁడుగురిలో నీ వెవతెవయ్యెద వని మరల నడిగెను. అనుగుటయు సుజాత "దేవా యీ నెనము మొదలుకొని నేను నా భర్తకు దాసినయ్యెద" ననిచెప్పెను.

పూర్వోదాహృతము లయిన మూఁడువిధములుగం గాక యుప మానములవల్లఁగూడ బుద్ధుఁడు తనధర్మముల బోధించుచుండును. ఈ క్రింది యుదాహరణము దానిని వ్యక్తపఱచును.—

"శిష్యులారా! ఒక కొండక్రింద నడవిలో నీటితో నిండినపల్లపు నేల యున్నది. దానిసమీపమున గొప్పలేళ్ళమంద గలదు. ఈలేళ్లకు

నపకారముఁ జేయుతలంపుతో నొక దుష్టుఁడు క్షేమమయి మనోహర మయి సుగమ మయిన మార్గమును మూసివైచి బురద గలిగి దుర్గ మమై గోతులతో నిండినతప్పుదారి వాటినిమిత్తమై యేర్పాటు చేయును. అది మొదలుకొని యా పెద్దమంద హానిజెంది క్రమక్రమ ముగా నశించునుగదా! అట్లుండ నొక సజ్జనుండు వచ్చి లేళ్ళకు క్షేమ కరమయి యభివృద్ధికరమయిన యేర్పాటులు చేయఁదలంచి క్షేమకర మయి మనోజ్ఞమైయున్న మంచిమార్గంముం దెఱచి తప్పుదారిం గప్పి పుచ్చి బురదనేలఁ గనఁబడకుండఁ జేసినపక్షమున లేళ్ళమంద వృద్ధి జెంది సుఖించునుగదా! నాచెప్పఁ దలఁచిన విషయమందలి యర్థము మీకుఁ గథారూపమునఁ జెప్పితిని. ఇదిగో దానిపరమార్థము వ్యక్త ముచేయుచున్నాను. వినుఁడు! నీటితో నిండినపల్లపునేల భోగము. లేళ్ల మందయనఁగా మానవకోటి. హానిచేసి దుఃఖనాశనములను గలుగఁ జేయుమనుష్యుఁడు మహాదురాత్ముఁ డైనమారుఁడు. తప్పుదారి యనఁగా నెనిమిది తెఱఁగులనున్న చెడుత్రోవ. ఆ యెనిమిది తెఁఱగు లెవ్వి యననివి.— 1 పాపమార్గము, 2 పాపనిశ్చయము, 3 పాప సంభాషణము, 4 పాపకార్యము, 5 పాపజీవనము, 6 పాపప్రయత్నము, 7 పాపాలోచనము. 8 పాపస్వభావము. ఆపాడుదారిభోగము, కామము. అజ్ఞానమే యా బురదనేల.

---

## సప్తదశాధ్యాయము.

బుద్ధుఁ డెనుబదియేండ్లవాఁ డైనప్పు డనఁగా నతఁడు నూతన మతస్థాపనముఁ జేసిన నలుబదియైదవయేట శ్రావస్తినగరమునుండి రాజగృహంబునకు వచ్చి గృధ్రశిఖర మనుకొండమీఁద బసచేసెను.

అక్కడ నున్నకాలముననే యామహాత్ముఁడు ఋజుమార్గ వర్తనముఁ గూర్చియు ధ్యాననిష్ఠంగూర్చియు, బుద్ధింగూర్చియు భిక్షువులతోఁ జర్చించి కొన్నియుపన్యాసముల నిచ్చెను. అట్లు కొంతకాల మచ్చట నుండి యాతఁడు తనప్రియశిష్యుఁ డయిన యానందునిం బిలిచి "ఆనందా! మన మిప్పు డంబలీతిహగ్రామమునకుఁ బోవుదము. రమ్మ"ని పిలిచెను. ఆనందుఁడు తక్కిన శిష్యులు వెంటరా నతఁ డచ్చటనుండి నలందపురమునకుంజని యొక మామిడితోఁటలో బస చేసెను. అనంతరము సిద్ధార్థుఁ డచ్చటనుండి పాటలీగ్రామమునకుఁ బోయెను. తరువాత నిదియే పాటలీపుత్రమని పేరువడసి చంద్రగుప్తాశోకప్రముఖ మౌర్యరాజులకును సుంగకాన్వాంధ్ర వంశస్థ రాజులకును రాజధానియై లోకప్రఖ్యాతి గాంచెను. కాని బుద్ధుని కాలమున నది యొక చిన్నగ్రామము. అందుకే యది పాటలీగ్రామ మనుపేర వ్యవహరింపఁబడెను. పాటలీగ్రామ సమీపమునకు జగద్గురుఁడు వచ్చె నని వినినతోడనే శిష్యులు సంతోషభరితస్వాంతులయి యాతఁడు విడిసిన నెలవునకుం జని, భయభక్తులతో నతనిచుట్టు గూర్చుండి తమ గ్రామమునకు వచ్చి యచ్చట నున్న సత్రమున బస చేయుమనివేఁడిరి. బుద్ధుఁ డందు కొడంబడెను ఆతఁడు సత్రమునకుఁ బోవుచుఁడ శిష్యులతనికి నమస్కరించి కుడిప్రక్క నాయనకును బోవ నిచ్చి యెడమప్రక్కను దారు జనిరి. ఆ సత్రము సమస్త విధముల చేత జగద్గురువునకు వాసయోగ్యముగా నుండునట్లు జేయుటకై యాసనములువైచి కుండలలో నీళ్ళుపెట్టి దీపమిచ్చి శక్యమైనన్ని సౌకర్యములు వా రొనఁ గూర్చిరి. అన్నియు సిద్ధమయినవెనుక వా రాయన సమీపమునకుఁ బోయి నమస్కరించి "దేవా! సర్వము సిద్ధమయినది. మీరు చేయఁదలఁచినకార్యము చేయుటయే కొఱత" యని విన్నవించిరి. విన్నవించుటయు నతఁడు తనకాషాయ వస్త్రములు

ధరించి భిక్షాపాత్రము కేలఁబూని భిక్షుగణము తన్ననుసరించి రా సత్రముఁ బ్రవేశించి పాదప్రక్షాళనము జేసి నడిమిచావడిలోనికింజని మధ్య స్తంభమునకుఁ జేరఁబడి తూర్పు మొగముగాఁ గూర్చుండి పాటలీగ్రామశిష్యుల నుద్దేశించి యీ క్రిందివిధమున నుపదేశించెను.

"ధర్మశూన్యతచేత దోషి యైదువిధము లయిననష్టములఁ బొందుచున్నాఁడు. మొట్టమొదట దోషి ధర్మరహితుఁడై సోమరిపోతై దరిద్రుఁడగును. తరువాత నతని యపఖ్యాతి లోకమున మిక్కిలివెల్లడియగును. పిమ్మట నతఁడు బ్రాహ్మణులయొద్దకుఁ గాని ప్రభువుల యొద్దకుఁ గాని గృహస్థులయొద్దకుఁగాని శ్రమణులయొద్దకుఁ గాని వాఁడెవరియొద్దకుఁ బోయినను, నేసంఘమునఁ బ్రవేశించినను, మిక్కిలి తొట్రుపడి భయముతోఁ బోవును. అతఁడు చనిపోవునప్పుడు మిక్కిలి మనోవ్యధతో మృతిఁబొందును. ఇది నాల్గవది. కడపట నతఁడు మరణానంతరము మోక్షమునందలేక పాపశేషమనుభవించుటకేదో యొకపాడుజన్మమెత్తి నానావస్థలపాలగుచుండును. ఓగృహస్థులారా! పాపాత్ము లనుభవించునట్టి యైదువిధముల నష్టమిది.

ఓగృహస్థులారా! ధర్మపరాయణుఁ డైదువిధములయినలాభములొందును. ధర్మతత్పరుఁడగుటచే కాయకష్టపడి భాగ్యవంతుఁడగును. తరువాత నతని విషయమై సుప్రతిష్ట లోకమున వ్యాపించును. పిమ్మట నతఁడు బ్రాహ్మణుల కడకుఁగాని, ప్రభువులయొద్దకుఁగాని, గృహస్థులకడకుఁగాని, శ్రమణులయొద్దకుఁగాని, యెక్కడకుఁ బోయినను నేసంఘమునఁ బ్రవేశించినను, గావలసినంత మనోధైర్యముతోను నాత్మవిశ్వాసముతోను బోవును. మనోవ్యధలేక మృతినొందును. మరణానంతరమున స్వర్గమున మంచిదశలో జన్మించును. ఓగృహస్థులారా! యివియే ధర్మనిరతుని పంచవిధలాభములు."

ఇట్లు సిద్ధార్థుఁడు శిష్యులకు నీతినేర్పి యానందభరితస్వాంతు

లఁజేసి సత్కార్యములకుఁ బురికొల్పి యజ్ఞాననిద్రనుండి ప్రబోధిం చునప్పటికి రాత్రిచాలఁప్రొద్దయ్యెను. అప్పు డాయన వారినుద్దేశించి "గృహస్థులారా! రాత్రిమిక్కిలి యతిక్రమించిపది. ఇఁక మీపనుల మీఁద మీరు పొండని యానతిచ్చెను.

బుద్ధుఁడు ప్రాతఃకాలముననే లేచి పాటలీగ్రామమునఁ గట్టఁ బడుచున్న యొకకోటను జూచి "ఆనందా! పాటలీ గ్రామమునఁ గోట కట్టుచున్నవా రెవ్వ"రని యడిగెను.

"దేవా! మగధరాజమంత్రులగు సునీథుఁడును, వైశాఖరుఁడు ను, రాజ్యశత్రులగు వజ్జ్యులను రాష్ట్రములోనికి రాకుండఁ జేయుటకై యీకోట కట్టుచున్నా"రని యానందుఁ డుత్తరము చెప్పెను.

అనవుఁడు బుద్ధుఁ డి ట్లనియె. "ఈపాటలీగ్రామము మిక్కిలి ప్రసిద్ధమైననగరమై సమస్తవ్యవహారస్థులకు నిలయమై, సమస్తవస్తువుల క్రియవిక్రయములకు స్థానమై, ముఖ్యనగర మవును. కాని, యీనగ రమున కగ్నిపీడ, జలపీడ. యంతఃకలహపీడ యనునట్టి మూఁడాపద లు వచ్చును."

నాఁడు బుద్ధదేవునినోట వెడలినయామాట లాపట్టణవిషయ మున నక్షరాల జరిగెను. బుద్ధదేవుఁడు పాటలీగ్రామమునకు వచ్చినాఁ డని విని యాయిరువురు మగధరాజమంత్రు లాయనను సందర్శించి నమస్కరించి "మహాత్ముఁడయిన బుద్ధదేవుఁడు శిష్యగణసమేతము గావచ్చి మాగృహమున భిక్షసేయవలెనని వేఁడుచున్నా" మనికోరి. ఎవ రయినఁ దన్ను భిక్షకుఁ బిలిచినప్పుడు మౌనముతో దానినంగీక రించుటయే బుద్ధున కాచారము గావున నతఁ డప్పులుకులు విని యూరకుండి వారియింటికిఁ జని యచ్చట భిక్షసేసి యాగ్రామము విడిచిపోయెను. పోవునప్పుఁడు మంత్రులు కొంతదూర మాయనను సాగనంపి యిట్లనిరి. "గౌతమశ్రమణుఁడు పోయినద్వారము గౌతమ

ద్వారమనియు, నతఁడు నదిదాఁటిన రేవు గౌతమతీర్థమనియు, నిఁక ముందు వ్యవహరింపఁబడుఁగాక!"

గౌతముఁడు గంగానది దాఁటి శిష్యులతోఁగూడి "కోటి" గ్రామమునకుఁ బోయెను. భాగీరథీనది నుత్తరించుటలో నొకమహాద్భుతము గౌతమునిచేతఁ గావింపఁబడె నని బౌద్ధపురాణకథలలో నున్నది. అది విశ్వాసపాత్రము గాకున్నను చిత్రముగా నుండుటచే నీ క్రిందఁ జేర్పఁబడు చున్నది.

గంగానది దాఁటుటకు బుద్ధదేవుఁడు పోవునప్పటి కానది పొంగి నిండి వఱదలోనుండెను. అద్దరికిఁ బోవుటకు శిష్యులు తగినసాధనముల వెదకికొనఁజొచ్చిరి. కొందఱు నావలకయి యత్నించిరి. కొందఱు దూలములకయి ప్రయత్నించిరి. కొందఱు తెప్పలు సంపాదింపఁ జూచిరి. అప్పుఁడు బుద్ధదేవుఁడు దృఢశరీరుఁడు చేయిచాపి మరలముడిచికొనుట కెంతసేపుపట్టు నంతలో నిద్దరినుండి యద్దరికి నొక్కనిముసములోఁబోయి యవ్వలిగట్టున శిష్యగణసమన్వితుఁడై నిలిచెనఁట!

తర్వాత నతఁడు నదికగ్రామమునకుఁ బోయి యచ్చటఁ గొంత కాలముండెను. అనంతర మతఁడు వేసాలిపురమున కరిగి "యంబపల్లి" యను నొకవేశ్యాంగనయొక్క మామిడితోఁటలో విడిసెను. బుద్ధదేవుఁడు వేసాలిపురమునకు విచ్చేసెననియు, నందుఁదనమామిడితోఁటలో విడిసెననియు, నంబపల్లివిని, బండి నడుచుటకు వీలైనంత దూరము బండిమీఁదఁబోయి యచ్చటదిగి యామహాత్ముని సన్నిధికిఁ గాలినడకనేపోయి పాదాభివందన మాచరించి సవినయంబుగ నుపాసీన యైయుండ సిద్ధార్థుఁడు పరమార్థంబుల నుపదేశించి దానిని సంతోషపెట్టెను. "దేవా! భిక్షుకభ్రాతృవర్గముతోఁగూడ దేవరవారు నా యింటభిక్షచేసి నన్ను గారవింతురుగాక" యని యామె వేఁడికొనెను. మౌనముచేతనే బుద్ధుఁడు భిక్ష నంగీకరించెను.

వేసాలిపురమందున్న ధనవంతులు ప్రభువులు సౌగతుఁడుతమ పురమునకు వచ్చెనని విని యతఁడున్న సహకారవనమునకుఁ బోయి తమ గృహములకు రమ్మని యాహ్వానముచేయఁదలఁచిరి. కాని యంబపల్లి యాగౌరవమును సంపాదించి చరితార్థురాలయ్యె నని వారికిఁ దోవలోనే తెలియుటంజేసి వారు మామిడితోఁటకుంజనక యంబపల్లియొద్దకేపోయి "యంబపల్లీ! యీభిక్షుమాకువదలివేయుము. నీకు లక్షనాణెము లిచ్చెద" మని బ్రతిమాలిరి. వారికంబపల్లి యిట్లనియె—'అయ్యా! లక్షరూకలు గాదు. వేసాలిరాజ్య మంతయు నా కిచ్చినను నే నీభిక్షును విడువను.'

అప్పలుకుల కులికి యాసంపన్నులు దీనితో నేమి బుద్ధుని యొద్దకే బోవుద మని నిశ్చయించి యాతనిసన్నిధికిం జని పాదములకు నమస్కరించి, 'స్వామీ! దేవరవారు శిష్యులతోఁ గలిసి మాయింట భిక్షఁ జేయవలయు' నని వేఁడిరి. 'నే నంబపల్లియింట భిక్ష సేయుదు నని మాట యిచ్చితి' నని బుద్ధుఁడు ప్రత్యుత్తర మిచ్చి వారి కోరిక నిరాకరింప విషాదపూరితమనస్కులై వారు మరలిపోయిరి.

మఱునాఁడుదయమున నతఁడు కావివలువలు గట్టి భిక్షాపాత్రి హస్తమునం దాల్చి సశిష్యుఁడై యంబపల్లి నెలవునకుం బోయి తన నిమిత్తము నిర్దిష్టమైన యాసనమునఁ గూర్చుండెను. అంబపల్లియు రొట్టెలు, మధురపదార్థములు మున్నగుపలువంకటములు వడ్డించి సమస్తోపచారములు చేసి వారు వలదు వలదనువఱకు బలవంతపెట్టి మఱిమఱి వడ్డించెను.

సిద్ధార్థుఁడు భోజనము చేసినతరువాత నంబపల్లి చిన్నపీఁట వైచికొని బుద్ధుని సమీపమునఁ గూర్చుండి 'స్వామీ! యీనాగృహము భిక్షుకులయుపయోగము నిమిత్త మిచ్చివేసితిని పరిగ్రహింపుఁ' డని వేఁడుకొనెను. బుద్ధుఁడాగృహముఁ బరిగ్రహించెను.

ఆయన వేసాలిలో నుండఁగానె వర్షకాల మారంభమయ్యెను. అప్పు డాయన నిజానుచరుల కిట్లనియె. 'ఓభిక్షుకులారా! ఈవాన కాలు నేను వేలువనమందుఁ గడపెదను. మీరును వేసలిచుట్టుపక్కల మీకనుకూలములైన మిత్రగృహములలోను బరిచితగృహములలోను వసియించి కాలము పుచ్చెదరా?'

'చిత్త మాలాగే యగుఁగాక' యని భిక్షుకు లుత్తర మిచ్చివారి వారి కనుకూలములగు తావుల నివసింపఁబోయిరి.

అనుచరు లీతెఱంగున వేసాలీపరిసరగ్రామముల వసింపఁ బోయినపిదప గౌతముఁడు ప్రియశిష్యుఁడైనయానందునిఁ దోడ్కొని వానసావి నాలుగునెలలు గడపుటకు వేలువనమున కరిగెను. ఇదియే యతనికట్టడపటి ప్రయాణము.

---

## అష్టాదశాధ్యాయము.

---

ఆసంవత్సర వర్షాకాలమున బుద్ధదేవుఁడు తన యాప్తబాంధవుఁడును, బ్రియశిష్యుఁడునైన యానందునిఁగూడి వేలువనమందున్నప్పు డాయనకు జబ్బు చేసెను. ఇదియే యాయన జబ్బుపడుటకు మొదలు. ఆయనశరీరస్థితి యంతకంతకుఁ జెడిపోయెను. చూచువారల కామహాత్ముని చరమదశ సమీపించినట్లు కనఁబడెను. అప్పుడాయన తనలో నిట్లు తలంచెను. "కట్టకడపటిసారి నాశిష్యుల కుపదేశము జేయక నే నీలోకము విడుచుట ధర్మముకాదు. అందుచేత నేను గాఢమైన మనోబలముచేత నీరోగమును జయింపవలెను." అని నిశ్చయించుకొని నాఁడుమొదలుకొని క్రమక్రమముగ రోగవివర్జితుఁడు కాఁజొచ్చెను. సంపూర్ణారోగ్యము వచ్చినతరువాత నతఁ

డు విహారమునుండి యీవలకువచ్చి యానందుఁడు తన నిమిత్తము పఱచిన యాసనము మీఁదఁ గూర్చుండెను. అచ్చట ననేకులు చేరిరి. కాని, ముందుగా వారెవ్వరుం బలుక లేదు. అప్పు డానందుఁ డిట్లనియె "ప్రభువా! దేవరవారు సంపూర్ణమైన యారోగ్యదశలో నుండఁగా నీకన్నులతోనే చూచితిని. దేవరవారు రోగపీడితులగుట యు నీకనులతోనే చూచితిని. ఈమహానుభావునిరోగముఁ జూచి బెంగచేత నాశరీరము తీఁగవలె దుర్బలమైనను నాకాశ మంతయు నాకన్నుల కంధకార బంధురమైనను, నా తెలివి తేటలు మందగించినను నీమహాత్ముఁడు ధర్మమునుగూర్చి కట్టకడపట దేహత్యాగము చేయఁడని నామనంబున నొకనమ్మిక తోఁచెను. ఆనమ్మికతో నాకుఁ గొంతధైర్యము కలిగెను.'

అట్లానందుఁడు పలుకుటయు సిద్ధార్థుఁ డిట్లనియె. 'ఆనందుఁడా! శిష్యగణము నాయొద్దనుండి యేమి యపేక్షించుచున్నది? బహిరంగమనియు, నంతరంగమనియు, భేదములు చేయక నే నెల్లప్పుడు సత్యముపదేశించితిని. గుప్పిడిబిగఁబట్టి విప్పక సత్యము కొంత చెప్పి తథాగతుఁడు కొంత గోప్యమని దాఁచువాఁడుకాఁడు. మతస్థులకందఱకు నేనే నాయకుఁడను. మతమునకు నేనే యాధారము నని తలంచువాఁ డొకఁడున్నపక్షమున నోయానందా! నిశ్చయముగా నతఁడే మతస్థుల కవసరములేని యుపదేశములు చేయఁదగినవాఁడు. ఆనందా! మతస్థుల కందఱకు నేనే నాయకుఁడని, నేనే మతమున కాధారమని బుద్ధుఁ డెన్నఁడుఁ దలంచుచుండుటలేదు. అట్టిస్థితిలో మతము యొక్క భవిష్యద్వర్తనమును గుఱించి యతఁడే యుపదేశము లేలచేయవలెను. ఆనందా! నేనుగూడవృద్ధుఁడనైతిని. బహువర్షములు గడిచినవి. నాపరియాణము సమాప్తమగుచున్నది. నాయాయుఃప్రమాణము చెల్లిపోయినది. ఎనుబదిసంవత్సరములు నాకు నిండుచున్నవి. మిక్కిలి

పాఁతవడిన బండి యెంతో జాగ్రత్తతోఁ గొంతదూరము మాత్రము నడుపుటకు వీలుగానుండునట్లే బుద్ధుని దేహముగూడ మిక్కిలి జాగరూకతతో సంరక్షింపఁబడినయెడలఁ గొలఁదికాలము నెట్టుకొని రాఁగలదు. కాఁబట్టియో యానందా! మీకు మీరే దీపములుగా నుండవలెను. మీకుమీరే శరణములై యుండవలెను. సత్యము నే దీపమట్లు మీరాధారము చేసికొని యుండుఁడు; సత్యమే శరణమనినమ్ముకొని యుండుఁడు. మీకంటె నన్యులు మీకు శరణమగుదురని యెన్నఁడు నమ్ముకొని యుండవద్దు. ఓయానందా! మనుష్యుఁడు తనకు తానే యెట్లుశరణమగును? తనకుఁదానే యెట్లు దీపమగును? తనకంటె నితరమైనశరణము నంగీకరింపక పోవుటయె తనకుఁ దా శరణమగుట. సత్యమునే నమ్ముట తనకుఁ దాను దీప మగుట."

ఈమహోపదేశమైనతరువాత బుద్ధదేవుఁడు వేసాలిలోఁగొన్ని దినములుండి యానగరముచుట్టుపరిక్కలనున్న చైత్యకములకుఁబోయి యప్పుడప్పు డక్కడ వసించుచుండెను. చైత్యక మనఁగా బౌద్ధభిక్షుకులు వసించుమఠము. వేసాలినగరసమీపమున నిట్టివనేకములుండెను. వేసాలి చూచుట కెంతో సుందరమైననగరమని గౌతముఁడే యానందునితోఁ జెప్పెను. ఒకనాఁడు తనప్రియశిష్యుఁడగునానందునిఁ బిలిచి "ఈచుట్టుపరికలనున్న భిక్షుకులనందఱ నిచ్చటఁ జేర్పు" మని సిద్ధార్థుఁ డానతిచ్చెను. ఆనందుఁడు వెంటనే వారినందఱ రావించెను. రావించుటయు సిద్ధార్థుఁడు వారికి మహాధర్మోపదేశముఁ జేసెను. ఇదియే యాతఁడు చేసినకట్టకడపటి ధర్మోపదేశము. ఆయుపదేశ మీక్రిందివిధముగ నున్నది. "సోదరులారా! నేను కనిపెట్టిన సత్యము మీకుపదేశించితిని. ఆసత్యధర్మములను మీరు చక్కఁగా గ్రహించి వశపఱచుకొని వాని నాచరించి, మననముచేసి, యీపరిశుద్ధమతము శాశ్వతమై, దేవతలయొక్కయు మనుష్యులయొక్కయు

క్షేమసౌఖ్యములకుఁ గారణభూతమైయుండునట్లు దీసి నెల్లెడ వ్యాపింపఁజేయుఁడు. నేను మీకుపదేశించిన సత్యము లెవ్వి? అవివిగో—చతుర్విధమైన మననము, పాపముతోఁ జతుర్విధ మైనయుద్ధము, ఋషిత్వమునకుఁ జతుర్విధపథము, పంచవిధ మైననీతిబలము, పంచవిధ మైనయాత్మజ్ఞానము, సప్తవిధమైనజ్ఞానము, అష్టవిధ మైనసన్మార్గము."

ఓసోదరులారా! యిటు చూడుఁడు. ద్వంద్వపదార్థము లన్నియుజీర్ణములగును. కావున శ్రద్ధతో మీమోక్షమునిమిత్తము మీరే ప్రయత్నము సేయుఁడు. తథాగతునకచిరకాలములోనే నిర్వాణము కలుగును. నేఁడుమొదలుకొని మూఁడు మాసములుతరువాత తథాగతుఁడు మృతినొందును.

అనంతర మతఁడు వారి నందఱఁబంపి వేసాలి విడచి యానందుఁడును మిక్కిలి భక్తులగు మఱికొందఱు శిష్యులును వెంబడింప "పావా" యనునూరికిఁ బోయెను. ఆయూరికిఁ బోఁగానె చందుఁడను కమ్మఱివాఁడొకఁ డాయనను గలసికొని "స్వామీ! నేఁడు నాయింటభిక్షచేసి నిన్ను గౌరవింపవలయు" నని ప్రార్థించెను. అందు కాయన సమ్మతించెను. చందుఁడు తనయతిథినిమిత్తము మధురాహారములు, రొట్టెలు, నడవిపందులమాంసము, వండించెను. బుద్ధుఁడు చందుని బిలిచి "యడవిపందిమాంసము నాకుఁ బెట్టి మధురాహారములు రొట్టెలు భిక్షుకులకి" మ్మని యానతిచ్చెను. అతఁడట్లచేసెను. భిక్షానంతరమున బుద్ధుఁడు పావాగ్రామమును విడచి కాశీనగరమున కరిగెను. కాని దారిలో నతనికి దారుణ మయినరక్తగ్రహణిరోగము వచ్చెను. దానివలన నాయన మిక్కిలి బాధపడఁజొచ్చెను. కాని, యామహాత్ముఁ డాబాధ మిక్కిలిదుస్సహమయినను దానిని మనోవైకల్యముఁజెందకుండ మిక్కిలి స్థైర్యముతో మిక్కిలిధైర్యముతో ననుభవించెను.

ఆహాహా! ఎంతటి ప్రతిభాశాలురైనను నెంతటిభగవదుపకార పరాయణులైనను నెంతటిధైర్యశాలురయినను మానవులు రోగపతితులైనప్పుడు దైహికబాధల ననుభవింపక తప్పదుకదా! బుద్ధదేవుని స్థితి క్రిమక్రమముగాఁ జెడిపోయెను. నానాఁటికి రోగమతిశయించెను. శరీరబలము క్షీణించెను. అట్లు దుర్బలశరీరముతోనే ప్రయాణముఁ జేయుచు సిద్ధార్థుఁడు మార్గమునుండి తొలఁగి యొకవృక్షచ్ఛాయకుఁ జని, యానందునిం బిలిచి "యానందా! నా కావిబట్ట లిక్కడంబఱపుము నేనుమిక్కిలి యలసియున్నాను. కొంచెముసేపు విశ్రమించెద" నని చెప్పెను. ఆనందుఁడట్లు చేసెనపిదప నతఁ డానందుని వెండియుఁ బిలచి "ఆనందా! దాహమై నోరెండుకొని పోవుచున్నది. కొంచమునీరిమ్ము త్రాగెద"నని యడిగెను. ఆనీరు త్రావి కొంత సేదదేఱి తానే స్వయముగా లేచి సమీపమున నున్న కుకుస్తానదికి మెల్లగఁ బోయి స్నానముచేసి వెండియు జలము ద్రావెను. కుకుస్తానది యనఁగా బర్హినది. ఇదికాశీనగరమున కెనిమిదిమైళ్ళదూరమున చోటాగండకినదిలోఁ బడుచున్నది. ఈస్నానపానములవలన సేదదేఱి కొంతబలము కలిగి బైలుదేరి కుషిమాగపురసరిసరములనున్న యొకతోఁటలో బసచేసెను. ఆవనమునఁ జేరి యతఁడు "ఓయానందా! నేను మిక్కిలి పరిశ్రాంతుఁడ నైతిని. రెండు కవలచెట్లనడుమ నుత్తరపుతలగడగ నాకుఁ బక్క వేయుము. నేను పండుకొనియెద" నని యానందునితో ననియెను. ఆవిధమున నానందుఁడు సెజ్జ సమర్చుటయు సిద్ధార్థుఁడు ప్రశాంతమనస్కుఁడై నిశ్చలభావముతోఁ గుడిప్రక్కకొత్తిగిలి కాలిమీఁదఁ గాలువైచుకొని పండుకొని యానందునితో నిట్లనియె. "ఇది పువ్వులకాలము కాకపోయినను గవలచెట్లు పుష్పములతోనిండియున్నవి. అవినామీఁద రాలుచున్నవి. తథాగతునకీగౌరవముగాక మఱియొక గౌరవము మఱియొకప్రతిష్ఠ మఱియొకసపర్య మఱియొకపూజ కలదు.

ఓయానందా! భిక్షుకుఁడుగాని, భిక్షుణి గాని, యనుచరుఁడు గాని, గృహస్థుఁడు గాని, సన్యాసి గాని, యెవరయినను సరే చిన్నవిషయమునందును బెద్దవిషయమునందును సత్యమువచించుచు ధర్మపరికారము నడుచుకొనుచు, ధర్మలేశములనుగూడ గమనించుచు జీవితకాలము గడపుదురో వారు తథాగతునకు గౌరవము గావించినవారు. సపర్యలు సల్పినవారు. సమారాధనలు చేసినవారు నగుదురు."

రాత్రి గతించుకొలఁది తమగురువున కవసానకాలము సమీపించిన దని శిష్యులకు స్పష్టముగాఁ బొడకట్టెను. చేయునదిలేక వారు ధైర్యముఁ గోల్పోయి గురువు శయనించిన స్థలమునకుఁ గొంచెము దూరముగ నరిగి విలపింపఁదొడఁగిరి. ఆయన సిద్ధిపొందునప్పటికి కానందుఁడు, అనిరుద్ధుఁడు, సరిపుత్త్రుఁడు మున్నగువారు సన్నిధి నుండిరి. కశ్యపుఁడు వచ్చెనుగాని వచ్చునప్పటికే గురువు నిర్వాణ మొందెను.

---

## ఏకోనవింశత్యధ్యాయము.

---

మహానుభావుఁ డగుగౌతముఁ డీవిధంబున మరణోన్ముఖుఁడై యున్న సమయమున బ్రియశిష్యుఁ డగునానందుఁ డిట్లనియె:—

"స్వామీ! కల్పాంతమువఱకు నీవు జీవించున ట్లనుగ్రహింపుము. మానవులక్షేమసౌఖ్యములనిమిత్తము ప్రపంచముపై జాలిదలఁచి దివ్యులయొక్కయు, మనుజులయొక్కయు సేమముకొఱకు, లాభము కొఱకు సంతోషముకొఱకు, గల్పాంతము దాఁక బ్రతుకుము. ప్రభూ! బ్రతుకుము."

శిశువునోటనుండి వెడలవలసినమాటల నుడువుచున్న యానందుని జూచి జగద్గురుఁడు చిఱునవ్వునవ్వెను. అప్పు డానందుఁడు వెండియు నిట్లనియె—"భగవానుఁడా! యీనట్టడవిలో నీవు పంచత్వము

నొందఁగూడదు. బ్రిభూ! రాజగృహము, వారణాసి. సాకేతము, శ్రవస్తి, చంపాపురము మొదలగుమహానగరము లనేకములు కలవు. దేవరవా రచ్చట సిద్ధిపొందునట్లు ప్రసాదింపుఁడు. ఆనగరములలో నెందైన సిద్ధిపొందినపక్షమున మీకళేబరమునకుఁ దగినగౌరవముజరుగును. ఏలయన నచ్చట తథాగతునిసిద్ధాంతములయందు విశ్వాసము గల భాగ్యవంతు లనేకులు గలరు" అనవుడు నమ్మహాత్ముఁడు మరల మందహాసము చేసెను. అదిచూచి యానందుఁడు "దేవా! మీరు మృతినొందినపిదప మీశరీర మేమి చేయుమని యానతిచ్చెదరు?" అనియడిగెను. అతనికి గౌతముఁ డిట్లనియె. "ఆనందుఁడా! తథాగతునికళేబరమును గౌరవించుటను గూర్చి నీవుశ్రమపడవలదు. నీస్వవిషయమున నీవు గట్టిపూనిక గలిగియుండు మని నిన్ను వేఁడుకొనుచున్నాను. నీమేలుకొఱకు నీవుపాటుపడుము నీవు జాగ్రత్తగా నుండుము."

తథాగతునియందు విశ్వాసము గలభాగ్యవంతులలో బుద్ధిమంతులనేకులున్నారు. వారు థాతగతునికళేబరమునకుఁ దగినగౌరవము జేయకపోరు" అని పలికి కొంతసే పూరకుండి యతఁడు మరల నానందునితో నిట్లనియె. "నేను మృతినొందుచున్నాను. చందుఁడు పెట్టిన యాహారము నేను తినినందున వానికి ముందుజన్మమున గొప్ప యదృష్టము తప్పక కలుగు నని నేనుపోయినతరువాత వానిలోఁ జెప్పుము. నానోటనే యీమాటలు నీవువిన్నట్లు వానితో నొక్కిచెప్పుము. అన్నిదానములలో మిక్కిలి యుత్కృష్టములైనవి రెండు గలవు. అందు మొదటిది నాకు బుద్ధత్వముప్రాప్తింపకమునుపు సుజాత చేసిన యన్నదానము. నే నీలోకమును విడిచి వెళ్ళిపోవుటకు ముందు చందుఁడు చేసిన యీ యన్నదానము రెండవది. ఆనందా! చందునియొద్ద కెవ్వరైనఁ బోయి "చందా! ఇది నీకుఁ గీడు. ఇది నీకు గొప్పనష్టము. నీచేతియన్నముఁ దినఁగానే తథాగతుఁడు మృతినొందె" నని వాని

కెవ్వరైన వెఱపు గొలిపి విచారము గలిగింపవచ్చును. కావున నట్టి వెఱపు వానిమనంబునుండి మాన్పి "చంచా! ఇది నీకు మేలు. ఇది నీకు లాభము. ఏమన తథాగతుఁడు నీచేతియన్నముఁ దిని పరమసిద్ధి వడసె" నని చెప్పవలెను.

పరమభక్తుఁడైనయానందుఁ డప్పలుకులు విని మనోధైర్యము చిక్కఁబట్టలేక దుఃఖాక్రాంతుఁడైన జగద్గురుసిసన్నిధిని విలపింపఁగూడదని యేష్చుట కావలికిఁ బోయెను. అతఁడు తనప్రక్కను లేకపోవుటఁగనిపెట్టి సోదరులారా! ఆనందుఁ డేఁడి యని యామహాత్ముఁ డడిగెను. "దేవా! పూజ్యుఁడైనయానందుఁడవ్వలి కరిగి విలపించుచున్నాఁ" డని వారుత్తరము చెప్పిరి. "సోదరులారా! పోయి నాకడకు వానిం బిలిచికొని రం" డని యతఁ డానతిచ్చెను. ఆనందుఁడు వచ్చి వానిప్రక్కఁ గూర్చుండెను. అప్పుడు తథాగతుఁడు మెల్లగా నిట్లు ధైర్యము చెప్పెను. "ఆనందా లేనిపోనిశ్రమ పడకుము. విలపింపకుము. మనకు మిక్కిలిసమీపములై ప్రియములైన పదార్థముల స్వభావమే యిట్టిదనియు వీనినివిడిచి వానినుండి వేఱుపడి మనము పోవలయు ననియు నే నిదివఱకే పలుమాఱులు చెప్పియుండ లేదా? ఏదియు శాశ్వతమై యుండఁజాలదు. అటువంటిస్థితి యసాధ్యము. ఆనందా! నీవు చిరకాలమునుండి నాయందు దయగలిగి మిక్కిలిమంచి వాఁడవై మెడతెగక యింతంత యనరాని యుపచారపరంపరఁ జేసి నాకుఁ బరమాప్తుఁడవయి యుంటివి. ఆనందా! నీవుమంచిపని చేసితివి. నీప్రయత్నము లంతఃకరణసుద్ధిగఁ జేయుము. నీవును మహాపాపమునుండియు భోగపరాయణత్వమునుండియు నహంభావమునుండియు మాయనుండియు నజ్ఞానమునుండియు స్వల్పకాలములో విముక్తుఁడవయ్యెదవు."

రాత్రి కడచుకొలఁది బుద్ధుఁడు క్రమక్రమముగ క్షీణింపఁ జొ

చ్చెను. ఆసమయమున నత్తావున నొకబ్రాహ్మణుఁడు వచ్చెను. అతఁడు కుశీనగరనివాసుఁడు. వేదాంతశాస్త్రవేత్త. అతనిపేరు సుభద్రుఁడు. అతఁ డానందునిఁ గలిసికొనియిట్లనియె. "గౌతమశ్రమణుఁడీరాత్రి దేహయాత్ర ముగించు నని వింటిని. ఇప్పుడు నామనస్సులో నొక గొప్పశంక బొడమినది. ఈసందేహము నివారించుటకు గౌతమ శ్రమణుఁడు తగినవాఁడని నాకుఁ దోఁచినది. కావున నో యానందా! గౌతమ శ్రమణుని నేను చూచెద. చూడనిమ్ము." అనవు డానందుఁడు "మిత్రుఁడా సుభద్రుఁడా తథాగతు నిప్పుడు పీడింపకుము. అతఁడు మిక్కిలి పథశ్రాంతుఁడై యున్నాఁ" డని యుత్తరము చెప్పెను. కాని సుభద్రుఁడు వానిని మఱిమఱి యడిగి బాధింపఁజొచ్చెను. వారి సంభాషణము బుద్ధునిచెవిని బడఁగా నతఁ డానందుని బిలిచి "ఓయీ! సుభద్రు నడ్డగింపకుము. వానిని నాకడకు రానిమ్ము. అతఁడు నన్నేమి యడిగినను జిజ్ఞాసువై యడుగును కాని నన్ను పీడింపవలె నని యడుగఁడని పలికెను. అంతట నాబ్రాహ్మణుఁడు సిద్ధార్థునిప్రక్క గూరుచుండి, అనేకశాఖలకు ప్రధానపురుషులుగ నుండి పరమతప శ్శాలు రయినబ్రాహ్మణులు పురాణకశ్యపుఁడు, మఖాళి, అజితుఁడు, కాత్యాయనుఁడు, సంగయుఁడు, వేలాతికుఁడు, నిగ్రతుఁడు మొదలగువారు లోకమున వెల్లడించినట్లు పదార్థతత్వములను గ్రహించిరా లేదా. లేకయందుఁగొందఱు తెలిసికొని కొందఱు తెలిసికొనలేక పోయిరా" యని యడిగెను. అడుగుటయు వానికి బుద్ధుఁడిట్లనియె. "సుభద్రా! ఆబ్రాహ్మణులు తమతమవిజ్ఞానము కొలఁదిగ తత్వము గ్రహించిరాలేదా యన్నసందేహ మటుండనిమ్ము. అట్టివిషయములు చర్చించుటకిది సమయము కాదు. నేను నీకు సత్యము నేర్పెదను. సావధానుఁడవై వినుము" అని గౌతముఁడు నీతిమార్గమును విడిచి పెట్టిన మతసిద్ధాంతముల ననుసరించినవారికి మోక్షములభింప దనియు

పవిత్రజీవనముతో నారంభమై భూతదయతో నంత మగునష్టవిధపావన మార్గముల ననుసరించినవారికె మోక్షము గలుగు ననియు బోధించెను. బోధించుటయు సుభద్రుఁడు జ్ఞానరసాస్వాదనము జేసి పరమానందభరితుఁడై "యహాహా! మేలు. మేలు. మీముఖమునుండి వెలువడిన మాటలు మిక్కిలి ప్రశస్తములు. దేవరవారు నన్ను శిష్యుఁడుగ గ్రహింపవలయును. మేనఁ బ్రాణము లుండునంతవఱకు నేఁడు మొదలుకొని పరమవిశ్వాసము గలిగియుండు"నని యతఁడు వినయముతోఁ బలికెను. అతనిపలుకులు విని బుద్ధుఁ డిట్లనియె. "సుభద్రా! పూర్వమొకసిద్ధాంతమునం దుండి యీ నవీనసిద్ధాంతములో నుత్తమస్థానమును గాని యధమస్థానమునుగాని ప్రవేశింపఁ దలఁచువాఁడు ముందుగా నాలుగుమాసములు శుశ్రూషఁ జేయవలయును." అట్లయిన నేను నాలుగుఁమాసములు శుశ్రూషచేయుదు"నని సుభద్రుఁ డొడంబడెను.

అప్పుడు గౌతముఁ డానందుని బిలిచి "ఆనందా! ఈతనిని మన మతమున జేర్చికొను" మని యానతిచ్చెను. అప్పుడానందుఁడు వానినొక్కకడకుఁ గొంపోయి స్నానము జేయించి సమస్తవస్తువులు వినశ్వరము లని యొకానొకమంత్రము పునశ్చరణ సేయించి వానిశిరస్సు గడ్డము ముండనము చేయించి కాషాయవస్త్రములు గట్టించి బుద్ధుఁడు ధర్మము సంఘము శరణము లని శరణత్రియము వానిచేతఁ జదివించి బుద్ధునియొద్దకుఁ గొనిపోయెను. అంతటఁబుద్ధుఁడు వాని నుత్తమపదస్థుఁడగుశిష్యుఁడుగ నంగీకరించి ధ్యానము సేయుట కొకవిషయము నుపదేశించెను. ఆమహానుభావుఁ డొనర్చిన కట్టకడపటికార్యమిదె.

---

## వింశత్యధ్యాయము.

ఆరాత్రి నాలవజాము సమీపించినప్పుడు బుద్ధదేవుఁడు పూజ్యుఁడైన యానందుని బిలిచి యిట్లు పలికెను. "ఆనందా! మన గురూపదేశ మస్తమించినది. మన కింక గురువులేఁ డని మీలోఁ గొందఱు కధైర్యము తోఁచవచ్చును. కాని మీరా విధముగఁ దలఁపఁగూడదు. నేను సంస్థాపించిన సత్యము నేను మతమునిమిత్తమై యేర్పఱచిన సూత్రములు, నేను బోయినతరువాత మీకు గురువులై యుండుఁగాక' యని పలికి కొంఁడొకతడ వూరకుండి యామహాత్ముఁడు మరల నిట్లనియె. "ఆనందా! నామరణానంతరమున స్వల్పధర్మములలో మార్పులు గావలసియున్న పక్షమున నట్టివి మార్చుకొనవచ్చును." అని యానందునితోఁ బలికి పిమ్మట భిక్షుకుల నుద్దేశించి యిట్లనియె:—"బుద్ధుని గురించి గాని, సత్యమునుగూర్చి గాని, ధర్మ పథమును గూర్చిగాని, యెవరిమనస్సులోనయిన సందేహములు, తప్పభిప్రాయములు నుండవచ్చును. అట్టివి మనంబున దాఁచుకొనక స్వేచ్ఛగాఁ దెలియపఱచి యడుగుఁడు. తథాగతుఁడు మన యెట్టయెదుట నున్నప్పుడు మనసందేహము లాయన నడిగి తీర్చుకొనమైతి మని విచారించుచు మిమ్ము మీరు దూషించుకొనవద్దు."

ఆమహాత్ముఁ డావిధమునఁ బల్కుచున్నప్పుడు భిక్షుకులందఱూరకుండిరి. బుద్ధుఁడు సందేహము లడిగి నివారించుకొనవలసినదని మఱి రెండుసారులు వారిని నొక్కి యడిగెను. మువ్మారడిగినను మూఁకలట్లు వారు ప్రత్యుత్తర మియ్యరైరి. అంతట నతఁడు భిక్షుకుల నుద్దేశించి యిత్తెఱఁగున భాషించెను—"సోదరులారా! గురువునెడల మీకుఁ గలభక్తివిశేషంబుచేత మీరు సందియముల నడుగకపోయి

యుండవచ్చును. కలిగినసందియములు మీ రొండొరులతోఁ జెప్పి కొనుఁడు."

ఆయన యట్లు పలికినను భిక్షుకులు నోరు తెఱచి యడుగరైరి. అప్పు డానందుఁడు తథాగతున కిట్లనియె—"దేవా! బుద్ధుని గూర్చి గాని, సత్యమును గూర్చిగాని, ధర్మపథమును గూర్చిగాని, యీమహాసభలో నెవరిమనస్సునను సందియములుగాని, తప్పభిప్రాయములుగాని, లే వని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను."

"ఆనందా! నీవు సంపూర్ణవిశ్వాసముతోఁ బల్కితి" వని బుద్ధుఁ డానందునితోఁ జెప్పి కొంతసే పూరకుండి సెజ్జనుండి సగము లేచి యిట్లనియె:—"సోదరులారా! చూడుఁడు! ద్వంద్వపదార్థము లన్నిఁటికి నాశనము స్వభావము. కావున శ్రద్ధతో మీమోక్షముల మీరే సాధించుకొనుఁడు" ఇవియే బుద్ధదేవుని కట్టకడపటి వాక్యములు.

అంతట నమ్మహానుభావుఁడు గాఢమైనధ్యాననిష్ఠలోఁ బ్రవేశించెను. పిమ్మట నాయన క్రమక్రమముగా నైహికసంబంధమైన జ్ఞానము మొదలైనవానిని విడిచి చిత్తము నిర్వికల్పసమాధిలోఁ జేర్చెను. అది చూచి యానందుఁ డనిరుద్ధునితో "భగవానుఁడు బుద్ధుఁడు సిద్ధిపొందినాఁ" డనెను. "అయ్యో! అన్నా! కాదు కాదు. బుద్ధుఁడు సిద్ధిపొందలేదు. సుఖదుఃఖానుభవములకు, నాలోచనలకు నతీతమైన నిర్వికల్పసమాధిలో నీమహాత్ముఁడు ప్రవేశించినాఁ" డని యనిరుద్ధుఁ డుత్తరము చెప్పెను. అనంతరము బుద్ధదేవుఁ డాస్థితిలోఁ గొంతసే పుండి దేహత్యాగము చేసెను.

ఆయన పోవునప్పుడు భూమి కంపించె ననియు, భైరవారావముతో మేఘములు గర్జించె ననియు, బ్రహ్మయు, మహేంద్రుఁడును నేవో కొన్నిశ్లోకములు పాడిరనియు, శిష్యులు రచించినగ్రంథములో నున్నది. ఈవ్రాతలు గురుభక్తిప్రేరితములు గాని సత్యమునకు

సమీపములు గావు. మహానుభావులు మృతి నొందునప్పుడు భూకంపములు గలుగవు. మందమతులు మృతినొందినప్పుడును భూకంపములు కలుగవు. ప్రపంచ మెప్పటివలెనె యుండును. సామాన్యమనుష్యుల వలె జన్మించిరనిగాని మృతినొంది రనిగాని చెప్పినపక్షమునఁ దమ గురువులయెడ లోకులకు గౌరవముండ దని శిష్యులు మహాద్భుతములను గల్పించుచుందురు.

ఆయన మృతినొందినతోడనే సంపూర్ణవైరాగ్యము లేనికొందఱుశిష్యులు "అయ్యో! గురువు మిక్కిలి త్వరలోఁ బోయెను. జీవితము విడచి మహాత్ముఁ డతిత్వరలోఁ జనియెను." అని తలమోఁదుకొనుచు, నేలఁ బడి దొరలియు వాపిడచి దుఃఖించిరి. కాని జ్ఞానవంతులు విరాగులు నైనశిష్యులు సమస్తపదార్థములు వినశ్వరములనుమాట జ్ఞప్తికిఁ దెచ్చుకొని ధైర్యము చిక్కఁబట్టి దుఃఖము శాంతముతో సహించిరి.

అప్పు డనిరుద్ధుఁ డానందునిం జూచి "అయ్యా! నీవు కుశనగరమునకుఁ బోయి మహాత్ముఁ డైనబుద్ధుఁడు మృతి నొందె నని చెప్పి ర మ్మ్మని పలికెను. అనవు డానందుఁ డాపురమునకుం బోయి యచ్చటనివాసులైనమల్లులతో సిద్ధార్థుని మరణవార్త చెప్పి "ఇప్పు డేమి చేయవలెనో యది చేయుఁడు" అని పలికెను. ఆమాట వినఁగానే కుశీనగరవాసులైన మల్లు లందఱుఁదమభార్యలతోడను బిడ్డలతోడను జుట్టములతోడను మిత్రులతోడను "అయ్యో!జ్యోతి యెంతత్వరలో నారిపోయెను. మహాత్ముఁ డెంతత్వరలో నస్తమించె" నని యెంతో దుఃఖించి తమ సేవకులం బిలిచి సుగంధద్రవ్యములు పుష్పహారములు వీణామృదంగాది వాద్యములు సమయోచితము లైనదుస్తులు, సిద్ధము చేయు మని యాజ్ఞాపించి సిద్ధార్థునికళేబర మున్న సాలవనమునకుం జని యాదిన మంతయు నృత్యముతోను గానముతోను గడపి పుష్పహారరచన

ముతోడను, చందనాదిసుగంధవస్తువులు సిద్ధముచేయుటతోడను దమ వస్త్రములతో వితానములు గల్పించుటతోడను వితానములకుఁ బూల దండలు గుచ్చుటతోడను మఱియు నితరము లైనయలంకారములం జేయుటతోడను గడపిరి. అనంతరము బుద్ధునిశరీరము మిక్కిలి గౌర వముతో మిక్కిలిభక్తితో వారు దహనముచేసిరి. దహనానంతరమున కుశీనగరవాసు లగుమల్లులందఱు బుద్ధుని దగ్ధచితి చుట్టుఁ జేరి నృత్య ముచేసి పాటలు పాడి దానిచుట్టు బాణములకోట గట్టి యామహా త్మునియెముకలు పరులు హరింపకుండ నేడుదినములు జాగ్రత్తపెట్టిరి.

ఆసమయమున మగధరాజగు నజాతశత్రుఁడు మల్లజాతి కీక్రిం దిసందేశ మంపెను. "సిద్ధార్థుఁడుక్షత్రియుఁడు. నేనును క్షత్రియుఁడనే. అందుచేత నామహానుభావుని యస్థికలలో నొకకొన్ని నాయొద్ద నుంచుకొనుట కర్హుఁడనే. ఆమహాత్ముని యస్థికలమీఁద నేనొక స్థూపముగట్టి యచ్చట నేఁటేఁట నుత్సవములు జేయించెదను."

వేసాలినివాసులును మల్లల కట్టిరాయబారమునే పంపిరి. కపిల వస్తునివాసు లగు శాక్యులును నట్టికోరికలే కోరిరి. ఈవిధంబుననే చుట్టు పరిక్కల నుండు దేశములవా రందఱు మల్లలయొద్దకు దూతల నంపిరి కాని మల్లలు వారలతో నిట్లనిరి. "మహాత్ముఁడయిన సిద్ధార్థుఁడు మా పురసమీపమున మృతినొందెను. కాఁబట్టి యాయనయస్థికలు మొదలైనవి మే మెవ్వరికిని నిచ్చువారము కాము. అట్లు పల్కుటయు ద్రోణుఁ డనుబ్రాహ్మణుఁ డొకఁడు వారికిట్లనియె:—"ఆర్యులారా! నాదొక్క చిన్నమనవి గలదు వినుఁడు. శాంత ముండవలయు నని బుద్ధుఁడు మన కుపదేశించుచు వచ్చెను. భూతకోటిలో నెల్ల నుత్త మోత్తముఁ డైన బుద్ధదేవుని యస్థికలం గూర్చి మనము కలహ మాడుకొని యుద్ధముచేసి యొండొరులకాయములు గాయములు గావించుట యనర్హమైనపని. కావున మన మందఱు మాయస్థికల నెని

మిది భాగములు జేసి యైకమత్యము గలిగి యుందము. మానవ జాతి బుద్ధునియందే పరమ విశ్వాసము నిల్పునట్లు జగన్మండలమునఁ బ్రతిభాగమున స్తూపములు లేచుఁగాత!" అనవుడు మల్ల లా బ్రాహ్మణునితో నిట్లనిరి:—"ఓ బ్రాహ్మణుఁడా! అట్లయిన నామహాత్ముని యస్థికలను నిష్పక్షపాతముగా నీవే యెనిమిది భాగములుగ విభజింపుము" అనవుడు ద్రోణుఁ డాయస్థికల నెనిమిదిభాగములుగ భాగించియొక్కొక్క రాయభారున కొక్కొక్కభాగ మిచ్చి చిట్టచివర "అయ్యా! యీపాత్ర నేను తీసికొనిపోయి దానిపై నొకస్తూపము నిర్మించి యుత్సవములు గావించెదను." అని పల్కుటయు వారాపాత్ర నతని కిచ్చిరి. ఇట్లెనిమిదిభాగములు పంచినపిదప పిప్పలివనవాసులైనమౌర్యులు తమ కాయస్థికలలో నొకభాగమిమ్మని వర్తమానమంపిరి. వారి కిచ్చుట కస్థికలలో నేమియు మిగులనందునఁ జితిలోనున్న బూడిద నంతయు వారికిచ్చిరి.

అట్లు భాగములు గొన్న యెనమండ్రుగురుఁ దమతమవంతు వచ్చిన యస్థికలు మున్నగువానిమీఁద స్తూపములు నిర్మించిరి. ఈవిధముగా నస్థికల కెన్మిది స్తూపములును పాత్రమున నొకస్థూపమును భస్మమున నొకస్తూపమును మొత్తముమీఁదఁ బదిస్తూపములు బయలుదేరెను.

బుద్ధునిమరణానంతరమునఁ గొన్నియేండ్లకు నాతని యస్థికలు సంగ్రహించి స్తూపములు నిర్మించినవారికి వైరములు పొడమెను. ఆవైరములవలన మహాయుద్ధములు బయలుదేరెను. ఆయుద్ధములలో, నా ద్రోహులలో నెంతోకష్టపడిన శిష్యులు కట్టిన మహాస్తూపములు నాశన మగుననియు నందువలన బుద్ధునియస్థికలు నామావశిష్టము లగు ననియు శిష్యులకే గొప్పభయము కలిగెను. అప్పుడు మహాత్ముఁడయిన కశ్యపుఁడు స్తూపములు గలవారియొద్దకుఁబోయి బుద్ధుని

యస్థికలు తనచేతి కిమ్మని ప్రార్థించెను. ఆకఠ్యపునియం దెల్లవారికి విశ్వాసముండుటచేవారందఱాతనికోరికె నిరాకరింపక తాము కొంచెమేనియు దాఁచుకొనక నాయస్థికలనెల్ల వారతనిచేతి కిచ్చిరి. అతఁడు వానినిగ్రహించిగయాక్షేత్రసమీపమున నొకమహారణ్యములో గొప్ప గొయ్యి త్రవ్వియం దొకయాలయము నిర్మించి బుద్ధునియస్థికల నొక బంగారుపాత్రలోఁబెట్టి యది యొకయిత్తడిపాత్రలోఁబెట్టి యాయాలయములో దానినిక్షేపించి యాగొయ్యి యంతయు మట్టితోఁ బూడ్చి యొకబంగారురేకుమీఁద నీక్రిందివిధముగ వ్రాసి యాగే కచ్చుటఁ బడవై చిరఁట.

"మగధరాజులలో నొకఁడైన యశోకుఁడు పవిత్రుఁడైనబుద్ధుని యస్థికలను లోకమంతట విజ్జిమ్మి వానిమీఁద స్తూపములు నిర్మించును."

అశోకుఁడు బౌద్ధమతావలంబకుఁడై దానిని లోకమంతట వ్యాపింపఁజేసిన కాలమున దశలక్షస్తూపములను నిర్మింపఁదలంచెను. కాని యాస్తూపముల యడుగున నిక్షేపించుటకు బుద్ధునియస్థికలు వానికి దొరుకక వయ్యెను. అతఁ డనేకస్థలములు వెదకించెను. కాని యవి యెందును లభింపలేదు. ఎట్టకేలకు వృద్ధుఁ డయినయొక భిక్షు విట్లుచెప్పెను:—"నేను పిన్నవాఁడ నయినప్పుడు నాగురువు నన్ను నట్టడవిలో నొకానొకప్రదేశమునకుఁ దీసికొని పోయి వత్సా! యీస్థలము మరువకుము" అని చెప్పి యాస్థానమునకుఁ దలవంచి నమస్కరింపు మనియె. బుద్ధునియస్థిక లాపవిత్ర స్థానమునం దున్నవని నేనూహించెద." అప్పలుకులు విని యశోకుఁడు తక్షణమే యాస్థానమునకుఁ బోయి యాయడవియెల్ల ద్రవ్వి భూగర్భిత మైనపుణ్యాలయమును గనిపెట్టి యయ్యస్థికలం గొనిపోయెను. కొనిపోయి మృతి నొందకముందే యనేక స్తూపముల నతఁడు నిర్మించెను. ఆస్థలము లన్నియు నిప్పుడు బౌద్ధులకు గొప్ప పుణ్యక్షేత్రములు.

సంపూర్ణము.

---

 




## పీఠిక.

హిందూస్థానమున వాయువ్యదిగ్భాగమందు పూర్వము నుండియు సుప్రసిద్ధమగు పాంచాల మను దేశము గలదు. అది ప్రస్తుతము పంజాబు దేశమను పేర వ్యవహరింపఁబడుచున్నది. ఆదేశమునందు లాహోరు ముఖ్యపట్టణము. ఆనగరమునకు సమీపమున "టాల్వొండి" యను పల్లెయొకటి కలదు. నానకు "టాల్వొండి" గ్రామమందు క్రీ॥ శ॥ 1438 వ సంవత్సరమున జన్మించెను. నానకుసీకుమతమును స్థాపించినమహాత్ముఁడు. జనులు సనాతనము లగు నుత్తమధర్మముల విడచి దురాచారములే సదాచారములుగ భావించి భ్రష్టులగుచుండఁ జూచి జాలినొంది కేవల లోకోపకారపరాయణుఁడై నానకు పరమార్థ మెఱుఁగక గతానుగతికమ్ముగ నధోగతిపాలగుచుండిన తోడిజనుల నుద్ధరించుటకు మంచిదారిఁజూపిన మహానుభావుఁ డగుటచే నానకునిచరిత్రము నెల్లవారుఁ జదువదగినదని వ్రాయఁబూనితిని.

ఇట్లు,

గ్రంథకర్త.

## ప్రథమాధ్యాయము.

నానకు క్షత్రియ వంశస్థుఁడు. తండ్రి పేరు కాళుఁడు. తల్లి పేరు త్రిప్తాదేవి. కాళుఁడు టాలువెండి గ్రామమునకు మునసబగుటచేత మిక్కిలి పలుకుబడి గలిగి లోకవ్యవహారవేదియై మితవ్యయముచేత ధనము కూడబెట్టి వడ్డివ్యాపారము చేయుచు గౌరవముగఁ గాలక్షేపము చేయుచుండెను. కాని వానినోరు మంచిదికాదు. హృదయము కఠినము. జనులతోఁ గలసిమెలసి యుండుట కిష్టములేనివాఁడు. ఆశ గలవాఁడు. అందుచేత గ్రామవాసులు వానికిఁజంకి పైకి వానియెడ మిత్రభావముఁ జూపినను మనసులలో వానిని ద్వేషించిరి. వానిభార్య త్రిప్తాదేవి గుణములలో మగనిం బోలక భిన్నశీలము గలదై నోటిమంచితనము సాధుస్వభావము గలిగి గ్రామవాసులచే గౌరవింపఁబడుచు వచ్చెను. మగఁడు ధూర్తవర్తనుఁడై చీటికిమాటికి మహాకోపపరవశుఁడై తన్ను సిలుగులఁ బెట్టుచువచ్చినను, త్రిప్తాదేవి యోరిమిఁగలిగి మగనిమాట జవదాటక వానియెడ గడుభక్తిగలిగి యుండెను. తండ్రియొక్క మనోదార్ఢ్యము తల్లియొక్క సాధుశీలము గ్రహించి యాదంపతులకే నానకు జన్మించెను.

ఆతని జన్మదినము నిర్ణయించుటకుఁ దగిన యాధారములు కానరావు. కొందఱు వాని పుట్టినదినము కార్తికశుద్ధ పూర్ణిమ యనుచున్నారు. మఱికొందఱు వైశాఖశుద్ధతదియ యనుచున్నారు. కార్తికశుద్ధపూర్ణిమనాఁడు నానకు జ్ఞాపకార్థము టాలువెండి గ్రామములోఁ బ్రతిసంవత్సరము తీర్థముజరుగుచుండుటచే వానిజన్మదినము కార్తికపూర్ణిమయేకాని వైశాఖశుద్ధతదియ కాదని నిశ్చయింపవలసియున్నది. ఆరాత్రి నిశీథసమయమున స్వధర్మభ్రష్టులగు హిందువులను మంచిదారినిం ద్రిప్పఁదలంచిన యామహాత్ముం డవతరించెను.

మన దేశమున గొప్పవారి పుట్టుకలు సామాన్యమనుష్యుల జన్మములకంటె విలక్షణముగ వర్ణింపఁబడుచుండును. రామ, కృష్ణాదిమహాత్ములు జన్మించినప్పుడు మహాద్భుతము లనేకములు జరిగినట్లు మనవారు పురాణములలో వర్ణించి యుండుటచే నిటీవలివారును మహాపురుషుల జన్మకాలమునందు వింతలు పొడకట్టినట్లు వ్రాయఁదొడంగిరి. నానకుచరిత్రము వ్రాసినవారుఁ గూడ నీవృద్ధాచారము నతిక్రమింపక వానిజన్మము లోకసామాన్యముగ వ్రాసిరి. నానకు పుట్టినతోడనే సగము నవ్వుచు సగము మాటలాడుచున్న మనుష్యునికంఠధ్వని గలుగున ట్లేడ్చెనని మంత్రసాని చెప్పెనఁట. అందలి సత్యమేమనఁగా నానకు తన తండ్రిపుట్టినట్లుఁ దాతపుట్టినట్లుఁ దక్కిన మానవులందఱుం బుట్టినట్లు బుట్టియుండును. అందఱుశిశువు లేడ్చినట్లే యేడ్చియుండును. కాని యతని చరిత్రము వ్రాసినవారు వాని గొప్పతన మంతయుఁ జూచిన పిదప నతఁడాకాలమున లోకైకపూజ్యుఁడైన పిదప వ్రాసియుండుదురు. కావున నంతటి మహానుభావుఁడు తక్కిన పామరమానవులవలెఁ బుట్టియుండఁడని నమ్మి మూర్ఖజనములు చెప్పుకొను మహాద్భుతములు కొన్ని వాని యవతారఘట్టమునందుఁ జేర్చియుందురు. అట్లే కాకున్న ప్రకృతిధర్మములు భేదమునందవలసియుండు. అద్భుతములు మహిమలు మొదలగునవి మూర్ఖుల మనస్సులలో నుద్భవించునుగాని నిజముగ జరుగవు.

ఒకనిపుట్టుకలో ఘనతయుండదు. ఒకనిపుట్టుకలో నైచ్యముండదు. ఎవఁడును జన్మించినతోడనే మాటలాడఁడు. తరువాత నెంత గొప్పవాఁడైనను మనుష్యుఁడు పుట్టినప్పు డందఱివలెనె యాఁకలి దప్పిక నిద్ర మొదలగు లక్షణములు గలిగి యుండును. ఇట్లనుటచేతఁ గొందఱు మనుష్యులయం దద్భుతశక్తి లేదని నేననుట లేదు. మనుష్యునిబుద్ధి వికసించినపిదప వాని విద్యంబట్టియు జ్ఞానముబట్టి

యు నొక్కొక్కని కసాధారణ ప్రజ్ఞ గలుగుచుండును. ఒక్కొక్కని
కి విస్తారము విద్యలేకపోయినను దైవభక్తి భూతదయ జితేంద్రియ
త్వము బాల్యమునం దంకురించి నానాఁట నభివృద్ధి జెందును. ఇట్టి
సత్పురుషులే పరోపకారపరాయణులై జీవితమంతయుఁ బరమార్థ
మునకు ధారపోయుదురు. ఈనానకు పుట్టినప్పు డద్భుతములతోఁ
బుట్టకున్నను యుక్తవయస్కుఁడైన పిదప భక్తాగ్రగణ్యుఁడయ్యె.

హిందువులలోఁ బుత్రసంతానము గలుగుట పరమానంద
హేతువు. అదియటుగు పుత్రసంతానము లేనిపురుషునకుఁ గుమారుఁ
డు గలిగినప్పు డాకుటుంబమునకుఁ బొడము నానందము నెవఁడు
వర్ణింపఁగలఁడు? పున్నమినాఁటి రాత్రిఁ బుత్రుఁడు కలుగుటయు మ
ఱియాఁ డుదయమునఁ గాళునిగృహము మహానందనిలయమై యుం
డెను. కాళున కదియటుకొక కూఁతురుండెను. ఎందఱాఁడుబిడ్డ లున్న
ను హిందువులలో మగబిడ్డలులేని మనుష్యుఁడు కేవలము మందభా
గ్యుఁడుగ నెంచఁబడుటచేఁ గాళుఁడు పుత్రోత్పత్తియైనతోడనే తాను
ధన్యుఁడనయితినని తలంచి సంతోషపరవశుఁడై తత్క్షణము పురోహి
తుం బిలిపించి బాలుని భవిష్యద్దశను గూర్చి మున్నె యెఱుంగవల
యునని జాతకము వ్రాయుమని కోరెను. ఇట్లు పురోహితుం బిలి
పించి జాతకము వ్రాయుమనుటలోఁ గుమారుని జాతక మఖండై
శ్వర్యవంతముగ నుండునని మె తండ్రి యభిప్రాయము. జ్యోతిష్కుఁడు
ను బరేంగితజ్ఞానము కలవాఁడుకావునఁ దండ్రియనుకొన్నట్లు కుమా
రుఁ డఖండైశ్వర్యవంతుఁ డగుననియు గ్రహములన్నియు నుచ్చస్థాన
మున నున్నవనియుఁ జెప్పి యంతతోఁ బోక బాలునకు స్వేచ్ఛతాత్రి
ధిపత్యముగూడ గలుగునని వక్కాణించి తదనుకూలముగ జాతక
మువ్రాయఁ దండ్రి యదిచూచి మేరమీరిన సంతోషమునందెను.
పురోహితుఁడు జాతకమునందుఁ బూర్వోదాహృతములగు విషయము

లకుఁ దోడుగ నానకు గొప్ప యవతారపురుషుఁ డనియు వానింబో లినవారు మున్నెవ్వరు లేరనియు వానిని హిందువులు మహమ్మదీ యులు సమానముగ గౌరవింతురనియుఁ బంచభూతములు వానికి లోఁబడి యుండుననియుఁ నతఁడు పరమేశ్వరారాధనమునందు నిర తుఁడై యుండుననియుఁగూడ వ్రాసెనఁట. ఈవిషయములు పురో హితుఁడు మొట్టమొదట జాతకమునందు వ్రాయుట యబద్ధము. నానకు మతసంస్కర్తయై లోకఖ్యాతుఁడైన పిదప వానిభక్తులు మొదలగువారు కల్పించుట నిజము. జాతకము లెట్టివో జాతకములు వ్రాయు జ్యోతిష్కులెట్టివారో వారిమాట లెంతవఱకుఁ బ్రమాణము లో మనదేశస్థులు చక్కగా నెఱుఁగుదురు. కావున నిచ్చట విస్తరిం చి వ్రాయనక్కరలేదు.

కాళుఁడు పురిటిదినములు గతించిన వెనుకఁ గుమారునకు జాతకర్మములు చేసి నానకని నామకరణము చేసెను. కాళుఁడు ప్రథమసంతానమైన యాఁడుబిడ్డకు నదివఱకే నానకియని పేరుపెట్టు టచే నామెపేరే కొడుకునకుఁగూడ బెట్టఁదలఁచి యట్లుచేసెను. నానకు దృఢశరీరుఁడై దినదినప్రవర్ధమానుఁ డయ్యెను. ఈతని శైశవమును గూర్చి చరిత్రకారు లెవ్వరును దగినట్లు వ్రాయలేనందున వానిచిన్న నాఁటి లక్షణము లిట్టివని నిర్ణయింప మనశక్యముగాదు. అతఁడు బా ల్యమునఁ దోడిబాలురదోడను బాలకులతోడను గలసిమెలసి యాట పాటలలో మెలంగక తరుచుగ నితరులతో మాడలాడ నొల్లకయుం డువాఁడని కొందఱు వ్రాసిరి.

ఏడవసంవత్సరమందుఁ దండ్రి వాని కక్షరాభ్యాసము చేసి గురువునకు బహుమానములిచ్చి విద్యాభ్యాసము చేయింపుమని కొడు కు నప్పగించెను. హిందీభాషను వ్రాయుట చదువుట వర్తకుల కుప యోగించు లెక్కలువేయుట మాత్రమే యాగ్రామ పాఠశాలలోఁ

జెప్పునట్టి విద్యలు. బడిపంతులు వాని కక్షరాభ్యాసముం జేసి తన చెప్పఁగల విద్యలు గరపుటకు బాలకుని బడికిం దోడ్కొనిపోయెను. నానకు బడికిఁబోయి మొదటినాఁడు నెమ్మదిగ నుండెను; కాని రెండవనాఁ డతఁడు చదువుకొనక యూరక గూర్చుండ గురువు వానిం గసిరి బెదరించెను. బెదరించుటయు శిష్యుఁడు గురువుపైఁ దిరుగఁబడి గురువును ధిక్కరించి నాకుఁజెప్పుటకు నీకేమి చదువు వచ్చునని వాని నడిగెనఁట. శిష్యుని ప్రశ్నమువిని గురువు తెల్లబోయి తాను సకలశాస్త్రములు నేర్చినట్లు ప్రత్యుత్తరమిచ్చెను. ఆమాటలువిని నానకు లౌకికవిద్య నిరుపయోగకర మగుటయేగాక హానికర మనియు దాని నభ్యసించినవారు సంసారపాశములం దగుల్కొని యెన్నటికిం బయల్పడఁజాలరనియు మనుష్యులు శ్రద్ధతో నేర్చుకొనవలసిన విద్య వేఱొకటి యున్నదనియు సత్యమును గ్రహించుట. భగవంతునియెడ భక్తి గలిగియుండుట భగవన్నామము కీర్తనము సేయుట మొదలగునవియే నిజమైనవిద్యలనియు నవియే యుభయలోకతారకము లనియు గురువునకు బదులు చెప్పెనఁట. అప్పలుకులు పలికి యంతట నూరకుండక నానకు భక్తితత్వముం దెలుపు శ్లోకము నొకదానిని జదివెనఁట. ఆశ్లోకార్థమిది.

“నీలోకానురాగము సిరాజేసి, నీబుద్ధిఫలకము కాగితముజేసి నీమనస్సు వ్రాతగాఁడుగఁ జేసి పరమేశ్వరుని గూర్చి వ్రాయుము. వ్రాసి వానియందు దృష్టినిలుపుము. ఏమివ్రాయవలయునని తలంచుచున్నాడవు. భగవన్నామము వ్రాయుము. భగవత్కీర్తనలు వ్రాయుము. భగవంతుఁ డాద్యంతశూన్యుఁడన్న మాట వ్రాయుము. మిత్రుఁడా! ఇట్టి వ్రాత నేర్చుకొంటివేని దేవుని యెదుటకు నీవుబోయి యీలోకమున నీవు నడచిన నడతకు సరిగ లెక్క చెప్పవలసివచ్చిన ప్పుడు తప్పక యావ్రాత నీపక్షము బూని కళంకరహితమై నిన్ను

రక్షించును."

ఏడుపదుల యేండ్ల వయసుగల వృద్ధుని నోటనుండి వెడలవలసిన యాభక్తిరస ప్రధాన వచనములు విని గురువు వాని యసాధారణశక్తి కచ్చెరువడి తన మనంబున నప్పుడప్పుడు పొడమి తనకు దుస్సాధ్యములయిన వేదాంతవిషయిక సందేహములఁదీర్చుకొనుటక దియే సమయమని యాబాలు ననేక ప్రశ్నము లడిగెనఁట. అడిగిన తోడనే నానకు వాని కన్నిఁటి కవలీలగఁ దగునుత్తరము లిచ్చెనఁట. ఆయుత్తరములు సహేతుకములుగ నున్నట్టు తోఁచుటయు గురువు బాలుఁడని యెంచక భయభక్తులు మెఱయ శిష్యుని పాదములకు నమస్కరించి యతఁడు సామాన్యుఁడు గాఁడనియు నవతారపురుషుఁడని యుశ్లాఘించెనఁట. ప్రపంచమందు మహాద్భుతమగు బుద్ధివికాసము గల బాలురు లేరని చెప్పఁ జాలము గాని యేడేండ్ల యీడు గల బాలకుఁ డట్టి పరమార్థబోధకములగు పలుకులు పలికెననుట విశ్వసనీయము కాదు,

అతఁడు పుట్టిపెరిఁగిన కుటుంబము నిరంతరము వేదాంత చర్చలలోఁ గృషిచేయుచుండిన పక్షమున బాలకున కాసంబంధములైన మాటలు కొన్ని పట్టుపడి యుండు నని మన మూహింపవచ్చును. అట్టిదేదియు నిచ్చట గానరాదు, లేక సహజముగ మహాబుద్ధిమంతుండగు బాలుఁడు గొప్పవిద్వాంసులయు విరాగులయు సహవాసము జేయుచుండిన పక్షమున నీవిధములగు పలుకులు కాకపోయినను జ్ఞానగర్భితములగు కొన్ని పలుకులు పలికినాఁడని మనము నమ్మవచ్చును. అది యేదియు నానకు విషయమునఁ గానరాదు. తల్లిదండ్రులకు వేదాంత కృషి లేదు. విరాగులతో సహవాసమున్నట్టు గనఁబడదు. మంచివిద్యావ్యాసంగ మదివఱకే యుండవచ్చుననుకొన్న బడికిఁబోయిన మఱునాఁడే యీచిత్రకథ జరిగెనని చెప్పుచున్నారు. కావున

నేవిధమునఁ జూచినను మన మా కథ నమ్మఁదగినదిగ లేదు. దాని యాథార్థ్య మేమైయుండుననఁ నానకు నోటనుండి యాపలుకులు బడికి పోయిన మఱునాఁడే రాకపోయినను యుక్తవయస్కుఁడై జ్ఞానవంతుఁడై మతసంస్కర్తయైన పిదప వానినోటనుండి యావాగ్రత్నములు వెడలియుండవచ్చును. చరిత్రకారులు వానికిమహిమ లారోపింపఁ దలఁచి పెద్దనాఁటి మాటలు పిన్ననాఁటికి మార్చి యుండవచ్చును.

అది యటుండ నీ సంభాషణములు జరిగిన పిదప నానకు మఱి యెన్నఁడు బడికి బోయియుండలేదనియు వానిచదువు రెన్నాళ్ళతో ముగిసెననియు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఇదియును వాని శిష్యులు వానియందలి భక్తివిశేషముచేతఁ దక్కిన ప్రాకృత పురుషులవలె నతఁడు చిరకాలము విద్యనేర్చికొనలేదని లోకమునకుఁ దెల్పఁ దలఁచి యట్లు వ్రాసియుందురేగాని యది నిజము కాదు. ఏలయన నెట్టి కుశాగ్రబుద్ధికైనఁ జదువుకొనకయే విద్యరాదు. అభ్యసించునప్పుడు విద్య సూక్ష్మముగ గ్రహించునట్టి మనీషయుండిన నుండవచ్చును. చదువక పండితుఁడైనవాఁ డెవ్వఁడును లేఁడు. మఱియు నానకు హిందీభాషం జక్కగఁ జదువను వ్రాయను నేర్చినట్లును లెక్కల వ్రాయుటలోఁ బ్రోఢయైనట్లుఁ గొంతకాల ముద్యోగములు చేసినట్లును మనకుఁ బెక్కుదృష్టాంతములు గలవు. అక్షరాభ్యాసమైన మఱునాఁడే చదువుముగించిన కుఱ్ఱవాని కంతటి ప్రజ్ఞగలుగుట యసంభవము గావున నతని చదువు రెన్నాళ్ళ చదువుగాక రెండేండ్ల చదువో, అంతకంటెఁ గొంచెముతక్కువకాలపు చదువో యైయుండవచ్చునని మన మూహింపవలసి యుండును. ఎట్లయిన నానకు విద్యావిషయమున విస్తారము శ్రద్ధ జూపినట్లు గానఁబడదు. కుమారునకుఁ జదువుమీఁద నెక్కుడు తమకము లేనియో నేర్చినవిద్య సగౌరవముగ దేహయాత్ర గడపుటకుఁ జాలుననియో యెంచుచేతనో తండ్రి

యచిరకాలముననే కొడుకుం జదువమానిపించెను. అట్లు పాఠశాల విడుచునప్పటికినానకు తొమ్మిదియేండ్ల ప్రాయమువాఁడు.

చదువు మానిపించిన వెంటనే కాళుఁడు కుమారు నేదైన వ్యాపారమునం బ్రవేశపెట్టవలయునని నిశ్చయించుకొనెను. అది మొదలు తండ్రికిఁ గొడుకునకు నెడతెగని వైరుధ్యమే సంభవించెను. నానకు ప్రత్యక్షముగఁ దండ్రి చెప్పిన పని జేయ నిష్టము లేనట్లుఁ గనఁబడకపోయినను దన కైహిక వ్యాపారములయం దెంతమాత్రి మిష్టములేదని చేష్టలచేతఁ జెప్పకయే చెప్పుచు వచ్చెను. విద్యాభ్యాసము ముగిసినతోడనే కాళుఁడు కుమారునిఁ బనిలో మప్పఁదలఁచి వాని బసులకాపరితనమున నియోగించెను. నియోగించుటయు నానకు వల్లెయని యాపని జేయ సమ్మతించెను. కాని యల్పకాలములోనే తన కుమారుఁడు పసుల కాఁచుటకుఁ బనికిరాఁడని కాళుఁడు గ్రహించెను, ఏలయన నానకు పరమదయాళువగుటచే నోరులేని జంతువులను బలవంతముగ నిర్బంధించి యొక్కచో నిల్పుట కూడదని తలంచి పసుల నదలింపక యవి యిచ్చవచ్చిన తెఱంగున విహరించుచుండఁ జూచుచు నూరకుండును. లేఁగదూడ తల్లిపాలు కుడువఁదలఁచెనా దాని తల్లిపాలదియేల కుడువఁగూడదని తత్క్షణమె యాదూడను పాలుగుడువనిచ్చును. ఆకుమడియైనను సరియే పండిన చేనైనను సరియే యావు మేయఁదలఁచెనా, పాప మవి యిచ్చవచ్చినట్లెల్ల కసవు తినఁగూడదని తత్క్షణ మేదానిని మేయ విడుచును.

పరమేశ్వరుఁడు మనుష్యులను దదితర జంతువులను సమానముగ సృష్టించినను మనుష్యుఁడు లేనిపోని యధికారములఁబూని యతిక్రూరుఁడై నోరులేని యాజంతువులను దన యిచ్చవచ్చిన తెఱంగున బాధలు పెట్టి మంచిపదార్థములెల్లఁ దానే యనుభవించుచు నెల్ల సౌఖ్యములఁ దానే పొందుచు నుండుట యేటిన్యాయమనియు మను

ష్యులలోఁ దల్లులు పాలిచ్చి తమ బిడ్డలఁ బోషించి యెంతో గారా
మునం బెంచుకొనుచుండఁ బశువు తమ యిచ్ఛవచ్చినప్పుడు తమ పొ
దుగుపాలను తమదూడల కిచ్చుకొనుటకేల స్వాతంత్ర్యముండఁగూడ
దనియు మనసున సందేహములు పుట్టి వానిని బాధింపఁదొడఁగెను.
ఏసందేహములు దోఁచిననేమి ఏయాలోచనలు తట్టిననేమి మొత్తము
మీఁద కొడుకుచేసినపనులు తండ్రికిఁ గిట్టవయ్యె. నానకుపసులకాపరి
యైయున్న కాలమున రెండు చిత్రికథలు జరిగినవఁట. నానకు పేరెత్తి
నవారందఱు దామునమ్మిన నమ్మకున్న నీయద్భుతకథలు రెండు జె
ప్పుకొనకమానరు. అందు మొదటికథ యిది. నానకు మండు వేసఁగి
నొకనాఁడుపగలు రెండుజాములవేళ నీచెవిగాడు పాచెవికిగొట్టుచున్నప్పు
డూరబైటఁ బసుల కాచుచుండి కునికిపాట్లురాఁగా నిద్దురనాపఁజాలక
యొకచెట్టుక్రిందఁ బండుకొనియెనఁట. సూర్యుఁడు పశ్చిమమునకుఁ బో
వుచున్నకొలఁది చెట్లనీడలు మునుపున్న తావుననుండకమాఱుచుండుట
సహజముకదా! ప్రకృతిధర్మ మట్లున్నను నాఁడది యేమిచిత్రమో
కాని నానకు పండుకొన్న చెట్టునీడ సూర్యగతింబట్టి మార్పు జెందక
యున్న తావునేయుండి యాబాలున కెండతగులకుండఁ గాపాడుచుం
డెనఁట.

రెండవకథ యీవిధముగనున్నది. గ్రీష్మకాలమున మఱియొక
దినమున నతఁడు పసులగాఁచుచు నిద్రాభరము నాపలేక మట్టమధ్యా
హ్నము మఱియొకతావున నెండలోఁ బండుకొని గాఢనిద్రజెందెనఁట.
అప్పుడొక నల్లత్రాఁచు తనపడగ బాలునితలమీఁద విప్పి వాని
కెండసోఁకకుండ సంరక్షణము చేయుచుండెనఁట. ఆ సమ
యమున నే టాలువెండి గ్రామనివాసి రాయబులారు గుఱ్ఱ
మెక్కి యెటనుండియో స్వగ్రామమునకుఁ బోవుచు నానకు
పండుకొనియున్న స్థలము సమీపమునుండి చనుచు నా మహా

ద్భుతమును జూచి విస్మితుఁడై తెప్పవాల్పక బాలుని వానిం గాచు సర్పమును జూచుచు గుఱ్ఱమునాపెను. కొంతదవ్వుననున్న పరిజనులంతలో వానింగలుసుకొనుటయు రాయబులారు వానింజూచి “యీబాలుఁడు మృతినొందెనా” యని యడిగెను. మృతినొందలేదని వారు ప్రత్యుత్తరము చెప్పుటయు రాయబులారు కడునచ్చెరువడి పామును వెడలఁగొట్టుమని వారి కానతీయ వారుమిక్కిలి మెలకువతో బాలునకపాయము గలుగకుండ సర్పమును బెదిరించి యవ్వలకుఁదోలి బాలునిడాసి యతఁడు తామెఱిఁగినవాఁడేయగుట వానిం దమ యజమానునకుఁదెల్పిరి. రాయబులారు వెంటనే గుఱ్ఱముదిగి బాలుని ముద్దుబెట్టుకొని యతఁడెవ్వఁడో యవతారపురుషుఁడని నమ్మి గ్రామమునకుఁ బోయి తనచూచినదంతయుఁ బూసగ్రుచ్చినట్లు కాళునితోఁజెప్పి బాలకుఁడు సామాన్యమనుష్యుఁడు గాఁడు కావున వానియెడల నెక్కుడు దయజూపుమని బ్రతిమాలి యింటికిఁబోయెను. ఇట్లు రెండుమూఁడుసంవత్సరములు కాళుఁడు కుమారుని గోపాలకవృత్తియందు నిలిపి దానికతఁడు తగఁడని గ్రహించి కొడుకు చాకచక్యమునుజూపి పాటుపడఁదగినదియుఁ బడిన పాటునకు లాభము గలిగించునదియు నగు వృత్తిం బ్రవేశపెట్టఁదలఁచి యొకపొలము వానికిచ్చి యందు వ్యవసాయముచేయుమని వానిని నియోగించెను. అదనునందే పొలముదున్నుట విత్తనములనాటుట మున్నగుపనులు జరిగెను. పక్షిదొంగల బారినుండియు, పందులు మొదలగు జంతువులబారినుండియుఁ జేను కాపాడుట నానకు పనియైయుండెను.

అతఁడును దనపొలమున వ్యర్థముగఁ గూర్చుండక పలుమాఱిట్టటుఁదిరుగుచుఁ గేకలువేయుచుఁ జప్పటులఁజఱచుచుఁ జేనుకాచుచున్నట్లె యగుపడెను. కాని యొకనాఁడైన నతఁడు చేతులార వడిసేలత్రిప్పి యెఱుఁగఁడు. మీఁదుమిక్కిలి ప్రక్కపొలములయందలి కాఁపులపశు

వులు తన చేలఁ బడినప్పుడు వానింబారఁదోలుట తనకెంతో కష్టముగ నుండెను. ఒక్కొక్కనాఁడతఁడు దయారసముచేత నోడలు మఱచిమృగములు పశువులు యథేచ్ఛముగఁ బండినచేను మేయుచుండఁ గన్నులప్పగించి చూచుచు నూరకుండువాఁడు. కాళుని మనసెప్పుడును గుమారునిదెస యనమానాస్పదమైయుండుటచే నొకనాఁడతఁడు పొలమునకుఁబోయి చేను దెసఁజూచి యది పాడుగానుండుట గ్రహించిమితిమీఱిన కోపమునంది యాబాలకుని మిక్కిలి తూలనాడి దానం దని విన్నొండక నింటికిఁబోయి తనయుండు మహైశ్వర్యవంతుఁ డగునని జాతకము వ్రాసిన పురోహితుని మీఁదఁబడి వాని నెంతయు నిందించెను.

ఆపురోహితుఁడును శాంతముదాల్చి కాళుని కోపకారణమెఱిఁగి తనపలుకు లసత్యములు కావనియు నానకు సర్వలోకపూజ్యుఁడగుననియు లక్షలకొలఁది జనులకతఁడు మహోపకారము చేయఁగలవాఁడగుననియు రాజాధిరాజులైన వాని గీచినగీటు దాటక వినయమున మెలంగుదురనియు జెప్పి వానిననునయించి పంపెనట. నానకునియొక్క చరిత్రకారులు జ్యోతిశ్శాస్త్రమునందు నమ్మికగలవారగుటచేఁ బైపలుకులు పురోహితుఁడు చెప్పినను జెప్పకున్నను వానినోటఁ బెట్టియుందురు. ఇక్కడికి నానకు పసులకాపరితనమునకే గాక వ్యవసాయము చేయుటకుఁగూడ దగనివాఁడని తండ్రి విస్పష్టముగ గ్రహించి వాని నేవృత్తియందుఁ బ్రవేశపెట్టి బాగుచేయనగునోయని కొంతకాలము విచారించి యేపనియందు నియోగింపకుండ నూరకయే గొన్నిసంవత్సరము లుంచినపక్షమున బాలుండు బాగుపడవచ్చు నని వానినైదుసంవత్సరములవఱకు యథేచ్ఛముగ సంచరింపుమని , చెప్పెను.

---

# ద్వితీయాధ్యాయము.

విద్యాబుద్ధులు నేర్చుకొనవలసిన కాలమున జనకుఁడు కుమారుని మనసువచ్చినట్లుఁ దిరుగుమని చెప్పుట యసంభవమేయైనను గాళుఁడు పుత్రుని వర్తనముచేత విసిగి యట్లు చేసెనేగాని బిడ్డను బాగుచేయవలయునను తలంపులేక కాదు. కాళుఁడు పండ్రెండవ యేఁట నానకునః స్వేచ్ఛావిహారమునకై విడిచి దృఢమనోబలము గలవాడగుటచేత నైదేండ్లలోపున మరలనెన్నఁడు వానిపురోవృద్ధి విషయమైన వానితో ముచ్చటింపక యైదేండ్లు గడచినపిదప ననఁగా నానకునకుఁబదునేడేండ్లు వయస్సు వచ్చినపుడు బుద్ధియేమైన మరలినదేమోచూడవలయునని కొడుకునొకసారి పిలిచి తాను మరణము నొందకమునుపే నేదైననొక మంచివృత్తి నేర్చుకొనుట మంచిదనియుఁ దనమరణానంతరమున మొగమైనఁ జూచువారుండరనియు వ్యవహారము నేర్చుకొనవలసిన యదను దాటినచో మరల గూడిరాదనియు నయమున భయమునఁ జెప్పి కొడుకును బుజ్జగించెను.

చిన్నతనమునుండియుఁ గాళుఁడు వ్యవహారమేచేయుటచే నదియే యుత్తమమైన వృత్తియనియు నదిలేనిచోఁ గొడుకు బ్రతుకలేఁడనియుఁ గాళుని యభిప్రాయము గావున నాతడంత నొక్కిచెప్పెను. కొడుకు తండ్రిపలుకులు తలవంచుకొని విని మిక్కిలి వినయముతో వెనుక చేసినదంతయు క్షమింపవలయునని యడిగి చేయుమన్న వ్యాపారము తప్పక చేయునట్లొడంబడెను. కుమారునియందేదో మంచిమార్పు కలిగినదని తండ్రి సంతసించి యాపదును చెడకుండ వానిందగినపనిలో నియోగింపవలయునని వానిచేతి కిరువదిరూపాయలిచ్చి చుట్టుపక్క పల్లియలకుంబోయి సరకులుకొని తీసికొనిరమ్మనియు లాభమున కమ్ముమనియుఁ జెప్పి యాచిన్నవ్యాపారములో జాగ్రత్తగా నడచుకొని

ధనము మంచివినియోగము చేసినపక్షమున ముందుముందు వాణిజ్యము నిమిత్తె మెక్కువధనమిచ్చునట్లు వాగ్దానముచేసి యాసపెట్టెను. అప్పలుకులు విని నానకు "ఈధనము మంచివినియోగమే చేసెద" నని నుడివిబయలుదేరిపోయెను. కాళుఁడు కొడుకునందుఁ బూర్ణవిశ్వాసములేనివాఁడై యెందుకైనను మంచిదని బలుఁడను నొకకాఁపువానిని జతయిచ్చి తనకుమారుఁడు సొమ్ము పాడుచేయకుండఁ జూడుమని వానితో నొక్కిచెప్పి సొమ్ము కుమారునిచేతికియ్యక బలునిబొడ్డుకొంగున గట్టిగ మూటఁగట్టి పంపెను. కాళుఁ డెంత జాగ్రత్తపడినను దైవనిర్ణయమే వేఱుగనుండెను. నానకు తండ్రికడ సెలవుగై కొని బయలుదేరినదిమొదలు "ఈధనము మంచివినియోగమేచేసెద" నన్న మాటలకు తండ్రికిఁదోఁచిన యర్థముకంటె విపరీతార్థము తోఁచనారంభించెను. ఇందుకుఁ గారణము తండ్రి యభిప్రాయము తెలియకపోవుట కాదు. బయలుదేరినతోడనే వానిమనస్సు సత్కార్యములమీఁదికిఁ బోయి శరీరమును బరవశముచేయ నతఁడు తనతండ్రి యేమిచేసినను సరే యతఁడిచ్చినసొమ్ముతో బియ్యము పప్పు మొదలగు సరకులు కొని మాఱుబేరమున కమ్ముటకంటె నాధనము భగవద్విషయమున వినియోగించుట యుత్తమమని భావించెను.

తండ్రిచెప్పినవిధమునఁ జేయనోడంబడి మరల వానియాజ్ఞకు విరుద్ధముగా వర్తించుట మంచిదికాదని నానకు కొంతసేపు విచారించెను. కాని వానిహృదయ మెన్నివిధముల మరల్చినను మరలదయ్యె. అతఁడట్లు ధర్మకార్యస్థితమనస్కుఁడై చనుచుండ మధ్యమార్గమున నొక సన్యాసులగుంపు వానికగపడెను. ఆవిరాగు లదినటకు కొన్ని దినములనుండి యాహారములేక మలమలమాడుచుండిరని విని నానకు మిక్కిలిజాలినొంది బలునియొద్దనుండి బలవంతముగా సొమ్ముపుచ్చుకొని యాగుంపుపెద్దచేతి కిచ్చెను. ఆవృద్ధసన్యాసియుఁ దన కాసొమ్మక్కఱ

లేదనియుఁ దినుటకుఁ బదార్థము లుపయోగించును గాని రూకలుప యోగింపవనియుఁ జెప్పి యాదానమును నిరాకరింపఁ బరమదయాళు వగు నానకు పరుగుపరుగున దాపుననున్న పల్లెకుఁబోయి గోధుమపిండి చక్కెర పప్పుమొదలగు సరకులఁ గొని తెచ్చి వానికి సమర్పించెను. సన్యాసులు వానింబరిగ్రహించి విందారగించిరి. నానకు వృద్ధసన్యాసి తోఁ జాలసేపు వేదాంతచర్చఁజేసి వారచ్చోటు విడిచినపిదప మెల్ల మెల్లన నింటికి బయలుదేరెను. కాని వానియడుగులు మునుపటి యట్లు సాగవయ్యె. తనతండ్రి యెట్టివాఁడో తనకుమూఁడఁ దలఁచిన యాపదయెట్టిదో యెఱుంగుటచే నతఁడు బెంగగొని దారిలో నడుమ నడుమ "అయ్యో! నేనేలపరవశుఁడనై పోతినోయి" యని బలునితోఁ బలుక, బలుఁడును "వద్దని నేను మొత్తుకొనలేదటోయి. నీవు వినలేదు కాని" యని జనులు చెప్పుచు వచ్చెను.

అట్లుమాటలాడుచు నిరువురు గ్రామసమీపమునకుఁ జేరి నానకు తండ్రికి జడిసి యింటికిఁబోవక యూరుబయట చెట్లలో దాఁ గికొనెను. బలుఁడు స్వగృహమునకుఁ బోయెను. కాలుఁడు రావలసినవేళకుఁ గుమారుఁడు రాలేదని వగచుచు బలుఁడు వచ్చిన ట్లువిని విసవిస వానియింటికిఁబోయి యాత్రిముతోఁ దనకుమా రునివార్త యడుగ వాఁడు జరిగినవృత్తాంతమంతయుఁ బూసగ్రుచ్చి నట్లు జెప్పెను. అదివిని కాలుఁడు రౌద్రాకారముంబూని ధనముపోయి నందుకు నేరమంతయు వానిమీఁద మోపెను. బలుఁడు జంకకఁ "నే వద్దని నుడివిన నీకొడుకే పాడుచేసె" నని బింకములోఁ బ్రత్యుత్తరము జెప్పఁ గొడుకుజూపుమని జెబ్బపట్టుకొని వానిని లాగికొనిపోయి చెట్ల చాటుననుండి కొడుకుఁ నీవలకీడ్చి తిట్లవానవానిమీఁదఁ జిత్తజల్లుగఁ గు రిపించెను. తండ్రియెన్ని విధముల దూషించినను నానకు తలవంచుకొని ప్రత్యుత్తరముఁ జెప్పక యూరకుండెను. కుమారుఁడు పుట్టినదిమొద

లు వానినెన్నివిధములనో బాగుచేసి తనవృత్తియందుఁ బ్రవేశపెట్టి ధనమార్జింపఁ జేయవలయునని రాయబులూరి కాలుఁడు పుత్రుని యప్రయోజకత్వముఁ జూచి నిర్విణ్ణుఁడై యాసలన్నియు నడుగంట వాఁడెందుకుఁ బనికిరాఁడని చచ్చినను సరే బ్రతికినను సరే వానిజోలికిఁ బోఁగూడదని నిశ్చయించుకొనియె.

తండ్రికోపము వడగండ్లవానవలె మొట్టమొదట విజృంభించెనేగాని తరువాత నంతమిక్కుటముగా నుండఁదగదని నానకు గ్రహించి యాదినము మొదలుకొని తండ్రిచూచుచుండఁగనే సాధువులతో సన్యాసులతో సహవాసముచేసి మాటలాడఁజొచ్చె. వారిద్దరొక యింటనున్నను దండ్రికొడుకులాగుండక యొండొరుల నెఱుఁగనివారివలె నుండిరి. కాలునకుఁ గుమారునివలనఁగలిగిననష్టపరాభవములను నానకునకుఁ గలిగినయవస్థయు నిరుగుపొరుగువారందఱువిని విచారించిరి. రాయబులూరు మఱునాఁడుదయమునఁ గాలునిఁ దనయింటికి రావించి నానకునెడ నతఁడు చూపినకాఠిన్యమునకుఁ దనకు చాల విచారముగా నున్నదనియు వానింబాధపెట్టవద్దని తానొకసారి వెనుక కోరినను దనమాటయైన లక్ష్యముసేయకపోవుట యనుచితమనియుఁ గలిగిన నష్టముఁ దానిచ్చుకొనఁ గోరుచున్నవాఁడనియుఁ జెప్పి యిరువది రూకలు దెచ్చి కాలునిచేతిలోఁ బెట్టెను. కాలుఁడు మిక్కిలి సిగ్గుపడి తన కాసొమ్మక్కఱలేదని చాలసేపు నిరాకరించెను కాని వానిప్రార్థన మీఁద నెట్టకేలకు స్వీకరించెను. కుమారుఁడు పాడుచేసినసొమ్ము కాలుఁడు రాయబులారుకడ పుచ్చుకొన్నాఁడనివిని లోకులు కాకులు పొడిచినట్లు పొడిచి యాత్మగౌరవముఁ జంపుకొని ధనమే పావనముగా నెంచుకొన్నందుకు వానిని మిక్కిలి నిందించిరి. ఆనిందలుపడలేక కాలుఁడు సొమ్ముతీసికొనిపోయి మరల రాయబులారున కీయఁబోవ నతఁడు పుచ్చుకొనక వానియొద్దనే యుంచుమని బ్రతిమాలి వెండియు నిట్ల

నిమె. "నీకుమారుఁడు నీయింట బొత్తుగా సుఖపడుటలేదు. వానిని వే ఱొకచోట బసచేయింపవలయునని నేఁదలంచుచున్నాను. నేను తురక నై పోతినిగాని లేనిచో వానిని మాయింటనే పరమానందముతో నుం చుకొందునుగదా! జాతిమతభేదములచేత నట్టిప్రాప్తి నాకులేదు" అని వానితోఁ బలికి యది మొదలు రాయబులారు నానకునందు మిక్కిలి భక్తిప్రేమలు గలవాఁడై వానికి సుఖమిచ్చు బసనేర్పరుపవలయునని దలపోయుచుండెను.

అట్లుండ నొకనాఁడు సుల్తానుపురవాసియగు జయరాముఁడను క్షత్రియుఁడొకఁడు పంజాబుదేశ పరిపాలకుఁడగు దౌలతుఖానులోడీ పనుపునఁ బంటలయంచనా వేసికొనుటకు తాల్వెండీ గ్రామమునకుం బోయెను. అతని కప్పటికి వివాహముకాలేదు. ఆరాజకుమారుఁ డొ క్కనాఁడు కాలుని కుమార్తెయగు నానకినిఁజూచి యామె చక్కఁదన ము నచ్చుటయు నాకన్నియను దనకిమ్మని తండ్రినడిగెను. అతనికోరి క కనుగుణముగ రాయబులారుగూడ జయరాముని సద్గుణముల నగ్గ డింపఁ గాలుఁడు సంబంధ మంగీకరించి ముందుగ ప్రధానముచేసి య ల్పకాలములోనే కూఁతును జయరామునకిచ్చి వివాహముచేసెను. వివాహానంతరమునఁ బెండ్లికూఁతురు పెండ్లికుమారునితో గృహప్రవే శమునకుఁబోవఁ గాలుఁడు నానకును వానివెంట సుల్తానుపురమునకం పెను. నానకు తండ్రిమాట జవదాటక నచ్చటికిఁ దిన్నగాఁబోయి చెలి యలను మరల దోడ్కొనివచ్చెను. మఱుసటిసంవత్సరము వైశాఖ మాసమున జయరాముఁ డత్తవారియింటికి రాఁగా రాయబులారు వానింబిలిచి నానకునకు బొత్తిగా సుఖములేదనియుఁ దండ్రిమిక్కిలి కఠినుఁడగుటచేత స్వగృహమున నున్నంతకాలము కష్టమే పాలించు ననియుఁ దోఁబుట్టువు దగ్గరనున్న పక్షమున నతనికి సుఖము కలుగునని యుఁజెప్పెను. జయరాముఁడందుకుసమ్మతించివానినివెంటఁగొనిపోవుదు

సనిపరిత్యుత్తరమీయ రాయబులారు "తొందరపడవద్దు ఇదిసమయము గాదు. సమయమువచ్చినప్పుడునేనేపంపెద" ననియప్పటికినివారించెను. అనంతరము జయరాముఁడు భార్యాసమేతుఁడై స్వగ్రామమునకుఁ బోయెను. పిమ్మట కొన్నిమాసములు గడువ నొకనాఁ డుదయమున స్నానముచేసి చెంబుచేతపట్టుకొని యింటికిఁబోవుచుండ దారిలో నొకసాధువు కనఁబడెను. కనఁబడినతోడనే యతఁడు వానికడకుఁ బోయి చాలసేపు వానితో వేదాంతచర్చచేసి చెంబును వ్రేలనున్న యుంగరమును వానికిచ్చి గృహమునకుఁబోయెను. కాళుఁడు వానిని జూడఁగానే యావస్తువు లేవియని యడిగెను. నానకు వానిమాటల కేయుత్తరమును జెప్పక తలవంచి నిలిచియుండెను. అప్పుడు కాళుఁడు దుర్భరకోపావేశమున వానిం బలుతెఱంగులఁ దిట్టి యిట్లనియె. "నీవు నాకెందుకుఁ బనికిరావు. నాగృహము తత్క్షణమవిడిచి నీయిచ్చ వచ్చినకడకుఁబోయి యన్నము సంపాదించుకొని బ్రతుకుము నేను నీవిషయమున నన్నియాసలు విడుచుకొన్నాను."

అహాహా! కాళుఁడు బిట్టలుకతో నేబాలునిఁ బరమమూర్ఖునిగా భావించి నిందించెనో, యాబాలుని లోకులు సర్వజ్ఞునిగ భావింతురని యించుకేనియు నెఱుంగఁడుకదా! అతఁ డెవ్వని దనగృహమం దుండనీయక వెడలనడపెనో యాబాలుని ముందుముందు రాజాధిరాజులు సింహాసనంబులు దిగివచ్చి పరిణతులై నిజాంతఃపురమునకు రమ్మని ప్రార్థింతురని స్వప్నమందైన నెఱుఁగఁడుకదా! అట్లెఱుఁగక యింటనుండి కాళుఁడు కొడుకును దోలుటయేలోకమునకు మేలయ్యె. రాయబులారు నానకును దండ్రియింటనుండి లేచిపొమ్మనవిని కాళుని బిలిచి "నీకు నీకొడుకునకు నింకపడదు. పడనప్పుడు మీయిరువురుఁ బగవారివలె నొండొరుల విడువఁదగదు. కావున నానకును మంచిమాటలుచెప్పి జయరామునికడకుఁ బంపుము. నీకోరికప్రకారము నీ

యింట నుండకపోవుటయు వీలున్నపక్షమున బాగుపడుటయు సంభవించునని హితోపదేశము చేసెను. కాళుఁడాయుపదేశము విని యదిలెస్సగానున్నదని కనిపెట్టి కొడుకుమీఁద నెంతకోపము వచ్చినను గడుపుతీఁపిచేత సంబంధము బొత్తుగావదలుకొనుట కిష్టములేక జయరామునియొద్ద నున్నపక్షమున నెప్పటికైననానకు బుద్ధి తెచ్చుకొని బాగుపడి తనదగ్గఱ వచ్చుటకవకాశముండుననితలంచి యప్ప బావలయొద్దకుఁ బొమ్మని పుత్రునికానతిచ్చెను. రాయబులారు నానకును మిక్కిలి గౌరవింపవలసినదనియు వానికిఁ జూపిన యాదరము తనకుఁ జూపిన యాదరముగ నెంచుకొందుననియు జయరామునకొక జాబువ్రాసి నానకుచేతి కిచ్చెను. ఆజాబుపుచ్చుకొని నానకు విషాద పూరిత మనస్కుఁడై సుల్తానుపురమునకుఁ బోయెను. ఎంతవారికైనఁ దలిదండ్రులను, జన్మస్థానమును విడుచుట కష్టముగదా? జయరాముండు లోకముతోడిపాటువాఁడు కాఁడు గావున వాని కీవిధమగు జా బవసరమేలేదు. జయరామునికంటెను వానిభార్య నానకి సద్గుణములదొంతి యగుటచేతను నామె కున్నంత సోదరప్రేమ సాధారణముగ లోకమునందెవరికి నుండకపోవుటచేతను నానకుఁ డిలువెడలిన తోడనే సుఖపడుకాలము వచ్చినదని మనము నమ్మవచ్చును. బలుఁడను కాఁపుకుఱ్ఱవాఁడు మొదటినుండియు నానకు బరమభక్తుఁడు అందుచేత వాఁడయాచితముగఁ దలిదండ్రులను గృహమును విడిచి నానకువెంటఁ బోయెను. పోయి యొక్కనాఁడైన సుఖింపక గురువుతో గలిసి యెన్నోయిడుమలఁ బడెను.

ఇల్లువిడిచి యైదుదినములు పయనముచేసి నానకు సుల్తాను పురము చేరెను. అక్కయు బావయు గడుఁబరమానందమునొంది వానిని మిక్కిలి గౌరవించిరి. జయరాముఁడు మఱఁదిఁజూచి నీవు యిచ్చ వచ్చినట్లు భగవద్ధ్యానముచేసికొనుచుఁ గూర్చుండవచ్చు నీజోలి

కెవ్వరు రారని స్పష్టముగఁ జెప్పెను. అంతటి యాదరముఁ జూపినం దుకుఁ దనయప్ప బావలకుఁ గృతజ్ఞుఁడై వందనములుచేసి "చిరకాలము మీకు నేను భారముగానుండ" నని తనయాత్మగౌరవము వెల్లడియగు నట్లు బలికెను. తనయునికి బావకు భారముగానుండునని తలంచి నాన కావిధముగాఁ బలుకలేదు. చెడిచెల్లెలింటికిఁ బోవుటకన్న స్నేహితుని యింటికిఁ బోవుట మంచిదను సామెతనుబట్టి పాటుపడక సోమరియై యక్కసొమ్మున్నదని యాత్మగౌరవముం జంపుకొనుటయనార్యకృత్య మని యెఱింగి యాతఁడిట్లుపలికెను. అయూరుఁ జేరినదిమొదలు నాన కేదో యుద్యోగము సంపాదించుకొని సొంతపాటువలనఁ బొట్ట పోసుకొని తన సేవకుఁడగు బలుని బోషింపవలయునని నిశ్చయించు కొనెను. నానకు పనిలోఁ బ్రవేశించుట విజయరాముని కంతగానిష్ట ము లేకపోయినను దోఁబుట్టువు సొమ్ముతినుట నానకున కిష్టములేదని గ్రహించి యట్టియాత్మగౌరవముండుట మంచిదేయని భావించుట చేతను నానకున కెదురాడుట కిష్టము లేకపోవుటచేతను మఱఁదియిష్ట ప్రకారము పోవఁదలఁచి యతఁడు పనికొఱకుఁ బ్రయత్నించెను. అప్పుడే దౌలతఖాను లోడీ పెట్టించిన ధాన్యపుఁగొట్టుమీద గుమా స్తా కావలసివచ్చెను.

ఆపనిలోఁ బ్రవేశించుటకు నానకు సమ్మతించెను. అంతకు మునుపు నానకు మందకొడిగఁ గూర్చుండి యెవ్వరితో మాటలాడక నెల్లప్పుడు పరధ్యానముగ నుండుచువచ్చినందున నుద్యోగములోఁ బ్రవేశించినతోడనే కొంతమాంద్యము వదలుననియుఁ గొడుకు వ్యా పారములోఁ బ్రవేశించినాఁడని విని కాలుఁడు పరమానందమొంది తనయెడం గృతజ్ఞుఁడగుననియుఁ దలంచి జయరాముండు మరఁది సంకల్పమును గొనియాడి యావార్త భార్యకెఱిఁగించెను. నానకి తమ్ముని వార్త పతిముఖమునవిని బాలుఁ డంత యాకస్మికముగ

నెట్లుమాఱిపోవునని విచారించి సోదరీగృహమునుండి కాలముబుచ్చుట కిష్టములేక సోదరుఁడట్లు తలంచెనేగాని స్థిరబుద్ధిగలిగి యామాటకు నిలువంబడియుండఁడని భర్తతోఁజెప్పి యంతట నిలువక తమ్మునిం బిలిచి "మాకు నీవుభారముగా నుండవు. మాకుఁ గావలసిన పదార్థము లన్నియు నున్నవిగావున మానిమిత్తము నీవీపనిలోఁ బ్రవేశింప నక్కఱలే"దని స్పష్టముగఁ జెప్పెను. ఎంత చెప్పినను నానకు తన యుద్యమమును విడువనందున నానకి వానియుద్యమమున కొప్పుకొనియె. పిమ్మట సతీపతులిరువురుఁ జేరి గుదికట్టువంటి సంసారబంధమును నానకు మెడకు తగిలించినచో నతఁడత్యాసక్తుఁడుగాక యుండునని వానికచిరకాలమున వివాహముచేయ నిశ్చయించిరి. కొడుకుద్యోగములోఁ జేరినవార్త కాలుఁడు విని వర్ణనాతీతమైన యానందము నొంది కొడుకింక బాగుపడి తీరునవియు ముందెంతవాఁడో యగునని యు నూటలూరఁజొచ్చెను.

నానకు విక్రమార్క శకము 1544 వ సం॥రము మాఘశుద్ధాష్టమినాఁడు సుల్తానుపురముఁజేరి కొన్ని దినములలోనే యుద్యోగమునఁ బ్రవేశించెను. దౌలతుఖానులోడీ క్రొత్తగుమాస్తాచేతికి ధాన్యపుకొట్టు స్థాపించునిమిత్తము మొదట వేయిరూపాయలిచ్చెను. నానకుయొక్క పూర్వచరిత్ర మెఱిఁగినవారు వాని స్వభావమున కంత విరుద్ధమైనపనిలో నెట్లుప్రవేశింపఁగలిగెనో యని యచ్చెరువడఁ జొచ్చిరి. మాయామర్మము లెఱుఁగని బలుఁడును నానకు లౌకిక వ్యవహారములందుఁ బ్రవేశించుచున్నవాఁడు గావునఁ దన సాయమంతటినుండి యక్కఱలేదనుకొని స్వగ్రామమునకుఁ బోవుటకుఁ దనకు సెలవిమ్మని నానకునడిగెను. నానకు వాని వెంగలితనమునకుఁ జిఱునవ్వు నవ్వి యిట్లనియె. "ఓయీ! మోసపోకుము. నేనెట్లు కాఁదలఁచినవాఁడనో యట్లయితీరుదును. దానికి నాకు నడుమ నేదియు

నడ్డము రాఁజాలను. ప్రస్తుతము కాలక్షేపమునిమిత్తము కొన్నినాళ్ళీ పనిఁ జేయఁబూనితినేకాని యిది నాపరమార్థముకాదు. సమయము వచ్చినప్పుడు మనమిద్దఱముఁ గలిసియే పోవుదము. కావున నీవు నా యొద్దనే యుండుము." అప్పలుకులు వినినతోడనే బలుని సందియ ములు తొలంగెను. తొలంగకపోయినను నానకుమీఁద వానికి మిక్కుటమగు ప్రేమ యుండుటచేత నతని కోరికప్రకారము వాఁడచ్చట నుండవలసినవాఁడే.

నానకు వ్యాపారము రెండునెలలు చేయునప్పటికిఁ గుమారు నొక్కసారి యుద్యోగము చేయుచుండఁ జూడవలయునని యుబలాట పడి కాళుఁడు స్వగ్రామమున ముండ్లమీఁదనుండిన ట్లుండియేమి యుం దోఁచక సుల్తానుపురమునకుఁ బోయెను. పోయి కొట్టుమీఁద గుదు రుగాఁ గూర్చుండి వ్యాపారము సేయుచున్న కొడుకుంజూచి పట్టఁజాలని సంతోషమొంది వ్యవహారమెట్లు జరుపుచున్నాఁడో తెలియఁగోరి కొడుకువ్రాసిన లెక్కలు పరీక్షించెను. పరీక్షింపఁగా వచ్చినలాభము లోనొక గవ్వయైన నిలువయున్నట్లు వానికిఁ గనఁబడలేదు. అయినను గాళుఁడు కొడుకు నేమియుననక కాలక్రమమున నవియు జక్కబడుననితలంచి ప్రస్తుతము కొడుకు కొట్టుమీఁదకు వేళకు వచ్చి వ్యాపారముచేసి వేళ కింటికిఁ బోవుచున్నాఁ డదియే చాలు నని సంతోషించెను.

నానకీ జయరాములు నానకునకు వివాహము జేయఁ గృతనిశ్చ యులైన ట్లిదివఱకే చెప్పియున్నారముకదా? జయరాముం డాసంక ల్పము నెఱవేఱువఱకు సరిగఁ గుడువక నిద్రింపక చుట్టుపక్కల గ్రామములకుఁ దడిమన్ను పొడిమన్నగునట్లు దిరిగి ప్రయత్నించెను. అట్లు ప్రయత్నించుచుండ నొకగ్రామమున మూళుఁడను నొకక్షత్రి యునియొద్దసంప్రాప్తయౌవనయైవివాహయోగ్యయగుకన్య యొకతె

యున్నదని వానికిం దెలిసెను. అల్లుఁడామాట మామకు నెఱిగింపఁ గాళుఁడు మూళునితో వియ్యమందుట కియ్యకొని పరిధానము చేసి కొని రమ్మని జయరామునితోఁ జెప్పెను. పరిధానము యథావిధిగా జరిగెను. వివాహ ముహూర్తము నిశ్చయింపఁబడెను. కాళుఁడు పెండ్లి పనులను జేయింప స్వగ్రామమునకుఁ బోయెను. పరిధానమైన యొక మాసమునకు జయరాముని యొద్దకుఁ గొందఱుపోయి నానకు ధాన్యపు కొట్టు సంబంధమగు లాభమును మూలధనమును సాధువులకు సన్యా సులకు నిచ్చవచ్చినట్లు దోఁచిపెట్టి పాడుచేయు చున్నాఁడనియు దానివలన బావమఱఁదుల కిద్దఱకు నపాయము వాటిల్లుననియుఁ జెప్పిరి. ఆమాటలు విని జయరాముఁడు తన ప్రాణముమీఁదికి వచ్చునని భయపడి కర్తవ్యమేమని భార్యనడుగ నామెమగని తెఱంగున భీతిల్లక తనతమ్ముఁడు లోకవ్యవహార మెఱుఁగనివాఁడు కాఁడనియు నతఁడెం తధర్మాత్ముఁడైనను నీతిసంపన్నుఁడగుటచే నితరులధనము చేతికివచ్చి నట్లు నమ్మఁజేయఁడనియు దృఢముగఁ జెప్పి వానివెఱపుఁ దీర్చుటకుఁ దమ్ముని బిలువనంపి క్షేమమడిగి యిష్టాగోష్ఠి కొంతసేపు నడపెను. అదియే మంచిసమయమని జయరాముఁడు వినయముతోడను శాంత ముతోడను మఱిదిం బలుకరించి యంగడివ్యవహార మేరీతిం జరుగు చున్నది. లాభనష్టము లెట్లున్నవని యడిగెను. నానకు బావనోటనుండి యప్పలుకులు వెడలినలోడనే కంఠస్వరమునుబట్టియు ముఖలక్షణ మునుబట్టియు హానికిఁ దనమీఁద నేదో యనుమానము కలిగినదని గ్రహించి తన్నొక రనుమానించుట కిష్టపడక తననిరపరాధత్వమును వెల్లడిచేసికొనఁదలఁచి తత్క్షణము లెక్కలు పరీక్షసేయుమని బావను గోరెను. నానకియు వానిమాటనే యనుసరించుటచే జయరాముఁడు వానిలెక్కలు శోధించెను. ఏమిచెప్పుదును! లెక్కలుచూడఁగాఁ బెట్టు బడిసొమ్ము చాలతుఖానుగారి లాభము నిలువయుండుటయే గాక

నానకునకు మూఁడువందల యిరువది రూపాయలు రావలసియుండెను. అది చూచి యక్కయు బావయు మిక్కిలి యానందము నొందిరి. కాని తనమరియాదయుఁ దన న్యాయబుద్ధియుఁ బాటింపక నిష్కారణముగ వాఁడు తనమీఁద ననుమానము నొందినందులకు నానకు మిక్కిలి నొచ్చుకొని మనఃఖేదమునొంది వ్యాపారము మాని పోవలయునని తలంచెను. కాని సోదరీభావుకులు చాలబలవంతము చేయుటచేతను వారిమాట గౌరవింపవలయునని బలుఁడు ప్రార్థించుటచేతను నిలువవలసి వచ్చెను. దౌలతుఖాను వానిసత్యసంధతకు మెచ్చి పెట్టుబడి నిమిత్తము రెండువేలరూపాయల నిచ్చెను. కొట్టు క్రమముగ వృద్ధి పొందెను. నెలనెలకు రాఁబడి హెచ్చెను. ఈవృద్ధికి నానకు మిక్కిలి సంతోషింపఁ జొచ్చెను. కాని యాసంతోషము ధనలాభమువచ్చుచున్నదని కాదు. మతేమనిన సత్పురుషులకు సాధువులకు సన్యాసులకు దీనులకు దైవభక్తులకు సహాయముచేసి తనజన్మముసఫలము చేసికొనవచ్చునని యతఁడాయుద్యోగమునం దంతకాలముండెను. నానకుయొక్కయాత్మ జలమందుండియు జలసంపర్కము లేని తామరపూవువంటిది గదా!

---

## తృతీయాధ్యాయము.

---

నానకునకు నానాఁటికి వ్యవహారములో లాభమధికముగ వచ్చెను. వచ్చినలాభ మంతయు నతఁడు మునుపటికంటె నెక్కుడుగ దైవభక్తులకు దీనులకు దానము చేయఁదొడఁగెను. అందుచేత గ్రామములోని జనులందఱు వానివర్తనముంగూర్చి తమలోఁ దాము చెప్పుకొన నారంభించిరి. కొందఱతని యౌదార్యమును మెచ్చుకొనిరి.

మఱికొంద ఱతని వితరణమునకు విపరీతార్థములను గల్పించి నిందింపసాగిరి. లోకులు పరమార్థము నరయక వినినదంతయు సమ్మువారగుటచే నానకు యజమానునిధనమంతయు యథేచ్ఛముగ వమ్ముసేయుచున్నాఁ డని యభిప్రాయపడిరి. యజమానునిధనమే యిచ్ఛవచ్చినట్లు వ్యయము సేయకపోయిన పక్షమున నిద్దఱు మనుష్యులకుఁ గావలసిన కర్చులే గాక సన్యాసులకు బిచ్చగాండ్రకు దోఁచి పెట్టుటకు వీనికెక్కడనుండిసొమ్మువచ్చినదని లోకులు పలుకఁ జొచ్చిరి ఆవిషయమున లోకులు నిశ్చయముగా దురభిప్రాయ పడిరి. ఏలయన నానకునకు వాని శిష్యుఁడగు బలునకుఁ గావలసినభోజనపదార్థముల నిమిత్తమగు వ్యయము మిక్కిలి స్వల్పము. నానకు వేదాంతియగుటచే కేవల ముదరపోషణమే ప్రధాన కార్యముగఁ జేసికొనక యేదితినిన ను దినము వెళ్ళిపోవునని సామాన్యులు భక్షించు వస్తువులనే యుపయోగించుచు వచ్చెను. గంజియన్నమెంతో వానికిఁ బంచభక్ష్యపరమాన్నములు నంతె. మధురాహారములు గ్రహించి తన పొట్టనింపి కండలు పెంచుటకంటె సొమ్మమితముగా వాడుకొని మిగిలినసొమ్ము సద్వినియోగముం జేయుట యిహపరసాధన మని యతండు నమ్మి జాగ్రత్తతో నుండెను. అట్టిమహానుభావులు తిండిపోతులుగా నుండరు గదా. ఆతఁడు చేయుదానములు మెరమెచ్చుల దానములుగాక యపాత్రదానములుగాక పేదలకు భగవద్భక్తులకు నీయఁబడిన సత్పాత్రదానములయ్యెను. గ్రామవాసులలో ననేకులు నానకుచేయు వ్యయములఁగూర్చి యత్యద్భుతముగాఁ జెప్పుకొనుచుండుట విని జయరాముఁడు లోకులమాటలే నిశ్చయములైనపక్షమున నవాబు నానకును దండించుటయే గాక తనకుఁగూడ మహాపకారముచేయునని భయపడి మఱేది నడుగుట కిష్టములేక సందేహించుచుండెను. నానకును లోకులగోల విని బావమనస్సు సంశయాకలితమైనదని తెలిసికొ

నితనచరిత్రము నిర్దుష్టమని వెల్లడి సేయుటకును, నిందారోపకులకు బుద్ధిచెప్పుటకును, బావనుబిలిచి మునుపటియట్లె తనలెక్కలఁబరీక్షిం పుమని కోరెను. జయరాముఁడు తనమనస్సులో ననుమానముగా నున్నట్లు నానకునకుఁ దెలియుట కిష్టములేనివాఁడయి యంగడిలో నేదోలోపమున్నదని మాత్రము మనస్సులో నభిప్రాయపడి లెక్కలు పరీక్షించుమని కోరినమాత్రముననే యందుకీయకొని నానకును నవాబునొద్దకుఁ దీసుకొనిపోయి యాతని దర్శనముచేసి లెక్కలుపరీక్షిం పుమని కోరెను. నవాబు వానిమాటలువిని నానకును దనయెదుటికిఁ బిలిచి పేరేమనియడిగి పేరు తెలిసికొన్నపిదప జయరామునివంక దిరిగి వీనికి వివాహమయినదాయని యడిగెను. వివాహము కాలేదని జయరాముఁడు ప్రత్యుత్తరముఁజెప్ప విని నవాబు "అదిగో! అదేకారణము. వివాహము కాకపోవుటచేతనే యతఁడు మాసామ్మెట్లు పాడుచేయుచున్నాఁడు. నీవు నాస్వభావ మెఱుఁగుదువుగదా. లెక్కలుసరిగానుండనిపక్షమున మీగతి యేమగునో చూచుకొనం" డని కఠినోక్తులు పలికెను. నానకు వానికఠోరభాషణము లాలకించి యించుకేని వెఱపునొందక "లెక్కలు చూపినపిదప మీయిష్టము వచ్చినట్లు చేయవచ్చును లెం" డని నిర్లక్ష్యముగ బదులుచెప్పెను. తనయంత వానియెదుట నానకు నిర్భయముగా నిర్లక్ష్యముగా నిశ్చలముగా నట్లుప్రత్యుత్తరము చెప్పుటచేత నవాబునకు మితిమీఱిన కోపము వచ్చెను. ఆకోపము పైకి స్ఫుటము గాకముందే జయరాముఁడు వానిముఖలక్షణములు గనిపెట్టి మిక్కిలి వినయముగా జేతులుజోడించిఁ నానకు గొప్పవారి దర్శనము లెన్నఁడుఁ జేయని పల్లెటూరువాఁ డగుటచేత మర్యాదలు తెలియక యట్లు వచించెనేకాని యనుమానింపఁ దలంచుకొన లేదనియుఁ దనయం దేదోషమును లేదని నమ్మి యంత విస్పష్టముగాఁ బలుక సాహసించెననియుఁ బ్రి

థమదోష మగుటచే క్షమియింపఁ దగు” ననియుఁ బలు తెఱంగులఁ బ్రార్థించెను.

ఆవేఁడికోలు విని దయాళువయి నబాబు తనకోటలో నున్న యదురావను మంచి లెక్కగానిని పిలిపించి యంగడిలెక్కలు శోధింపుమని యానతిచ్చెను. యదురావు మిక్కిలి జాగరూకతతో నైదు దినములు లెక్కలు పరీక్షించెను. నవాబుపెట్టిన పెట్టుబడియు, దాని మీఁదవానికి రావలసిన లాభమునుగాక 321 రూపాయలు కొట్టులో నిలువయున్నట్లు లీపరీక్షవలనఁ దేలెను. నానకు తననిమిత్తము దాన ధర్మముల నిమిత్తము వ్యయముచేయఁగా నతనివంతు మిగిలినసొమ్మిది. అదిచూచి జయరాముఁడు మానప్రాణములు దక్కినవని మిక్కిలి సంతోషించి మఱునాఁడు నవాబు దరిశనమునకుఁ బోయెను. అదివఱకే యదురావువలన లెక్కలపరీక్షనుగూర్చి నవాబు వినియున్నందున జయరామునిఁజూచి యతఁడు “నీమఱఁదిమీఁద నీవిధముగ వాడుకలు కలుగుటకుఁ గారణ మే” మని యడిగెను. అనవుడు జయరాముఁ డిట్లనియె. “లోకములో నెంత మంచివారి కయినను శత్రువులుండక మానరు కదా? అట్లే మానానకుమీఁద గూడ గిట్టనివారు కొందఱున్నారు. ఇదియంతయు నామహాత్ముల సృష్టియేకాని మావానిలోప మేమియులేదు.” పరీక్షానంతరమున నవాబు నానకుమీఁద నెక్కువ విశ్వాసముఁ గలవాఁడై మునుపిచ్చిన సొమ్మునకుఁ దోడుగఁ బెట్టుబడికిక్రింద మఱి మూఁడువేలరూపాయలనిచ్చి వ్యాపారము నెక్కుడుగ సాగింపుమని చెప్పెను. నానకు నిర్దోషియని తెలిసినప్పుడు జయరాముఁడు వానిభార్యయు నొందిన యానంద మింతింతయని వర్ణింప నలవికాదు. ఆపరీక్షవలన నవాబునకు నానకుమీఁద నమ్మిక పొడముటయేగాక జయరామునిమీఁదఁ గూడ నధిక గౌరవము గలిగెను. కుబుసమువిడిచిన కోడెత్రాఁచనుబో

న్నది పూలదండ యయినట్లు బానమఱఁదుల నిర్దరిపయి నలిగి వారిం జెరుపఁ దలఁచిన నవాబు పరమాప్తుఁ డగుటచే నానకుమీఁద నింద లుమోపిన శత్రువులు సిగ్గుపడి నోళ్లు మూసికొనవలసినవా రైరి. నానకుమేలునే గోరునట్టి బరమమిత్రులు సంతోషపరవశు లైరి. తన కుమారుఁడు బుద్ధిహీనుఁ డనియుఁ జిల్లిగవ్వయైన నార్జింపలేఁడనియుఁ గొఱమాలినవాఁడనియుఁ దలంచి వానినింటనుండి వెడలనడచినకాళుఁ డు పుత్రుని మితవ్యయము నిర్దోషిత్వము నవాబునకు వానిపై దయ గలుగుట మొదలగువార్తలు విన్నప్పుడు పొందిన సంతోష మను భవైకవేద్యమేగాని వర్ణన కసాధ్యము. మొదటినుండియు నానకు మహాత్ముఁడగునని నమ్ముచుండి రాయబులారు దానిని విని మెం తో సంతోషించెను.

ఒకనాఁడు సాయంకాలము జయరాముఁడు భార్యయు నాన కునుగూర్చి మాటలాడుకొనుచుండునంతలో నతఁడే వచ్చి వ్యాపా రములో తనవంతువచ్చిన లాభపుసొమ్ము దెచ్చి దాఁచుఁడని వారిచేతి కిచ్చెను. అక్కడకుఁ దమ్మునిమీఁద ననుమానమెన్నఁడును లేకపో యినను లోకులుచేసిన నిరాపనిందల కామె మనఃఖేదమునొంది పరీ క్షానంతరమున నిష్కళంకుఁడై వచ్చిన సోదరుని బహువిధముల గారవించెను.

నానకు గుణవంతుఁడై ధనసంపాదకుఁ డగుటచేత స్వకుటుంబ భారము వహింపఁగలఁడు గావున వానికి వివాహము శీఘ్రముగఁ జేయుట యుచితమని సోదరీ భావుకలు తొందరపడిరి. అదియునుఁ గాక సంసారబంధమునందు వానిని బిగివేశిపెట్టినచో నతఁడందే తవు ల్కొని యన్యవిషయమునుండి మనస్సు మరల్చి బాగుపడునని వా రెంచిరి. యీవఱకే వానికొక సంబంధము గుదిర్చిరని మనమెఱుఁగు దుముగదా! జయరాముఁడు నానకునకుఁ బిల్ల నీయఁదలఁచిన మూ

ఘునిని పేర ముహూర్త నిశ్చయము సేయుమని జావాబులువ్రాసెను గాని మూళుఁడు వివాహమునకుఁ గావలసిన సంభారములు తనకు సమకూడలేదని కొంతయాలస్యముఁ జేసి యెట్టకేలకు భాద్రపదబహుళ సప్తమిదినమున సుముహూర్తము సిశ్చయించి వివాహమునకుం దరలి రమ్మని వ్రాసెను. కాలుఁడు సకుటుంబ పరివారముగా సుల్తానుపురమునకుఁ బోయి యటనుండి పెండ్లికొడుకును జయరాముఁడు మొదలగు చుట్టములను దోడుకొని తరలి పోయెను. వియ్యంకుఁడు వియ్యాలవారిని దనస్థితికిఁ దగినట్లు గౌరవించెను. వివాహమహోత్సవము మూఁడుదినములు జరిగెను. నాలవనాఁడు కాలుఁడు పెండ్లికూఁతురును వెంటఁ బెట్టుకొని సపరివారముగ బయలుదేరి సుఖముగ సుల్తానుపురముఁ జేరెను.

పెండ్లికూఁతురుపేరు సల్లఖి. అత్తవా రెందుచేతనో తల్లిదండ్రులు పెట్టినపేరం బిలువక చూనియని యామెను బిలుచుచువచ్చిరి. సుల్తానుపురమునకు వచ్చినపిదపఁ గాలుఁడు కొడుకునుం గోడలి స్వగ్రామమునకుఁ దోడ్కొని పోవఁదలఁచెను. టాల్వెండి గ్రామమునకుఁ బోవుటకు నానకున కిష్టములేదు. ఆకారణముచేత జయరాముఁడు, నానకియుఁ దాని కంగీకరింపరైరి. కాని కొందఱుపెద్దలు నానకుయొక్కతల్లివివాహమునకు రానందున కొడుకుంగోడలు కాఁపురము చేయుచుండ నామె కన్నులు చల్లగ చూడగోరుననియు నొక్క నెలయైన నామెకడనుండుట యుచితమనియు నుపదేశించిరి. ఆయుపదేశముంబట్టియుఁ దల్లిమీఁదఁగలగౌరవముంబట్టియు నానకుస్వగ్రామమునకుఁబోవ నిష్టపడి భార్యాసమేతుఁడై తండ్రితోఁగూడ జనియెను. అతఁడు వచ్చువఱకు నంగడిపని బలుఁడు చూచుటకొప్పుకొనెను. వివాహదీక్షితుఁడై కళ్యాణవేషముతోనున్న కుమారుఁడు ధర్మపత్నిసమేతుఁడై తల్లిపాదములకు నమస్కరింప త్రిప్తాదేవి కొడుకుం

గోడలిఁ గౌఁగిలించుకొని యానందబాష్పము లనియెడి ముత్యాలసేస లు వారిపైఁ జల్లెను. నానకు రాక విని చుట్టములు నెచ్చెలులు పరిచితులు వానిం జూడవచ్చి యతఁడు మంచివృత్తిలోఁ బ్రవేశించినందుకు ధనముసంపాదించుచున్నందుకు జాల సంతసించి కొనియాడిరి. కొడుకక్కడనున్న నెల దినములలోఁ దండ్రి సహజముగఁ గఠినుఁడయ్యు మర లనేమి సాహసము పుట్టునో యను భయమున నేమియు ననక నడుమనడుమ నెవరితోనో యన్నట్టు "ధనము సంపాదించుట మంచిది. ధనము లేనివారి నెవరుఁ జూడరు. దుస్సహవాసములు చేయఁ గూడ"దనుచు నెమ్మదిగఁ గాలము వెళ్ళఁబుచ్చెను. ఆమాసము ముగిసినపిదప నానకు భార్యాసమేతుఁడై సుల్తానుపురమునకుఁ బోయి యెప్పటియట్ల తన పనిలోఁ బ్రవేశించెను. పుట్టినింటివారు చూనీదేవిని మరల స్వల్పకాలములోనే బంపుదుమని చెప్పి తీసికొని పోయిరి.

——

## చతుర్థాధ్యాయము.

ఇరువదియేండ్లయిన నిండకముందే నానకు గృహస్థుఁడయి సంసారభారము వహించెను. కాని యా పెండ్లి వానిజీవనము సుఖాస్పదముగఁ జేయుటకు మారు దుఃఖభాజనముగఁ జేసెను. చూనీదేవి కోపశీల, గర్వసమేత. ఒరులపై నధికారము చేయనిచ్చకలది. ఆమె జనకుండగు మూలుఁడు కాలుని యచ్చు. వాక్పారుష్యమునందు ధనాశయందు మనఃకాఠిన్యమునందు వియ్యంకు లొండొరులకుఁ దీసిపోరు. చూనీదేవితల్లి నానకుతల్లివంటిది గాక భర్తృగుణములకు వన్నెవెట్టుచు ననుకూలదాంపత్య మని లోకులు చెప్పుకొనునట్లు నడచెను.

అట్టి జననీజనకుల కుద్భవించినందున చూనీదేవి తల్లిచాలు
బిడ్డయుఁ దండ్రిచాలు బిడ్డయు నయ్యెను. తల్లిదండ్రుల గుణములు
ప్రతిబింబములట్లు బిడ్డలయందు గానబడుచుండునుగదా! తల్లి మంచిది
కానపుడు తండ్రిమంచివాఁడగుటయో తండ్రి యోగ్యుఁడుగానపుడు తల్లి
యోగ్యురాలగుటయో తటస్థించునేని బిడ్డలొకవేళ సుగుణవంతులు కావ
చ్చును. భార్యాభర్తలిద్దఱు దుస్స్వభావులయినపుడు బిడ్డలు సాధుశీలుర
గుట యరిది. అయోగ్యులగుజననీజనకులకుద్భవించినను బిడ్డలు జన్మిం
చినది మొదలు సజ్జనులచేఁ బెంపఁబడుదురేని వారికి సద్గుణము లలవడవ
చ్చును. అట్లుగాక యవివేకులగు మాతాపితలకుఁ బుట్టి వారికడనే పెరిఁగి
నబిడ్డలమాట వేఱె చెప్పవలయునా! చూనీదేవి గయ్యాళితనమునఁ దల్లి
దండ్రులను బోలినందునఁ బ్రతిదినము మగఁడు గృహమునకు వచ్చినప్పు
డు పిల్లిమీఁదఁబెట్టి యెలుకమీఁద బెట్టి సణుగుచు నిదిలేదదిలేదని కే
కలు వేయుచుండును. అంతతోఁ బోక గృహకృత్యములకుఁ గావలసిన
సంబారములు సరిగ సమకూర్చుట లేదనియు సంపాదించిన ధనమం
తయు బైరాగులకు బావాజీలకుఁ బెట్టి సంసారము గుల్ల చేయుచు
న్నవాఁడనియు, నుదయాస్తమయములు మగనిని సాధించుచుండును.
సంపాదించినధనములోఁ జిల్లిగవ్వయైన వెచ్చబెట్టక తనయిచ్చవచ్చి
నట్లు వ్యయముచేయుటకుఁ దనయధీనము జేయుమని పోరుచుండును.
తానెంత పోరుపెట్టినను భర్త తనమాట రవ్వంతయు లక్ష్యము సేయ
నందున నామె తనపంతము నెగ్గించుకొనుటకుఁ బలుమాఱు తల్లిదండ్రు
లకుఁ దనకష్టములఁ దీర్పరమ్మని వర్తమాన మంపుచుండెను. పంపుట
యేతడవుగ వానియత్తమామ లిరువురు కూఁతురు మిక్కిలికష్టపడుచు
న్న దనుకొని యల్లునియింటికి వచ్చి తమకూఁతు రష్టకష్టములు బడు
చున్నదని కల్లబొల్లి యేడ్పులేడ్చి "యెన్నఁడు బుద్ధి తెచ్చుకొని బా
గుపడుదువు నాయనా?" యని యల్లునిమీఁదఁబడి రక్కసులవలె

వానిని బాధించుచు వచ్చిరి. సహజముగ శాంతశీలుఁడయి వాక్పారుష్యమున్న మిక్కిలి యసహ్యపడుచు నిరంతరము మనశ్శాంతినే గోరు నానకు, ఆలిపోరునకుఁ దోడుగ నత్తమామల పోరుగూడ సంభవించుటచే మనస్థిమితము లేనివాఁడయి చాల దుఃఖపడుచు వచ్చెను. ఒకప్పు డత్తమామలపోరుఁ బడలేక మాయింట నన్నవస్త్రములకు లోపము లేమిఁ దాయని యడుగుచుండును. ఆపలుకుల కత్తమామలు మిక్కిలి కినిసి "అన్నవస్త్రములున్న చాలునా, మఱేమియు నక్కఱ లేదా? నగలుండవలె నాణెములుండవలె. సంసారము చేయుచున్నపుడెన్నో యుండవలెను. కాలునొచ్చినఁ జేయినొచ్చిన నింటఁగూర్చుని సుఖముగఁ దినుటకుఁ గొంతసొమ్ము నిలువ యుండనక్కఱలేదా? నీసొమ్ము దినుచున్న గోసాయిలు సన్యాసులు నీకాపత్సమయమున నక్కఱకువత్తురని తలంచుచున్నాఁడవు కాబోలు! పాపమేమియు నెఱుఁగని మాపిల్ల యట్టియాపత్సమయము వచ్చినచో నిష్కారణముగ గంగలో దిగవలయు" నని నిష్ఠురముగఁ బలుకుచు వచ్చిరి. కర్ణకఠోరములగు నప్పలుకులు విన్నప్పుడు నానకుమనస్సు మిక్కిలి ఖేదము నొంది "మాయూరికి మాయత్తవారియూరికి, నిప్పుడున్న దూరముకంటె, బదిరెట్లుదూరముండిన మాగుండును గదా. దూరముండినపక్షమున వీరు తఱచుగ వచ్చి నన్ను బాధింపకుందురుగదా" యని తలంచుచుండును. అల్లునియూరికి మామయూరికి దూరముండుట మంచిదనియే కాఁబోలు శాస్త్రకారకులు సయితము "గృహస్థులు పుత్రికలను దూరప్రదేశములనుండు పడుచువారి కీయవలయు" నని శాసించిరి. నానకునకు గృహము సుఖప్రదమగుటకుమాఱు దుఃఖభాజన మయినందున నతఁ డింటనుండినప్పుడు ముండ్లకంపమీఁద నుండినట్లుండి మెదుకులు నోటవేసుకొని యావలకుఁ బోవుచుండును. సోదరీగృహమునకుఁ బోవఁదలఁచిన వానియత్త యామెయింటికిఁగూడ బోయి

యల్లునిమీఁద విధివిరామము లేక నేరములు చెప్పుచువచ్చెను. నానకి నాథుశీల యగుటచేఁ దనసోదరుఁడు యోగ్యుఁడని యామె యెఱిం గియుండియు నాగయ్యాళిగంపనోటికి వెఱచి యేమియు ననక యూర కుండును.

వేయిమంది పడుచుపడఁతు లైనను నానకి యత్తగారి యె దుట నిలువలేరు. అట్టియామెయెదుట పరమసాధ్వియగు నానకినిలిచి యేమిప్రతిఘటింపఁగలదు! స్వగృహమునందుఁగాని సోదరీగృహమునం దుఁగాని యించుకేనియు మనశ్శాంతినొందుటకు వీలులేక నానకు దు కాణమే యిల్లుచేసి కొని దినమునం దెనిమిదిజాములలోఁ జాలభాగ మ క్కడనే గడుపుచు వచ్చెను. అతనికి బలుఁడు సహాయుఁడు; బలున కతఁడు సహాయుఁడు. అతఁ డొంటిగఁ గూర్చున్నప్పుడు మనసులో ననేకాలోచన లొకదాని వెంబడి నొకటి తోఁచుచుండును. భార్య దుఃఖహేతువు. సంసారము దుఃఖహేతు వని పెద్దలు చెప్పెడుమాటలు వానికి జ్ఞప్తికిరాఁగా నతఁడు మాటిమాటికి మెడకు గుదికట్టయుఁ సంకిలియు నగు నీవివాహ మేల చేసికొంటి నని విచారించుచు దృఢ మైన యాబంధమును తెంపుటకు సమయమును నిరీక్షించుచుండెను. అట్లు నిరీక్షించుచుండగానే యనేక సంవత్సరములు గడచెను. అతని కప్పటికి ముప్పదియాఱవయేఁడు. వివాహమై పదునాఱు సంవత్సర ములాయెను. అతని కిద్దఱు కుమారులు జన్మించిరి. అతని ముప్పది రెండవయేఁట మొదటికుమారుఁడు పుట్టెను. ఆకుమారునిపేరు శ్రీచం ద్రుఁడు. మఱి నాలుగేండ్లు కనఁగా ముప్పదియాఱవయేఁట రెండవ కుమారుఁ డుదయించెను. అతనిపేరు లక్ష్మీదాసు. అట్టియవస్థలలో నానకుజీవితమందు గొప్పమార్పొకటి జరిగెను. ఆమార్పు వానిని సంపూర్ణముగ మార్చివేసెను. భార్యాబంధమే త్యజింప నలవిగానిది. అట్టియెడ సంతానముచేత మఱింత దృఢమైన యాబంధమును నానకు

తృణప్రాయముగ ఛేదింపఁగలఁడని లోకులెవ్వరుఁ దలంపలేదు. వాని శత్రులు, మిత్రులుగూడ నానకు సంసారబంధమునం దగులుకొన్నాఁడు. వానిబ్రహ్మవిద్యయంతయు నడుగంటినదని బహిరంగముగ ననుకొనుచుండిరి. అట్టి సమయమున నానకు సర్వసంగపరిత్యాగి యై యెల్లవారల సద్భుత మొందఁజేసెను. రెండవకుమారుఁడు పుట్టినయా అమాసములకు నానకొకనాఁ డొకచోట నొంటిగఁ గూర్చుండి దీర్ఘాలోచనము చేయుచుండ వానికడకొక పకీరు వచ్చెను. ఇరువురు గొంతసేపు భగవద్విషయికమైన చర్చచేసిరి. ఆసంభాషణము ముగిసినవెనుక పకీరు నానకుతో నిట్లనియెనఁట. "నానకూ! నీవు చేయుచున్న పనియేమి? నీజీవితముయొక్క పరమార్థమిదియేనా? నీవు చేయవలసిన యుత్కృష్టకార్యమునకు నీవిప్పుడు గడుపుచున్న దేహయాత్ర యనుకూలమై యున్నదో లేదో చూచుకొనుచున్నావా?" ఆపలుకులు నానకుమనస్సుమీఁద నెంతో పనిజేసి వానిని విరక్తిమార్గమునకుం ద్రిప్పెను. త్రిప్పుటయు నతఁడు పకీరుతో నిట్లనియెనఁట. "భగవంతుఁ డంతయు సరిగా వచ్చునట్లు నడపించును" ఆపలుకులు పలుకునప్పుడు నానకు మనసార నేదోచేయుటకుఁ గృతనిశ్చయుఁ డైనట్లు కనఁబడెను. అదిగ్రహించి పకీరు సంతసించి తన దారిం బోయెను.

అపకీరుతోఁ బ్రసంగముజరిగిన యెనిమిదిమాసముల కొకనాఁడు తెల్లవాఱుజామున నానకు దాపుననున్న యేటి కెప్పటియట్ల స్నానమునకుఁబోయి తిరిగి గృహమునకు రాక యదృశ్యుఁ డయ్యెను. అతని యదృశ్యత యాలుబిడ్డలకు సోదరీ భావుకలకు జాల భయము గలిగింప వారు వానినిమిత్తము గ్రామము పొలిమేరలు వెదకించిరి. కాని యతండెందుం గానఁబడఁడయ్యె. ఆయనను గనిపెట్టి వానికి గిట్టనివారు నానకు నవాబుసొమ్ము హరించి యాపదవచ్చునను భయ

మున నెక్కడికో పాఱిపోయెననియు గడుసువాఁడగుటచేత నట్లు చేసె ననియు నపవాదములు వేయఁజొచ్చిరి. అట్లు పగతురు చెప్పుకొను చుండ నేనికారణముననో మరల నానకు మూఁడవనాఁడు స్వగ్రామ మునకుఁ బోయెను. అతనింజూచి నిరాపనిందలు మోఁపిన కుత్సిత స్వభావులు తమపలుకులు కల్లలయ్యెనని తలవంచుకొనిరి. నానకు చిన్న గోచిమాత్రము పెట్టుకొని దిగంబరుఁడట్లై యుండె. స్వగృహ మునకుఁ గాని సోదరీగృహంబునకుఁ గాని యతఁడు పోవక యూరక నిందందుఁ దిరుగఁజొచ్చె. గ్రామవాసులు వానియవస్థఁ గనుఁగొని "వానికి మతి లేదు. పిచ్చియెత్తిన"దని కొందఱు దయ్యమేదో పట్టి యట్లు వేధించుచున్నదని కొందఱు బలుకఁజొచ్చిరి. నానకు హఠా త్తుగ నదృశ్యుఁడయ్యెనని విని నవాబు వానికిఁ బూటకుఁడగు జయ రామునింబిలుపించి లెక్కలు పరీక్ష సేయింపుమని యానతిచ్చెను. జయ రాముఁడు నానకును గూడ వెంటఁబెట్టుకొని నవాబునొద్దకుఁ బోయెను. లెక్కలు మూఁడవసారి పరీక్షింపఁబడెను. కాని కడచిన రెండుసార్లవ లెనే నానకు నిర్దోషియని తేలుటయేగాక యతని వంతు రు 760లు రావలసి యుండెను. పరీక్షానంతరము నవాబు నానకున్యాయబుద్ధికి సంతోషించి మరల దనకడ నుండుమని యడిగెను. నానకు తన కుద్యోగ మక్కఱలేదని తనకు రావలసిన ధనము పేదలకుఁ బంచి పెట్టుమని చెప్పెను.

నానకు చాలకాలము గృహస్థుఁడై భార్యతోఁ గాఁపురము చేసి సంతానముంబడసి సంసారబంధములు మఱింత బిగిసినవెనుక వయసు కొంత ముదిరిన పిదప విరాగియై యాలుబిడ్డల విడచి నిస్పృహుఁడై భగవద్ధ్యాన పరాయణుఁడగుట జాలమంది కాశ్చర్యము గలిగించును. కాని యిందాశ్చర్య పడవలసిన దేమియు లేదు. ఏలయన నానకుయొక్క గృహస్థాశ్రమము వాని నుత్తమగతి నొందించు

నట్లే యుండెను. కాని యధోగతికిం దెచ్చునట్లు లేదు. అతఁడు ప్రతి దినము జాము రాత్రియుండఁగా మేల్కొని స్నానము జేసి పరిశుద్ధ దేహముతోడను పరిశుద్ధ మనస్సుతోడను భగవద్ధ్యానము చేయుచుండును. భగవంతుఁడు దయామయుఁడు సత్యస్వరూపుఁడు పరిశుద్ధుఁడు నగుట చేత వాని నిర్మలమనస్సుతో ధ్యానించి వారికందఱకు దయా సత్య శౌచములు తమయంతటఁ దామేవచ్చి కరతలామలకములై యుండెను. వారు సంసారమునందుండియు సంసారమున కతీతులు. మనసు వారి యధీనమునం దుండుటచే నుండఁదలంచిన నింట నుండుదురు. వెడలఁదలంచిన నిర్విచారముగ వెడలుదురు. అదియునుగాక న్యాయార్జితమగు సొంత ద్రవ్యముఁ దినువారిమనస్సు నిర్మలమై పవిత్రమై యుండును. నానకు ధాన్యవ్యాపారదుకాణమునం బ్రవేశించినది మొదలు న్యాయార్జితము స్వార్జితము నగు ధనమే తినుచుండుటఁ జేసి వాని చిత్తము నిష్కలుష మైయుండె. మఱియు నతఁడు ద్రవ్యమును సంపాదించినప్పుడు భగవద్భక్తులకు స్వార్జితమునఁ జాలభాగము దానముచేయుచువచ్చెను. దాత యెల్లప్పుడు భగవంతునకు సమీపవర్తియై యుండునుగదా! పూర్వోక్త విషయములంబట్టి నానకు సంసారమందున్నపుడె మోహపాశబద్ధుఁడు గాఁడనియు, నిర్మలాంతఃకరణముగలవాఁడనియుఁ, బరమభక్తుఁడనియు, నిస్పృహగలవాఁడనియు మనము గ్రహింపవచ్చును. అట్టి గుణము లుండుటచేతనే విరక్తిదోఁచినతోడనే యతఁడు సంసారము నవలీలగ విడువఁగలిగెను.

మామఁడు తనయల్లుఁడు విరాగియైపోయెనని విని తద్దయు విషాదమంది పిడుగడఁచిన వాని చందమునఁ దొలుదొల్త నిశ్చేష్టుఁడయ్యెను. తెలివివచ్చినపిదప నతఁడు మహాకుపితుఁడై యల్లుఁడు దారపుత్త్రులను నిరాధారులఁజేసి సన్యసించుట దుష్కార్యమనియు సంసారనాశహేతువనియు నభిప్రాయపడి యల్లుఁడుద్యోగము సేయున

పుడైన నించుకధనము నిలువచేయక పోవుటచేతను కూఁతుసంసార
ము బిడ్డలు పాపలు గలిగి పెద్ద దగుటచేతను దానిపోషణ మేవిధంబు
న జరుగఁగలదని బెంగపెట్టుకొనియె. తనకున్న సొత్తులోనుండి కూఁ
తున కేదేనిఁ గొంత యియ్యవలయుననఁ దనసంసారము దీనస్థితిలో
నేయుండెను. నానకు మొకటినుండియు నెవ్వరితో మాటలాడక నొం
టిగఁగూర్చుండి ప్రపంచముమీఁద నసహ్యపడునట్లుగానఁబడుచువచ్చె
నుగాని యతడంతలో నంతపని చేయునని మామగారెన్నఁడు స్వప్న
మందైనఁ దలంపలేదు. తలఁచినకొలఁది కూఁతురుయొక్కయు మను
మలయొక్కయు నవస్థ విషాదము గలుగఁజేయ మూళుఁడుతనమాట
యల్లుఁడు వినఁడని యెఱింగి తనపురోహితుని గాంచి నానకుబుద్ధి
వైరాగ్యమునుండి మరల్చి సంసారమువంక ద్రిప్పుమని యాయనను
బతిమాలి పంపెను. ఆపురోహితుఁడు వల్లెయని బయలుదేరి పోయి
శ్మశానమునఁ దుఁగూర్చుండి యీశ్వరధ్యానము చేయుచున్న నానకు
నుగాంచి యాలుబిడ్డలను మలమలమాడ్చి సన్యసించుట యనుచితమ
నియెన్నో తెఱంగుల వానికుపదేశించెను. కాని వానిమనస్సు నిశ్చ
లమై యుండుటంజేసి పురోహితుఁడు వచ్చినదారినే స్వగ్రామమున
కుఁ జని యావృత్తాంతము మూళున కెఱింగించెను. అల్లుఁడు మరల
సంసారియగుట యసాధ్యమని గ్రహించి మూళుఁడు నానకునకు
ధాన్యపుదుకాణములో రావలసిన యేడువందల యరువది రూపా
యిలు వానియాలుబిడ్డలకిచ్చి రక్షింపవలయునని నబాబునకు
విజ్ఞాపనమంపెను. నవాబు నానకు దారపుత్రుల నిరాధారస్థితికి
మిక్కిలి జాలినొందియు నానకుచేత పేదలనిమిత్తము దానమీయఁ
బడినధనము వాని సమ్మతిలేక యాలుబిడ్డల కిచ్చుటయధర్మ
మని భయపడి మూళుఁడు కోరినప్రకారము చేయుట కిష్టపడఁడ
య్యె. అయినను నానకునకు మతిలేదని లోకులు చెప్పుకొనుటచేతను

మతిలేనివాఁడు చేసిన దానధర్మములు పరిగ్రహింపఁ దగినవి కావని తెలియుటచేతను నవాబు వానివంతుధనము దానముచేయక యాలు బిడ్డల కీయఁ బ్రయత్నించెను. నానకు నిరంతరము గోరీలదొడ్డిలో గూర్చుండి జపము సేయుచుండుటచే వాని కేదేని యొక దయ్యముపట్టి యుండవచ్చునని కొందఱు చెప్పిరి. తురకలకును దయ్యము లున్నవని నమ్మకకలదు గావున నవాబు తన మతగురువు నొక్కనింబిలిచి మంత్రములు చదివి యా దయ్యమును వదలించుమని వానితోఁ జెప్పి నానకునప్పగించెను. ఆగురువు నానకుకడకుంబోయి తనమంత్రము లన్నియుఁ జదివెను. ఎన్ని మంత్రములు జదివిన నతఁడెప్పటి యట్లె యుండెను. తురక గురువు నానకుతో నించుకసేపు సంభాషించి వానికి దయ్యము పట్టలేదనియు మతి లేకపోలేదనియు గ్రహించి యామాట నవాబున కెఱిఁగించెను. పేదలకుఁ బంచిపెట్టవలసిన సొమ్ము మఱియొకలాగున వినియోగించుట మహాపాపమని మహమ్మదీయ ధర్మశాస్త్రములలో నుండుటచే నవాబు పాపభీతినొంది యాధన మేవిధంబున వినియోగింప నగునని జయరామునిం బిలిపించి యాలోచన మడిగెను. జయరాముఁడెటుచెప్పిన నెటువచ్చునో యని యేయాలోచనముం జెప్ప వెఱచెను. ఏలయన నానకుయొక్క యాలుబిడ్డలయవస్థఁజూడ ధనము వారికప్పగించుటయే న్యాయమని తోఁచును. నానకు మతి లేనివాఁడు కాఁడని తెలిసినప్పుడు వానిచెప్పిన చొప్పున వానిసొమ్ము దానముచేయకపోవుట యనుచితమని తోఁచును.

ఈ రెండు ధర్మసందేహములుజయరాముని బాధించినకతమున నతఁడు నానకునే పిలుపించి కర్తవ్యమునుగూర్చి యడుగుమని నవాబునకు విన్నవించెను. నవాబు వానిచెప్పినచొప్పున నానకును రమ్మని వర్తమాన మంపెను. నానకువానియాజ్ఞ నిరాకరించి రానందున నవాబు వానిని బలవంతముగ దనసన్నిధికి రావించి తనయాజ్ఞప్రకార

ము రాకుండుటకుఁ గారణమేమని కోపముతో నడిగెను. నానకు వాని కిట్లనియె. "నేను మీసేవచేయునప్పుడు మీయాజ్ఞమన్నించి యిప్పుడు భగవంతునిసేవ చేయుటచే భగవంతునియాజ్ఞనే మన్నించెద. అప్పలుకులు విని నవాబు "నీవు భగవద్భక్తుండ వయితివేని నేనును భగవద్భక్తుఁడనే. నేఁడు శుక్రవారము మసీదునకుఁబోయి మనమిద్దఱము నమాజు చేయుదము రమ్మ"ని పలికెను. భగవంతుఁడు సర్వవ్యాపకుఁడను నమ్మిక హృదయమున నుండుటచే నానకు మసీదునకుఁ బోవ సమ్మతించె. సమ్మతించుటయు నవాబు కొలువులోనున్న గొప్పసరదారులను స్వమతగురువులను నానకును వెంటఁబెట్టుకొని వైభవముతో మసీదునకుఁ బోయి ప్రార్థనల నారంభించెను. తురకలందఱు దమయాచారప్రకారము ప్రార్థనసమయమున మోకాళ్ళమీఁదఁబడియుండ నానకు మాత్ర మట్లుచేయక కాలువంచక నిలిచియుండెను. ప్రార్థనలు ముగిసినపిదప నవాబు నిలిచియున్న నానకునఁజూచి "ఓయి! నీవు నాతోఁగలిసి ప్రార్థించుటకు వచ్చితివా? లేక నిలిచియుండుటకు వచ్చితివా?" యని యడిగెను. నవాబు ప్రశ్నమునకు నానక ఈక్రిందియుత్తరముఁ జెప్పెను. "ప్రార్థనసమయమున మీరు గాంధారదేశమున గుఱ్ఱములను బేరము చేయుచుండిరి. అందుచేత నేను మీతోఁ గలసి యెట్లుప్రార్థన సేయఁగలను." అనవుఁడు నవాబుప్రక్కనున్న ఖాజీ నానకుతో నిట్లనియె. "నీవు నవాబుగారితోఁ గలిసిప్రార్థనము జేయలేనిపక్షమున నాతోఁ గలసి యేల ప్రార్థింపవైతివి?" అప్పలుకులకు నానక ఈవిధమునబదులు చెప్పెను. 'మీతక్కువ యేమున్న. దిమీగుఱ్ఱపుపిల్ల మీదొడ్డిలోనున్న బోదెలోఁ బడునేమోయను భయమున మీమనసు ప్రార్థనసమయమున మీగుఱ్ఱపుపిల్ల వెనుకనే యుండెను. నేను మీతోఁగలిసిన మాత్ర మెట్లు ప్రార్థింపఁగలను.'

అతని పలుకులు విని నవాబు ఖానిగురువు విస్మయమును నొం

దిమొండొరుల మొగంబులు చూచుకొని యెట్టకేలకుఁ దమమనస్సు లానయయమున నిజముగా మసీదులో లేవనియొప్పుకొనిరఁట. అన్యుల మనోగతములగు నాలోచనలను విజ్ఞానవంతులు సులభముగ నెఱుంగఁ గలరని ప్రకృతి శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇది నిజమో యతిశయోక్తియో మనము చెప్పఁజాలము. అనంతరము నవాబు నానకును బిలిపించిన కార్యము మఱవక ధనమెట్లు వ్యయము సేయవలయునని వానినడిగెను. ఎన్నివిధములఁ దరచి తరచి యడిగినను నానకు మొట్టమొదట దానన్నట్లు ధర్మమే చేయుమని నొక్కిచెప్పెను. నవాబు నానకు నడిగిన కార్యములేదని తెలిసికొని వానిం బంపివేసి యాధనము సగము నానకు మనోరథ ప్రకారము పేదలకుఁ పంచిపెట్టి సగ మాలుబిడ్డల కిచ్చెను.

ఈనాఁటి హిందువులకు వలెనే యానాఁటి హిందువులకుఁగూడ జాతి మతవర్గసంబంధములైన పట్టుదలలు మిక్కుటముగనుండెను. మన దేశము నిప్పుడు క్రైస్తవులు పరిపాలించుచున్నట్లే యప్పుడు మహమ్మదీయులు పరిపాలించుచుండిరి. ప్రభువులు మహమ్మదీయ మతస్థులయినను దేశస్థులు హిందూమతమునే యవలంబించి విశేషాభిమానముగలవారై యుండిరి. తురకలుహిందువులు పలుమాఱుత్సవసమయములఁగలియుచువచ్చిరిగాని కలిసి తినుట వియ్యమందుట మొదలగు వానిలో మాత్రము హిందువులు గలియరైరి. హిందువుఁడు మసీదునకుఁబోయి తురకలం గలసి నమాజు చేయుట స్వమత మర్యాదం దాటుటగా నానాఁటివారు భావించుచువచ్చిరి. అట్టివాని నానాటివారు వెలివేసి రేగాని వర్ణములో నుంచరైరి. నానకు మహమ్మదీయులతోఁ గలిసి మసీదులోఁ బ్రార్థనజేసి స్వమతమర్యాద నతిక్రమించెను. నావాబుఖాజీ వాని వెంటఁబెట్టుకొని పోవుటంజేసి నానకు స్వభావమెఱుఁగనివాఱందఱు దప్పక యతఁడు నవాబు ప్రేరణంబు

నఁ దురకలలోఁ గలసెననియే జెప్పుకొనిరి. జయరాముఁ డామాట విన్నప్పుడు చాలతొట్రుపడి యతిత్వరితమున నింటికిఁబోయి యావార్త భార్యకెఱిఁగించెను. ఆమె తన సహజధైర్యమునుజూపి భర్త జెప్పినమాట సరిగా నమ్మలేదు. జయరాముఁడు తనమాట భార్యసరిగా నమ్మకపోవుటచే నిజస్థితి గనుగొని రమ్మని నాథుఁడను బ్రాహ్మణుని నానకుదగ్గఱకంపెను. ఆబ్రాహ్మణుఁడు తక్షణమే బోయి యథార్థస్థితిఁ దెలుసుకొని నానకు తురకలలోఁ గలిసినమాట యబద్ధమనియు నానకు నవాబుమాటకులోబడియట్టివని జేయువాఁడు కాఁడనియుఁ జెప్పెను. అదివిని జయరాముఁడు భార్యయు మిక్కిలి సంతసించిరి.

నానకు విరాగులలోఁ గలిసినవార్త కాళునకుఁ జాలకాలమునకుఁగాని తెలియదయ్యె. తాల్వొండి గ్రామమునకు సుల్తానుపురమునకుఁ గొన్నివందలమైళ్ళ దూరమున్నందున నాదినములలో వర్తమానము దెలియుట చాలకష్టముగ నుండెను. పూర్వము పొరుగూరి వార్తలు దెలియవలెనన్న గృహస్థుఁడు పురోహితునో యింటి మంగలినో యింటిపాటకునో లేక బత్తెమిచ్చి ప్రత్యేకముగా నొకమనిషినో పంపవలయును. కుమారునివార్త కాళున కెట్లో తెలిసెను. ఆవార్త వినఁగానే కాళుని ప్రాణములు నిలువునంబోయెననిచెప్పవచ్చును. త్రిప్తాదేవిదుఃఖ మింతింతయని వర్ణింప నలవిగాదు ఆమెభర్త తన దుఃఖముఁ గోపావేశముచేత నడుమనడుమ మఱచుచువచ్చె, త్రిప్తాదేవి శాంతమున భూదేవియే. కోపమెట్టిదో యెఱుఁగనిదిగావున నామె దుఃఖమున కూరటయే లేకపోయెను. అయినను కుమారునిస్థితి యున్న దున్నట్లు తెలిసికొని రమ్మని కాళుఁడు మర్దనుఁడను గాయకుని సుల్తానుపురమున కంపెను. మార్గమున మర్దనున కెదురుపడిన మొదటిపురుషుఁడే యావార్త నిజమని బలికెను.

అప్పటికిని మర్దనునిమనసు సందేహపరవశమ గుటచే సుల్తానుపురము నకు వచ్చినతోడనే జయరాముఁడు వానిసందేహమును దీర్చెను. అదూత యంతతోఁ దనివి నొందక నానకును స్వయముగాఁ జూడ వలయునని కోరి గోరీలదొడ్డికిఁబోయి యాతనిం గాంచి మరల గృహ స్థాశ్రిమస్వీకారముఁ జేయుమనివానికెన్నెన్నో యుపదేశములఁజేసెను. ఈతఁడు తాల్వొండినుంచి వచ్చునప్పుడు తనవాక్చమత్కృతిచేత నాన కుమనసు గరగించి గృహస్థుంజేయఁ గలిగినట్లు కాళునితోఁ బిజ్ఞలు పలికివచ్చె. అందుచేత నతఁడు తన యావచ్ఛక్తి వినియోగించి నాన కుం దిప్పఁజొచ్చెను. అయ్యైరువుర కలయికచేత నానకు గృహస్థాశ్రి మము స్వీకరించలేదు గాని నానకు చేసిన వేదాంతబోధలచేత మర్ద నుఁడు సంసారముమీఁద విరక్తుఁడై తాల్వొండికిఁబోయి కాలునకుఁ గుమాపునియవస్థయైనం జెప్ప దలంపక నానకునకు శిష్యుఁడయ్యెను. ఊరక శిష్యుఁడైయుండక నానకుకంఠములోఁ బ్రాణ ముండినంత కాలము పరమభక్తుఁడై తోడునీడయట్లు వానిని సేవించెను.

లోకము నుద్ధరింపఁదలఁచిన మహాత్ములొక్కచోట నెప్పుడు నుండరు. తాము బుట్టిపెరిగినచోటులను వ్యవహారములు చేసినచోటు ల మొదలే యుండరు. తమకు భగవంతుఁ డిచ్చిన జ్ఞానము లోక మంతట వెల్లడిచేయుటయే వారి ముఖ్యోద్దేశము గావున మహాత్ము లు నిరంతరము దేశాటనము చేయుచుందురు. నానకుగూడ జగదుప కారపారీణుఁ డగుటచే మర్దనుఁడు తన శిష్యుఁడైన కొన్ని నాళ్ళకు సుల్తానుపురమువిడిచి మఱియొకతావునకుఁ బోవఁదలఁచెను. మర్దనుఁడు మంచిపాటకుఁడగుటచే నిరంతరము భగవన్నామ కీర్తనము గాన రూపమున వానినోటినుండి వినవచ్చునని నానకు తాంబురా కావల యునని కోరి యదికొనుటకైనఁ దనయొద్ద ధనముఁ లేనందున దానికి వలయు ధనమిమ్మని సోదరికడకు వర్తమాన మంపెను. తమ్ముఁడట్టి

కోరిక కోరుటయే చాలునని నానకిదేవి తక్షణమే వానికిఁ గావలసిన ధనమిచ్చి సోదరు నొకసారి జూడఁగోరి యెటులైన వచ్చిచూచి పొమ్మని ప్రార్థనపూర్వకముగా వర్తమానమంపెను. నానకు తన యక్కమాట త్రోసివేయలేక యామె దర్శనమునకుఁ బోయెను. నానకి తమ్ముని మిక్కిలి గారవించి భోజనముపెట్టి చాలసేపు వానితో సంభాషించెను. అక్కడ నుండఁగానే నానకు పూర్వపుచెలికాఁడగు బలుని జూడఁగోరెను. నానకి వెంటనే వానిని రావింప నతఁడు వానిం జూచి నీ వెట్లున్నావని యడిగెను. బలుఁడప్పలుకులు విని యజమానుఁడు తన్ను విడిచిపోయినది మొదలు తన కేమియు దోఁచక పిచ్చియెత్తినట్లున్నదనియు సెలవయ్యేనేని తాల్వోండికి బోయి వ్యవహారములం జక్కఁ బెట్టుకొని మున్ను చేయఁదలంచిన పనిఁ జేయ వచ్చుననియు బదులు చెప్పి నానకుచేసినపని చాల మంచిదని పొగడి యతండు త్రొక్కినత్రోవ తప్పన్న వారిని నిరసించి తనకు నానకునందుఁ బరమభక్తి గలిగింపుమని భగవంతుని బ్రార్థించెను. నానకు వాని భక్తికిమెచ్చి తాల్వోండికిఁ బోవుటకు వానికి ననుజ్ఞనిచ్చెను.

అనంతరము నానకు సోదరియొద్ద సెలవుబుచ్చుకొని నిజనివాసమగు గోరిలదొడ్డికిఁ బోయెను. మర్దనుఁడు తాంబూరా గొనుటకు బజారున కరిగెను. బజారులో నెక్కడ వెదకిన నొక్క తాంబురా యైనం దొరకలేదు. దొరకకపోవుట యటుండఁగా వానియుద్దేశమెఱిఁగిన పడుచువాండ్రిందఱు వానిని జూచి యెగతాళి సేసిరి. మర్దనుఁడు బజారంతయుఁ దిరిగి తిరిగి విసికి వేసారి నానకుకడకుఁబోయి తాంబురా దొరకకపోవుటయుఁ దన్నెల్లవారుఁ బరిహసించుటయు లోనగు వృత్తాంతమెఱింగించెను. నానకు వానిపలుకులు విని యిట్లని యూరడించె. "ప్రపంచమంతయు నజ్ఞానాంధకారమున మునిఁగి యున్నది. ఇప్పుడు లోకము మనల నిరసించినను ముందుముందు పశ్చాత్తాప

ముతోడను వినయముతోడను మనమాటల నాకర్ణించును." ఈశ్వరునియందు గాటముగ మనస్సు నిలిపిన పరమభాగవతోత్తముని మనోధైర్యమెట్లుండునో చూచితిరా? లోకము తనమాట నిరాకరింపక వినయముతో వినుమని వానియంతరాత్మ విస్పష్టముగ వానికి జెప్పెను. భగవద్భక్తులకు, సామాన్యమనుష్యులకుఁగల ముఖ్యభేద మిదియే. అనంతరము నానకు కొంచెము యోజించి సుల్తానుపురము నకు సమీపమందున్న యొక గ్రామములో నొకవర్తకుఁడు పెహ లూయనువాఁడు తాంబురాలు చక్కగాఁ జేయఁగలఁడనియు వానికడకు బోయిన దొరకుననియుఁ జెప్పి మర్దను నంపెను. మర్దనుఁడు బయలు దేరి నానాస్థలములు దిరిగి యామనుష్యునినెలవుగానక మూఁడు దినము లు తిరిగి తిరిగి మిక్కిలి డస్సి యొకచెట్టుక్రిందఁ గూర్చుండ వానియొద్ద కే పెహలూ వచ్చి యొకతాంబురా యిచ్చెనఁట. మర్దనుఁడు దాని వెల యీయఁబోవ దాని నతఁడు పరిగ్రహింపక నానకుదర్శనము చేయింపుమని ప్రార్థించెను. మర్దనుఁడును వానిందోడ్కొని నానకునకుఁ జూపి తదభీష్టముం దీర్చెను.

మర్దనుఁడు గానవిద్యలో నానాటివారి నందఱిని మించెనని చెప్పుదురు. తాంబురా దెచ్చి శ్రుతివేసి యతఁడు "తుహీనిరాకార్ తుహీనిరాకార్ నానక్ బందా తేరా" యను పల్లవిగలకృతిపాడెను. పాడినతోడనే నానకు భక్తిరసపరవశుఁడై యొడలెఱుంగక పడియెను. మర్దనునకుగానమునం దధికప్రజ్ఞ మొదటలేదనియు నానకు వరప్రసాద మునకునిముసమున నట్టిప్రజ్ఞ వానికిఁ గలిగినదనియుఁ గొంద ఱనుచు న్నారు. కొందఱు మర్దనునకు సహజముగా గానమునం దధికప్రజ్ఞగల దని చెప్పుదురు. నానకు మైమఱచిపడుట మర్దనునియొక్క గానప్రభావ ముచేతఁగాక వానిహృదయమున నున్న భక్తిరసముచేతనే యని కొం దఱు పలుకుదురు. ఈమాటయే కొంతవఱకు నిజమని తోఁచుచున్నది

భక్తి రసములేని శుష్కహృదయుఁడు రాళ్ళఁ గరగించు పాటలు విని నను పరవశుఁడై మూర్ఛిల్లునా? సహజముగా హృదయము భక్తి పూరితమైనప్పుడు స్వల్పగానము సహితముఁ వాని కుత్సాహము గలి గించును. అంతేకాని తాంబురాణాయ్యలు నోటిపాటలు భక్తిలేని వానికి భక్తి సృష్టింపలేవు.

నానకు రెండుదినములు మూర్ఛావస్థలోనుండి మూఁడవనాఁడు కన్నుదెఱచి చూచెను. గురువునకు మెలకువవచ్చినతోడనే మర్దనుండు స్వగ్రామమునకుఁ బోవుటకు సెలవిమ్మని యడిగెను. నానకు కారణ ముం దెలియఁగోర మర్దనుఁ డిట్లనియె. "మీరు మూర్ఛపోయి రెం డేసిదినము లీప్రకారముగా నున్నపక్షమున నాపని యేమికావయును? ఆఁకలిచేత దాహముచేత నేను చచ్చిపోనా! కావున నన్నుబోనిండు." శిష్యుని బేలమాటలు విని గురు విట్లనియె. "నీయిష్టము వచ్చినట్లు చేయవచ్చును. నీవు స్వగ్రామమునకుఁ బోయి సుఖించినను సంతోష మే. నన్ను గనిపెట్టుకొనియున్నను సంతోషమే. ఉండఁదలఁతువేని యాఁకలిచేతదప్పికచేతబాధపడవలసియుండును. నానకుతోనున్నవారికి నానకుతోపాటు కష్టములేగాని సుఖములు లభింపవు" మర్దనుఁడా పలు లుకువిని యేమియుం బదులుచెప్పక యెటుచేయుటకుం దోఁచక సందిగ్ధ మనస్కుఁడై యుండెను. అంతలో మర్దనుఁడు తనతమ్ముని విడిచి పోవఁదలంచుకొన్నాఁడని విని నానకి విచారమొందిమర్దనుని బిలిపించి పోవఁదఁలచినకారణమడిగి తమ్ముని విడిచిపోవలదనియు సుల్తానుపురము లో నున్నంతకాలము తనయింటనే రెండుపూటఁలు భుజియింపవలసిన దనియు సోదరుఁడాయూరు విడిచిపోవునప్పుడు వానివెంటఁ బోవలసిన దనియు నీప్రయాణమున కగు కర్చులన్నియుఁ దానే యిచ్చుకొనఁ బూనుననియుఁ జెప్పి యప్పుడే రెండుబట్టలు నిరువదిరూపాయలు వాని కిచ్చెను. అవిపుచ్చుకొని మర్దనుఁడు వారు చెప్పినట్లే చేయుటకు

వాగ్దానముచేసి మరల నానకుకడకుం బోయెను. మర్దనుఁడు కనబడక పోవుటచే నతఁడు స్వగ్రామమునకే బోయి యుండవచ్చునని నానకు తలంచి వానిం జూచినతోడనే మరల నేలవచ్చితివని యడిగెను. మర్ద నుఁడు నానకీదేవి తన్నుఁ బిలిపించి చెప్పినమాటలన్నియు వాని కెఱిఁ గించెను. మర్దనుఁడు తనసోదరియొద్దనుంచి వస్త్రములుగ్రహింపవచ్చు నే కాని ధనము స్వీకరించుట యనుచితమని తలంచి నానకు వానివద్దనున్న ధనముఁదీసికొనిసోదరియొద్దకుఁబోయియామెధనమామె కిచ్చెను. ఆమె దానిని బుచ్చుకొనుట కిష్టములేనిదయ్యుఁ దమ్ముఁడేమ నుకొనునోయను భయమున మరల గ్రహించి గృహస్థాశ్రమము స్వీ కరించి తల్లిదండ్రులకు నాలుబిడ్డలకుఁ దనకు బావకు నత్తవారికి నెప్పటియట్లు నేత్రానందము గలుగఁజేయఁదగునని వానిని బ్రార్థిం చెను. ఎన్ని చెప్పినను నానకు తనతోవ విడువనందున నానకీదేవి తమ్మునిం జూచి "నాకు నిన్నుఁ జూడవలయునని బుద్ధి పుట్టినప్పుడు నేను నీకు వర్తమాన మంపెదను. నీవు తత్క్షణమువచ్చి నన్నుఁజూచి పోవలయు"నని కోరెను. నానకు సోదరికోరికను దప్పక తీర్చుట కొడంబడెను.

---

పంచమాధ్యాయము.

---

అనంతరము నానకు కొంతకాల మచ్చటనుండి సోదరియొద్ద బావకడ సెలవుగైకొని లాహోరు మండలమునందలి యమ్నాబా దు పట్టణమునకుఁ బయనమైపోయెను. సుల్తానుపురమును విడిచిన యాగడియ మొదలుకొని యీకథానాయకుఁడు గురు నానకు నామ ముతో వ్యవహరింపఁబడుచు వచ్చె. ఏలయన నాదినము ప్రారంభ

 

ముగా నతఁడు తనకాలమున సంఘమునందుఁ బ్రబలియుండిన దురాచారమును వెలిఁబుచ్చి ఖండించుటకును బ్రజల మనస్సులనుండి మూఢవిశ్వాసములను దొలఁగించుటకును సత్యమని తానునమ్మిన మతము స్వేచ్ఛగా లోకులకు బోధించుటకును సంకల్పించెను. ఏమనుష్యుఁడు తనబోధనలవలన మానవకోటికి నీతి, యాత్మజ్ఞానము, మనోవికాసము గలిగించునో యతఁడే గురుశబ్దమున కర్హుఁడు. నానకు తనకుఁ గలిగిన యాత్మజ్ఞానమును దోడిమానవులకు నెఱింగించుటకే గాక దైవధర్మములకు విరుద్ధములైన దురాచారములను సంఘమునుండి దూరముగఁ దోలుటకు నిర్మూలించుటకు సమకట్టెఁ గావున నీతఁడు గురుబిరుదము నందుటకుఁ దగినవాఁడు. అందుచేత నాశబ్దమతనియందు సార్థకమయ్యెను.

సుల్తానుపురమునుండి యమ్నాబాదునకుఁ బోవుట కేమదిన ములుపట్టెను. ఈపట్టణమునకు నానకు వచ్చుటకుఁ గారణమేమన నచ్చట దైవభక్తుఁడు సత్ప్రవర్తకుఁడు నగు వడ్లవాఁ డొకఁడుండెను. ఆతని జూచుటయే యీగురుని యభిలాష. ఆవడ్రింగి పేరు లల్లో. నానకు తత్పురముఁ బ్రవేశించి సరిగ నావడ్రింగియింటికిఁ బోయెను. లల్లో నానకు మహాత్ముఁడని వినియుండెఁగాని యాతని దర్శన మది వఱ కెన్నఁడుఁ జేసియుండలేదు. తనగృహమున కనాహూతుఁడై యరుదెంచిన పురుషుఁడు నానకే యని తెలిసికొని యావడ్రింగి మహానందభరితుఁడై వానినెంతయు గౌరవించెను. అతఁ డక్కడ కొన్నినాళ్ళుండి తనమతము బోధింప నారంభింప నాపురజనులకు వానిమీఁద ననిష్టము పొడమెను. అనిష్టమే కాదు. కేవలము ద్వేషమే కలిగెను. అట్లు కలుగుట యాశ్చర్యముకాదు. ఏలయన నేమనుష్యుఁడైన మతవిషయమునఁగాని సంఘవిషయమునఁగాని జ్యోతిషాది శాస్త్రములఁగాని క్రొత్తసిద్ధాంతము బోధించినప్పుడును సిద్ధాంతము

ప్రాతదైనను నూతనముగా నాచరణమునకుఁ దెచ్చినప్పుడును లోకులు కాకులట్లు వానిం బొడిచి తలయెత్తుకొననీయక నిందించి బహిష్కరించి దండించి చేతనైనచో నిష్కారణముగఁ జంపివేయుదురు. ప్రపంచముయొక్క పూర్వచరిత్రం జదివినవారి కందఱకు నిది విదితమే. లోకులు క్రొత్తసిద్ధాంతములలోనున్న యోగు బాగుల నరయరు. దానివలన మానవకోటికిఁగల్గు లాభనష్టములను విచారింపరు. మునుపటి యాచారములకు విరుద్ధముగ బోధించినవాఁడు నీతిమంతుఁడైనను సరే విద్యాసముద్రుఁడైనను సరే జ్ఞానరాసియైనను సరె లెక్కసేయక వానినెల్ల సిలుగులం బెట్టుదురు. ఈమాటల యాథార్థ్యము స్థిరపఱచుట కుదాహరణములు వేనవేలున్నవి. ఎందఱో పరమపవిత్రులు మలినచరిత్రులచేత సంహరింపఁబడిరి. ఎందఱో విజ్ఞానవంతులు పరమమూర్ఖులచేత బాధింపఁబడిరి. ఎందఱో శాస్త్రకారులు నిరక్షరకుక్షులచేత నిందింపఁబడిరి. అద్వైతమతోద్ధారకుండగు శ్రీశంకరాచార్యుఁడు మళయాళ బ్రాహ్మణులచేత నెన్నియిడుమలఁ బడెనో మనము వినియుండలేదా? ఆయనతల్లి మృతినొందినప్పుడు కులబ్రాహ్మణులు శవదహనమునకు సాహాయ్యముచేయక మిన్నకుండ శంకరుఁడు గొడ్డలితో మాతృదేహమును ఖండఖండములుగాఁ జేసి మోసికొనిపోవుటకు వీలులేక తన దొడ్డిలోనే యగ్నిసంస్కారము చేసెనఁట. విశిష్టాద్వైత మతోద్ధారకుండగు రామానుజాచార్యుని చోళరాజు దేశమునుండి తఱిమెనఁట. రామానుజుఁ డారాజు చనిపోవువఱకు నసఁగాఁ బండ్రెండు సంవత్సరములు తనమతము స్వదేశమున బోధింప వీలులేక విదేశములఁ గాలక్షేపము చేసెను. ఏసుక్రీస్తు

వంటి నీతివంతుని బరమభక్తుని సుగుణవంతుని వాని దేశీయు లగు యూదులు నిర్హేతుకముగాఁ గౌరత వేయింపలేదే. మతము మాట యటుండనిండు. పరికృతిశాస్త్రములలోఁ గ్రొత్తసంగతులు కనిపెట్టిన వారికిఁగూడ నిట్టియవస్థలే సంభవించినవికదా. "సూర్యుఁడు భూమిచుట్టుఁ దిరుగుటలేదు. భూమియే సూర్యునిచుట్టుఁ దిరుగుచున్న"దని కష్టపడి కనిపెట్టి యాసత్యము లోకమునకు వెల్లడించినందుకే గడాబ్రూనోయను పశ్చిమఖండవాసుని వాని మతస్థులగు క్రైస్తవులు బ్రతికియుండఁగా వానిని నిప్పులలోఁ బడవైచి చంపిరి. క్రొత్తదానిని లోకులు మొట్టమొదట నేవగించుట సహజము.

నానకు క్రొత్తసిద్ధాంతమేమియుఁ జెప్పకపోయినను వానిమతము పవిత్రమైన యార్యమతమైనను నాఁటి దేశస్థుల యాచారమునకు విరుద్ధముగ నుండుటచే వానిని బ్రజలు ద్వేషించిరి. నానకు పరమశాంతుఁడైనను దత్పురజనులు వాని నెగతాళిచేసి చప్పటులఁ జఱచి యవమానించిరి. నానకునకు మర్దనునకుఁగూడ నక్కడనుండుట కిష్టములేకపోయెను. గురుశిష్యులు తమతలంపు వడ్రింగి కెఱిఁగించిరి. అంత త్వరితముగ నేల బోవలసివచ్చెనని వడ్రింగి వారినడుగ నానకు తనయునికి పురజనులకు బాధకరముగా నున్నందున వారికి మనోవ్యధ కలిగించుట కిష్టములేక తాను పోవలసివచ్చెనని ప్రత్యుత్తరమిచ్చి యీక్రింది విధమునఁ బలికెనఁట. "నే నూరకుంటినా నన్ను జ్ఞానములేని మొద్దందురు. మాటాడితినా పేలుచున్నాఁ డందురు. కూర్చుంటినా మెవనికొఱకో యేడ్చినట్లే యున్నాఁడందురు. లేచిపోతినా నెత్తినిగుడ్డవేసికొని పోయినాఁ డందురు. వినయము జూపితినా భయపడి లోఁబడినాఁడందురు. ఈజనుల నెట్లు మెప్పింపవలయునో నేనెఱుఁగను. భగవంతుఁడే నన్నిహాపరముల రక్షించుఁగాక!" "లోకో భిన్నరుచిః" యను సామెతనుబట్టి మనుష్యుల మనస్సులు పరి

పరివిధములుగ నుండును. ఒకనికి మిక్కిలి బాగున్నది మఱియొకని కెంతో యోగ్యముగాఁ గానఁబడును. అందఱ మెప్పించుట మనుష్యమాత్రుని కెవ్వనికిం దరముగాదు. కావున లోకోపకారపారీణుఁడగు మనుష్యుఁడు తనకు సత్యమని తోఁచినదానిని లోకుల నిందల కుడుగక స్తోత్రముల కుబ్బక దైవముఖముఁజూచి నిర్భయముగఁజాటును. గురునానకు తనయూరు విడచిపోవుట కిష్టపడనొల్లక లల్లో మాసముదినములు తనయింట నుండుమని వానిని బ్రార్థించెను. అతఁడు మిక్కిలి వినయముతో వేఁడుకొనుటచేతను మిక్కిలి భక్తిగలవాఁడగుటచేతను నానకు వానికోరిక నెరవేర్ప నియ్యకొనెను. మర్దానుఁడు పురజనులుపెట్టు బాధలు పడలేకను కొత్తయూరులో మునుపటియట్లు పొద్దుపోవక పోవుటచేతను స్వగ్రామము పోవఁదలఁచి యజమానుని సెలవడిగెను. తనకాతిథ్యమిచ్చిన గృహస్థుఁడు సామాన్యస్థితికలవాఁడైనందున నిరువుర కన్నమిడుట వానికి భారముగా నుండునేమో యనియుఁ బోవఁదలఁచిన వాని నాపఁగూడదనియు నానకు మర్దనుని పోక కనుమతించి నెల దినములలో ననఁగాఁ దా నాపురము విడువక ముందే రమ్మని చెప్పిపంపెను.

గురునానకు తత్పురమున నున్నప్పుడు సంపన్నుఁడు పలుకుఁబడి కలవాఁడు కులమున క్షత్రియుఁడు నగు మాలికుభాగో యను నతఁడు బ్రాహ్మణులకు సంతర్పణముఁ జేసినాఁడు. నానకునుగూడ విందునకుఁ బిలచెను. ఏమి కారణముచేతనో నానకు విందునకుఁ బోవలేదు. ఆసంపన్నుఁడది యవమానముగా గ్రహించి నానకు దర్శనమునకుఁబోయి విందునకు రాకపోవుటచేఁ దనకుఁగలిగిన యవమానమును మనస్తాపమును బిట్టు జెప్పుకొనెను. అదివిని నానకు భాగోనుజూచి యంతటి స్వల్పవిషయమున కంతగా విచారింపవలసిన యావశ్యకత లేదని చెప్పి వెనుక విందారగింపనందుకు దోషపరిహారార్థ

ముగా నప్పు డతఁడిచ్చు వస్తువులఁ దినుటకు వాగ్దానముచేసి భక్ష్యములఁ దెమ్మని యడిగెను. భాగో సంతుష్టహృదయుఁడై తత్క్షణము కొన్నిభక్ష్యములఁ దెమ్మని సేవకున కాజ్ఞాపించెను. తోడనే మిగుల రుచ్యములగు పదార్థములు పళ్ళెరములతో వచ్చెను. అవి ముట్టక మునుపే నానకుపరిక్కను నిలిచియున్న పేదవడ్రింగిని జూచి మీయింటిపదార్థములఁ గూడ తీసుకొనిరమ్మని యాజ్ఞాపించెను. అనవుడు లల్లో మహాప్రసాదమని తనయింటనున్న నిస్సారపదార్థములం గొన్నిఁటిని దెచ్చి గురు సమ్ముఖమునం బెట్టె. పెట్టుటయు గురువు రెండుపళ్ళెరములనుండి రెండువస్తువులు చెఱియొక చేతం గ్రహించి వ్రేళ్ళతో నొక్కెనఁట. నొక్కినతోడనే భాగో తెచ్చిన పదార్థముల నుండి నెత్తురుబొట్లు పడెనఁట. లల్లో సమర్పించిన పదార్థములనుండి తెల్లని పాలు గారెనఁట. అట్లు కారుట యసంభవమగుటచే నీకథ విశ్వాసపాత్రముగాదు. కాకున్నను లోకుల కీకట్టుకథ కొంత నీతిని బోధింపకపోదు. ఇందు మనము నేర్చికొనవలసిన నీతి యిది. సంపన్నులు వెండిగిన్నెలతోడను బంగారుపళ్ళెరములతోడను దెచ్చియిచ్చు పంచభక్ష్యపరమాన్నంబులు వారి కష్టార్జితంబులు కావనియు, పొట్ట గడువక దినమెల్లఁ జమటయూడ్చి పాటుపడు నిరుపేద లనేకుల బాధించి బలాత్కారముగాను మోసపుచ్చియు సంపన్నులు ధనము గ్రహించి విందుల తామారగించి యొరులకు మెప్పునకై పెట్టుదురనియు, పాలుమాలక యొరుల వంచింపక మేను దాఁచుకొనక పాటుపడి దారపుత్రుల నెట్టెటో పోషించుచు గౌరవముగఁ గాలక్షేపము సేయువాని గంజియన్నమే భాగ్యవంతుల పాయసాన్నములకంటె భక్ష్యములకంటె మహాత్ము లెక్కువ యాదరముతో నెక్కువరుచితో భుజింతురనియు మన మెఱుంగవలయు.

భాగో తెచ్చిన పదార్థములనుండి నానకు నెత్తురు పిండిన

మాట నిస్సంశయముగా నతిశయోక్తియై యుండును గాని వాని తెచ్చిన యాహారమును దిన్నగ మెసవక వడిగింకి యుడికినకూడు నెక్కువ యాదరించి సమగ్రముగ భక్షించియుండుననుట సత్యమని మనమూహింపవచ్చును. ఇంతియగాక గడుసుదనమెఱుంగని వెంగలిజనులను దోఁచికొను భాగ్యవంతులగువారి యన్నముకంటె నీతిమంతులగు నిరుపేదల కూఁడు శ్లాఘ్యము గ్రాహ్యమునని నానకు మొగమోటమిలేక వానితోఁ జెప్పియుండిన నుండవచ్చునని గూడ మనమూహింపవచ్చును. ఆయాహారణము నాధారము జేసికొని బుద్ధిమంతులీకథను గల్పించి యుందురు. భాగ్యవంతుఁడై యెల్లవారలకు గౌరవనీయుఁడైయున్న భాగోకు నిరుపేదయుఁ దక్కువ వర్ణము వాఁడునందు వడిగింగియునగు లల్లో యెదుట జరిగిన యవమానము నతఁడు సాధారణముగ మఱచిపోఁదగినదిగాఁ గానఁబడదయ్యె. ఆక్రోధమతఁడు మనసులో నుంచుకొని నానకున కేదైన నపకారము జేయుటకు సమయము నిరీక్షించు చుండెను. రంధ్రాన్వేషణము చేయువారికి సమయములు చిక్కకపోవునా? శీఘ్రకాలములోనే యతని కోరిక యదనుదొరకెను. ఎమ్నాబాదు ఖిల్లాదారు (గవర్నరు) గానుండిన శేజిఖానున కొక్కఁడే పుత్త్రుఁడుండెను. అతఁడా దినములలో గొప్ప జాడ్యముచేఁ బీడితుఁడైయుండె. శేజిఖాను గొప్పవాఁడగుటచే నతఁడు తన యధికారమునకు లోఁబడిన దేశములోనున్న గొప్పవైద్యులఁ నందఱఁ బిలిపించి కుమారునకు జికిత్సలఁ జేయించెను. కాని యవి యన్నియు నిష్ఫలము లయ్యెను. భాగో శేజిఖానున కాప్తుఁడగుటచే ఖాను తనకుమారుని దేహస్థితి నాతనితోఁ జెప్పుకొని శీఘ్రముగ నేదో చికిత్స జేయనిపక్షమునఁ బుత్త్రుఁడు తనకు దక్కఁడని బిట్టు విచారించెను. భాగో వానివిలాపము విని మేటివైద్యుల చికిత్సలు నిష్ఫలమ్మాయెనందున నటమీఁదఁ జికిత్సలఁజేయింపక భగవద్భక్తుఁడై పరమ

పవిత్రుఁడై మహిమలుచేయఁగల యోగినెవ్వనినైన బిలిపించి మంత్రి బలముచే రోగములు శరీరమునుండి నిర్మూలము జేయుట కర్తవ్యమని వాని కుపదేశించెను. ఆయాలోచనము మిక్కిలి బాగున్నదని ఖాను మెచ్చుకొని నిజముగా వాక్శుద్ధిగలవాఁడు మహిమగలవాఁడు నగు యోగిదొరకుట సులభసాధ్యము కాదని పలికెను. అనవుఁడు నగర మందున్న బైరాగుల సన్యాసుల యోగుల నందఱఁ బట్టి తెప్పించిన పక్షమున నందులో నెవ్వఁడైన నొక్కమహాత్ముఁ డుండకపోఁడని భాగో ప్రత్యుత్తరమిచ్చెను. ఆయుపదేశము లెస్సగానున్నదని మెచ్చి ఖాను కానఁబడినవిరాగుల నెల్ల బట్టుకొమ్మని సేవకులకానతిచ్చెను. అట్లు పట్టుబడిన వారిలో గురునానకుకూడ నొకడై యుండెను. రాజభటులు గురునానకును నిష్కారణముగఁ బట్టుకొని తీసికొనిపోవు చున్నందుకు లల్లో చాల విచారించెను. గురునానకు తనకు శిష్యుం డగు పేదవడ్రింగి నూరడించి తనయాత్మ బంధములో లేనంతకాలము శరీరముబంధింపఁ బడినను బాధల నొందినను దనకు జిజ్ఞాసలేదని పలికి వానికిధైర్యము చెప్పెను.

మానవుఁడు తలంచున దొకటియు దైవము నిర్ణయించున దొకటియు నగుచుండును గదా. శేజిఖాను తనయధికారబలమున భాగో చెప్పిన యాలోచనమునను సరించి పట్టణమునంగల విరాగులనెల్ల బలవంతముగఁ బట్టి తెప్పించెనేకాని తమయభిప్రాయము వారికి సరిగ నెఱిఁగింపకమున్నె కుమారుని శరీరస్థితి వారికి దెలుపకమున్నె యంతలో మొగలాయీలు మహాసేనాసమేతులై జయాభిలాషమై వచ్చుచుండిరనియు వెంటనే తమకు లోఁబడనిపట్టణంబుల భస్మపటలము చేయుచు మనుష్యుల మర్దించుచుండిరనియు గుండెలవియు వార్తలు తెలిసెను. లోఁబ డని పట్టణములు భస్మపటలము లగుచున్న వనుటచేత లోఁబడిన

యూళ్లు నిరపాయములై యున్నవని తలంపవలసినపని లేదు. నీతిపూలిన యాదండులోని సైనికులు లోఁబడిన యూళ్ళసైతము దోఁచుకొని స్త్రీలఁజెఱబట్టి యథేచ్ఛముగా మెలంగుచువచ్చిరి. ఎట్లయిననువారి యధికార మొప్పుకొన్న గ్రామములు, లొప్పుకొనని గ్రామములకంటె నించుక సుఖతరములుగ నుండినవని చెప్పవచ్చును. ఆవార్తలు నివి శేఖాను వానిచుట్టములు మిత్రులు తక్కిన పట్టణములకుఁ బ్రాపించిన దురవస్థయే తమ పట్టణమునకుఁగూడ తప్పక పట్టునని మహాపదకు సంసిద్ధులై యుండిరి. అనుకున్నంతపని జరిగె. బేబరుయొక్క మొగలాయిసైనికులుకొలఁదికాలములోనే యమ్నాబాదునకుఁబోయి యనాగరకులు క్రూరులునగు సైనికులు చేయఁదగిన దుండగములన్నియుఁ జేసిరి. ఒక్కదోఁపుడుకాదు. ఒక్కస్త్రీ మానహానిగాదు. అపుడు జరిగిన దౌర్జన్యములను గురునానకు స్వయముగఁ జూచియుండుటచేత నతఁడు స్వభాషలో నాపురజనుల దురవస్థఁ గొన్నిపద్యములలో వర్ణించెను. ఆపద్యముల తాత్పర్య మీక్రిందఁ బొందుపఱచెద. ఈవాక్యములలో నతఁ డంతఃపురస్త్రీలదురవస్థనే మిక్కిలివర్ణించి యున్నాఁడు.

"అహా? యీస్త్రీలు మున్ను పువ్వులతో సుగంధతైలముతో నగలతో వారిశిరసుల నలంకరించుకొని యుండిరికదా ! ఆయువతులిప్పుడు శిరస్సులు ముండనముచేయించుకొని నోట మట్టిఁగొట్టుకొని పోవుచున్నారుగదా! తొల్లి యీ యంగనలు సుందరమందిరముల వసియించుచుండిరిగదా! నేఁడు వారిజయించిన వారియెదుట నిలువనైనఁ దగరట. వందనము సర్వేశ్వరా! వందనము. నీసంకల్ప మెవ్వఁ డెఱుంగఁడు గదా ! నీవేమి చేయఁదలంచెదవో నీవ యెఱుంగుదువు. ఈ పడంతులు వివాహకాలమున భర్తలపార్శ్వముల నెంతెంత శోభిల్లుచుండిరో గదా ! వివాహానంతరమున నీ వెలఁదులు

పల్లకులెక్కి భర్తృగృహములకుఁ బోయినప్పు డెంతెంత వైభవముతో నుత్సవములు జరిగెనో కదా ! చేతుల కంకణాలు ధగధగమెఱయ నీక్రొత్తపెండ్లికూఁతు లత్తవారి గుమ్మములముందు నిలిచినప్పుడు ముసలిముత్తయిదువులు పీడాపరిహారార్థ మెన్ని సారులు దృష్టి తీసిరో గదా ! వారి నోట మాట వచ్చెనా లెక్కలేని ధనము వారియధీనమయ్యెనుగదా ! హంసతూలికాతల్పముల మీఁద హాయిగాఁ బన్నుండుటయెగాని పనిచేసి యెఱుంగరుగదా. కావలసిన సమస్తమధురఫలములు వారికవలీలగఁ జేకురు చుండెడివి. ఆ యువిదలు శరీరములమీఁద ధరించిన చీనిచీనాంబరములు మణిభూషణములు వెలలేనివిగదా ! కటకటా ఇప్పుడు వారిచక్కఁదనమె వారికి శత్రువయ్యెను. వారివిభవమె విరోధియయ్యెను. దురాత్ములగు యధికారుల యాజ్ఞాప్రకారము సైనికు లాస్త్రీలం జెఱబెట్టిరి. దైవము తనకిచ్చవచ్చినవారి నున్నతపదవికిం దెచ్చి కాఁపాడును. మనుష్యుఁడుతేగు సమయమున భగవంతుని దలంచుకొన్నయెడల వారికపాయము లేలవాటిల్లును? శత్రువులు దండువిడియకముందు ప్రభువులు భోగపరాయణులై దైవమును మఱచి నిశ్చింతతోనుందురు. ఇప్పుడేమివిచారించిన నేమిఫలము? బేబరుశాసనము చెల్లుచున్నది. సుకుమారవతులగు సుందరాంగులు సయితము పట్టెడన్నమునకు మొగము వాచియుండిరి. మసీదులలో నమాజుచేయవలసిన యవసరము దేవాలయములలోఁ బూజలుచేయవలసిన యవసరము లేకపోయినది. హిందూసుందరులు మనసార మొగమునఁ గుంకుమబొట్టు బెట్టుకొనుటకైన వీలులేని కాలము వచ్చినది. మునుపు వీరెవ్వరు రాముని పేరైన స్మరించి యెఱుఁగరు. ఇప్పుడు స్మరింపఁదలఁచినను శత్రువులు స్మరియింపనియ్యరు. కొందఱు చెల్లాచెదరైన తమ కుటుంబములసేమము నరయుచున్నారు. కొందఱు చుట్టపక్కముల కుశలవార్తల నడుగుచు

న్నారు. కొందఱు తమ దుష్కర్మములఫల మనుభవింపఁ గూర్చుండినట్లు నేలఁగూర్చుండి యేడ్చుచున్నారు. భగవంతుఁ డేమిచేయ నిచ్చగించునో యదియే సంభవించును. మనుష్యుఁడు చిన్న " పురుగు"

అట్లు ప్రజల యవస్థనుగూర్చి కొన్నిపద్యములు చెప్పి నానకు పట్టణపరిపాలకుఁడగు శేజిఖానుని దుర్గతిని వర్ణించుచు మఱికొన్ని పద్యములు రచించె. ప్రతిపద్యాంతమందు భగవంతుని మార్గము మనుష్యబుద్ధికి దుర్గమములనియు నతని శాసనము లవిలంఘనీయము లనియు నానకు నొక్కి. చెప్పుచు వచ్చెను. ఆపద్యముల తాత్పర్య మీక్రింద వ్రాయుచున్నాఁడ. "ఒక కాలమందు శేజిఖాను వాని యంతఃపురాంగనలు ననుభవించిన భోగ మింతింతయని చెప్పరాదు కదా! సేవకులు వారికనుసన్నలమెలంగి వారినోటి మాట జాఱినమాత్రమున నూడిగములు చేయుచువచ్చిరిగదా! కోరికలు కోరుటయె తడవుగా నవి సఫలము లయ్యెనుగదా! అహోరాత్రము లెడతెగని పండుగలై మహోత్సవములతో నిండియుండెనుగదా! ఆనందసముద్రమునఁ దేలుట సౌఖ్యములనవ్వారిగా ననుభవించుట సేవకుల కాజ్ఞాపించుట యాటలాడుట యలంకారములఁ జేసికొనుట మున్నగుపనులకంటె నన్యమెఱుంగరుకదా! అవును. శేజిఖాను వానివంటి యితర మనుష్యులు నిశ్చయముగా నట్లు గడపిన దినములు కొన్ని యుండెను. అదృష్టము కలిసివచ్చినంతకాలము వారికట్లు జరిగెను. కటకటా వారిప్పు డెట్లున్నారు. శత్రుసైనికు లున్నసొమ్మెల్ల నోలుచుకొనిరి. ఈ యాయవమాన మనక యెల్లయవమానములు వారివంతయ్యె. వెనుక ననుభవించిన మహాభోగములకన్నిఁటికి బ్రాయశ్చిత్తమో యన్నట్లు కొందఱు మహాభారముగ నున్న సంకెళ్ళతోఁ గాళ్ళుకదపలేక నేఁడో రేపో గతించిన తమచెలికాండ్రఁ గలిసికొనుటకు సంసిద్ధులై చెఱసాలల్లో గుందుచున్నారు. భగవంతుఁడు న్యాయశీలుఁడు సర్వోన్నతుఁ

డు. అతనిశాసన ముల్లంఘించినవారు తప్పక నశింతురు. ఈనాఁటి ప్రిభువులగు పటానులు వానియాజ్ఞ దాఁటలేదా? దానిఫల మనుభవించుట లేదా? ఘాతుకులగు మొగలాయీసైనికులకుఁ బౌరుషహీనులయిన పటానప్రిభువులకు జరిగిన యాయుద్ధములో నిర్హేతుకరముగా జచ్చిన వేనవేలు పురుషులు స్త్రీలు బిడ్డలు మొదలగువారి పక్షముఁ బూనుట కెవ్వరు లేకపోయిరి."

---

## షష్ఠాధ్యాయము.

---

మర్దనుఁడు గురువును వీడ్కొని తాల్వెండీగ్రామమునకుఁ బోయెను. ఆగ్రామవాసులు వానిరాకకు సంతసించి నానకునుఁగూర్చి మిక్కిలి యాత్రముతో నెన్నోప్రశ్న లడుగఁజొచ్చిరి. మర్దనునకంటె ముందు పదునైదుదినముల క్రిందట బలుఁడు తాల్వెండికిఁబోయెను. నానకుతండ్రి యదివఱకే తనకుమారుఁడు సన్యాసులలోఁ గలిసిపోయినాఁడని విని యామాట నిజమో యబద్ధమో కనుఁగొనుటకు బలుని కడకుఁబోయెను. అది యదార్థమే యని బలుఁడుపలుకుటయు భగ్నమనోరథుఁ డగుకాళుఁడు కాళునికంటె నెక్కుడుగ దిృప్తాదేవియు మితిలేని వగఫునొందిరి. కాళుఁడు ఫుత్రిస్నేహము కతమున మనశ్శాంతిఁగోల్పోయి నిరపరాధుఁడగు నాకొఁపుకొడుకును జూచిన చోటనెల్లఁ దిట్టుచుఁ దనకుమారుని పాలిఁటి దుష్టగ్రిహ మనియుఁ దన కొంపదీసినవాఁ డనియు దుఃఖింపఁజొచ్చెను. కాళుఁడు, పుత్రిని దెస నాసవిడిచియు మరల నతఁడు సంసారమును స్వీకరింపఁడని మనంబున నెఱింగియు నెవరిప్రోత్సాహముచేతనైన బలుఁడు విడిచిపోయినపిదప బుద్ధిమంతుఁడై సంసారమున వెండియుఁ బ్రివేశించియుండఁగూడనా

యని కొంత లేనిపోని యాసపెట్టుకొని మర్దనుఁడు గ్రామమునకు రాఁగానే బలునికంటె వాఁడు బుద్ధిమంతుఁడనిభావించి వాఁడు సుతు నివిషయమున నేదైన మేలువార్త చెప్పునేమోయని భ్రమపడి వా నినిం గలిసికొని నానకు వైరాగ్యమునుగూర్చి యనేకపశ్నలడిగెను. తనయునిఁగూర్చి కాళుఁడు విన్నదంతయు యదార్థమని మర్దనుఁడు ప్రత్యుత్తరము చెప్పెను. అది విన్నతోడనే కాళునియొడలు జల్లుమ నెను. మొగము తెల్లబారెను. మర్దనుఁడు కాళునిమాటలకు బదులు చెప్పునపుడు నిర్భయముగను జ్ఞానగర్భితముగను మాటలాడెను. మొ దట కాళుఁడే తనయునివార్త యరసివచ్చుటకు మర్దనునిబుత్తెంచెన ని చదువరు లెఱుంగుదురుగదా! మర్దనుఁడు తన యుదరపోషణార్థ ము గానవిద్య నేర్చుకొన్న వాడయ్యు గురునానకుతోఁ గొన్నినాళ్ళు సహవాసముచేయు నప్పటికి వానికి స్వలాభపరాయణత యైహిక విషయాసక్తి దవ్వులయ్యెను. పారమార్థికచింత ప్రబలెను. తనవలెనే పుత్రుఁడు సంసారతంత్రములో దగుల్కొనునట్లు చేయవలయునని ప్రయత్నించుచున్న కాళునిచేష్టలయందతనికేవ గలిగెను. దయాళు వు లోకబాంధవుఁ నగుభగవంతుఁ డొకఁడున్న వాఁడనియు వాని సేవయే మానవునకుఁ బ్రథమకృత్యమనియు నతడు తెలిసికొనెను. తెలిసికొని తన్ను పంపిన యజమానికంటె మర్దనుఁడుజ్ఞానియయ్యె. నా నకుయొక్కనిశ్చలభక్తిని శాంతమును మనోధైర్యమును భూతదయ ను జూచినవారందఱదివఱకెంత భక్తిహీనులైనను తప్పకభక్తితప్పరు లగుదురు. అందుచేతనే మర్దనుడు స్వలాభాన్వేషిగాక నానకునకు శిష్యుడయ్యెను. పుత్రుఁడు చెడిపోయినాడని దుఃఖితుడైన కాళుని మ ర్దనుఁ డూరడించి గుణరత్నాకరుఁడగు నట్టికుమారుఁడు గర్భమున జనిం చినందునఁ దన్ను ధన్యుడుగా భావించుకొనక విచారించుట యవివేక మని యు వానికుమారుఁడు లోకసామాన్యుఁడు కాఁడనియు శ్రీకృష్ణుని

యవతారమనియు సూర్యచంద్రులయంశమునఁ బుట్టె ననియు మఱి యుఁ బెక్కుభంగులఁ దనభక్తికొలఁదిచెప్పి వానిపీడ్కొని మొదటినుం డియు నానకునందు మంచియభిప్రాయము గలిగియుండిన రాయబు లారు కడకుఁబోయి నానకు వృత్తాంత మంతయు వానికెఱింగించెను. రాయబులారు నానకు వృత్తాంతమును కాళుఁడువిన్నట్లు వినకమున్ను తానను కొన్న దానికి నాఁడువిన్నదానికి సరిపోయెనని చాలసంత సించి తాల్వెండీగ్రామమునకు గురునానకు నొకసారి బంపుమని మర్ద నుని వేఁడుకొని తనమాటలుగా వానికి విన్నవింపుమని కొన్ని పలు కులు చెప్పి పుచ్చెను. మర్దనుఁడు తనవెంటఁనీసారి బలుని దోడ్కొని పయనమై యమ్మాబాదునకుఁ బోయెను.

పోయి నానకును గాంచి యతఁడు రాయబులారుమాటలుగా నిట్లని విన్నవించెను. "నేను చాలకాలమునుండి మహాత్ము లగు మిమ్ముఁ జూడఁగోరుచుంటిని. కాని వార్ధకము, దేహదౌర్బల్యము నారాక కాటంకము గలిగించినవి. పయన మేఁడుదినములు పట్టుట చేతను బాధలు మిక్కిలి పడవలసివచ్చుటచేతను రాఁజాలనైతిని. కావున నా యెముకలు గోతిలోబడకమున్నె మీరే తాల్వెండిగ్రామ మొక్కసారి వచ్చి నాకు దర్శనమిచ్చి నన్ను ధన్యునిఁ జేయవలయు నని కోరు చున్నాను." ఆ సందేశము మిక్కిలి జాలిగొలుపునదై యుండుటచేతను దనమీఁద మొదటినుండియు నభిమానముగలిగి తన కెన్నో యుపకారములు చేసిన రాయబులారునొద్దనుండి యా సందే శము వచ్చుటచేతను నానకు దానిని జులకనగాఁ జూడలేకపోయెను. అందుచేత బలుఁడు, మర్దనుఁడు జేరిన దినముననే నానకు లల్లోయొద్ద సెలవు పుచ్చుకొని యమ్నాబాదు విడచి తాల్వెండికిఁ బోవఁదలఁచెను.

తలఁచెనుగాని పయనము గావలసి వచ్చినప్పుడు వానిమనస్సు మిక్కిలి సందేహించెను. రాయబులారుమీఁది విశ్వాసముచేత నన్ను

గ్రహముచేత స్వగ్రామదర్శనము వాని కిష్టమైనను వాని మనస్సునకు మిగుల బాధను కలిగించునట్టివియు మనోధైర్యమును సంపూర్ణముగా శోధింపఁ గలిగించునట్టివియు నగు స్థితిగతు లక్కడ నున్నట్లు వానికిఁ బొడగట్టెను. ఎవ్వనిఁగూర్చి గురునాన కప్పటికిని భయపడు చుండెనో యా కాళుఁ డక్కడ నుండెను. దయామయ స్వరూపిణియు గన్నతల్లియునగు త్రిప్తాదేవియు నక్కడనే యుండెను. కోపోద్దీపితుఁడగు తండ్రికఠోరభాషణముల నతఁడొకవేళ సైరించి సరకు సేయక మనోధైర్యమును జిక్కఁబట్టినఁ బట్టుఁగాక! మూర్తీభవించిన కృపారసమో యన్నట్లు మృదువులగు మాటలతో, జాలిగొల్పు చూపులతో, బాష్ప పూరితములైన కన్నులతో దఱికిఁజేరి మీఁద జెయివైచి తల్లి బ్రతిమాలుకొన్నప్పు డెంతనిశ్చలహృదయముగల కొడుకైన బేలవడి లోబడకుండునా? సహజముగ మాతృభక్తి యతిశయముగా నున్న నానకువంటి గుణవంతుఁడు తల్లిమాటలఁ కెదురాడఁగలఁడా? మాటకు మాట యుక్తికి యుక్తి చెప్పి యతఁడు తొక్కినమార్గము సరికాదని సహేతుకముగా నెవరైన వాదించినచో వారి నతఁడు వాదమున నోడింపఁగలఁడు. అట్లు చర్చలుపెంపక వాదములు సలుపక కన్నీళ్లనే యుక్తులుచేసికొని దయనీయములగు మాటలనే యాయుధములుగ జేసికొని కొడుకులం గెలిచి వారిమనస్సులం ద్రిప్పఁదలఁచు తల్లులముందఱ పుత్రుల నీమములు నిలుచుట యఱిది. ఇందుచేతనే పూర్వకాలమునందు గౌతమబుద్ధుఁడు మొదలగు మహాత్ములందఱు సన్యసించి యా యాశ్రమమునందు జాలకాలము స్థిరపడినపిదప తల్లిదండ్రులు మొదలగు చుట్టములం జూడఁబోయిరి. అవి యన్నియు నానకు చక్కగా నెఱిఁగినవాఁడు గావున తాల్వెండికిఁ బోవుదునా మానుదునా యని మొదట నించుక సంశయించియు జననీ జనకుల ప్రార్థనలకు మనోవైకల్యము నొందక స్థిరముగా నిలిచినప్పుడే తన వైరా

గ్యము వైరాగ్యమగుననియు గానిచో నది వ్యర్థమనియు భావించి తప్పక యా యూరికిం బోయి తన మనోధైర్యమును బరీక్షించుకొనం దలంచెను. అట్లు కృతనిశ్చయుండై యిరువురు శిష్యులచేత ననుగమ్యమానుండై నానకు తాల్వోండికింబోయి గ్రామమునం బ్రవేశింపక యూరు బైటం జెఱువుదగ్గఱ బసచేసెను.

అతని రాక గ్రామములో దెలిసినతోడనే గ్రామవాసులు స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులుం దమతమ పనులుకట్టి తమ గ్రామవాసియైన యీ మహాయోగి దర్శనము చేయ తీర్థప్రజవలె వచ్చిరి. నానకు మనసులో తలంచినట్లె తండ్రియగు కాళుండు, తల్లి త్రిప్తాదేవి, పినతండ్రిలలో నొకండు వానికడకు వచ్చిరి. అప్పుడు నానకు సన్యాసివేషముతో నుండెను. కాషాయవర్ణము గల రెండు గజములగుడ్డ తలకుం జుట్టుకొని యట్టిదే మఱియొకటి మొలకుం జుట్టుకొని మఱియొక చిన్నగుడ్డ చేతంబూని యతండు కూర్చుండెను. ఊరుబైటం జెట్టుక్రింద నట్టిదీనవేషముతోం గూర్చుండిన యీ కుమారునిం జూడం దల్లి తండ్రిలమన స్సెట్లు పరితపించెనో చదువరులే యూహించుకొన వచ్చును. కాళుండు కుమారునిస్థితిం జూచిన తోడనే మనోవైకల్యము నొంది కోపపరవశుండై నానకును దూషించుటకుం బ్రయత్నించెనుగాని శాంత స్వభావుండగు వాని తమ్ముం డక్కడనే యున్నందున మనస్సు స్వాధీనములో నుంచుకొమ్మని సోదరునకు హితోపదేశముచేసి వాని సంరంభమును మాన్పెను. అనంతరము దండ్రి కుమారునితోం సంభాషింపం దలంప నానకు పిన తండ్రి లోకవృత్త మెఱింగినవాండయినందునం గాళుండుమాటలాడ మొదలుపెట్టు నేని వాని వాక్పారుష్యమువలనం దండ్రికొడుకుల కదివఱకే గలిగిన వియోగము మఱింత యధికమగునని వానిని మాటలాడ నీయక తానే ముందు ప్రసంగమునకు దొరకొనెను.

అన్నకొడుకును బినతండ్రి పలుకరించి ముందుగా స్వగృహమునకు రమ్మని నానకును బిలిచెను. నానకు వానికిట్లు ప్రత్యుత్తర మిచ్చెను: "అయ్యా! నాయిల్లు వేఱుగనున్నది. మీాయిల్లునాయిల్లు గాదు. అన్ని యిండ్లతో సంబంధము వదలుకొంటిని." కొడుకిచ్చిన యీా యుత్తరము చెవిని బడినతోడనే త్రిప్తాదేవి, పుత్రిస్నేహ మితరాలోచనలను జయింప మనసు పట్టలేక వలవల యేడ్చుచుఁ గుమారుని పాదములపైఁ బడెను. మాతృవిధేయుఁడగు నాగురువు తల్లిని పరమ భక్తితో పాదములపైనుండి లేవనెత్తి వినయమున నిట్లనియె. "అమ్మా! క్షమయేనాకుఁ దల్లి. సంతుష్టియే నా తండ్రి. మనోజయకారణ మయిన సత్యమే నా పినతండ్రి."

ఆ యుత్తరము మిక్కిలి ప్రశంసనీయ మైనదిగదా? గురు నానకు తన యెట్టయెదుట నున్న బంధువులు బంధువులుగారని విస్పష్టముగఁ జెప్పి దీనబంధువుఁడగు భగవంతుఁడే తనబంధువుఁ డనియు వాని సన్నిధానమునకుఁ గొనిపోవందగిన సత్యాది సద్గుణములే తన మిత్రములనియుఁ దెలియఁజేసెను. అప్పు డాతని పలుకులు వినినవా రందఱు వాని నిశ్చలభావమునకు సంతసించి యతఁడు గృహస్థాశ్రమమును సంపూర్ణముగ విడిచినాఁడనియు జితేంద్రియుఁడై యాశల జయించి సంసార సంబంధముఁ దెంపినాఁడనియు వాని చరిత్రము ముందుముందు సుజనవందితమై యుండుననియు నమ్మిరి. కష్టతరమైన మాతాపితృ సందర్శన మీావిధమునఁ బరిణమించినందుకు తనకు మనోధైర్యము వీడకుండఁ దాను బయటఁబడినందుకు నానకు మిక్కిలి సంతసించెను.

"మాతృదేవోభవ, పితృదేవోభవ" యని వేదములు పలుకుచున్నవిగదా. సమస్త మతములు తలిదండ్రులసేవ యుత్తమోత్తమమని యంగీకరించు చున్నవిగదా! అట్టియెడ తలిదండ్రులకు విధే

 

యుం డైన నానకు తన యకాల సన్యాసమువల్ల వారికిరువురకు నధిక మనో వేదన నేల గలిగింపవలయు? తల్లిదండ్రుల దుఃఖపెట్టిన యతఁడు గురువగునా యని కొందఱడుగవచ్చును. స్వలాభము నెంచుకొని తల్లిదండ్రులను విడుచువాఁడు దూష్యుఁడగును గాని లోకాను గ్రహార్థము గృహమును దారపుత్రులను మాతాపితలను స్వలాభమును స్వసౌఖ్యమును బరిత్యజించి యేకాకియై సుజనులు చుట్టములుగ జ్ఞానులు సహకారులుగ శిష్యులు బిడ్డలుగ లోకమే యిల్లుగ భగవంతుఁడు తండ్రిగ భావించి పాపుల నభ్యుద్ధరింపఁ బాటుపడి మేనులు ధారవోయునట్టి మహాత్ములు తలిదండ్రులకు మనోవేదన గలిగించినంత మాత్రమున దూష్యులుగారు. ఈ తండ్రి దుఃఖించినను బైనున్న యా తండ్రి వాని గుణములకు సంతసించును. ఈ పుత్రులు తగు జీవనాధారము లేక స్వల్పకాల మిడుమలు బడినను శిష్యపుత్రులు వేనవేలు సద్గతులు గలిగి సుఖింతురు. బుద్ధదేవుఁడు తలిదండ్రులమాట సరకు సేయక సన్యసించె. శంకరాచార్యుఁడు తల్లికనిష్టమైనను వివాహపూర్వమందె నాలవయాశ్రమము స్వీకరించెను. రామానుజాచార్యుఁడు కాఁపురమునకు వచ్చిన భార్యను విడనాడి భగవత్సేవకై త్రిదండ సన్యాసియయ్యెను. బసవేశ్వరుఁ డుపనయనమే చేసికొనననని గురులమాట ధిక్కరించెను. పురాణములలో నిట్టియుదాహరణము లనేకములుగలవు. శుకుఁడు బాల్యముననే సన్యసించి తండ్రియగు వేదవ్యాసునకు మిక్కిలి మనఃఖేదము గావించెను. ప్రపంచారంభము నుండియు లోకోపకారులై మహాత్ములు గురువచనంబుల నతిక్రమించియే లోకబంధువులైరి. మాతాపితల శాసనము లతిక్రమింపఁగూడదనిన వారు గృహమునందుండిన మానవలోకము గతియేమి కావలసియుండును?

అట్లు నానకు తల్లియొక్కయుఁ బినతండ్రియొక్కయు

మాటల నిరాకరింప బిన తండ్రి కాలునితో నాలోచించి రాయ బులారుమాటమీఁదఁ దమకుమారునకు గౌరవము గలదని యెఱింగి యతనిచేత బుద్ధి చెప్పించుకొనవచ్చుననుకొని వానియింట బసచేయుమని నానకును వేఁడుకొనెను. నానకు రాయబులారు నిమిత్తమే యక్కడికి వచ్చినందున వానియింటికిఁ బోవుట కేయాటంకముఁ జెప్పక కదలిపోయెను. పోయి యామహాత్ముఁడు వార్ధకముచేతఁ గదల లేకయున్న రాయబులారునుగాంచి వానిపాదములను దనహస్తముతో స్పృశించెను. ఆశతవృద్ధు మలినములగు తన పాదములను బవిత్రుఁడగు గురువు స్పృశించినందుకు నొచ్చుకొని లేవలేక కూర్చుండియే నతనిశిరస్సు మహానీయుఁడగు నానకు నడుగులం జేర్చెను. గురువు వృద్ధని శిరస్సు సగౌరవముగా నెత్తి సేమమడిగెను. ప్రియభాషణంబులతో నిరువురుఁ గొంతసేపు గడపిన పిదప నానకుబంధువులు వంటబ్రాహ్మణుని నొక్కనిఁ గుదిర్చి నానకునిమిత్తము వంట జేయించిరి. కాళుఁడుఁ ద్రిప్తాదేవి యాదిన మంతయు రాయబులారు గృహమం దే పడియుండిరి. వారు తనయింటియొద్ద భృత్యులవలె నేలపడియుండిరో యాకారణము రాయబులారు చక్కగా నెఱిఁగి తానె ముందుగ నామాట కదపక వారినోటనుండియే వారికోరికలు జెప్పింప దలఁచి ప్రసంగింపఁ జొచ్చెను. ఆతఁడు సంభాషణమారంభించి నాలుగు పలుకులు పలికినతోడనే ద్రిప్తాదేవి కన్నుల నీరుపెట్టుకొని తద్దయు దుఃఖితయై రాయబులారు హృదయము కరగి పోవునట్లు వగచుచు వానినిట్లు ప్రార్థించెను. "ఈకష్టకాలమందు మీరుతప్ప మాకు సాయము చేసి మమ్ముఁ దేల్చువారెవరు లేరు. నాయనా! నీయావచ్ఛక్తి వినియోగించి నాబిడ్డతో నెట్లు చెప్పవలయునో యట్లు చెప్పి వాఁడీయూరునుండి పోకుండునట్లుచేసి పుత్రభిక్షము పెట్టుము. నీకెంతో బుణ్యముండును." రాయబులారు త్రిప్తాదేవి మాటలచేతఁ బరవశుఁడై నానకునుజూ

చి నీతల్లియభీష్టమెట్లయిన నెరవేర్పఁగలవాయని యడిగెను.అడిగియం తట నూరకుండక రాయబులారు వెండియు నిట్లనియె. "నాకువిస్తార ము సేద్యము జేయఁదగిన భూమిగలదు. అందుకొంత నీకుచితముగ నిచ్చెద. నీవు శిస్తునీయ నక్కఱలేదు. కావలసిన పాలేళ్ళను బంపెదను. నీవేమియు శ్రమపడనక్కఱలేదు. అది సేద్యము చేయించుచు నిచ్చట నుండఁగలవా."

అతనిమాటలకు గురువిట్లు బదులుచెప్పెను. "అయ్యా! భగవ న్నామ స్మరణమే విత్తనమగుఁగాక! సంతుష్టియే నాగలియగుఁగాక! వినయమే కలుపుతీత యగుఁగాక! ఇట్లుకృషిచేసిన నీభక్తివిశేషముచే తను దైవానుగ్రహముచేతను మంచిపంట పండఁగలదు. నీయిల్లు ని త్యకళ్యాణసదనమై వర్ధిల్లఁగలదు" అప్పలుకులువిని దాపుననున్న పిన తండ్రి నానకుతో మెల్లగనిట్లనియె. "నీవు వ్యవసాయము వంటికష్టపు బ ని జేయలేని యెడల మంచియంగడి నొకదానిం బెట్టి సుఖముగఁగూ ర్చుండి పనిచేయుచుండుము." అనవుడు గురువు పినతండ్రికిట్లనియె. "ఇఁకనాలస్యము చేయక నీజీవితకాలమునే యంగడిచేసికొనుము. భగ వన్నామమె యాయంగడిలో నమ్మెడు సరకుగా నేర్పఱచుకొనుము. ధ్యానమే యాసరకును సంపాదించుసాధనముగా నుంచుకొనుము. ఈశ్వరనామవ్యాపారము చేయువర్తకులతోనే బేరసారములఁ జేయు చుఁ గాలము గడపుము. ఇంతకన్న వేఱు వర్తకము చేయకుము" అ ట్లు పలికిన కొడుకుమాటలు విని పినతండ్రి వెండియు నిట్లనియె. "నీ కంగడి పెట్టుట కిష్టములేని పక్షమున విదేశములు జూడ నభిలాషగ లిగినపక్షమున గుఱ్ఱములవర్తకము జేయుము. అదికారణముగానీవె న్నోఁదూరపుపట్టణములఁ జూడఁగలవు" నానకు దాని కిట్లు బదులుచె ప్పెను. "నీవు శాస్త్రములను వినెడు వ్యాపారమునుండి సత్యమను గు ఱ్ఱములను దూరదేశములకు దీసికొనిపోయి యమ్ముము. నీదారిబత్తె

ముగ సత్కార్యములు సౌజన్యత గొనిపొమ్ము. ఆవ్యాపారమువల్ల నీ కుఁగలుగు లాభమేమన నీవక్షయలోకమున కఱిగి నిరాకారుఁడగు నీశ్వరు సాన్నిధ్యమును జేరి మోక్షసుఖము ననుభవింపఁగలవు" జ్ఞానియగు కుమారుఁ డన్నివిధముల నిహలోక వ్యాపారమురోసి బ్రహ్మజ్ఞానబోధకములగు పలుకులు పలుకుచుండఁ బినతండ్రి వానినెంతమాత్రము గ్రహింపలేక సిగ్గులేక మరలనిట్లనియె. "పోనీ! నీకుగుఱ్ఱపువర్తక మిష్టములేదేని సర్కారువారియొద్ద నుద్యోగములోఁ జేరుము.' ఈమాటకు గురువునోటినుండి యీక్రిందియుత్తరము వచ్చెను. "నీవు మనసార భగవంతుఁడను సర్కారును గొలువుము. నీయాత్మ భగవన్నామము మీఁది భక్తిని వృద్ధి పొందించునట్లు నడుచుకొనుము. నీయధికారమంతయు దోషములమీఁదఁ జూపి దానిని నశింపఁ జేయుము. అట్లుచేయుదువేని నీవుసిద్ధుఁడవగుదువు."

నానకునకుఁ బినతండ్రికి జరిగిన సంభాషణము విని రాయబులారు నానకుయొక్క మనస్సునకు నిష్టముగానుండునట్టి పని వానిచుట్టములు చెప్పలేదనుకొని తాను చేయబోవునుపదేశము తప్పక యంగీకరింపఁబడునని నమ్మి గురువుతో నీవిధమున బలికెను. "బీదవాండ్రకునీవొకసత్రము వేయుము. దానిపోషణకుఁ గావలసిన ధాన్యమంతయు బండఁదగిన మంచిభూమి మూఁడు నూతులుగలది నేను నీకిచ్చెదను. నీవు శిస్తుహూపకముగా నాకేమియునీయనక్కఱలేదు." ఇదిసత్కార్యమగుటచే సాధారణముగ నానకు మెత్తబడి దానికొప్పుకొనవలసిన దే. కాని యాతని మనోనిశ్చయము దృఢమైనదగుటచే నతఁడు పౌర్వాపర్యములు విచారించి దానికి సమ్మతింపలేదు. ఇదియే గాదు. ఎవ్వరెంతెంత మంచి యుపదేశములఁ జేసినను నానకుమనస్సున కవి యెక్కవయ్యె. అట్లుకొన్నిదినములు తాల్వొండిలోనుండి నానకు మెట్టకేలకాయూరువిడిచి పోఁదలఁచెను. ఏలయన నతఁడచ్చట నున్నందువలనఁ

పారమార్థిక చింతగల కొంతమందికే జ్ఞానోపదేశపూర్వకమగు నుపదేశము జరుగుచుండెనుగాని విశేషజనులకు వినోదముదీరుటతప్ప నెక్కువయుపయోగము లేకపోయెను. గ్రామమువిడిచి పోఁదలఁచినప్పుడువానిని మిత్రులుఁ జుట్టములుఁ దలిదండ్రులుఁ జుట్టుకొనిరి. తల్లిదండ్రులు సన్న్యాసాశ్రమమును విడువుమని చాలబ్రతిమాలిరి. రాయబులారు సయితము తలిదండ్రుల పక్షముఁబూని వ్యాపారమేమియుం జేయనక్కఱలేదనియు నూరక స్వగ్రామమున నుండినంజాలుఁ గావున దానికైన నియ్యకొనఁదగుననియు నానకును వేఁడుకొనెను. అందులకు నానకు తద్విషయమునఁ దనయిష్టము చెల్లదనియుఁ దనయిష్టమే చెల్లినపక్షమున జననీజనకులను మెప్పించుటకంటె మఱియొక కార్యము తనకు లేదనియుఁ దనయిష్టముకంటె సతీతమైన పరమాత్మునియిష్టమెట్లో యట్లు జరుగవలసినదనియు బదులుచెప్పెను.

అట్లు చెప్పి బలమర్దనులు వెంబడింప గురువు పరియాణోన్ముఖుఁడై యున్నపుడు రాయబులారు వానిసమీపమునకుఁ బోయితనకొక ధర్మకార్యము జేయ నిష్టముగలదనియు నెయ్యది యుత్తమోత్తమ కార్యమగునో గురువునోటినుండి విన వేడుక గలదనియుఁ జెప్పెను. పరోపకారము చేయఁదలఁచిన సత్పురుషునకు నిరుత్సాహము జేయుట భావ్యముగాదని గురువు వాని మంచితలంపునకు సంతసించి తాల్వెండి గ్రామములో మంచిచెఱువు లేనందున మంచినీళ్ళతటాకమొకటి త్రవ్వింపనగునని వానికుపదేశము చేసెను. నానకు స్వగ్రామము లోనున్నపుడచట చెఱువులేనందుకు మిగులవిచారించుచువచ్చెను. గ్రామస్థులు దానివలనఁ జాల నిడుమలు బడుచువచ్చిరి. రాయబులారుగురువు నిర్ణయించిన ధర్మకార్యము సర్వజనోపయోగమైనదని, శ్లాఘించి తగినతావు వెదకి చెఱువు త్వరలోఁ ద్రవ్వించి దానికి గురునానకు పేరుపెట్టెను.

---

## సప్తమాధ్యాయము.

ఇంతవఱకు నానకు దేశాటనమని చెప్పఁదగిన సంచారము చేయలేదు. అతఁడు తిరిగినయూళ్ళు రెండుమూఁడుమాత్రమేగలవు. అందు మొదటిది సుల్తానుపురము. రెండవది యమ్నాబాదుగ్రామము. ఈయూళ్ళకుఁ బోవునపుఁడు మార్గవశమున నతఁ డొకటి రెండుగ్రామములు చూచియుండవచ్చును. అతనిశరీరము వాని మనస్సువలెనే స్వేచ్ఛావిహారమం దాసక్తి గలదగుటఁ జేసి యతనికి దేశాటనమునందు మిక్కిలి యిష్టముండెను.

బలమర్దనులు వెంబడింప నట్లు తాల్వొండి గ్రామము విడిచి నానకుముందుగా యమ్నాబాదునకుఁ బోయెను. అచ్చట పూర్వశిష్యుఁడగు లల్లో వాని నాదరించి పదునైదు దినములు తనయింట నుంచుకొనెను. అటనుండి గురువు తత్సమీపమందున్న మఱియొక తావునకుఁబోయెను. ఆస్థలమున కిప్పుడు నానకుమఠ మని పేరు. ఆ కాలమం దచ్చట గాఢనియమములతో యోగాభ్యాసము జేయునట్టి సిద్ధులనేకులుండిరి. గురునానకు శిష్యసమేతుఁడై యాస్థలమునకుఁబోయి సిద్ధాశ్రమమున కెదురుగా నొకనారింజచెట్టుక్రిందఁ గూర్చుండెను. ఆకిచ్చిలిచె ట్టదివఱకు చాలకాలమునుండి శోషించి మోడుగానుండెనఁట. గురువు దానిక్రింద నాసీనుఁడైనతోడనే యావృక్షము పచ్చనియాకులు లేతచిగుళ్ళుగలిగి దర్శనీయమయ్యెనఁట. ఈవింత దూరమునుండి సిద్ధులు గనిపెట్టిరఁట. వారు తమకంటె నెక్కువయోగులు లేరని కడుగర్వితులై యుండువారఁట. తమకంటె నెక్కువమహిమలు గల మహాత్ములు వచ్చెనని తెలిసికొని యాసిద్ధులు నానకు చుట్టుం జేరిరి. జోగులు పదిమంది జేరినప్పుడు వేదాంతచర్చ తప్ప మఱియొకవిషయ మేది చర్చింపఁబడును? ఆసిద్ధులు తమకు దుస్సా

ధ్యములగు వేదాంతవిషయక ప్రశ్నముల నెన్నో గురువు నడిగిరి. గురువు దేనిలోను వారికిం దీసిపోవం డయ్యె. సిద్ధులడిగిన ప్రశ్నల కన్నిటికి గురువు ప్రవలీలగ మనస్సునకుం దక్షణమే నాటునట్లుగ ననుభవ సిద్ధమగునట్లుగాం బ్రత్యుత్తరములు చెప్పి యుండఅను సంతుష్టులం జేసెను. అంతట నాసిద్ధులు నానకు, తమకంటె నెక్కువసిద్ధుండని గ్రహించి వానిం గొనియాడి తమమతమునం జేరుమని ప్రార్థించిరి. నానకు దానికి సమ్మతింపక మనుష్యున కాత్మశుద్ధి సత్ప్రవర్తనము మొదలగునవి యుండవలయును. కాని పై వేషములవలన లాభములేదనియు వేషధారణముతోం బనిలేక యంతఃకరణశుద్ధికై పాటుపడవలయుననియు దానేమతమునందు నే తెగయందుం జేరుట లేదనియుం జెప్పెను. అట్లుపలికి నానకు వారి కాసమయమున గొన్ని నీతి వాక్యముల నుపదేశించెనంట. అవి భాషాంతరమునం దుండుటచే వాని తాత్పర్య మీక్రిందం బొందుపఱచుచున్నాండ. "కాషాయాంబరము, దండము ధరించుటలోను మేనెల్ల బూడిద పూసికొనుటలోను యోగము లేదు. శిరస్సు ముండనము చేయించుకొనుటలోను శంఖము లూదుటలోను యోగము లేదు. లౌకికాకర్షణములచేతం జుట్టబడియు మనుష్యుం డాయాకర్షణములకు లోబడక వాని కతీతుండై యుండుటలో నిజమైన యోగమున్నది. వట్టి మాటలవల్ల నిజమైన యోగము రాదు. ఈశ్వరుని సర్వవ్యాపకత్వ మెవ్వండు తెలిసికొనునో యతండే యోగి. యోగము మనస్సులోనే కాని దానికి వెలుపల లేదు. యోగము గోరీదిబ్బలలో లేదు. యోగము శ్మశానములలో లేదు. ఈశ్వరైక్యము జెందుచున్నామని దొంగమూర్ఛలు బడుటలో లేదు. నానా దేశములకరిగి తీర్థములందు మునుంగుటలో లేదు. లౌకికాకర్షణములకు లోంబడక వాని కతీతుండయి యుండుటలోనే యోగము కలదు. మన యాదిగురువగు పరమేశ్వరుని దెలిసికొం

టిమా సర్వసంశయములు నివారణమగు. అంతట ముక్తి కరతలామలకమగును. భగవద్విషయమును దెలిసికొనఁగోరువాఁడు ముందుగా మనశ్శాంతి సంపాదింపవలయును. మనస్సు తన యిష్టమువచ్చినట్లు దిరుగుటమాని నిశ్చలమైనప్పుడు పరంజ్యోతి తనలోనే వెలుఁగుచుండును. తనలో నీశ్వర తేజము ప్రకాశించుచున్నట్లు తెలిసికొనుటయే యోగము."

అనంతరము నానకు సిద్ధమఠము విడిచి గంగానది ప్రవహించెడు భూములలో సంచారము చేయఁదలఁచి పయనమయ్యెను. ఈయాత్రాచరిత్రలు సత్యమునకు దూరములై యద్భుతములతో మహిమలతో నిండిన కల్పనాకథలై యున్నవి. నిజమైన చరిత్రము నిమిత్తము నానకునుగూర్చి వ్రాయఁబడిన ప్రాచీనగ్రంథములను మనమెంతవెదకినను నూటికొకచోట నెక్కడనో యొక సత్యమైన వృత్తాంతముండును గాని తక్కినదంతయు బృహత్కథలోనున్న కథలకన్న నెక్కుడు చిత్రకల్పనలతో నిండియుండును.

ఆచరిత్ర లట్లుండుటకు మూఁడు ముఖ్యకారణములు గలవు. అందు మొదటిది. ఆచరిత్రలు వ్రాసినవారు భూగోళశాస్త్రమేమో యెఱుఁగరు. వారు జన్మమధ్యమున స్వదేశమగు పంజాబు నప్పుడప్పుడు చూచియుందురు. కాని గంగానది ప్రవహించెడి దేశములనుగాని యచ్చట నివసించు జనులనుగాని వారెన్నఁడు జూచియెఱుఁగరు. ఏస్థలములఁజూడక స్థిమితముగా నిండ్లయొద్ద గూర్చుండి విన్నకథల నాధారములు చేసికొని చరిత్రలు వ్రాయు గ్రంథకర్త లంతకంటె నెక్కువగ నేమివ్రాయఁగలరు? రెండవకారణ మిది. ఆచరిత్రలీయాత్రలు జరిగిన ముప్పదియేండ్ల తరువాత వ్రాయఁబడినవి. ఆవ్రాతలు గూడ నానకుయొక్క ప్రియభక్తుఁడగు బలుఁడే చెప్పి వ్రాయించుటచేత బయలుదేరినవి. బలుఁడు గురువుతోఁగూడ దిరిగినను విద్యాగంధ

శూన్యుఁ డగుటచేతను మూఢవిశ్వాసముగలవాఁ డగుటచేతను గ్రంథకర్తలకు గురువృత్తాంతమును చెప్పునప్పుడు నిజమగు వృత్తాంతములను సరిగఁ జెప్పలేక తన పిచ్చినమ్మకముల నందుఁ జొనుపుచుఁ జాలకాలము గడచిన పిదప చెప్పుటచే సరిగా జ్ఞాపకములేక తన మందమతికి స్ఫురించిన వన్నియుం దెలుపుచు గురుచరిత్రమందలి యీ భాగమును సంశయాస్పదముగఁ జేసెను. మూఁడవకారణ మిది. గురుచరిత్రము వ్రాయునప్పటికి గురువుమృతుఁడయ్యెను. అతనికీర్తి యార్యావర్తమం దంతట వ్యాపించె. ఎన్నో మహిమలు వాని కారోపింపఁబడెను. ఎన్నో యద్భుతములు వానింగూర్చి చెప్పుకొనఁబడెను. చరిత్రకారులు వానిమహిమలు వినినవారే గావున తాము వినినవి చుట్టుప్రక్కలజనులు చెప్పుకొనునవి యగు నలోకసామాన్య చర్యలతోఁ బుస్తకముల నింపిరి. ఆగ్రంథములలోనున్న విశ్వాసపాత్రములుకాని యంశములు విడిచి వాని యాత్రలు కొన్ని వర్ణింతము.

ఆతండు గంగాతీరమునం బయనముసేసి వంగదేశమునకు వచ్చెను. అచ్చటఁగొంతకాలముండి పిదప నతఁ డాసామునకుఁబోయి యచ్చట ననేకమాసములుండెను. ఈపయనములతో మర్దనుఁడు మిక్కిలిడస్సి తన గురువువలె భక్తితత్పరుఁడై మార్గాయాసము మఱచుటకుఁగానిజలునివలె వైరాగ్యముగలిగి శ్రమకోర్చుటకుగానిసమర్థుఁడు గాకపోయెను. అస్సాముదేశమున సంచరించుచుండ నానకు షేకుఫరీదను మహమ్మదీయ యోగియొక్క వంశస్థుఁడైన యొక తురకను గలుసుకొనెను. వారిరువురుఁ గొన్నినాళ్లు గలిసియుండి భగవద్విషయము లనేకములు చర్చించిరి. వారెడబాయునప్పుడు మతద్వేషములు లేక యొండొరులం గౌఁగిలించుకొని విషాదముతో వేఱైరి. ఆసామునుండి గురు వోఢ్రదేశమునకుఁ బోయి జగన్నాథ క్షేత్రము

ను దర్శించి యచటి యాలయమునం దర్చకులు పండాబ్రాహ్మ ణులు నిత్యకృత్యములలోఁ జేయు నకార్యములంజూచి యేవగించెను.

జగన్నాథక్షేత్రమునుండి నానకు దక్షిణదేశమునకుఁబోయి యందనేక దివ్యస్థలముల సందర్శించి యక్కడనుండి సింహళద్వీప మునకుం జనెను. ఈగురువు వెళ్ళునప్పటికి సింహళద్వీపమును శివనా థుఁడనురాజు పాలించుచుండెను. తనదేశమునకు ముప్వురు క్రొత్త మనుష్యులు వచ్చిరనియు నందు సామాన్యసన్యాసులకుఁబోలని యొ కవిరాగి గురువై యుండెననియు శివనాథరాజు విని వానిఁ జూడఁ గోరెను. కోరి యాతనిం జూడఁబోవుటకు ముందు వానిప్రజ్ఞ యెట్టి దియో జగద్వంచనము సేయవచ్చిన మాయయోగియో నిజమైన సన్యాసియో వానిమనోనిశ్చలత యెట్టిదో కనుఁగొనియనంతరమువాని దర్శనమునకుఁ బోవలయునని రాజునిశ్చయించుకొనిపంచభక్ష్యపరమా న్నములతోనిండిన యన్నములు, విలువగల చీనిచీనాంబరములను సా గసుకత్తియలగు పడుచుకన్నియలను యోగికిఁ గానుకగాఁ బంపెను. గురునానకు మొదటి రెండువస్తువులఁ జేతితోముట్టక కన్నియలం గ న్నెత్తిచూడక నిరాకరించుటయు నవి తోడ్కొనిపోయినవారు వచ్చి నదారినే భగ్నమనోరథులై పోయిరి. తనకావించిన పరీక్ష గురునందలి గౌరవముఁబెంప రాజు స్వయముగ నానకును సందర్శింపవచ్చి యం తటి మహాత్ముని రాకచేతఁ దనరాజ్యము ధన్యమైనదనికొనియాడెను. ఆమహారాజుచేసిన యాదరణమునకు సంతుష్టుఁడై కాఁబోలు నానకు సింహళద్వీపమున రెండుసంవత్సరముల యైదుమాసము లుండెను. ఆ దీవివెడలి లాతిభూములకు నానకు పయనమైనప్పుడు మర్దనుఁడు నిరం తరప్రయాణములచేత విసికి గురువునువిడిచి యథేచ్ఛం జనియెను. అట్లు మర్దనుఁడు గురువును బాసిపోయినను గొంతకాలము వాని నెడఁ బాసియుండునప్పటికి వానికేమియుం దోఁచక పిచ్చియెత్తినట్లుండు

టచే గురువు పిలువకపోయినను దనంతటఁ దానువచ్చి నానకును గలిసి కొనెను.

అనంతరము గురునానకు లోకానుభవజ్ఞానము సంపాదింపభరత ఖండమునకుఁ జుట్టుపరిక్కలనున్న యనేక మ్లేచ్ఛదేశములకుఁ బయన ముచేసెను. ఆయన చూచినట్లు జెప్పఁబడిన దేశములలో నొక్కదాని పేరైనియు నీనాటిభూగోళశాస్త్రజ్ఞు లెఱుంగరు. ఆదేశముల కాకాల మున నట్టి పేళ్లుండెనో లేక చరిత్రకారులు జగమునలేని దేశములనూ హించి గ్రంథములలో వ్రాసిరో మనము చెప్పఁజాలము. మనము నిశ్చయముగా నొక్కవిషయమునుమాత్రము చెప్పఁగలము. ఇస్లాము మతస్థాపకుఁడగు మహమ్మదువారి జన్మస్థలమైన యరేబియాదేశము నకు గురునానకు పోవుట నిర్వివాదాంశము. ఆదేశమునకు సముద్ర యానముచేసెనో మెట్టదారినిఁబోయెనో చెప్పఁజాలముకాని త్రోవలోఁ బారసీకపుదేశపు రేవుపట్టణమగు బుషాహరునగరము నాయన జూచె ను. మార్గవశమున నతఁడేయూరికిఁబోయిన నాయూర బ్రహ్మజ్ఞానము నం దాసక్తిగల మనుష్యులం జేర్చి వారికుపదేశముఁజేసి జ్ఞానబీజముల నచ్చట నాటి యవి పెరిగి ఫలించుననితోఁచినచోట్లఁ జిన్నసంఘము లేర్పఱచి ప్రతిసమితి నొక్క పెద్దనేర్పఱచి వానికి భాయియనుపేరుపెట్టి యతనియాజ్ఞకు వారు బద్ధులై యుండునట్లు శాసించి యటుపిమ్మటఁ బోవుచువచ్చెను. హిందూదేశమునకుఁ బడమటనున్న దేశములలో నేఁటికిని ధర్మశాలలుండుట కాద్యకారణమితఁడే. అట్లుసమాజములు స్థాపించుటలో గురునానకుయొక్క తలంపు క్రొత్తమతము స్థాపింప వలయుననికాదు. మిక్కిలి పురాతనమైన యార్యుల యుపనిషన్మత మును జగమునకుఁ జాటుటయే యాయన ముఖ్యసంకల్పము. తనచేత నుపదేశింపఁబడిన జ్ఞానవాక్యములయందు నమ్మికగల జనులు నిర్భయ ముగఁ దమధర్మముల ననుష్ఠించి యితరులకు మార్గప్రదర్శకులై యుం డవలయునని యాయన యెల్లచోటుల నొక్కి చెప్పుచువచ్చె.

అరేబియాప్రయాణములలో నానకు, వానిశిష్యులు నిర్బాధక ముగ నన్నిప్రదేశములుం జూచుటకుఁ దురకవేషములు వేసికొనిరి. నానకు సహజముగఁ గలహముల కిష్టపడని పరమసాధువౌటచే జగడములు రాకుండనుండుటకట్లు వేషము మార్చెనేకాని భయముచేతనెంత మాత్రముకాదు. ఏలయన నానకు మహమ్మదువారి జన్మప్రదేశమగు మెక్కాపట్టణమునకుఁబోయి,పుణ్యభూములు చూడఁదలంచియు మహమ్మదీయులకు విరుద్ధములగునాచారములనే గొన్నిఁటిని నెఱపుచువచ్చెను. మెక్కాలో మహమ్మదీయుల కొక్కమాలయముగలదు. కాబా యని దానికిం బేరు. ఆయూరికిఁ బోయిన మహమ్మదీయుఁ డెవ్వఁడు దన కాళ్లు కాబాయున్నవైపునకుఁజాపి పగలుకాని రాత్రికాని శయనింపఁడు. పండుకొన్నప్పుడు తలయే కాబావైపున నుండవలయు. నానకు తఱచు రాత్రులు పండుకొనునప్పుడు తనకాళ్లు కాబావైపునకుఁ జూపుచువచ్చె. తురకలకు భయపడినవాఁడట్లు చేయునా? ఆగుడి యధికారి యొకనాఁడు శాస్త్రవిరుద్ధముగా శయనించిన నానకునుజూచి దైవగృహమువైపు కాళ్ళుచాపుట యనాచారమని కఠినస్వరముతో మందలించెను. ఆతనికి గురు విట్లు ప్రత్యుత్తరమిచ్చె. "దేవునిగృహమేప్రక్కను మాత్రమేయుండి యేప్రక్కనులేదో నాకు దెలియదు. నీ వెఱుఁగుదువేని నాకాళ్ళు చేతఁబట్టుకొని దేవునిమందిరములేని ప్రక్కకు వాటిని ద్రిప్పుము." ఆలయాధికారి వాని పలుకులు విని మతము నైనను లెక్కసేయక నోట పరిహాసములుసేయు మొండివాఁడై యుండవచ్చునని భావించి వాదము ముదరనీయక యంతతో సరిపెట్టెను. మెక్కావెళ్ళిన మహమ్మదీయులు మహమ్మదువారు పరమపదము వేంచేసిన స్థానమగు మెదీనాకువెళ్ళి యాయనసమాధిఁ జూడకపోరు. నానకు మెక్కాలోఁజూడవలసిన వైచిత్ర్యములనెల్లఁజూచి సంతుష్టుఁడై, మెదీనాకుఁగూడ బోవఁదలంచుచుండ మర్దనుఁడు తనగురువు మెదీ

నాకు జనుఁడనుకొని యక్కడకుఁబోకతప్పదని పట్టుపట్టెను. అదివఱకే వెళ్లఁదలఁచిన గురువు శిష్యుని ప్రోద్బలముచేత వెంటనే బయలుదేరి పండ్రెండుదినములు పయనముచేసి మెదీనాపట్టణముఁజేరి మహమ్మదు సమాధింజూచి కొన్నిదినములచ్చట నుండెను. ఆదినములలో నతఁడు మెక్కాలోవలెనే యిక్కడను సమాధివైపుకాళ్లుచాఁపి శయనించుచు వచ్చెను. మెక్కాలోనున్న యాయజమానునికంటె మెదీనాలోనున్న సమాధియజమానుఁడు చండతరుఁడు, దురహంకారుఁడు. ఇందక్కడజ మేమున్నది! దేవుని దూషించినప్పుడుసయితము నోరెత్తక గురువుల పేరెత్తినతోడనే రాక్షసులవలె మీఁదఁబడి మనుష్యులను దూషించి వీలగునేనిఁ జేయిచేసికొను పరమభాగవతులు ప్రతిమతమున వేనవేలు గలరు. మెక్కామెదీనాపట్టణములకుఁబోయి యాపుణ్యభూములఁజూచిన పిదప మహమ్మదువారినిఁగూర్చి నానకున కెట్టియభిప్రాయముకలిగె నోశిష్యుఁడగుబలునియీక్రిందివాక్యములవలన స్పష్టమగును. ఈమాటలు బలునినోటనుండివచ్చినను గురునియభిప్రాయము లేయగుట నిజము.

మహమ్మదువారినిగూర్చి గురునియభిప్రాయములను బలుఁడీ క్రిందివిధమునఁ దెలిపెను. "మహమ్మదువారిస్వభావమున మహాత్ముల కుండవలసినంతశాంతము కానఁబడక కోపముపాలెయెక్కువ గానఁబడు చున్నది. పునర్జన్మరాహిత్యమగునంతటి వైరాగ్యముగూడ నాయన యొద్ద నున్నట్లు గానఁబడదు. స్వలాభపరాయణత యక్కడక్కడఁ గానఁబడుచున్నది. ఆయన పరిశుద్ధుఁడు నిష్కళంకచరిత్రుఁడు ననుట కెంతమాత్రము సందియము లేదుగాని సంపూర్ణమైన పవిత్రత సంపాదించుటకు జన్మపరంపరనుండి విమోచనమొందుటకు నీమహాత్ముఁడు మరలజన్మము నొందవలయు. ఆజన్మము హిందూస్థానమున నొక శూద్రునియింటఁ గావలయు. ఆయన జీవన్ముక్తుఁడై యొకానొకకాలమునఁ బరలోకారోహణముచేసి యీశ్వరసందర్శనము చేసెననిచెప్పెడి

మాటలు కేవలముకల్పితములు. ఏలయన నీప్రపంచమున సృష్టింపఁ బడినజంతువులె నేత్రగోచరము లగునుగాని సృష్టింపఁబడనివి కంటి కగపడవు. భగవంతుఁడు సృష్టిపదార్థములలో నివాఁడు కాఁడు. కావున నతఁడు మానవదృగ్గోచరుఁడగుట యసంభవము. కానిజీవాత్మచర్మో పాధినిబాసి పరిశుద్ధావస్థఁజెందినప్పుడు పరమేశ్వరసాన్నిధ్యముఁ బడ యుటకుఁ బాత్రమగును. పవిత్రమైన ఖురానుగ్రంథముభగవద్వాక్య ము కాదు. కారణ మేమన, భగవంతున కొకభాష లేదు.

అట్లుకొన్ని దినములు మదీనానగరముననుండి యచ్చటివిశేష ములు దర్శించుచుండఁ బ్రియసోదరింజూడ నతనికి బుద్ధిపుట్టెను. ఈ చెలియలిమీఁద నాయనకు మొదటినుండియు నింతింత యనరానిప్రే ముడి యుండెను. ఏలయన నీతోబుట్టువే చిన్ననాఁ డతని కెన్నిసా రులో శరణం బిచ్చెను. తండ్రి కఠినుఁడై యతనిపైఁ బిట్టలుక పూని నప్పుడు కాపాడెను. తనసోదరుఁడు మిక్కిలినీతిమంతుఁడనియు సత్య ప్రియుఁడనియు నిక్కడక్కడ యనక యవకాశము వచ్చినచోటనెల్ల వాదించుచు వచ్చెను. లౌకికవ్యవహారవిముఖుఁడై పరమేశ్వరధ్యాన పరాయణుఁడై సోదరుఁడు మందమతియై యున్నపుడు తనభ ర్తసయుతము పిచ్చివాఁ డని యెగతాళి సేయుచుండ నామె య తఁడు పరమభాగవతోత్తముఁ డని కనిపెట్టి గౌరవించెను. ఆకోరిక పొడమినతోడనే గురువు శిష్యసమేతుఁడై మదీనానగరమును విడిచి కొన్ని మాసములు నిరంతరప్రయాణములు గావించి పారసీకగాంధారాదిదేశము లతిక్రమించి పాంచాలదేశము ప్రవేశించి యెట్టకేలకు సుల్తానుపురముజొచ్చి చెలియలిగృహము జేరెను. అన్నయుం జెలియలు పరస్పరసందర్శనజనితానందమునఁ బర వశత్వము నొంది గాఢాలింగనము జేసికొనిరి. కొంతకాల మతఁడు సోదరీగృహంబున వసియించి పుణ్యభూములలో నగ్రగణ్యమైన

హిమాలయపర్వతముఁ జూడఁదలంచెను. తలపుపుట్టఁగానె యతఁడు బయలు దేఱెను.

హిమాలయము హిందూస్థానమునకు త్తరమున భగవంతుఁడు నిర్మించినస్ఫటికపుగోడయో యనునట్లు భారతఖండలక్ష్మిశిరోభాగంబునఁ దాల్చినవజ్రింపుమకుటమో యనునట్లు విరాజిల్లుచుండును. ఇది యనేకపుణ్యక్షేత్రములకు నిలయము. నరనారాయణులకు నివాసమైన బదరికాశ్రమ మిందేయున్నది. సిద్ధసాధ్యగంధర్వఖేచరాదుల కిది విహారస్థాన మనియు నుమామహేశ్వరుల కునికిప ట్టనియు బ్రహ్మాదిసురగణంబునకు సిద్ధమునివర్గమునకు నీమహీధరకూటములు యజ్ఞవాటము లనియుఁ గుమారస్వామికి జన్మభూమి యనియు భగీరథప్రయత్నమున నాకాశంబుననుండి మహీతలంబునకు దిగిన గంగాదేవికి వసతిస్థలం బనియు నెల్లయోషధులకునిలయం బనియుఁ బురాణములలో వర్ణింపఁబడినది. మఱియుఁ బరమభాగవతోత్తము లగు మహామహులు పరమతస్థులు తమ్ముబాధించినప్పుడు నిలువ నీడలేక తలదాఁచుకొనుటకుఁ జోటులేక మెట్టకేలకు దుర్గమమగు నీపర్వతరాజము శరణువేఁడి గుహాంతరములు నివాసములుగఁ జేసికొని సుఖించుచు వచ్చిరి. ఇట్టియీ మహాశైలముయొక్క నపారమహిమము పురాణములవలననే గాక చూచినతైర్థికులవలనఁగూడ విని దేశాటనపరాయణుఁ డగునానకు శ్రవణంబుల వినినదంతయు నేత్రంబులతోఁ జూచి యానందింపఁ దలఁచుట యాశ్చర్యముకాదు.

అతఁ డాపర్వతమున కరిగి యొకక్షేత్రమునుండి యొకక్షేత్రమున కరుగుచుఁ గంటి కగపడినబ్రహ్మవాదులతోడ వేదాంతచర్చలు సేయుచుఁ దనపరిభావమెఱుఁగక తన్ను నిందించినవారిచేత నానావమానంబులం బడుచు భూషణంబులకు సంతసింపక దూషణంబులకు దురపిల్లక తనపనిచేసుకొనుచుండెను. మొట్టమొదట నతని యాస్తిక

ధానము కర్మకాండనిరసనము జూచి యాయామతస్థులు వానిని దమ తమమతంబులం జేరు మనిపిలిచి యతఁ డందు జేరక యామత ముల ఖండింప వారతనియెడల గౌరవము జూపకపోయిరి. కాని కాలక్రమమున నతని విశేషవినయంబును సాటిలేని సత్ప్రవర్తనము నుపాయములేని భక్తియు సూనృతవ్రతాసక్తియుఁ గనుఁగొన్నపిదప నతఁ డసాధారణపురుషుఁ డనియు సర్వవిధముల మాననీయుఁ డని యుఁ దెలిసికొని యథార్థ్వ గౌరవము గావించిరి. తొలుదొల్త నతని ని విశ్వసింపక యనుమానముతోఁ జూచినవారు వానిసద్గుణసంపద యాలస్యముగఁ గనిపెట్టి యతఁడు తమ్ము విడిచిపోవునప్పుడు మఱి కొంతకాల మతనిసహవాససౌఖ్యము గలుగకపోయెఁగదా యనివిచా రించిరి. హిమాలయమునఁ దిరుగుకాలమున శిష్యుఁడగుమర్దనునిశరీర స్థితి చెడెను. నానకుయొక్క శరీరము శీతోష్ణములకు జంకునదికాదు. రెండవశిష్యుఁ డగుబలుని శరీరము నంతగా గాసిజెందలేదు. కాని మితిమీఱినయాచలియు నెడతెంపు లేనియావానలు నెల్లపుడు మం చుమీఁదిపయనములు సరిగ నాహారము లభింపమిఁ బ్రయాణకష్ట ములు మొదలగునవి సుకుమారుఁడైన యాగాయకుని యారోగ్య మునకు భంగము గలిగించెను. నానాటి కతనిస్థితి బాగుపడుటకు మారు క్షీణించుటంజేసి గురువు యాత్రకట్టిపెట్టి పంజాబు దేశమునకుఁ బోవ నిశ్చయించెను. కాని యామండలముచేరుటకైన నవకాశము లేకయే మర్దనునిస్థితి పూర్తిగఁ జెడిపోయెను. కొన్నిదినములుమాత్ర మే యతఁడు జీవింపఁగలుగునని గురువునకుఁదోఁచెను. అందుచేత వా రతనిని దీర్ఘప్రయాణము సేయింపక దాపున నున్నయొకపల్లెకుఁ దీసి కొనిపోయి చేతనైనచికిత్స చేయించి స్వహస్తములతోఁ జేయఁదగినం తయుపచారము జేసెను. బలుఁడును దనచెలికానికి శక్యమైనపరిచ ర్య గావించెను. ఆయుశ్శేషము లేనప్పుడు వైద్యములు నుపచార

ములు నిష్ప్రయోజనములుగదా. మర్దనుఁ డట్టకేలకు మృతినొం దెను. మర్దనుఁడు తనమరణానంతరమునఁ దనదేహము దగ్ధముసేయ వలసినదే కాని ఖననము చేయఁగూడదని గురువుతో మనవిజేసికొనె ను. శిష్యుని యిచ్ఛాప్రకారమె గురువు కళేబరమును ఖననముసే యక నగ్నిపాలు చేయుటకే కృతనిశ్చయుఁడై తద్విషయప్రయత్న ములు చేసెను. ఆమువ్వుర కప్పుడుగలసొత్తు మూడుశాటులు. ఆశా టీత్రియమును నానకు శిష్యునికళేబరముఁ జుట్టఁబెట్టి స్వహస్తనిర్మిత మైన చితిమీఁద శవమును బలుఁడుం దానును బెట్టిరి. అగ్నిసంస్కా రము బలునిచేతఁ జేయింపక శిష్యవత్సలుఁ డాకట్టకడపటికర్మముగూ డఁ దనచేతులతోనే చేసెను. శిష్యునకుఁ జుట్టము లెవ్వరులేమి యత నియుత్తరక్రియలు చేయుట ధర్మమని గురువు స్వయముగానె పార లౌకికక్రియలు చేసెను. నిజమైనప్రేమ యెక్కువతక్కువస్థితులుగాని వర్ణభేదముగాని పాటింపనీయదుగదా. "ఉదారచిత్తానాం వసుధయే వకుటుంబః" యనునట్లు మహానుభావులకు లోకమే కుటుంబము. మర్దనుఁడు గురువుతోఁ జిరసహవాసము జేయుటంజేసి మౌఢ్యము బాసి జ్ఞాన మించుకయైన సంపాదించెనాయని కొందఱు సంశయము పడవచ్చును. అట్లు సందియముపడుటకు వలనుపడదు. ఏలయన మం చిపూలు గ్రుచ్చినదారముసైతము సువాసన గలిగియుండును. అట్లె బ్రహ్మజ్ఞానసంపన్నుఁడైననానకువంటి మహానుభావునితోఁ జిరకాల ము కలసిమెలసియుండి యతఁడు సేయు వేదాంతచర్చలు పలుమా ఱు వినివిని యున్నమర్దనునకు జ్ఞానమంటదనుట యసంభవము. మొ ట్టమొదట మర్దనుఁడు నానకునొద్ద శిష్యుఁడైనప్పుడు వాఁడు తనజాతి యందు మిక్కుటమైన యభిమానము గలిగి యాశాపాశబద్ధుఁడై స్వలాభపరాయణుఁడై నెల్లవారి నెగతాళిసేయుస్వభావము గలవాఁ డై చీటికిమాటికి సణుగుకొనుచు లోకవ్యవహారములయందె యాస

క్తి గలిగియుండెను. కాని కాలము గడచినకొలఁది గురువుయొక్క సదాచారసంపత్తి యీశ్వరభక్తి లోకోద్ధరణానక్తి కన్నులారఁ జూచినకొలఁది నతనిధనకాంక్ష స్వలాభపరాయణత మొదలగు సామాన్యమానవలక్షణము లడుగంటెను. భక్తిజ్ఞానవైరాగ్యములు వాని స్థానము నాక్రమించెను. అవి హృదయమున నెలకొనుటయు నతఁడు నిరర్థకసంభాషణములతోఁ గాలక్షేపము సేయక సణుగులుగొణుగులు మాని పరాక్షేపణలు గట్టిపెట్టి జ్ఞానమార్గమున బడి బ్రహ్మానుసంధానపరాయణుఁ డయ్యెను. ఆతనియందుఁ గలిగినమార్పులు గనిపెట్టి సంతసించి యజ్ఞానకవచమును విడిచి జ్ఞానకవచమును దొడిగికొని తన శిష్యుఁడు దేహయాత్ర చాలించినందుకు సంతసించెను.

మర్దనునిమరణము నానకుయొక్క సంకల్పమునకు మార్పుకలిగించెను. పంజాబు దేశమునకుఁ బోవలయునని యంతకుముం దతఁడాలోచించెను. కాని ప్రియశిష్యుఁడైనబలుఁడు సేతుబంధరామేశ్వరయాత్ర చేయవలయునని కుతూహలపడినందున నతనిమనోరథసిద్ధి గావించుటకై యతఁడు దక్షిణాపథంబున కరుగ సంకల్పించెను. ఈ ప్రయాణమున నానకున కనేకులతో వేదాంతచర్చలు జరిగెను. ఆ చర్చలు వివాదహేతువులు గాక యతనికి సంతోషప్రదములై రెండవపక్షమువారికి జ్ఞానసంధాయకములై యుండెను. రామేశ్వరయాత్ర నుండి యతఁడు తిరిగివచ్చి కొందఱు సాధువులు గురుదాసుపురము జిల్లాలో నున్న బాటలె యనుపుణ్యక్షేత్రమునకుఁ బోవుచున్నారని విని యాసాధువులసహవాసము చేయుటకును తన జన్మభూమి నింకొకసారి సందర్శించుటకును నిశ్చయించి వారితోఁ గలిసి యచ్చోటి కరిగెను. బాటలేగ్రామవాసులకును నచ్చటచేరిన తీర్థవాసులకును సనాతనసిద్ధాంతములకు వ్యతిరేకమైన మతబోధ చేయుచున్ననానకుయొక్క రాక యసహ్య మయ్యెను. ఆ మహాత్మునియెడల వారెం

తద్వేషభావము బూనిరో యెంతకఠినముగ దూషించిరో యెంతయ వమానపఱచిరో మనము చెప్పఁజాలముకానియెందరెందరుసాధువులు తనతో వితండవాదములు చేసి వెఱపించినను వెఱవనిధీరుఁడు పలు పల్లియలయందుఁ బట్టణములయందు వసియించు పూర్వాచారపరాయణుల కోపానలజ్వాలలఁబాఱి బడసినిశ్చలుఁడు వేనవేలుజనులు వచ్చి పరిశ్నలవర్షము గురిపించివాదించి యోడిపోయి తుదకు నిందించినను మనోధైర్యము చెడనిపరమశాంతుఁడు బాటలేగ్రామము విడిచి వెడలవలసినవాఁడయ్యెను. "అతిపరిచయా దవజ్ఞః" యన్నట్లు పిన్ననాటనుండియుఁ దన్ను దనకుటుంబమును గృహపరిస్థితులను దనబాల్యవిచేష్టితములను నెఱిఁగిన కాకులవంటి లోకుల నడుమనున్నపుఁడు శాంతాంతఃకరణుఁడగు పరమతపోధనుఁ డైననువారివెక్కిరింపు లగ్గలమైనతఱితనశాంతము చిక్కబట్టజాలఁడు.

పంజాబుదేశము విడువకమున్న మృతినొందిన మర్దనుని స్థానమందుఁ దనకుమఱియొకశిష్యుఁడు సంప్రాప్తించునేమోయని వెదుకజొచ్చెను. ప్రియశిష్యుఁ డైనమర్దనున కొక్కకుమారుఁ డుండె నని యతని కప్పుడు జ్ఞప్తికి వచ్చెను. ఆబాలకుని పేరు సజ్జదుఁడు. ఆకుమారుఁ డెట్లైన శిష్యుఁడుగఁ బరిగ్రహించుటకు గురువును బలుఁడును గృతనిశ్చయు లై తమరాక గ్రామవాసుల కెవ్వరికిం దెలియకుండునట్లు రాత్రి ప్రొద్దుపోయిన తరువాత తాల్వెండిగ్రామమునకువెళ్లిరి. గురు వొకమాఱుమూలను గూర్చుండి సజ్జదునికడకు బలునిపంపెను. అతఁ డతిరహస్యముగఁ బోయి గురుసందేశ మెఱిఁగించినతోడనే సజ్జదుఁ డెంతకాలమునుండియొ ప్రయాణ మగుచున్నవాఁడ పోలె గడియమాలస్యమైనఁ జేయక వెంటనేమూటముల్లె గట్టుకొనివానితో బయలుదేరెను. అతనినిజూచి నానకు వానితండ్రియొక్క మరణవార్తను దెలిపెను. నానకుయొక్క తల్లియుఁ దండ్రియు గతించినా.

రని సజ్జదుఁ డాజ్ఞాపించెను. గురువుయొక్క పినతండ్రి మాత్రము బ్రతికి యుండెనని యు నిష్టమైనచో నతనిని జూడవచ్చు ననియు సజ్జదుఁడు విన్నవింప గతంనాస్తి మృతినొందిన వారికొఱకు విచారించిన గార్యము లేదు. జీవించియున్నవారిని జూడనక్కఱలే దని నానకు తన జన్మస్థానమున నొక్క రాత్రియైన సంపూర్ణముగఁగడుపక శిష్యసమేతుఁడై వెడలెను.

ఈసారి గాంధార నగరమున కరుగవలయునని వారి సంకల్పము. గాంధారపురమున వసియించుచు సుప్రసిద్ధులైన బాబావలీ యను మహానుభావుని సందర్శింపవలయు నని యతఁడు బయలుదేఱెను. ఈదారి పలుమాఱతనికాలిక్రింద నలిగిన దే యగుటచేత గ్రామములు బురములు బరిచితములు. ఆముప్పురును ముల్తాను మండలములోని తలంబాపట్టణము విడిచిన తరువాత గురువు బలునితోఁగూడి మెల్ల మెల్లగా వెనుకబోవుట కేర్పఱచుకొనిముందరియూరికి సజ్జదుని ముందుగాఁ బంపెను. సజ్జదుఁడు కొంత దూరము పోవునప్పటికి వాని కొకయూరు కనఁబడెను. అచ్చట హిందువుల దేవాలయము మహమ్మదీయుల మసీదు నొక్క స్థలమందె యొకదానికొకటి చేరియుండెను. ఆమతాధిపతి జనపనార పీచువలె మిక్కిలి తెల్లనై నాభీవివరపర్యంతము వ్యాపించిన గడ్డము గలిగి వృద్ధుఁ డని తెలియఁజేయుటకు మొగముమీఁద ముడుతలుగలిగి చూచినవారికి గౌరవభాజన మని తోఁచుచుండును. సజ్జనుఁడు గంభీరుఁడైన యాతని యాకారము చూచి భక్తితత్పరుఁడై యతని కభివాదము చేసి యతనితోఁ బ్రసంగించెను. ఆవృద్ధుఁడు కొంత సంభాషణము జరిగిన పిమ్మట వానిని భోజనశాలకుఁ దీసికొనిపోయి మధురాహారములతో విందు సేయుమని సేవకుల కానతిచ్చెను. సేవకులును కడుపార వానికి మెక్కబెట్టు వారుపోలె నత్యాదరమున వానిని లోనికిఁ దీసి

కొనిపోయి యోగిరముపెట్టుటకు మాఱు వాని కట్టినపుట్టము లొలుచుకొని తిండిపెట్టక కాలు సేతులు గట్టి మారుమూల గదిలోఁ బడవైచిరి. ఇదిజరిగిన కొంతసేపటికి గురుఁడు బలుసమేతుఁ డై యచ్చోటికిఁ బోయి సజ్జదుని గానక యావృద్ధుని బిలిచి తనశిష్యుని శరీరాదులు వర్ణించి యానవాలు చెప్పి యట్టిలక్షణములు గల పడుచువాఁడు మీ కగుపడినాఁడా యని యడిగెను. అట్టికుఱ్ఱవాని మొగమైనఁ జూడలేదని యాయోగి భృవుఁడు నొక్కిపలుక వాని మాయమాటలు దొంగ చూపులు గురువున కనుమానము గలిగించెను. తోడనే బలుఁడును దానును సజ్జదునికొఱకు పలుతావులు వెదకిరి. ఎట్టకేల కన్నములేక మిక్కిలి ఖిన్నుఁ డై యొకమూలబద్ధుఁ డై యున్న సజ్జదుని వారు కనుంగొని వానికట్లు విప్పి విముక్తుం జేసి యావృద్ధుం బిలిచి నిరపరాధు లగు బాటసారుల నావిధముగ నిష్కారణముగ దోఁచుకొని చెఱబెట్టవలసిన యవసరమేమివచ్చె నని మిక్కిలి కఠినముగ నడిగిరి. అడుగుటతోఁదనివినొందక గురువు కపటయోగింజూచి సాధుబాధ పరమపాతకమనియు నది కావించిన దురాచరణము లిహలోకమునకుఁ జెడుటయే గాక పరలోకమునకుఁగూడ జెడి దుర్గతులపాలగుదురని ధర్మోపదేశము చేసెను. అతితీక్ష్ణమైన యాయుపదేశముయొక్క వేఁడిమిచేతనమ్ముదుసలిదొంగయొక్క రాతిగుండెయు గరిగి నీరై పోవ నతఁడు పశ్చాత్తప్తుఁ డై దుఃఖపరవశుఁ డై తనకావించిన దోసమొప్పుకొని తప్పు సైరింపుమనివేఁడుకొనెను. అపురుషత్రియ మాస్థానము విడిచి కొంతదవ్వరుగునప్పటికి మర్దనుని సమాధి యున్న యూ రగుపడెను. ఆసమాధి దృష్టిపథమునం బడిన తోడనే భస్మరూపుఁ డైన తనతండ్రి యాసమాధిలో నున్నాఁడని విని సజ్జదుఁడు పితృభక్తి తరంగితాంతరంగుఁ డై యాస్థానము విడిచి రాఁ జాల నని గురువుతోఁ జెప్పి యచ్చటనె జీవితశేషముఁ గడుప

నిశ్చయించుకొనెను. సజ్జనుఁడు తన్ను విడుచుటచేత గానము తన చెవుల కింక వినఁబడదని గురువు వానిని విడువలేక విడువలేక విడిచెను. శుభము సంప్రాప్తించినప్పుడు మేర మీఱిన యానందమును కష్టము సంప్రాప్తించినప్పు డపారమైన దుఃఖమును బొందుట ధీరలక్షణము గా దని శ్రీకృష్ణుఁడు భగవద్గీతలలోఁ జెప్పిననీతి స్మరించుకొని యతఁడు సజ్జనునివియోగముకొఱకు విచారము నొందలేదు. అట్లు సజ్జనుని పితృసమాధికడనెలకొలిపిబలోపేతుఁడై నానకుబహుదినంబులుప్రయాణములుచేసిగాంధారదేశమునకు హిందూదేశమునకు నడుమనున్నకొండలలో ప్రసిద్ధమైనబొలానుకనుమదాటి కడుశ్రమపడిమెట్టకేలకు గాంధారము జేరెను. బాబావలీ వారిని మిక్కిలిప్రేమతో నాదరించెను. నానకు జ్ఞానసముద్రుఁడైన బాబావలీయొక్క సహవాస సౌఖ్యము కతిపయదినము లనుభవించి మునుపటికన్న జ్ఞానసంపన్నుఁడై యచ్చోటు విడచి స్వదేశాభిమానుఁ డయ్యెను. మార్గమధ్యమున మానచంద్రుండను క్షత్రియుఁ డాయన కగపడెను. ఈరాచవానికి మతాసక్తిమెండు. ఎవ్వరైనఁదనకు సన్మతోపదేశము చేసి మంచి దారి చూపువారు దొరకుదురా యని తగినగురువు నిమిత్త మతఁ డెదురుచూచు చుండెను. మంచినీరు త్రాగఁబూనువారికి మహాసరోవర మగపడినట్లు నిరుపేదకు పెన్నిధి లభించినట్లు నానకువంటి జ్ఞానరత్నాకరుఁ డాజ్ఞానదరిద్రునకు దొరికినతోడనే యతఁడు తనయదృష్టముచేత లభించెనని సంతసించి యనేకదినములు శుశ్రూషజేసి బహు సంవత్సరములనుండి దేనికై యన్వేషించుచుండెనో యాబ్రహ్మజ్ఞానఫలమును దనివోవ ననుభవించెను.

తిరిగి పయనము చేయునపుడు నానకు బాలనాధపర్వతమునొద్దఁ జుట్టుప్రక్కల నెక్కడ నూరుపల్లెలు లేని నట్టడవిలో నొకచెట్టుక్రింద, శిష్యద్వితీయుఁడై దారితెన్ను గానక మెసగుట కాహార

ములేక బడలి గూర్చుండెను. ఆకొండదాపున జోగులమఠ మొకటి గలదు. ఆజోగుల కొడయఁడైన యోగి పరమదయాళువు, పరోప కారపరాయణుఁడు. అతని యాజ్ఞాప్రకార మాజోగులు ప్రత్యహము సాయంసమయమున చిన్నచిన్నజట్లుగాఁ జేరి దారితప్పి పోవుబాటసా రులను గలిసికొని వారిని దమమఠమునకుఁ దోడ్కొనివచ్చి సత్క రించుచుందురు. ఆగుంపులలో నొక్కటి వృక్షచ్ఛాయంగూర్చుండిన నానకుం గనుంగొన తమమఠమునకువచ్చి యతిథి గావలసినదని వానిని గోరెను. ఆతరుచ్ఛాయయె తన కారాత్రి నివాసయోగ్య మగు నెలవగుననియు దా నదివిడిచి రాననియు నతఁ డుత్తరము చెప్పెను. వారతని యుత్తరము మఠాధిపతి కెఱిఁగింప నతఁడు కదలి పోయి స్వయముగ నతని నాహ్వానము జేసెను. అతని కోరికనిరాకరిం చుట మోటతనమనితలంచి గురువుతనయనుచరుని గలిసిమఠమునకరిగి యతిథియైవారిచ్చుసత్కారములనందిసంతుష్టుడయ్యెను.అతఁడామఠము ననొకటిరెండుదినములుండిమరలబయలుదేరి తెంపులేనిపయనములు చే సితనమామగారైనమూళుఁడువసియించుగ్రామముచేరెను. అప్పటికతఁ డు పదియాఱు సంవత్సరములనుండి ప్రయాణము చేయుచుండెను. ఆ గ్రామమునకు నానకు వచ్చినాఁడని వినినతోడనే ముదిమిచే నవయవ పటుత్వము దప్పిన మూళుఁడు కన్నులార నల్లునొక్కసారిగని యతని నింటికిఁ దోడ్కొనిరావలయునని శ్రమపడి యతఁడున్న,ధర్మశాలకుఁ బోయి సబహుమానముగ నతనిని తనయింటికి రమ్మని వేఁడు కొనెను. గురువు బహుమానముల స్వీకరింపక యతని గృహమునకుఁ బోవుటకు సమ్మతింపక హరినామస్మరణమే తన కాప్తబంధు వనియు ధర్మశాలలే తనగృహములనియుఁ జెప్పి యతనిం బంపెను.

మామగారి గ్రామమైన పఖోకరంధవాలో నానకు రెండు మాసములు లుండెను. ఆకాలములో నజ్ఞానతమః పటలముచేత నా

వృత్తులైన యనేకమనస్సులయందు జ్ఞానదీపములను వెలిఁగించి వారి నీశ్వరభక్తులుగఁ జేసెను. అంతకంత కతని పేరు పరిసరభూము లయందు వ్యాపించుట జేసి జ్ఞానసంపాదనము నిమిత్తము జనులు పెక్కండ్రతని సన్నిధికి రాఁదొడఁగిరి. మాసద్వయ మాగ్రామమునను న్నతరువాత ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు గొప్పతీర్థము జరుగునని తెలిసినందున నానకు బలువిగూడి యచ్చటకరిగెను. ఆర్యావర్తమాసమందలి మహాపుణ్యక్షేత్రములలోఁ గురుక్షేత్ర మొకటి. ఈక్షేత్రమందే భగవానుఁడగు శ్రీకృష్ణుఁడు తన మేనమఱదియుఁజెలియలి మగఁడును గారాపుచెలికాఁడునగు నర్జునునకు రథసారథియై పార్థసారథినామధేయంబునఁబ్రసిద్ధుఁడై కురుపాండవసైన్యమధ్యమునరదంబున నిలువంబెట్టి యుపనిషదాకారమైనభగవద్గీతాశాస్త్రము మాధవుం డాయన కుపదేసించెను. ఈక్షేత్రమునందే కురుపాండవ రాజకుమారులు కౌరవసామ్రాజ్యము నిమిత్తము పెచ్చుపెరిగినమత్సరంబున మహాసంగ్రామము గావించి నిహతులైరి. ఈక్షేత్రమునందే యాకాలపురాజనందను లంధఱు కౌరవపాండవులలో నేదోయొకపక్షముబూని మహానామపశియానలమునకు మిడుతలై కథావశేషులైరి. మహాభారతసంగ్రామము జరిగి రమారమి యిప్పటికి నాలుగు వేల సంవత్సరములైనను ననేక రాజర్షులచ్చట రణనిహతులై వీర స్వర్గము జూరగొనుటచే నాటఁగోలెనది భువనపావనమైన పుణ్యక్షేత్రమై పుణ్యాత్ములకెల్ల సేవ్యమై పురాతనచరిత్రాభిలాషులకుఁ గూడన భిగమ్యమైవిరాజిల్లుచున్నది. ఈకారణముచేతనే నానకాస్థలమునకుఁబోయి యుండును. ఆసంవత్సరము సమ్మేళనము మిక్కిలి గొప్పది. అన్ని వర్ణములవారు నన్ని మతములవారు నచ్చట సమావేశమైరి. కాని కాలక్షేపము నిమిత్తము వేడుకనిమిత్తము వేళాకోళము నిమిత్తము విహారము నిమిత్తము వచ్చినవారే కాని తీ

ర్థవాసులలో ననేకులు నిజమైన భక్తితోడను శ్రద్ధతోడను బరమా ర్థముతోడను వచ్చినవారు లేరు. హోమములు గావించువారు స్వాధ్యాయము చెప్పువారు భజనలు చేయువారు, స్నానములు సలుపువారు, జపములు చేయువారు తపోనిరూఢు లైన వారు ధర్మోపదేశములు చేయువారు వేనవేలు గనఁబడిరి. విగ్రహారాధనము విరివిగా జరిగెను. నిష్కళంకమైనభక్తి నిజమైనవైరాగ్యము సత్పాత్రదానము సాధుసేవ బ్రహ్మజిజ్ఞాస మొదలగునవచ్చట మృగ్యములయ్యెను. నానకువంటి వేదాంతి కవియన్నియు నసహ్యములై తోచెను. ఆజపములు తపములు దానములు ధర్మములు బ్రహ్మజ్ఞాననిష్ఠుఁడైన యామహాత్మునకుఁదలయేరు గలిగించెను. పారమార్థికులు గాక గతానుగతికులై నమూఢలోకులకుబుద్ధి చెప్పవలయునని తలంచిబలుని బిలిచియచ్చటచెఱువులోనుండియొకచేపందెమ్మని యతఁడు తెచ్చిన యామత్స్యమునుదాకలోఁబెట్టివండింపఁదొడఁగెను. అదిచూడఁగానే తీర్థవాసులకు నతితీక్ష్ణమైన కోపము వచ్చెను. అటువంటి పావన క్షేత్రమునఁ బరమపావన చరిత్రులగు తీర్థవాసులు లక్షోపలక్షలు చూచుచుండగ నటువంటిపుణ్యదినమున యోగి యన్న పేరు పెట్టుకొన్నవాఁడు జీవహింస చేసి కడుపునించికొనుటకన్న కష్టకార్యము మఱొకటిలేదని యచ్చటఁజేరినవావారందఱుఁ దలంచి కోపగించిరి. కొందఱు తమనాలుకలను యథేచ్ఛముగ నుపయోగించి వానిని నోటికి వచ్చినట్లు బండబూతులు తిట్టిరి. అట్టి దురాత్ముని బ్రతుకనియ్యఁ గూడదని దుడ్డుకఱ్ఱలు చేతఁబట్టుకొని చంపవచ్చిరి. వానికాసమయమున నోడలే తెలియలేదు. పొంగి పొరలివచ్చుచున్న మహాసముద్రమువలె జనసమూహము తన్ను నిర్మూలనము చేయుటకు దుడ్డుకఱ్ఱలతో వచ్చి మీఁదపడుచున్నను నతఁడు మహాపర్వతమువలెఁ జలింపక నిర్భయముగ వారిముందర నిలిచి మీఁగ వాగ్వాదముచేసి

నన్ను గెలువదలంచిరా లేక దండప్రయోగముచేతనే నిర్జింపఁదలచిరా యని యడిగెను. వర్షకాల మేఘము లుఱిమిన చందమున దమకంఠ ము లెత్తి వారిట్లనిరి. వాగ్వాదముచేసి నీతప్పు నీవు తెలిసికొని యిక ముం దట్టిపని నెన్నడు సేయనని నీవు ప్రమాణము చేసిన పక్షమున నిన్ను విడిచెదము. లేదా యీచేఁపను నీవు కోసినట్లే నిన్నుముక్క లుముక్కలుగాఁ గోసెదమని వారుత్తరమిచ్చిరి. అపుడునానకు వారి కిట్లనియెను. "మనుష్యుఁడు మాంసమునుండి పుట్టెను. మాంసము తోనే పెరుగుచున్నాఁడు. కావున మాంసమునందు నంతద్వేష ముం డవలసిన యవసరములేదు. పూర్వాచారపరాయణులైన యామూ ఢభక్తులు వానిమాటకుఁ దగినప్రత్యుత్తరముచెప్పలేక యతఁడు జ్ఞాన సంపన్నుఁడైన మహాయోగి, అతని జోలికి మనము పోఁగూడదని చల్లచల్లగ జారిరి. నానకు గురువుయొక్క ప్రతిష్ఠ దేశమంతట ము ఖ్యముగఁ బంజాబుదేశమునను గ్రమక్రమముగ వ్యాపించెను. అతఁ డొకమతమును మెచ్చలేదు. ఒకమతమును ఖండింపలేదు. ఏమతము నందైనను దోషములున్నపక్షమున నాదోషముల నతఁడు విమర్శించి ఖండించుచు వచ్చెను. దీనిఫలిత మేమనఁగాఁ బ్రతిమతస్థులు నతనిం గూర్చిన కథలువినుచు నతని గుణగణములు భక్తిశ్రద్ధలు జెప్పుకొను చువచ్చిరి. అంతకంతకతని యశస్సు ఢిల్లీచక్రవర్తియొక్క కొలువు కూటమువఱకు వ్యాపించెను. ఆకులమున భోగపరాయణుఁడైన యిబ్రహీములోడీ ఢిల్లీచక్రవర్తియై యుండెను. ఆఢిల్లీచక్రవర్తి కితనిగొడవ లక్కఱలేదు కాని యాయన యాస్థానమునందు స్వమ తాభిమానియు నానకు సిద్ధాంతములయందు ద్వేషము గలవాఁడు నగు ముత్సద్దీయను మహమ్మదీయుఁడుండి చక్రవర్తికి నానకుమీఁద నమితద్వేషము కలుగునట్లు చెవిచెంతఁజేరి కొండెము లెన్నెన్నియో చెప్పి యతనిమనస్సు పాడుచేసెను. ఆమహమ్మదీయుఁడు చక్రవర్తి

తో నీతెఱంగునఁ జెప్పెను. ఈనానకు మహమ్మదీయమతమునకేగాక హిందూమతమునకుఁగూడ ద్రోహవిగ్రహారాధనము సేయఁగూడదనియువర్ణభేదముదూష్యమనియునితఁడుహిందువుల నధిక్షేపించును. గోవధముపాతకమనియుమహమ్మదువారు జగద్గురువుకారనియు మనల నధిక్షేపించును. కావుననితఁడుభయమతస్థులకు విరోధియే కావునసర్వవిధముల దండ్యుఁడు" ఆపలుకులు చక్రవర్తికి నచ్చెను. ముత్సద్దికిగాని చక్రవర్తికిగాని హిందూమతము మీఁద నిజమైన యభిమానమున్నదని మనము నమ్మఁగూడదు. మహమ్మదీయమతము నధిక్షేపించుటచేతనే ముత్సద్దీకి నానకుపైఁబట్టరాని యాగ్రహము వచ్చెను. తనమతమును దూషించినందుకు నానకును దండించినచో హిందువులకు గష్టముగనుండునని ముత్సద్దీ హిందూమతముమీఁద సత్యంతాభిమాన మున్నట్లభినయించి చక్రవర్తి కాపరమసాధువుమీఁద పారములేని కోపము దెప్పించెను. ఆకోపావేశమునఁ జక్రవర్తి నానకును జెఱసాలలోఁ బెట్టించెను. మహాపురుషులకుగృహములు, కారాగృహములు నొక్కవిధముగానే యుండుననుమాట భోగపరాయణుఁడైన చక్రవర్తి యెఱుఁగఁడు. జీవన్ముక్తులగు మహాత్ములు కారాబద్ధులయ్యు చెఱసాలలో సంపూర్ణ స్వాతంత్ర్యముగలవారియట్ల సంతోష భరితులై యుందురు. అజ్ఞానులు యథేచ్ఛముగ విహరింప స్వాతంత్ర్యము గలిగియు సంసారబద్ధులై కారాబద్ధులకంటె నధికదుఃఖము ననుభవించు చుందురు. చక్రవర్తి గురువుయొక్క శరీరమునే నాలుగుగోడల నడుమబంధించెను. కాని యతనియాత్మను బాధింపఁజాలఁడు. శరీరము చెఱనుండి గదలలేకపోయినను విశృంఖలమైన యాత్మ రోదసీకుహరమంతయు స్వేచ్ఛగా విహరించి పరమేశ్వరుని పాదములవఱకుఁ బయనము సేయును. ఆచెఱసాలలో నున్న ఖైదీలు ప్రతిదినము తిరగళ్ళతోఁ గొంతపిండి విసరవలయునని నియమ

ముండెను. కారాబద్ధు లోపని బహుకష్టమునఁ జేయవలసి వచ్చెను. నానకు స్వధర్మముచేయుటయం దత్యంతాసక్తిగలవాఁడు కావున దక్కినవాండ్రివలె రేలు పెందలకడ నిదురవోవక విసరవలసినపిండి యంతయు విసిరి శయనించుచు వచ్చెను. అది యెఱుఁగక తోడిఖైదీలు నానకుయొక్క శిష్యులు నానకునకు మహామహిమలు గల్పించి నానకు స్వహస్తముతో విసరనక్కఱలేకుండ నతని ప్రభావముచేత వాటంతటవే తిరుగళ్ళు తిరిగెననియుభగవంతుఁడేవచ్చి విసరెననియుఁ జెప్పుకొనఁజొచ్చిరి. మూఢవిశ్వాసముగలయానాఁడుజనులందఱునామాటలునమ్మిరి. దైవానుగ్రహమువలన నానకు చిరకాలముచెఱలోనుండలేదు. మొగలాయి వంశస్థుఁడగు బేబరు కట్టకడపటిసారి హిందూదేశముపై దండు వెడలి పానిపట్టుయొద్ద యిబ్రహీము లోడీని గెలిచి యతనిం జంపి ఢిల్లీసింహాసన మెక్కెను. అతఁడు గద్దెయెక్కిన యెనిమిదవనాఁడు మహానుభావుఁడైన యోగి యొకఁడు పూర్వచక్రవర్తిచేత నిర్హేతుకముగ జెఱబెట్టబడెనని విని తక్షణమే యతనినివదిలిపెట్టవలసినదనియు మిక్కిలిగౌరవముతోఁ దనసన్నిధికిఁదోడ్కొని రావలసినదనియు నానతిచ్చెను. అతని యాజ్ఞాప్రకారము బందెకాఁడు వానిని జక్రవర్తి సన్నిధికిఁ దోడ్కొనిపోయెను. చక్రవర్తి యతనితో భగవద్విషయమై సంభాషించి యతఁడిచ్చిన యుత్తరములకు సంప్రీతుఁడై, ప్రీతుఁడై వీడుకొలిపెను. ఏడు తరముల వఱకు బేబరుసంతతివారు హిందూస్థానము పరిపాలింతురని యాసమయమున బేబరుతో నానకు చెప్పెనని కొందఱు చరిత్రకారులు వ్రాసిరి. అట్లుమొగలాయి చక్రవర్తిని వీడ్కొని నానకు మరల దేశాటనమారంభించి కాశ్మీర దేశమునకుఁ బోయియచ్చట దనసిద్ధాంతములను బోధించి ప్రసిద్ధుఁడైనయొక బ్రాహ్మణుని దనమతమునం గ్లుపుకొనియె. నాటంగోలె బెక్కండ్రు నాతనిమతమును స్వీకరించి

శిష్యులైరి. కాశ్మీరమునుండి యతఁడు లాహోరుపురమునకువచ్చెను. ఆపురవాసియు మిక్కిలి పలుకుబడి గలవాఁడు గొప్పవాఁడునగు నొక తురక యమీరుగూడ నతని శిష్యుఁ డయ్యెను.

అనంతరము నతఁడు మామగారి యూరికి వచ్చెను. ఒకనాఁ డతఁ డాగ్రామమున నొకచెట్టుక్రిందఁ గూర్చుండ జాటుజాతివాఁడై న యొకబాలుఁడు పశువులం దోలుకొనుచు నాదారిం బోయెను. వానిపేరు బూరా. అతనిముఖవైఖరింబట్టి సద్గురూపదేశము గలిగి సత్పురుషునిచేత శిక్షితుఁ డైనపక్షమున నాబాలకుండు మహాపురుషుఁడు కాఁ గలఁడని గురువు తెలిసికొని వానిం దనకడకు రమ్మని చేసన్న జేసెను. ఆబాలుఁడు తక్షణమె యాతనిసన్నిధికిం బోయి యేలపిలిచితిరని యడిగెను. పనియేమిలేదు. ఊరక పిలిచితినని గురువుత్తరముచెప్పెను. లోకఖ్యాతకీర్తిమైన మహానుభావుఁడు తనవంటి యర్భకుని నిర్హేతుకముగఁ బిలువఁ డని యబ్బాలుఁడు తలంచి మఱునాఁ డొక చెంబునిండ నేయి బోసికొని యతని దర్శనమునకుఁ బోయి తన తెచ్చిన కానుక గ్రహింపుమని ప్రార్థించెను. నీతలిదండ్రులతోఁ జెప్పి యిది తెచ్చితివా వారెఱుకలేక తెచ్చితివాయని నానకుఁడింభకు నడిగి మాతాపితలకుఁ దెలియకుండఁ దెచ్చితినని యతఁడుత్తరము చెప్ప గృహయజమానులకుఁ దెలియకుండ దొంగతనముగఁదెచ్చిన వస్తువు పుచ్చుకోనని బాలకుఁ డెంత బతిమాలినను దానిని గ్రహింపక పంపివైచెను. అనంతర మాబాలకుఁడు ప్రతిదినము గురుసందర్శనము జేసి క్రొత్తవిషయములు నేర్చుకొనుచుఁ గొంతకాలమున కాతనికి శిష్యుఁడై పంజాబుదేశమందు మిక్కిలి పేరుగాంచిన సన్యాసి యయ్యెను. ఈవిధముగ హిందువులు మహమ్మదీయులుగూడ నతని శిష్యులుగ వచ్చిరి.

మామగారియూర నాలుగుసంవత్సరములుండి మామగారి

మరణానంతరమున నతఁడు గ్రామము విడిచిపెట్టెను. అప్పటి కతని కరువది సంవత్సరములు నిండెను. మునుపటి వలెదీర్ఘప్రయాణము లు చేయుటకు ఓపిక లేకపోయెను. అందుచేత స్వస్థలము విడిచి దేశాంతరముల కరుగఁగూడ దని యతఁడు నిశ్చయించుకొనెను.

చరమావస్థ.

నానకు షష్టిహాయన పూర్తి చేసినందున మునుపటివలె సాధువులయొక్కయు సన్యాసులయొక్కయు ఫకీర్లయొక్కయు సహవాసము చేసి వేదాంతగోష్ఠితోఁ గాలము బుచ్చుట కవకాశము లేకపోయెను. ఏదోయొకచోట స్థిరముగానుండి పశ్చిమవయస్సు గడుపవలయునని నిశ్చయించి యేగ్రామము తనకనుకూలముగా నుండునో యని యతఁడు విచారింపఁ దొడఁగెను. అట్లొకస్థానమేర్పఱచుకొనకమునుపు జన్మభూమియగు తాల్వోండి కరిగి పితృవంశస్థులలో హతశేషుల నొకసారి చూడవలయునని కోరిక గలిగినందున నతఁడచ్చట కరిగెను. అతని పినతండ్రి యగులల్లామాత్రమప్పటికి జీవించియుండెను. నానకు పినతండ్రియింటఁ బదునైదు దినములుండెను. యావజ్జీవ మచ్చటనే యుండవలసిన దని పినతండ్రి నానకు ననేకవిధముల బ్రతిమాలెను. కాని యతఁడు దానికి సమ్మతింపలేదు. నానకు తన్ను విడిచిపోవు నప్పుడు పినతండ్రి గుఱ్ఱమొకదానిని తెచ్చి సుకరముగఁ బ్రయాణము చేయుటకు వీలుగ నుండును గనుక దానినైనఁ బరిగ్రహింపవలసినదని పలువిధముల వేడుకొనెను. అదియు బరిగ్రహింపక నానకు వానికిట్లనియె. నేను భగవంతుని కొలువు చేయుచున్నాను. ఇప్పుడు నామనస్సులో నేవిధమైన సంతాపము గాని బెంగ గాని భయము గాని సందేహము గాని లేదు. ఇది పెట్టుబడి లేనివ్యాపారము కాని లాభము విశేషముగ వచ్చుచున్నది. ఇదియిమ్మని, అది యిమ్మని యడుగువారు లేరు. ఎంతయదృష్టవంతులకొ గాని యిటువంటి చేరము

తగులునా. అట్లు చెప్పి పినతండ్రిని వీడ్కొని చిరకాలమునుండి తన్ను సేవించుచున్న బలుని తన శుశ్రూషాబంధమునుండి విడిపించి యథేచ్ఛముగ విహరింపవలసిన దని యానతిచ్చి బియాసునదీతీరమున మిక్కిలిమనోహర మైనయొక స్థానము తనకునిలయముగ నేర్పఱచుకొని యాస్థానమునకు విశ్వకర్త యగుపరమేశ్వరునిపేరు పెట్టఁదలంచి కర్తారపురమని నామమిడెను. ఇచ్చట సాధువులు యోగులు పెక్కండ్రు చేరి యతనిని సేవించి యతని సహవాససౌఖ్య మనుభవించిరి. అతనిభార్య యగుమానీదేవియు నానకుయొక్క కొడుకులుఁ గూడ నచ్చోటనే జేరిరి. ఆబిడ్డలువచ్చిరని యతని కానందములేదు. విచారములేదు. సన్యాసులకు తమమనస్సె సమస్తానందములు గలుగజేయును. గానిబాహ్యవస్తువులు సంతోష మొసంగఁజాలవు. అతఁడీవిధముగ నొకచోట స్థిరముగ నుండుటవలన గొప్ప ప్రయోజనము గలిగెను. ఆమహాత్ముఁ డదివఱకు బోధించిన బోధనములవలనను గానముచేసిన గీతములవలనను చేసిన వాదముల వల్లను నతని యభిప్రాయములు దెలియుచుండినను నవి యొకవరుసలేక చెదిరి విడివిడిగా నుండుటచేత నెల్లవారికి సులభముగ లభింపకుండెను. పూర్వోత్తర సందర్భములు చక్కగా గమనించి యవి యొకచోఁ జేర్చివ్రాసి లోకుల కుపయోగముగ నుండునట్లు చేయవలసిన భారము తనపై నుండెను. ఒకచో స్థిరముగ నుండుటవలనఁగలుగు ముఖ్యప్రయోజన మిదియె. అకర్తారపురమునుండి నానకు తనపని నెఱవేర్చుచుండ లెహనుఁడను నొకక్షత్రియుఁడు విష్ణుదేవి యనుక్షేత్రమునకు యాత్ర పోవుచు నీగ్రామమునకుఁబోయి యచ్చోట మహానుభావుఁ డొకఁడున్నాఁడనివిని యాతని సందర్శించెను. ఆక్షత్రియుఁడు కర్తారపురమున నొక్కదినము మాత్రమె యుండఁదలఁచెను. కాని నానకుయొక్క బోధామృతపానముచేత నతఁడు పరవశుఁ డై యచ్చోటు విడువఁజాలక

నిరంతర శుశ్రూషలచేతను పరమార్థగ్రహణముచేతను వినయవివేక సంపత్తిచేతను సత్ప్రవర్తనముచేతను గురువుయొక్క యనుగ్రహము బడసెను. గురుశిష్యులకుఁ గలపరిచయము స్వల్పకాలమునుండి యైనను నారాచవానిభక్తిజ్ఞానవైరాగ్యములు గురువుమనస్సును సంపూర్ణముగఁ గరగించి యతనియందు పుత్రవాత్సల్యము గలిగెను.

తనయనంతరమున దాను బోధించిన మతము లోకమునకు బోధించుటకుఁ దగినవాఁడా రాచవాఁడే యని నానకు వానినే పీఠాధిపతి జేసెను. ఈకార్యము చూనీదేవికి మిక్కిలి కష్టముగ నుండెను. పీఠాధిపత్యము కుటుంబమునకు గౌరవము విశేషముగఁ గలిగించుటయెగాక కట్నములు కానుకలు మొదలగువానిరూపమున ధనలాభము గూడ గలిగించును. కావున నట్టిమహాపదవి తనకొడుకులకు రాక పరాధీనమగుటచే నాయిల్లాలు మిక్కిలివగచి యది తనపుత్రులయందెనిలుపుమని యతనింబ్రార్థించెను. కానిమతబోధకుఁడైన పీఠాధిపతి కుండవలసిన లక్షణములేవియుఁ దనకుమారులయందు బొడకట్టక క్షత్రియునియందె పొడగట్టుటచేత నతఁడు లోకోపకారార్థమై పుత్రస్నేహ మొకమూలకు ద్రోచి మతవ్యాప్తియె ప్రధానముగఁ జేసికొని యిల్లాలి మొఱలు పెడచెవిని బెట్టి రాచవానినె పీఠమునఁ బ్రతిష్ఠించి యతని కంగదుఁడనునామమిచ్చెను. చూనీదేవి నెట్లయిన తనకావించిన యేర్పాటున కొడంబరుపఁదలఁచి నానకు తనకుమారులను రాచవానిని బలుసారులు భార్యయెట్టయెదుట బహువిధముల శోధించెను. ఆశోధనలలో క్షత్రియుఁడె సర్వవిధముల శ్రేష్ఠుఁడని చూనీదేవికింగూడ దోఁచుటంజేసి సత్యమొప్పుకొనక తప్పదుగావున మనసులో నిష్టము లేకపోయినను నామె రాచవానినె ప్రతిష్ఠింపఁ దగునని నోటితో ననెను.

ఆమహాపథప్రతిష్ఠుఁడగు తన శిష్యుఁడు మత్సరగ్రస్తులైన జ

 

నులచేత బీడింపఁబడకుండ నతని స్వగ్రామమునకే బోయి యుండవ లసినదని శాసించెను. తాను వచ్చినపని సమాప్తమైనందున నానకు దేహత్యాగము చేయవలసినకాలము సమీపించు చున్నదని గ్రహించి యందుకు సన్నద్ధుఁడయ్యెను. మరణము సమీపించుచున్నదని యా తఁడు తెలిసికొని యొకనాఁడతఁడు 'రేపురాత్రిలోపుగ నేను లోకాం తరమున కేగుదు'నని చెప్పెనఁట. అతనిబసకు సమీపముననొక మఱ్ఱి చెట్టుగలదు. ఆవృక్ష మతనికి మిక్కిలి ప్రియము. అతఁడుపలుమాఱు దానినీడను వసియించి సుఖించెను. ఆదినమునఁగూడ నతఁ డాచెట్టు క్రిందనే తన సెజ్జలపఱపించుకొని పండుకొనియెను. ఆమహాత్మునకు గాలము సమీపించినదని విని హిందువులు మహమ్మదీయులు గూడ గడసారి యాతనిదర్శనము జేయఁగోరి గుంపులు గుంపులుగఁ బోయి చూచి ధన్యులైరి. మరణమునిమిత్తము ప్రత్యేకముగ నతఁడు గట్టిం చుకొన్న యింటిలోనికిఁ దన్ను తీసుకొనిపొమ్మని సాయంకాలమతఁ డుకోరెను. ఆగృహమున స్వబంధువులయొక్కయు శిష్యగణముయొ క్కయు సన్నిధి నతఁడు 1526 వ సంవత్సరమున నాశ్వయుజ శుద్ధ దశమినాఁడుజాముగాత్రియుండఁగఁబరమపదమునొందెను. చూనీదేవి యు గొడుకులు పీఠాధిపత్యము తమకుటుంబములో నుంచవలసినదని కట్టకడపటి దినమున సయితము గురుని యడుగులపైఁబడి వేఁడుకొనిరి. కాని యతఁడు నిశ్చయుఁడై వారివేడికోలుత్రోసిపుచ్చెను. గురుకళే బరమునకు దహనసంస్కారము చేయతలఁచి హిందువులాశవమును రు ద్రభూములకడకుఁ గొనిపోయిరి. అదివిని యెంతయు మహమ్మదీయు లు నానకు తమ మతమే బోధించె ననియుఁ దమవాఁడేయనియు శవ ముతమయధీనమే కావలసినదనియు వాదించి శవమును ఖననము చే యుటకై తెమ్మనిరి. హిందువులందుకు సమ్మతింపకపోగా రెండు తెగ లకు భయంకరమైన కలహము వచ్చుటకు సిద్ధమయ్యెను. ఉభయులు

కత్తులుదూసిరి. అప్పుడొకజ్ఞాని యాగుంపులోనుండి వచ్చి నానకువంటి మహాత్ములు తమకళేబరములోనుగూడ విడిచిపోవరు సుఁడీ యని పలికెను. ఆమాట విని హిందువులు మహమ్మదీయులు గూడకళేబరమును మున్నుబెట్టిన నెలవునకు బోయిచూడ నచ్చటశవము లేకపోయెను. ఎల్లవారు విస్మితులైరి. ఆయన కప్పుకొన్న దుప్పటిమాత్రము లభించుటంజేసి యదిహిందువులు మహమ్మదీయులు రెండుతునకలు చేసి చెఱియొక తునక పుచ్చుకొనిరి. హిందువులాతునకను దహనము చేసిరి. తురకలు నేలపూడ్చిపెట్టిరి. ఈవిధముగ మహానుభావుడైననానకు పేదకుటుంబమునపుట్టితనవిజ్ఞానసంపత్తిచేత జగద్గురువై మతకర్తయై డెబ్బదియేండ్లు జీవించి జీవితకాలములో నొక్కనిమిషమైనను వ్యర్థముచేయక జ్ఞానసంపాదనమునందే వినియోగించిసంసారశృంఖలముల నాశముగ దెంపివైచి యెవ్వరికొలువు సేయక దేవదేవునికొలువే చేసిచరితార్థుడై యాతని సాన్నిధ్యముఁ బడసెను.

నానకు స్థాపించిన మతముపేరు సీకుమతము. తన్మతస్థులు సీకులు అని వ్యవహరింపఁ బడుచున్నారు. వీరు పంజాబుదేశమున విశేషముగ నున్నారు. నానకు యొక్క మతము చైతన్యవైష్ణవమతమువలె, బసవేశ్వరుని జంగమ మతమువలె వర్ణభేదశూన్యమై భక్తిరసప్రధానమైయుండును. విగ్రహారాధనము చేయ గూడదని నానకు బోధించెను. వేదమునందితనికి గౌరవము కలదు కాని యదియే పరమప్రమాణమని యతఁ డొప్పుకొనలేదు. జీవహింసాస్పదములైన క్రతువులు మొదలగు కర్మలుపనికిరాదని యతఁడుగర్హించెను. ఈశ్వరుఁ డొక్కఁడే యనియు నతఁడుసర్వశక్తుఁడనియు సృష్టిస్థితిలయకారణుఁడనియు, భక్తిచేతనే యతఁడు సాధ్యుఁ డగుననియు నితని యాశయము. శంకరరామానుజమధ్వాచార్యులవలె నితఁడు విద్వాంసుఁడు గాఁడు. జీవాత్మపరమాత్మభేదములు విచారించియితఁడుతత్త్వ

నిర్ణయములు చేయలేదు. భక్తిజ్ఞానవైరాగ్యములవలన మానవుఁడు పాపబంధములు విడిచి యీశ్వరసాన్నిధ్యము నొందునని యతఁడు బోధించెను. సీకులమతగ్రంథముపేరు ఆదిగ్రంథము. దీనికే గ్రంథసాహేబులని పేరు. దీనిలో నానకుయొక్కయు నతని యనంతరమున మతరక్షకులైన గురువులయొక్కయు సిద్ధాంతము లున్నవి. ఇతఁడు తులసీదాసు కబీరుదాసు మొదలగువారియట్లే పరమభాగవతోత్తముఁడు. ఈమతము పదియవ గురువగు గురుగోవిందుని కాలమున మహోన్నతమైన స్థితికి వచ్చెను.

సమాప్తము.






సీకుమతమునకు స్థాపకుఁడైన నానకు తన్మతమునకు ప్రథమ గురువు. ఈమతమునకు గురువులు పదిమందిగలరు. వారిలో గురుగోవిందుఁడు కడపటి గురువు. మొదటిగురువునకుఁ బదియవగురువునకు నడుమనుండిన గురువుల చరిత్రములఁ దెలియకపోయినచో గురుగోవిందుని చరిత్రము సమగ్రముగాఁ దెలియుటకు వీలులేదు. కావున వారిచరిత్రములనుగూడ సంగ్రహముగా నిందుఁబొందుపఱచెదము.

---

## రెండవగురువు—అంగదుఁడు.



ఈయంగదుని పూర్వవృత్తాంతము చిత్రమైనది. ఈతఁడు క్షత్రియుఁడు. పూర్వాశ్రమమందితని పేరు లెహనా. అతఁ డొకనాఁడు తీర్థయాత్రాపరుఁడై పోవుచుండ నప్పుడు కర్తరపురమందు గురునానకు వసియించుచున్నవాఁ డనియు నతఁడు మహాత్ముఁ డనియు వానికిం దెలిసెను. తెలియుటయు నతఁడు ముందుగ నానకు దర్శనముఁ జేయఁదలఁచి కర్తారపురమునకుఁబోయెను. పోయి యమ్మహాగురుని మతవిషయకోపన్యాసములు విని లెహనా పరవశుఁడై నానకునకుఁ బరమభక్తుఁడై తాను పోవఁదలఁచిన స్థానము, స్వస్థానము, స్వగృహము మఱచి వాని పాదసేవ జేయుచు నచ్చటనే యుండెను. గురునానకు శిష్యుని చిత్తనైర్మల్యము, భక్తి, విశ్వాసము, వినయ

ము, యోగ్యత మొదలగు సద్గుణములకుం గడుంబ్రియుఁడై తన కుమారులయందలి పక్షపాతము విడిచి తనయనంతరము లెహానా సీకు మతాచార్యుఁడై పీఠ మధిష్ఠింప వలయునని యాజ్ఞాపించెను. నానకు భార్యయగు చూనీదేవియుఁ గుమారులు దాని కొడంబడరైరి. చూనీదేవి పుత్రులలో నొకనికా పీఠాధిపత్యము నీయవలయునని పలుమారులు భర్తను బ్రార్థించెను. లెహానాయొక్క సుగుణసంపద తన యిల్లాలికిఁ జూపి తనయేర్పాటు నామెచేతఁగూడ నొప్పింపవలయునని నానకు తనకుమారులను, లెహానాను భార్యయెదుటఁ బరీక్షించుచు లెహానాయొక్క బుద్ధికుశలతను జూపుచువచ్చెను. చూనీదేవియు లెహానా మిక్కిలి బుద్ధికుశలుఁడని యొప్పుకొనియెను. కాని తన కొడుకులకాపదవి రాలేదని మనసులో విచారించుచు వచ్చెను. నానకు పరమపదమునొందెడు దినమునఁ గూడ దారపుత్రులు తమ వంశము నందె పీఠాధిపత్యము నిలుపుమని బహువిధములఁ బ్రార్థించిరి. కాని గురువు వారి ప్రార్థనను బెడచెవినిఁ బెట్టెను. క్రొత్తవానికిఁ బీఠాధిపత్య మర్పించినందుకు తన యాలుబిడ్డల పోరధికమగుటఁజేసి యతఁడు లెహానాకుఁ గొన్నిబాధలు కలుగునని తలంచి తన కతఁడు దూరముగానుండుట మంచిదని భావించి లెహానాను వాని స్వగ్రామమునకే బంపెను. లెహానా యచ్చటనేయుండి గురుమరణానంతరమున నంగదుఁడను బిరుదువహించి సీకుల రెండవగురు వయ్యెను. అంగదుఁడు తన గురువుచెప్పిన మార్గమునే యనుసరించెను. సీక్కుల వేదమగు నాదిగ్రంథమున నంగదుఁడు రచించిన భాగములు స్వల్పముగఁ గలవు. అవి యేకేశ్వరారాధనముం దెలుపుచు మనోహరములుగా నుండును. అమృతసరము మండలములో నున్న ఖాదూరు గ్రామము మతఁడు నివాసముగ నేర్పరచుకొని రేయుంబవళ్ళు భగవత్ప్రార్థనము ధ్యానముఁజేయుటలోనే కాలము బుచ్చుచుఁ దన్నుఁ సేవింపవ

చ్చినవారికి పరిశుద్ధమైన యా సిక్కమతముం దెలుపుచు నెల్లర గౌర వమునకుఁ బాత్రుఁడయ్యెను. అతఁడు గొప్పదాత. వానిగృహ మ న్నాతురులకు సత్రమై యుండెను. ఆతని మృదుభాషలను కఠినసీమము లను దానశీలమును లోకులందఱు వేనోళ్ళఁ బొగడుచువచ్చిరి. అతఁ డు మన గురుస్వాములవలె నేతి పిండివంటలు మొదలగునవి భక్షిం పక కొయ్యరొట్టెమాత్రమే తిని దేహపోషణముఁ జేసికొనుచువచ్చె ను. గురునానకు విధముననే యంగద గురువుగూడ తనశిష్యులలో నొకనినే యనంతరగురువుగాఁ జేసెను. ఆయన కొడుకులగు వాసుఁ డు, దత్తుఁడు మహాచార్య పదమునకుఁ దగిన యోగ్యతలు లేనివా రైనందున యతఁడు శిష్యునే యేర్పఱుపవలసివచ్చెను. కుమారులుండి యామహాపదము కాంక్షించుచున్నపుడు వారి కాపదవి నొసఁగక యర్హుఁడైన వానినే తత్పదవినుంచిన నానకుయొక్కయు నంగదుని యొక్కయు మనోధైర్యము నిష్పక్షపాతబుద్ధి మిక్కిలి శ్లాఘనీయ ములుగదా! సీకుల మతగ్రంథములు వ్రాయఁబడిన గురుముఖీ లిపి నీయంగదుఁడే కనిపెట్టెనఁట. ఈలిపి ప్రస్తుతము సంస్కృతభాష వ్రాయఁబడుచున్న నాగరలిపినిఁ బోలియుండును. గురువు జీవించి యుండగనే యంగదుఁడు దానిని నిర్మించెనని కొందఱును వానిపరో క్షమున నిర్మించెనని కొందఱును జెప్పుదురు. ఈయంగదుఁడు 2 సం వత్సరముల కొన్నిమాసములు మతగురువై క్రీ॥ శ॥ 1552 సంవత్సర మునఁ గాలధర్మమొందెను. అతఁడు మరణపూర్వ మనేక సంవత్సర ములనుండి కాళ్ళమంటలబాధ పడుచు తుదకారోగముబారిఁబడియె.

---

## మూఁడవగురువు—అమరదాసు.

అంగదగురుని యనంతరమునఁ బీఠాధిపత్యమును వహించిన యమరదాసు క్షత్రియుఁడు. నానకుయొక్క మతబోధలు చెవినిఁబడు

నప్పటికి వాని కఱువదియేండ్లు నిండెను. అతఁడు గురుపీఠమునధిష్ఠిం చు టీక్రిందివిధముగా సంభవించెను. సిక్కు గురువులందఱు సన్యాసులుగాక గృహస్థులయినందున నంగదుని యింటి యాఁడుపడుచొక్కతె యమరదాసు కుటుంబములోని బాలకునకుఁ బాణిగ్రహణము చేయఁబడెను. అమరదాసు క్రొత్తచుట్టమగు నంగదుఁడు పరిశుద్ధ జీవనముఁ గలవాఁడనియు మహాభక్తుఁడనియు విని వానిదర్శనము చేయఁబోయెను. అంగదుఁడు చుట్టమును గౌరవించి వానికింగొన్ని కానుకలిచ్చెను. అమరదాసు తాను బాంధవ్యభావమున రాలేదనియు శిష్యభావమున వచ్చెననియుఁ జెప్పి కానుకల గ్రహింపఁడయ్యె. అదివిని యంగదుఁడు శిష్యభావమున వచ్చినపక్షమున బాంధవ్యము మాట తలపెట్టక వెంటనే శుశ్రూష జేయనారంభించు టుచితమని పల్కెను. అమరదాసు సంతసించి తక్షణమే వానిశిష్యుఁడై నాఁడు మొదలు పరమభక్తుఁడై యుండెను. ముసలివాఁడయ్యు నతఁడు మిక్కిలి విధేయుఁడై గురువుఁగొల్చెను. అతనిభక్తి యింతింతని వర్ణింపనలవికానిది. ఎంత నీచసేవనైన నతఁడు మనసున లేశమైన సందేహమందక గురునకుం జేయుచుండును. గురునకుఁ బాదములలో మంటరోగముగలదని యీవఱకే చెప్పియుంటిమి. ఆతని పాదములపైఁ జల్లని నీరుపోసి కడిగి వానిప్రాణము సుఖపెట్టుటకై యమరదాసు తామువసించు ఖాదూరునకు మూఁడు క్రోసుల దూరముననున్న బియాసునదికిఁబోయి కుండెడునీరు మూపునఁబెట్టి మోసికొని ప్రతిదినము నడచి వచ్చుచుండును. ఈపని నతఁడు స్వయముగాఁ జేయ నిచ్చగించెనేకాని గురు వాతని నందునియోగింపలేదు. ఒకనాఁడు రాత్రి చీఁకటిలో నదినుండి వచ్చుచుండ గురునిబసపొరుగున నున్న సాలెవాని యింటియెదుట నమరదాసు కాలుజాఱి గుభాలునఁ బడియెను. కుండపగిలెను. వానికి దెబ్బతగిలెను. సాలెవాఁడు చప్పుడువిని యధ

రిపడి యదియేమో కనుగొని రమ్మని భార్యతోఁ జెప్పెను. అమరదాసు ప్రత్యహముఁబకు శ్రమ యెఱిఁగినదే కావున వాని యిల్లాలు జరిగిన వృత్తాంతముఁజూచి భర్త కిట్లనియె. "ఈపని యిల్లువాకిలి లేని నిర్భాగ్యుఁ డమరదాసు చేసినది." ఈమాటలు ప్రక్కయింట నున్న యంగదుని చెవులం బడుటయు నతఁడు సత్వరము శిష్యునికడ కుంబోయి ప్రేమాతిశయమున వానిం గౌఁగలించి లోకుల యుల్లసోక్తులకు మనోవేదన మందకుము. నేను నీపోషకుఁడను. నాకుఁగల భాగ్యమంతయు నీదే యని పలికి యోదార్చెను. ఈపలుకులంబట్టి గురువునకు వృద్ధశిష్యునిమీఁద నెంత వాత్సల్యముగలదో తేటపడును. ఇదిజరిగిన కొన్నినాళ్ళకే యమరదాసు భవిష్యద్గురువుగా నంగదునిచే నియుక్తుఁ డయ్యెను.

అంగదుని మరణానంతర మమరదాసు గురువై యాపదవి కతఁడర్హుఁడే యని యెల్లరచేఁ బొగడఁబడియె. అతఁడు సిక్కుమత సిద్ధాంతములను జనుల మనసున కెక్కునట్లు బోధించి చాలమందిని తనమతమునం గలుపుకొనెను. అనేకమహారాజులు జమీందారులు భక్తితత్పరులై వాని బోధనల విని పూర్వమాధ్యమునువిడచి వాని శిష్యులై బాగుపడిరి. నానకు కుమారులలో నొకఁడగు శ్రీచంద్రుఁడు క్రొత్తగా దాసులపేరఁ గొందఱ శిష్యులం జేరఁదీసి వారినొక తెగగాఁ నేర్పఱచెను. స్థాపకుఁడు గురునానకు పుత్త్రుఁడగుటచే లోకులామతముఁగూడ నానకు కల్పించినదే యని భ్రమించుచువచ్చిరి. ఆభ్రమ నివారింపఁదలఁచి యమరదాసు నానకుయొక్క సిక్కుమతస్థులను వానిపుత్త్రునియు దాసులనుండి వేరుపఱచెను. ఈపని యంగదగురువే చేయవలసినది. కాని యతఁడు నానకుమీఁదం గల గౌరవాతిశయమున వాని పుత్త్రుని మనసు నొప్పించుట కిష్టములేక యూరకుండెను. అందువలన నమ్మహాకార్య మమరదాసు పాలం బడియె.

అమరదాసునకొక కొడుకు, నొక కూఁతురుఁ గలదు. కొడుకు పేరు మోహనుఁడు, కూఁతురుపేరు భాని. కొడుకు పీఠాధిపత్యమున కనర్హుఁడని యమరదాసు తన యల్లుఁడు రామదాసున కాపదవి నిచ్చెను. అమరదాసు కూఁతును రామదాసున కిచ్చి వివాహముచేయుటనుగూర్చి లోకులీకథను చెప్పుకొనుచున్నారు. అమరదాసు కూఁతురుమీఁద నధికానుగముఁ గలిగి యామెకుఁదగినవరునిఁగూర్చ బహుప్రియత్నములు చేసెను. ఒకనాఁ డతఁడు తనమనోరథమును దనయొద్ద పనిచేయుచుండిన యొకబ్రాహ్మణున కెఱింగించి మంచివరుని వెదుక నాజ్ఞాపించెను. ఆవిప్రుఁడు కొన్ని తావులకరిగి పెండ్లికొడుకుల ననేకులంజూచి యమరదాసు కడకుఁబోయి యన్నివిధముల భానికిం దగిన వరుఁడు లభించెనని విన్నవించెను. పెండ్లికొడు కెంతపొడవుండునని గురువు బ్రాహ్మణు నడుగుటయు నతఁడు చుట్టుప్రక్కల గుంపుఁ గూడియున్న జనులనందఱుఁ బరికించిచూచి యందొకబాలునిఁజూపి "పెండ్లికొడుకు సరిగా వీనియంత పొడవుండు" నని పలికెను. అదివిని గురువు లావణ్యమును గ్రిక్కుచున్న యాబాలుని మొగము వంక తప్పకచూచి వానిం బలుకరించి "నీపేరేమి? వంశమెద్ది? వృత్తియేమి" యని యడిగెను. ఆబాలుఁడు తనపేరు రామదాసనియు తాను క్షత్రియుఁడననియు గండ్వాలు గ్రామవాసిననియు గౌరవముగా జీవనము జరుగుచుండెననియు గురువునకుఁ బదులుచెప్పెను. అమరదాసు వానివృత్తాంతము విని ముదితహృదయుఁడై బ్రాహ్మణుఁడు తీసుకొని రాఁదలఁచిన పెండ్లికొడుకును విడిచి యెట్టయెదుటనున్న బాలుఁడగు రామదాసు రూపరేఖావిలాసంబులంబట్టియు వంశముబట్టియుఁ దనకూఁతునకుఁ దగువరుండని దలంచి వానికామెనిచ్చి వివాహము చేసెను.

అమరదాసు మతబోధ చేయునపుడు సర్వదా సంఘమునందలి

దురాచారములను వెలిపుచ్చి ఖండించు చుండును. సహగమనము ఘోరకృత్యమని యతఁడు తలఁచుచుగ గర్హించుచువచ్చెను. ఢిల్లీచక్రవర్తియగు నక్బరు వానిమీఁద నిష్టముగలవాఁడై పలుమారు రావించి భూషించెను. అట్లు జగద్వినుతముగ నిరువదిరెండు సంవత్సరముల యైదుమాసముల పదునొకండురోజులు పీఠాధిపత్యము వహించి క్రీస్తుశకము 1575 వ సంవత్సరమున గండ్వాలగ్రామమున సిద్ధిపొందెను. అతని శరీరము దహనముచేసి శిష్యులాస్థలమున నొకగొప్ప గోలీని గట్టిరి. ఇప్పటికిని బ్రతిసంవత్సరము సిక్కు లాస్థలమునకు యాత్ర చేయుదురు.

---

## నాల్గవగురువు—రామదాసు.

రామదాసు తన మామగారియాశల వ్యర్థపుచ్చలేదు. పీఠాధిపతి యగు గురువులయొద్ద నుండవలసిన సకలలక్షణములు వానియందుఁ గలవు. అమరదాసుపై భానీదేవి కెంతభక్తియుండెనో రామదాసున కంతియ భక్తిగలదు. రామదాసునకు లోకోపకారపరాయణతయై వభక్తి యాత్మశుద్ధి వానికీర్తి నలుదెసల నలముకొనఁ జేసెను. అందువలన వాని చుట్టు ననేకులుచేరి కొలిచి శిష్యులయిరి. అక్బరు చక్రవర్తి వానికీర్తివిని యొకసారి చూడఁగోరి వానిని రావించెను. చక్రవర్తి విజ్ఞానసంపన్నుఁ డగుటచేతను, సర్వమతాదరము గలవాఁడగుటచేతను రామదాసు ప్రసంగములకుఁ జాల ముదితహృదయుఁడై వానికిఁ గొంతభూమి బహుమానముగ నిచ్చెను. ఆనేల గుండ్రముగ నుండినందున లోకులు దానిని రామదాసుచక్రమందురు. ఈ భూమిలో రామదాసుకొలను నొకదానిని త్రవ్వించి యమృతసరమని దానికిం బేరుపెట్టెను. ఆసరస్సు చుట్టు నొకపట్టణముతరువాత

బయలు దేరును. దానికి నమృతసరమని పేరువచ్చెను. ఈగురువు స్వగ్రామమగు గాండ్వాలులోను, స్వనిర్మితమగు నమృతసరము లోనుగూడ నివసించుచు వచ్చెను. చక్రవర్తియగు నక్బరు కాశ్మీరమునుండి ఢిల్లీకిఁబోవుచు దారిలో గాండ్వాలువద్ద నొకనాఁడువిడిసి, రామదాసుతోఁ బ్రసంగింప నిచ్ఛగించి వానిని రావించెను. గురువు వచ్చుటయుఁ జక్రవర్తి వానిని మిక్కిలి గౌరవించి వాని కావించిన వేదాంతచర్చల కలరి యేదేనొక కోరిక గోరుమనెను. రామదాసు తన కేకోరికలు లేవని లోకులపక్షమునఁ దానొకవరము చక్రవర్తి నడుగఁ దలఁపుగలడని విన్నవించెను. చక్రవర్తి యావరము తప్పక నొసంగునట్లు వాగ్దానము చేయుటయు గురు విట్లనియె. "దేవరవారు లాహోరుపురమున నున్నకాలమున సరకు విశేషముగ విక్రయమగు చుండినందున ధాన్యాదులకు మంచిధరలుండెను. ఇప్పుడు దర్బారు లాహోరువిడిచినందున ధర మందమగును. దానివలన బంటకాఁపులు చెడుదురు. కావున నీసంవత్సరము సిస్తువసూలు చేయవలదని వేఁడు కొనుచున్నాను. చక్రవర్తి వానియుపదేశ మంగీకరించి దీనబంధు వగు నాగురుని వచనప్రకార మాయేఁడు కాఁపులవద్ద సిస్తుగై కొనఁ గూడదని యానతిచ్చి, పలు కానుకలిచ్చి గురువును వీడ్కొనెను. అట్లు రామదాసు సిక్కుమతము లోకమున వ్యాపింపఁజేయుచు నేడు సంవత్సరములు పీఠాధిపత్యము నహించి క్రీస్తుశకము 1582 వ సంవత్సరమునఁ బరమపద మొందెను. ఆతని గోలీ బీయాసునది యొడ్డున నున్నది.

---

## ఐదవగురువు—అర్జునుఁడు.

రామదాసుతరువాత పీఠ మెక్కిన గురువులందఱు రామదాసు సంతతివారే. ఈపీఠాధిపత్యము రామదాసు సంతతియందే నిలుచు

ధిపత్యమున కర్తయై యుండెను. పృధిచందునకుఁ గడుపుమంట తొంటి కన్న హెచ్చెను. ఎట్టకేలకర్జునుఁడు పిత్రార్జితములగు భూములు, ధనములు సోదరునకిచ్చి పీఠానివృత్తి చేసికొనెను.

జ్ఞాతి శత్రుత్వము వదలించుకొనియర్జునుఁడు సుఖంబున నుండఁ దలప సోదరునికంటెను నెక్కుడు బలవంతుఁడు వాని కంటె నెక్కువ హానిచేయగలవాఁడునగు చందూషా గురువునకు శత్రుఁడయ్యెను. చందుషా లాహోరునగరములో ఢిల్లిచక్రవర్తియొక్క మంత్రియై యుండెను. గురువునకు వానికిఁగల వైరకారణమిది. చందూషాకు మిక్కిలి చక్కని కూఁతురుండెను. ఆమెకుఁదగు వరుని దెచ్చి వివాహముసేయ నతఁడు సంకల్పించి యల్లునికొఱకు వెదకుచుండ నర్జునుని కుమారుడగు హరిగోవిందుడు సకలలక్షణ సంపన్నుఁడగు యర్హవరుఁడని వానికిం దెలిసెను తెలియుటయు నాతఁడు వాని సంబంధమున కంగీకరింపక బాలుఁడులక్షణసంపన్నుఁడైననేమి అర్జనుడు పకీరుఁడా? నేను వానితో వియ్యమొంది నీఁచపడుదునా? నేనొక మేడమీఁదిపై యంతస్థువంటివాఁడను. అర్జునుఁడు దానియడుగుననుండు మురికినీళ్ళ కాలువవంటివాఁడు గాదా" యని సమీపవర్తులతో బలికెను. అనంతరము కొన్నాళ్ళకు తన పుత్రికకు మంచివరుఁడు లభింపమి చందుషా హరిగోవిందుఁడే యనుకూలవరుఁడని వానికిగూతునీయదలచి ప్రధానముచేసికొనుట కర్జునునియొద్దకు వెలలేని కట్నములు కానుకలు పంపెను. చందుషా యంతకమున్ను పలికిన పలుకులు గురువునకొక్క పరిచారకుఁడు విన్నవించినందున గురువు కోపభూయిష్టుఁడై తన కుమారుఁడు చందూషాపుత్రికను బాణిగ్రహణము చేసికొనుటకు దగడని కానుకలం ద్రిప్పివేసి వెండియునిట్లనియె. "చందూషా చాల గొప్పవాఁడు నేను పకీరును. నాతో వియ్యమందుట కతనికి మతిపోయినదా యేమి."

అని సంభంధము నిరాకరించుటయు నావార్తలు విని చందూషా స్వయముగఁ బోయి గురునిదర్శనము జేసి బాంధవ్యమున కంగీకరింపుమని బహువిధముల వానిం బ్రార్థించెను. ఎన్ని విధముల బ్రార్థించినను గురువుతన మనోనిశ్చయమును దిప్పుకొనక వానిం గసరికొట్టెను. చందూషా మహాకోపోద్దీపితుడై గురునిపై మనమున నక్కసు్సబూని వాని కేదేని నపకారము జేయ సమయము వెదకుచుండి జహాంగీరు చక్రవర్తివద్దకుబోయి సీకు గురువు దేశములో నుండుట రాజ్యమునకు నష్టకరమని వానికి నచ్చచెప్పెను. చక్రవర్తి వానికొండెములు విని యర్జునుని దనయెుమటికి రావించి వానివలన రాష్ట్రమునకు భంగము లేదని గ్రహించి విడిచిపుచ్చదలంచుటయు చందూషా వానిని విడువగూడదని పట్టుబట్టి యర్జునుని దనస్వాధీనము చేసికొని తనయిచ్చవచ్చినట్లు వానిం జేయుటకు పాదుషా సెలవు గైకొనెను. పాదుషాయట్లు సెలవిచ్చుటయుఁ జందూషా యర్జునుని బ్రతికియుండగఁ దగులపెట్టింపవలయునని నిశ్చయించుకొనెను. గురువగు నర్జునుఁడు తనకు రాదలచిన ఘోరమరణము విని చెక్కుచెదరక భయపడక క్షమింపుమని చందూషాను ప్రార్థింపక సర్వసిద్ధుడై తగుల బెట్టకమునుపు నదిలో స్నానముచేయనిమ్మని వానికి వర్తమాన మంపెను.

చందూషా యర్జునుని కడపటి కోరికఁదీర్పఁదలఁచి రావినదిలో స్నానార్థము వాని నరుగనిచ్చెను. గురువు నదిలోమునిఁగియదృశ్యుఁడయ్యెను. ఇదిక్రీ॥ శ॥ 1607 సంవత్సరమున జరిగెను. గురువు దారుణమైన యగ్నిమరణముకంటె జల మరణమెక్కువ సహ్యముగ నుండునని తలంచి లోఁతునీట దిగి చచ్చియుండును. అనంతరము శిష్యులు వెదకి గురుని శవముం గనుఁగొని తెచ్చి దహనముచేసిరి. లాహోరు కోటయెుద్ద సుందరమైన సమాధియొకటి శిష్యులచేనిర్మింపబడి యిప్పుడొక పుణ్యక్షేత్రమయి యున్నది. ఈయర్జునుఁడే సీక్కుల వేదమని

చెప్పఁదగిన యాఁదిగ్రంథమును బ్రిస్తృతమున్న విధముగా బయటికిఁ దెచ్చెను. ఈ గ్రంథ మీాయన రచియింపలేదు. నానకు మొదలగు పూర్వగురువులు రచియించిన గ్రంథములను సంస్కరించి తాను కొన్ని భాగముల రచియించి యందుఁ జేర్చి దాని కాదిగ్రంథమని పేరుపెట్టెను. ఈ గ్రంథ రచన మిక్కిలి యుత్కృష్టము. శ్లాఘనీయము. ఏలయన సీకుమతమున కాధారమయిన ప్రధానగ్రంథ మేదియు లేక పోవుట యొక గొప్ప వెలితిగనుండెను. మఱియు నాలుగక్షరములు కూర్ప జాలిన జ్ఞానలవదుర్విదగ్ధులు కొందఱదివఱకే బయలువెడలి యర్థములేని పిచ్చిగీతములఁ గొన్నిఁటి నల్లి వాని కర్తృత్వము నానకున కారోపించి లోకమున నవి వ్యాప్తముఁ జేయుచుండిరి. అందుచేత నిజముగా గురువులు రచించిన భాగము లేవో తదితరులు వ్రాసిన భాగములేవో· నిరూపించుట యప్పటికే కష్టసాధ్యముగ నుండెను. అదికారణముగా శిష్యులు గురువగు నర్జునుని సన్నిధికింబోయి వానితో నిట్లు మనవి యొనర్చిరి. "స్వామీా! గురునానకు రచియించిన గీతములు వినినప్పుడు మనస్సు పరిశాంతమై భక్తి తత్పరమగును. ఇతర సాధువులనేకులు చాల పద్యములను స్వయముగ వ్రాసి వానికి నానకు పేరుఁ జేర్చిరి. ఆ పద్యములం జదువువారి హృదయముల భక్తి జనియింపమ సరేకదా మీాఁదుమిక్కిలి గర్వము కూడనంకురించును కావున భక్తుల కవిత్వ భేదములఁ దెలిసికొనుటకు నానకుపద్యముల కేనైన నానవాళ్ళు వేయుట సముచితము." అర్జునుఁడు వారి విజ్ఞాపన మాలకించి యట్టికార్య మావశ్యకమని తలంచి యా గ్రంథమును గూర్ప నారంభించెను. ఈ గ్రంథము గూర్చుటలో నర్జునునకు భాయి గురుదాసుభల్లుఁ డనుకవితా ప్రౌఢిమగల సీకు మతస్థుఁ డొకఁడుచాల సాయముఁ జేసెను.ఆది గ్రంథమునందు మొదటి యైదుగురు గురువుల భాషితములుఁ జేర్పఁబడియుండె నొకరి కవిత్వము

మఱియొకరి కవిత్వమని జనులు భ్రమింపకుండునట్లు చక్కఁగా నొనర్పఁ బడెను. అర్జునుఁడు నానకు రచియించిన పద్యములు మహల్లపలుని పద్యములని ప్రత్యేకముగా గురుతులుపెట్టి వ్రాసెను. మహల్లపలుఁడనఁగా ప్రథమగురువని యర్థము. అర్జునుఁడు, కబీరు మొదలగు నీశ్వర భక్తులచే రచియింపఁబడిన భక్తిరస ప్రధానములగు గీతములఁ గొన్నిటి నాది గ్రంథమునందుఁ జేర్చి యట్టివానికిఁ గృతికర్తల నామములు గురుతులుగా నదికెను. అనేక సంవత్సరములు పాటువడి యర్జునుఁడు గ్రంథమును ముగించిన పిదప సిక్కుల రావించి యిట్లుపదేశముఁ జేసెను. "సోదరులారా! ఈ యాదిగ్రంథమునం దేదిగలదో యది యంతయు మీ కాదరణీయము. ఇందులేనిది గురునానకు చేసినాఁడని నమ్మిక గలవారు మీకు దృఢముగాఁ జెప్పినను మీ కగ్రాహ్యమే యగును" ఆదిగ్రంథ నిర్మాణమే యర్జునుని జీవితమునందుఁ బ్రధానమయినది. అతఁడు కావించిన తదితర లోకోపకారములలో ముఖ్యముగాఁ జెప్పఁదగినవి తరంతమను గ్రామమునఁ ద్రవ్వించిన కోనేరొకటి. రెండవది యమృతసరమందుఁ ద్రవ్వించిన చెఱువు. తరంతర గ్రామ మమృతసరమున కేడుమైళ్ళదూరమున నున్నది. అర్జునుఁ డమృతసరమే తనకుఁ గాఁపురముగఁ జేసికొని యందు హరిమందిర మను పేరఁ జక్కని భవనమొకటి కట్టించెను. అతనికి నివాసస్థానమైనదాదిగ నమృతసరము తొంటియట్ల గుడిసెలతో నిండియుండక క్రమక్రమంబున మేడలకు మిద్దెలకు నిలయమై సిరులకు నెలవై యమృతసరనామము సార్థకముఁ జేసికొనెను.

ఈగురువునుగూర్చి చిన్న చిత్రకథ యొకటి కలదు. ఆకథఁ జదివినవారికి సిక్కుమతాచార్యులు పూజ్యులైన పురుషులయెడ నెంత వినయసంపత్తిఁ గలిగి మెలఁగుచుండిరో సులభముగఁ దెలియఁగలదు. ఈగురువు పీఠాధిపత్యముఁ జేయు కాలమున నానకుయొక్క కుమారు

లలో నొకఁడగు శ్రీచందుఁడు బ్రతికియుండెను. అర్జునుఁడు గురు పుత్రుని దర్శనమునకుఁ బోయి కాంచి వానియెడ మిక్కిలి ప్రపత్తి నెఱపి గారవించెను. ప్రసంగవశమున శ్రీచందుఁ డర్జునునితో నీగడ్డ మింతపొడుగుగాఁ బెంచితి వేమనెను. అనవుఁ డర్జునుఁడు నీపాదరక్షల మీఁది దుమ్ముఁ దుడుచుటకుఁ బెంచితి నని ప్రత్యుత్తరమిచ్చెను. విన యగర్భితమయిన యామేలిపలుకు విని కడునక్కజపడి శ్రీచందుఁ డిట్లనియె. "ఈవినయ సౌజన్యములే నీకును నీపూర్వాచార్యునకును నానకుయొక్క పీఠము నిప్పించినవి. మాగర్వమే మమ్మాపదవికి దూరముచేసెను."

---

## ఆఱవగురువు—హరిగోవిందుఁడు.

అర్జునుని యనంతరము వాని పుత్రుఁడగు హరిగోవిందుఁడు గురువయ్యెను. పీఠ మెక్కునప్పటికి హరిగోవిందుఁడు పదునొకండేండ్ల ప్రాయము కలవాఁడు. అతిక్రూరమయిన పితృమరణమునకు నతఁడు తద్దయు శోకించి తత్కారణుఁడయిన చందూషాయెడలఁ బగఁబూని తగు సమయము వచ్చినపుడు కసిదీర్చుకొనుటకుఁ గృతనిశ్చయుఁ డయ్యెను. ఆతని పినతండ్రియగు పృధివిచందుఁడు తాను గురువు కావలయునని మఱియొకసారి ప్రయత్నించెను; కాని సిక్కులందఱుఁ గట్టుకట్టి యైకకంఠ్యముగ వాని యాధిపత్యము వలదని నిరాకరించు టచే వానియత్నములు వ్యర్థములయ్యెను. అయినను బృధివిచందుఁడు తన పట్టినపట్టు విడువక చలపాదితనమూని తన యన్నను బీడించి నట్లె యన్నకుమారునిఁ గూడ నానాబాధలుఁ బెట్టఁదలఁచెను.

హరిగోవిందుఁడు తండ్రివలె మెత్తనివాఁడు గాక దేహ బలిము మనోబలముఁ గలవాఁడు కావున నేవెఱపులేక పీఠాధిపత్య

మున కష్టపెట్ట సంకల్పించిన వారితో సంధి జేసికొనక తుదవఱకుఁ బోరఁదలఁచెను. ఆతనియందు మతాచార్యునియం దుండవలసిన పవిత్రత ప్రజ్వలితభక్తి పట్టుదల మొదలగు లక్షణము లకుఁ దోడుగ శూరజన చిహ్నములైన బలసాహసము లుండుటచేత హరిగోవిందుఁడు స్వమతమును బోధనాధికముచేత వృద్ధిఁ జేయుట యె గాక నానకుయొక్క మతవ్యాప్తికి దేశకాలవిపర్యయములచేతఁ గావలసిన శౌర్యాదిలక్షణములను సిక్కులకుపదేశించి తన్నుఁ జూచి వారు నేర్చుకొనుట కవసరమై నప్పుడు పగవారితో మొనలుదీర్చి పెనంగొనుచు వీర విహారములు సేయఁజొచ్చెను. వయసు ముదిరిన కాలఁది హరిగోవిందుఁడు మంచిగుఱ్ఱపురౌతయి బల్లెమును బట్టుట లోను ఖడ్గమును ద్రిప్పుటలోను సాటిలేని నేర్పరియై యుద్ధములలో మొ నలుదీర్చుటలో గూఢోపాయములం బన్నుటలోఁ బ్రోడయై కడువేఁట తమకముఁ గలిగి యనుచరులకు హృదయానందము గలుగఁ జేయుచుం డెను. వేఁటయందు వాని కెంత తమకమో కాని యతఁడు స్వహ స్తములతోఁ జంపిన జంతువుల మాంసమును దినునప్పుడు మహానంద భరితుఁడై యుండువాఁడఁట. అట్టి తేజశ్శాలి యనుచరుల హృదయ ములలో శౌర్యాగ్నిపాడమి ప్రజ్వరిల్లుట యొక యాశ్చర్యములోనిది కాదుగద. హరిగోవిందుని శిష్యులగు సిక్కులు మొదటనుండియు మతమే ప్రధానముగాఁ జూచుకొను భక్తులయ్యు గురువుమార్గము ననుసరించి క్రమక్రమముగ వీరరస పూరితులై రణరక్తులై మెలంగఁ జొచ్చిరి.

జహాంగీరు చక్రవర్తికి గురువునందు మిక్కిలి గౌరవము జనిం చెను. ఊరక గౌరవము కుదుసుటయె కాదు. ఆచక్రవర్తి హరిగోవిందు నకు వశవర్తియై మెలంగెను. అట్లు మెలంగుటచేతనే గురువు తండ్రిని బలవన్మరణము పాలుచేసిన చందుషా యల్పకాలములోనే చక్రవర్తి

యాగ్రహమునకుఁ బాత్రుఁడై యాతని రక్షణము లేనివాఁడై దిక్కు మాలినవాఁడయ్యెను. అనఁగా హరిగోవిందుఁడు చందూషాను దనయిచ్చవచ్చిన తెఱంగునఁ జేయుటకు వీలు కలిగెను. అంతట కొద్దికాలమునకె దురాత్ముఁడగు చందూషాగృహముఁ దోఁచుకొనఁబడెను. అతఁడు నీచమైన మరణము నొందెను.

జహంగీరు కాశ్మీరమునకుఁ బోవుచు దనవెంట నీ సీకుగురువును దోడ్కొని పోయెను. హరిగోవిందుఁడు స్వతంత్రుఁడు నిర్భయ చేతస్కుఁడు నైనందున జక్రవర్తితో నప్పుడు సయితము నదురుఁ బెదురు లేక మాటలాడుచు వచ్చెను. ఆమొగలాయి దర్బారులో నున్నపుడు వానికి మహమ్మదీయ మతగురువులతో సీక్కు మహమ్మదీయ మతముల మంచిచెడ్డలుగూర్చి వాదములు సంభవించుటయు నతఁడు చక్రవర్తిని సరకుసేయక తురకగురువులకు జంకక తనయభిప్రాయమును నిర్భయముగఁ జెప్పుచువచ్చెను. అందుచేత జహంగీరునకు వానిమీఁద నాగ్రహము బొడమెను. అదియునుం గాక యీగురువు తనకు ముడుపులకానుకలరూపమున వచ్చు ధనమునకెవ్వరడిగిన లెక్కసెప్పక యథేచ్ఛముగా వ్యయము సేయుచుండును. వేఁటయందలి తమకము నానాటికి వానికి హెచ్చుఁజొచ్చెనే కాని డింపుపడదయ్యె. మతాభిప్రాయభేదములచేతఁ గలిగినకోపమున కీరెండు కారణములు నెపములు కాఁగా జహంగీరు గురుగోవిందునిఁ జెఱసాలలో బంధింపవలసినదనియు రెండులక్షల రూపాయలు ధనదండన మెప్పుడిచ్చు నప్పుడు విడుదలకావలసినదనియు నానతిచ్చెను. అంత మొత్తము లేనందున హరిగోవిందుఁడు గ్వాలియరు కోటలో బద్ధుఁడయ్యెను. ఈకోటలో గురువు పండ్రెండు సంవత్సరములు బందెయై యనేకకష్టములనుభవించెనని చెప్పుదురు. కడుపునిండనన్నములేదు. పండుకొనుటకు పానుపులేదు. మాటలాడుటకు మనుష్యుఁడులేఁ

డు. ఎంత పీడఁగలిగినను గురువు తొల్లిఁటియట్లె, పూనిక స్వతంత్రి భావము విడువక యుండెను. చక్రివర్తి దేహము మాత్రిమె గ్వాలి యరుకోటలో బంధించి శిష్యులగు సీకులకు వానిని గానఁబడకుండఁ జేయఁగలిగెనే కాని వారికి మహాగురువు నెడగల తీవ్రిమయిన భక్తి ని గౌరవమును లేశమైనను రూపుమాప జాలఁడయ్యె. గురువు కారాగృహ బద్ధుఁడయ్యెనను వార్త చెవిసోఁకుటతోడనే దేశమందలి నానాభాగముల నుండి సీకులు గ్వాలియరునకుఁ బోయిరి. పోయి నయనానందకరముగాఁ దమగురువుమూర్తిం జూడ లేకపోయిననువారువాని యున్నకోటకు దూరముననుండి సాష్టాంగ నమస్కారములఁజేసి వానిపాదముల మనంబుల ధ్యానించి వానివిమోచనమున కనేకవిధముల భగవంతునిఁ బ్రార్థించి స్వదేశముల కరుగుచు వచ్చిరి. ఎట్టకేలకు జహంగీరున కేమితోఁచినదో తెలియదు. కాని యతఁడు సీకు గురువును బంధవిముక్తినిఁ జేసెను.ఆకాలమున రాజకీయవ్యవహారములు సరిగానుండనందున పాదుషా సీక్కులకు నుపకారముఁ జేసిన పక్షమున వారుశత్రువులలోఁ గలియక తనపక్షమున నుందురని నమ్మి వారి గురువును విడిచి వారి చిరాభిలాషముఁదీర్చెను. ఆదినములలో మొగలాయిసేనల కధిపతియైన యుసాపుఖాను మొదలగు నుమ్మరావులు కొందఱు చక్రివర్తి కహితులయి వానిపై ధ్వజమెత్తఁ జూచుచుండిరి. ఇదిమనంబునం బెట్టుకొనియే చక్రవర్తి యీఘనకార్యము జేసెను. విముక్తుఁడై గురువు మాళవదేశమున కరిగి తన పూర్వవ్యాపారములె చేయనారంభించెను- ఈయారంభములోఁ గొంద ఱను చరులే బలంగముగా గల యీమతగురువు మహాసముద్రి తరంగములవలె తరుగని సేనలుగల ఢిల్లీశ్వరునితోఁ బోరవలసివచ్చెను.

ఇంతలో జహంగీరుమృతినొందుటయుషాజహానుసింహాసనమెక్కుటయు సంభవించెను. షాజహానునిపెద్దకొడుకగు దారా పంజాబు దేశ

మునకుపరి పాలకుఁడుగ నియమింపబడెను. అప్పుడుహరిగోవిందునిశిష్యు డొకఁడు తురుష్కస్థానమునుండి తనగురువునకుసమర్పింప నుత్తమజాతి గుఱ్ఱములను గొన్నింటిఁదెచ్చెను. కాని యవి గమ్యస్థానమునకుఁ జేరక ముందే చక్రవర్తిగారికిఁ గావలసి యుండినవను నెపమున మార్గమధ్యమున మహమ్మదీయ సేవకులచే నపహరింపఁబడెను. గురువు దుస్సహమైన యీపరాభవమును భరింపఁజాలక తీవరపడి దానికిఁ దగుప్రతీకారముం జేయఁదగిన యదను వెదకఁజొచ్చె. తురకలచేతఁ బట్టువడిన గుఱ్ఱములలో నొకటి లాహోరు న్యాయాధిపతియైన ఖాజీకి సమర్పింపఁబడెను. మహమ్మదీయ ప్రభుత్వములో ఖాజీలే మనకు జడ్జీలుగా నుండిరి. ఆగుఱ్ఱము కుంటిది యయినను గురువు విశేషధన మిచ్చి దానింగొనఁ బ్రయత్నించెను. బేరము ముగిసినపిదప గురువు వెల యిచ్చి దానినిఁ దీసికొనఁడయ్యె. అప్పుడు సీకుగురువు తన్నెగతాళి సేయుటకై కుంటిగుఱ్ఱము నిమిత్త మంతధనము నిచ్చునట్లు బేరమాడెనని ఖాజీ తెలిసికొని వానియెడ నలుక వహించెను. ఈయలుక మఱియొక కారణముచే ద్విగుణీకృత మయ్యెను. ఖాజీ కుమార్తె యగు కవెలాన్‌బీబీ హరిగోవిందుని మోహించెను. అది తండ్రి మెఱిఁగి నివారింపఁ బ్రయత్నింప నామె హరిగోవిందుని శరణు వేఁడెను. ఖాజీ మహాకుపితుఁడై తన పరాభవము దీర్పుమని చక్రవర్తిని వేఁడుకొనెను. ఆయన యేడువేల సైనికులను హరిగోవిందుని బట్టుకొను నిమిత్తమంపెను. ఆసైన్యముయొక్క రాక విని గురువు తన సీకు మూఁకలఁ గలియఁగట్టుకొని యెట్టెటో యైదువేలమందిని చేర్చి మొగలాయిసేనతో యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. అమృతసరమునొద్ద నుభయసేనలకు సంకులసమర మయ్యెను. అతిసాహసులగు సీక్కుల పరాక్రమము ముందర మహమ్మదీయుల ధైర్యస్థైర్యములు ఝంఝానిలము ముందరి మేఘముల ట్లయ్యెను. పరాజితులైన మొగలాయి

సైనికులు లాహోరునకుఁ బాఱిపోయిరి. విజయులైన సీక్కులు వారిని వెన్నంటి తరిమితరిమి యనేకుల దుత్తునియలుగా ఖండించిరి. కలహహేతువైన కవలాన్‌బీబీ హరిగోవిందుకడనే మరణానంతరము వఱకు నుండెను. ఆమె నతఁడు వివాహమయ్యెనని తోఁచెడిని- అందుచేతనే గాఁబోలతఁడు ప్రియురాలిపేర కవలాన్ సరస్సను నొకకోనేరు నమృతసరఃపట్టణమునఁ ద్రవ్వించెను.ఇదియైన కొన్నిదినములకే హరిగోవిందుని శిష్యుఁడొకఁడు చాలకాలము దేశద్రిమ్మరియై తిరుగుచున్న చక్రవర్తి తన గురువు గుఱ్ఱములనుహరించినందుకుఁ బ్రతీకారముగా మరలఁ జక్రివర్తిగుఱ్ఱముల రెంటి నపహరించి తెచ్చెను. దైవవశమున నీరెండుగుఱ్ఱములు దొల్లిగురువు నిమిత్తము తురుష్కస్థానము నుండి శిష్యుఁడొకఁడు తెచ్చిన హయములలోనివే యయ్యెను.

ఈవార్త విని తతోఁడనే మొగలాయి దర్బారు కోపాగ్నిచే ప్రజ్వరిల్లెను. వెంటనే యిరువురు తురకసేనాపతులు మహాసేనాసమేతులై గురువునకు బుద్ధిచెప్పుటకు వచ్చిరి. అది యెఱింగి హరిగోవిందుఁడు సమరసన్నాహముఁ జేసెను. రెండుమొనలకు సందడికయ్యమయ్యె. మరల మొగలాయీలకుఁ బరాజయము సీకులకు జయముఁ గలిగెను. తురకసేనలు సీకులకు వెన్నిచ్చి ప్రాణభీతి లాహోరునకుఁ బరుగెత్తెను. సేనానులిరువురు సీకులచే రణనిహతులైరి. అనంతరము గురువు తనపేర నిర్మింపఁబడిన హరిగోవిందు పురమునకుఁ జనియె. అక్కడ చందూషా బంధువుఁడొకఁడు గురువును గడతేర్పఁ బ్రయత్నించెను. ఈ ప్రయత్నములో నతఁడె యమపురమున కతిథి యయ్యెను.

అనంతరము హరిగోవిందుఁడు కొంతకాల మిక్కడ నక్కడఁ దిరిగి యమృతసరమునకుఁ బోయెను. వెంటనే వానికిఁ బగతురతోఁ

బోరాటము సిద్ధమయ్యెను. ఈగురుని యనుచరులలో ముఖ్యుఁడు పైండాఖానను నొక పఠానుతురక. వానితల్లి చిన్నపుడు గురువును చాలిచ్చి పెంచెను. అది కారణముగా గురువు వానిని నమ్మిన బంటుగా నేలుకొని తద్దయు నాదరించె. పఠానుఁడు నట్లె గురువునెడఁ బ్రియభృత్యుఁడై వానికనుసన్నల మెలంగుచుండెను. అటులుండ నొక్కనాఁడు హరిగోవిందుని పెద్దకుమారుని పెంపుడుడేగ పఠానుని యింట వ్రాల నతఁడు దానింబట్టి దాఁచె. గురుపుత్రుఁడు వానికడకుఁబోయి దాని నిమ్మని యడిగెను. అక్కఱకుతురక మొదట డేగ తనకడలేనే లేదని నొక్కిపలికి యెట్టకేలకు తనకడ నుండెననియుఁ దానినిచ్చుటలేదనియు గరువముతోఁ బలికెను. హరిగోవిందుఁడు తురకను దౌర్జన్యమునకు దండింపవలయునని సంకల్పించెను. కానియీ తలంపు నెరవేరకమున్నె పఠానుఁడు ఢిల్లీకిఁబోయి చక్రవర్తితోఁ దనపరాభవము విన్నవించుకొని కొంతసేన నిచ్చిన గురువుం బట్టి తెచ్చునట్లుఁ బ్రతినఁజేసెను. చక్రవర్తి వానికోరికను దీర్చి కొంత సేన నిచ్చె. హరిగోవిందుఁ డాసేన నెదుర్కొనెను. ఆదళంబులకు పోరు ఘోరంబుగ జరిగెను. ఎప్పటియట్ల విజయలక్ష్మి హరిగోవిందుని యధీనమయ్యెను. నాఁడు తురక లనేకులు గురుని ఖడ్గమున కెఱయైరి. అందు పైండాఖాను ముఖ్యుఁడు. ఈయుద్ధమున శత్రుసైనికుఁ డొకఁడు భయంకరముగఁ గత్తిదూసి గురునిమీఁదఁ బడియె. గురు వా వేటుం దప్పించుకొని నవ్వుచు ఖడ్గమెత్తి "ఓరీ! దెబ్బకొట్టుట యట్లు గాదు. ఇదిగో నిట్లుసుమీ" యని యొక్కవేటున వానిని రెండుతునియలుజేసి తన పాదములముందరఁ బడవేసెను. ఈగురుని చరిత్రమును వ్రాసినవారిలో నొకఁ డీసందర్భమున హరిగోవిందుఁడు కోపావేశమున శత్రువును జంపలేదనియు శిష్యులకన్నివిద్యలు నేర్పుటయే గురుధర్మమగుటచే గురువైన యాతఁడు

 

ఖడ్గకౌశలక్రమమును శిష్యులకు నేర్పుటకే యట్లు చేసెననియు వ్రా
సెను. క్రొత్తగాఁ గలిగిన యీ జయమునకు గురువు సంతసింపక
చక్రవర్తి-వలన మఱిమఱి యుపద్రవముల కది హేతువగునని గని
పెట్టి యాదారుణకర్మముల నేవగించి ప్రశాంతచిత్తుఁడై చరమావస్థ
నిర్మల ప్రదేశమున భగవత్కైంకర్యమునందు వేదాంతగోష్ఠియందుఁ
గడుపఁదలఁచి కొంతకాల మొకగ్రామమున నుండి యచ్చోటువాసి
పర్వతప్రాంతముల కరిగెను. అచ్చట శతధ్రువు నదికిం దూర్పుటొ
డ్డుననున్న కీర్తి-పురము దనకుఁ గాపురముఁ జేసికొనియెను. ఆయూ
రనే హరిగోవిందుఁడు జీవితాంతమువఱకుఁ గాఁపురముండి సీకుమతము
వ్యాపింపఁ జేసి నలువది యెనిమిది యేండ్ల ప్రాయమున క్రీ॥ శ॥
639 వ సం॥న సిద్ధిపొందెను.

అతనిఁ గొందఱు వేదాంతియందురు. కొందఱువానిని బహు
దేవతాభక్తుఁ డందురు. ఎవ్వరేమనుకొన్న నతఁడు సీకుమతమందు
దృఢమైన విశ్వాసముఁ గలవాఁడనియుఁ దన జీవితము దాని కేధార
వోసెననియుఁ జెప్పవచ్చును. హరిగోవిందున కైదుగురు కుమారు
లుండిరి. వారి నామధేయము లివి. 1 గురుదత్తుఁడు, 2 తేజబహ
దూరు, 3 సూరతసింగు, 4 అనిరుద్ధుఁడు, 5 ఉత్తులరావు, పెద్దకొ
డుకు హరిగోవిందుఁ డుండఁగానే కాలధర్మమునొందెను. ఆతనికొక్క
కొడుకు కలఁడు. వానిపేరు హరరావు. తండ్రిలేని బిడ్డయగుటచేత
హరిగోవిందుఁడు వాని నెక్కువ గారాబముతోఁ బెంచి వానికే య
నంతరమునఁ బీఠమిచ్చెను.

---

## ఏడవగురువు — హరరావు.

గురుహరరావు శాంతస్వభావుఁడు. నిరంతర మీశ్వరధ్యాన
తత్పరుఁడు. ఎల్లవారితో మైత్రియే పాటించెను గాని కలహమున

కష్టపడఁడు. తన జీవితకాలములో నొక్కసారిమాత్రమే యతఁడు లౌకికవ్యవహారములఁ బ్రవేశించెను. ఢిల్లీసింహాసనము కొఱకు షాజహానుని పెద్దకొడుకు ధర్మస్వరూపుఁడునగు డారా మీఁదికి దుష్టశీలుఁడగు నౌరంగజీబు దండెత్తినప్పుడు హరరావు డారాకు సహాయముఁ జేసెను. యుద్ధములో డారా యోడిపోయిన పిదప నౌరంగజీబు రాజ్యప్రతిష్ఠితుఁడయి హరరావును బెదరించి వాని పెద్దకుమారుండగు రామారావును తనయొద్ద జామీనుగా నుంచవలసినదని యాజ్ఞాపించెను. చక్రవర్తి నెదిరించుటకుఁ దగిన మనోధైర్యము గాని, ధనముగాని, సైన్యముగాని లేనందున హరరావువిధి లేక తన జ్యేష్ఠపుత్రుని ఢిల్లీదర్బారునకుఁ బంపెను. రామారావు దర్బారునకుఁ బోయినప్పుడు చక్రవర్తి వానిమాటలపొందికకు సౌజన్యతకుఁ జాల సంతసించి యాగ్రహమువిడిచి హరరావు మతగురువేకాని యుద్ధప్రియుఁడైన వీరుఁడు కాఁడని నమ్మి యాకుమారునకు విలువగల వస్త్రాలంకారములు బహుమానముచేసి తగినపీఠమిచ్చి దర్బారులో నిలిపి గౌరవించెను. హరరావు క్రీ॥ శ॥ 1863 సంవత్సరమునఁ గీర్తిపురమందుఁ గాలధర్మమొందెను. అతఁడు మృతినొందకమునుపే తనకనిష్ఠపుత్రుని హరి కృష్ణునిఁ (హరికిసన్) పీఠాధిపత్యమున నియమించెను.

---

## ఎనిమిదవగురువు—హరికృష్ణుఁడు.

---

తండ్రిపోవునప్పటికి జ్యేష్ఠపుత్రుఁడగు రామారావు ఢిల్లీలోనే యుండెను. జ్యేష్ఠుని దన్నువిడిచి కనిష్ఠునకు గురుపదవి తండ్రియిచ్చినందుకు రామారావు మిక్కిలి కినిసి తనకుజరిగిన యన్యాయమును జక్రవర్తితో మొఱబెట్టుకొననతఁడువానియందనుగ్రహముకలవాఁడై తత్క్షణము తనదర్బారునకు రావలసినదని గురువగు హరికృష్ణున కా

జ్ఞాపించెను. గురుపదము నందుట ప్రపంచక భోగము లనుభవించుటకు, నధికారములు చేయుటకు ననుకొని, యది తనకు లభింపలేదని విచారించి దానివిషయమై విశ్వప్రయత్నము చేయుటచేతనే రామారావట్టి పదవి కనర్హుఁడని చెప్పవచ్చును. అతని కాపదవి నీయక చిన్నకొడుకున కిచ్చుటలోఁ దండ్రి న్యాయముగా నడచు కొనెననియే మన మూహింపవలయును. హరికృష్ణుఁడు పీఠ మెక్కినప్పటి కేడేండ్ల ప్రాయమువాఁడయినను వానిమొగము కలకలలాడుచు జ్ఞాన తేజస్సుతో నిండియుండెను. ఆతఁడువచ్చి యెదుట నిలువ నౌరంగజీబు చక్రవర్తి వానిముద్దుమొగమును జూచి, ముద్దులుమూటగట్టు మాటలను విని, వాని యందు పక్షముగలవాఁడయ్యెను. ఈపక్షపాతమునకుఁ దోడుగా హరికృష్ణుని తెలివియే వానికి గొప్పసాయముఁ జేసెను. ఈ తఁడు బాలుఁడగుటచేఁ జక్రవర్తి వానినొకసారి యంతఃపురమునకు బిలిపించియంతఃపురస్త్రీల నందఱఁ జూపి తనపట్టపుదేవి యెవ్వరో చూపుమని యడిగెను. హరికృష్ణుఁ డదివఱకెన్నఁడు జూడకపోయినను జక్రవర్తిభార్యను దప్పక చూపెను. తనయంతిపురమైన నెన్నఁడు చూడని యాబాలుఁడు బుద్ధిసంపదచేఁదనపట్టపుదేవిని నిరూపించినందు కాశ్చర్యమునొంది చక్రవర్తి యతఁడే పీఠాధిపత్యమునకుఁ దగినవాఁడని శాసించెను. ఇట్లు చేయుటకుఁ గారణాంతరముఁగూడ కలదు. ఏదియైన హరికృష్ణుని తల్లివలె రామరావుతల్లి సత్కులసంజాత కాదు. ఢిల్లీశ్వరున కనుగ్రహము గల్గినను జగదీశ్వరునకు వానిమీఁద ననుగ్రహము లేకపోయెను. ఆకాలములో ఢిల్లీనగరములోఁ బ్రబలియుండిన మశూచికవ్యాధి యాబాలగురువున కగపడి యచిరకాలమున వానిఁ దన పొట్టఁబెట్టుకొనియె. ఆతని శరీరము ఢిల్లీలోనేయమునాతీరమునదహనముచేయఁబడెను. ఆచోట నిపుడొక చిన్నసమాధి యున్నది. చనిపోవునప్పటికి హరికృష్ణుఁడు తొమ్మిదిసంవత్సరములవాఁడు.

## తొమ్మిదవగురువు — తేజబహదూరు.

—०ॐ०—

ఈయన సీకుల యాఱవగురువగు హరిగోవిందుని రెండవకుమారుఁడు. ఈతఁడు బుకాలాయను గ్రామమున వాసము సేయుచుండెను. ఎనిమిదవగురువగు హరికృష్ణుఁడు మృతినొందునప్పుడు తదనంతరగురువెవ్వఁడని యడుగఁగా నాబాలుఁడు "బాబాబుకాలా" యనిపల్కెనఁట బుకాలాగ్రామమందు కాఁపురముండు జనులందఱు సీకులే. బాలగురువుయొక్క కడపటిపలుకులు తెలిసినతోడనే యాగ్రామమందున్న ప్రతిసీకుమతస్థుఁడు గురుపీఠముఁ దనకే హరికృష్ణుఁ డీయ నుద్దేశించినాఁడని చెప్పి తక్కినవారితో వివాదపడఁజొచ్చెను. గ్రామమంతటఁ గలవరము బయలుదేఱెను. తేజబహదూరప్పటికే చాల వయసుగడచినవాఁ డయినందునను, మొదటినుండియు నతఁడు లౌకికవ్యాపారములయందు విశేషముగా మనసు నిలుపక యీశ్వరభక్తితత్పరుఁడయినందునను దక్కినసీకులవలెఁ దాను పీఠ మాక్రమించుకొనుటకు ప్రయత్నములు సేయక నిర్మల మనస్కుఁడై యుండెను. మతమునకు గురు వేర్పడలేదని నానాభాగములనుండు సీక్కులు విచారింపఁజొచ్చిరి. అప్పుడు ఢిల్లీలోఁ గాఁపురముండెడు మఖానుషాయను సీకుఁ డొకఁడు వివాదముఁ బరిష్కరింపఁదలఁచి యెవరు గురువగుదురో వారి కిచ్చుటకు విలువగల కానుకలను దీసికొని బయలువెడలి బుకాలాగ్రామమునకుఁ బోయెను. అక్కడ సీకులందఱు వానిచుట్టుం జేరిరి. "పీఠాధిపత్యము నాకు రావలయు నాకు రావలయు. బాబా బుకాలా యనఁగా నేనే. నేనే" యని ప్రతిమనుష్యుఁడు తనమాటనే చెప్పుకొనసాగెను. ఆవివాదముల కంతము లేకపోవుటచే మఖానుషా "వెనుకటి గురువు కడపటి పలుకులు సరిగాఁజెప్పఁడు. అవి విని నేను పరిష్కరించెద"నని పల్కి యాపలుకు లప్పుడు సన్నిధానవర్తులగు మనుష్యులవలన

వీని యిట్లనియె. "వెనుకటి గురువుమాటల కర్థము మీకు తెలియలేదా? బాబా బుకాలా యనఁగాఁ దన పినతాతయగు తేజబహాదూరుఁడని వెనుకటిగురువుగారి యర్థము. కాఁబట్టి యతఁడే మనకు గురువు" అని వెంటనే తేజబహాదూరునికడకుఁ బోయి మఖానుషా "నీవ మా గురువు" వని వానితోఁ జెప్పి తాను తెచ్చిన వెలలేని కానుకల వానికి సమర్పించెను. అతఁడా కానుకలను గ్రహింపక పీఠాధిపత్యము తన కక్కరలేదనియెను. కాని మఖానుషా తనపట్టువదలక యాతని నెట్ట కేలకొడంబరచెను. అనంతరము పట్టాభిషేకమహోత్సవము మహా వైభవముతో జరిగెను. దేశమందలి సిక్కులందఱు వానిని గురువుగా నంగీకరించి కానుక లంపిరి. పూర్వగురువునకుఁ బరమశత్రుఁడైన రామారా వప్పటికి ఢిల్లీలోనేయుండి తేజబహాదూరు పీఠమెక్కుట విని మహాదుఃఖము నొంది ధీరమాలుఁడను మిత్రుని సాయముబడసి తేజబహాదూరునిమీఁద నక్కస్సుఁ బూనెను. అట్లుండి యొకసారి యాతఁడు మిత్రసహితముగా నొక చిన్న సేనం గూర్చుకొని తేజబహాదూరుని గృహము దోఁచుకొనఁబోయెను. కయ్యముఁ జేయుట కిష్టము సామర్థ్యముఁగూడ లేనందున గురువగు తేజబహాదూరు తనయూరు విడిచి యమృతసరముఁ బాఱిపోయెను. పూర్వసిక్కులచేత స్థాపింపఁబడిన దేవాలయ మొకటి యక్కడకలదు. ఆకోవెల యధికారులు సహితము దేజబహాదూరునిపై నిష్టములేనివారై వానిని గుడిప్రవేశింపనీయరయిరి. అంతలో మఖానుషా మరల గురుదర్శనార్థము వచ్చినందున గురువు వానింజూచి యీర్ష్యచేఁ గొందఱుసిక్కులు తన్నుబాధించి దోఁచుకొని బ్రాణములఁదీయ నుద్యుక్తులై యుండిరనియు నందుచేఁ దనకు స్వదేశము విడిచికొంతకాలము దేశాటనము జేయఁదలంపు కలిగినదనియు నాతనితోఁ జెప్ప నాతఁడును మంచిదని కొంతపరివారమును వెంటఁబెట్టుకొని గురువుందీసికొని ఢిల్లీనగరమునకుఁబోయెను.

అక్కడ రామూరావు చక్రవర్తియగు నౌరంగజీబు నను గ్రహంబునకుఁ బాత్రుఁడై యుండి గురువుమీఁద నేవో కొండెములు చెప్పి యాతని మనసు విరిచెను. అంతట చక్రవర్తి తేజబహదూరు తన సన్నిధికి రావలసినదని యుత్తరువువ్రాసి పంపసిద్ధముగ నుండఁ గొందఱు కొలువుకాండ్రదియెఱింగి "నీకు గురువు మతబోధకుఁడే కాని లౌక్యుఁడు కాఁడు. నిరపరాధి" యని విన్నవించి యప్పటి కాపదఁ దొలఁగించిరి. ఈయాపద గడువంబెట్టిన మహాత్ముఁడు రాజపుత్ర శిఖామణియగు జయపురమహారాజు. ఆమహారాజు తదవసరమున నాసాము దేశమునకు సేనాసమేతుఁడై చక్రవర్తిపనిమీఁదఁ బోవుచు నీకు గురువునుఁ దనవెంట రమ్మని పిలిచెను. తేజబహదూరు తనకుటుంబమును బాటలీపురమున విడిచి యామహారాజుతోఁ జని కొంతకాల మాసాము దేశమును గొంతకాలము బంగాళమునుదిరిగి క్రీ. శ. 1667 వ సంవత్సర ప్రాంతమున, మరల స్వదేశమున కరిగెను. పాటలీపురమున నున్నపుడే దేజబహదూరు భార్య గురుగోవిందను కొడుకుం గనియెను. అక్కడ నుండఁగా వెండియు రామూరావు ప్రేరణమున నౌరంగజీబు తన్ను హాజరు కమ్మని యుత్తరువు పంపినట్లు విని దేజబహదూరు స్వగ్రామము విడిచి సట్లెజి (శతద్రువు) నదీ తీరమందు నొక చిన్నగ్రామము నైదువందలరూపాయల వెలకుఁగొని యందుఁ గాపురముండెను. అతఁడా గ్రామమునకు ముఖోదేవి యని పేరు పెట్టెనుగాని యిటీవల దాని కానందపురమను నామము కల్గెను.

ఆయూరఁ గాఁపురమున్నది మొదలు దేజబహదూరు తన పూర్వశాంతపద్ధతిని విడిచి, తండ్రియగు హరిగోవిందునివలెనే "ఇదం బ్రాహ్మ్య మిదంక్షాత్రి" మను మాటనిజముగా బ్రహ్మజ్ఞాన సంపత్తికిఁ దోడు పౌరుషముఁ జూపఁ జొచ్చెను. ప్రాఁత పగతుఁడగు రామూరావు కతమునను, మాటిమాటికి వేధించు మహా

మ్మదీయుల కతమునను గురువు సహజశాంతమును విడువవలసివచ్చె. అటులుండ రామారాయపేరిరితుఁడై చక్రవర్తి మరలఁ దన సమ్ముఖమునకు రావలసినదని యాతని కుత్తరువు పంపెను. గురువు వెళ్ళుటకు వీలులేదు. వెళ్ళకుండుటకు వీలులేదు కదా! వెళ్ళినచో సహజముగా సీకుమతముపై నతి ద్వేషముకలిగి నిరంతరము రామారావు చెప్పుకొండెముల నాలకించుటంజేసి యతిక్రోధముం బూనియున్న చక్రవర్తి తన్నుంబ్రతుకనీయఁడని యాతఁడు స్పష్టముగ నెఱుఁగును. వెళ్ళకున్నచోఁ దొలుదొల్తనే చంపించునని యంతకుమున్నె యెఱుఁగును. కాబట్టి యాతఁడు భయపడుట బ్రతిమాలుకొనుట యనుచితములనుకొని శిష్యులం జేరఁబిలిచి "మనలో కొందఱు ప్రాణత్యాగములు చేసినంగాని యీ చక్రవర్తి దారుణ పరిపాలనము తుదముట్ట" దని వీరరసావిష్టుఁడై పలికెను. అప్పలుకులు విని దాపుననున్న పుత్త్రుఁడు గోవిందసింగు తండ్రి కిట్లనియె. "దేవా! అంతటి సత్కార్యమునకు దేవరవారి ప్రాణత్యాగమే వినియోగించునుగాని తదన్యుల ప్రాణపరిత్యాగము కార్యకారియగునా" అప్పలుకులు విని తేజబహదూరు తత్క్షణమే బయలుదేఱి సపరివారంబుగ ఢిల్లీకిఁ జని క్రీ॥శ॥1680 వ సంవత్సరమున స్వమత సంరక్షణార్థము మహమ్మదీయ చక్రవర్తి క్రోధానలంబునకుఁ దనశరీర మాహుతిగాఁ జేసెను. గురువు దారుణమరణము నొందినను స్వల్పకాలమునందే యా మహాత్ముని శరీరత్యాగము ఫలించినదో యనునట్లు మొగలాయి చక్రవర్తుల దుష్పరిపాలన మడుగంటెను.

---

## పదియవగురువు.

---

### గురుగోవిందుఁడు—బాల్యము.

తేజబహదూరు రాజపుత్రులతోఁగలిసి యాసాము దేశములోఁ దిరుగు నాపదలోనున్నను దనకర్తవ్యకృత్యముల మఱవక జనుల మానస

క్షేత్రములు సారవంతములై యున్నవని తోఁచినచోట్లఁ దన మత బీజముల నాటుచుఁ గృషిచేయుచుండ నాతనిభార్యయగు 'గుజరీదేవి' గోవిందసింగను పుత్రునింగనియె. ఈ కుమారసింహమె పంజాబుదేశ మున మత, సాంఘిక, రాజకీయ విషయములందు వెనుకటిస్థితినిఁ దల క్రిందుచేసి సిక్కుమతసౌధము మహమ్మదీయుల మహాద్వేషవాయువు లచేఁ బడకుండ నిలిపిన శిలాస్తంభములలోఁ నొకఁడయ్యెను. స్వ సౌఖ్య పరిత్యాగము, కావలసివచ్చినయెడల ప్రాణత్యాగముజేసి ధర్మమార్గముల విడువని మహాపురుషులు దేశమును విపత్సముద్రము నుండి యుద్ధరింపఁగలరని యీ మహాత్ముని చరిత్రము చదివిన వా రందఱకుఁ దేటతెల్లమగును.

గురుగోవిందుఁడు క్రీ॥శ॥1663 సంవత్సరమున నొకశనివారము రాత్రి నాలుగవజామున జన్మించెను. ఆసామునకుఁ బోవునప్పుడు తేజబహదూరు నిండుచూలాలగు భార్యను పాటలీపురమున విడిచి తనకుఁ గుమారుఁ డుదయించెడు పక్షమున నాతనికి గోవిందుఁడని నామకరణముఁ జేయవలయునని యానతిచ్చెను. నానకు జననకాల మున కానఁబడినట్లె గోవిందుని జన్మసమయమునం గూడ ననేక మహాద్భుతములు పొడగట్టెనఁట. ఆయనచరిత్రములు వ్రాసినభక్తు లామహాద్భుతములను పరమాణువును బ్రహ్మాండముగఁ జేసి వానిని నమ్మి విశేషముగా వర్ణించియుండిరి. కాని మనమాకథలను నమ్మ నక్కరలేదు. నమ్మకపోయినను గోవిందసింగు చరిత్రము నందు మాత్రము గానఁబడునవలోకసామాన్యములునసన్యసాధ్యములునగు మహాకార్యములను జూచి నవనాగరికులమయిన మనముకూడ లోలో నాశ్చర్యము నందకపోము. తలిదండ్రులు దృఢశరీరులగుటచే నాతఁ డారోగ్యముగల దృఢకాయముఁ గలిగి పుట్టి యేపుగాఁ బెరిఁగెను. తల్లిపాలు విడిచి తోడిబిడ్డలతో నాడుకొన నేర్చినది మొదలు గోవిం

 

డుఁడు తన వంశమునకు ననురూపములగు తెలివి తేఁటలను సుగుణ సంపదను వ్యక్తముచేయ సాగెను. ఆడుకొనునప్పుడే యతఁడు తన సహకారులను రెండుకక్షులుగాఁ దీర్చి పురికొల్పి యొకనితో నొకరిఁ బోరాడించుచుండును. ఈ కృత్రిమ యుద్ధములలోఁ దఱుచుగాఁ బోరాటములు తీవ్రముగానె జరుగుచు వచ్చినను గోవిందుఁడే యెల్ల పుడు విజయము నందుచువచ్చె. ఒకప్పు డతఁడు విల్లు బాణములు తుపాకులు లేకపోయినను స్వయముగా నట్టివిచేసికొని తోడి బాల కుల వెంటఁబెట్టుకొని వారి కాయాయుధములిచ్చి యడవికిఁజని వేఁట సేయును. గోవిందుఁడు తఱుచుగా నుపయోగించునది వడిసేల. ఆతఁడు చేతికొలఁది దానిందిప్పి రాయి విడిచెనా యాదెబ్బ తగిలి యొకటిరెండు పక్షులు నేల రాలవలసినదే. వేరొకప్పుడు గోవిందుఁడు ధర్మాధిపతిగఁ గూర్చుండి బాలకుల వివాదములఁ బరిష్కరించి తప్పులు చేసినవారికి దండనలు విధించి మెప్పులుగన్న వారికి బహు మానము లిచ్చుచుండును. బాల్యచాపలముచేత నాతఁడు కావించిన యా సాహసకృత్యము లప్పుడప్పుడు దుండగములగుచు వచ్చినందున యిరుగుపొరుగు వారికి బాధలు కలుగుచువచ్చెను. ఆతని వడిసేల దెబ్బ నెత్తినిఁబెట్టి తెచ్చుకొను నీటి కడవలకు తగులుటయు నవిపగిలి పోవుటయు సంభవించుచు వచ్చినందునఁ బొరుగువారు గోవిందుని తల్లికడకుఁబోయి జగడములాడుచువచ్చిరి. గుజరీదేవి కుమారునిఁ గఠినముగా మందలించి వారింబ్రతిమాలుకొని పంపుచుండును. గోవిం దుఁడు భీతియనుమాట నెఱుఁగని ధైర్యశాలి. ఆతని ధైర్యమెట్టిదో తెలుపుటకొక చిన్నకథగలదు. అతఁడొకనాఁడు సంగడికాండ్రం గలిసి యాడుకొనుచుండ నక్కడికిఁ జాటలీపురమేలు ప్రభువువచ్చెను. ఆ ప్రభువు సేవకులు మునుముందు పరుగుపరుగునవచ్చి బాలకులతో నిట్లనిరి. "ప్రభువుగారు వచ్చుచున్నారు. అందఱు సలాములు

సేయుఁడు." అప్పలుకులువిని గోవిందుఁడు "వద్దువద్దు. వెక్కిరించుఁడు వెక్కిరించుఁ"డని యానతిచ్చెను. యుక్తాయుక్తమెఱుఁగని బాలకు లందఱు తత్క్షణమే వానియాజ్ఞాప్రకారము జేసిరి. ఆ ప్రభువు తన యెడలసంత బండతనముజూపిన యా బుడుతల నేమిసేయనగునని యోచించుచుండగనే నిమేషకాలములో వారందఱు నానాభాగముల కుం బరుగెత్తిరి. చిన్నపిల్ల లేకాలమందైనఁ జిన్నపిల్ల లేకదా. ఔచిత్యము వయసు వచ్చినకొలఁది హెచ్చును. ఎవని గుణాగుణంబులను కాని బాల్యక్రీడలంబట్టి మనము నిర్ణయింపరాదు. విద్యాబుద్ధు లబ్బినపిదప మనుష్యుని నడతె యిట్టిదని నిర్ణయింపనగును.

---

## వివాహము.

గోవిందసింగున కేఁడవయేఁటనే వివాహమయ్యెను. ఈ వివాహమునకు తేజబహదూరు తనరాఁబడికి మించిన సొమ్ము వ్యయముచేసి యతివైభవము జరిపెను. గోవిందుని మామ క్షత్రియుఁడు. ఆయన పేరు హరజీమల్లుఁడు పెండ్లికూఁతురు పేరు జేతు. వివాహము వేదమంత్రపఠన పూర్వకముగా బ్రాహ్మణులచేతనే చేయింపఁబడెను. ఇది యతిబాల్యవివాహము. పెండ్లికుమారునకే యేఁడేండ్ల వయస్సున్నపుడు పెండ్లికుమార్తె నాలుగేండ్లదో, మైదేండ్లదో యయి యుండునుగదా. అందుచేత నీవివాహము బొమ్మలపెండ్లియని భావింపనగును కాని నిజమయిన పెండ్లిగా భావింపఁగూడదు. అనేక విషయములలో సంస్తవనీయములగు మార్పులు చేసిన సీకుగురువులు బాల్యవివాహ దురాచారము నేల యడుగంట ద్రొక్కలేదో తెలియకున్నది. ఈ దురాచార పిశాచమిప్పటికి మనదేశమున స్థిరముగ నిలిచియుండి దేశమునకు మితిమీఱిన నష్టమును జేయుచున్నది. ఇది యడుగంటినఁ

యులు. తల్లి పేరు చంద్రమణీదేవి. ఆతనితలిదండ్రు లిద్దఱు యోగ్యతకు మిక్కిలి ప్రసిద్ధికెక్కి గ్రామస్థులందఱిచేత గౌరవింపఁబడుచు వచ్చిరి. ఖుదీరామచటోపాధ్యాయుల సత్యనిత్యతను దైవభక్తిని దెలుపుటకు రెండుదాహరణల నిచ్చుచున్నాము. ఆతఁడు పూర్వము "దేరి" యను గ్రామమునఁ గాపురముండువాఁడు. ఆయూరిజమీందారుఁడొకవిషయ మునఁ దప్పుసాక్ష్యమిమ్మనియు నీయకుండిన వానిం జిక్కులఁబెట్టెద ననియు బెదరించినందున నతఁ డబద్ధమాడఁ జాలక యా యూరు విడిచి కమర్పుకూరునకు వచ్చి తన జీవితశేష మచ్చటనే గడపెను. ఒకనాఁ డతఁడు తన కూఁతుం జూచుటకుఁ బయనమయి పోవుచుం డఁగా మార్గమధ్యమున నప్పుడే క్రొత్తగా బయలుదేరిన దళములు గల యొకమారేడుచెట్టు గనఁబడెను. మారేడుదళములతో శివపూజ సేయుట యతనికి మిక్కిలిప్రియమగుటచేఁ బ్రయాణ మింకొకయప్పు డు జేయవచ్చును. ఈయదనుతప్పిన బిల్వదళములు మఱియొకప్పుఁడు దొరకునాయనిపయనమును గట్టిపెట్టి చెట్టెక్కి మారేడుదళములఁగో సియొకనిండ వేసికొని వెనుకకుం జని యిల్లుచేరి మనసార శివపూ జఁ జేసెను. అతనియొద్ద వాక్శుద్ధిగలదనియు శుభముగాని యశుభము గాని యతఁడన్నట్లుజరుగుననియు జనులునమ్మిరి. చటోపాధ్యాయుఁడు యాత్రనిమిత్తము గయకుఁబోయియుండనందు గదాధరుఁడగు శ్రీమ హావిష్ణువతనికిఁగలలోఁ గనఁబడి వానికడుపునఁ గొడుకయి పుట్టుదునని చెప్పెనట. అందుచేతనతనికిఁ దండ్రి గదాధరుఁడను పేరుబెట్టెను. కాని యిటీవల నెందుచేతనో యతఁడు రామకృష్ణుఁడను పేరం బరఁగె.

రామకృష్ణుఁ డాఱవయేఁటనే పురాణములు చెప్పెడివారియొద్ద కుఁబోయి భారత భాగవత రామాయణాదికథల నెఱింగెను. ఆతనికం ఠధ్వని మధురమయి గాంభీర్యమైనది. గానమునం దించుక పరివేశము గలుగుటచే నతఁడు శ్రావ్యముగఁ బాడగలవాఁడఁట. దేవాలయము

లందలి విగ్రహములు చక్కఁగా జెక్కఁబడినవో లేవో తెలిసికొను టకతనికి సహజమైపుణ్యము గలదఁట అతఁడు కడు బాలుఁడయినను గ్రామమునందలి పెద్దలు చుట్టుపట్లవాండ్రు దేవతావిగ్రహములముం దువానికిఁజూపి యతఁడు మెచ్చినతరువాతనే ప్రతిష్టలఁ జేయఁచువచ్చి రి. రామకృష్ణున కద్భుతమయిన జ్ఞాపకశక్తిగలదు. ఒకమారు భాగ వతులాయూరికివచ్చి జలక్రీడ లాడఁగా నాబాలుఁడది చూచికథయం తయు జ్ఞాపకముపెట్టుకొని తరువాతఁ దోడిబాలురచే నాకథ యాడిం చెను. ఆయన వసియించు గ్రామము జగన్నాథక్షేత్రమునకుఁ బో వుదారిలోనుండుటచేత యోగులు సాధువులు సన్యాసులు వచ్చియా యూరిసత్రములో బసచేయుచుండిరి. అప్పుఁడు రామకృష్ణుఁడు వారి యొద్దకుఁబోయి వారివల్ల ననేకాంశములం గ్రహింపుచు వచ్చెను.

తనయూరి జమీందారుఁడు మృతినొందఁగా నుత్తరక్రియలస మయమునఁ జుట్టుప్రక్కలపండితులనేకు లచ్చట చేరిరఁట. ఆసమయ మున వారికివేదాంత విషయమయి సందేహము దోప వారు చర్చ లు సేయుచుండ బాలుఁడగు రామకృష్ణుఁ డక్కడకుబోయి సందియ మవలీలగాఁ దీర్చెనఁట. పండితు లందఱు వానిని మహానుభావుఁడని కొనియాడిరి. రామకృష్ణుని పెద్దయన్న రామకుమారచటోపాధ్యా యులు సంస్కృతమున బండితుఁడై కలకత్తాలో నొకపాఠశాలఁబె ట్టెను. తండ్రి రామకృష్ణునకుఁ బదియాఱవయేటనుపనయనముచేసిచదు వునిమిత్తము వానిని బెద్దకొడుకున కప్పగించెను. రామకృష్ణుఁడాబడి లోఁ గొన్నినాళ్ళు చదివి యెంతకాలము చదివినను నాలుగుమూక లుసంపాదించుటకు వినియోగించు విద్యలేగాని మోక్షసాధనమయి న చదువు లేదని విసువుజెంది యాబడిలోఁ జదువుకొనుట మానెను.

1853 వ సంవత్సరమున కలకత్తానగరమున కైదుమైళ్ళదూర మున రాణీరాసమణి యను జమీందారురాలొక దక్షిణేశ్వరస్వా

మి యాలయమును గట్టించెను. ఇది హిందూదేశమున శ్రేష్ఠమయిన కోవెలలలో నొకటి. ఆయాలయమునకు రామకృష్ణునియన్న యర్చకుడుగా నేర్పడెను. ఆలయప్రతిష్ఠ జరిగినదినమున నిరువదివేలమంది కన్నప్రదానము జరిగెను. గుడికట్టించిన యామె శూద్రస్త్రీయగుటచే నామె కట్టించిన యాలయమున భుజించుట యశాస్త్రీయమని రామకృష్ణుఁడంత యన్నప్రదానము జరుగుచున్న యాయాలయమునభుజింపక సాయంకాలమువఱ కుపవాస ముండి కొంచెమటుకులు కొనితిని రాత్రి కలకత్తాకుఁ బోయెను. తరువాతఁ గొన్నినాళ్ళకు సోదరుడువచ్చి తనకడనుండుమని బ్రతివాలుటచేఁ దనయన్నము తానుగంగయొడ్డున వేతే యొండుకొందునని చెప్పి యన్న నొప్పించి యతనితోఁగలసియుండుటకుఁ బోయెను. అట్లుకొంతకాలము జరుగ సోదరులకు శరీరమునందనారోగ్యము గలుగుటచే రాణీరాసమణియొక్క యల్లుఁడగుమధురనాథుఁడు రామకృష్ణునే కోవెల కర్చకుఁడుగా నియమించెను.

అతఁడాపనింబూని యనుదినమును దక్షిణేశ్వరస్వామిని శ్రీకాళికాదేవినిఁ బూజించుచుండఁ గాళియందత్యంతభక్తి యాతనికినెలకొనియెను. పూజానంతరమున రామకృష్ణుఁడు దేవీవిగ్రహమునొద్దగూర్చుండి కొడుకు తల్లియొద్ద గారాముచేసి యడిగినట్లు "అమ్మా! పలుకవే నాగతియేమి చెప్పితివే' యనిపిలుచుచు నెడతెగక ప్రార్థించుచుండును. ఆదేవి తన మాతయనియు జగన్మాతయనియు నతఁడెంచుచు తాను నివేదన చేసిన యాహారమామె నిజముగాభక్షించుచున్నదనుకొనెను. ప్రార్థించుటయేగాని యాతఁ డెన్నఁడు రెండవపనిచేయకుండుటచే వానిబంధుగు లతఁడు వెఱ్ఱిధోరణిలోఁ బడినాఁడని నమ్మి పెండ్లిచేసినచోఁ గొంతవఱకు దృష్టిమరలు ననుకొని వివాహముఁ ఒలపెట్టిరి. పెండ్లిచేయుటకుఁ దనవారుఁ దలపెట్ట నతఁడుతనకురా

మచంద్రముఖోపాధ్యాయుఁ డనునొక బ్రాహ్మణుని కూఁతురు శారదామణి దేవి యను నుత్తమబాలిక భార్యయగునట్లు విధింపఁబడినదనియు వానియొద్దకుఁబోయి యడుగుమనియుఁ దనవారితోఁజెప్పెను. వారామాటల కద్భుతపడి వెంటనే ముఖోపాధ్యాయునియొద్దకుఁ బోయి యడుగ నతఁ డంగీకరించి యైదేండ్లవయస్సుగల తనకూఁతును వాని కిచ్చి వివాహము చేసెను. వివాహ మయిన పిదప మరల రామకృష్ణుఁడు వచ్చి యాలయంబున నర్చకత్వము చేయఁబూనెను.

వివాహము జరిగినదిగాని చుట్టము లనుకొన్నట్లు వానిమనోవైకల్యముమాత్ర మించుకయుఁ దగ్గక మఱింత హెచ్చెను. ఈపర్యాయ మతఁడు ప్రార్థనము సేయుటయే గాక యహోరాత్రము లొక్కమచ్చున నెడ తెరపిలేక "తల్లీ నాకుఁ బ్రత్యక్షము గావేమే" యని పెద్దపెట్టున నేడ్వసాగెను. ప్రతిదినము సాయంకాలమయిన తోడనే "అయ్యో! తల్లీ! మరల నొకదినము గడచిపోయినది. ఇఁకఁ బ్రత్యక్షమగుట యెన్నఁడే" యని విలపించును. చూచినవారిలోఁ గొందఱు పిచ్చియెత్తినదనిరి. మఱికొందఱాయేడుపుఁజూచి వానికి దారుణ రోగబాధ కలదనిరి. మథురనాథుఁడు నది రోగమే యనుకొని తగు చికిత్స చేయించుటకు గొప్పవైద్యులకడకుఁ దీసికొనిపోయిచూపెను. వైద్యులెవ్వరు వానిరోగము కనుఁగొనఁజాలరయిరి. తుదకొక మహావైద్యుఁడు వానికది రోగము కాదనియు నతఁడు మహాయోగియనియుఁ జెప్పెను. అతఁడొకప్పుడు భక్తిపారవశ్యముచేత దేవికి సమర్పింపఁదలఁచిన పూఁలదండలు తానే మెడలో వైచుకొనును. మథురనాథుఁడది మొట్టమొదటఁ జూచి వానిపైఁ గోపించెను. కానిపిమ్మట వానిమహిమ నెఱిఁగి యూరకొనెను. రామకృష్ణుఁడు గుడిలో నర్చన సేయుటకు వీలులేనియవస్థలో నుండుటచే నతని నాపనిలోనుండి తప్పించి మథురనాథుఁ డతని మేనయల్లుని నియమించెను.

ఇట్లుండ నెంతకాలమునకుఁ దనకు దేవి ప్రత్యక్షముకాలేదని నిరాశఁజెంది రామకృష్ణుఁడు మృతినొందఁదలఁచుచుండఁగా నొడలు తెలియక పడిపోయెను. ఇది కొందఱు మూర్ఛయనుకొనిరి. కాని య దిమూర్ఛగాక సమాధియయ్యెను. ఈసమాధిలో వానికి కాళికాదేవి ప్రత్యక్షమై వాని ననుగ్రహించెను. అంతట నతఁ డించుకయూరడిల్లి యుండెను. అదిమొద లతఁడు మరణమునొందునఁటకుఁ బలుమారులు సమాధిప్రవేశముఁ జేయుచునేయుండెను. అతఁడు సమాధిలోనున్న పు డెంతఘనవైద్యులు వచ్చి చేయిచూచినను నాడి గనఁబడదయ్యె. ఈయద్భుతమున కెవ్వరుఁ గారణముఁ జెప్పఁజాలరయిరి. సమాధిలోఁ దనకు దేవి తఱచుగాఁ బ్రసన్నురాలగుచుండుట నిజమో లేక తన మనోభ్రమయో యని యొక్కొక్కమా రతఁడు సందియపడుచుదాని యాథార్థ్యమును గనుంగొనుటకయి యదివఱకెన్నఁడునుజరుగని యొ కకార్యము జరిగినచో దేవిప్రత్యక్షముమాట నమ్మెదనని యతఁడు దేవితోఁ జెప్పుచుండును. ఎట్లన రాణిరాసమణియొక్క కొమార్తెలిద్ద ఱుఁ దమయంతఃపురమువిడిచి యాలయము ముందు మఱ్ఱిచెట్టుక్రిం ద కువచ్చి తనతోమాటలాడినచో దేవి ప్రత్యక్షమగుట నమ్మెదనని దేవితోఁ బలికెను. రాచమణికూఁతు లిద్ద ఱెన్నఁ డంతఃపురమువిడు వని గోషాస్త్రీలు. అదివఱ కెన్నఁడాలయము త్రొక్కిచూచి యెఱుఁ గరు. అది యేమిచిత్రమోకాని యాశుద్ధాంతకాంతలిద్దఱు గుడిచూ చుటకుఁ దల్లియనుమతి నంది యాలయమునకువచ్చి మఱ్ఱిచెట్టునీడ నున్న రామకృష్ణునిఁ బలుకరించి "దేవి నిన్ననుగ్రహించును. భయ పడకు"మనిచెప్పిపోయిరి. ఈతెఱంగుననే యతఁడు కోరిన ట్లనేకాద్భు తములు దేవీప్రసాదమువలన జరుగుచు వచ్చెను.

ఇట్లు నిరంతరప్రార్థనములఁ జేయుచు సమాధులంబ్రవేశించు చు రామకృష్ణుఁడు పండ్రెండుసంవత్సరములు తపస్సుచేసెను. ఆకా

లమునందొకనాఁడు రాత్రియు నతనికి నిద్రలేదు. కన్నులు బలవంతముగా నతఁడు మూయఁదలఁచినను మూయఁబడవయ్యె. అప్పుడప్పుడతఁడు "దేవీ! నేను మృతినొందుదునుగాఁబోలు'నని భయపడుచుండ నతనికి "వత్సా! శరీరమునం దభిమానము విడువవేని నీకు ముక్తి యెట్లుగలుగు"నని యొకశబ్దము వినబడెను. ఒకమారతఁడు తల్లీ! నేనీకించిజ్జ్ఞులగు మనుష్యులవద్ద చదువు నేర్చికొనను నీవే నేర్పుమనియడుగ "వత్సా! నేను నీకు నేర్పెదనులే"యని యొకమాట వానికి వినఁబడెను. అప్పుడప్పు డతఁడు సర్వసమానుఁడయి "నేను బ్రాహ్మణుఁడను గొప్పవాఁడను. తక్కువజాతులవా రల్పులను దురభిమానము నామనసునుండి తొలఁగింపు"మని దేవిని బ్రార్థించి వెంటనే తక్కువజాతివాండ్రగు సేవకులయిండ్లూడ్చి వారికి విధేయుడయి మెలగును. మఱియొకప్పు డతడొకచేత రూపాయిలను రెండవచేత చిల్లపెంకులను బట్టుకొని గంగయొడ్డునఁగూర్చుండి "ఇది ధనము. దీనిచే బియ్యముపప్పుమొదలగువస్తువు లన్నియు లభించును. దీనినందఱు గౌరవింతురు. ఇవి చిల్లపెంకులు. వీనిమొగమెవ్వరుఁ జూడరు. నాకివి రెండు సమానములే" యని రెండును గలిపి గంగలోఁ బాఱవేయును. ఒకనాఁడు రాసమణి యల్లుఁడు మథురనాథుఁడు పదునైదువందల రూపాయిలు విలువగల యొకగొప్ప శాలువ వానికిం గప్పెను. రామకృష్ణుఁడు మొదటదానికి సంతసించినట్లె కనఁబడి నాలుగునిముసములలో నాశాలువుందీసి నేల పై వైచి కాలరాచి దానిపై నుమిసి "ఇదిగర్వమును హెచ్చించును. దీనికన్న ప్రాతగుడ్డపేలికలుమే"లని దానితో నేలయూడ్చి పాఱవైచెను. ఆదినములలో నతనికి నిరంతరము శరీరమంతయు మంటలెత్తుచువచ్చెను. అందుచేత నతఁడు గంగలోఁ గంఠములోతు నీళ్లలో దిగి తఱచుగ నిలుచుచు వచ్చెను.

ఇట్లుండ నామహాత్మునియొద్ద కొకయోగినివచ్చెను. ఆమెయూ

రెయ్యదియో యెవ్వరెఱుంగరు. ఆమె కనేకపురాణంబులు కంఠపాఠ ముగ నచ్చును. వాదములుచేసి యెంతెంతపండితులనైన నవలీలగగె ల్చెడు ప్రజ్ఞగలది. ఒకయోఁడుదివచ్చి తనకుఁ గొంతవిద్య నేర్పునని దేవి సమాధిలో నతనితో నొక్కమారు చెప్పెను. చెప్పినచొప్పున దీర్ఘకాయము స్ఫురద్రూపము గలయాయోగిని వచ్చి రామకృష్ణు నాన వాలు పట్టి "నేను నీకొఱకే వెదకుచున్నాను. కనఁబడితివా" యని వానిం బలుకరించి యాతనితోఁ గలిసి కొంతకాల మచ్చటనుండెను. రామకృష్ణునిశరీరమంతయు భగభగమండుచుండుటచే నాతఁడామెను కారణ మడుగ నామె భగవద్భక్తులకందఱకు శరీర మట్లే మంటలె త్తుననియు నిట్లే నాలుగువందలయేండ్లకిందట శ్రీచైతన్యునకును, బూ ర్వకాలమున రాధాదేవికి భగవంతునిపైఁగల యనురాగముచే దేహ తాపము గలిగెననియు జెప్పి తనమాటలు సత్యములని ఋజువుచేయు టకు వైష్ణవపురాణములం దెప్పించి యందుఁ బ్రమాణములంగనబరచి నమ్మించి రామకృష్ణుని మేన మంచిగంధము మూఁడుదినములు పూ యించి పూలదండలు మెడనువేయించి యట్లే చైతన్యునియొక్కయు రాధయొక్కయు తాప మడఁగెనని చెప్పెను. ఈశైత్యోపచార ముచే నద్భుతముగ రామకృష్ణుని మేను చల్లఁబడెను. ఈమంటలడగి నవెనుక నతనికి మితిలేనియాఁకలిబాధకలిగెను. ఎంతయన్నమెన్నిమా రులు తిన్న నతనికి యాఁకలియుపశమిల్లదయ్యె. అప్పుడాయోగిని చైతన్యుఁడు రాధమొదలగువారికిఁగూడ నిట్లే వింతయాఁకలికలిగెనని చెప్పి, కొన్నిగ్రంథదృష్టాంతములఁ జూపి పలుపిండివంటలు కూరలు నన్నము కుప్పకుప్పలుగా నతనియెదుటఁ బెట్టించెను. రాసులకొలఁదిప దార్థములఁజూచుటచే నతనియాఁకలి క్రమక్రమంబుగ నుపశమిల్లి ప్ర కృతిలోఁ బడెను. ఈయోగిని యతనికి యోగశాస్త్రము సమగ్రము గాఁ దానున్న కాలమున నేర్పెను.

ఇవ్విధంబున యోగశాస్త్రమునఁ బరిపూర్ణుఁడై రామకృష్ణుఁడు వేదాంతము నభ్యసింపవలయునని తలఁచుచుండఁగా నతనియొద్దకు మహానుభావుఁడగు దిగంబరయోగి యొకఁడువచ్చెను. అతఁడు బీరెండ గాయునప్పుడును గొండ చిల్లివడ వానలు గురియు నప్పుడును జెట్ల క్రిందనేగాని యిండ్ల తల దాఁచుకొనఁడు. ఊరుబైటనేగాని గ్రామమున వసింపఁడు. పండ్లు పాలెగాని యన్నముతినఁడు. రామకృష్ణుఁ డొకనాఁడు గంగయొడ్డునఁ గూర్చుండ నాయోగివచ్చి వానిని గుర్తెఱిఁగి బ్రహ్మజ్ఞానోపదేశము చేయవచ్చితినని చెప్పి యతనితోఁ గలసి పదునొకండు మాసములుండెను. రామకృష్ణుఁడు సాటిలేని బుద్ధిప్రజ్ఞ గలవాఁడగుటచే నాతఁడుపదేశించిన బ్రహ్మవిద్య నతిస్వల్పకాలమున నవలీలగా గ్రహించె. యోగి యాతని తెలివి కక్కజపడి "వత్సా! నేను నలువదియేండ్లు కష్టపడి నేర్చినదానిని నీవు నాలుగు దినములలో నేర్చితివి" యని యాదినము మొదలు వానిని శిష్యుఁడుగా నెంచక మిత్రుఁడుగా భావించెను. ఆ యోగితనయొద్దనిరంతరము నగ్నిహోత్రము నిలుపుకొని యదియె పరమపావనమని తలంచుచుండెను. ఒకనాఁడా యగ్నిహోత్రమున నొకఁడు చుట్టఁకాల్చుకొనఁ బోగా యోగి తన యగ్ని మైలపడినదని వానిపైఁ గోపించెను. అప్పుడు రామకృష్ణ పరమహంస యోగి నిట్లని మందలించె. "అయ్యా! యీయగ్నియు దీనిని మైలపఱచినమనుష్యుఁడు పరబ్రహ్మస్వరూపము లేకదా. నీకీ భేదబుద్ధి యేలకలుగవలె?" ఆ పలుకులు విని యోగి పరమహంసతో "ఇఁకమీఁద నే నెన్నఁడు నెవరిపైఁ గోపపడ" నని తెలివిం దెచ్చుకొనియె.

రామకృష్ణుఁ డీవిధమున బ్రహ్మజ్ఞానమునేర్చి జ్ఞానమొకదారి నడత యొకదారి గాకుండ నద్వైతసిద్ధి నొంది పిమ్మట యోగాభ్యాసముచేయ నారంభించెను. ప్రాణాయామముఁ బట్టి యూపిరి బంధించి

యాహారంబుఁ దినక యతఁ డొక్కొకసారికొన్ని దినములు గడుపుచు వచ్చెను, ఆ దినములలో నెక్కడినుండియో యొకసాధువు వచ్చి యతనితోఁ గలసియుండి ప్రాణాయామముఁబట్టినప్పు డాహారము లేమిచే నతఁడు మృతినొందునేమోయను భయమున బలవంతముగ నాహారమును మింగించుటకుఁ బ్రయత్నించుచువచ్చెను. ఒకనాఁడు రామకృష్ణున కెంతకు మెలఁకువ రానందున సాధువు దుడ్డుకఱ్ఱతో వానిం గట్టిగాఁ గొట్టి మెలకువ దెప్పించి రెండు కబళములయన్నము నోట గుక్కి బ్రతికించెను. ఈతెఱంగున నాలుమాసములు యోగా భ్యాసమగునప్పటికి రామకృష్ణున కాహార నిద్ర సుఖములులేమి గ్రహణిరోగము సంభవించెను. ఈరోగము యోగమును మాన్పించి వానికిఁ జాల మేలొనరించెను. స్వదేశవైద్యులు వాని రోగము కొన్ని రోజులలో మాన్పిరి. ఆ యభ్యాసముచేత సామాన్య యోగులకు దుర్లభమైన నిర్వికల్పక సమాధిని దానుప్రవేశింపఁగలిగితిననియు దృఢ మైన మనస్సును శరీరమును గలిగి యుండుటచేత తానట్టి సమాధిని బ్రవేశింప మరల బ్రతుకనయ్యెను. కాని సామాన్యులు బ్రతుకుట యరిదియనియు నతఁడిటీవల చెప్పుచు వచ్చెను. ఆరోగ్యము కలిగిన పిదప నతఁడు వైష్ణవులభక్తిమార్గము నవలంబింపవలయునని తలంచెను.

వైష్ణవులు భగవంతు నైదు విధములుగా సేవింతురు. 1. సేవ కులు యజమానుని గొలిచినట్లు 2. మిత్రులొండొరులఁ బ్రేమించు నట్లు 3. తలిదండ్రులు బిడ్డలఁ బ్రేమించునట్లు 4. బిడ్డలు తలిదం డ్రులఁ బ్రేమించునట్లు 5 భార్య భర్తను వలచునట్లు. ఈ యైదిం టిలోఁ గడపటివిధమే యుత్కృష్టమైన దనియు నా మార్గముననే పూర్వము గోపికలు రాధాదేవియు ననుసరించి ముక్తులైరనియు నమ్మి రామకృష్ణుఁడు కొన్ని దినములు స్త్రీవేషముఁ దాల్చి తాను భగవంతుని భార్యయగు రాధనని యెంచి తత్సంయోగమునకై పలు

మారు ప్రార్థించెను. ఒకనాఁడు సమాధిలో నతనికి ముద్దుమొగముతో గోపాల కృష్ణదేవుఁడు సాక్షాత్కరించినందున నతఁడు కృతార్థుఁడయ్యె. రాధ పరమభాగవతోత్తమురా లనియు నామె గోపాల దేవునియందు వలపునిలుపుట భక్తిచేతనేగాని సంభోగార్థము గాద నియు జ్ఞానవంతుఁడేగాని పామరు లాగ్రింథములఁ జదువఁగూడద నియు రామకృష్ణునియభిప్రాయము. భక్తియోగమునందిట్లు సిద్ధిని గాంచిన పిదప నతఁడు మహమ్మదీయపద్ధతి ప్రకారము కొన్నిదినములు భగవంతుని ధ్యానించెను. ఆవల క్రైస్తవసిద్ధాంత ప్రకారము కొన్నిదినము లీశ్వరుని సేవించెను. ఆదినములలో నతనికి యేసు క్రీస్తొకమారు కనఁబడి వాని ధన్యునిజేసెను. రామకృష్ణుఁ డేమత మవలంబింపఁ దలఁచునప్పు డామతస్థుఁ డొకఁ డతనియొద్దకు వచ్చి తదరి హస్యములన్నియు నతనికిఁజెప్పునట. అన్నిమతముల నవలంబించుటచే ప్రతిమతము మంచిదేయనియు నేమతమవలంబించినను మనుష్యులకు ముక్తిదొరుకుననియును నొక్కొక్కమత మఖండ సచ్చిదానంద స్వరూపుండగు భగవంతుని గుణములు దెలుపుననియు నతఁడభిప్రాయ పడెను.

అతఁడు సంకల్పసిద్ధుఁడని వాడుక. ఒకనాఁ డాయన గంగ యొద్దనఁ గూర్చుండి తన యోగాభ్యాసమున కనువుగా నొక కుటీరమును నిర్మించుకొనఁ దలంచుచుండ నప్పు డద్భుతముగాఁ గొన్ని వెదుళ్ళు తాటియాకులు నార మొదలగు గుడెసెకుఁ గావలసిన పరికరములు గొట్టుకొనివచ్చి వానికంటఁ బడెను. ఆ పరికరముల నతఁడు వెంటనే గ్రహించి కొందఱు సేవకుల సాయమునఁ గుటీరము నిర్మించుకొనియె.

ఇవ్విధంబునఁ బరమయోగియై రామకృష్ణుఁడుండ నతనిభార్య పుట్టినింట నీడేరి పదునెనిమిదేండ్ల ప్రాయముగలదయ్యె. తల్లిదండ్రు

లామెతో నీమగఁడు పిచ్చివాఁడయ్యె నమ్మా యనిరి. కొందఱులోకు లతఁడు పరమయోగియయ్యెనని చెప్ప విని శారదామణిదేవి యట్టి మగని నొక్కసారి కన్నులారఁ జూడవేడుకపడి తల్లిదండ్రుల సెలవు పొంది వానియొద్దకుంబోయి తన్నెఱింగించుకొనియె. రామకృష్ణుఁ డామెనాదరించి యిట్లనియె. "పూర్వపు రామకృష్ణుఁడు మృతినొంది నాఁడు. నేను క్రొత్తవాఁడను. లోకమునందలియాఁడువాండ్రందఱు నాకెట్లు తల్లులో నీవును నాకు తల్లివిగాని భార్యవుగావు." అని యామెపాదములను మ్రొక్కి యాశీర్వదింపుమని ప్రార్థించి పువ్వులతోఁ బూజించి వెంటనే సమాధిగతుఁడై యొడలెఱుఁగకఁ బడియె. మగనికిం దెలివివచ్చిన పిదప నా యిల్లాలు "స్వామీ! నేను మీతపమున కంతరాయము గలిగింపను. మీ పాదసేవ సేయుచు నిచ్చటనే పడియుండెద. నా కందుకు సెలవిమ్మని వేఁడిన నతఁ డామె వేడికోలంగీకరించె. ఆమెయు భర్తవలెనే నిస్పృహగలిగి విరాగిణియై యుండె. మధురనాథుఁ డొకనాఁడామెను బిలిచి "తల్లీ! నీకు నేను పదివేలరూపాయ లిచ్చెదను. నీవుబోయి సుఖముగా నుండు" మని చెప్ప శారదామణిదేవి నవ్వి "నాయనా! నాభర్త ధనము నిరాకరించియే మహాత్ముఁడయ్యె. నేనును వాని ననుసరించెద. నాకు ధనమెందు" కని నిరాకరించె.

అనంతరము కొన్నినాళ్ళకు మధురనాథుఁడు తీర్థయాత్రలకుఁ బోవుచు రామకృష్ణుని వెంటఁ గొంపోయె. ఆయాత్రలలో రామకృష్ణుఁడు కాశికిఁబోయి జగత్ప్రసిద్ధసన్యాసియగు త్రైలింగస్వామినిసందర్శించి గోకులబృందావనమున గంగామాతయను మహాత్మురాలిని సేవించి ధన్యుఁడయ్యె. మరల వారింటికి వచ్చుచున్న మధ్యమార్గమున నొక పల్లియలో జనులు దారిద్ర్యమున బాధపడుచుండుటఁ జూచి పరమహంస వారిదైన్యమునకు వగచి యాయూరసందఱనాదరించినఁగాని నే

నిచ్చటనుండి కదలనని గూర్చుండె. అప్పుడు మధురనాథుఁడు చాల సొమ్ము వెచ్చబెట్టికొన్నినాళ్ళన్నప్రదానముచేసి కట్టగుడ్డలిచ్చి యాదరించె. ఈతఁడు పరమపావనుఁడు. వానిదర్శనముచేసినవారందఱు వెంటనే పవిత్రులగుదురు. అతని సాన్నిధ్యవిశేషమున కొందఱు సమాధిగతులయి యీశ్వరుని గనువారు కొందఱు తమదురాలోచనలవిడిచి యిండ్లకు నిష్కల్మషచిత్తులయి పోయెడువారు. వేయేల ఆయననొకసారి చూచినపిదప జారులకు కాంతాసక్తియు లోభులకు ధనాసక్తియుఁ బోయెడునవి. ధనముపేరు చెప్పిన నతనికెంతరోఁతయో యీ క్రిందిసంగతినిబట్టి తెలిసికొనవచ్చును.

వెండి బంగారునాణెముల నతఁడు స్పృశించినమాత్రమునఁ జేతులు గజగజవణకును. చరమకాలమునం దతఁడు వెండి బంగారముల నేగాక యినుమునుసయితము తాకఁజాలఁడయ్యె. అతనియొద్దమహిమలనేకములు కలవు. కాని ప్రజ్ఞంబ్రకటించుటకై యామహిమలనెన్నఁడు నతఁడు ప్రదర్శింపఁడయ్యె. ఆయన భూతగతానాగతములనుజెప్పఁగలఁడు. తనపరోక్షమున జరుగుకార్యములఁ బేర్కొనఁ గలఁడు. తన యెదుటనున్నవారిమనసులోని యాలోచనల నెఱుఁగఁగలఁడని యనేకులు చెప్పుదురు. కొందఱు మనుష్యులు దేవగుణములతోఁడను గొందఱు మనుష్యులు రాక్షసగుణములతో జన్మింతురనియు నట్టివారిని జులకనగఁ గనిపెట్టవచ్చుననియుఁ బూర్వజన్మమునఁ జరితార్థులై సకలసౌఖ్యములఁ దనివితీర ననుభవించినవారీజన్మమున విరాగులయి సన్న్యాసులగుదురనియు నతఁడు చెప్పుచుండును. అనేకమహిమలుగల యీమహానుభావుఁడు కలకత్తానగరమునకుసమీపమందున్నను తత్పురవాసులు చాలకాలమువఱ కతని నెఱుఁగనే యెఱుఁగరు.

బ్రహ్మసమాజ మతాచార్యుఁడగు కేశవచంద్రసేనుఁడు పరమభాగవతుఁడై యొకతోఁటలో విరాగియై పొద్దులుబుచ్చుచున్నవాఁ

డని విని రామకృష్ణుఁ డాతనిఁ జూడఁబోయెను. అదిమొదలు వారి కిరువురకు దృఢమయిన స్నేహముఁ గలిగెను. కేశవచంద్రసేనుఁడు రామకృష్ణుని పరిభావమెఱిఁగి వానినాశ్రయించి సందియము లడిగి తెలిసికొని పరమభక్తిచే నతని పాదములు తనకన్నుల నద్దుకొని పలుమాఱు వానిదర్శించి బ్రహ్మజ్ఞానవంతుఁడై తుదకాయన సిద్ధాంతము లన్నిఁటి నవలంబించెనని చెప్పుదురు. ఈచంద్రసేనుఁడు రామకృష్ణుని బోధనలఁ గూర్చియుచిత్రచరిత్రనుగూర్చియు నొకగ్రంథము వ్రాసి ప్రకటించెను. ఆపుస్తకము బయలువెడలిన పిదప కలకత్తాపు రజనులు రామకృష్ణు నెఱిఁగిరి. అది మొదలు కలకత్తానుండియు బంగాళాదేశమునుండియు జనులు వందలకొలఁదివచ్చి సందియములడిగి యతనిచేత బోధితులై పోవుచువచ్చిరి. అప్పు డతనికి యీశ్వరావేశము నయితము వచ్చువాడుక గలదు. ఆ యావేశము లేనప్పుడు సేవకులకయిన విధేయుఁడుగ నుండినట్టి యామహాత్ముఁ డది వచ్చినతో డనే తాను భగవంతుఁడననియుఁ దనవంటివారు లేరనియు పూర్వము రాముఁడు కృష్ణుఁడు బుద్ధుఁడు యేసుక్రీస్తు మొదలగువారై పుట్టినది తానేయని చెప్పుచుండును. అతని బోధనలు విని యందఱును సంతసించి తృప్తినొందుచు వచ్చిరి.

ఈ పరమహంసకు 1886 వ సంవత్సరమున గంఠమునఁ గురుపునై చెను. ప్రజలకు మతబోధ మానుమని వైద్యు లెంత చెప్పినను వినక కంఠములోనుండి మాటవచ్చువఱ కతఁడు మతబోధ చేయఁదొడఁగెను. ఆరోగము క్రమక్రమముగ వృద్ధియగుటచే రామకృష్ణపరమహంస 1886 వ సంవత్సరమున ఆగస్టు 16 వ తేదీని రాత్రి యొంటిగంటకు యఖండసచ్చిదానందపరబ్రహ్మమును గలసిపోయెను.

ఇతఁడు శరీరమునం దభిమానములేని మహాయోగి. సార్థకనామముగల పరమహంస. నిజమయిన మహర్షి. ధనమును జిల్లపెంకు

ను సమానముగఁ జూచిన నిస్పృహుఁడు. చండాలుని యందును బ్రాహ్మణునియందును గుక్కయందును గోవునందును బ్రపంచము నందలి సంమస్తపదార్థములయందును బరమాత్మయున్నదని గ్రహించి తత్ప్రకారము నడచిన ఋజువర్తనుఁడు. మతవిషయమున నితనితో భిన్నాభిప్రాయములుగల పురుషులు సయితము వాని సత్ప్రవర్తనకుఁ గడుంగడు మెచ్చి కొనియాడిరి. బంగాళీభాషదక్క సంస్కృతముగాని మఱి యే యితరభాషగాని యతనికి రాకపోయినను దానిబోధనలం జదువువప్పు డతఁడు సకలశాస్త్రసంపన్నుఁ డనుకొనవలసివచ్చును. ఈపరమహంస సహజజ్ఞాని యని యనేకుల యభిప్రాయము.

---

## మహావాక్యములు.

1. ఆకాశమున నీకు రాత్రివేళ నక్షత్రము లెన్నో కనఁబడును కాని యవినీకు పగలు కనఁబడవు. అందుచేత ఆకాశమున పట్టపగలు నక్షత్రములు లేనేలేవని నీవు చెప్పఁగలవా? ఆలాగుననే నీనజ్ఞానము వైయున్న కాలమున నీకు భగవంతుఁడు కనఁబడఁడు. అందుచేత దేవుఁడు లేఁడని చెప్పకుము.

2. ఒక్కవస్తువునే పెక్కండ్రు పెక్కుపేళ్ళతో వ్యవహరింతురు. ఎట్లనఁగా జలమును కొందఱు నీళ్ళందురు. కొందఱు పానియందురు. కొందఱు వాటర్ అందురు. ఎవరెట్లన్నను పదార్థ మొక్కటేకదా! అట్లే నిత్యుఁడై నిర్మలుఁడైన యానందస్వరూపుఁడు భగవంతుఁ డొక్కఁడే. అతనినే కొందఱు బ్రహ్మమందురు. కొందఱు హరియందురు, కొందఱు జహోవాయందురు. కొందఱు శివుఁడందురు. కాని దేవుఁడొక్కఁడే.

3. తొండయొక్క రంగును గుఱించి ఇద్దఱుమనుష్యులు గట్టిగా వివాదపడిరి. ఆచెట్టుమీఁదనున్న తొండ ఎఱ్ఱగానున్నదని యొకఁడువాదించెను. "కాదుకాదు నీవు పొరపాటు పడినావు. అది ఊదా రంగు కలిగియున్నది." అని రెండవవాఁడు వానిమాట ఖండించెను. వారిద్దరు తమలో తాము వివాదము పరిష్కరించుకొనలేక యాచెట్టు క్రిందచిరకాలమునుండి కూర్చుండియాతొండయొక్కవిధములన్నియు కనిపెట్టిచూచుచున్న యొకమనుష్యుని యొద్దకుపోయిరి. "అయ్యా! తొండ ఎఱ్ఱగానున్నది కాదా?" యని యొకఁ డాయన నడిగెను. "అవును. ఎఱ్ఱగానేయున్నది" అని యతఁడు త్తరువిచ్చెను. రెండవ వాఁడు "ఇదేమిటండీ! మీరల్లాగనుచున్నారు. అది ఎఱ్ఱగాలేదు. అది ఊదారంగుఁ గలిగియున్నది" అని చెప్పెను. "ఔను! అది వూదారంగు గలదే యని యాచెట్టుక్రింది మనుష్యుఁడు చెప్పెను. తొండయొక్క రంగులు క్షణక్షణము మారిపోవునని యామనుష్యుఁ డెఱుఁగును. కావున వారిద్దఱును సరిగానే చెప్పిరని తెలిసికొని అతఁ డిద్దఱికిని ఔనని బదులు చెప్పెను. ఆలాగే భగవంతుఁడు బహురూపములు కలవాఁడు. ఆరూపములలో నేదోయొక్కటి మాత్రమే చూచినవాఁడు భగవంతున కారూప మొక్కటియే యున్నదని వాదించును. కాని యతని రూపములన్నియు చూచినవాఁడు భగవంతుఁడు బహురూపుఁడని యతసి నానారూపములను వర్ణించి చెప్పఁగలుగును. భగవంతుఁడు బహురూపములు గలవాఁడు. అయినను రూపములు లేనివాఁడు. కాని యెట్టి పరమభక్తులకైనను గనఁబడని రూపములెన్నో యతని కింకను గలవు.

4. భగవంతున కనేకనామములు కలవు. అతని రూపము తెలిసికొనుట కెన్నోమార్గములు కలవు. ఏనామముతో నతనిని నీవు

పిలువ తలఁచుకొందువో ఆనామముతోనే అతఁడు పలుకును. ఏరూప ముతో చూడఁదలతువో ఆరూపముతోనే కనఁబడును.

5. నలుగురు గుడ్డివాండ్రు ఏనుఁగును చూడఁబోయిరి. అందొకఁడు దానికాలుపట్టుకొని చూచి ఏనుఁగు స్తంభమువలెనున్నదని చెప్పెను. రెండవవాఁడు తొండముతడవిచూచి యేనుఁగు రోకలివలె నుండునని పలికెను. మూఁడవవాఁడు దానిపొట్టఁ బట్టిజూచి యేనుఁగు పెద్దపాణకవలెనుండు ననెను. నాల్గవవాఁడు దానిచెవులు స్పృశించి ఏనుఁగు చేటవలెనుండునని వాదించెను. ఈతెఱఁగున వారు నలుగురు యేనుఁగయొక్క రూపమును గుఱించి తగవులాడిరి. దారినిబోవు బాటసారి యొక్కఁడు వారికయ్యమువిని అదియేమని యడిగి తెలిసికొని ఇట్లనియెను. "ఏనుఁగును మీరెవ్వరును నిజముగాచూడలేదు." ఏనుఁగు స్తంభమువలె లేదు. దాని కాలు స్తంభమువలె నున్నది. అది పాణ కలాగున లేదు. దానికడుపు పాణకలాగున నున్నది. అది రోకలిలాగున లేదు. దాని తొండము రోకలిలాగున నున్నది. అది చేటవలె లేదు. దానిచెవి చేటలాగున నున్నది. ఆలాగుననే భగవంతుని రూపమొక్క టిమాత్రమే చూచినవారు భగవంతున కారూపమొక్కటేగాని మరి యొకరూపము లేదని వాదించి కలహమాడుదురు.

(6) పంచదార తెచ్చి చిలుకలు మొదలైనపక్షులుగాను, మరి బహుచిత్రవస్తువులుగాను వర్తకుడు చేసినట్లే జగన్మాతయైన యాదేవి యనేక రూపములతో అనేక నామములతో యెల్లదేశములయందు నెల్ల కాలములయందు పూజింపబడుచున్నది. భిన్నమతములు భగ వంతునియొద్దకు మనలను తీసుకొనిపోవు భిన్నమార్గములు.

(7) బంగారమొక్కటే పలువేళ్లకల పలునగలుగా చేయబడు చున్నట్లే భగవంతుఁడొక్కఁడే భిన్న దేశములలో భిన్నకాలములలో బహునామరూపభేదములచేత సేవింపఁబడుచుండును. అతఁడు భిన్నవిధ

ములుగానారాధింపఁబడుచున్నను కొందరతనిని తండ్రియందురు. కొందరతనిని తల్లియందురు. భిన్నపద్ధతులతోను, భిన్నసంబంధములతోడను సేవింపఁబడుచున్నట్టి భగవంతుఁడొక్కఁడే.

(8) (ప్రశ్న) అన్నిమతములకు దేవుఁడొక్కఁడే యైనపక్షమున యేభిన్నమతములవారు భగవంతుఁడు భిన్నస్వరూపుఁడని యేలచెప్పిరి? (ఉత్తరము) దేవుఁడొక్కఁడే కాని యతని యవస్థలువేరు. గృహయజమానుఁడొక్కఁడేయయ్యు నొకరికిఁ దండ్రియు నొకరికన్నయు నొకరికిఁ దమ్ముఁడు నొకరికి మామయు నొకతెకు మగఁడునై యుండి యాయానామములతో నాయాబంధువులచేఁ బిలువఁబడుచున్నట్లే భగవంతుఁడొక్కఁడయ్యు భక్తుఁడేయవస్థలోఁ దన్నుఁజూచునో యా యవస్థనుబట్టి వేరువేరు భక్తులచే వేరువేరునామములతోఁ బిలువఁబడి వేరువేరు రూపములతో నర్చింపఁబడును.

(9) కుండల దుకాణములో బాన, చట్టి, పిడత, మూకుఁడు కూడా మొదలైన నానారూప భేదములుగల వస్తువులుండును. కాని యవియన్నియు మట్టితో చేసినవే. అట్లే భగవంతుఁడొక్కఁడే కాని యతఁడు భిన్నకాలములలో భిన్నదేశములలో భిన్నరూపములతోను భిన్నావస్థలతోను సేవింపఁబడు చున్నాఁడు.

(10) దేవుఁడొక్కఁడే కాని యతని యవస్థలు బహువిధములు. ఒక్కశాఖమే తెచ్చి పాకభేదములచేతనది యనేకరుచులు గల్గియుండునట్లు చేయవచ్చును. అట్లే దేవుడొక్కఁడే యయ్యు, నవస్థాభేదములను బట్టి భక్తులచే వేరువేరు భావనలచే భజియింపఁబడు చున్నాఁడు.

(11) మనుష్యుఁడు తలగడాసంచివంటివాఁడు. ఒకసంచి యెఱ్ఱగా నుండును మరొకటి నల్లగానుండును. వేరొకటి పచ్చగానుండును. కాని వానియన్నిటిలోనున్న దూదియొక్కటియే. మనుష్యప్రకృతియు నట్టిదే. ఒక డందముగానుండును. ఒకఁడు కురూపియగును. ఒకఁడు

పరమపవిత్రుఁడైయుండును. ఇంకొకడు దుర్జనుఁడగును. కాని పరమేశ్వరుఁడు వారందరిలో నున్నాఁడు.

(12) ఉదకమంతయు నారాయణస్వరూపము. కాని యెల్లవిధములైన నీళ్ళు త్రాగుటకు పనికిరావు. అట్లే భగవంతుఁడు సమస్తప్రదేశములందున్నను ప్రతిస్థలము మనుష్యులు వెళ్ళిచూడదగదు. కొన్ని నీళ్ళు కాళ్ళు కడుగుకొనుట కేపనికివచ్చును. మరినీళ్ళుసంధ్యావందనము మొదలైనవి చేసికొనుటకు పనికివచ్చును. కొన్నినీళ్ళు త్రాగుట కే తగవు. కొన్నినీళ్లు త్రాగవచ్చును. ఆలాగే స్థలము లనేకవిధములు. మనము కొన్ని స్థలములసమీపమునకు మాత్రమే పోవచ్చును. కొన్నిచోట్లకు పోనేకూడదు. కొన్నింటిలో లోపలికి నిశ్శంకముగా పోవచ్చును. కొన్నిటికి దూరమునుండియే తొలగిపోవలెను.

(13) దేవుఁడు పెద్దపులిలో సహితమున్నాఁడనుమాట నిజము. కాని మనము దాని దగ్గిరకు పోఁగూడదు కదా! అట్లే భగవంతుఁడు పరమ దుర్మార్గునిలో గూడ నున్నాఁడనుట నిస్సంశయము. అయినను మనము దుర్మార్గుల సహవాసము మాత్రము చేయరాదు.

(14) ఎవనిని బహుజనులు గౌరవించి వానిమాట శిరసావహించి వాని యాజ్ఞాప్రకారము నడతురో యట్టి వానియందు భగవద్వ్యక్తి యధికముగా నుండును. జనబాహుళ్యముచేత గౌరవింపఁబడనివానియందు అట్టివ్యక్తి తక్కువగా నుండును.

(15) ప్రపంచమునందు గలప్రతిపదార్థము దైవమే యని గురువు శిష్యునకుపదేశించెను. శిష్యుఁడు బాహ్యార్థమే గ్రహించెను. కాని దాని పరమార్థము గ్రహింపజాలకపోయెను. ఒకనాఁడు శిష్యుడు రాజవీధినిఁ బోవుచుండగా నొకయేనుగు వాని కెదురుగా వచ్చెను. దానిఁ దోలుచున్న మావటివాఁడు తొలగుతొలగుమని చప్పట్లుకొట్టి కేకలు వైచెను. కాని యాశిష్యుఁడు కదలక తనమనస్సులో నిట్లువితర్కించు

కొనెను. నేనిప్పు డేలతొలగవలయును. నేను దేవుడను; ఏనుగుకూడ దేవుడే. దేవునకు దేవునివలన భయమేమియుండును? అని తలపోసి కదలక దారికడ్డముగా నిలిచెను. ఏనుగు విసురుగావచ్చి తొండముతో వానిని పట్టుకొనియెత్తి యావల విసరివైచెను. శిష్యుడు గట్టిగా గాయపడి గురువు కడకు పోయి జరిగిన వృత్తాంతమంతయుజెప్పి దేవున కెందుకపరాధముఁ జేయవలెననియడిగెను. అందు కుపాధ్యాయుడిట్లనెను. "సరే నీవు దేవుఁడవు. ఏనుగుగూడ దేవుఁడే. మావటివాడుకూడ దేవుఁడేకదా! మావటివానిరూపమున వచ్చి దేవుడు తొలంగుమని నిన్ను హెచ్చరించి నప్పుడు నీవు మూఢుడవై తొలగక యేలనిల్చితివి."

(16) భగవంతుఁడును వాని మహిమలు వర్ణించునట్టి భాగవత పురాణమును పరమ భాగవతోత్తముఁడైనభక్తుడును సమానులేయని గ్రహింపవలయును.

(17) ప్రతిపురుషుఁడు నారాయణుఁడు. మనుష్యుడు కాని జంతువు కాని మహర్షి కాని నీచుఁడుగాని సమస్తవస్తువులు నారాయణ స్వరూపములే.

(18) మంచుమాట చాలమంది వినియుందురుగాని దానిజూచి యుండదు. అట్లె మతబోధకులలో ననేకులు భగవంతుని గుణములు గ్రంథములలోఁ జదివి తెలిసికొన్న వారేకాని యనుభవముచేత గ్రహించినవారు లేరు. మఱియు మంచు జాలమంది కన్నులతోఁజూచిన వారేకాని నాలుకమీఁద వైచుకొని రుచిఁజూచినవారుపెక్కండ్రు లేరు. అట్లేమతబోధకులలో ననేకులు భగవద్విలాస మణుమాత్రముజూచి యుందురుగాని సంపూర్ణ దివ్య తేజముఁజూచియుండరు. మంచురుచి చూచినవాడే యది యెట్లుండునో చెప్పగలడు. ఒకమారు సేవకుడై మరియొకసారి స్నేహితుడై యింకొకసారి పరిణయజనుడై వేరొకసారి

తన్మయుడై యెవ్వడునానావస్థలలో భగవంతుని సహవాసముఁ జేయునో వాడే భగవంతుని గుణవిశేషములనొక్కొవర్ణింపఁ గలఁడు.

(19) చమురులేక దీపము వెలుగఁజాలదు. అట్లే భగవంతుడులేకుండ మనుష్యుడు బ్రతుకజాలఁడు.

(20) మానవ శరీరము పొయ్యిమీఁద కాలుచున్న కుండ. ఇంద్రియములు మనస్సు మొదలైనవి యాకుండలో నుడుకుచున్న బియ్యమో దుంపదినుసులో కాగుచున్న నీళ్ళోయని తలంపవలయును. నీవు కుండను గాని యుడుకుచున్న వస్తువులను గాని తాకుదువేని నీచేయి కాలును. అవేడి సహజముగ పుట్టియుండదది కాదు. అందులోనున్న వస్తువులది కాదు. ఆవేడి యగ్నిది. ఆలాగే మనుష్యునియందున్న ఈశ్వరుడను నగ్ని, ఇంద్రియములు, మనస్సు మొదలైనవాటిచేత వాటికృత్యములు చేయించుచుండును. ఆయగ్ని చల్లబడినపుడే ఇంద్రియములు, సర్వావయవములు తమతమ పనులను మానును.

(21) భగవంతు డిట్లనుచున్నాడు. "జంతువులను కరచునట్టి విషసర్పమును నేనే; ఆవిషబాధ తొలగించు మంత్రగాడను నేనే; శిక్ష విధించునట్టి న్యాయాధిపతిని. నేనే. కొరడాతో కొట్టి విధింపబడిన శిక్షను జరుపునట్టి వాఁడను నేనే.

(22) దొంగతనము చేయుమని దొంగను బురికొల్పువాడు దేవుడే. దొంగవచ్చును. జాగ్రత్తయని గృహవాసులను హెచ్చరించువాడు దేవుడే.

(23) సర్వేశ్వరుడు శరీరములో నెట్లు నివసించును? పిచికారీలో కఱ్ఱ యున్నట్లే దానిలోనుండియు దానికంటె భిన్నముగానుండును.

(24) భగవంతుఁడు సూది బెజ్జములో గొప్ప యేనుగును గుచ్చి సన్నదారమువలె యావలకు లాగగలఁడు. అతఁడు సర్వశక్తుఁడు. ఏమిచేయఁ దలఁచిన నది చేయఁగలడు.

(25) తామరకాడల చేతను నాచుచేతను గప్పఁబడిన చెఱువులో దుముకులాడు చేపలు పైకిఁగనఁబడవు. అట్లే మానవ శరీరములోనున్న సర్వేశ్వరుఁడు మాయచేతఁ గప్పఁబడి మానవదృష్టికి గోచరుడుగాడు.

(26) ఒకమనుష్యుడు కల్పవృక్షము క్రింద గూర్చుండి తాను రాజుకావలయునని కోరెను. అతఁడు వెంటనే రాజయ్యెను. తర్వాత నతఁడు చక్కని యప్సరస తనప్రక్కను కూర్చుండవలయునని కోరెను. వెంటనే దివ్యమంగళ విగ్రహముగలయొకస్త్రీ యతని ప్రక్కను గూర్చుండెను. పిమ్మట నతఁడు పెద్దపులి వచ్చిననన్ను పుడు మ్రింగిన నెట్లుండునో యనితలంచెను. అనుకొనుటయే తడవుగా నతడు పులిచేఁ టఁబడెను. భగవంతుడా కల్పవృక్షమువంటివాఁడు. "నేను దిక్కుమాలిన వాడను. నిర్భాగ్యుడను" అని యెవడు తలంచునో వాడుసరిగా దిక్కుమాలినవాడు నిర్భాగ్యుడునై యుండును. కానిపరమేశ్వరుఁడు తనకు తోడునీడయై తనకోరికలనెల్ల దీర్చి తన్ను గాపాడునని యెవడు తలంచి నమ్మునో వాడాయనవలన తనమనోరథసిద్ధుఁడఁబడయగలఁడు

(27) భూమి యజమానుఁడు మిక్కిలిభాగ్యవంతుడైనను దన నేలదున్ని వ్యవసాయముఁజేసెడు పంటకాపు తెచ్చియిచ్చెడుచిన్నకానుకను గూడ మిక్కిలి ప్రేమతోడను సంతుష్టితోడను గ్రహించి యానందించును. అట్లేభగవంతుడు సర్వశక్తుడయ్యు భక్తులు జేయునట్టిచిన్నిపూజకు సంతసించును.

(28) గంటవాయించినపుడు కంగుకంగుమను శబ్దములు స్పష్టముగా వినఁబడి లెక్కించుటకు వీలుగా నుండును. కాని గంటకొట్టుటమానగానేకంగుకంగుమను శబ్దములుపోయి రెండునిమిషములవఱకు గుయ్యి అను శబ్దము భేదించుటకు వీలులేక వినఁబడును. రెండువిధ

ములుగా వినబడునట్టి యాఘంటానాదమువలెనే భగవంతుడు నిరూపించుటకు శక్యముగాను నశక్యముగాను గూడనుండును.

(29) వ్రాత నేర్చుకొనుటకు మొదలుపెట్టిన పిల్లవాడు మంచి దస్తూరికుదుర్చుకొనుటకై ముందు పెద్దసున్నలవరవడిచూచి వ్రాసినట్లె మొదట మనస్సు ఆకారముగల వస్తువులమీద నిలిపి చిత్తవృత్తినిరోధముచేసికొనవలయును. ఆపనిలో మనము నెరవేరినిమేని నిర్గుణబ్రహ్మముమీద మనసు చులకనగా నిలుపవచ్చును.

(30) వేటకాడు పెద్దగురిచూచి కొట్టుటకుముందు అలవాటు చేసికొని యందారితేరిన తర్వాత సూక్ష్మలక్ష్యముల ననాయాసముగా గొట్టగలుగునట్లే మనుష్యుడు తనమనస్సు ముందుగా రూపములుగల విగ్రహములమీద స్థిరముగా నిలుపుట నేర్చుకొన్నపక్షమున కాలక్రమమున రూపములేని విగ్రహములమీదకూడ మనస్సు స్థిరముగా నిలపవచ్చును.

(31) భగవంతుడు సర్వస్వతంత్రుడు నిత్యుడునైన పరబ్రహ్మము జగత్పిత. దేశకాలములచేత పరిచ్ఛేదింపబడని నిర్గుణబ్రహ్మము మితియు మేరయులేని మహాసముద్రము. మనుష్యు డందులో ప్రవేశించెనా గట్టుగానలేక కొట్టుకొని మునిగిచచ్చును. కాని సగుణబ్రహ్మమైన హరియొక్క సాన్నిధ్యమును నేను పొందితినేని సముద్రమునబడి మునిగిపోయెడువాడు గట్టు జూచినప్పు డెంతయానందించునో అంతయానందమును శాంతిని బొందుచుండును.

(32) దేవుడునిరాకారుడు, సాకారుడుకూడనై యున్నాడు. అతడు ఆకారమును నిరాకారతనుగూడ వ్యక్తము (transcends) చేయగలపరవస్తువు. అతడు మరియెట్టివాడో యతడే చెప్పవలయును.

(33) భక్తిమార్గములో నొకానొక దశయందు భక్తుడు, ఆకారముగల యీశ్వరునిఁజూచి సంతుష్టుడగును. మరియొకదశలో నిరాకారుడైన యీశ్వరునియందు రమించును.

(34) సాకారుఁడైన యీశ్వరుఁడు కంటికగపడును. అంతేకాదు. మనమతనిని ముఖాముఖీగా జూచి ప్రియమిత్రునిఁ గనుగొన్నట్లే హస్తములతో స్పృశింపవలెను.

(35) నేనొకప్పుడు వస్త్రముల ధరించి మరియొకప్పుడు దిగంబరినై యుండునట్లే భగవంతుడొకప్పుడు సగుణుడు, మరియొకప్పుడు నిర్గుణుడు.

(36) నీరు పేరుకొని మంచుగడ్డ యైనట్లే దృశ్యమానమగు నీశ్వరమూర్తి అవాఙ్మానసగోచరమైన పరబ్రహ్మముయొక్క భౌతిక స్వరూపము. ఆమూర్తి ఘనీభవించిన సత్యానందస్వరూపమని చెప్పవచ్చును. జలమయమై జలముయొక్క రూపాంతరమైన మంచుగడ్డ నీటిలోఁ బడవైచినప్పుడు కొంతసేపటికి కరగి మరల నీరై పోవునట్లు సగుణబ్రహ్మము నిర్గుణబ్రహ్మముయొక్క రూపాంతరము. నిర్గుణబ్రహ్మమునుండి బయలుదేరి యాసగుణబ్రహ్మము కొంతసేపా రూపముతోనుండి యెట్టకేలకు నిర్గుణబ్రహ్మమునలీనమై యదృశ్యమగును.

(37) భగవంతుఁడు జ్ఞానసిలయుఁడు. అతనిపేరుజ్ఞానము. ఇన్ని మాట లెందుకు. అతఁడు జ్ఞానమయుఁడు జ్ఞానస్వరూపుఁడు.

(38) మనుష్యుల చేష్టలలో రెంటినిఁజూచి భగవంతుఁడునవ్వుచుండును. మొదటిది అన్నదమ్ములు పిత్రార్జితమైన యాస్తి "ఇదినాది యది నీది" యని పంచుకొనునపుడు. రెండవది రోగి చావునకుసిద్ధముగా నున్న పుడువైద్యుడొకడువచ్చి "నేను వీనిని బ్రదికించెద" నని చెప్పినపుడు.

(39) పిచ్చివాండ్రు, త్రాగుబోతులు, చిన్నపిల్లలు భగవంతు నిచేత నావేశింపఁబడినవారివలెనే తమమాటల యర్థము తెలియకయే తమంతటతాము సత్యము పలుకుచుందురు.

(40) సూర్యమండలము భూమికంటె నెన్నో రెట్లుపెద్దది. కాని కడుదూరముననుండబట్టి యదిగుండ్రనిపళ్ళెమువలెఁ గనబడుచున్నది. అట్లే భగవంతుఁడు అప్రమేయమహాస్వరూపుఁడు. కాని మన మాయనను మిక్కిలి దూరమున నుంటచే మనమాయన యౌన్నత్యమును లేశమైన భావింపలేకయున్నాము.

(41) తెలిసిగాని తెలియకగాని భగవంతుని నామస్మరణము మనము చేసినపక్షమున దానిఫలము తప్పక గల్గును. తనయిష్టప్రకారము నదికిఁబోయి స్నానముఁ జేసినవాఁడు స్నాన ఫలమును బొందును గదా! అట్లే యొకరి బలవంతముమీద నదికిఁబోయి స్నానముఁ జేసినవాఁడును స్నానఫలము ననుభవించును. ఒకఁడు నిద్రపోవుచున్నప్పుడు మరియొకఁడు వానిమీద నీళ్ళుపోసి స్నానము జేయించినను స్నానఫలమనగా పరిశుభ్రత వానికిఁ గలుగకపోవునా?

(42) హరికీర్తన లేగృహమందు నిత్యము గానము జేయఁబడునో యాగృహమున సైతాను కాలు బెట్టలేఁడు. (సైతానునగా మనుష్యులను దుష్టమార్గములకుఁ బురికొల్పి వానిచేతను పాపముఁ జేయించునట్టిభూతము.)

(43) ఒక రాజు బ్రాహ్మణునిఁ జంపి పశ్చాత్తాపము నొంది నాకీబ్రహ్మహత్యా మహాపాతక మెట్లుపోవు నని తెలిసికొనుటకై యొక మహర్షి యాశ్రమమునకుఁ బోయెను. అప్పుడు మహర్షి యింట లేకపోయెను. ఋషికుమారుఁడు రాజువలన వాని దీనవృత్తాంతమువిని "రాజా! నీవు మూడుసారులు రామనామమును స్మరియింపుము. అంతట నీపాతకము పోవును" అని చెప్పి వానింబంపి తండ్రి

వచ్చినతర్వాత జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పెను. అది విని మహర్షి కోపించి యిట్లనియె. "ఒక్కసారి రామనామ ముచ్చరించినంత మాత్రముననే బహుజన్మసంచితములైన మహాపాతకములు నశించునుగదా! రామనామము ముమ్మారుస్మరింపుమని యీతనితో నేలజెప్పితివి? నీకు రామనామమునందు భక్తి స్థిరముగా గుదరలేదు. నీవుచండాలుఁడవుగమ్ము" అనిశపింపగా ఋషికుమారుఁడు రామాయణములో జెప్పబడిన గుహుఁడయ్యెను.

(44) ఎఱిఁగియైననుసరే యెఱుఁగకయైననుసరే యమృతపుఁదొట్టిలోఁ బడినవాఁడు చావులేనివాఁడగును. అట్లే యిష్టపడియైననుసరే యిష్టపడకయైననుసరే భగవన్నామము నుచ్చరించినవాఁడు తప్పక ముక్తుఁడగును.

(45) గొప్ప పొగయోడ సరుకుపడవలను తెప్పలను వెనుకఁగట్టుకొని వాటి లాగుకొని నీటిమీద నిరపాయముగా పోవునట్లు జగద్రిక్షకుఁడొకఁడు భూమిపై నవతరించి మాయాసముద్రములో మునిఁగిపోకుండ వేలకొలఁది మనుష్యులను నిరపాయముగా నావలకు తీసికొనిపోవును.

(46) వరదవచ్చినప్పుడు నదులు వాగులు వెల్లివిరిసి చుట్టుప్రక్కలనున్న నేలయంతయు జలమయమగునట్లు చేయును. కాని వాననీరు ముచుపేర్పడినదారులగుండ ప్రవహించిపోవును. మహానుభావుఁడును భూమిపై నవతరించినపుడు వాని దయవల్ల నందరు ముక్తులగుదురు. సిద్ధులు మిక్కిలికష్టపడి ఘోరతపముచేసి తాముమాత్రమే మోక్షపదమును బడయుదురు.

(47) పెద్దదూలము ప్రవాహములో కొట్టుకొనివచ్చునప్పుడు తాను నూర్గురు మనుష్యులనైన నది రక్షించును. కాని యది మునుగదు. దుబ్బుకొట్టుకొని వచ్చినప్పుడు కాకివ్రాలిన నది మునిగిపోవును.

అట్లే యొకమహానుభావుఁ డవతరించెనేని వానిశరణముఁ జొచ్చిలెక్క లేనంతమంది మనుష్యులు రక్షింపఁబడుదురు. సిద్ధుఁడు మిక్కిలిశ్రమ పడి తన్నుమాత్రమే రక్షించుకొనఁగలుగును.

(48) ఆవిరియంత్రము సరుకులతో నిండిన గొప్పబరువు బండ్ల గుంపును వెనుకదగిలించుకొని యనాయాసముగా లాగుకొనిపోయి తాను గమ్యస్థానమును జేరుటయేకాక వాటినిగూడ చేర్చును. జగద్రక్షణ పరాయణులైన మహానుభావులుగూడ నిట్లే సంసార దుఃఖభారముచే నిండిన మనుష్యులను తండోపతండంబులుగా దీసు కొని పోయి భగవంతునిపాదములయొద్ద పడవేయుదురు.

(49) శ్రీరాముఁడు భూలోకమున నవతరించినపుడు అతఁడునా రాయణావతారమని సప్తమహర్షులు మాత్రమే గ్రహింపగలిగిరి. కావున దేవుఁడీలోకమున నవతరించినపుడు ఆయన యట్టివాఁడని తెలిసి కొనువారు స్వల్పముగానుందురు.

(50) పరబ్రహ్మమనియెడుపక్షముమీద లెక్కలేనందఱు రా ములు, కృష్ణులు, క్రీస్తులు వసియించుచుందురు. వారిలో నొకరిద్దరు నడుమనడుమ నీలోకమునకు వచ్చి యత్యద్భుతములైన మార్పులను జేయుచుందురు.

(51) అవతారపురుషుఁడు భగవంతునిదూత. అతఁడు మహాచ క్రవర్తియొక్క రాజప్రతినిధివంటివాఁడు. చక్రవర్తి తనరాష్ట్రములో దూరపుమండలములయందు సంక్షోభములు గల్గినపుడు వాటినడ చుటకై తనప్రతినిధి నచ్చటికి బంపినట్లే ప్రపంచమునం దేభాగము నందైన మతము క్షీణించి ధర్మములు చెడినపుడు ధర్మసంస్థాపనార్థ ము భగవంతుఁడు తనయవతారము నక్కడకుఁ బంపును.

(52) అవతారపురుషుఁ డొక్కఁడే కాని జీవసముద్రమునందుము నీఁగి యొకానొకచోట తేలి యచ్చట కృష్ణుఁడనిపించుకొనును. మరల

నింకొకచోట మునిఁగి లేచి క్రీస్తువనిపించుకొనును.

(53) మండువేసవిలో నీళ్ళు మిక్కిలి లోతునూతులనుండి మి క్కిలి శ్రమతోతోడుకొనవలసివచ్చును. కాని వర్షకాలమున దేశమం తయు వరదలతో నిండినపుడు నీరు ప్రతిచోట సులభముగాదొరకు ను. అట్లే జపతపములచేతను ప్రార్థనలచేతను మనము మిక్కిలి కష్ట మున భగవంతుని సాన్నిధ్యముఁ జేరఁగలుగుదుము. కాని యవతార మనియెడు వరదపొడిచినపుడు భగవంతుఁ డిక్కడక్కడ యనక ప్రతి స్థలమునందు దొరకును.

(54) ఉపయోగించెడువారులేక మంటితోకప్పఁబడి పూడిపో యి గడ్డిగాదముతో నిండియుండిన పాతబావి కనిపెట్టి త్రవ్వించి మరలనది జనులకుపయోగపడునట్లు చేయువాఁడు సిద్ధపురుషుఁడు. అది వుకెప్పుడు బావిలేనిచోట జలమున్నచో టెరిఁగి బావి త్రవ్వించు వాఁడవతారపురుషుఁడు. మంచితనము పవిత్రతమొదలైనయుత్తమలక్ష ణములు, ఎవరియందణఁగి సహజముగానుండునో వారికేసిద్ధపురుషులు మోక్షమీయఁగలుగుదురు. భక్తిజ్ఞానశూన్యమై యెడారివలె నెండి పోయిన హృదయములుగల పరమశుంఠలసహిత మవతారపురుషుఁడు రక్షించి మోక్షమునకుఁ బంపును.

(55) అర్జునుఁడు, రాముఁడు, కృష్ణుఁడు, ద్రౌపది, సీత, రాధ మొద లగువారు నిజముగా లోకమున వసియించిన మానవులుగారనియు కే వలముఁ గల్పితస్త్రీపురుషులనియు మీరుతలంపవద్దు. వారునిజముగా మనవలెనే రక్తమాంసమయములైన శరీరములుగలిగి లోకమునవిహ రించినవారేకాని వారు దేవతలగుటచే చారిత్రకపురుషులు గాను ఆత్మజ్ఞాన వేత్తలుగాను చూడ వ్యవహరింపఁబడుచున్నారు.

(56) భగవంతుఁడు మానవ శరీరముఁదాల్చి యవతరించినప్పు డితఁడెంతస్వార్థత్యాగముఁ జేయునో యించుకైన తెలిసికొనుటకష్టము.

(57) సముద్రమునకు మహాతరంగములెట్టివో పరబ్రహ్మమునకు జగద్రక్షకులైన మహానుభావు లట్టివారు.

(58) ఏస్థితిలోనున్నవాఁడు సిద్ధుఁడనంబడును? జ్ఞానపరిపక్వమైన యవస్థయందున్నవాఁడు సిద్ధుఁడు. బంగాళదుంప, వంకాయ మొదలగునవి పక్వమగునపుడు మెత్తపడును. పరిపక్వమొందిన యవస్థయందున్న సిద్ధుఁడుగూడ మెత్తనివాఁడై దయారసముఁగలిగి వినయసంపదఁగలిగియుండును.

(59) ఐదువిధములైన సిద్ధులీప్రపంచమునఁగనఁబడుచున్నారు.

(1) స్వప్నసిద్ధులు. అనఁగా స్వప్నములలో జ్ఞానబోధముఁ గలిగి సిద్ధులైనవారు.

(2) మంత్రసిద్ధులు. మహామంత్రోపదేశములవల్ల సిద్ధులైనవారు.

(3) హఠసిద్ధులు. ఆకస్మికముగా సిద్ధులైనవారు. పాతుదొరుకుటవల్ల భాగ్యవంతురాలైన పిల్లను పెండ్లియాడుటవల్లగాని హఠాత్తుగా నిరుపేద భాగ్యవంతుఁడైనట్లే పాపకర్ములు పశ్చాత్తాపము వల్లనో మరేకారణముచేతనో ఆకస్మికముగ సిద్ధులగుచుందురు. అట్టివారే హఠసిద్ధులు.

(4) కృపాసిద్ధులు: రాజానుగ్రహముచేత పరమదరిద్రుఁడు భాగ్యవంతుఁడైనట్లు పరమేశ్వరానుగ్రహముచేత నాత్మావబోధముఁ గలిగినవారు కృపాసిద్ధులనఁబడుదురు.

(5) నిత్యసిద్ధులు: వీరెప్పుడు పరిపూర్ణులే. గుమ్మడితీగ ముందు కాయలుకాచి పిమ్మట పువ్వుపూచినట్లు నిత్యసిద్ధులు సత్కర్మలవల్ల సిద్ధులుగాక ముందుగానే సిద్ధులైపుట్టి తర్వాత సత్కర్మలఁ జేయుదురు. వారు కర్మలుజేయుట తమసిద్ధి కొరకుగాదు. మానవకోటికి కార్యాచరణమువల్ల దారిఁజూపుటకు మాత్రమే.

(60) హోమపక్షులని యొక జాతిపక్షులుగలవు. అవి యాకా

శమున మిక్కిలి యెత్తైన ప్రదేశములయందుండును. ఆప్రదేశములు వాటికి మిక్కిలి ప్రియములు. ఆతావులువిడిచి అవి క్రిందికి దిగనిచ్ఛగింపవు. అవి యాకాశమునందే గూడుకట్టును. ఆగుడ్లు భూమి యొక్క యాకర్షణశక్తిచేత నేలబడుటకై క్రిందికి దిగజారును. అవి యున్నచోటికి నేలకును దూరము మిక్కిలి యెక్కువగుటచే నవి నేల బడుటకు కొంతకాలముపట్టును. నేలపడకముందే ఆ గుడ్లు పొదిగి తల్లులు పిల్లలను జేయును. ఆపిల్లలకు పైనుండుటే సహజలక్షణమగుటచేత నధో మార్గమునువిడచి పూర్వము తమతల్లులుండిన స్థానమున చేరును. శుకయోగి, నారదుఁడు, యేసుక్రీస్తు, శంకరాచార్యులు మొదలగు మహానుభావులా పక్షులవలెనే మిక్కిలి చిన్నతనమునందే యీ లోకసంబంధములను విడిచిపెట్టి యూర్ధ్వలోక దృష్టిగలవారై దివ్యజ్ఞాన తేజముగలిగి కృతార్థులైరి. వారే నిత్యసిద్ధులు.

(61) దివ్యమహర్షులు భగవంతునకాప్తబంధుకోటిలోఁ జేరుదురు. వారు దేవునకు, మిత్రులు, బంధువులు మొదలైనవారివంటివారు. సాధారణమనుష్యులు భగవంతునకు దూరపరిచితులు.

(62) ఒకమేకుతో మనము కొబ్బరికాయను గట్టిగా పొడిచితిమేని మేకు పెంకులోనుండి లోపలిగుంజులోనికి దిగును. కాని కాయ కురిడియైనప్పుడు మేకు పెంకును భేదించుకొని పోవునుగాని కురిడీకి తగులదు. ఎందుచేతననగా కురిడీపెంకు నంటుకొనక విడిగానుండును. ఏసుక్రీస్తు కురిడికాయవంటివాఁడు. ఆతనియాత్మ కురిడీ, అతని శరీరము పైచిప్ప. అతనియాత్మ శరీరమునంటక వేరుగానుండును. అందుచేతనే నతనిశరీరమునకు గలిగిన బాధ యాత్మను నొప్పింపజాలక పోయెను.

(63) ఒకసాధువు జనసమ్మర్దముగల యొక పట్టణవీధిలో నడచుచు పొరబాటుచేత నొక దుర్మార్గునివ్రేలు త్రొక్కెను. ఆ దుర్జ

నుఁడు కోపావేశమునొంది సాధువును తన చేతిదుడ్డుకఱ్ఱతో గొట్టెను. సాధువు దెబ్బలకోర్వలేక నేలబడి మూర్ఛిల్లెను. ఆయన శిష్యులు నానావిధములైన యుపచారములుచేసి కష్టపడి యతనికి తెలివివచ్చునట్లు చేసిరి. కొంత తెలివివచ్చినతర్వాత శిష్యులలో నొకఁడు గురువు నిట్లడిగెను. స్వామీ! మీకుపచారము చేయుచున్నవా రెవరో గుర్తు పట్టగలరా? ఆ సాధు విట్లు బదులుచెప్పెను. "నన్ను గొట్టినవాఁడే నా కుపచారముచేయుచున్నాఁడు" నిజమైన సాధువునకు మిత్రశత్రువులు సమానులు.

(64) పాలు నీరు కలసియున్నప్పుడు హంస నీరక్షీరములను విభాగింపఁగలదు. అనగా పాలు త్రాగి నీరు విడిచిపెట్టగలదు. తక్కినపక్షులాలాగున జేయజాలవు. అట్లే దేవుఁడు మాయతోఁగలసి యున్నాఁడు. సామాన్యమనుష్యులు మాయకంటె భిన్నముగానున్న పరమేశ్వరుని జూడఁజాలరు. పరమహంసమాత్రమే మాయను ద్రోచివైచి భగవంతుని గ్రహింపఁగలుగును.

(65) గాలి మంచిగంధపు వాసనను తెచ్చును. అమేధ్యవాసనను తెచ్చును. కాని గాలి యీ రెండింటితోఁగూడ గలియదు. అలాగే సిద్ధుఁను ప్రపంచమునందు నివసించుచున్నను దానినంటియుండఁడు.

(66) సిద్ధుఁడు నీటిలోనున్న తామరాకువలె బురదలోనున్న చేఁపవలె నుండును. తామరాకునకునీరంటదు. చేఁపకు బురద యంటుకొనదు.

(67) ప్రవాహముగ యేటినీరు పారుదల గలిగియుండుటచే చెరువునీరువలె పాడుగాదు. అట్లే ధనము నిస్సంగులైనవారిచేత బడి వెంటనే మరియొకచోటికి బోవునుగాని నిలువయుండదు.

(68) కాలిపోయినత్రాడు దానియాకారమును విడువక బూడిదయై బూడిదత్రాడువలె నుండును. కాని దానితో మన మేవస్తువును

కట్టజాలము. అట్లే ముక్తి జెందినవాఁడు తనయహంకారమునుమాత్రము విడిచి యాత్మస్వరూపమును నిలుపుకొనుచున్నాఁడు.

(69) నీటిపక్షి నీటిలో మునిగినప్పటికి తడిదానివెండ్రుకలనంటు కొనదు. ఆలాగే సిద్ధుఁడు ప్రపంచము నంటి ముట్టకుండ జీవించును.

(70) మేఁకయొక్క తల తెగవేసినతర్వాతగూడ దానిశరీరము జీవమున్నట్లే కొంత సేపు కొట్టుకొనును. ఆలాగే సిద్ధులలోనున్న య హంకారము నిర్మూలనమైనప్పటికి భౌతికశరీరముయొక్క వ్యాపారము లకు తగినంత చైతన్య మతనిలో నుండును. కాని సంసారముతో నతనిని మరల బంధించుటకు మాత్రి మది చాలదు.

(71) అచ్చమైన బంగారముతో నగలు చేయుటకు వీలులేదు. మరియొక ద్రవ్యమేదో కొంతకలుపవలెను. అట్లే మనుష్యుఁడు కొంత మాయతో కలసి యుండవలెను. మాయలేనివాఁ డిరువదియొక్కరోజు కంటె నెక్కువ బ్రతుకఁడు. శరీరమున్నంతకాలము దేహసంబంధ ములైన వ్యాపారములను జరుపుటకు మిక్కిలి కొంచెమైనను మాయ యుండవలెను.

(72) దాగుడుమూతలాటలో తల్లియని యొకఁడు కూర్చుండి ఆట తానాడక కన్నులు మూయుచుండును. పరుగెత్తుకొనివచ్చి తల్లి నిముట్టుకొన్నవాఁడు దొంగకాఁడు. ఆలాగే భగవంతునొక్కసారి చూచినవాఁడు సంసారసంబంధమైన సంకెళ్ళచే కట్టబడఁడు. ఆటలో తల్లిని ముట్టుకొన్న పిల్లవానిని తక్కినపిల్లలు తరుముకొనివెళ్ళి దొం గను సేయరు. అందుచేత నతఁడు స్వేచ్ఛగా నిష్టమువచ్చినచోటికి బోవవచ్చును. అట్లే యీప్రపంచమను గొప్పయాటలో భగవంతుని పాదముల నొక్కసారి ముట్టుకొన్నవానికి భయములేదు.

3(7) పరశువేదిని స్పృశియించుటవల్ల నినుము బంగారమగు ను. ఆబంగారము పెంటలో పడవైచినను నేలపూడ్చిపెట్టినను నదియు

మేలిమిబంగారముగానే యుండును. కాని వెనుకటి యినుపముక్క కానే రదు. భగవంతునిపాదములొక్కసారి స్పృశియించినవాని స్థితికూడ నిట్టిదే. అట్టివాఁడు నిర్జనమైన యరణ్యములోనుండనీ జనసమ్మర్దము గల నగరమునందుండనీ యతని మాలిన్య మెంతమాత్రము నంటదు.

(74) పరశువేదినిదాకినతోడనే యినుపకత్తి బంగారుకత్తి యగును. అది పూర్వస్వరూపమును విడువకున్నను నరుకునట్టి శక్తి యట మీఁద కలిగియుండదు. అట్లే భగవంతుని పాదములనుబట్టుకొన్న వాఁ డెప్పటి యాకారముతోనున్నను నటమీఁద దుష్కార్యము చేయ జాలఁడు.

(75) సూదియంటురాతికొండ సముద్రములో డాగియుండి నీటి మీఁద నడచుచున్న యోడ నాకర్షించి దానిలోనున్న నినుపమేకులను తన ప్రక్కకు లాగుకొని కఱ్ఱపలకలు విడిపోవునట్లు చేసి ముంచివే యును. అట్లే మనుష్యునియాత్మ సర్వేశ్వరుని ప్రభావమను అయ స్కాంతముచేతనాకర్షింపబడినప్పుడు ఆసర్వేశ్వరప్రభావము జీవాత్మ యొక్క స్వార్థపరత్వమను నహంకారమును నాశనముజేసి యీశ్వర దయాసముద్రములో దానిని ముంచివేయును.

(76) పాలు నీలుకలసినప్పుడు మరల వానినెవ్వఁడు వేరుచేయ లేనట్లు కలసిపోవును. ఆలాగే యాత్మాభివృద్ధినికోరు క్రొత్తశిష్యుఁడు వీరువారనక యెల్లవారితో గలిసిమెలసి తనపూర్వవిశ్వాసములను నాశనము చేసికొనును. పాలు కాచి వెన్న చేసినతర్వాత నావెన్న నీటిలో వైచినప్పుడు దానిలో గలియక తేలుచుండును. ఆవిధముగానే జీవాత్మ పరమాత్మయొక్క సంపర్కము కలిగియుండినపక్షమున నది యేసంఘములోనున్నను దానియొక్క కాలుష్య మంటకుండ నిర్మల మైయుండును.

(77) అత్తవారింటికి క్రొత్తగా కాపురమునకు వెళ్ళినపడుచు

సంతానము కలుగునవరకు మిక్కిలి జాగరూకతతో నింటిలోని పనిపాటలు చక్కపెట్టుకొనుచుండును. కాని బిడ్డపుట్టినతోడనే మునుపటి వలెనే యింటిపనులమీద దృష్టినిలుపదు. అవిచేయుటతో నామెకు మునుపటివలె సంతోషముండదు. మీదుమిక్కిలితనబిడ్డలో నేస్వర్గము మోక్షమున్నదని రెండవపనిపై ధ్యానముంచక దానిముద్దుముచ్చటలతోనే కాలముపుచ్చును! అలాగుననే మనుష్యు డజ్ఞానములోఁబడి యున్నంతకాలము ప్రపంచవ్యాపారములను చేయుచుండును. కాని భగవంతుని దర్శనమైనతోడనే లోకవ్యాపారములమీద వానికి రుచి తప్పిపోవును. భగవంతుని సేవసేయుటయే యతనికి సుఖము.

(78) మనుష్యుఁడు సంతకు దూరముగా నున్నప్పుడు వానిచెవులకు హోరుమను ధ్వనిమాత్రమే వినఁబడునుగాని మనుష్యకంఠములు స్పష్టముగా వినబడవు. కాని యతడు సంతలో బ్రవేశించినతర్వాత నొకఁడు దుంపలకొరకు, వేరొకఁడు వంకాయలకొరకు, మరియొకడు మరియొక వస్తువుకొరకు బేరమాడుచున్నట్లు మనుష్యకంఠములు స్పష్టముగా వినఁబడును. అట్లే మనుష్యుడు భగవంతునకు దూరముగానున్నంతసేపు హేతువాదములలోను గొప్పచర్చలలోను డిగి కళవళపాటు పొందుచుండును. కాని భగవంతునిసన్నిధికిఁబోయినతోడనే చర్చలు, హేతువాదములు నడుగంటును. భగవంతుని మాయలు మిక్కిలిస్వల్పముగా నతఁడు తెలిసికొనఁజాలును.

(79) ఎంతకాలము మనుష్యుఁడు ఓయీశ్వరా! ఓయీశ్వరా! యని పిలుచుచుండునో యంతకాలము వానికీశ్వరుఁడు కనబడలేదన్నమాటే. ఎందుచేతనన సర్వేశ్వరుని జూచినవాఁడు నోరెత్తక నిశ్శబ్దముగా నుండును.

(80) తుమ్మెద తామరరేకులలో జొచ్చి యందలి తేనెత్రాగకమునుపు జుమ్మని రొదచేయుచు, పువ్వుచుట్టు తిరుగుచుండును, పువ్వ

లోపలజొచ్చి మకరందము గ్రోలినపిదప నది నిశ్శబ్దముగా నుండును. మనుష్యుఁడు భగవంతునిగూర్చి చర్చలు వాదములుచేయుచుండెనేని దృఢభక్తియనెడు మకరందమును వాఁడు రుచి చూడలేదని యర్థము. అది యొక్కసారి చవిచూచిన నతఁడు మరి నోరెత్తఁడు.

(81) చిన్నపిల్లలు బొమ్మలుపెట్టుకొని యాడుకొనుచుందురు. తల్లికనబడగానే అమ్మా! అమ్మా! యని వెంటబడుచుందురు. అట్లే మీరుకూడ ధనము, గౌరవము, కీర్తి యను బొమ్మలతో నాడుకొనుచు నెట్టిచింతలు లేక యున్నారు. కాని లోకమాతయైన యాదేవి నొక్కసారి మీరు చూచితిరేని ధనముమీఁదను, గౌరవముమీఁదను కీర్తిమీఁదను మీరు దృష్టియుండదు. అవి యావలబారవైచి మీరు తల్లి వెంట బడుదురు.

(82) తాతపూరియను దిగంబరస్వామి యిట్లు చెప్పుచుండెడి వాఁడు. "ప్రతిదినము తోమకపోయినపక్షమున నిత్తడిపాత్రి త్రుప్పు పట్టును. అట్లే మనుష్యుఁడు ప్రతిదినము భగవంతుని ధ్యానముచేయక పోయినపక్షమున నతని హృదయము క్రమక్రమముగా మలినమగును" అతనికి శ్రీరామకృష్ణపరమహంసయిట్లు బదులుచెప్పెను. "అవును. అదినిజమేకాని యాపాత్రి బంగారపుది యయినపక్షమున నిత్యము తోమనక్కఱలేదు. అట్లే భగవంతుని సాన్నిధ్యము జేరిన మనుష్యుఁడు నిత్యమును జపమును, ప్రార్థనలు చేయనక్కరలేదు."

(83) పటికబెల్లము రుచిచూచినవానికి పట్టిబెల్లము రుచియింపదు. గొప్పమేడలో నిద్రిపోయెడు వానికి మురికిగుడిసెలో నిద్రిపట్టదు. అట్లే బ్రిహ్మానందము నొక్కసారి చవిచూచిన మనుష్యుఁడు ప్రపంచసంబంధమైన తుచ్ఛసౌఖ్యములపై వాంఛ నిలుపఁడు.

(84) రాజుగారి ప్రాసాదములోనున్న యంగన బిచ్చగాని వలపునకు జిక్కదు. అట్లే యీశ్వరానుగ్రహమునకు బాత్రుఁడైన మను

ష్యుఁడు బ్రపంచసంబంధమైన స్వల్పవస్తువులనుగోరఁడు.

(౮౫) బయలుమీఁదనున్న మనుష్యుఁడు కాలిక్రిందనున్న గడ్డి పరకలను, ప్రక్కనున్న దేవదారువృక్షములనుజూచి "ఈవృక్షమెంత పొడుగుగానున్నదో, ఈగడ్డిపరక లెంతచిన్నవిగా నున్నవో" యని యాశ్చర్యమునొందును. కాని యతఁడొక గొప్ప పర్వతమెక్కి దాని శిఖరముమీఁదనుండి క్రిందికి చూచెనేని బొడుగైన దేవదారుచెట్టునేల నంటియున్న గడ్డిపరకయు నతనిదృష్టికిసమానముగాఁగనబడును. నేల యంతయు నొకపచ్చని బయలుగా నతనికంటి కగపడును. అట్లే యీలోకదృష్టిగల మనుష్యులకు గౌరవతారతమ్యములు ధనమువలన గలిగిన భేదములు కనబడుచుండును. కాని దివ్యజ్ఞాననేత్రము తెరచి నప్పుడు లోకములో నెక్కువతక్కువలు కనఁబడవు.

(౮౬) వట్టికుండలో నీరు పోసినపక్షమున నొకవిధమైన చప్పుడ గును. కాని నిండుకుండలో నట్టి చప్పుడుకాదు. అట్లే భగవంతుని జూడని వానికి వట్టి యార్భాటములు మెండుగా నుండును. కాని యత డు దేవుని చూచినప్పుడు వట్టియార్భాటములు మాని బ్రహ్మానంద మును నిశ్శబ్దముగా ననుభవించును.

(87) స్త్రీతనకు తనమగనికి జరిగెడు రహస్యసంభాషణము తే నకు మిక్కిలి నమ్మికగల చెలికత్తెలకు మాత్రమే చెప్పును గాని యితరస్త్రీలకు చెప్పదు. అట్లేపరమభక్తుఁడు సర్వేశ్వర సాంగత్యము వలన తనకు గలిగిన సాంద్రానందమును భక్తునకే తెలియజేయును. కాని యితరులకెరుగజేయఁడు. అది చెప్పినదాక వాని కొకప్పుడు తోచదు.

(88) మిడత వెల్తురుచూచెనా మరలనది చీకటిలోనికి పోదు. పంచదారకుప్పలోఁ బడిన చీమ యక్కడే చచ్చునుగాని యది దాటి

పోఁజాలదు. అట్లే సద్భక్తుఁడు వైరాగ్యమువలన తనజీవితమును భగవంతున కర్పణ జేయుచున్నాఁడు.

(89) దైవభక్తుఁడు తన దైవమును తల్లియని పిలుచుటలో నెక్కువ యానంద మేల పొందుచున్నాడు? ఏలయన బిడ్డకు తనతల్లి యొద్దనెక్కువచనువు లుండును. అందుచే నామె యాబిడ్డకు మిక్కిలి ప్రియముగా నుండును.

(90) భంగుత్రాగువాఁడు పదిమందిని గూడుకొని త్రాగినట్లే సద్భక్తుడు తానొంటిగా నీశ్వరకీర్తనము చేయఁజాలఁడు.

(91) ఆవులమందలో నొకక్రొత్త జంతువు చొరబడినయెడల గోవులన్నియు దానిని బొడిచి పొడిచి మందనుండి పారఁదోలును. కాని యామందలో మరియొకయావు చొరబడినయెడల నొకదాని శరీర మొకటి నాకుకొని దానితో స్నేహముచేయును. అట్లే యొక భక్తుఁడు మరియొకభక్తుని కలసికొనినప్పుడు వారిరువురు మిక్కిలి సౌఖ్యమనుభవింతురు. ఒండొరుల వియోగము నోర్వఁజాలరు. కాని పరిహాసముఁ జేయవచ్చిన వారినిమాత్రముఁ జేరనీయరు.

(92) భక్తున కేది బలము? భక్తుఁడు దేవుని ప్రియపుత్రుఁడు. కావున కన్నీళ్ళే వానికి బలము. (బాలానాం రోదనంబలం)

(93) కోఁతిపిల్ల తల్లిని గట్టిగా గౌఁగిలించుకొనును. పిల్లిపిల్ల తల్లిని గౌఁగిలించుకొన లేదు. కాని తల్లిదగ్గఱ నున్నప్పుడు జాలిగా నేడ్చును. కోఁతిపిల్ల తల్లిని గట్టిగా పట్టుకొనలేక పట్టు సడలించెనా నేలఁబడి చచ్చును. పిల్లిపిల్ల తల్లినేనమ్ముకొని యుండునుగావున దాని కట్టి యపాయ మెన్నఁడును గలుగదు. పిల్లిపిల్లను దల్లి నోటగఱచుకొని తీసికొనిపోవును. తనబలమే నమ్ముకొన్నవారికిని, దైవమునే నమ్ముకొన్నవారికిని గలభేద మిట్టిదియే. కోఁతిపిల్ల తనచేతిపట్టునే నమ్ముకొనునుగావున దాని కెన్నఁడైన నపాయము గలదు. పిల్లిపిల్ల

తల్లినే నమ్ముకొనునుగావున దానికి భయము లేదు.

(94) స్వాతివాన కురియునపుడు ముత్తెపుచిప్ప సముద్రము యొక్క అడుగుభాగమునుండి పైకివచ్చి నీటిపైఁ దేలుచుండును. ఆ వానచుక్కలు కొన్ని తనలోఁబడువఱకు నోరు తెఱచుకొని యది యా నీటిమీఁదనే యుండును. ఆవర్షబిందువులు పడినపిదప నాముత్తెపుచిప్ప యడుగునకుఁ బోయి యానీటిచుక్కలను మంచిముత్యాలుగాఁ జేయును. అలాగే బ్రహ్మజ్ఞానోపదేశముఁ జేయునట్టి సద్గురువు తమకు లభించువఱకు నొకచోటినుంటి యొకచోటికి విధివిరామములు లేక తిరుగునట్టి జ్ఞానాసక్తులు కొందఱు గలరు. అట్లుసంచరించునపుడు వారియదృష్టమున జ్ఞాననిధియైన గురువు దొరకెనేని వానియుపదేశామృతమును వారు తనివిదీఱఁ గ్రోలి సంసారబంధములను భేదించి లోకమున కగపడకుండ నేమూలనో యడఁగి యుందురు.

(95) చెకిముకిరాయి యెంతకాలము నీళ్ళలోఁబడి యుండినను దాని తేజస్సును గోలుపోదు. నీటిలోనుండి తీసినవెంటనే యినుపముక్కమీఁద దానిని గొట్టిచూడుము. అగ్నికణము తక్షణమే బయలుదేఱును. దృఢవిశ్వాసముఁ గలభక్తుఁడుకూడ నట్టివాఁడే. అతఁడు లోకసంబంధమైన మాలిన్యములచేత చుట్టఁబడియుండినను వాని భక్తివిశ్వాసములు మాత్రము పోవు. భగవన్నామము చెవినిఁబడగానే యతఁ డానందముచేఁ బరవశుఁడగును.

(96) రాయి నీటిలో లక్షలకొలఁది సంవత్సరము లున్నను మెత్తబడదు. కాని మట్టినీరు దగ్గఱగానే మెత్తఁబడి బురదయగును. అల్లాగే నిజమైన భక్తివిశ్వాసములు గలవాని హృదయము కష్టపరంపరలకు లొంగి మెత్తబడదు. చంచలభక్తిగలవాఁడు స్వల్పకష్టమును గూడ సహింపలేక చెడిపోవును.

(97) చిన్నబిడ్డయొక్క యమాయకత్వమెంతో చిత్రముగా

నుండును. ధనరాశి వానియెదుటఁ బోసినను దానివైపుఁ జూడక చి
న్న బొమ్మను పుచ్చుకొని యానందించును. విశ్వాసముగలభక్తుఁడు
నట్టివాఁడే. లోకులందఱు ధనము, గౌరవము బిరుదులు గోరుచుండఁ
గా భక్తుఁడొక్కఁడే యవి కోరక యీశ్వరునిఁగోరును.

(98) భగవంతుఁడు పంచదార కుప్పవంటివాఁడు. చిన్న చీమ
యాకుప్పకడకుఁబోయి కొంచెము చక్కెరఁ దీసికొనిపోవును. అంత
కంటె పెద్దచీమ మరికొంచెమెక్కువ పంచదారఁ దీసుకొనును. కాని
యాకుప్ప తరుగక మునుపటివలెనే యుండును. ఈశ్వరభక్తులా చీమ
లవంటివారె. ఒక్క యీశ్వరగుణముననే వారు మత్తిలియానందిం
తురు. భగవంతునిగుణము లన్నియు నెట్టివాఁడును దనలో నిముడ్చు
కొనఁ జాలఁడు.

(99) తర్కశాస్త్ర పండితుఁడొకఁడు శ్రీరామకృష్ణపరమ
హంస యొద్దకుఁబోయి "జ్ఞానము, జ్ఞాని, జ్ఞేయము నగఁగా నేమి" య
ని యడిగెను. ఆపరమహంస వాని కిట్లనియె. అయ్యా! ఈశాస్త్రచ
ర్చాచమత్కారములను నే నెఱుఁగను. నేను జగజ్జననియైన దేవినొక్క
తనే యెఱుఁగుదును. నే నామె పుత్రుఁడను.

(100) శ్రీహరినామము చెవినిఁ బడగానే యెవనిశరీరము పుల
కరించునో యెవ్వాఁడాయన పేరు వినఁగానే యానందబాష్పముల విడు
చునో వానికదే కడపటి జన్మమనియు నటుమీఁద జన్మములు లేవని
యు గ్రహింపవలయును.

(101) శరీరముమీఁద బయలుదేఱిన తామర గోకినకొలఁది
దురద హెచ్చును. దురద హెచ్చినకొలఁది గోకబుద్ధిపుట్టును. గోకిన
ప్పుడు హాయిగానుండును. ఆలాగే భగవన్నామకీర్తనము చేయఁ
బూనిన భక్తుఁడు విసుగులేక భజన చేయుచునేయుండును. చేసినకొలది
యతని భక్తి హెచ్చుచుండును.

(102) గొప్పధాన్యపు వర్తకునియొద్ద పండ్లుకొనుటకు మెవఁడైన వచ్చినపుడు కొలగాఁడు విరామములేక కొల్చుచునేయుండును. కూలివాండ్రు గాదిలోనుండి ధాన్యము తెచ్చి కొలగానిముందర పోయుచుందురు. అందుచేత కొలగాని ముందరనున్న ధాన్యము తరుగదు. కాని స్వల్పధాన్యపు వర్తకుని గాదిలో విశేషధాన్యమునిలువయుండదు. కూలివాండ్రు తట్టలతోఁ దెచ్చి పోయవలసిన యవసరముండదు. ఆలాగే మహాభక్తులహృదయములలో భగవంతుఁ డెప్పటికప్పుడు తరుగులేని యూహలను గలిగించుచుండును. భక్తులు నిరంతరము నవనవకల్పనలతో పరమేశ్వరుని భజియించుటకుఁ గారణమదే. ఇక గ్రంథపఠనమువలననే జ్ఞానము నేర్చుకొన్న భక్తుఁడు స్వల్ప ధాన్యపు వర్తకులవలె నిలవసరుకు వేగముగా వ్యయముచేసి క్రొత్త సరుకు లేక కూర్చుండును.

(103) తండ్రితాతలనాటనుండి వ్యవసాయమే వృత్తిగా గల కాపువాఁడు పండ్రెండు సంవత్సరములు వానకురియకపోయినను, నేల దున్నుట మానఁడు. క్రొత్తగా నాగలిపుచ్చుకొని దున్ననారంభించినవాఁడు మొదటిసంవత్సరము వానకురియనిపక్షమున భయపడి వ్యవసాయమును మాని పారిపోవును. అట్లే యావజ్జీవము పరమేశ్వర సేవయందే గడపిన పరమభక్తుఁడు దైవము తనకు కనబడకపోయినను భక్తి మానఁడు.

(106) ఈశ్వరభక్తియను నమృతమును సంపూర్ణముగా గ్రోలిన సద్భక్తుఁడు త్రాగుబోతువంటివాఁడు. అందటిచేత నతఁడు సామాన్యపు మర్యాదల నెఱుఁగక వర్తించుచుండును.

(105) నాచు పరివాహముగల నదులలో మొలవదు. అది పరివాహములేని చిన్నచెఱువులు మొదలగువానిలో మొలుచును. ఆలాగే నిర్మలములై విశాలములై సారపరాయణ లేనిమనుష్యులు

నడుపుచున్న సంఘములలో భేదములుపుట్టవుకాని యంతఃకరణశుద్ధి లేక స్వార్థపరాయణులైయుండు మనుష్యులు నడుపునట్టి సంఘముల లో నదిస్వేచ్ఛగాఁ బెరుగును.

(106) యోగులును సన్యాసులును సర్పములవంటివారు. పామెన్నడు తనకొఱకెన్నడు కన్నముత్రవ్వుకొనదు. చీమలు పెట్టిన పుట్టలలో దూరును. ఒకకన్నము నివాసయోగ్యము కానప్పుడు మరి యొక కన్నములో దూరుచుండును. అట్లే యోగులు సన్యాసులు తమనిమిత్తము స్వగృహములు నిర్మించుకొనక నేఁడొకచోట రేపొక చోట పరుల గృహములలో కాలము గడపుచుందురు.

(107) యోగిమహిమ పరమయోగియెఱుఁగును. నూలువర్త కుఁడు నూలుకట్ట చేతఁబట్టుకొని యదియెన్నవనంబరు నూలో చెప్పఁ గలఁడు గాని మరియొకఁడు జెప్పజాలఁడు.

(108) ఒకయోగి రాచబాట సమీపమున సమాధియను గొప్పయవస్థలోనుండి స్మారక మెఱుఁగక పండుకొనెను. ఒకదొంగ యాదారిని బోవుచు యోగిని చూచి తనలో నిట్లనుకొనెను. "ఇచ్చ ట పండుకొన్నవాఁడు దొంగ. ఏదో యింటికి మంచి కన్నమువైచి యలసిపోయి పండుకొన్నాఁడు. రాజభటులువచ్చి వీనిని పట్టుకొనిత న్నుదురు. నేను పెందలకడ పారిపోదును." అని పరుగెత్తెను. ఆత రువాత నొకత్రాగుబోతు వచ్చి యతనిని జూచి యిట్లనియె. "ఓరి నాయనా! తప్పత్రాగి గోతిలో పడినావా? నీకంటె నేనేనయమూ. చెడత్రాగి నప్పటికి నేను తూలిపడుట లేదు." చిట్టచివరకు యోగి యొకఁడా దారిని బోవుచు నేలఁబడియున్న యోగిని జూచి యతడును సమాధిలోఁ బడియున్నట్టు గ్రహించి భక్తితో యతని పాదములకు నమస్కరించెను.

(109) రాణిరాసమణి కట్టించిన కాళికాలయముదగ్గరకు నొక

నాఁడొక సాధువు వెళ్ళెను. అప్పుడొక కుక్క యచ్చట విడువబడిన మృష్టాన్నము దినుచుండెను. అదిచూచి సాధువు కుక్కను గౌఁగలించుకొని "అన్నా ఈకూటిలో నాకు భాగముపెట్టకుండ నీవొక్కఁడవే తినుచున్నావా" యని దానివిస్తరిలోఁ జొరబడి దానితోకలసియన్నముతిననారంభించెను. అక్కడనున్న జనులు సాధువు పిచ్చివాఁడని తలంచిరి. కానియాసాధువు దేవాలయమునెదుట నిలువఁబడి మహామంత్రములతో దేవినిస్తుతించెను. ఆస్తోత్రముయొక్క యుద్రేకముచేత దేవాలయము గడగడవడకినట్లగపడెను. అప్పుడు చుట్టుపట్లనున్న జనులు మునుపు వెఱ్ఱివాఁడనుకొన్నయతఁడు గొప్పసాధువని తలంచిరి. నిజమైనసాధువులు పిల్లలవలె పిచ్చివాండ్రవలె మురికిగుడ్డలు గట్టుకొనియు మారువేషములు వేసికొనియు దేశాటనము చేయుచుందురు.

(110) ఒంటిగానున్నప్పుడు అనగా తానుచేసెడు దుష్కార్యముచూచి నిందించువారెవరు లేనప్పుడు సయితము నెవఁడు తప్పుగాని పాపముగాని చేయఁడో యతఁడే సాధువు, అతఁడే యోగి.

(111) బంగాళీభాషలోనున్న శ, ష, స, యను మూడక్షరములు సమానమైన యుచ్చారణ కలవి. శాంతింపుము, శాంతింపుము, శాంతింపుమని వానికర్థము. ఈయర్థమునుబట్టి మన మక్షరమును నేర్చుకొనునాఁడు మొదలుకొని శాంతమే యవలంబింపవలెననిమనపెద్దలభిప్రాయమైనట్లు దోచుచున్నది. శాంతగుణము ప్రతివానికి మిక్కిలి ముఖ్యమైనది.

(112) ఇసుక పంచదారతో కలపవచ్చును. అవిరెండు కలసినప్పుడు చీమ యిసుకరేణువును విడిచి పంచదారమాత్రమే తీసికొనిపోవును. అట్లే సజ్జనులు చెడుగువిడిచి మంచినే గ్రహింతురు.

(113) చేటయొక్క లక్షణమేమనఁగా చెడుపదార్థము తోసివైచి మంచిపదార్థము నిలుపుటయే. సజ్జనులస్వభావము నిట్టిదే.

(114) బ్రతికియుండియుఁ జచ్చినవాఁడే నిజముగా సజ్జనుఁడు. అనగా మృతినొందినవాని శరీరములో నేవిధముగా నహంకారము, కామము, క్రోధము, లోభము, చచ్చియుండునో అట్లే బ్రతికియుండుశరీరములోఁగూడ నవి కనబడకుండ నెవఁడు చంపివేయునో యతఁడేసజ్జనుఁడని భావము.

(115) లౌకికులగు మనుష్యులు ప్రపంచసౌఖ్యముల కొరకై పవిత్రములైన ధర్మకార్యములెన్నో చేయుదురు. కానికొంచెముదుఃఖము, పేదతనము వచ్చినపుడు ధర్మకార్యములను మఱచిపోవుదురు. వారు చిలుకలవంటివారు. చిలుక దినమంతయు "రామ రామ" యని పలుకుచు మార్జాలమువచ్చి తన్ను పట్టుకొన్నప్పుడు రామస్మరణము మఱచిపోయి "కీరుకారు" మని చచ్చును.

(116) ఇనుపజవలుగల మంచముమీద మనము కూర్చున్నప్పుడది క్రిందికి వంగిపోవును.కూర్చున్న వాఁడు లేవఁగానేయథాప్రకారముగా నుండును. లౌకికులగు మనుష్యులవిధ మిట్టిదే. మతసంబంధమైన సంభాషణ విన్నంతసేపు వారికిమతాసక్తియుండును. ప్రపంచ సంబంధమైన గొడవలలోదిగినతోడనే వారి భక్తిజ్ఞానవైరాగ్యములు రూపుమాయును.ఎప్పటివలె దురాశాపాశబద్ధులైసంచరించుచుందురు.

(117) ఇనుపముక్క కొలిమిలో నున్నంతసేపెఱ్ఱగా నుండును కొలిమిలో నుండితీసిన కొంతసేపటికది చల్లారి యెప్పటివలె నల్లగా నుండును.లౌకికుఁడగుమనుష్యుఁ డిట్లేయుండును. అతఁడు సాధువులమధ్య కూర్చున్నప్పుడు ధర్మపన్నములు చెప్పుచుండును. వారిని విడిచి రాగానే యవియక్కడే మరచిపోవును.

(118) ఒకయోగితో నొకమనిషి యిట్లనియె- "నాకొడుకు హరీషుఁడు పెద్దవాఁడైనతర్వాత సంసారభార మతనిమీదవైచి నేను యోగినై యోగాభ్యాసముతోఁ గాలముబుచ్చెదను." అదివిని యో

గియిట్లనియె. "యోగాభ్యాసముఁ జేయుటకు నీకెప్పటికినవకాశముదొరకదు.నీవప్పుడు "హరీషుఁడు నామనుమఁడైన గిరీషుఁడునన్నొకక్షణమైన విడిచిపెట్టి యుండఁజాలరు. గిరీషునకువివాహమైనతర్వాతయోగాభ్యాసమునకైపోయెద" అందువు. అట్లునీకోరికలకంతమేయుండదు

(119) అమ్మకమునిమిత్తము దుకాణముమీద పెట్టినమిఠాయి మొదలగు మధురపదార్థములమీద నొకప్పు డీఁగలువ్రాలును. అప్పుడేపాకీవాఁడెవ్వఁడైన మలినవదార్థమును దీసికొనిపోవుచుండెనేని వెంటనే యాయీఁగలు మిఠాయినివిడిచి యాతట్టమీద వ్రాలును. కాని తేనెటీఁగ మలినవస్తువులమీద నెన్నఁడును వ్రాలదు. అదిపుష్పములు మీద వ్రాలిమకరందమేత్రాగును. లౌక్యులీఁగలవంటివారు. అప్పుడప్పుడు వారిమనస్సులు భగవధ్యానమనెడు మధురపదార్థము మీద వ్రాలినను వెంటనే లోకసంబంధమైన దుర్వ్యాపారమాలిన్యమును స్పృశించును. సజ్జనుఁడెప్పుడు పరమేశ్వర ధ్యానమునందే యాసక్తిఁ గలిగియుండును.

(120) ఒక పేదబ్రాహ్మణుఁడు దారిద్ర్యపీడితుఁడై యొక గృహస్థునికడకుఁబోయి తనకేదైన సహాయముఁ జేయుమని కోరెను. ఆ గృహస్థుఁడు తనకు సంసారసంబంధము లేదనియుఁ దాను గుమ్మరిపురుగువాటముగా నింటిలోఁ దిరుగుచుంటిననియు డంబములు గొట్టుచుండెడివాఁడు. ఆయాచకుఁడు సహాయము చేయుమని యడిగినప్పుడు గృహస్థుఁడిట్లనియె. "అయ్యా! నేను నాచేతితో ధనము స్పృశింపను. నాకు సంసారసంబంధములేదు. నన్నేల యాచింపవచ్చితివి?" అతఁడట్లుచెప్పినను యాచకుండు పీడించెనుగాని విడిచిపెట్టలేదు. అతని వేడికోలు త్రోసిపుచ్చలేక యెట్టకేలకు గృహస్థుఁడు వానికొక రూపాయి యియ్యఁదలఁచి మరునాఁడు రమ్మనిజెప్పి లోపలికిఁబోయి భార్యనుబిలిచి ఓసీ! పాపము ఒక పేదబ్రాహ్మణుఁడు మిక్కిలి దీనుఁడై యాచింప

వచ్చినాఁడు. వానిదశజూచి జాలిపడి నేను వానికొక రూపాయియియ్యఁ దలఁచుకొన్నాను. నీయభిప్రాయ మేమిటి? అని యడిగెను. ఆమె భర్త కిట్లనియె. "సరిసరి! గొప్ప జాలిగుండెగలవారు బయలుదేరినారు. ముందువెనుకలు చూడకుండ పారవేయుటకురూపాయలు రాళ్ళుగావు. చెట్లమీది యాకులుగావు" అనవుడు భార్యను బ్రతిమాలుకొనుచు మగఁడిట్లనియె "పాపము! బ్రాహ్మణుఁడు మిక్కిలి పేదవాఁడు. రూపాయికి తక్కువియ్యకూడదు." "లేదులేదు. రూపాయిలేదు, గీపాయిలేదు. ఇదిగో నాదగ్గర రెండణాలకాసున్నది. కావలెనంటే ఇది యివ్వండి లేదా పొమ్మనండి" అని యామె కఠినముగాఁ జెప్పెను. గృహ యజమానుఁడుపెత్తనము మొదటినుండియు భార్యమీదవదలిపెట్టెనుగావున నామెమాట కెదురాడలేక రెండణాలకాసు మాత్రమే యాబ్రాహ్మణునకిచ్చెను. ఆవిధముగా సంసారసంబంధములేనిగృహస్థులు భార్యలకు దాసులుగాని వేదాంతులుగారు. సంసారసంబంధములేని గృహస్థులన్నప్పు డట్టివారి నుదాహరణగాఁ దీసికొనఁగూడదు.

(121) ఊఁత పల్లివాఁడు నీటిలోఁ బడవైచినప్పుడు చిన్నచేఁపలు సంతోషముతోఁ బోయి దానిలోఁ జిక్కుకొనును. కాని మరల బయటికి రాజాలవు. అట్లె పైపై మెఱుఁగులుజూచి బుద్ధిహీనులు భ్రమపడి ప్రపంచకవ్యవహారములలోఁ బడుదురు. చేఁపలు వలలోఁబడుట సులభముగాని దానినుండి వెడలివచ్చుట సులభముకానట్లే ప్రపంచకవ్యవహారములోఁ బ్రవేశించుట సుకరముగాని వాటినుండి విమోచనము నొందుట కష్టము.

(122) సంసారసుఖముల ననుభవించుచుండియు వానిసంబంధములేని మహానుభావుఁ డెవ్వఁడనిన జనకమహారాజు పేరొక్కటియే చెప్పుచుందురు. కాని ప్రపంచోత్పత్తియైనదాదిగా నేటివఱకు నిట్టి రాజర్షి యితఁడొక్కఁడేకాని రెండవవాఁడులేఁడు. కామలోభములను

లెంటిని విడువనివాఁడు ముక్తినొందఁజాలఁడు. ఇదే సామాన్యధర్మము. నేను జనకుఁడనని నీవు దలంపఁగూడదు. అతఁడుపోయి యిప్పటికెన్ని వేల సంవత్సరములో యైనను జనకునివంటివాఁడు ప్రపంచమున మరల పుట్టలేదు.

(123) ఈ ప్రపంచము రంగస్థలమువంటిది. అక్కడ ననేకులు వేరువేరు వేషములు ధరించి నాటకమాడుదురు. కొంతకాలమాడిన దాఁక వారు తమతమ వేషములు దీసివేయరు. కొంతవఱకాడిన తర్వాత వారంతటవారే వేషములు దీసివేసికొందురు.

(124) భక్తునిహృదయ మెండిననిప్పుపుల్లవంటిది. భగవన్నామము కొంచెము వినఁబడినను వానిహృదయము భక్తియను నగ్నిహోత్రముతో నిండియుండును. లౌకికునిమనస్సు భోగము దుఃఖము నను నీటితో తడసి నిమ్ముకున్న నిప్పుపుల్లవంటిది. దైవమునుగూర్చి యతని కెన్నిమారు లుపదేశించినను వానిమనస్సు భక్తిజ్వాలనముతో నిండదు.

(125) జనకమహారా జెంత మేధావంతుఁడో యొక లౌకికుఁడు గూడ నంతటిమేధావంతుఁడై యుండవచ్చు. యోగియెంత శ్రమపడునో యతఁడు గూడ నంత శ్రమ పడవచ్చును. సన్యాసి పూనినంత వైరాగ్యముఁ బూనినఁ బూనవచ్చును. కాని యివియన్నియు నతఁడు దైవముకొఱకు జేయక పేరుకొరకు, ప్రతిష్ఠకొఱకు, ద్రవ్యముకొఱకు జేయును.

(126) నీరు రాతిలో జొరఁబడదు. అట్లే మతభక్తి లౌకికుని హృదయములోఁ బ్రవేశింపనేరదు.

(127) మేకు మట్టిలో సులభముగా దిగును గాని రాతిలో సుకరముగా దిగదు. అట్లే పుణ్యాత్ముల హితోపదేశము లౌకికుని

యాత్మలోఁ జొరఁబడదు. భక్తుని హృదయములో నది యవలీలగాఁ బ్రవేశించును.

(128) మెత్తని మట్టిమీాద సులభముగా ముద్రివేయవచ్చును కాని రాతిమీాద నట్లువేయఁజాలము. అట్లే పరమేశ్వర సంబంధ మయిన జ్ఞానము భక్తుని హృదయముమీాద సుకరముగా ముద్రింపఁ బడును కాని లౌకికునిహృదయము మీాఁద నట్లుగాదు.

(129) సంపూర్ణముగా లోకవ్యవహారమునందే ప్రవేశించిన లౌకికుని లక్షణము లిట్లుండును. అతఁడు వేదమువినఁడు, మతచర్చల మాట యతనికక్కఱలేదు. ఈశ్వరస్తోత్రము లతని కింపుగానుండవు. అంతేకాదు. ప్రార్థనలుమొదలగునవి చేయకుండ నితరుల నాటంక పెట్టును. సజ్జనులను మతసంఘములను దూషించును. ప్రార్థనలు జేయువారినిఁజూచియెగతాళిచేయును.

(130) మొసలిచర్మము మిక్కిలి దట్టముగా నుండును. అందు చేతనే యాయుధములు దానిఁబొడువఁజాలవు. మీాదు మిక్కిలి యా యుధములన్నియు మొక్కవోవును. అట్లే లౌకికునకు నీవెంతమతబోధఁ జేసినను నది వాని హృదయమును భేదించుకొని పోఁజాలదు.

(131) వంతెనక్రిందికి నీరొకవైపునుండివచ్చి రెండవవైపునుండి ప్రవహించిపోవును. మతబోధయు లౌకికులవిషయమై యిట్లె యుండు ను. మతబోధ యొక చెవిలోఁ బ్రవేశించి వెంటనే రెండవచెవిలో నుండి యావలికిఁబోవును. అతనిమనస్సుమీాఁద నది యెంతమాత్రము ముద్రితముగాదు.

(132) లౌకికునితో మాటలాడినప్పుడు పావురమునోటిలోను న్న తిత్తి వడ్లగింజలతో నిండియున్నట్లు వాని మనస్సు ప్రపంచ సం బంధములైన యాలోచనలతోను కోరికలతోను నిండియున్నట్లుమన ము తెలిసికొనవచ్చును.

(133) నిప్పుమీఁదనున్నంతసేపు పాలుకాఁగి పొంగును. నిప్పు తీసితిమేని శాంతముగా నుండును. అట్లే క్రొత్తశిష్యుని యొక్క హృదయము మతసంబంధములయిన వ్యాపారములలో నున్నంతసేపేయుత్సాహముతో నిండియుండి తర్వాత చల్లబడును.

(134) రాజదర్శనముఁ జేయవలెనన్న ద్వారపాలకులను మంత్రులు మొదలగువారిని వశపఱచుకొనవలెను. అట్లే యీశ్వరసాన్నిధ్యము జేరవలెనన్నవాఁడు భక్తులయొక్కయు జ్ఞానులయొక్కయు సహవాసముఁ జేయవలెను.

(135) నీభక్తివిశ్వాసములు నీలోనే యుంచుకొనుము. అవి నీకడఁ గలవని చాటుకొనవద్దు. అట్లు చాటుకొందువేని నీకు మిక్కిలి నష్టము గలుగును.

(136) బొమ్మలు మూడువిధములు. ఉప్పుబొమ్మలు, గుడ్డబొమ్మలు, రాతిబొమ్మలు. ఈబొమ్మలను నీటిలో ముంచినయెడల మొదటి బొమ్మ కరగిపోయి రూపనాశన మగును. రెండవది తడిసి ముద్దయయి బరువెక్కును గాని దాని యాకారమును నిలుపుకొనును. మూడవది నీటికిదుర్గమమై యుండును. తన యాత్మ పరమాత్మతో నైక్యముఁజేసికొన్నట్టి ధన్యునివంటి దాయుప్పుబొమ్మ. అదే ముక్తపురుషుఁడు. దివ్యజ్ఞానము భక్తి సంపూర్ణముగాఁ గలభక్తునివంటిది రెండవబొమ్మ. సత్యమైనజ్ఞానము లేశమయినను గ్రహింపని లౌకికుని వంటిది మూడవ బొమ్మ.

(137) చేఁపలు బడినప్పుడు కొన్ని తప్పించుకొని పోవుటకు బ్రయత్నమే చేయవు. కొన్ని వలనుండి తప్పించుకొని పోవుటకు గట్టి యత్నముఁజేయును. కొన్ని వల జీల్చుకొని యావలకుఁబోయి ప్రాణము దక్కించుకొని సుఖించును. ఇట్లే మనుష్యులు మూడు విధములుగా నున్నారు. కొందఱు సంసారబంధములలోఁ దగిలియున్నారు.

వారు బద్ధులు. కొందఱు మోక్షముకై యత్నముఁజేయుచున్నారు. వారు ముముక్షువులు. కొందఱు బంధములను దెంపుకొన్నవారు. వారు ముక్తులు.

(138) జల్లెడ ముదుకవస్తువును మెత్తనివస్తువును వేరుచేయును. అట్లు జేయుటలో మెత్తనివస్తువును క్రిందికిఁ బడద్రోయును. ముదుక వస్తువును పైనుంచుకొనును. దుర్మార్గుఁడిట్లే చెడ్డను గ్రహించి మంచి విడిచిపెట్టును.

(139) ఇద్దరు మనుష్యులొక తోఁటలోనికి వెళ్ళిరి. లౌకికుఁడు తోటజేరగానే యెన్ని చెట్లున్నవో చెట్టున కెన్నికాయలున్నవో లెక్క జూచి తోటఖరీదు గట్టనారంభించెను. రెండవ వాఁడు యజమానుని పరిచయము జేసికొని యొక మామిడిచెట్టుక్రిందకిఁ బోయి వాని యుత్తరువు బడసి యొక పండుగోసి తిన మొదలు పెట్టెను. ఈయిద్దరిలో నెవ్వఁడు తెలివికలవాఁడు? ఫలము భక్షించినయెడల మనయాఁకలిదీరును. ఆకులు కాయలు పండ్లు చెట్లు లెక్కపెట్టుటవల్ల వచ్చినలాభమేమి? మేధావంతుఁడైన దాంభికుఁడు సృష్టికిఁ గారణమేమి యని ప్రశ్నలుజేసికొని కాలముఁ బాడుచేయును. వినయవివేకములుగల సజ్జనుఁడు భగవంతుని పరిచయముఁ జేసికొని యానంద మనుభవించును.

(140) గ్రద్ద మహావాయుపథమున నెంతయో యెత్తున కెగురును. కాని కుళ్ళిపోయిన పీనుఁగేదయిన దొరకునేమోయని క్రిందికే చూచుచుండును. అట్లే గ్రంథజ్ఞానము మాత్రమే గల పండితులు భగవంతుని గూర్చియు వేదాంతమునుగూర్చియు గంభీరముగామాట్లాడుదురు. ఆసంభాషణ మంతయు వట్టిదే. వారిదృష్టి ప్రపంచసంబంధమైన యధికారము, గౌరవము, ధనము మొదలగు వానిమీఁదనే యుండును.

(141) ఒకమహారాజుగారి కొలువులో శివుఁడు గొప్పవాఁడా

విష్ణువు గొప్పవాఁడా యని విద్వాంసులలో వివాదము బయలు దేరెను. కొందఱు శివుఁడుగొప్పవాఁడనిరి. కొందఱు విష్ణువుగొప్పవాఁడనిరి. వివాదము మిక్కిలి ప్రబలమయినపుడు పండితుఁడొకఁడు లేచి రాజుతో నిట్లనియెను. రాజా! నేను శివునిజూడలేదు. విష్ణునిజూడలేదు. ఇద్దరిలో గొప్పవాఁడెవ్వఁడో నేనెట్లుచెప్పఁగలను? అని పలికెను. అంతలో వివాదము ముగిసెను. ఏలయన వాదిప్రతివాదులలో శివునిగాని విష్ణునిగాని చూచినవారులేరు. ఒక దేవునితో మరియొక దేవుని పోల్చఁగూడదు. ఒక దేవునిఁ జూచినవాఁడు తక్కిన దేవులు కూడ పరబ్రహ్మము యొక్కమారురూపములే యని తెలిసికొనును.

(142) ఏనుఁగునకు రెండువిధములైన దంతములుండును. పైకి కోరలవలె కనపడుదంతముల జతయొకటి. ఆహారము నమలుట కుపయోగపడు దంతములజత యొకటి. అట్లే శ్రీకృష్ణునివంటి యవతార పురుషులు సామాన్యమనుష్యులవలె లోకవ్యాపారములుచేయుచుందురుగాని వారు నిజముగా చూచినపక్షమున కర్మాతీతులై యుందురు.

(143) గంజాయి పీల్చుచు మందులు పంచిపెట్టునట్టి సాధువు నిజమైన సాధువుకాఁడు. అటివాని సహవాసము చేయగూడదు.

(144) ఒక బ్రాహ్మణుఁడు తోఁటనాటి దానిని మిక్కిలిజాగరూకతతోఁ గనిపెట్టుచుండెను. ఒకనాఁడొకయావు తోఁటఁజొచ్చి బ్రాహ్మణుఁడు మిక్కిలి ప్రేమతో పెంచుకొనుచున్న మామిడిమొక్క తినివైచెను. తనకు మిక్కిలి ప్రియమైన మొక్క తినివైచినందుకు మిగుల గోపించి బ్రాహ్మణుఁడు గోవును దిట్టముగాఁ గొట్టెను. ఆదెబ్బలతోనది చచ్చెను. బ్రాహ్మణుఁ డావును జంపినాఁడని గ్రామమంతట గొప్ప వాడుకపడెను. గ్రామవాసులు గోహత్య యేలచేసితివని బ్రాహ్మణుని నిలువతీసి యడిగిరి. బ్రాహ్మణుఁడు వేదాంతియగుటచే నిట్లుత్తరము చెప్పెను. "ఆవును నేను చంపలేదు నాహస్తము చంపినది. హస్తము

నకు దేవేంద్రుఁడధిష్ఠాన దేవతగనుక గోవును చంపిన పాపమిందునిదిగా ని నాదికాదు" ఆవార్త నింద్రుఁడు విని వృద్ధబ్రాహ్మణ వేషము వేసి కొని తోఁటయజమానునియొద్దకుఁ బోయి యీతోఁట యెవ్వరిది నాయనా యని యడిగెను.

బ్రాహ్మణుఁడు:—నా దే.

ఇంద్రుడు:—ఈతోఁట మిక్కిలి యందముగా నున్నది. మీతోఁట మాలి మిక్కిలి నేర్పరి. ఎంతచక్కగా చెట్లునాటినాఁడోచూడ ముచ్చటగుచున్నది.

బ్రాహ్మణుఁడు:—అయ్యా! ఆపనికూడ నా దే. నేను స్వయముగా సల హా యిచ్చి వృక్షములను నావిధముగా నాటించినాను.

ఇంద్రుఁడు:—నిజముగా నీవు మిక్కిలి తెలివిగలవాఁడవయ్యా. కాని యీబాట యింత చక్కగా వేసిన వారెవ్వరయ్యా. ఇదియెం తో సుందరముగా నున్నది.

బ్రాహ్మణు;—ఇదియంతయు నేను చేసినదే.

ఇంద్రుఁడు:—అయ్యా, బాగున్న పనులన్నియు నీవుచేయక నీసేవకుల చేత చేయించినను మెప్పంతయు నీదేయనుచున్నావు. పాప ము నీచేతితో చంపిన గోవు విషయమైన పాపము మాత్రము దేవేంద్రుని నెత్తిమీద రుద్దినావా? గొప్పవేదాంతివి.

(145) నీవు పాపరహితుఁడవుగా, సజ్జనుఁడవుగా నుండుటకు మన సార గోరుదువేని భగవంతుఁడు నీకు యోగ్యుఁడైన గురువును పంపు ను. అంతఃకరణశుద్ధియే దీనికి ముఖ్యముగాఁ గావలసినది.

(146) క్రొత్తచోటికి వెళ్ళదలచినవాఁడు దారి యెరిగినవాని మాటలయందు గురియుంచి వాఁడు నడపించినదారిని నడవవలయును. పదుగురుచెప్పినట్లు నడచినయెడల దారితప్పి చెడిపోవును. అట్లే యీ శ్వరసాన్నిధ్యమును జేరఁదలఁచినవాఁడు మంచిగురువునొక్కని నాశ్ర యించి యాయనచెప్పినట్లు నడుచుకొనవలయును.

(147) అంతఃకరణశుద్ధియు నధికమైనదయాశక్తియుఁగలవానికి గురువుయొక్క యవసరమేలేదు. అతఁడు భగవంతుని సాన్నిధ్యము స్వయముగానే పొందగలఁడు. కాని యట్టివారు లోకమున తరచుగా లేరు. అందుచేతనే గురువుయొక్క యవసరము గలుగుచుండును. పరమగురు వొక్కఁడే యుండును. కాని యుపగురువులు పెక్కుమంది యుండవచ్చును. ఏవిద్యనేర్చినవాఁడైనను యుపగురువు కావచ్చును. పరమగురువనఁగా బ్రహ్మవిద్య నేర్పినవాఁడు.

(148) కలకత్తాకు బోవుటకు దారులెన్నోగలవు. దూరగ్రామవాసియొకఁడు కలకత్తాకుబోవవలయునని పయనమై "నేను కలకత్తాకేదారిని బోవలయును" అని మార్గమధ్యమున నొకనినడిగెను. ఈ దారిని వెళ్ళుమని యామనుష్యుఁడొకమార్గము చూపెను. అట్లుకొంత దూరముపోయి వాఁడు మరియొక బాటసారినిజూచి కలకత్తాకిది దగ్గర దారియేనా? యని యడిగెను. అనవుడు నతఁడిట్లనియె. "అయ్యో! కాదు నీవు వెనుకకువెళ్ళి యెడమప్రక్కనున్న దారినిపో." ఆమాట విని యతఁడట్లే చేసెను. ఆక్రొత్తదారిని వాఁడు కొంతదూరమరిగి కలకత్తాకు దారి యేదని మరియొక్కని నడిగెను. అతఁడింకొక దారిచూపెను. ఆ విధముగా నతఁడు సరిగా నొకత్రోవనైననడువక యాదారిమార్చి యీ దారికి, నీదారిమార్చి యాదారికిఁ బోవజొచ్చెను. అతఁడు కలకత్తా వెళ్ళదలచెను. కావున మొదటివాఁడుచూపిన మార్గమునుబట్టియే వెళ్ళవలసినది. అట్లే భగవంతుని జేరదలచినవారు సూటిగా నొక మార్గప్రదర్శకునే యనుసరింపవలెను.

(149) శిష్యుఁడు గురువాక్యము లెన్నడు ఖండింపఁగూడదు. గురువేమి యానతిచ్చునది శిరసావహించి మన్నించవలయును.

(150) గురువు మధ్యవర్తి. ఆతఁడు మనుష్యునకు భగవంతునకు సంధానము జేయువాఁడు.

(151) ముత్తెము దీసికొని పైచిప్ప యావల బారవేయుము. గురువు చెప్పిన మంత్రముమాత్రము పునశ్చరణచేయుము. నీగురువు యొద్ద నున్న చెడ్డగుణములను విసర్జింపుము.

(152) నీగురువును దూషించి వాని వాక్యములను ఖండించు వారిమాటలను వినఁబోకు. అట్టిదూషకుని సమక్షము విడిచిపొమ్ము.

(153) చంద్రుఁ డెల్లవారికి మామయయినట్లే భగవంతుఁడు మానవజాతికెల్ల జనకుఁడు. మార్గదర్శకుఁడు. చందురుఁడు చందమామ యని లోకులనుచుందురు, గావున మామయని చెప్పవలసివచ్చెను.

(154) తనగురువుయొక్క పరిభావమునందు సంపూర్ణ విశ్వాసముగల శిష్యుఁడొకఁడు గురునామస్మరణము జేయుచు దానిమహిమ చేత నదిమీఁదనడచి వెళ్ళెను. గురు వదిచూచి తనలో నిట్లనుకొనెను. "ఆహా! నా పేరులో గూడ నింతమహిమమున్నది కాబోలును.అట్లైన నేను మిక్కిలిగొప్పవాఁడను శక్తిమంతుఁడను కావలసినదే"యని మరు నాఁడు నదియొద్దకుఁబోయి"నేను, నేను,"అనుచు నదిమీఁద నడచి పోవ దలచెను. కాని నీటిలో నడుగుపెట్టునప్పటి కతఁడు నీటిలోబడి మునిగి చచ్చిపోయెను. విశ్వాసము మహాద్భుతములను జేయగలదు గాని యహంకారము, గర్వము మనుష్యునకు మరణకారణములు.

(155) గురువులు వందలకొలఁది దొరకుదురు కాని మంచి శిష్యులు మాత్రము దొరకుట యరిది.

(156) స, రి, గ, మ, ప, ధ, ని, స, యను నక్షరములు నో టిలో నుచ్చరించుట సులభము. కాని వీణమీఁద నవి వాయించుట యు నోటితో పాడుటయు కష్టము. అట్లే మతమును గురించి మాట లాడుట సులభము. ఆచరించుట కష్టము.

(157) సామాన్యులు బస్తాలకొలఁది మతము మాటలాడుదురు. కాని యొకగింజమాత్రమైన నాచరింపరు. కాని జ్ఞాని మాటలాడునది మిక్కిలి స్వల్పము. అతని బ్రతుకంతయు మతాచరణమే.

(158) ఇతరులెట్లు నడుచుకోవలయునని నీవు కోరుదువో ముందుగా నీవట్లె నడచుకొనుము.

(159) నిజము చెప్పుచున్నాను వినుఁడు. ఎవఁడు నిశ్చయముగా దేవుఁడు కావలయునని కోరునో వానికి దేవుఁడు తప్పక కనఁబడును.

(160) తామరపువ్వుయొక్క రేకులు క్రమక్రమముగా రాలిపోవును. కాని వాటియానవాళ్ళు పోవు. అట్లే నిజమైన జ్ఞానమువచ్చినప్పుడు తప్పక యహంకారము నశించును. కాన నది యుండిన జాడలు కనఁబడును. అయినను నవి హాని చేయునవి కావు.

(161) మనుష్యునియందు రెండువిధములైన యహంకారములున్నవి. మొదటిది పరిపక్వమైన యహంకారము, రెండవది పరిపక్వముకాని యహంకారము. పరిపక్వమైన యహంకార మిట్లుండును. "నాదియను వస్తువేదియు లేదు. నేను చూచుచున్నదియు, భావించుచున్నదియు, స్పృశించుచున్నదియు నాదికాదు. వెయ్యేల! ఈశరీరమే నాదికాదు. నేను నిత్యుఁడను, స్వతంత్రుఁడను." పరిపక్వముకాని యహంకారము దీనికి విరుద్ధముగా నిట్లుండును. "ఇది నాయిల్లు, ఇది నాబిడ్డ, నాభార్య, నాదేహము."

(162) వెల్లుల్లిపాయ రసము పోసిన గిన్నె నూరుసారులు తోమినను దాని దుర్వాసనపోదు. అహంకారముకూడ నట్టిపెంకిఘటమె. అది మనలను సంపూర్ణముగా నెన్నడును విడిచిపెట్టదు.

(163) కొబ్బరిమట్టలు చెట్టునుండి క్రిందికి రాలిపోవును. కాని మాానిమీద వాటి జాడలు కనబడును. ఆలాగే శరీరమున్నంతకాలమహంకారముయొక్క జాడ కనబడుచుండును. మనుష్యుఁడెంతటి యాత్మజ్ఞానసంపన్నుడైనను వాని కించుక యహంకారముండపోదు. కాని ఈయహంకార సూచనలు వానిని ప్రపంచమునకు బంధింపవు. పునర్జన్మకారణములు కావు.

(164) సూర్యుఁడు ప్రపంచమునకు వేడి వెలుతురు నీయగలఁడు గాని మబ్బు క్రమ్మినప్పుడు సూర్యుఁడు ప్రకాశింపజాలఁడు. ఆలాగే యహంకార మాత్మలో నుండునంతవరకు భగవంతుఁడు హృదయము మీఁద ప్రకాశింపజాలఁడు.

(165) గర్వము చెత్తవంటిది. బూడిదవంటిది. నీరుదానిమీఁద పడగానే యినికి పోవును. గర్వపూరితమైన హృదయముమీఁద ధ్యానములు, ప్రార్థనలు పనిచేయవు.

(166) అన్నిపక్షులలోను కాకి మిక్కిలి తెలివిగలదని లోకు లందురు. తానెక్కువ తెలివిగలదాననని కాకికూడ తలంచును. అది యెన్నఁడు వలలోఁ జిక్కుకొనదు. రాగల యపాయమును బుద్ధిసూక్ష్మతతో దప్పించుకొనును. ఎంతనేర్పున వస్తువులు దొంగిలించుకొని పోవును. ఇంతజ్ఞానమున్నను మలినపదార్థ భక్షణముచేతనేగాని దానిపొట్ట గడచుటలేదు. క్షుద్రమైన తెలివితేట లుండుటవల్ల దానికీయవస్థ పట్టెను.

(167) బ్రహ్మమానసపుత్రుఁడైన నారదుని మనస్సులో గర్వముప్రవేశించెను. తనయంతవాఁడులేఁడని యతఁడుమనస్సులో దలంచ నారంభించెను. అది యెఱింగి శ్రీమహావిష్ణువు గర్వభంజనముఁజేయఁ దలంచి నారదుని పిలిచి "వత్సా! భూలోకములో నొకచోటనాభక్తుఁ డున్నాఁడు. వాని కడకుబోయి వానిపరిచయముఁ జేసికొను" మని చెప్పెను. నారదుఁడు భూలోకమున కరిగి యాభక్తునిఁ జూచెను. అతఁడు సేద్యగాఁడు. ఉదయమునందు లేచియతఁడొక్కసారిహరినామ స్మరణము జేసి పొలమునకుఁబోయి దినమెల్ల నేల దున్ని సాయంకాల మింటికిఁబోయి భోజనముఁజేసి మరల నొక్కసారి హరినామ స్మరణముఁజేసి పండుకొనును. నారదుఁడు తనలో నిట్లనుకొనెను. "ఈమోటకాఁపువాఁడు హరిభక్తుఁ డెట్లగును? వాఁడు లోకవ్యవహారములలో

దగులుకొని యున్నాఁడు. భక్తునియం దుండవలసినలక్షణములేవియు వానియందగపడవు." అంతట నారదుఁడు వైకుంఠమునకరిగి కాపువా నిని దానఁజూచుట తనకు వానియందు మంచి యభిప్రాయముగలు గకపోవుట మొదలగు విషయములు విష్ణువుతోఁ జెప్పెను. అప్పు డతఁడు నారదునిఁజూచి "వత్సా! ఈనూనెగిన్నె చేతఁబట్టుకొని వైకుంఠపురమంతయుఁ దిరిగిరా. నూనె దానియంచువఱకున్నది. ఒక్కచుక్కయైన నేలఁబడకుండజాగ్రత్తగాఁ దిరిగి రావలెను జుమీ!" యని చెప్పెను. నారదుఁ డాగిన్నెపట్టుకొని విష్ణువు చెప్పినట్లు తిరిగి వచ్చెను. అప్పుడా పరమేశ్వరుఁడు "నారదా! గిన్నెపట్టుకొని తిరుగు చున్నప్పుడు నీవునన్నెన్నిసార్లు స్మరించితివి?" అని యడిగెను. అన వుఁడు నారదుఁ డిట్లనియె. "దేవా! ఒక్కసారియైన మీపేరు స్మరింప లేదు. ఈవల గిన్నెవంకఁజూడనా ఆవలమీపేరేస్మరింపనా? నా ధ్యాన మంతయు జముదుమీాదనేయుండెను. అట్టియెడమిమ్మెట్లుధ్యానింపగల ను." అనవుడు హరి వానినిట్లు మందలించెను. ఈచిన్నగిన్నె పట్టుకొ నుటచేతనే నీవు నన్ను స్మరింపలేకపోతివి. పాపము పెద్దకుటుంబ భార ముపై వైచికొన్న యాపేదకాఁపువాఁడు దినమునకు నన్ను రెండు సార్లైనను తలపెట్టుచున్నాఁడు. నీకన్న వాఁడే పరమభక్తుఁడుకదా!

(168) ప్రేమ మూడువిధములు కలది. మొదటిది స్వలాభ పరాయము, రెండవది పరస్పరవ్యాప్తము, మూడవదిస్వలాభవిముఖ ము. స్వలాభపరాయణమైన ప్రేమ యధమము. ఎందుచేతనన నది తన మేలేగాని తనవారి సుఖము చూడనీయదు. పరస్పర ప్రేమలో మనుష్యుఁడు తన సుఖమును చూచుకొనుచు తనవారి సుఖముకూడ గోరును. స్వలాభము కోరని ప్రేమ యుత్తమోత్తమము. మనుష్యుఁడు తనవారి సేమమునే జూచునుగాని తనసుఖము జూడఁడు.

(169) బృందావనమందలి గోపిక శ్రీకృష్ణుఁడు తనకు ప్రియు

డైన గోపీనాథుఁ డని భావించెనుగాని సర్వేశ్వరుఁడని భావింపలేదు. అట్లే నిజమైన భక్తుఁడు భగవంతుఁడు తనకు ప్రాణబంధువనియు నాప్తమిత్రుఁడనియు భావించును.

(170) "ఈజన్మమునందే నేను ముక్తిని బడయవలయును మూఁడుదినములలో భగవంతుని కనుఁగొనవలయును. ఇంతయేందుకు ఆతని నామమొక్కమారుస్మరించి యాతనిని నాకడకురప్పించెదను." అని గాఢమైన భక్తియు, దృఢమైననిశ్చయము నెవరికుండునోయతఁడే త్వరగా నీశ్వరు నాకర్షించును. మిడిమిడి భక్తిగలవారు భగవంతుని సన్నిధిచేరుటకు బహుకాలము పట్టును.

(171) ఒకజ్ఞానియు నొకభక్తుఁడు నొకయడవిలో నడచుచుం డిరి. దారిలో దూరమున నొకపెద్దపులి వారి కగపడెను. అప్పుడుజ్ఞాని యిట్లనియె. "మనము భయపడి పారిపోనక్కరలేదు. పరమేశ్వరుఁడు మనలను రక్షించును." ఆపలుకులు విని భక్తుఁడిట్లనెను. "కాదుకాదు పారిపోవుదమురమ్ము. మన ప్రయత్నమువలన మనము తప్పించుకొనఁ గల పనికి నిష్కారణముగా భగవంతునేల శ్రమపెట్టవలెను."

(172) బ్రహ్మజ్ఞానముమగవానివంటిది. దైవభక్తియాఁడుదా నివంటిది. జ్ఞానము పరమేశ్వరుని వీథిగదులలోనికి మాత్రమే బోవఁ గలదు. భక్తియాడదికనుక భగవంతుని యంతఃపురములోనికిఁ బ్రవే శింపవచ్చును.

(173) భక్తియు, జ్ఞానము చిట్టచివరకు ఒక్కటే. శుద్ధజ్ఞానము నకు, శుద్ధభక్తికి భేదములేదు.

(174) దూరపుసంతకుఁబోయి చేపలమ్ముకొని పల్లెపడఁతులు కొందఱు తిరిగి ఇంటికిబోవుచుండగా దారిలో వారికిని వడగండ్ల వాన మొత్తెను. అప్పుడు వారు దాపునున్న పుష్పాలవర్తకునియింట జొర బడి యారాత్రి యచ్చట బండుకొనిరి. వారు పండుకొన్న గదిలో

మిక్కిలి కమ్మని తావులు వెదజల్లుచున్న పువ్వులగంప లుండెను. ఆవాసన పల్లెపడుచుల కెంతో యసహ్యముగా నుండుటచేత వారికొక్క కునుకైన పట్టలేను. అప్పుడు వారిలో మిక్కిలి తెలివిగల యాఁడుది యిట్లనియె. "అక్కలారా ఈపువ్వులకంపు మననిద్దుర చెడగొట్టినది. దీనికొక్కయుపాయము తోచుచుచున్నది. వినుఁడు. మనచేఁపలబుట్టలు మనముక్కుదగ్గర పెట్టుకొని పండుకొందము. అనువాసన ముందర ఈపాడు పువ్వులకంపు కనబడక మనకు నిద్దుర పట్టును." ఆపలుకులు విని పల్లెపడఁతులు భళీయని మెచ్చి యట్లుచేసి క్షణములో గుఱ్ఱుపట్టి నిదురపోయిరి. దురభ్యాసములలో జిక్కుపడినవారిపాటు లిట్టివే. దురాచారములకు వారు గులాములై యుండవలయును.

(175) ఒకయింట నొకపెంపుడుముంగి యుండెను. ఇంటివారొకత్రాడును తెచ్చి యొకకొన దాని మెడకుగట్టి రెండవకొసకు గొప్పబరువురాయి గట్టిరి. ముంగి ముంగిలివాకిటిలోను, దొడ్డిలోను, స్వేచ్ఛగా నాడుకొనవచ్చును. కాని భయము తోచగానే గుబాలున గోడమీదికెక్కి కూర్చుండును. అయిననుగోడమీఁద నది చాలసేపుండుటకు వీలులేదు. త్రాటికిఁ గట్టిన బరువురాయి క్రిందికి దానిని దిగలాగుచుండును. అందుచేతనది సుఖముగా, నిర్భయముగా గోడమీద కూర్చుండుటకు వీలులేదు. అట్లే మనుష్యుని యిల్లు మహోన్నతమైన భగవత్పాద సన్నిధినున్నది. దుఃఖపూరితుఁడైన మనుష్యుఁడుభగవంతునిసాన్నిధ్యము చేరును. కాని సంసారభారము క్రింది కీడ్చుటచేత పరమేశ్వర సన్నిధానమున చిరకాల ముండలేక నతఁడు వెంటనే క్రిందికిదిగును.

(176) పటికబెల్లము సాధారణమధురపదార్థములలో చేరదు. అది రోగపీడితులుకూడ పుచ్చుకొనవచ్చును. అందువల్ల రోగముతగ్గునుగాని హెచ్చదు. ఓంకారము తక్కినవాటివలె శబ్దముకాదు. పర

బ్రహ్మమే. అట్లే భక్తి, జ్ఞానము, పరిశుద్ధి, మొదలగునవి కావలెనని కోరుట కోరికలలోఁ జేరదు.

(177) పండు పెరిగినకొలఁది పువ్వు, రేకులు క్రమక్రమముగా రాలిపోవును. అట్లే నీలో దివ్యజ్ఞానము హెచ్చినకొలఁది నీలోనున్న దౌర్బల్యములు క్రమక్రమముగా నశించును.

(178) క్రొత్తగాపుట్టిన దూడ యెన్నోసారులు పడుచు లేచుచు క్రమక్రమముగా నడక నేర్చుకొని సరిగా నిలువఁబడును. అట్లే భక్తిమార్గములో మనుష్యుఁడెన్నో సారులు జారిపడినఁగాని జయము నొంచలేఁడు.

(179) గుక్కెఁడు సారాయితోనే కొందరికి కావలసినంత మత్తెక్కును. రెండుమూడుబుడ్ల సారాయి త్రాగినఁగాని గొందరికి నిషా యెక్కదు. కాని వారి కిరువురకు నిషావలనగలుగు నానందము సమానమే. అట్లే కొందరుభగవంతుని సాన్నిధ్యముపొందియాబ్రహ్మానందముచే బరవశులగుదురు. కొందరు భగవంతుని దివ్య తేజము కొంచెమగపడినతోడనే మేరలేని యానందము నొందుదురు. కాని దివ్యానందప్రాప్తిచేత నిద్దరు సమానధన్యులే.

(180) పాముమిక్కిలి విషజంతువు. దానింబట్టుకొనుటకువచ్చినవారి నదికఱచును. కాని సర్పమంత్రము నేర్చుకొన్నవాఁడు పాముల నవలీలగాఁ బట్టుకొని నగలవలె వెంట గొనిపోవును. అట్లే బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు కామలోభములచే నపవిత్రుఁడుకాఁడు.

(181) ఈక్రింది స్థితిగతులలో నేదైననొకటి యనుభవమునకు దెచ్చుకొన్నవాఁడు సిద్ధుఁడగును. (1) "ఈవిశ్వమంతయు నేనే, (2) ఈ విశ్వమంతయు నీవే (3) నీవు యజమానుఁడవు నేను సేవకుఁడను.

(182) భగవంతుని కనుగొనుటకు నీవు నీశరీరమును, నీమనస్సును, నీసంపదలను బలిపెట్టనక్కరలేదు.

(183) దేవత్వముకనఁబడకమున్న మానవత్వము నశింపవలయును. ఆనందస్వరూపిణియైన దేవియొక్కయావిష్కరణముగలుగుటకు ముందు దైవత్వముకూడ నశింపవలయును. చచ్చిన శివదైవత్వముయొక్క వక్షస్థలముమీఁద దేవి తనదివ్యనృత్యమును జేయును.

(184) ఎవని ధ్యాననిష్ఠయు, భక్తియు, నతిశయముగా నుండునో యతఁడే భగవంతుని త్వరగాఁ గనుగొనును.

(185) ఒకచేఁపను నీటిలోనుండి తీసికొనికాలము బైటనుంచిమరల నీటఁ బడవేయుము. అది బయటనున్న కాలములో నెట్లుండునో యోగి సమాధిలో నట్లుండును.

(186) సముద్రములో గొప్పపర్వతములు, చిన్నకొండలు, చరియలు మొదలగునవి యుండును. కాని, యవి పైకగపడవు. అట్లే సమాధిలో యోగి సత్యానందసముద్రములోఁ దేలుచున్నప్పుడు మానవవ్యక్తి యంతయు సంఛన్నమై యుండును.

(187) కుండలో నీరుపోసి యొకచోటఁబెట్టితివేని క్రమక్రమముగా దానిలో నీరెండిపోవును. కాని యాకుండ నీటిలోఁబెట్టితివేని నది యచ్చటనున్నంతకాలము జలపూర్ణమై యుండును. భగవంతుని యెడల నీభక్తియు నట్టిదే. నీహృదయము భగవద్భక్తితోనింపికొంతకాలముంచి తరువాత నితరవ్యాపారములలోదిగి యతనినిమరచితివేని నీహృదయముక్రమక్రమముగాభక్తిశూన్యమై దేవునకునిలయముకాకపోవును. కాని నీహృదయమా భక్తిరసములో మునిగియుండునట్లు చేసితివేని నీవు భగవంతున కెన్నడును దూరముకావు.

(188) ధ్యానయోగములో నెవఁడు బాహ్యజ్ఞానములేక యుండునో వాఁడు ధ్యానయోగములో సిద్ధింబొందినాఁడని చెప్పవచ్చును.

(189) నీటిలోఁ బడవైచిన కూజాయొక్క లోపలను వెలుపలను నీరుండును. అట్లే భగవంతునిలో మగ్నమైనయాత్మ లోపలను, వెలుపలను, సర్వవ్యాపకుఁడైన యీశ్వరునే జూచును.

(190) భగవంతుని దయారసము క్రిందికి ప్రవహించినప్పుడు ప్రతిమనుష్యుఁడు తనదోషములను తానెఱుఁగును. అవి తెలిసినపిదప తానెవ్వరితోడను వివాదమాడఁగూడదు.

(191) చిన్నదీపము తేగానే నూరేండ్లనాటి చీకటియైనను నశించును. అట్లే భగవంతుని కటాక్షవీక్షణములచేత ననేకజన్మాంతరసంచితదోషములు పటాపంచలగును.

(192) మలయవాయువు వీచినతోడనే సారముగలవృక్షములన్నియు మంచిగంధపుచెట్లగును. కాని యరటిచెట్టు, వెదురుపొద, తాళవృక్షము మొదలగు సారములేని చెట్లు మార్పులేకయెప్పటియట్లయుండును. అట్లే భగవంతునిదయారసముప్రవహించినప్పుడు యోగ్యతాబీజములుగలమనుష్యులు తోడనే సాధువులై భక్తిపూరితమానసులగుదురు. కాని పనికిమాలిన లౌకికులు మార్పుచెందక యుందురు.

(193) ఉషస్సు సూర్యోదయమునకు ముందు కనఁబడునట్లు స్వార్థత్యాగము పరిశుద్ధజీవనము ధర్మము మొదలగునవి భగవదనుగ్రహము కలుగుటకు ముందుకనఁబడును.

(194) తన సేవకుని గృహమునకు రాజు పోదలచుకొన్నపుడు సేవకుఁడు తనకు తగిన సన్మానము చేయుటకై తనపీఠములు,తననగలు భోజనపదార్థములు వానియింటికిఁ బంపును.అట్లే భగవంతుఁడు తా నే హృదయమునందు ప్రవేశింపదలచుకొన్నాఁడో యాహృదయములోనికి వినయవివేకములను భక్తివిశ్వాసములను ముందుగాఁ బంపును.

(195) లోతులేనినీరు సూర్యరశ్మి తగులుచుండెనేనిక్రిమక్రమముగా దానంతటదే యెండిపోవును. అట్లే పాపాత్ముఁడు భగవంతునే నమ్ముకొనియున్న పక్షమున వాని పాపము దానంతటదేక్షయించును.

(196) పోలీసువాఁడు మాయలాంతరుచేతబట్టుకొని దానివెలుగాటు త్రిప్పునో యటువైపుననున్న మనుష్యుని చూడఁగలడు. కాని

యామనుష్యుఁ డితనిని జూడలేఁడు. ఆవెలుగు పోలీసువాఁడు తనవైపు త్రిప్పుకొన్నప్పుడు తానుకూడ నితరులకు గనబడును. అట్లేభగవంతుఁ డెల్లవారిని జూచును కాని యతని నెవ్వరు జూడలేరు. తాను స్వయముగా గనబడదలచుకొన్నప్పు డతనిని మనము చూడఁగలము.

(197) కొన్నిచేఁపల కొక్కటేయెముకయుండును. కొన్నింటి కెన్నో యెముకలుండును. కాని చేఁప దినువారు యెముకలన్నింటినితీసి పారవైచి భక్షించునట్లు కొందరు బహుపాపములనుచేసి యుందురు. కొందరు కొన్నిపాపములను మాత్రమే కావించియుందురు. కాని కాలక్రమమున దైవానుగ్రహమే వాటిని శుద్ధిచేయును.

(198) దైవానుగ్రహమను వాయువు రేయుంబవలువీచుచున్నది. జీవనసముద్రములో వేగముగా నీవు ప్రయాణముచేయఁదలచుకొన్నపక్షమున నీమనస్సనెడు నావయొక్క తెరచాపలు విప్పుము.

(199) చల్లగాలి వీచుచున్నప్పుడు విసనకఱ్ఱలు విడచిపెట్టవలెను. దైవానుగ్రహము గలిగినప్పుడు జపములు, తపములు, ప్రార్థనలు పరిత్యజింపవలెను.

(200) మతములు, తెగలు, వర్ణములు, నిష్ప్రయోజనములు. ప్రతివాఁడు తనమతమునందు చెప్పబడిన ధర్మములను విశ్వాసముతో నాచరింపవలెను. దైవసాన్నిధ్యమును బడయుటకు విశ్వాసమే పరమ సాధనము.

(201) విశ్వాసముకలవానికి సర్వముకలదు.విశ్వాసముకొరవడినవానికి సర్వము కొరతయే.

(202) విశ్వాసమువలనను రోగములు కుదుర్చునట్టి వైద్యులు రోగులను పిలిచి "నాశరీరములో రోగములేదు. నాకెంతమాత్రము జబ్బులేదు" అను మాటలను వారినోట పలికింతురు. అందువలనతమ కేరోగములేదని వారికి విశ్వాసము కలుగును. ఆవిశ్వాసముచేత

నుండురోగము కుదురును. అలాగే నేను మంచివాఁడను కాను, నీతి లేనివాఁడను" అని నీవుతలంతువేని నీవట్టివాఁడ వేయగుదువు. అట్లు గాక నాదగ్గర నఖండశక్తి కలదని నీవు విశ్వసించితివేని నీకట్టిశక్తి తప్పక గలుగును.

(203) భగవంతుఁడైన శ్రీరామచంద్రుఁడు లంకకుఁ బోవుటకై సముద్రమునకు సేతువుకట్టవలసివచ్చెను. కాని హనుమంతుఁ డొక్క దాటున లంకలో దుమికెను. యజమానునికంటె వానిబంటగు కోఁతి యెక్కువ పనిచేసెను. దీనికారణమేమి? శ్రీరాముని యందు హను మంతునికిఁగల యఖండవిశ్వాసమే.

(204) ఒకమనుష్యుఁడు నదిదాటివెళ్ళవలసివచ్చెను. అది సుర క్షితముగా దాటుటకు వాని కొకయోగి తాయెత్తునిచ్చి "ఇది చేతికి గట్టికొనుము. నదిమీఁద నీవు నడచివెళ్ళఁగలవు" అని పలికెను. ఆమను ష్యుఁడది తీసికొని నీటిమీఁదనడచి సగముదూరముపోయి తాయెత్తు లో నేమియున్నదో కనుగొనవలెనని బుద్ధిపుట్టగా నది విప్పిచూచెను. అందులో నొకచిన్న తాటియాకుముక్క మీఁద "రామ" యను రెండ క్షరములు వ్రాసియుండెను. అదిచూచి యామూర్ఖుఁడు తనలో "ఇం తేనా యేదో గొప్పమంత్రము ఉన్నదనుకొన్నాను. రామనామమా! ఇది ఎవ్వఁడెరుగఁడు!" అని తిరస్కారభావముచూపెను. ఆతలంపుపుట్టిన తోడనే వాఁడు నీటిలోమునిగిపోయెను. భగవంతునియెడల విశ్వాసము మహాద్భుతమును జేయును. విశ్వాసముప్రాణము, సందేహముమరణము.

(205) ప్రశ్న:—నాజీవనోపాధికై నేను ప్రయత్నముచేసుకో వలసియుండగా ప్రతిదినము భగవధ్యానము చేయుటకై నాకవకాశ మేది?

ఉత్తరము:-ఎవనికొరకు నీవుపనిచేయుచున్నావో వాఁడే నీకు గావలసిన వస్తువులు నమర్చియిచ్చును. భగవంతుఁడునిన్నీలోకమునకు బంపకమునుపే నీసంరక్షణకొరకు తగినయేర్పాటులు చేసెను.

(206) ప్రశ్న:—నేనెప్పుడు స్వేచ్ఛగానుందును?

ఉత్తరము:—నీయహంభావము నశింపఁజేసి నీవు పరమేశ్వరునిలో లీనమగుదువో అప్పుడు.

(207) గాలిపడగలు లక్షోపలక్షలుచేసి పిల్లలు గాలిలో నెగరవేయుదురు. కాని యందులో నొకటి రెండుమాత్రమే త్రాడుతెంచుకొని పోవును. అట్లే వందలకొలది సాధకులలో నొకరిద్దరుమాత్రమే సంసారబంధములు తెంచుకొని ముక్తులగుదురు.

(208) పాదరసపుకుండలో సీసపుముక్క పడవైచితిమేని వెంటనే యది దానిలోఁ కలసిపోవును. అట్లే జీవాత్మ పరబ్రహ్మమను సముద్రములోఁ బడినపక్షమున తనవ్యక్తిని పోగొట్టుకొని బ్రహ్మమునందు లీనమగును.

(209) ప్రశ్న:—ఈకాలమున చేయఁబడుచున్న మతబోధను గురించి మీయభిప్రాయమేమి?

ఉత్తరము:—వండిన యన్నము ఒకమనుష్యునకు మాత్రమే సరిపోవునంత యుండఁగా నూరుమందిని విందునకు పిలుచుట యెట్లుండునో యీమతబోధ యట్లున్నది.

(210) ఇతరులకు బోధలుచేయుటకంటె నాకాలమందు భగవంతునారాధించుట మంచిది. యారాధనమే యుత్తమబోధ. తానుముందుగా ముక్తుఁడగుటకు ప్రయత్నము చేయునో వాఁడే గొప్పబోధకుఁడు. సిద్ధునికడకు నానాదేశములనుండి యనేకులువచ్చి బ్రహ్మవిద్యనేర్చుకొందురు. వారెక్కడనుండి వత్తురో తెలియదు. వారినెవ్వరుపిలువలేదు. పుష్పము వికసించినప్పుడు తుమ్మెదలు నానాభాగములనుండి యెవ్వరు పిలువకుండగనేవచ్చి మకరందము త్రాగును.

(211) ఓమతబోధకుఁడా! బోధించుటకు నీకధికారముకలదా? మెడలో దవాలితాల్చిన తక్కువ రాజభటుఁడుకూడ కనబడఁగానే

జనులు వానిమాట గౌరవముతో విందురు. ఎట్టియల్లరినైన వాఁడడపఁ గలఁడు. అది యెల్ల వాని దవాలీబలమే. కావున నోబోధకుఁడా! నీవు ముందుగా దేవునివలన బోధించుట కధికారమునకు దగినయావేశమును సంపాదింపవలెను. ఆయావేశము కలుగనంతవఱకు నీవెన్నిబోధలు చేసినను నవి వ్యర్థములే.

(212) దివ్యతేజస్సుతో నెవ్వఁడు వెలుగుచుండునో వాఁడొక్కఁడే నిజమైన మనుష్యుఁడు.

(213) ఆత్మబంధముకలవాఁడు మనుష్యుఁడు. బంధములు లేని వాఁడు పరమేశ్వరుఁడు.

(214) తక్కెడలో బరువున్న సిబ్బె క్రిందికిదిగిపోవును. బరువులేనిది పైకిలేచిపోవును. అట్లే యధిక సంసారభారముగల మనుష్యుఁడు క్రుంగిపోవును. తక్కువభారముకలవాఁడు పైకనగా పరమేశ్వర సన్నిధికరుగును.

(215) భగవంతుఁడు మనుష్యులందరిలో నున్నాఁడు. కాని ప్రతిమనుష్యుఁడు భగవంతునిలో లేఁడు. మనుష్యులు విశేషదుఃఖమనుభవించుటకిదే కారణము.

(216) మనుష్యులు రెండువిధములుగా నున్నారు. గురువు శిష్యునితో నిట్లుచెప్పెను. "నేను నీకు బోధించునది వెలలేనిది కావున నేను బోధించినజ్ఞాన మితరులకు జెప్పక నీవేయుంచుకొనుము." అనగా శిష్యుఁడది యెవ్వరికి జెప్పక దాచుకొనెను. ఆగురు వాజ్ఞానమును మరియొక శిష్యున కుపదేశించెను. అతఁడా జ్ఞానము వెలలేనిదనియు సర్వజన తారకమనియు నెరిగి ఎత్తైనచోట నిలువఁబడి యెల్లవారి కారహస్యముపదేశించెను. అవతారపురుషులు రెండవతరగతివారు. సిద్ధులు మొదటితరగతివారు.



(217) పిల్లకాలము సుపవాసము చేయువాఁడెవ్వఁడును లేఁడు.

కొందఱు జాముప్రొద్దెక్కి భోజనము చేయుదురు. కొందరు రెండుజాములప్పుడు తిందురు. కొందరు మూడుజాములవేళభుజింతురు. కొందరు రాత్రి భుజింతురు. అట్లే యీజన్మములోను, మరియొక జన్మములోను నవేక జన్మాంతరములైన తరువాతను యెప్పుడో యొకప్పుడు మనుష్యుఁడు పరమేశ్వరుని దర్శనము చేయును.

(218) పండు చెట్టున పక్వమై మాగి తనంతట నేలరాలినప్పుడది మిక్కిలి రుచిగలిగి యుండును. అట్లుగాక పండకముందే చెట్టునుండి కోసి ముగ్గవేసితిమేని యది రుచితగ్గిపోవును. అట్లే మనుష్యుఁడు జ్ఞానపరిపక్వదశ నొందినప్పుడు వర్ణభేదములు మొదలైనవి తమంతట తామే వదలిపోవును. అపరిపక్వదశ వచ్చువఱకు మనుష్యుఁడట్టి భేదములను తప్పక పాటింపవలయును.

(219) తుపానుపట్టినప్పు డేది యేచెట్టో మనము చప్పున చెప్పజాలము. ఒకటి మఱ్ఱిచెట్టొ రావిచెట్టొ తెలిసికొనుట కష్టము. అట్లే సత్యజ్ఞానమనెడు తుపానురేగినపుడు వర్ణభేదములు కనఁబడవు.

(220) పుండు పూర్తిగా మానినవెనుక పొర దానంతటదియె యూడిపోవును, కాని దానిని బలవంతముగా నూడదీసిన యెడల నెత్తురుకారును. అట్లే మనుష్యునకు సంపూర్ణజ్ఞానము కలిగినవెనుక వర్ణభేదములు మొదలగునవి స్వయముగా నశించును. కాని యట్టిభేదములను బలవంతముగా నశింపఁజేయుట తప్పు.

(221) ప్రశ్న:—జందెముంచుకొనవలసిన యవసరమేది?

ఉత్తరము:—ఆత్మజ్ఞానము కుదిరినప్పుడు బంధము లన్నియు తమంతటవే విడిచిపోవును. అప్పుడెక్కువ జాతియనిగాని తక్కువ జాతియనిగాని బ్రాహ్మణుఁడనిగాని శూద్రుఁడనిగాని భేదముండదు. అప్పుడు బ్రాహ్మణ వర్ణసూచక మైన యజ్ఞోపవీతముయొక్క యవ

సరమే యుండదు. కాన భేధబుద్ధి యున్నంతకాలము బలవంతముగా జన్నిదమును విడిచిపెట్టకూడదు.

(222) ప్రశ్న.—“మీరు భార్యతోఁ గలసి సంసారమెందుకు చేయుదురు”? అనియొకరు రామకృష్ణపరమహంస నడిగిరి.

ఉత్తరము:—దేవతల సేనాపతియైనకుమారస్వామియొకనాఁడు తనగోటితో నొకపిల్లిచెంపమీఁద బరికెను. ఇంటికివెళ్ళినతర్వాత తల్లియైన పార్వతీదేవియొక్క చెంపమీఁద బరుకులుకనఁబడెను. అదిచూచి యతఁడు “అమ్మా! నీచెంపమీఁద బరుకులెందుకువచ్చిన” వనియడిగెను. పార్వతియతనికిట్లనియె. “కుమారా! ఇదినీపనియె. నీగోటితో నీవే బరికితివి.” అనవుడు కుమారస్వామి మిక్కిలియాశ్చర్యముతో నిట్లనియెను. “అమ్మా! నేనెన్నఁడు నిన్ను బరికినట్లు జ్ఞాపకములేదే నీవేల యిట్లనుచున్నావు?” అని పలికెను. “కుమారా! నీవు నేఁడొక పిల్లిని బరకలేదా” అని పార్వతియడిగెను. “అవును! బరికితినికాని నీచెంప మీఁద బరుకులెందుకు నుండవలయును.” అనవుడు దుర్గయిట్లనియె. “కుమారా! యీప్రపంచమున నేనుతప్ప మరియొకవస్తువులేదు. నేనే సృష్టి. నేనే చరాచర ప్రపంచము. నీవెవరికి హానిచేసినను నాకు హానిచేసినట్లే.” ఆపలుకులువిని కార్తికేయుఁడు మిక్కిలి విస్మయమొంది వివాహముచేసికొనుట మానుకొనెను. ఏలయన జగమునఁగల స్త్రీలందఱు తనతల్లియొక్క స్వరూపములే యగుటచే నతని దృష్టికి ప్రతిస్త్రీయు తనతల్లియగు దుర్గవలెనే కనఁబడెను. నేనా కుమారస్వామివంటివాఁడనే. లోకమునంగల ప్రతియువిదుది నాకంటికి లోకమాతయగు పార్వతివలెనే గనఁబడుచున్నది.

(223) గొప్పకుటుంబములోని పతివ్రతలను నేనుచూచినప్పుడు నాతల్లియైన పార్వతి పతివ్రతారూపముతో వచ్చినట్లే నాకగపడును. మఱియు నీనగరమునందు సిగ్గుబిడీయములు విడిచి నీతిమాలిన నేష

ముతో వీధియరుగులమీఁద గూర్చుండునట్టి గుడిసివేటువాండ్రను జూచినప్పుడును నాతల్లియైన దుర్గ మరియొకవేషముతో వినోదించు చున్నదని నేను తలంచెదను.

(224) ఈపట్టణమందంతట వాయుదీపములు గేస్‌లైట్లున్న వికదా. ఆవాయువుయొక్క తేజము పట్టణమందలి నానాభాగముల లో నొకచోట నెక్కువ తేజముతోను నొకచోట తక్కువ తేజముతోను వెలుగుచుండును. కాని యా తేజమునకు జీవమని చెప్పఁదగిన వాయువు పట్టణమంతకు నొక్కచోటనుండియే వచ్చును. అప్పుడప్పుడు ప్రపం చమునఁ బుట్టునట్టి మతబోధకులు దీపస్తంభములు వంటివారు. పర మేశ్వరునియొద్దనుండి బ్రహ్మజ్ఞాన తేజము వారిమీఁదికి ప్రసరించుచుండు ను. అందువలన వారు లోకమున వెలయుచుందురు.

(225) ఇంటిమీఁదకురిసిన వాననీరు గొట్టములమూలమున బై టికిఁ దీయవచ్చును. ఆగొట్టములతుదను మిక్కిలి చమత్కారముగ గో ముఖములు పెద్దపులిముఖములు చెక్కఁబడినపక్షమున నీరు గొట్ట ములలోనుండి యాముఖముల ద్వారమున బైటకువచ్చును. నీరుమా త్రిమా గొట్టములలోనిదికాదు. అది వాననీరు. పరమసాధువులు నా నాచిత్రిముఖములుగల గొట్టములు వంటివారు. వారిముఖములనుండి భగవంతుఁడు సత్యజ్ఞానామృతమును ప్రవహింపఁజేయుచుండును. ఆ జ్ఞానము వారిదికాదు. భగవంతునిది.

(226) నక్కకూతలన్నియు నొక్కమచ్చుననే యుండును. ప్ర పంచమందలి జ్ఞానులందరియొక్క బోధ లొక్కవిధముననే యుండును.

(227) ఈప్రపంచమున మనకు సుఖముగలుగఁజేయునట్టి ప్రతి విషయమునందు గొప్పగానో కొంచెముగానో పరమేశ్వరసంబంధ ముండును. బెల్లమునకు పటికిబెల్లమునకు నెట్టిభేదమున్నదో నట్టిసుఖ మునకు నీశ్వరసంబంధముగల సుఖమునకు నట్టిభేదముకలదు.

(228) ఇతరులవ్యాపారమునందు మగ్నుఁడైనవాఁడు తనలోపలివ్యవహారములను వెలుపలివ్యవహారములను మరిచిపోవును. అనగా తనలోకవ్యవహారములనుగాని పారమార్థికవిషయములనుగాని విచారించుకొనఁడు.

(229) మనస్సు దుర్మార్గములయందు ప్రవేశించినప్పుడు బ్రాహ్మణుఁడు మాలపల్లెలోనున్నట్లు గౌరవముగల పెద్దమనుష్యుఁడు చుట్టుగుడిసెలలో నున్నట్లు తలంపవలెను.

(230) ఒకమనుష్యుఁడు ప్లీడరును చూచినతోడనే వానికి వ్యాజ్యములమాట జ్ఞాపకమువచ్చును. అట్లే పరమభాగవతోత్తముని చూడఁగనే మనుష్యునకు భగవంతుఁడు పరమార్థము మొదలైనవి జ్ఞాపకమువచ్చును.

(231) ప్రశ్న:—మతబోధకునకు తనబంధువులవలన గౌరవము జరుగకపోవుటకు కారణమేమి?

ఉత్తరము:— గారడివాఁడు విద్యలుచేయునప్పుడు వానిచుట్టు క్రొత్తవారు చేరుదురుగాని వానిచుట్టాలు చేరరు.

(232) కొన్ని చెట్ల విత్తనములు చెట్టుక్రిందఁబడక కాయపగిలి గాలికెగిరి దూరముగాఁబడి యచ్చట మరలమొలచును. అట్లే సిద్ధునియొక్క యాత్మ సమీపమునందుగాక దూరమున వ్యక్తమగును.

(233) దీపపువెలుఁగు కొంతదూరముననున్న స్థలమును ప్రకాశింపఁజేయుచుండును. కాని దానిదగ్గరనే క్రీనీడయుండును. ఆలాగే మతోద్ధారకునియొక్క సామీప్యమున నున్నవాఁడు వానిమహిమగ్రహింపలేఁడు. కాని దూరమునందున్నవాఁడు వాని జ్ఞానప్రభావములను గ్రహించి బాగుపడును.

(234) మిక్కిలి వడిగా ప్రవహించునదియొక్క నీళ్ళు ఒకచోట గుండ్రని సుడిగుండములుగాతిరుగును. కాని యాగుండములను వెం

టనేదాటి యాజల మెప్పటివలె ప్రవహించును. అట్లే యీశ్వరభక్తుల హృదయములు నడుమనడుమ నిరాశ విచారము మొదలగు సుడుల లోఁబడి గ్రుక్కుచుండును. కాని యట్టియవస్థ క్షణకాలముమాత్రమే యుండునుగాని చిరకాలముండదు.

(235) పండ్లతోనిండినచెట్టు వంగియుండును. కనుక నీవుగొప్ప వాఁడవు కాఁదలఁతువేని వినయముగలిగి వంగియుండుము.

(236) త్రాసులోబరువుగలచిప్ప క్రిందికిఁబోవును. తేలికచిప్ప పైనుండును. అట్లే సద్గుణము సామర్థ్యముగలవాఁడు మిక్కిలియడగి యుండును. కాని మూర్ఖుఁడు గర్వముగలిగి చెడిపోవును.

(237) సజ్జనునికోపము నీటిమీఁదగీచిన గీతవలె క్షణభంగుర మేగాని చాలసేపుండదు.

(238) తెల్లబట్టమీఁద నల్లనిమంటిచుక్క బడెనేని చుట్టుప్ర క్కలనున్న తెల్లదనము మందర నానలుపు మిక్కిలి యసహ్యముగ నుండును. అట్లే పవిత్రుఁడైన సాధువుదగ్గర మిక్కిలి చిన్నతప్పున్న ను నదిమిక్కిలి ఘోరముగా కనఁబడును.

(239) సూర్యకాంతి యన్నివస్తువులమీఁదను సమానముగానే పడును. కాని యద్దములు నీళ్ళు మెరుఁగుచేసిన లోహములు మొద లగు తళతళలాడువస్తువులలో నదిప్రతిఫలించును. ఈశ్వర తేజ మిట్టి దే. అదియెల్లవారి హృదయములమీఁద పక్షపాతములేక సమాన ముగాఁబడును. కాని సాధువులయొక్కయు సిద్ధులయొక్కయు స్వచ్ఛ హృదయములమీఁద నది పరిపూర్ణముగా ప్రతిఫలించును.

(240) పాదరసముపూసిన యద్దములో మనుష్యుఁడు తనప్రతి బింబమును చూడఁగలుగును. అట్లేవైరాగ్యముగల మనుష్యునియొక్క పావనహృదయములో నీశ్వరప్రతిబింబము ప్రతిఫలించుచుండును.

(241) నీవుచిన్నబిడ్డవలె నెప్పు డవూయికుఁడవగుదువో యప్పు డే దివ్యతేజము నీవుబడయఁగలవు. నీవునేర్చికొనిన ప్రపంచజ్ఞానమం తయు మఱచిపోయి చిన్నబిడ్డవలె నజ్ఞానుఁడవుగమ్ము. అప్పుడే సత్య జ్ఞానమును నీవు సంపాదింపఁగలవు.

(242) మన పంచాంగములలో వర్షయోగములు వ్రాసియుం డును. పంచాంగమెంత తెలిసినను వానచుక్క యూఁడిపడదు. అట్లే పుస్తకములలో నెన్నోధర్మములుండును. కాని యవి చదివినంతమా త్రమున భక్తివిశ్వాసములు పుట్టవు. అందు నేర్పఁబడిన సద్గుణముల ను నేర్చుకొని మనుష్యుఁ డాప్రకారము నడచుకొనవలెను.

(243) ప్రశ్న—మతములు మొదట మిక్కిలి పవిత్రము లుగానుండి క్రమక్రమముగా నేలచెడిపోవును?

ఉత్తరము:—వాననీరు మిక్కిలి పరిశుద్ధమైనది. కాని యది దేనిమీఁదఁబడునో దానిబట్టి శుద్ధిమారుచుండును. ఇంటిమీఁదను, గొట్టములలోను మురికియున్నపక్షమున దానిమీఁద కురిసి గొట్టము లగుండ వచ్చునీరు మురికిగానుండును.

(244) సొమ్ము నీ కన్నము, నెయ్యి మొదలగువానిని మాత్ర మే సమకూర్చును. కాబట్టి యదే పరమార్థమని దానికొర కెల్లపా టులు పడి మోసపోకుము.

(245) గీటురాతిమీఁద గీచినయెడల బంగారముయొక్క యు, ఇత్తడియొక్కయు వన్నె స్పష్టపడును. అట్లే కష్టములు కలిగి నప్పుడే నిజమైన సాధువులెవ్వరో, వంచకులెవ్వరో తెలియును.

(246) ఉక్కుతునక కావలెనన్న మంచి యినుము తెచ్చి య దికి మెన్నోసారు లెఱ్ఱఁగా కాల్చి సుత్తితోఁ గొట్టవలెను. అప్పుడది యుక్కుగా మారును. అంతట దానిని మనము యిష్టమువచ్చినట్లు వంచి కత్తులుగాను, కటారులుగాను చేయవచ్చును. అట్లే మనుష్యుఁ

డు మహాకష్టము లనియెడు కొలిమిలో కాల్పఁబడి లోకపీడ యను సుత్తిదెబ్బ పలుమారు తినినఁగాని పరిశుద్ధుఁడు, వినయసంపన్నుఁడు గాఁడు.

(247) నీమతములో నెల్లప్పుడు స్థిరముగా నిలువఁబడుము కాని యసహనమును, మౌఢ్యమును విడిచిపెట్టుము.

(248) నూతిలోని కప్పవలె నుండవద్దు. ఆకప్ప తన నూతి కంటె విశాలమైనదియు, గొప్పదియు మఱియొకటి లేదనితలంచును. మతోన్మాదము గలవారందఱు నట్టివారే వారు తమమతమే సర్వ శ్రేష్ఠమందురుగాని తక్కిన మతములలోని మంచి చూడరు.

(249) ఒక మనుష్యుఁడు పరమశివభక్తుఁడై తక్కిన దేవతల నసహ్యించుకొనుచుండును. ఒకనాఁడు శివుఁడు వానికిప్రత్యక్షమై "ఇతర దేవతలను నీవు దూషించినంతకాలము నేను నీభక్తి మెచ్చుకొనను" అనిపలికెను. కాని యామనుష్యుఁడు తనపంతము విడువలేదు. మరి కొంతకాలమునకు శివుఁడు మరల వానికి సాక్షాత్కరించెను. ఈసారి కేవల శివరూపముతోగాక హరిహరరూపముతో గనఁబడెను. అనఁగా సగము శరీరము శివుఁడు సగముశరీరము విష్ణువు. ఈవిగ్రహము. చూచి యామూర్ఖుఁడు సగము సంతోషించి సగము విచారించెను. అనఁగా విష్ణుదర్శన మైనందున విచారించెను. అయినను శివరూపమున్నవయిపున నతఁడు పుష్పములతో నర్చించి యా భాగముననే హారతులిచ్చి సాంబ్రాణి ధూపము వైచెను. కాని యా ధూపవాసనలు విష్ణుమూర్తి యాఘ్రాణింపకుండ వానిముక్కు చేతితో నొక్కిపట్టెను. మేరమీరిన యతని మూర్ఖతఁజూచి శివుఁడసంతుష్టుఁడై తత్క్షణమే యదృశ్యుఁడయ్యెను. కానియామనుష్యునిమూర్ఖత లేశమైన తగ్గలేదు. ఈవార్త గ్రామమంతట తెలిసెను. ఊరిలోని చిన్నబిడ్డలు వాఁడు కనఁబడినప్పుడెల్ల విష్ణునామముచ్చరించి వానినుడి

కింపఁదొడఁగిరి. అప్పుడు వాఁడాశబ్దము విసలేక చెవులకు గంటలు కట్టుకొనెను. వానికి ఘంటాకర్ణుఁడని పేరు కలిగెను. వాఁడు హరిహరుల కిద్దఱకుగూడ ననిష్టుఁడయ్యెను. మూర్ఖు లిట్లే మూఢవిశ్వాసములచేత చెడిపోవుదురు.

(250) క్రొత్తకోడలు మామగారికి నత్తగారికి తక్కినపెద్దలకు వినయముగా నడచుకొనుచు తన మగనిమీఁద భక్తి నెప్పటియట్లే నిలుపుకొనునట్లు నీవును నీయిష్టదైవతము మీద నధికభక్తిగలవాఁడవై యుండి తక్కిన దేవతలను నిరాకరింపకుము.

(251) నిజముగా మతముమీఁద భక్తిగలవాఁడు తక్కినమతములుగూడ పరమపదమునకు మార్గములేయని తలంచును. అన్యమతములమీఁద మన మెల్లప్పుడు గౌరవము నిలుపవలెను.

(252) బ్రహ్మసమాజమునకును హిందూమతమునకునుఁ గల భేద మేమి? బ్రహ్మసమాజ మొకటే స్వరము. హిందూమతము బహుస్వరములతోఁ గూడినజ్ఞానము. బ్రహ్మసమాజమతస్థులు బ్రహ్మముయొక్క యేకస్వరముతో సంతుష్టులై యున్నారు. హిందూమతము శ్రావ్యమై మధురమైనగానమునకు హేతువైన బహుస్వరములను గలిగియున్నది.

(253) హిందువులు బ్రహ్మసమాజమతస్థులు, తమతమ మతములను మిక్కిలి పట్టుదలతో బోధించుచున్న కాలమున నొక మనుష్యుఁడు రామకృష్ణపరమహంసయొద్దకుఁ బోయి యీ రెండుమతములగురించి మీ యభిప్రాయమేమి యని యడిగెను. అప్పుడతఁడిట్లనియె. "నాతల్లియైనదేవి తనపని వా రిద్దరిచేతఁగూడ చేయుంచుచున్న" దని నాయభిప్రాయము.

(254) హరియనఁగా మనహృదయములు హరించువాఁడు. హరిబల మనకు నాధైనబలము.

(255) పాపము పాదరసమువంటిది. అది దాగదు. రసముతిన్న వానినోరు పుండై యారహస్యము దాగనట్లే పాపముగూడ దాగదు.

(256) విచారముగలిగినప్పుడు వచ్చుకన్నీళ్ళు సంతోషము గల్గినప్పుడు వచ్చునానందబాష్పములు నొక్కనేత్రిమునుండి పుట్టి చెరి యొకకొననుండి కారును. దుఃఖజలము ముక్కునకు సమీపముననుండు కంటికొననుండి కాఱును. ఆనందబాష్పములు రెండవకొననుండి కారును.

(257) మహాద్భుతము లైనకార్యములఁ జేయువారియొద్దకుఁ బోకుము. వారు సత్యమార్గము విడిచి తిరిమ్మరువారు. వారిమనస్సులు మాయాశక్తియొక్క వలలోఁ దగులుకొని యున్నవి. అవి బ్రిహ్మముకడకుఁ దీసికొనిపోవు మార్గమున నడ్డుగానుండును. కావున వాని నెన్నఁడు కోరవద్దు.

(258) నిర్జనవనములో నొకఁడు పదునాల్గు వత్సరములు యోగియై తపస్సు జేసి యెట్టకేలకు నీటిమీఁద నడుచునట్టి యద్భుతశక్తి సంపాదించెను. ఈమహాశక్తి గలిగినందుకు మిక్కిలి సంతసించి యతఁడు తన గురువుకడకుఁబోయి తనకిట్టిప్రజ్ఞ కలిగినదని చెప్పెను. అదివిని గురువునవ్వుచు శిష్యున కిట్లనియె. "వత్సా! పదునాలుగేండ్లు ఘోరతపస్సు జేసి కాయకసరులుదిని బహుశ్రిమపడి నీవునేర్చి చేయఁగలపనినేరేవు పడవనడుపువానికి నొక్కడబ్బిచ్చి ప్రతిమనుష్యుఁడు చేయగల్గుచున్నాఁడు సుమా.

(259) పరమహంసయొక్క శిష్యుఁడొక్కఁడు పరులమనస్సులోనున్న యభిప్రాయముల గ్రిహింపఁగలశక్తి సంపాదించి తన ప్రజ్ఞా విషయమై గురువుతోఁ జెప్పెను. అతఁడు వానిఁ జీవాట్లుపెట్టి యిట్లనియె, "ఛీ! సిగ్గు సిగ్గు! ఇట్టి నీచవిషయములందు, నీ తెలివితేటలు వినియోగించి చెడిపోకుము.

(230) చాకలివానియొద్ద నెన్నో బట్టలుండును. కాని యవి వాని వికావు.బట్టలుదికినతోడనే యవి వాఁడు యజమానులకుఁ బంచిపెట్టును అప్పుడు వానిల్లు వస్త్రశూన్యమగును. తమ స్వంత యాలోచనలు లేనిమనుష్యులు చాకలివాని వంటివారే.

(231) దురాశ దుఃఖముచేటు. సంతుష్టి సంతోషదాయకము. ఒకనాఁడొక మంగలి పిశాచము లాశ్రయించిన యొక చెట్టుక్రిందనుండి పోవుచుండెను. అప్పుడు పైనుండి "నీకేడుకుండల బంగారము కావలె నా" యనుశబ్దము వినఁబడెను. మంగలి తలయెత్తిచూచెను. ఎవ్వరుకన బడలేదు. వాఁడక్కజమునంది సాగిపోఁదలచుకోగా మరల నాశబ్దమేవి నఁబడెను. అప్పుడు వాఁడిట్లనియె. "అయ్యా! మీరెవరో నేనెఱుఁగను కాని దేవరవారు నావంటి పేదమంగలిమీఁద దయగలిగి నిర్హేతుక ముగా నిటువంటి గొప్పయుపకారముఁ జేయఁదలచుకొన్నందుకు వద్ద నుటకు నాకునోరువచ్చునా?" అనిపలుక "ఇంటికివెళ్ళునప్పటికి,ఏడుకుం డల బంగారము నీయింటనుండును వెళ్లు" మని శబ్దమువినఁబడెను.మం గలి మహానందభరితుఁడై పరుగుపరుగున నింటికిఁబోయి చూచునప్ప టికి బంగారముతోనిండిన యేడుకుండలు కనఁబడెను. అందొకకుండ లోసగముమట్టుకు మాత్రము బంగారముండెను. ఆఱుకుండలనిండబం గారమున్నదని వాఁడుసంతుష్టిఁజెందక యేడవకుండనిండలేదనివిచా రించుచు, ఆకుండ బంగారముతో నింపివేయవలెనని భార్యశరీరము మీఁదనున్న నగలనమ్మి, యిత్తడిసామాను వెండిసామాను విక్రయిం చి బంగారముఁగొని యాకుండలోఁ బడవైచెను. కాని యది నిండ లేదు. అంతట వాఁడు మునుపటివలె సుఖముగా నన్నముఁ దినక చో డంబలియు గంజియుఁ ద్రాగిబ్రతుకుచు ధనముఁబోగుచేసి యాకుండ లోవేయుచువచ్చెను. అప్పటికి నది నిండలేదు. వాఁడు రాజుగారి సేవకుఁడాటచే మునపటిజీతముతోఁ దన కుటుంబసంరక్షణ మాటలే

దని చెప్పుకొని జీతము వృద్ధిచేయుమని కోరెను. రాజు వానిమాట నిజమనుకొని యట్లుచేసెను. ఆజీతముతో బంగారముకొని యాకుండ లో వేయుచువచ్చెను. ఎంతకు నది నిండలేదు. తర్వాత వాఁడుబిచ్చ మెత్తి ధనమార్జింపఁజొచ్చెను. చిక్కి శల్యమయ్యెను. మురికిగుడ్డలు కట్టఁజొచ్చె. వానియవస్థఁజూచి రాజు విస్మయమునొంది వానినిఁ బిలిచి "ఓరీ! జీతము వృద్ధికాకమునుపే నీవెక్కువ బలముగాను శుభ్ర ముగాను గనఁబడితివి. వృద్ధియైన తర్వాత మిక్కిలి దురవస్థలో బడి తివి కారణమేమి? ఏడుకుండలబంగారము పుచ్చుకొంటివా యేమి?" అని యడిగెను. మంగలివాఁడు తెల్లఁబోయి "మహాప్రభూ! ఈరహ స్యము దేవరవారి కెవ్వరుజెప్పిరి?" అనియడిగెను. ఓరీ! ఎవ్వరునుజెప్ప నక్కఱలేదు. ఈయేడుకుండలబంగారము పుచ్చుకొన్నవారినెందఱినో యెఱుఁగుదునని రాజు బదులుచెప్పి యాకుండలిచ్చివేయుమని యాజ్ఞా పించెను. అప్పు డాక్షురకుఁడు పిశాచములున్న వృక్షముకడకుఁ బోయి బంగారపుకుండలు నాకక్కరలేదనిచెప్పెను. వాఁడింటికిఁ బోవునప్పటికి కుండ లంతర్ధానము నొందెను. కాని వాఁడు పొట్టకట్టిపెట్టుకొని యేడ వకుండలోఁబోసిన సొమ్ముకూడ పోయెను.

(232) తామర గోకినప్పుడు మిక్కిలి సుఖముగానుండునుకాని తర్వాత కలిగెడు బాధ వర్ణింపనలవికాదు. అట్లే ప్రపంచిక సుఖ ముల ననుభవించునప్పుడు మిక్కిలి సంతోషకరముగా నుండునుకాని పిదప వానివల్ల గలుగునష్టము మితిమీరి యుండును.

(233) ప్రపంచమెట్లున్నది? ఉసిరి కాయవలెనున్నది. ఉసిరికా యయందు గింజపెద్దది. గుజ్జు తక్కువ. తింటే వగరు. కడుపునొప్పి.

(234) ధనముకొరకై మితిమీరిన శ్రమపడులోభివలెనే నీవు భగవంతునిదర్శనము సంపాదించుటకై సకలప్రయత్నములుచేయుము

(235) హృదయాకాశముమీఁద కోరికలనెడు మహావాయువు

లు వీచినంతకాలము భగవంతుని తేజము మనము చూడఁజాలము. నిర్మలమై నిశ్చలధ్యానముతోఁగూడిన హృదయమునందే పరమేశ్వ రావిర్భావము గలుగును.

(266) మకిలిగల యద్దములో సూర్యకిరణములు ప్రతిఫలిం పవు. అట్లే మాయామోహితములై మలినములై యపవిత్రములైన హృదయములు భగవంతుని మహిమను గ్రహింపఁజాలవు. పరిశుద్ధమైన యద్దమున సూర్యబింబము ప్రతిఫలించునట్లు, పరిశుద్ధహృదయమున భగవంతుఁడు కనఁబడును. కావున పరిశుద్ధుఁడవై యుండుము.

(267) గాలిచే సంక్షోభముఁ జెందిన నీటిమీఁద చంద్రుఁడు విఱిగిపోయిన బొమ్మవలె ప్రకాశించును. అట్లే మాయామోహితుఁడైన లౌకికునియొక్క యస్థిరచిత్తముమీఁద పరిపూర్ణుఁడైన భగవంతుఁడు స్వల్పతేజముతో మాత్రము ప్రకాశించును.

(268) ప్రశ్న:—భక్తుఁడు తన యిష్టదైవముకొఱకు సర్వము నేల పరిత్యజించును?

ఉత్తరము:—కంటికి వెలుఁగుకనఁబడఁగానే పురుగు చీఁకటి నుండి దానివైపు పరుగెత్తును. చీమ చెరుకుపానకములోనే పడిచచ్చును. కాని దానినెప్పుడు విడువదు. ఆలాగే భక్తుఁడు సమస్తమును విడిచి తనదైవమునే చేరుకొనును.

(269) మనుష్యుఁడు నిచ్చెనయో, వెదురుగడయో, మెట్లవరుసయో, త్రాడో, యాధారముచేసికొని యింటిమీఁది కెక్కవచ్చును. ఆలాగే భగవంతుని సమీపించుటకు సాధనోపాయము లనేకములు గలవు. ఒక్కొక్కమత మొక్కొక్కవిధానమును తెలియఁజేయును.

(270) ప్రశ్న:— దేవుఁడు సర్వవ్యాపకుఁడు కదా. ఆయనను మనమేల చూడఁజాలము?

ఉత్తరము:—నాచు, తుక్కు, జమ్ము, మొదలైనవానిచే కప్పఁ

బడిన యొకగుంటగట్టుననిల్చిన మనుష్యునకు గుంటలోనినీరు కనఁబడదు. నీరు చూడవలయునన్న జమ్ము, నాచు మొదలైనవి తీసివేయవలయును. నీకన్నులను మాయకప్పుచున్నది. కావున నీవు భగవంతుని జూడలేవు. ఆయనను నీవుచూడఁదలఁతువేని నీకన్నులనుండి మాయను తొలఁగింపుము.

(271) ప్రశ్న:—మనముజగన్మాతయైన దేవినేలచూడఁజాలము?

ఉత్తరము:—ఆమె గొప్పయింటిస్త్రీవంటిది. తెరవెనుకనుండి యందరినిఁజూచుచు తానెవ్వరికిఁ గనఁబడక తన వ్యవహారమంతయు నామె చక్కఁగా చేసికొనుచుండును. ఆమెకొడుకులు మాత్రమే తెరఁదాటివెళ్ళి యామెను జూడఁగలరు. అట్లే మాయయను తెరమరుగుననున్న దేవిని సద్భక్తులు మాత్రమే చూడఁగలుగుదురు.

(272) వాదములుసేయకుము. నీమతముమీఁద నీకెంతవిశ్వాసమున్నదో యితరులమతములమీఁద నితరులకు నంతవిశ్వాసమే యున్నది. వితండవాదము చేయుటవలన తనతప్పు తానెన్నఁడు తెలిసికొనఁజాలఁడు. ఈశ్వరానుగ్రహము ప్రసరించిన పక్షమున ప్రతిమనుష్యుఁడు తనతప్పు తానుగ్రహించును.

(273) ఒకకాఁపువాఁడు దినమంతయు శ్రమపడి చెఱుకుతోఁటకు నీరుపెట్టెను. కాని యానీటిలోనొకచుక్కయు చెఱుకుతోటలోఁబడక యెలుక కన్నములుగుండ భూమిలోనికిఁబోయెను. తనహృదయమున ధనార్జనము కీర్తిసంపాదనము మొదలైనకోరికలు పెట్టుకొని భగవంతునారాధించునట్టి భక్తుఁడుకూడ నట్టివాఁడే. అనుదినము వాఁడు ప్రార్థనఁజేయునప్పటికి వానిప్రార్థనము నిష్ప్రయోజనము ఏలయన వానియారాధనమంతయు వాంఛలనియెడు నెలుకకన్నముల గుండ వ్యర్థమైపోవుచున్నవి. వాని జీవితాంతమున సహితము వాఁడు లేశమైన వృద్ధిచెందక మొదటనున్నట్లే యుండును.

(274) భక్తిని భక్తులను వెక్కిరించి యెగతాళిఁ జేయునట్టి మూర్ఖులకు దూరముగానుండి నీవు ప్రార్థనచేసికొమ్ము. ప్రార్థనకాలమందు వారిని దగ్గరకు రానీయకుము.

(275) ప్రశ్న:—వేరు వేరు తెగలు కల్పించుట మంచిదా?

ఉత్తరము:—నాచు ప్రవాహముగల యేటిలో మొలవదు. నిలువనీరున్న కోనేరులలో మొలుచును. అట్లే భగవంతునిమీఁద గాఢప్రేమఁగలవాఁడు మఱియొకపనిఁ జేయుట కవకాశము లేకయుండును. పేరు ప్రతిష్ఠలు గావలసినవాఁడు క్రొత్త తెగలు కల్పించును.

(276) వేదములు తంత్రములు పురాణములు మొదలైనసమస్తపవిత్రగ్రంథములు మనుష్యులనోళ్ళనుండి వెలికివచ్చుటచేత తినియుమిసినయన్నమువలె నెంగిలియై మైలపడినవి. కాని పరబ్రహ్మము మనుష్యుల నోటనుండివచ్చు మాటలచే నింతవరకు సంపూర్ణముగా వర్ణింపఁ బడలేదు గావున నింతవరకెంగిలియై మైల పడలేదు.

(277) మాయను మనము కనుఁగొనగానే యది పారిపోవును. ఒకపురోహితుఁడు తనశిష్యునిఁ జూచుటకై గ్రామాంతరము వెళ్ళుచుండెను. ఆయనవెంట సేవకుఁడు లేఁడు. త్రోవలో నొక మాదిగవాఁడు కనబడగా వానిం జూచి యతఁడు, "ఓరీ! నీవు నావెంట సేవకుఁడుగా వత్తువా కడుపునిండ నీకన్నము పెట్టించెదను. నీ కేలోటు లేకుండఁ జేసెదను. రాగలవా!" అని యడిగెను. అనవుడు మాదిగవాఁడిట్లనియె. "మహాప్రభూ! నేను కడజాతివాఁడను. నేను దేవరవారికిబంటునై యెట్లు రాఁగలను." అది విని పురోహితుఁడిట్లనియె. "భయములేదు! నీవేజాతివాఁడవో యెవ్వరితోను చెప్పవద్దు. ఎవ్వరితోను మాట్లాడవద్దు. ఎవ్వరిజోలికిపోవద్దు." అందుకు మాదిగవాఁడొప్పుకొనెను. సాయంకాలము పురోహితుఁడు సంధ్యావందనము చేసికొనుచుండఁగా మరియొక బ్రాహ్మణుఁడటకు వచ్చి సేవకునిఁజూచి 'ఓరీ! నాజోడు తీసికొనిరా!' అని యాజ్ఞాపించెను.

ఎవ్వరితోడను మాట్లాడవద్దని గురువు చెప్పుటచేత వాఁడు జోడు దీసి కొనిరాక బదులు చెప్పక యూరకుండెను. బ్రాహ్మణుఁడు జోడు తెమ్మని మరలగట్టిగా పలికెను. వీఁడు మొద్దువలె గూర్చుండెను. మూడవసారి బ్రాహ్మణుఁడు మిక్కిలి కోపించి "ఓరీ! మాదిగవెధవా! మాటలాడ వేమిరా! జోడు తెమ్మన్న మాటలు వినఁబడలేదా!" అని దూషించెను. అప్పు డాసేవకుఁడు తనలో "అయ్యో! నాసంగతి కనిపెట్టినారు. ఇక నేనిక్కడ నుండకూడదు" అని పరుగెత్తెను.

(278) (ప్రశ్న) పరమాత్మకు, జీవాత్మకు భేదమేమి? (ఉత్తరము) నదీప్రవాహములో నొకదూలము వైచితిమేని జలము రెండు భాగములైనట్లు మనకగపడును. అట్లే మాయవల్ల గలిగిన యుపాధి భేదములచేత నిర్వికల్పమగు పరబ్రహ్మము భేదమై జీవాత్మయట్లు, పరమాత్మయట్లు కనఁబడుచున్నది. కాని నిజముగా రెండు నొక్కటే.

(279) సూచికాయంత్రము, ఉత్తరదిక్కును జూపినంతకాలము నోడ సరిగా నడచునుగాని తప్పుదారిఁ బట్టదు. జీవనమనియెడి నావ యొక్క సూచికాయంత్రమని చెప్పఁదగిన మనస్సు చలనములేక పరబ్రహ్మమువైపు సదా తిరిగియుండిన పక్షమున నేయపాయము లేక గమ్యస్థానముఁ జేరును.

(280) ఒక యవధూత యొకచోటఁగూరుచుండి జపము జేసి కొనుచుండగా నాదారిని పెండ్లివారూరేగుచు మంగళవాద్యములతో మహావైభవమునఁ బోవుచుండిరి. అవధూత జపముమాని యటుచూచెను. అప్రక్కనే యొక వేఁటగాఁడు చెట్టుమీదనున్న పక్షిని కొట్టవలెనని సరియైనగురిఁ జూచుచు పెండ్లివారికేసి చూడలేదు. దృష్టి మరల్ప లేదు. ఒక్కయడుగైనఁ గదల్పలేదు. అవధూత వేఁటగానిఁ జూచి ఓయీ! నీవ నాగురువువు! ఆపక్షిమీద నీమనస్సు లీనమైయున్నట్లు నేను ధ్యానించునట్టి పరబ్రహ్మముమీద నామనస్సు లీనమైయున్న పక్షమున నేను ధన్యుఁడనగుదును.

(281) ఒక పల్లెవాఁడు చేఁపలుపట్టుటకై గాలము నీటిలో వైచె ను. ఆదారినిబోవుచుండి యవధూత వానినిబిలిచి తాను బోవఁదలఁచు కొన్న యూరిపేరుఁ జెప్పి దానికి దారియెట్లని యడిగెను. అప్పుడు చేఁప గాలమునందగులుచున్నట్లు పల్లెవానికిఁ దోఁచుటచే వాఁడు తదే కనిష్ఠతోనుండి యవధూతమాటలు వినుపించుకొనలేదు. చేఁప దొరకిన తర్వాత పల్లెవాఁడు పరిక్కనున్న యవధూతనుజూచి "స్వామీ! ఇంత కుమునుపు మీరేమోయడిగినారది యే"మనియడిగెను. అప్పు డవ ధూత యిట్లనియె. 'అయ్యా! నీకు నమస్కారము. నీవు నాగురుఁడవు చేఁపను బట్టునపుడు నీచిత్తమా వ్యాపారమునందెట్లు లీనమై యున్నదో పరబ్రహ్మజ్ఞానముఁ జేయునపుడు నామనస్సుగూడ నట్లున్నపక్షమున నేను గృతార్థుఁడను.

(282) ఒకచేఁపనుపట్టుటకై కొంగ మంచిమొనపునైచి పొంచి యుండెను. దానివెనుక నిలిచి యొకవేఁటగాఁడు దానిఁజంపుటకై వింట బాణము సంధించి గురిచూచుచుండెను. కొంగ వెనుకకుదిరిగి చూడక తనకు మూడదలచిన కీడు గుర్తెరుగక చేఁపజాడలే కనిపెట్టుచుండెను. ఒక యవధూత యాదారిఁబోవుచు కొంగకు నమస్కరించి యిట్లని యెను. పక్షి గురువై నాకు మంచి విషయము బోధించెను. నేను ధ్యాన నిష్ఠలోనున్నప్పుడు నేనుగూడ నావెనుక నేమున్నదో చూడకుండ నిశ్చలమనస్సుతో నీ మనస్సు చేఁపమీఁదనున్నట్లే నేనుందును గాక!

(283) ఒక గ్రద్ద చేఁపను నోటగరచుకొని పోవుచుండెను. ఆచే పను తాము బట్టుకొని తినవలెనని కొన్నిగ్రద్దలు, కాకులు దానిఁద రుముకొని పోవఁజొచ్చెను. అప్పుడాగ్రద్ద విసిగి చేఁపనేలబారవైచెను. వెంటనే మరియొకగ్రద్ద యామత్స్యమును ముక్కునంగఱచికొనెను. తరుముకొనిపోవుచున్న గ్రద్ద, వాయసము మొకటిగ్రద్దను విడిచి మ త్స్యమ్మును బట్టుకొన్న రెండవగ్రద్ద వెంటబడెను. మొదటిగ్రద్ద చెట్టు

కొమ్మమీఁదనెక్కి హాయిగాకూర్చుండెను. ఒకయవధూత దానిఁజూచి నమస్కరించి యిట్లనియె. ఓగ్రద్దా! నీవే నాగురువువు! ఏలయన మనుష్యుఁడు ప్రాపంచక వాంఛలనియెడు బరువుడిచిపెట్టనంత సేపు వాఁడు సకలదుఃఖములపాలగుననియు, అట్టిబరువు విడిచినవెంటనే నీవలె నిర్విచారముగా సుఖముగా గూర్చుండుననియు నీతి నేర్పితివి.

(284) మనగురువు మనుష్యుఁడుగావున మంత్రము చెవిలో నుపదేశించెను. దేవుఁడే గురువైనపక్షమున మంత్రము మనయాత్మకుపదేశించును.

(285) సూదిలో దారమెక్కించుకోఁదలచుకొన్న యెడల దారము నునుపుజేసి సన్ననికొనయుండినట్లు జేయవలెను. అప్పుడా దారము చులకనగా సూదిబెజ్జములో నెక్కును. అట్లే నీహృదయము పరమేశ్వరునిమీఁద నిలుపదలఁచుకొన్న యెడల వినయముగలిగి, శాంతముగలిగి, కోరికలను జంపుకొనుము.

(286) ఒక పుట్టలో నొకపాముండి దారిఁబోవునందరిఁ గఱచుచుండెను. అందుచేత నాత్రోవనెవ్వరుఁ బోవరైరి. ఒకనాఁడొక యోగి యా మార్గమునఁ జనుచుండ పాము బుసకొట్టుచు వానిఁగరువఁబోయెను. అది యామహాత్ముని సమీపించునప్పటికి వానిమహిమచే దాని పొగరడగి పోయెను. యోగి పామునుజూచి "ఓసీ! నన్ను గరువ దలఁచినావా?" అని పలికెను. అతనిపలుకులువిని పాముసిగ్గుపడి యూరకుండెను. అప్పుడు యోగియిట్లనియె. ఇకముందు నీవెవ్వరిఁ గఱువకుము. మంచిమార్గమునఁ గాలక్షేపముఁ జేయుము. ఆపలుకులకు సర్పమువినయముతో దలయూచెను. యోగితనదారిఁబోయెను. పాము పుట్టలోఁబ్రవేశించి వెనుకటిదుర్గుణములువిడిచి యెవ్వరినిహింసచేయక సాధువృత్తిఁ బూనియుండెను. సర్పముయొక్క శక్తి చచ్చెనని చుట్టుపక్కలవారందరు దానిదుర్గుణము గ్రహింపలేక దానిజగ్గరకుఁ

బోయి పుల్లలతో పొడిచి, బెడ్డలతో గొట్టి, రాళ్లమీద, ముండ్లమీద నీడ్చి నానాబాధలు పెట్టఁజొచ్చిరి. కాని యది యన్ని బాధలుపడుచు నెవ్వరిజోలికిఁబోవదయ్యెను. దానిశరీరమంతయు నెత్తురు గారఁజొచ్చెను. అదృష్టవశమున యోగియాదారిని వచ్చి సర్పముయొక్క దురవస్థఁజూచి నీకిట్టి దుస్థితి యేలవచ్చెనని యడిగెను. మీయుపదేశముఁబట్టినేనెవ్వరిజోలికిఁ బోకపోవుటచే నిట్టి దురవస్థ ప్రాప్తించెనని యది యుత్తరమిచ్చెను. అప్పుడు యోగియిట్లనియె. వెఱ్ఱిదానా! యెవ్వరిని గఱచి జంపవద్దని ధర్మోపదేశముఁ జేసితిఁగాని నీవు లోకువై యిట్లుచెడి పొమ్మని చెప్పితినా? నీజోలి కెవ్వరైన వచ్చినప్పుడు బుస్సుమనిలేచి వారిని బెదరింపుము. పాముగఱచునేమోయను భయము వారికుండవలయును. కాని కఱచి హింసింపవద్దు." అది మొదలుకొని సర్పము తనయెడ నెల్లవారు భయముఁగలిగి యుండునట్లు వర్తించెను. నీవీప్రపంచమున సుఖముగా బ్రిదుకఁదలంచుకొన్న పక్షమున నెల్లవారికి నీయెడల భయము, భక్తి, గౌరవము గల్గునట్లు నడుచుకొనవలెను. నీవెవ్వరిని హింసింపఁగూడదు. ఒకరిచేనీవు హింసింపఁబడఁగూడదు.

(287) పక్షి పారిపోయినతర్వాత పంజరమెవ్వరికి నక్కఱలేదు. అట్లే ప్రాణమనియెడుపక్షి యెగిరిపోయినపిదప శవమెవ్వరికినక్కరలేదు.

(288) చమురులేక దీపమెట్లు వెలుగదో యట్లే మనుష్యుఁడు దేవుఁడులేక జీవింపఁ జాలఁడు.

(289) విద్వాంసుఁడైన యొకబ్రాహ్మణుఁ డొకానొక రాజుకడకుఁబోయి 'రాజా! నేను వేదశాస్త్రపురాణములలో గొప్పపండితుఁడను పుణ్యగ్రంథమైన భాగవతమును నీకుజెప్పెద చదువుకొమ్ము.' అని పలికెను. నిజముగా భాగవతము చదువుకొని దానిపరమార్థము తెలిసికొన్ననాఁడు తనదారియే చూచుకొనునుగాని కొలువుకూటములకుఁ బోయి రాజులదర్శించి వారినాశ్రయించి ధనమపేక్షింపఁడని యా

రాజెరుగును. కావున బ్రాహ్మణునింజూచి 'అయ్యా! భాగవతముమీరు చక్కగా చదివినట్లగపడదు. మీరది సంపూర్ణముగాఁ జదివి వత్తురేని మిమ్ము గురువుగా జేసికొందు' నని పలికెను. ఆపలుకువిని బ్రాహ్మణుఁడు "అహాహా! ఈరాజెంతమూర్ఖుఁడు. ఎన్నోసంవత్సరములనుండి భాగవతము నేనెన్నోసారులు చదివియుండఁగా నేనది తిన్నగాచదువలేదనుచున్నాఁడు." అని తనలోననుకొని యింటికిఁబోయి యెందుకైనను మంచిదని మరియొకసారి భాగవతము గట్టిగాచదివి రాజుకడకుఁబోయి భాగవతము నేర్పెదనని చెప్పెను. రాజు వెనుక చెప్పినట్లే చెప్పి యాయనను వెనుకకుఁబంపివైచెను. బ్రాహ్మణుఁడు మిక్కిలి విసిగి పోయెను గాని రాజట్లు మాటిమాటికిఁ జెప్పి తన్నుబంపివేయుట కేదియో గొప్పకారణముండవలెనని యూహించి యింటికిబోయిగదిలోఁగూర్చుండి మిక్కిలి శ్రద్ధతో భాగవతము నంతయు మొదటినుండిచివరవరకు జదివెను. ఈసారి యతనికి భాగవతముయొక్క పరమార్థమంతయు దెలిసెను. ఆయర్థము దెలిసినకొలది యతనికి రాజులమీద రాజసభలమీద ధనముమీద కీర్తిమీద వాంఛలు నశించెను. మంచివైరాగ్యము పుట్టెను. భగవంతునిమీదనేకాని రాజుమీదతనకు దృష్టి లేకపోయెను. కొన్నిసంవత్సరములు గడచినవెనుక రాజునకు బ్రాహ్మణునిమాట జ్ఞప్తికి రాగా,నతఁడాపేదబ్రాహ్మణుని యింటికిబోయిచూచి యతఁడు దివ్యజ్ఞాన తేజములతో వెలయుచున్నవాఁడని తెలిసికొని పాదములపైఁబడి నమస్కరించి యిట్లనియె. "స్వామీ! మీరు భాగవతముయొక్క పరమార్థమంతయు గ్రహించినారు. మీరనుగ్రహింతురేని నేను మీశిష్యుఁడనయ్యెద."

(250) గాలిలేనప్పుడు వేఁడితగ్గించుటకై విసనకఱ్ఱతో మనము విసరుకొందుము కాని గాలివిసరునప్పుడు విసనకఱ్ఱ విడిచిపెట్టుదుము. పైనుండి మనకుసాహాయ్యము లేనంతకాలము గమ్యస్థానముఁజేరుటకు,

మనంతట మనమే ప్రయత్నము జేయవలెను. అట్టిసహాయ మెవ్వరికైన గలిగినప్పుడు వాఁడు స్వయముగా పాటుపడుట మానవచ్చును.

(291) ప్రశ్న:— దేవుఁడెక్కడనున్నాఁడు? అతని మన మెట్లు జేరఁగలము?

ఉత్తరము:— సముద్రములో ముత్యములున్నవి. ఆముత్యములు దొరకువఱకు నీవుమాటిమాటికి సముద్రమున మునుగుచుండవలెను. అట్లే ప్రపంచమునందు దేవుఁడున్నాఁడు. కాని యాతనిని జూచుటకు నీవు గట్టిప్రయత్నముఁ జేయవలయును.

(292) ప్రశ్న— ఆత్మ శరీరములో నేవిధముగా నుండును?

ఉత్తరము:— చిమ్మనగ్రోవిలో దాని నంటి యుంటక కొట్టునట్టి కఱ్ఱయుండునట్లు.

(293) మహాసముద్రములో నొక యోడకొయ్య యొక్క చిట్టచివర నొకపక్షి నివాస మేర్పరచుకొని కొంతకాల మచ్చట నుండి విసిగి క్రొత్త చోటికిఁ బోవదలచి మునుపటితావు విడచి యెగిరిపోయి నానాదిక్కుల కరిగెను. మహాసముద్ర; మాటచే వృక్ష మెక్కడను దాని కగపడలేదు. అందుచే నెట్టకేల కది మరల నక్కడికే చేరెను. అలాగే గురువుగారుపదేశించిన నియమములు నిష్ఫలు జరుపలేక విసిగి యతని కంటె మంచిగురువుకడకుఁ బోవలెనని వానిని విడిచి దేశాంతరములు తిరిగి తిరిగి యటువంటి గురువునుగానక చేసిన ప్రయత్నమంతయు నిష్ఫలముకాగా మొదటిగురువున్నందు మునుపటి కంటె నెక్కువ గౌరవము గలిగి సామాన్యుఁడైన శిష్యుఁడు చివరకా పూర్వగురువునే యాశ్రయించును.

(294) ఒక మేకపిల్ల జ్యేష్ఠమాసమున నొకనాఁడు తల్లిముందర గంతులువేయుచు నిట్లనియె. "అమ్మా! ఈసారి రాసలీలోత్సవకాలము

న నీకు రాసపుష్పములతో విందు జేసెదను." అని సంతోషముతోఁ బలికెను. అనవుడు మేఁకయిట్లనియె. "అమ్మా! ఆపనినీవను కొన్నంతేను లభముకాదు. రాసపుష్పము మేత మనకులభించు లోపుగామనమె న్నో యాపదలను గడుపవలెను. ఈలోపుగా నెవరైన యజ్ఞపశువుగా తీసికొని పోవచ్చును. దేవీనవరాత్రిములలో దుర్గకు బలిపెట్టవచ్చును. భేతాళునకు బలియయ్యవచ్చును. ఇన్నికష్టములు గడచిన తర్వాత గదా మనము రాసపుష్పము మేయుట. మనుజుఁడుభవిష్యత్కాలమున నారాగల సుఖముల తలంచి యుబలాటముపడకూడదు. నడుమనెన్నో యాపదలు రావచ్చును."

(215) ఈఁగ యొకసారి పుండుమీఁద వాలి మరియొకసారి మధురపదార్థములమీఁద వ్రాలునట్లు లౌకికునిమనస్సు ఒకసారితుచ్ఛమైన ద్రవ్యసంపాదన మందును మరొకసారి భగవద్విషయమునందును నిల్చును.

(216) ఆకాశమునుండి పడిన వాననీరు మన గృహములమీఁదబడి గొట్టములగుండా భయంకరమైన పెద్దపులి ముఖమునుండి సింహముఖములనుండి నేలఁబడుచున్నది. కానియది సింహవ్యాఘ్రముఖములనుండి వచ్చిననీరు కాదు. ఆకాశమునుండి పడిన వర్షజలమే. ఆలాగే జ్ఞానవాక్యములు కొందరు మహాత్ముల నోటనుండి వచ్చినను నిజముగా దేవునివల్ల నుండి వచ్చినవే. కొన్నిచోట్ల వాననీరు వచ్చు గొట్టముచివర చిత్రచిత్రములైన జంతువుల ముఖములు చెక్కఁబడి యుండును, జలము వాటినుండివచ్చును. అందముకొరకు చమత్కారముకొరకు నట్లు చేయుదురు.

(217) చిల్లిగోనెసంచిలోనుండి కారిపోయి త్రోవనిండ బడిన యావాలు ప్రోగుచేయుటయెంతకష్టమో బహుచింతలమీఁదనుబహువ్యాపారములమీఁదను దగుల్కొన్నమనస్సు పరమేశ్వర ధ్యానము మీఁద నిల్చుటంతకష్టము.

(298) నిద్రబోవక మేలుకొన్నవారియింట దొంగలు ప్రవేశింపఁజాలరు. అట్లే నీవు జాగ్రత్తగా నున్నపక్షమున దురాచారములు నీలోఁ బ్రవేశింపవు.

(299) దూడపుట్టగానే మిక్కిలి సంతోషముగలిగి యేవిచారములేక గంతులువైచి యాడుకొనును. కాని దానిమెడకు పలుపుతగిలించినతోడనే యది వెనుకటిసంతోషమును గోలుపోయి నవకము చెడి మిక్కిలి విచారించుచుండును. అలాగే మనుష్యుఁడు పిల్లవాఁడుగా నున్నంతసేపు విచారరహితుఁడుగను విచ్చలవిడిగా నాడుకొనుచును సంతోషస్వరూపుఁడై యుండును. కాని వివాహముఁ జేసుకొని సంసారము దగిలించుకొన్నవెంటనే వెనుకటి విలాసము స్వాతంత్ర్యము గోల్పడి దీనుఁడగును. మంచుబిందువువలె మిక్కిలి పరిశుద్ధుఁడై క్రొత్తపూవువలె విలాసమును గలిగి వాయువువలె చకచక గలిగి మనుష్యులెల్లప్పుడు బాల్యావస్థలోనే యుండిన నెంతబాగుండును!

(300) పడవ నీటిలోనుండవచ్చును. కాని నీరు పడవలోనుండకూడదు. అట్లే యీశ్వరాన్వేషకులు ప్రపంచమున నుండవచ్చును. కాని ప్రపంచము వానిలో నుండకూడదు.

(301) తన గురువు సామాన్యమనుష్యుఁడే యని తలంచునట్టివాఁడు ఆ గురువువల్ల నే విధమైన లాభమును పొందఁజాలఁడు.

(302) నీవేమి తలంచుచున్నావో యదే పైకిచెప్పవలయును. నీ తలంపులకును మాటలకును మైత్రి యుండవలయును. అట్లుగాక మాటలతో దేవుఁడే సర్వశక్తుఁడని చెప్పుచు మనస్సులో ప్రపంచపు గొడవపెట్టుకొని యుందువేని నీ కెంతమాత్రమును లాభము లేదు.

(303) మేకలు మొదలైన జంతువులు చిన్నపిల్లలు పాడుచేయకుండ మొక్కచుట్టు ముండ్లకంచె వేయవలయును. కాని మొక్క గొప్పచెట్టైనతర్వాత మేకలమందగాని యావులమందగాని దాని

నీడను నిలిచి దానియాకులు పళ్లు ననుభవింపవచ్చును. అట్లే నీలో భక్తి క్రొంచెమున్న కాలమున నది దుస్సహవాసమువల్లను జెడిపోకుండ జాగ్రత్త పెట్టుకొనవలయును. నీభక్తి క్రమక్రమముగా విశాలమై దృఢముగా నాటుకొన్న వెనుక నీ బోధవల్ల బాగుపడి యనేకులు దురాత్ములు సజ్జనులు గావచ్చును.

(304) పసుగును నీటితోఁ గడిగి విడిచిపెట్టితి వేని మంటిలో దొర్లి యది మలినమగును. అట్లుగాక దానిని శుభ్రమైన గదిలోఁ గట్టితివేని శుచిగా నుండును. అట్లే మహాత్ముల సహవాసము వలన నీవు పరిశుద్ధుఁడవైనను ఆవల దురాత్ములతోఁ గూడి చరియించితి వేని నీ మనశ్శుద్ధి తప్పక చెడిపోవును. అట్లుగాక నీమనస్సును దైవముమీఁదనే నిల్పి మెలగుదు వేని నీకు మాలిన్యము లేదు.

(305) ప్రశ్న—భక్తుని కేది బలము?

ఉత్తరము—కన్నీళ్లేబలము. ఏడ్చుచున్న బిడ్డను తల్లి యోదార్చి దాని కోర్కె తీర్చుచున్నట్లె దుఃఖించుచున్న భక్తుని దయతో నోదార్చి భగవంతుఁ డాదరించును.

(306) ఎవ్వరికిఁ దెలియకుండ మూలకూర్చుండి గాని, నిర్జనమైన యడవిలోగాని, మనస్సులోగాని భగవంతుని ధ్యానము జేయవలయును.

(307) రెండుచేతులతో తాళము వేయుచు నీవు హరినామ స్మరణము చేయుము. అప్పుడు నీకు నీ మనస్సు ధ్యానయోగము నందు నిలుచును. నీవు చెట్టుక్రింద గూర్చుండి చప్పట్లు చఱచితివేని కొమ్మలమీఁదనున్న పక్షులన్నియు నెగిరిపోవును. అట్లే తాళము వేయుచు భగవన్నామస్మరణముఁ జేసినపక్షమున మనస్సు నాశ్రయించిన దురాలోచనలన్నియు దూరముగా నెగిరిపోవును.

(308) ఒక్క శాకమే తెచ్చి కూరగాను పులుసుగాను పచ్చడిగాను జేయవచ్చును. ఒక్కొక్కని కొక్కొక్కటి రుచించును. అట్లే భగవంతుఁ డొక్కఁడయ్యు భక్తుల యభీష్టప్రకారము బహువిధముగా దోచుచుండును. అతఁడు కొందరికి ప్రభువువలె నుండును. కొందరికి దండ్రివలె నుండును. ఒకనికిఁ బ్రేమరసము వర్షించునట్టి తల్లివలె నుండును. కొందరికి మనఃప్రియంబగు భర్తవలె నుండును. కొందరికి విధేయుఁడైన పుత్రునివలె నుండును.

(309) అనేకు లెవరికి నమస్కరింతురో వానికి నీవుకూడ నమస్కరింపుము. అంతమంది భక్తిశ్రద్ధలు చూపునట్టిచోట భగవంతుఁ డుండును. ఏలయన నతఁడు దయాస్వరూపుఁడు.

(310) ఆలుబిడ్డలు బంధుమిత్రులు లేకపోయినను గొందరు ప్రపంచమునందు లేనిపోని సంబంధములు గల్పించుకొని యీ లోకమునకు బద్ధులై యుందురు. వారు స్వేచ్ఛగా నుండుట వారికిష్టము లేదు. కుటుంబముగాని బంధువర్గముగాని లేనివాఁడు పిల్లినో, కుక్కనో, కోఁతినో, పక్షినో పెంచి యదియే స్వర్గము మోక్షమునని దాని పోషణమునందే కాలముపుచ్చుచు మహానందము నొందుచుండును. ఇదియంతయు మాయయొక్క శక్తి. అది మనుష్యులమీఁద నెంతో యధికారముఁ గలిగి యున్నది.

(311) తీవ్రజ్వరపీడితుఁడైన రోగి విశేషదాహముఁ గలిగి సముద్రములోని నీరంతయుఁ దానే త్రాగగలనని తలంచును. వాని జ్వరము తగ్గిన తర్వాత గ్రుక్కెఁడు నీళ్లుకంటె నెక్కుఁడు త్రాగఁ జాలఁడు. అట్లే మాయయను జ్వరముచేత నొడలు తెలియకున్నవాఁడు భగవంతుని మూర్తినంతయు తాను దర్శించి కౌగిలించుకొనగల్గినట్లు తలంచును. కాని యామాయ తొలగినప్పుడు భగవంతుని మహాతేజములో నొక్క చిన్నకిరణమే వానిని శాశ్వత దివ్యానందములో ముంచివేయుటకుఁ జాలునని తెలిసికొనును.

(312) దారుణమైన జ్వరముతో బాధపడుచు విదాహముగల రోగి మంచమునకు నొకపక్క చల్లని మంచినీళ్ళకుండలు రెండవ పక్కను పరబత్తులు మొదలగు పదార్థములు నున్నవనుకొనుము. ఆ రోగి తనరోగ మెక్కువైనను సరేకాని యా చల్లని నీరు త్రాగక మానునా? పరబతులు రుచిచూడకమానునా? ఇంద్రియముల యధి కారము క్రింద నున్న మనుష్యుఁడు నట్టివాఁడే. కాంతాకనకముల నడుమ మనుష్యుఁడున్నప్పుడు వాటిచేత నాకర్షింపఁబడక మనుష్యుఁ డుండఁగలఁడా? అతఁడు న్యాయమార్గమునందుండుట మిక్కిలి కష్టము. అందుచేత నతనిస్థితి చెడిపోక మానదు.

(313) అదివఱకు పెరుగు తోడుపెట్టిన కుండలో వేఁడిపాలు పోయకూడదు. పోసినయెడల నదికూడ చేరుకొని పెరుగగును. మంచి యనుభవముగల గురువు విలువగల గొప్పధర్మముల లౌకికున కొప్పగింపఁడు. ఏలయన వాఁడా ధర్మములకు నపార్థముజెప్పి సద్విని యోగముఁ జేయక వాటిని స్వలాభముకొఱకుపయోగించు కొనును. అదియునుగాక గురువు వానిచేత నుపయోగకరమైన పని యేమియు జేయింపఁడు. ఎందుచేతనన గురువు తన్ను లోకువజేసి యెక్కువ పనులు జేయించుచున్నట్లు వాఁడనుకొనునేమోయని భయముచేత.

(314) మంచిపాలలో రెట్టింపునీళ్లు కలిసినప్పుడు, ఆపాలుకాచి చిక్కన జేయుటకు చాలసేపు పట్టును. లౌకికుని మనస్సు ప్రపంచ సంబంధములైన దురాలోచనలనియెడు నీటితో గలసి యుండును. ఆ మనస్సును పరిశుద్ధముజేసి యది తగినస్థితిలోనుండునట్లు జేయుటకు చాలకాలము పట్టును.

(315) తక్కువవారి గర్వము క్రమక్రమముగా నశింపవచ్చును. గాని తన ప్రభావమును గురించి యోగికి గర్వమున్న యెడల నది త్వరగా నశింపదు.

(316) మంగలములో ధాన్యముబోసి పేలాలు చేయునప్పుడు పై కెగిరిపోయి పేలిపోయినవే శ్రేష్ఠమైనవి. కాలినగుర్తులు వాని కుండవు. మంగలములో మిగిలిపోయినవాటికిఁ గొంచెముగానో గొప్పగానో కాలినయానవా లుండును. అలాగే భక్తులలో సంసారబంధములను దెంపుకొని యావలికిఁ బోవునట్టివారు పరిపూర్ణులు. సంసారము జేయుచున్న భక్తులు నిజముగా నెంత భక్తులైనను వారి కీలోక సంబంధమైన మచ్చలు కొన్ని యుండక మానవు.

(317) భగవంతుఁడు మనలను పోషించుచున్నాఁడు గనుక దయామయుఁడని చెప్పుటకు వీలులేదు. అంతమాత్రము చేతనే యతఁడు దయామయుఁడుగాడు. ఏలయనఁ దనబిడ్డలకుఁ దండ్రి యన్నవస్త్రములిచ్చి పోషింపక దప్పదుగదా! కాని మనము తప్పుదారుల బట్టి యింద్రియములకు వశులమై చెడిపోకుండ నతఁడు మనలను గాపాడినప్పుడే యతఁడు దయామయుఁడని మనము చెప్పవచ్చును.

(318) దొంగను మనము గనుగొన్నపుడు వాఁడు పారిపోవును. అట్లే విశ్వమును మోహింపఁజేయునట్టి మాయను మనము గనుగొందుమేని వెంటనే యది యంతర్ధానమగును.

(319) అగ్నిహోత్రమునకుఁ బ్రత్యేకముగా నొకరూపము లేదు. కాని యది కట్టెలను బొగ్గులను నాశ్రయించుకొన్న రూపములను దాల్చి యుండును. అప్పుడురూపహీనమైన యగ్నిరూపములతోఁ గూడి యుండును. ఆలాగే నిరాకారుఁడైన పరమేశ్వరుఁడు కొన్నిమెడల కొన్నిరూపములఁ దాల్చును.

(320) ప్రశ్న:—మనము భగవంతుని గట్టిగాఁ బ్రార్థింపవలయునా?

ఉత్తరము—ఆయనను నీయిష్టము వచ్చినట్లు ప్రార్థింపుము. నీవెట్లు చేసిన నాయన నీప్రార్థనముఁ దప్పక వినును. వానియొక్క చప్పుడు సహిత మాయన వినఁగలఁడు.

(321) శాస్త్రజ్ఞానముల వలన భగవంతుఁ డిట్టివాఁడని యెవరికైన నుపదేశము జేయుట కాశీనగర మిట్టిదని పటముగీచి చెప్పుట వంటిది.

(322) ఒకమనుష్యుఁడు బావి త్రవ్వింపనారంభించి యైదు నిలువులు త్రవ్వించెను. జలపడక పోవుటచే నచ్చట నీరు పడదని యా చోటఁ ద్రవ్వించుట మాని మరియొకచోట నుయ్యి త్రవ్వించ మొదలుపెట్టెను. అక్కడ మునుపటికంటె రెండునిలువు లెక్కువ త్రవ్వించెనుగాని యచ్చట సహితము నీరు పడలేదు. అతఁడు విసిగి యా చోటుమాని మూడవచోట నుయ్యి త్రవ్వింప సాగెను. అక్కడ తొమ్మిదినిలువులు త్రవ్వించెను. కాని జలదర్శనము కాకపోవుటచేఁ దన దొడ్డిలో నూయి వీలులేదని ప్రయత్నము మానుకొనెను. మొత్తము మీద నతఁ డిరువదియొక్క నిలువులు త్రవ్వించెను. మూఁడుచోట్ల గోతులుపెట్టి ఖనులు త్రవ్వించుటకంటె మొదటిబావి త్రవ్వినచోట మరినాలుగైదు నిలువులు త్రవ్వించిన పక్షమున నీరు బడియుండును. ఇంత ధనవ్యయము గాకపోయి యుండును. మాటిమాటికిఁ దమ మతములు మార్చుకొనునట్టి మనుష్యులస్థితి యట్టిదియే. తనమతమునందు శక్తియున్నదా లేదా యని సందేహింపక తానునమ్మిన దైవమునుగట్టి పూనికతోఁ గొల్చినపక్షమున జయము నిశ్చయముగాఁ గలుగును.

(323) లోపలగింజయే ప్రధానముగాని పైనున్న పొట్టు ప్రధానముగాదు. వడ్లగింజ నేలమీద చల్లినపు డదిమొలచుటకు పెరుగుటకు వరిపంట కావలెనన్న పక్షమున పొట్టుతోఁ గూడియున్నగింజలే చల్లవలయునుగాని వట్టిబియ్యము చల్లిన నవి మొలవవు. ఆలాగేమతముయొక్క యభివృద్ధికి కర్మలు తప్పక యుండితీరవలయును. ఆకర్మలు జ్ఞానబీజమును గప్పునట్టిపొట్టువంటివి. కావున సత్యమైనజ్ఞానమును సంపాదింపకమునుపు ప్రతిమనుష్యుఁడు కర్మలు యథావిధిగాఁ జేయవలయును.

(324) ముత్తైమే పరిధానముగాని ముత్యపుచిప్ప పరిధానము గాదు. ముత్యముదొరికినవానికి చిప్పతోఁబనిలేదు. సత్యస్వరూపుఁడైనపరమేశ్వరుని తెలిసికొన్నవానికి కర్మలయవసరములేదు.

(325) ఒకపేదవాఁడు దాపుననున్న యడవికిఁబోయి పుల్లలు గొట్టుకొని యవి తెచ్చి యమ్ముకొని మిక్కిలికష్టజీవనము జేయుచుండెను. ఆయడవిదారినిఁబోవుచున్న సన్యాసియొకఁడు వానిఁజూచియడవిచివర పుల్లలు గొట్టియవస్థపడుటకంటె వనమధ్యమునకుఁ బోయిన పక్షమున నెక్కువలాభముండునని వానితోఁజెప్పెను. ఆపుల్లలుకొట్టువాఁడు సన్యాసిమాటలయందు విశ్వాస ముంచి మునుపటికంటె దూరముగా నడవిలోనికిఁ బోయెను. అచ్చట వానికి మంచిగంధపుచెట్టు కనఁబడగా నదికొట్టి మోయఁగలిగినన్ని మంచిగంధపుమొంగలు మోసికొనిపోయి యమ్ముకొని విశేషలాభము సంపాదించెను.తర్వాత నతఁడా యరణ్యమున మరికొంతదూర మరిగెను. అక్కడతనికి రాగిగని యగపడెను. త్రవ్వఁగలిగినంత రాగి త్రవ్వుకొని మోయఁగలిగినంత మోసికొని తెచ్చి విక్రయించి యధికలాభము పొందెను. పిమ్మట వాఁడు వనములో మునుపటికంటె నెక్కువదూర మరిగి వెండిగనికనిపెట్టి కావలసినంత వెండిత్రవ్వుకొని తెచ్చియమ్ముకొని భాగ్యవంతుఁడయ్యెను. దానితో నతఁడు తనివివందక యరణ్యగర్భమున కరిగి బంగారుగనులు వజ్రపుగనులు గనిపెట్టి త్రవ్వుకొని తెచ్చి వాటిని విక్రయించి లక్షాధిపతి యయ్యెను. సత్యజ్ఞానము గ్రహింపఁదలఁచుకొను వానిస్థితి యిట్టిదే. నరుఁడు కొంతజ్ఞానము సంపాదించి కొన్నిప్రజ్ఞలు సముపార్జించినవెనుక నాకిదిచాలునని కూర్చుండక జ్ఞానాభివృద్ధికై ప్రయత్నించిన పక్షమున బ్రహ్మజ్ఞానసంపదయందు భాగ్యవంతుఁడు గావచ్చును.

(326) నూనె మొట్టమొదట చేతికిరాసుకొని పనసకాయకో

సినయెడల దానిజగురు చేతికంటుకొనదు. (అలాగే బ్రహ్మజ్ఞానము మొట్టమొదట సంపాదించుకొనినపిమ్మట కాంతాకనకములనడుమనీవు నివసించినను నీకు దోషమంటదు.

(327) ఈఁతనీఁదనేర్చుకొనఁ దలఁచినవాఁడు కొన్నాళ్ళు నీళ్ళలో నిట్టటుకొట్టుకొని ప్రయత్నముఁ జేయవలెను. ఒక్కనాఁడీఁత నేర్చుకొని యెవ్వఁడుగాని సముద్రములో నీఁదజాలఁడు. అలాగే నీవుపరబ్రహ్మమను మహాసముద్రములో నీఁదదలంచిన పక్షమున నీవుముందుగా ననేకప్రయత్నములు జేయవలయును.

(328) ప్రశ్న:—మనుష్యుఁ డెప్పుడు ముక్తుఁడగును?

ఉత్తరము:—అహంకార మెప్పుడు చచ్చునో యప్పుడు.

(329) ముల్లు గ్రుచ్చుకొన్నప్పుడు మరియొక ముల్లుతో దానిఁ బైటికిఁదీసి రెండుముళ్ళుపారవేయుదుము. ఆత్మయొక్కయున్నగప్పినట్టి యజ్ఞానమును జ్ఞానమే నశింపఁజేయవలయును. జ్ఞానాజ్ఞానములు రెండుగూడ నవిద్యలోఁ జేరినవేగనుక మహోత్కృష్టమైన యీశ్వరజ్ఞానము సంపాదించువాఁడు ద్వైతభావమునుండి విముక్తుఁడౌనుగావున జ్ఞానాజ్ఞానములు రెండింటిని వర్జించును.

(330) లోతులేనిగుంటలో పరిశుభ్రమైన నీరు త్రాగఁదలంచినవాఁడు పైనసీరు కలచకుండ పై తేటనీరు తీసికొని త్రాగవలయును. కలసిన పక్షమున నదివర కడుగుననున్న మడ్డినీరు పైకివచ్చి త్రాగుటకు వీలులేకుండఁ జేయును. నీవు పరిశుద్ధుఁడుగానుండదలఁతువేని దృఢభక్తిగలిగి లేనిపోని వితండవాదములలో దిగక సదనుష్ఠానము జేయుచుండుము. అట్టివాదములలో దిగినపక్షమున నీమనస్సు మలినమగును.

(331) ప్రశ్న—ఈశరీరము క్షణభంగురమై పనికిమాలినదైనయెడల పరమపావనులైన మహాత్ములు దానిని మిక్కిలి శ్రద్ధతో నేల గాపాడుచున్నారు?

ఉత్తరము పట్టిపెట్టెను గురించి యెవఁడును శ్రద్ధ జేయఁడు. విలువగల నగలు, ధనముగల పెట్టెను ప్రతివాఁడు మిక్కిలి జాగరూకతతోను గాపాడును. మహాత్ముల శరీరములలో భగవంతుఁడువసియించున్న కావున వారు శరీరములను శ్రద్ధతోఁ గాపాడుదురు. మనశరీరములన్నియు భగవంతుని కాటపట్టులుగదా!

(332) ఆవిరియంత్రము బరువుబండ్ల నెన్నింటినో యీడ్చుకొని పోవును. భగవంతునియందు దృఢభక్తి గలిగి యతనికి బిడ్డలవలెనున్న మహాత్ములు తాము బహుకష్టపరంపరలననుభవించి తోడి మానవులను తమతోఁ దీసికొని పోవుదురు.

(333) ప్రతి మనుష్యుఁడు తనమతమునే యనుసరింపవలయును. మహమ్మదీయుఁడు మహమ్మదీయ మతమును క్రైస్తవుఁడు క్రైస్తవ మతము ననుసరించుట మంచిది. హిందువులకు మహాఋషులమత మేర్పడి యున్నది కనుక వారు దానినే యవలంబించుట కర్తవ్యము.

(334) లేత వెదురు సులభముగా వంచవచ్చును. ముదురు వెదురు వంచవలఁచితిమేని నెంటనే యది పెళుక్కుమని విఱుగును. లేత హృదయములను మంచి పనులవైపు దిప్పుట సులభము. కాని ముసలిగుండె వంచఁదలఁచుకొన్నప్పుడు పట్టుఁదప్పి పోవును.

(335) సత్యజ్ఞానమనెడు తేజముతో నెవ్వఁడు వెలుఁగుచుండునో వాఁడే నిజమైన మనుష్యుఁడు. తక్కినవారు పేరునకు మాత్రమే మనుష్యులు. నిజముగా మనుష్యులుగారు.

(336) సూచికాయంత్రమునందలి సూది యుత్తరపుదిక్కునే యెల్లప్పుడు సూచించుచుండును. అందుచేతనే సముద్రముమీద నడుచునట్టి యోడ యెన్నఁడును దారితప్పిపోదు. ఆలాగే మనుష్యుని హృదయము భగవంతునిదిక్కునకుఁ దిరిగి యున్నంతకాలము

ప్రాపంచిక వ్యవహారములనిరోధము మహానముద్రమున మనుష్యుఁడు మునిఁగిపోఁడు.

(337) పల్లెటూరి యాఁడువాండ్రు కుండమీఁద కుండబెట్టి మూఁడునాలుగు నీటికుండలు తలపై నిడుకొని యొక్క నీటిచుక్కైన తొణకకుండ తమకష్టసుఖములఁ జెప్పుకొనుచును చెఱువుయొద్దనుండు తమ యిండ్లకుఁ బోవునట్లు ధర్మమార్గమున సంచరించునట్టి బాటసారిగూడ నడువవలెను. ఎట్టి స్థితిలోనున్నను మనుష్యుఁడు తన హృదయము మాత్రము ధర్మమార్గమునుండి తొలఁగకుండునట్లు చూచికొనవలెను.

(338) కృష్ణలీలనాటకము లాడునపుడు మద్దెల తాళములు వాయించుచు "కృష్ణారమ్మా కృష్ణారమ్మా" అని గట్టిగా పాడుదురు. కాని కృష్ణవేషధారుఁడు పాటవిని తన్నే పిల్చుచున్నారని రంగస్థలమునకు వెళ్ళక ప్రక్కనొక గదిలో నెవరితోనో మాట్లాడుచు చుట్టఁ గాల్చుచుఁ గూర్చుండును. అంతట నారదుఁడు ప్రవేశించి మధుర గానముఁ జేసి "కృష్ణా రమ్మ"ని పిల్చినతోడనే తానింక గనపడకుండుటకు వీలు లేదని కృష్ణుఁడు నారదునకు దర్శనమిచ్చి తీరును. భక్తుఁడు వట్టిమాటలతో భగవంతుని పిల్చినంత మాత్రమున నతఁడు రాఁడు. భగవంతుఁడు నిజముగా వచ్చినప్పుడు భక్తుని మనస్సు దివ్యానంద ముతోఁ గరగును. అంతట భక్తుఁడు రా! రా! యని బిగ్గరగాఁ బిలుచుట మానును. పరమభక్తిపూరితమైన మనస్సుతో భక్తుఁడు పిలిచినప్పుడు భగవంతుఁడాలస్యము జేయక వచ్చును.

(339) ఇదినాదియని యహంభావములేక సర్వము దైవాధీనమేయని విశ్వసించి వైరాగ్యముఁ బూనుటకంటె మనుష్యునకు క్షేమకరమైనమార్గము మఱియొకటిలేదు.

(340) ప్రశ్న:—సంపూర్ణ విశ్వాసమనఁగా నెట్టిది?

ఉత్తరము:—దినమంతయు మిక్కిలి కష్టపడి యాయాసము

దీర్చుకొనుటకై బాలీసునఁ జేరఁబడి చుట్టఁగాల్చుకొనుచు మనుష్యుఁడు సుఖించునట్టి యవస్థయే పరమవిశ్వాసము. అనఁగా సమస్తవిచారములు మనోవ్యథలు నాశనమొందుట.

(341) ఎండిన యాకులు వాటిపరియత్నము గాని యిష్టము గాని లేకయే గాలిచేత నెగరఁగొట్టఁబడిపోవునుగదా! అట్లే భగవంతుని నమ్మికొనియుండువారు, ఆయన యిచ్ఛతోఁ గలసి మెలఁగుచుందురు. వారి యిచ్ఛ యెంతమాత్రిముండదు. వారి పరియత్న మంతకంటె నుండదు.

(342) ప్రశ్న:—బ్రహ్మజ్ఞానవికాసము లేక గొప్ప వక్తృత్వమును మంచిబోధనాశక్తియుఁగల మతబోధకుని గుఱించి మీయభిప్రాయమేమి?

ఉత్తరము:—ఒకఁడు తన దగ్గఱ దాచినసొమ్మును యథేచ్ఛముగా వ్యయముఁ జేయువాఁడెట్టి వాఁడో యతఁడట్టివాఁడు. అతఁడాడునట్టి మాటలు పరులనుండి సంగ్రహించినవికాని వాని సొంతము గావు కావునను, ఆమాటవలన వానికెంతమాత్రిమును నష్టములేదు గావునను నతఁడు పరులకు హితోపదేశము మాత్రిముఁ జేయఁగలఁడు.

(343) లౌకికునకు మత సంబంధమైన వాసనయేని గిట్టదు. అతను హరినామస్మరణఁ జేయఁడు. హరిభజనము, కీర్తనమువినఁడు. ఇతరులు హరిభజనముఁ జేయుచున్నప్పుడాపనిఁ జేయవద్దని వారికి నిరుత్సాహముఁ గలిగించును. ప్రార్థనలను తా నెగతాళిజేయును. మతసంబంధమైన సమాజములు పేరెత్తినప్పుడు నోటికివచ్చినట్లు తిట్టును.

(344) ఒకస్తంభము నొకచేతితోఁ బట్టికొని తలతిరుగునను భయములేకుండు పిల్లవాఁడు దాని చుట్టు గిఱ్ఱున దిరుగునట్లు నీవు భగవంతుని గట్టిగాఁబట్టుకొని నీనిత్య కృత్యములను జేసికొమ్ము. అప్పుడు నీకేమపాయముండదు.

(345) జారకాంత తన గృహకృత్యములను జక్కపెట్టుకొనుచుఁ దన రహస్యప్రియునిమీఁద మనస్సు నిల్పియుండును. ఆలాగే లోక వ్యవహారములయందు మునిఁగి పోయిన యో మనుష్యుఁడా! నీ వ్యవహారములను జేసికొనుము. కాని నీహృదయము మాత్రము భగవంతునిమీఁదనే నిల్పుము.

(346) సంపన్నుల కుటుంబములోఁ బుట్టిన బిడ్డలను దాది తన బిడ్డలయట్లే పెంచును. కాని యాబిడ్డలమీఁదఁ దన కేవిధమైన యధికారము లేదని యది యెఱుఁగును. ఆలాగే నీ బిడ్డలకు కూడ నీవు దాదివంటివాడవు. ఆబిడ్డలతండ్రి భగవంతుఁడే.

(347) వివేకము వైరాగ్యము లేక వేదములు శాస్త్రములు వర్ణించుట నిష్ప్రయోజనము. ఆ రెండు లేనివానికి బ్రహ్మజ్ఞానము కుదరదు.

(348) ముందుగా నిన్ను నీవు తెలుసుకొనుము. అప్పుడు నీవు విశ్వపతియైన భగవంతుని దెలిసికొనఁగలవు.

(349) ప్రశ్న:—నాయహంభావమనఁగా నేది? అదినా హస్తమా పాదమా మాంసమా రక్తమా?

ఉత్తరము—చక్కగా విచారించితివా "నేను" అనునట్టి వస్తు వెక్కడను లేదని తెలిసికొనఁగలవు. ఉల్లిపాయయొక్క పొరయొకటొకటేతీసినట్లు అహంభావమును విభజనచేసి పరిశీలించితి మేని "అహం" అనునది యెచ్చటను లేదని తెలియును. ఆవిభజనలయొక్క పరమార్థము దైవమును దెలిసికొనుటయే. అహంభావము జాఱిపోయినపుడు పరబ్రహ్మము వ్యక్తమగును.

(350) ఈ కలియుగమునకుఁ దగిన యుత్తమభక్తిమార్గ మేమనఁగా భక్తప్రియుఁడైన భగవంతుని నామము స్మరించుటయే.

(351) నీవు భగవంతునిఁ జూడఁదలఁతువేని భగవన్నామస్మర

ణనుయొక్క శక్తియందు దృఢవిశ్వాసము గలిగియుండి నిత్యానిత్య వస్తుభేదముఁ దెలిసికొమ్ము.

(352) మదపుటేనుఁగును విచ్చలవిడిగాఁ దిరుగనిచ్చితిమేని యది మొక్కలు చెట్లుపెల్లగించును. కాని మావటివాఁడంకుశముతో దానిఁ బొడిచి యదలించినపక్షమున నూరకుండును. అట్లే మనస్సు నియమములేక యున్నప్పుడు సోమరితలఁపులఁదలఁచుకొనుచు నిష్ప్రయోజనముగాఁ గాలక్షేపముఁ జేయును. యుక్తాయుక్తవిచారణ మను నట్టి యంకుశముపోటు తగులఁగానే యామనస్సు ప్రశాంతమగును.

(353) హరినామము వినఁగానే పరవశత్వముచేత నానంద బాష్పములు రావలెను. అవి వచ్చువఱకు మనుష్యులు భక్తియోగా భ్యాసముఁ జేయవలయును. హరిపేరుఁజెప్పఁగానే యెవ్వఁడానందబా ష్పములు విడుచునో వానికి భక్తియోగాభ్యాస మక్కఱలేదు.

(354) జ్ఞానులయొక్కయు సాధువులయొక్కయు మైత్రి యా త్మాభివృద్ధికిఁగావలసిన ముఖ్యసాధనములలో నొకటి.

(355) ఆత్మ యొకదేహమునువిడిచి యీలోకమునుండి వెళ్ళి పోవునపుడు, ఆచరమావస్థలో న దేదేహమునుగుఱించి తలంచుకొను చుండునో యాదేహములో మరలఁబ్రవేశించి జన్మమెత్తును. అందు చేత భక్తియోగాభ్యాసములు మిక్కిలియవసరము. ఎల్లప్పుడు భక్తి తత్పరులమై యున్నపక్షమున మనస్సులో ప్రపంచసంబంధమైన తల పులు పుట్టవు. అప్పుడు భగవద్భావయ మొక్కటే యాత్మనిండి యుండి మరణకాలమందు సహితము వానినివిడువదు. అప్పు డాత్మ భగవంతునిగూర్చి తలంచును గావున భగవంతునిలోఁ బ్రవేశించును.

(356) ప్రశ్న:-మనుష్యుఁడు భగవంతునెట్లుప్రేమింపవలయును?

ఉత్తరము:—పతివ్రతయైన భార్య భర్తను ప్రేమించునట్లు పరమలోభి తానుపోగుచేసిన ధనముఁ బ్రేమించునట్లు భక్తుఁడు మనః

పూర్వకముగాను హృదయపూర్వకముగాను భగవంతుని ప్రేమింప వలయును.

(357) ప్రశ్న:—మనలోనున్న పాపచింతను జయించుటెట్లు?

ఉత్తరము:—పువ్వులోనుండి పండు క్రమక్రమముగా నెదుగు చున్నప్పుడు పూరేకు లొక్కటొక్కటిగా రాలిపోవుచుండును. కావున ద్వైతము మనలో నతిశయించినకొలఁది దుష్టస్వభావములువాటంతటవి నశించును.

(358) ప్రశ్న:—ఇహలోక సంబంధములైన యింద్రియసుఖములమీఁది యాసక్తి యెప్పుడు నశించును?

ఉత్తరము:—పరిచ్ఛేదరహితుఁడునగు భగవంతునియందు సకలసుఖములయొక్కయు సకల సంతోషములయొక్కయు సమీపకరణమున్నది. అట్టి భగవంతునియందు రమించువారు పనికిమాలిన ప్రాపంచక సౌఖ్యమునందు దమకముఁ జూపరు.

(359) ప్రశ్న—ఏస్థితిలో మనస్సున్నప్పుడు పరమేశ్వరదర్శన మగును?

ఉత్తరము:—మనస్సు ప్రశాంతమై, నిర్మలమయినపుడు భగవంతుఁడు గనఁబడును. మనస్సముద్రము వాంఛావాయువులచేత సంక్షుభితమైనపుడు భగవంతుఁడు దానిలోఁ బ్రతిఫలింపఁజాలఁడు. అట్టి దశలో భగవద్దర్శన మసాధ్యము.

(360) ప్రశ్న:—మనము దైవము నెట్లుకనుఁగొనఁగలము?

ఉత్తరము:—పల్లెవాఁడు పెద్దచేఁపను బట్టుకొనవలెనని కోరి గాలమున కెఱఁగుఁ గ్రుచ్చి చేఁప దానిఁ బట్టుకొనువఱకు నిశ్శబ్దముగా నిరీక్షించుచుండును. భక్తుఁడు భక్తిసాధనములను జేయుచు నోపికతోఁ గనిపెట్టుకొని యున్నపక్షమున దైవము తప్పక కనఁబడును.

(361) పాపాత్ముని హృదయము వంకరవెండ్రుకవంటిది. ఎం

త్తసాగఁదీసినను నది సరిగానుండక ముడుచుకొనిపోయి వెనుకటిదశ లోనుండును. అట్లే దుష్టునిహృదయముకూడ సులభముగా మార్పు జెందును.

(362) జ్ఞాన మద్వైతమునకు దారిఁదీయును. అజ్ఞానము భిన్నతకుఁ దీసికొనిపోవును.

(363) సత్పురుషుల సహవాసము బియ్యముగడుగు నీళ్ళవంటిది. కడుగునీళ్ళు మత్తుఁబోఁగొట్టును. అట్లే సాధువులమైత్రి కోరికలనియెడి మద్యముతాగిమత్తిలియున్న మూఢమానవులమత్తు దూరముగాఁ బోఁగొట్టును.

(364) ఒకజమీందారుని ప్రతినిధి తనప్రభువును విడిచి సంస్థానగ్రామములోనికి వెళ్ళినపుడు రైతుల నానాబాధలు పెట్టును. కాని జమీందారునిసన్నిధికి వచ్చినప్పుడు పూర్వపద్ధతులను మార్చుకొని మంచితనముఁ గలిగి రైతుల నాదరించి వారికష్టములను మెల్లగావిని న్యాయము వారికొసఁగుటకై ప్రయత్నించును. యజమానుని యెడలఁ గల భయమువలన దుర్మార్గప్రతినిధి సజ్జనుఁ డగుచున్నాఁడు. ఇది యెల్ల జమీందారుని సాన్నిధ్యవిశేషమునం గలిగినమార్పు. ఆలాగే పుణ్యాత్ముల సహవాసము దుర్జనులమనస్సులలో భయభక్తులఁ గలిగించి వారిని సజ్జనులుగాఁ జేయును.

(365) తడికట్టె నిప్పుమీఁద వైచినపక్షమున వెంటనే తడియిగిరిపోవును. అప్పుడాకట్టె కాలనారంభించును. ఆలాగే పుణ్యాత్ముల సహవాసము లౌకికులగు స్త్రీపురుషుల హృదయములనుండి కామక్రోధలోభములనియెడు తడిభాగముల నెండఁజేయును. అంతట వివేకాగ్ని వాటిని వెలయించును.

(366) ప్రశ్న:—స్త్రీగాని పురుషుఁడుగాని తనజీవితకాల మెట్లు గడుపవలయును?

ఉత్తరము:—కంసాలి కుంపటిమీఁద నిప్పులారిపోకుండ శ్రవణముతో నిప్పులుఁ మాటిమాటికి గుదుపునట్లు మనస్సు సజ్జనసహవాసముచేఁ బలుమారు ప్రదీప్తమగుచుండవలెను.

(367) నీటిలోఁదడిపిన పిండిముద్ద రొట్టిగాఁజేసి వేఁడి నేతిలోఁ బడవేయుము. అది గుడగుడమని ధ్వనిఁజేయును. అది వేగినకొలఁది ధ్వనితగ్గును. అది పూర్తిగా వేగినపిదప గుడగుడశబ్దము కొంచెమైన నుండదు. అట్లే మనుష్యుఁడు మిడిమిడిజ్ఞానముఁ గలిగినప్పు డుపన్యాసము లిచ్చుటకు మతబోధఁ జేయుటకు బయలుదేరును. కాని జ్ఞానము సంపూర్ణముగా లబ్ధమైనతర్వాత నతఁడు వ్యర్థాడంబరములు మానును.

(368) ప్రపంచసంబంధములైన యాకర్షణలనడుమఁగాపురము సేయుచు వానిచే భంగపడక యెవ్వఁడు పరిపూర్ణతను బడయునో యతఁడే మహాశూరుఁడు.

(369) కమ్మరివాఁడు తనకొలిమి యారిపోకుండ నుండుటకు నడుమనడుమ తిత్తితో గాలిపోసి నిప్పులు రగులుకొల్పినట్లు మనస్సును నడుమనడుమ సజ్జనసహవాసముచేత వెలయించుచుండవలయును.

(370) నిత్యమై జ్ఞానమయమైన యానందమనియెడుమహాసముద్రమున మనము మునుఁగవలెను. ఆకామక్రోధములనియెడు భయంకరజలచరములకు వెఱువకుము. వివేకవైరాగ్యము లనియెడు పసుపుముద్దలు మేనినిండఁబూసికొని యాసముద్రమున మునుఁగుము. ఆజలచరముల కీపసుపువాసన గిట్టదుకావున నవి నీజోలికిరావు.

(371) పాపాకర్షణముండునట్టి తావులకు నీవు పోవలసివచ్చినప్పుడు, అట్టిచోటులు నీవుజొచ్చువేళ జగన్మాతయైన దేవిఁ దలఁచుకొనుము. ఆమె నీహృదయమునందు దాఁగియున్న దుస్తంత్రములనుండి సహితము నిన్నురక్షించును. తల్లియెదుట సిగ్గులేక నీవు దుష్కార్యములు జేయఁగలుగుదువా ?

(372) ప్రశ్న:—ఈప్రాణముమీఁది తీపి యెట్లుపోవును ?

ఉత్తరము:—మానవశరీరము నశియించునట్టియు వేగమేకుళ్ళి పోవునట్టియు రక్తము, మాంసము, శల్యము, చర్మము, క్రొవ్వుమొదలగు పదార్థములతో చేయఁబడినది. ఇట్లు శరీరముయొక్క నానాభాగములను మనము పరిశీలించి, తత్వవిచారముఁ జేసితిమేని ప్రాణముమీఁది తీపి నశించును.

(373) ప్రశ్న:—భక్తు లేదుస్తులు ధరింపవలయును?

ఉత్తరము:—తగిన దుస్తులు ధరించుట మంచిది. సన్యాసి ధరియించు కాషాయవస్త్రములు గట్టువాఁడును, భిక్షుకుఁడు ధరియించు తంబురా చిరుతలు దాల్చువాఁడును, బూతుమాట లాడఁజాలఁడు. బూతుపాటలు పాడఁజాలఁడు. తేలికపలుకులు పలుకఁజాలఁడు. కాని వన్నెలవిసనకఱ్ఱవలె డాబుదుస్తుల ధరించువాఁడు నీచాలోచనలు జేయుచు నీచపుమాటలాడుచు, నీచగానముఁ జేయుచుండును. కావున విలువగల దుస్తులు ధరింపరాదు.

(374) ప్రశ్న:—మనస్సులో నొకప్పుడు శాంతి యుండును, కాని యది చిరకాల మెందుకుండదు?

ఉత్తరము:—వెదురుకఱ్ఱనిప్పు మాటిమాటికి మనమూఁదిరవు ల్కొల్పకపోయినయెడల త్వరగా నారిపోవును. ఆత్మజ్ఞానమనియెడు నగ్నిహోత్రి మారిపోకుండ నిత్యము వెలుగుచుండుటకై యెడతెగ నిభక్తి యవసరము.

(375) ప్రపంచమునందుండి ముక్తిఁ బొందదలంచువారు కోట గోడవెనుకనుండి యుద్ధముఁజేయునట్టి సిపాయీలవంటివారు. భగవంతుని వెదకుచు నీప్రపంచమును విడిచిపెట్టునట్టి యోగులు. బహిరంగమైన యుద్ధభూమిలో యుద్ధముఁజేయునట్టి యోధులుకోటగోడలలో

డాగి యుద్ధముజేయుట బహిరంగమైనచోట యుద్ధముజేయుటకంటె క్షేమకరము.

(376) తల్లియైన దేవి నీవిధముగా వేఁడుకొనుము. "ఓ తల్లీ! నిర్మలమైనభక్తిని వజ్రమువలె దుర్భేద్యమైన విశ్వాసమును నాకు ప్రసాదింపుము.

(377) విషసర్పములున్న యింట నివసించుమనుష్యులు మిక్కిలి జాగ్రత్తగానుండి మెలఁగునట్లు ప్రపంచమున వసియించు మనుష్యులు కామలోభములనునట్టి దుర్వ్యసనములఁ బడకుండ మిక్కిలి జాగ్రత్తగా నుండవలయును.

(378) కుండకు సూదిబెజ్జమంత చిల్లి యుండినను నీరంతయు దానిలోనుండి కారిపోవును. ఆలాగే ధర్మానుష్ఠానమందుఁ బ్రవేశించువానికి నందు స్వల్పమోహమున్నను వాని యనుష్ఠానమంతయు వ్యర్థమగును.

(379) తోడుకొన్న పాలు కవ్వముపెట్టి చిలికి వెన్నఁదీసియానెన్న చిలికిన పెరుగులో నుంచకూడదు. అట్లుంచుటవలన వెన్నయొక్క చిక్కఁదనము రుచియు నించుకతగ్గును. అది మరియొకకుండలో మిక్కిలి తేటనీటఁ బడవైచి యుంచవలయును. ఆలాగే యీప్రపంచమున భక్తిజ్ఞానవైరాగ్యములు కొంతవఱకు సంపాదించినమనుష్యుఁడు ప్రపంచమధ్యమందే యుండి లౌకికులతోఁ గలసిమెలసి యుండినయెడల నతనికి మాలిన్యమంటవచ్చును. ఆప్రపంచమును విడిచియున్నయెడల నతఁడు పరిశుద్ధుఁడై యుండును.

(380) మసియున్న గదిలో నీవున్నయెడల నీవెంత జాగ్రత్తగా నుండినను నీకేమాత్రమైన మసి యంటకమానదు. ఆలాగే యొకపడుచువాఁడు నిండుయౌవనమందున్న కాంతతోఁ గలిసి యొకయింటిలోనున్నయెడల వారిద్దరు కోరికల నెంతజంపుకొన్నను, నెంతజాగ్ర

త్తగానున్నను, స్వల్పముగానైనను వ్యభిచారవృత్తి వారిమనంబుల జనియింపకపోవదు.

(381) శవసాధనమనియెడు దారుణకర్మచేత నిద్దరుమనుష్యులు కాళికాదేవి నుపాసన చేయఁదలఁచిరి. శవసాధనమనఁగా నర్ధరాత్రమున శ్మశానమున కరిగి శవముమీఁద కూర్చుండి ఘోరమంత్రములతో దేవినుపాసనముచేయుట. ఆయిద్దరిలో నొకఁడు ఘోరమైన యాకర్మముజూచి మతిభ్రష్టుడయ్యెను. రెండవవాఁడు సంకల్పసిద్ధిఁ బొందెను. అతనికి దేవి తెల్లవాఱుజామున సాక్షాత్కరించెను. అంతట నతఁడు "ఓ దేవీ! నన్నీవిధముగా నేలయనుగ్రహించితివి. వానినేల పిచ్చివానిజేసితి" వని యడిగెను. అప్పుడతనికి దేవి యిట్లనియె. "బిడ్డా! నీ పూర్వజన్మములలో నీవెన్నోసారు లీపూజలు జేసి పిచ్చివాఁడవై యీజన్మమున మాత్రము నన్నుఁ జూడఁగలిగితివి."

(382) ప్రశ్న:—హిందువులలో ననేక మతములున్నవి. ఏమత మవలంబింపవలయును?

ఉత్తరము:—ఒకనాఁడు పార్వతి మహాదేవు నిట్లడిగెను. "ఓ దేవా! నిత్యమై, నిరుపమానమై, సర్వోత్కృష్టమైన యానందమునకు మూలమేమి?" ఆమెకు మహాదేవుఁడిట్లనియె. "విశ్వాసమే మూలము" మతములయొక్కయు, శాఖలయొక్కయు విశేషలక్షణములు ముఖ్యమైనవి కావు. ప్రతిమనుష్యుఁడు తనమతమునందు విధింపఁబడిన ధర్మములను భక్తిశ్రద్ధలతోఁ జేసినఁ జాలును.

(383) యౌవనము రాని యాఁడుపిల్లలు మగపిల్లలు సంభోగసౌఖ్యముయొక్క యానందమెఱుఁగనట్లే లౌకికుఁడు బ్రహ్మానందపారవశ్యముయొక్క చవి యెఱుఁగడు.

(384) ప్రశ్న:—శరీరము క్షణభంగురమై యస్థిరమైనది గదా! దానిగుఱించి యేల యింతశ్రద్ధ?

ఉత్తరము:—పట్టిపెట్టె నెవ్వఁడును జాగ్రత్తపెట్టఁడు. ధనము మొదలైన విలువగల పదార్థములున్న పెట్టెమాత్రమే మనుష్యులు జాగ్రత్తపెట్టుదురు. సత్పురుషులు శరీరవిషయమున జాగ్రత్తపుచ్చుకొనక తప్పదు. భగవంతునికి నిలయమైన యాత్మకీశరీరమాలయము. అందుచేత నది జాగ్రత్తపెట్టవలయును.

(385) ప్రశ్న:—మనుష్యులలో దైవభక్తి యెంతకాలముండును?

ఉత్తరము:—ఇనుపముక్క నిప్పులోనున్నంత సెపె ఎఱ్ఱగానుండును. నిప్పులోనుండి తీయఁగానే నల్లబడిపోవును. ఆలాగే మానవుఁడీశ్వరసంసర్గ మెంతకాలము గల్గియుండునో యంతకాలమే భక్తి గలిగి యుండును.

(386) మెత్తనిమట్టితో బొమ్మలు చేయవచ్చును. కాలి గట్టిపడినమట్టితో నట్టివిచేయఁజాలము. ఆలాగే ప్రపంచసంబంధమైన కోరికలతో నిండినహృదయముల మహోన్నతభావములను గ్రహింపఁజాలము.

(387) నీరు, నీటిబుగ్గయు నొక్కటే. ఆబుగ్గలు నీటియందే పుట్టి నీటిమీద తేలియాడి నీటిలోనే లీలమైపోవును. ఆలాగే జీవాత్మయుఁ బరమాత్మయు నొక్కటే. జీవాత్మ చిన్నది. మితిగలది. పరమాత్మ యపరిమేయమైనది. జీవాత్మ యస్వతంత్రమైనది. పరమాత్మ స్వతంత్రమైనది.

(388) కప్పపిల్ల తోఁక యూడిపోయినతర్వాత నేలమీద నీటిమీద కూడ బ్రతుకఁగలదు. అజ్ఞానమనియెడు తోఁకలు యూడిపోయెనేని మనుష్యుఁడు స్వతంత్రుఁడగును. అప్పుడతఁడు ప్రపంచమునందును, భగవంతునియందును గూడ సమానముగా నుంకఁగలఁడు.

సమాప్తము.

---




అను

## మాలయోగికథ.

భగవద్భక్తు లన్నిజాతులలో నన్నివర్ణముల లోనున్నారు. సకలధర్మద్రోహులగు రాక్షసులలోను ధర్మరక్షకులులగు దివ్యుల లోను వేదవిదులగు బ్రాహ్మణులలోను మృగప్రాయులై మూర్ఖు లగు చండాలురలోను బరమభాగవతోత్తములు జన్మించినట్లు మన పురాణాదులయందుఁ గథలు గలవు. ఈశ్వరభక్తి కలుగుటకు సత్వ గుణమే ప్రధానముగాని వర్ణము ప్రధానముగాదు. కర్మలచేతను గుణములచేతను గేవలము చండాలురనఁదగినవారు బ్రాహ్మణులలో ననేకులు గలరు. గుణములచేతను కర్మములచేతను బ్రాహ్మణు లని పించుకొనఁదగినవారు చండాలురలో ననేకులుగలరు. ఈచిన్నకథకు నాయకుఁడైన నందుఁ డీకడపటి తెగలోఁ జేరినవాఁడు.

ఆర్కాటుజల్లాలో ఆధనూరను నొక చిన్నగ్రామముగలదు. ఆపల్లియలో నొక మాలకుటుంబమున రమారమి యాఱువందల యేండ్లక్రిందట నొకబాలుఁడు జన్మించెను. తలిదండ్రు లాతనికి నందుఁడను పేరు పెట్టిరి. ద్రవిడభాషలో నతఁడు తిరునాళైపోవా రను పేరం బరఁగుచుండు. ఆపే రతని కేలగలిగెనో చదువరులు ముందు ముందు గ్రహింపఁగలరు. మనదేశమున మాలవాండ్రస్థితి యెట్లున్నదో చెప్పనక్కఱలేదు. వారి యిప్పటి స్థితియే మిక్కిలి శోచనీయముగ నున్నదిగదా! వారి వెనుకటి స్థితినిగూర్చి వేరే వక్కాణింపవలయునా?

అగ్రజాతులగు బ్రాహ్మణక్షత్రియవైశ్యులసమీపమునకు మాలవాండ్రు రాఁగూడదు. కొన్ని తావులలో మాలవాని నీడమైన బ్రాహ్మణుని మీఁద పడరాదఁట. దక్షిణదేశమున మాలవాండ్రు పల్లెటూళ్ళలో వీథులనడుమనుండి నడువఁగూడదు. నడువఁదగిన వీథులనుండియైన వాఁడు నడచినంతసేపు "నేనుమాల నేనుమాల" నని గట్టిగ నరచుచుపోవలయును. వారి కేవిధమైన విద్య యులేదు. ఇప్పుడిప్పుడు కొంచెమాస్తి వారుసంపాదించుకొనుచున్నారు గాని పూర్వకాలము వారికాస్తి యనుమాటయే లేదు. ఎవఁడైన ప్రజ్ఞావంతుఁడున్నను శాస్త్రముబట్టి చండాలుఁ డాస్తి సంపాదింపఁ గూడదు. కాఁబట్టి వారగ్రవర్ణములవారియొద్ద నెల్లప్పుడు పాలేరుతనములు చేసి యజమానులు ధర్మభిక్షముగ నిచ్చు ధాన్యమును స్వీకరించి పొట్టలు పోసికొనవలసినవారు. పాలేరులను పేరె కాని మాలవాండ్రు పైవర్ణములవారియొద్ద నిశ్చయముగ బానిసలని చెప్పవచ్చును. అన్నివిధములచేత నిట్టి యధమస్థితిలో నున్నమాలల కులమునందె నందుఁడు జన్మించెను. ఆతని వంశము తక్కిన చండాలవంశములకంటె నేవిధముచేతను గొప్పది కాదు. అతని పుట్టినతావు తక్కినమాలల జన్మస్థానమువంటిదె. మాలపల్లెలు సాధారణముగ నూరుబైట నుండునుగదా. అన్నియును మట్టి చుట్టుగుడిసెలె కాని యిల్లని చెప్పఁదగిన దండొక్కటియునుండదు. ఆగుడిసెలైన సరిగాఁ దీర్చి కట్టకపోవుటచే నాగూడెమున నడచుటకు వీలైనవీథులుండవు. మఱియు నచ్చట నేమూలఁ జూచినఁ గడుపులోఁ బ్రేవులు సయితము వెడలిపోవునట్లు వమనములుదెప్పించు దుర్వాసనలుండును. ఏచాయఁగనుఁ గొన్న పెంటపోగులు కుండపెంకులు చింకిచాపలు గుడ్డపేలికలు తోలుముక్కలు గొడ్డెముకలు మిక్కిలి యసహ్యముగఁ గనఁబడుచుండును. ఏవంకఁ జూడ్కులు ప్రసరించిన నూరపందులు కోళ్ళు కుక్కలు దిగంబరులై యెండకుమాడిన పిల్లలు

నగముదిగంబరులగు స్త్రీపురుషులు దృష్టిపథమునఁబడుదురు. ఏదెసఁ జెవియొగ్గి విన్నఁ దప్పద్రాగిన స్త్రీపురుషుల కలహములు కుక్కకూత లు పిల్లలయేడ్పులు కాకుల యఱపులు వినఁబడుచుండును. ఇట్టిగూడె ములోనే నందుఁడు జన్మించెను.

పుట్టిన తావునుబట్టియు వంశమునుబట్టియుఁ దలిదండ్రులఁబట్టి యుఁ జూడ నందుఁడు యోగ్యుఁడగుటకు వీలులేదు. మఱియు నిరంతము పోలేరమ్మ గంటాలమ్మ మొదలగు గ్రామదేవతల గుళ్ళకుఁబోయి. యా దేవతలకుఁ గల్లు మాంసము నైవేద్యముపెట్టి మేఁకలను గొఱ్ఱెలను బలి యిచ్చికొలుచుటయే కాని సత్వగుణప్రధానముగ నిశ్చలభక్తితో నీశ్వ రుని యర్చించుట నందునకు గాని వాని పూర్వులుగానియేనాడునుజూచి యైననెఱుంగరు. అట్లుండ వేదశాస్త్రాధ్యయనము జేసిపరమనిష్ఠాగరిష్ఠు లగు బ్రాహ్మణులకైన దుర్లభమైన యంతటి పరమభక్తి యాచం డాలబాలున కెట్లలవడినదో పరమేశ్వరుఁడెఱుంగవలయునుగానినరుఁ డెఱుంగుట యసాధ్యము. నందుఁడు చిన్నతనమునందుఁ దక్కిన చండాలబాలకులవలెఁగాక యాటపాటలలో సైతము నీశ్వరభక్తియే ప్రకటించుచుండువాఁడు. తోడిబాలురు చాలమంది గంతులువేయు చు నాడుచుండ నతఁడు వారితోఁగూడక కొందఱిదన వెంటఁబెట్టు కొని మట్టితెచ్చి దేవునిబొమ్మలు చేయుచుండును. దేవుఁడు నల్లని శరీరము పెద్దమీసములు జరీతలగుడ్డ చేతిలో నొకగొడ్డలి గలిగిమెత్తు చెప్పులజోడు తొడిగికొనియుండునని వానియభిప్రాయమగుటచే నతఁడు చిన్ననాఁటచేసిన విగ్రహములన్నియు నట్లె యుండెనఁట. విగ్రహము లుచేసి వానికిఁ బ్రదక్షిణములు గావించి యతఁడు, మఱికొందఱు బాలభక్తులు గలిసి పాటలు పాడి యావిగ్రహముల నూరేగించి యుత్సవములు సేయుచువచ్చిరి. ఇవియే యాతని బాల్యవినోదములు.

అథనూరుగ్రామమున బ్రాహ్మణగృహముల సమీపమున

నొక శివాలయము గలదు. దాని గోపురము గుండ్రముగను మిక్కిలి సుందరముగను నుండును. ఆగోపురమన్న నందునకుఁ బరమప్రీతి. అతఁడు మాలఁడు గావున దగ్గరకుబోయి చూచుటకు వీలులేక దూరమున నుండియే యాగోపురముయొక్క యౌన్నత్యము సౌందర్యము శిల్ప చమత్కృతి చూచిచూచి తనివి తీరక మఱిమఱి చూచి తనలోఁదా నుమురియుచుండును. గ్రామమందు స్వస్తివాచనములతోడను తూర్య ధ్వనులతోడను కాగడాలతోడను భజనలతోడను శివుని కూరేగింపు టుత్సవములు జరుగుచుండ నందుఁడు మాలబాలురను బోగుచేసికొని పరుగుపరుగున గ్రామముకడకుఁ బోయి కడుదవ్వుననుండియే యాయు త్సవములు చూచి పరమానందము నందుచుండును. వేదము మీదను వేదముచదువు బ్రాహ్మణులయెడలను దేవాలయములయెడలను వానికి సహజముగ మిక్కిలి భక్తి గలదు.

ఆభక్తికిఁ దోడుగ వాని హృదయమున నీశ్వరభక్తి యంకురించెను. అందుచేతనతఁడు భగవంతుని మెప్పించుట కేమంచిపని చేయఁగల నాయని వితర్కింపఁదొడఁగెను. జాతి యెంచినఁ గడు నీచుఁడు. స్థితి యెంచినఁ గడుఁబేదయగుటచే నతఁడు భగవంతున కేవిధమైన కైంకర్యము చేయఁజాల నందుకుఁ దద్దయు విచారించుచుండ నొకనాఁడు వాని మనంబున నొక యుపాయము తట్టెను. కులమునఁ జండాలుఁడ డుటచే స్వామియొద్ద వాయించుడోళ్ళకు వీరణములకుఁ గావలసిన చర్మములు దానుస్వయముగఁ దెచ్చి బాగుచేసి యుచితముగ వాద్యములు సేయువారి కిచ్చుట యుత్తమమైన భగవత్సేవయని వానికిఁ దోఁచెను. ఈయూహ తట్టినతోడనే యతఁడు దిగ్గునలేచి మహానందభరితుఁడై "నాతో స్వామి మాటలాడినాఁ" డని యందఱితోఁ జెప్పెను. ఎల్లయప్పుడు మనస్సున భగవంతుని ధ్యానించు సత్పురుషులకు దేవుఁడు ప్రత్యక్షమైనట్లు మాటలాడినట్లు పరవశత్వముచేత భ్రమ కలుగు

చుండును. అస్లే నందునకును భ్రిమగలిగియుండవచ్చును. ఆయూహా తోఁచినతోడనే యతఁడు గూడెమునకుఁ బోయి చర్మములుసంపాదించి తడిపి మెత్తగఁజేసి వాద్యములుసేయు మంగలివాండ్రి కుచితము గ నిచ్చెను. అది మొదలు చర్మముల పేరు చెప్పిన వానియొడ లుప్పొంగుచుండును. తీరికయైనప్పుడెల్ల చర్మములు బాగుచేయుటయే పనిగ నతఁడన్యవ్యాపారమును మానియుండెను.

ఈనందునకు మిత్రులగు మాలపిల్లలింక ననేకులుండిరి. వారి పేరు లిప్పుడెవ్వరికినిం దెలియవు. నందుఁ బాలురకు భగవత్కీర్తనలుచెప్పి తాను వారుఁ గీర్తనలుపాడుచు మేన భస్మము పూసికొని భజనలు చేయుచుందురు. నందుఁడు చిన్ననాఁటనుండియు నొకబ్రాహ్మణుని పొలములోఁ బనిచేయుచుండెను. ఒకనాఁడు పనిముగియకుండగనే యతఁడు తోడిబాలురఁగూడుకొని దాపుననున్న తిరుపంకూరుగ్రామమునకుఁబోయెను. ఆయూరి కిప్పుడు "పాత్రవైతీశ్వరం కోయిల్" అను పేరున్నది. నందుఁడు సహకారులతోఁగలసి యాయూరుపోయి శరీరమున కాపాదమస్తకము బూదిపూసికొని గ్రామమునకు మూఁడుప్రదక్షిణములుచేసి యాలయమున కెదురునిలిచిశివభజనలుచేసి సాయంకాలమైన తరువాత తాను గానుకగఁ దెచ్చిన యరఁటిపండ్లు కొబ్బరికాయలు దేవునకు నివేదన సేయుమని యర్చకున కంపెను. అర్చకుఁ డవి గ్రహించి యాలయమలంకరించి సాయంకాల పూజ సేయుచుండ నందుఁడు తక్కిన మాలవాండ్రు గుడిబైట ధ్వజస్తంభము వెనుకనుండియే యాగంటనాదము హరహరమహాదేవయను భక్తులకంఠధ్వని ధగధగ వెలుఁగు దీపములు దీపములలో మెఱయు దేవుని యాభరణములు మహామంత్రనాదములు కర్పూరహారతి మొదలగునవి విని చూచి జన్మమధ్యమం దదివఱకెన్నఁడు నొందని మహాద్భుతము మహానందముమహాభయమునొంది జన్మసార్థకమయ్యె

నని భాషించెను. ఆదీపములవెలుఁగున దూరమునసుండి తిన్నఁగా నగపడనియామహాలింగమును వంగివంగిపలుసారులు తెప్పవాల్పక చూచి తన మెట్టయెదుట నీశ్వరుఁడు సాక్షాత్కరించెనని నమ్మి సంతోషము పట్టఁజాలక కన్నులనుండి యానందబాష్పములు స్రవింప నొకసారి యేడ్చుచు నొకసారి నవ్వుచు శివస్మరణముచేయుచు నెట్టకేలకు ధ్యానాతిశయముచేతఁ బరవశత్వమునొంది మూర్ఛిల్లెను.

అప్పుడు దారిఁబోవువారనేకులు వానిచుట్టుఁ జేరి వానితన్మయత్వమునకు నిశ్చలభక్తికి మిక్కిలియచ్చెరువుపడిరి. భక్తవత్సలుఁడగు శివుఁడు, మనసు తనలో నైక్యముచేసిన యాపరమభాగవతోత్తముని భక్తికి మెచ్చి తనవిగ్రహము వానికిస్పష్టముగాఁ గనఁబడవలయునని యాలయములోఁ దనకెదురుగనున్న పెద్దనందివిగ్రహమును బ్రక్కకొత్తిగిలుమని యానతిచ్చెనఁట. అందుచేతనే ప్రతిశివాలయమున శివునికెదురుగానుండు నందివిగ్రహము తిరుపంకూరులో దేవున కెదురుగానుండక యిప్పటికి నొకప్రక్క నుండునఁట.

అట్లుమూర్ఛిల్లి కొండొకసేపటికిఁ దెలివిఁదెచ్చుకొని నందుఁడు తనచుట్టు గుంపుగూడిన బ్రాహ్మణులకు నమస్కరించి మరలనొకసారి గ్రామప్రదక్షిణము చేయవలయునని చెలికాండ్రతోఁగూడి బయలుదేఱెను. బయలుదేఱిపోవుచుండ బ్రాహ్మణవీధికిఁ జిట్టచివర నున్న యొకయింటి యరఁగుమీఁదఁ బురాణవేత్తయగు బ్రాహ్మణపండితుఁ డొకఁడు వందలకొలఁది జనులంబోగుచేసి చిదంబరపురాణముఁ జదివి యర్థముచెప్పుచుండుట తటస్థించెను. నందుఁ డాసమీపమునకు వచ్చునప్పటికి బ్రాహ్మణపండితుఁడు 'చిదంబరము సకలక్షేత్రములలో గొప్పది. ఒక్కసారి చిదంబరముఁ గన్నులారఁ జూచినవాఁడు పరమపాతకుఁడైననుసరే చండాలుండైననుసరే నిశ్చయముగ జన్మపరంపరయను సముద్రముదాఁటి పరమేశ్వరునిసన్నిధిఁ జేరియుండు

సని యుపన్యసించి చిదంబర దేవాలయమును దానిలోనుండు మహి మను వర్ణించి చెప్పసాగెను. ఆమాటలు నందుని చెవులలో నమృతధార లువలె పడెను.

చిదంబరము దక్షిణహిందూస్థానములోని దివ్యస్థలములలో మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. అందు శివుని యాకాశలింగమున్నది. ఈవి ధమునసె పృథివీలింగము జలలింగము తేజోలింగము వాయులింగము గల శివక్షేత్రములు మఱినాలుగు దక్షిణదేశమునఁ గలవు. శివుఁ డు పంచభూతములలో నొక్కొక్కదానిరూపము గ్రహించి యొక్కొ క్కక్షేత్రములో నుండెనని పెద్దలు చెప్పుదురు. చిదంబర మనుమాట కు జ్ఞానాకాశమని యర్థము. తీర్థయాత్రాపరులు చిదంబరమునకుఁ బోయి యా యాకాశలింగమునుజూచి చిదంబరరహస్యమును జూచి నామని చెప్పుదురు. ఆకాశమనఁగా నేమియు లేనిచోటని యర్థమగుటచే జిదంబరరహస్యమనఁగా నేదిలేదని యర్థము. పండితులు దీనింగూర్చి వేదాంతార్థము చెప్పుదురు. ఆయాలయమధ్యమున బంగారుపెంకులతో నేసిన యొక మండపముగలదు. దానిని లోకులు చిత్సభయందురు. చిత్సభయనఁగా జ్ఞానసభయని యర్థము. ఆమండపములో మొదట నటరాజస్వామివిగ్రహ ముండును. అవ్వల లోకులకాశ్చర్యముఁ గలు గఁజేయు చిదంబరరహస్యముండును. ఇదియే మనుష్యుఁడు తెలిసికొన వలసిన రహస్యములలోఁ బరమరహస్యమనియు నిర్గుణపరబ్రహ్మస్వ రూపమనియుఁ జెప్పుదురు. నటరాజస్వామి విగ్రహము మిక్కిలి దర్శనీయమై జగన్మోహనముగనుండును. అంతటి పరమసుందరమగు విగ్రహము లోకములో మఱియే దేశమున నే దేవాలయమున లేదని బహుదేశదృష్టలు చెప్పుచున్నారు. అది కేవలము మనుష్యుఁడుచేసిన రాతివిగ్రహమైనను నిశ్చయముగ నంత జీవకళ యుట్టిపడునట్టియుఁ జూచినమాత్రమున నెల్లవారి కానందముఁ గలుగఁ జేయునట్టియు

దోషరహితమైనట్టియు విగ్రహము మఱొకటి లేదని చూచినవారంద రైకకంఠ్యముగ నభిప్రాయపడుదురు. ఆవిగ్రహముయొక్క శిరస్సున నున్న మెత్తని యుంగరముల జుట్టును విశాలమగు నాసికను జీవకళ గ్రుక్క చక్కని వెడఁదకన్నులను చిదానంద కరుణారసములను వె దజల్లు ముఖారవిందమును తాండవనృత్యము నిమిత్తము సుందరముగ వంచిన హస్తములను మిక్కిలి మనోహరమైన యాకుంచితపాదము ను జూచువారు నిశ్చయముగ,నొక్కపురుషుఁ డక్కడఁ దాండవమాడు చున్నాఁడని తలంపవలసినదే కాని విగ్రహమనుటకు వీలులేదు.

ఆవిగ్రహమున కనేకహస్తములుకలవు. ఒకకుడిచేతిలో నొక డమరుకమున్నది. శివుఁడు తాండవసమయమున దానిని వాయించు చున్నట్లును నీటిలోనుండి బుడగలు నిప్పులోనుండి నిప్పుకలు పొడ మినట్లు బ్రహ్మాండము లాడమరుకమునుండి పుట్టుచున్నట్లును జెక్కఁ బడియున్నది. రెండవ కుడిచేతితో సృష్టింపఁబడిన సకలజగముల రక్షించుచున్నట్లు చూపఁబడినది. ఒక యెడమచేతిలో సకలబ్రహ్మాం డముల నిర్మూలనముచేయు ప్రళయాగ్ని యున్నట్లు గానఁబడును. కుడి పాదముమాత్రము భూమిమీఁదనే స్థిరముగానున్నట్లు జూపఁబడి యున్నది.

విగ్రహ మంతదివ్యసుందరముగ నుండుటచేతనే ద్రవిడదేశ మున సుప్రసిద్ధులైన యప్పారు మాణిగారు పట్టణాధరు తాయిమ న్నారు మొదలగు పరమశైవులు భక్తిరసముచేతఁ బరవశులై ద్రవి డభాషలో సర్వోత్కృష్టమై వినువారియొడలు నయిత ముప్పొంగఁ జేయు కవనముచే నాదేవుని స్తవముచేసియున్నారు. పరమశైవులు ప్రపంచమునం బ్రతిపదార్థమునందు నటరాజస్వామి నిరంతరము నా ట్యముచేయుచుండును. కావున నెల్లవస్తువులకుఁ జైతన్యము కలదని చెప్పుదురు. శివుఁడు నటరాజరూపమునఁ దాను జగన్నాటక సూత్రి

ధారుఁడగుటఁ బ్రకటించుచున్నాఁడని వేదాంతులు చెప్పుదురు. ఈ క్షేత్రమునఁ బూర్వకాలమున పతంజలి యను మహర్షియు వ్యాఘ్రపదుఁడను మహాత్ముఁడు నటరాజదేవు నాశ్రయించి యొకఁడు జ్ఞానమార్గమున వేఱొకఁడు భక్తిమార్గమున ముక్తిఁజెందిరని స్థలపురాణమునఁ గనఁబడును. నటరాజస్వామి కోవెలకు సమీపముననే గోవిందరాజపెరుమాళ్ళు నాలయముగలదు. అందుచేఁ జిదంబరక్షేత్రము శైవులకేగాక వైష్ణవులకుఁగూడ సేవ్యమైనస్థలమే.

నందుఁడు బ్రాహ్మణునినోటినుండి చిదంబరమహాత్వమంతయుఁ జెవులు దోరవెట్టుకొని మిక్కిలి శ్రద్ధతో విని పరమానంద భరితుఁడయ్యెను. చిదంబరము, నటరాజస్వామి యనుమాటలకు విధేయుఁడైపోయి యారాత్రియే బయలుదేఱి యాదివ్యక్షేత్రమును జూడవలయునని సంకల్పించెను. కాని చెలికాండ్రు వాని యుద్యమమున కిష్టపడక "చిదంబరము మనము చేరకమునుపే గుడితలుపులుమూయఁబడును. మఱియు నీవుబ్రాహ్మణునొద్ద బాలేరువు గదా? ఆయన సెలవు లేక మనమెక్కడికైనఁ బోవచ్చునా! ఇదివఱకే మనమాలస్యము చేసితిమిగావున పోవల"దని యాపిరి. మఱియొకఁడైన పక్షమున నప్పుడే వారిమాటలను ద్రోసివేసి తనయభీష్టము నెఱవేర్చుకొనియుండును. నందుఁడట్లుచేయక "బ్రాహ్మణునకు నన్నుఁబాలేరుగాఁ జేయుటయు భగవదిచ్ఛయే. నామేలు నాకంటె భగవంతుఁడే బాగుగ నెఱుఁగును గదా? దేవుని యిచ్ఛాప్రకారము నడచుట వానిగుడికిఁబోవుటకంటె మంచిది. కావున నేనిప్పుడుపోయి బ్రాహ్మణుని కాళ్ళమీఁదఁబడి వానినెల్ల విధములఁ బ్రార్థించి యనుగ్రహము పుట్టఁజేసెదను. అప్పుడాయనయే నన్నుఁ బోవనిచ్చు"నని పలికి చిదంబర ప్రయాణముమాని యాగ్రామమున జనులయుపయోగార్థము తాను తన చెలికాండ్రతోఁగలసి యొక కోనేరుత్రవ్వ స్వగ్రా

మమునకుఁ బోయెను. ఒకమాలఁడు మఱికొందఱు మాలలతోఁ గలసి యల్పకాలమున నొక చెఱువు త్రవ్వుట యాశ్చర్యమే కదా! భక్తిరసమేమిచేయింపదు? నందుఁడు నిజమైన భక్తుఁడు గావున నట్లు చేసియుండవచ్చును. నందుఁడు చెఱువుత్రివ్వఁ బ్రారంభించిన తోడనే గణేశ్వరుఁడు ప్రత్యక్షమైతనతండ్రి భక్తునిప్రీతికొఱకుఁ దానే కోనేరు త్రవ్వియిచ్చెనని పెద్దలు చెప్పుదురు. ఎట్లైన నందుఁడే యది త్రవ్వి యుండవచ్చును. లోకోపకారముచేయుట దేవునిబూజించుట వంట్టిదేయనియు నార్తులగువారి కన్నోదకములనీయక గుడికి నరఁటిపండ్లు కొబ్బరికాయలు మొదలగునవి తీసికొనిపోయి వట్టిపూజలు చేయుట నిష్ఫలమనియు నందుఁడు తలంచుటచే నతఁడా సత్కార్యము చేసియుండునని మనము నమ్మవచ్చును.

అట్లతఁడు చెఱువుత్రివ్వి గ్రామమునకుఁ బోయి తీరికచేసికొని యొకసారి చిదంబర క్షేత్రముఁ జూడవలయునని కోరుచుండెను. కోరి కపొడమినది మొదలాతని మనస్సు స్వామియందె సక్తమైయుండు టంజేసి పొలములోఁ బనిచేయునప్పుడు గృహమందుఁ గూర్చున్న ప్పుడు నిదురపోవునప్పుడుఁగూడ నందుఁడు నటరాజస్వామి తన యెట్టయెదుటఁ దాండవనృత్యము సలుపునట్లు భావించి యానందింపఁ జొచ్చెను. చిదంబరక్షేత్రి మొక్కసారి పోవుటకుఁ దనకుఁ సెల విమ్మని ప్రతిదినము యజమాను నడుగవలయునని నందుఁ డూహిం చియు నోరుదెఱచి యడిగినతోడనే యజమానుఁడు తనకోర్కె నిరా కరించునను భయమున నూరకుండుచు వచ్చెను. ప్రతిదినము సాయం కాలము "తప్పక నేను జిదంబరము వెళ్లుదు"నని యతఁడు చెలికాం డ్రతోఁ జెప్పుచు వచ్చెను. కాని పయనము సాగకపోవుటచే రేపు లెన్నియో నేఁడులయ్యెను. చెలికాండ్రు తిరునాళైపోవారని పేరు పెట్టి నందుని వెక్కిఱింపఁ జొచ్చిరి. తిరునాళైపోవా రనఁగా రేపు

వెళ్ళువాఁడని యర్థము. రేపు రేపని నందుఁ డెన్నాళ్ళకుఁ బోవక యుండుటచే మిత్రులా పేరుపెట్టి వానిని పరిహసించిరి. ఈనడుమ నా గ్రామములోనుండిన మాలవాండ్రు నిజమైన భక్తి యెట్టిదో యెఱుంగని మూర్ఖులగుటచే నందుని విధమంతయుఁ జూచి మొట్టమొదట నాశ్చర్యమొందిరి. కాని నందుఁడు నిరంతరము భగవన్నామ ముచ్చరించుటయు మేనెల్ల బూడిదపూసికొనుటయుఁ గన్నులు మూసికొని ధ్యానము చేయుటయు సహజమైన ధూర్తభావమును విడిచి వినయ సంపత్తి గలిగియుండుటయు భగవద్విషయిక ప్రసంగమే కాని యన్య పరిసంగము మానుటయు దగ్గఱనుండి చూచినకొలఁది వారికి మేర మీఱిన భయము పుట్టెను. పై లక్షణములకుఁ దోడుగ నందుఁడు కల్లుద్రాగుట మాంసముతినుటయు మానెను. తోడిమాలబాలు రాడు మోటయాటలలోఁ బ్రవేశించుట మానెను. గొడ్లను గోయుట, వానికంటె కతిఘోరకృత్యముగఁ గనఁబడుటచే నట్టిపని చేయ వలదని పలుమాఱు కులస్థులతోఁ జెప్పుచువచ్చెను. కులస్థులగు చండాలురు తప్పత్రాగి బూతులు తిట్టుకొనుచుఁ గయ్యము లాడునప్పుడు నందుఁడు వారిపొంతఁబోక దూరమున నొకచోఁ గూర్చుండి తన చుట్టునున్న చెట్లు పుట్టలు వాగులు మొదలగువానిం జూచి యవియన్నియు నటరాజస్వామిచేత సృష్టింపఁబడినవే యని యెంతయుఁ దన్మయమేయని భావించి యలరి "ఓస్వామి! నీవు సృష్టించిన పదార్థములను జూచుట కంటె నీ నిజరూపమును జూచుటకు నా మనస్సు వేడుకపడుచున్నది. నాకు దర్శనమిమ్మని వేడుకపడుచుండును.

ఇట్లు నందుఁ డొకనాఁడు నటరాజధ్యానపరాయణుఁ డయి తన్మయంబగు చిత్తంబుతోఁ బరవశుఁడయియుండ వానికన్నులనుండి యానందబాష్పములు జొటజొటఁ గాఱెను. మేనుఁ దెలియక యతఁడు నేలంబడియెను. అప్పుడు పొరుఁగు మాలఁడొకఁడు వానిం

జూచి పెద్దరోగమేదో వానికి మూడినదని భయపడి పెద్దపెట్టున నఱచుచు నెల్లవారింబిలిచెను. వెంటనే చుట్టుప్రక్కలనున్న మాల వాండ్రు పరుగు పరుగున నచ్చోటికిఁబోయి పడియున్న నందుని చుట్టు గుమిగూడి వాని శరీరమంతయుఁ గట్టిగఁ గదిపి బలవంతముగ వానికి మెలకువ దెప్పించి మేలుకొన్న పిదప నట్లు పడిపోవుటకుఁ గారణమడిగిరి. పరమేశ్వరుఁ డొక్కఁడున్నాఁడనియు వాని ధ్యాన మేతనయవస్థకుఁ గారణముగాని రోగము కారణము కాదనియు నందుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. నందుని ప్రత్యుత్తరము వారికి సహేతుకముగ నుండనందున మాలపెద్ద లందఱుఁ దోడనే సభచేసి నందుని దురవస్థకుఁ గారణములు చర్చించి తమ కులదేవతలకుఁ దఱుచుగ జాతరులు చేయకపోవుటచే నా దేవతలు కోపించి నందుని బాధించుచున్నవేకాని మఱియొక కారణముకాదని నిశ్చయించి మఱునాఁడే జాతరలుచేయవలెనని కృతనిశ్చయులైరి. జాతరకు గొప్ప ప్రయత్నము జరిగెను. మాలవాండ్రు పెద్దతాటియాకుల పందిరివేసి మామిడాకుల తోరణములఁగట్టి యరఁటి కంబములు పాఁతి దానిని సొగసుగ నలంకరించిరి. బలినిమిత్తము కావలసినన్నికోళ్ళు, మేఁకలు, గొఱ్ఱెలు సిద్ధముగానుండెను. నైవేద్యము నిమిత్తమెన్నో కడవలకల్లు చేర్పఁబడెను. సోది చెప్పుటలో నిండు ప్రజ్ఞగలమాలగురు వొకఁడు వచ్చి యాతంతు నడుప సమకట్టెను. అద్భుతమగు పేళ్ళుగల యిరులన్, వీరన్, కావేరి, నల్ల కరుపన్ మొదలగు క్షుద్ర దేవతల విగ్రహములు రాగిడిమట్టితో భయంకరముగఁ జేయఁబడెను. మఱునాఁడుద యమున బల్లెనున్న మాలలందఱు జాతరఁజూడఁ బందిరికిరిందికిఁ జేరిరి. మట్టిదేవతలు ప్రాముఖ్యతనుబట్టి వరుసగా నిలుపఁబడిరి. అప్పుడు కొందఱుమాలలు నందుని బట్టుకొని మధ్య ప్రదేశమునకుఁ దోడుకొనిపోయిరి. అంతట మాలగురువు తన డమరుకమును వాయిం

చెను. తోడనే వందలకొలఁది మాలవాండ్రు కొమ్ములూఁదిరి. మఱి కొందఱు తప్పెతాగ్గి చెవులు చిల్లులు వోవునట్లు గుండె లదరునట్లు డప్పులు వాయించిరి. ఆవాద్యములు కొంత సేపు మ్రోసి యాగెను.

అప్పుడు గురువున కావేశమువచ్చెను. ఆయనకు దేవతలందఱుఁ బూనిరఁట. పూనినతోడనే వాఁడు వెఱ్ఱికేకలు వేయుచు లేచెను. లేచుటయు వాఁడు స్వర్గమున కెగిరిపోవునేమో యను భయమునఁ బిడిరాళ్ళవంటి పదుగురు మాలవాండ్రు వానిం బట్టుకొనిరి. అప్పుడు వాఁడు చిందులు ద్రొక్కుచు డమరుకములు వాయించుచు విపరీతముగ నభినయించుచు నీక్రింది విధమగు సోదిచెప్పెను. "మన నందన్నకు సంతవీధిని బెద్ద చింతచెట్టుమీఁదనున్న పొడుగుజుట్టుదయ్యము పట్టినది. అది యొకమాఱు వానిని నవ్వించును. ఒకమాఱు ఏడిపించును. ఒకసారి నిద్రపోఁగొట్టును. ఒకసారి వింతపలుకులు పలికించును. ఒకసారి నాట్యమాడించును ఔనా కాదా? యావికారములు వాని యొద్దఁ గానఁబడుచున్నవా లేవా?" అనవుడు నచ్చటఁ జేరినమాలలందఱు "నిజమే నిజమే, నందుఁ డచ్చముగ మీరుచెప్పినట్లె చేయును. ఆహాహా! ఎంతనిజముగఁ బలుకుచున్నాఁ డయ్యా! ఈయన సోది యెంతప్రత్యక్ష మయినదయ్యా" యని పెద్దపెట్టున నఱవఁజొచ్చిరి. నందుఁడు గురువుమాటలు చెవిఁబెట్టక తక్కినవారివంకఁ జూడక మనసులో "నటరాజస్వామి! నీనాట్యము నాకుఁ జూపవా" యని ప్రార్థనము చేయుచుండెను. అంతట గురువు మఱల నిట్లుపలికెను. "మన దేవతల కందఱకు నందునిమీఁదఁ గోపమువచ్చినది. నూఱు గొఱ్ఱెలను రెండువందల కోళ్ళను నల్లకురుపనుకు తోడి దేవతలకు బలియిచ్చి నూఱుకడవలకల్లు నైవేద్యము పెట్టినపక్షమున నందునకు దయ్యము వదలిపోవును." అని పలికి సోదిచాలించి గురువు నేలఁ బడిపోయెను. అంతట దృఢశరీరులగు పదుచు మాలవాండ్రు కొంద

ము నాట్యముసేయ నారంభించి పిచ్చిపాటలు పాడిరి. ఆపాటల తాత్పర్య మీక్రింద( బొందుపఱచు చున్నా(డను. "ఓ పిడారీ! నీవు మాపొలములు( దో(టలు( గాచు దేవతవు. పాప మీనందుని గావుము. ఓ నల్లని వీరన్నా? ఓ పెద్దతల వీరన్నా! మేము మీపా దముల నాశ్రయించుచున్నాము. నందుని రక్షింపుము. ఓ బలము గల యిరులన్! నీవు శూరు(డవు. పొట్టనిండ మే(కలను బెట్టెదము. నందుని రక్షింపుము" అని యర్థమువచ్చు పాటలువారు పాడుచుండ నం దు(డు "నా దైవము నటరాజస్వామి. అత(డు తప్ప నన్ను రక్షింప( గలవా రెవ్వరు? బ్రహ్మాండమంతయు నిండువానికి పెద్దతలలు పొట్టలు పెట్టుచున్నారా? అవియన్నియు దయ్యములుగాని దేవతలుకావు. మూఢులారా! నమ్మిచెడిపోవకు(" డని యర్థమువచ్చు పాటలు పాడుచుండెను. చండాలు రాయుత్సాహములో నందుని మాటలు పాటలు వినిపించుకొనలేదు. ఆనాట్యమైనపిదప దారుణమగు జంతు బలి ప్రారంభమయ్యె. వందలకొల(ది కోళ్ళను, మే(కలను, గొఱియ లను నిష్కరుణముగా(జంపి యాతావు నెత్తురుకొలను చేసిరి. అతి ఘోరమైన యా జంతుహింసచూచి భరింపలేక నందు(డు దుర్వ్యా పారమునుండి తొల(గు(డని యనేకవిధముల వారికి నయమున భయ మున( జెప్పి యాదుష్కర్మము మాన్పింప(దల(చెను. కాని వాని హితోపదేశమంతయు బూడిదలో( బోసిన పన్నీరయ్యెను. వాని పలుకుల నాదరింపకపోవుటయేగాక మీ(దుమిక్కిలి వారు "వానిని బట్టిన దయ్యము వదలక యట్లు పేలించుచున్న" దని పలికిరి. ఆహింస వారు మాననందున నందు( డచ్చోటువాసి వేఱొకయెడకు( బోయి వారినామూర్ఖతవాపి రక్షింపుమని యీశ్వరుని(బ్రార్థించెను.

నందుని హృదయము చిదంబరమునకు( బోయి నటరాజ స్వామి దర్శనము చేయవలయునని మునుపటికంటె నెక్కుడుగ నుబ

లాటము పడఁజొచ్చెను. అభిలాష మడఁచుకొనలేక మెట్టకేల కతఁడు చిదంబరము పోవుటకుఁ దనకు సెలవిమ్మని యజమానుఁడగు బ్రాహ్మణునడుగ నిశ్చయించుకొనెను. అంతలో మాలపెద్ద లందఱు మరల సభచేసి యెన్ని మేఁకల బలియిచ్చిన నెన్ని జాతరలు చేసిన నందుని బట్టిన పిశాచము వదలలేదని విచారించి వాని యజమానుఁడగు బ్రాహ్మణునియొద్దకుఁ బోయి నందుఁడు చిదంబరము పోవుటకు సెలవి య్యవద్దని వానిని బ్రార్థించిరి. వారి మొఱలు విని బ్రాహ్మణుఁడు నల్లెయని వారి కభయమిచ్చెను. అనంతరము నందుఁడువోయి చిదంబరయాత్ర కనుజ్ఞ నిమ్మని యజమానుని వేఁడుకొనెను. అతని మనవి వినినతోడనే యాబ్రాహ్మణున కెక్కడలేని కోపమువచ్చెను. వచ్చుటయు నవ్విప్రుఁడు "ఓరిదొంగ! ఓరిమాలకుంకా! నీవు చిదంబరము వెళ్ళుదువా? నీవు బ్రాహ్మణుఁడవు కాఁ దలంచుచున్నావా యేమి? నీబ్రతుకునకుఁ జిదంబరము వెళ్ళుట కూడనా? చాలుఁజాలు. నోరు మూసికొని పడియుండుము. లేకున్న వీపు వసులఁ గొట్టించెదను జాగ్రత్త" యని మఱియు ననేకవిధంబుల దూషించెను. తన యజమానుఁ డంత క్రూరుఁడై ప్రవర్తించుట చూచి నందుఁడు చేయున దేమియు లేక కన్నుల నీరువెట్టుకొని యచ్చోటువిడిచి యొకచెట్టు క్రిందఁ గూర్చుండి వెక్కివెక్కి యేడ్చి భగవంతు నుద్దేశించి తనలోఁ దానిట్లనుకొనియె. "ఓయీశ్వరా! నీవెంత నిర్దయుఁడవైతివి. నేనా బ్రాహ్మణుని నిందింపవలసిన పనిలేదు. పరమాణువయినను నీయాజ్ఞ లేక కదలదు. కావున బ్రాహ్మణుఁడును నీయాజ్ఞాబలముననే యట్లు పలికెను. వీఁడొక కడజాతివాఁడు. దయ కనర్హుఁడు నని తలఁచి దిక్కుమాలిన యీనిర్భాగ్యుని విడిచితివి. నాకేవిధమైన గొప్పతనము లేదు. ధనములేదు. చక్కఁదనములేదు. పేరు ప్రతిష్ఠలులేవు. విద్య లేదు. ఈలోపములకుఁ దోడుగ నేను మాలవాఁడనై పుట్టి యొకరి

క్రింద భానిసనై యుంటిని. నీయనుగ్రహ మున్నంత కాలము నాకి వన్నియుఁ గొఱఁతలుగాఁ గనఁబడలేదు. నేఁడు నీయనుగ్రహము కొఱఁతయగుటచే నన్నికొఱఁతలుఁ గనఁబడుచున్నవి. ఓ యీశ్వరా! నే నెట్లు బ్రతుకుదు."

ఇట్లు కొంతసేపు విచారించి "ఛీ! యీ పాడుశరీరము విడిచి యీశ్వర సన్నిధానమునే చేరుదు"నని యావేశముతో నొకసారి యాత్మహత్యఁ జేసికొనఁదలంచె. కాని యాశాపాశము వెనుకకు లాగుటచే నించుక శాంతించి యాదుష్ప్రయత్నము మాని "నాకేది కావలయునో యది నాకన్న భగవంతుఁడే బాగుగ నెఱుఁగును. కావున నన్నివిషయములలో వానియాజ్ఞకే బద్ధుఁడనై యుండెద. నేను పొగరుఁబోతునై యజమానునియాజ్ఞ తిరస్కారము చేయుచున్నాను. నేను వినయవంతుఁడనై స్వామియాజ్ఞ శిరసావహింపనిచో నాపై భగవంతున కనుగ్రహము కలుగునా? బ్రాహ్మణుఁ డిప్పుడు నన్ను నివారించినను జిదంబరము బోవ నర్హుఁడ నైనప్పుడు నన్నుఁ బోవ నిచ్చునని వెండియుఁ దనలో వితర్కించుకొని యూరకుండెను.

అట్లు కొన్నిదినములు గడచినపిదప మరల నందుఁడు యజమానుని దర్శనముచేసి మునుపటికన్న నెక్కుడువినయముతోఁ జిదంబరయాత్ర కనుమతి వేఁడెను. యజమానుఁడు తొల్లింటికంటె నెక్కువ తిట్లుతిట్టి వానికోరిక నిరాకరించెను. ఈసారి నందుఁడు వెనుకటియట్లు దుఃఖింపక తాను నటరాజస్వామి దర్శనము చేయుట కనర్హుఁడ ననియు మునుపటికంటె నెక్కుడు భక్తి వినయము పావనత మొదలగునవి తనయందు నెలకొనఁ జేసికొనుట యావశ్యక మనియుఁ దలంచి యట్లుండుటకుఁ బ్రయత్నింపఁదొడఁగెను. నిదురపోయిన కాలముతప్పఁ దక్కిన కాలమంతయు నతఁ డీశ్వరధ్యానమునందే గడపుచు నడుమనడుమఁ దనమీఁద ననుగ్రహము లేదని విలపించుచు

నొక్కొకయెడ సృష్టి వైచిత్ర్యములఁ జూచి బ్రహ్మానంద భరితుఁడై యీశ్వర మహిమం గొనియాడి నాట్యమాడుచు నొక్కనిముసమైన వృథ సేయక యుండెను. నదులు కొండలు పక్షులు వృక్షములు మొదలగు సమస్తపదార్థములు గూడ నీశ్వర స్వరూపములే యని భావించి యతఁడు చెట్లం గౌఁగిలించుకొనును. ఎగిరెడు పక్షులతోఁ బరుగెత్తును. పారెడు నదులం గొనియాడును. ఇంకను బలుతెఱంగుల విలక్షణముగఁ బ్రవర్తించుచుండును.

ఈవికారములంగాంచి వానిచుట్టములు నిశ్చయముగఁ బిచ్చి యెత్తెనని నమ్మిరి. నమ్మి యాపరమమూర్ఖులు వాని కనేక చికిత్సలు చేయించి కాలుసేతులు గట్టి తిట్టి కొట్టి పలువిధముల బాధించిరి. అన్ని బాధలు పడినప్పుడైనను నందుఁడు నటరాజస్వామిని మఱవక బాధించువారి దూషింపక బాధ దుస్సహమైనప్పుడు "సర్వేశ్వరా! ఈతప్పు వారిదికాదు. శివునియాజ్ఞలేక చీమయయినఁ గుట్టదుకదా. ఇది నీమహిమయే కావున వీరిపై నలుగక యనుగ్రహింపు" మని నెనరు గలిగి వారివిషయమున నీశ్వరు వేఁడుచుండును. అతనికిఁ గల భూతదయ యిట్టిదని మనము వర్ణింపఁ జాలము.

అతఁడు చీమలకుఁ బంచదార పెట్టును. నేలనుండు పురుగులెండకు మాఁడి చచ్చునని జాలినొంది వానిని నీడకుఁ గొని పోవును. పక్షు లవ్యక్తమధురముగాఁ గూయునప్పుడు వానితోఁ గలసి కూయును. ఇట్లతఁడుచేయు విపరీతచేష్టలు చూచి వానిచుట్టములు నిరంతరము వానితోనే తిరుగుచుఁ గాలముగడుపుచు వచ్చినందున యజమానునిపనిలో నికిఁ బోవుటకు వారికిఁదీరిక లేకపోయెను. చేలుకోఁతకువచ్చినందున బ్రాహ్మణుఁడు పాలేళ్ళనందఱఁబిలిచి పాలునాలిన కతమున వారిందొలఁగించి నందుఁ డేమనునో చూడవలయునని వానిఁ బిలిపించెను. నందుఁడు యజమానునియెదుటికిఁ బోయి చేతులుజోడిం

చుకొని మిక్కిలి వినయమున నిలిచెను. బ్రాహ్మణుఁడు వాని వినయము భక్తి చూచి మిక్కిలి సంతసించి నందుఁడు వానిచుట్టము లనుకొని నట్లు పిచ్చివాఁడుగాఁడనియుఁ బరమభాగవతోత్తముఁడనియు వాని విశేషభక్తిని వెఱ్ఱితనముగా వానిచుట్టములు భావించిరనియు బ్రాహ్మణుఁడు గ్రహించి వెనుక నందుఁడు చిదంబరమునకుఁబోవ, రెండుసారులు సెలవడుగుటయు, రెండుసారులు దాను నిరాకరించుటయుఁ దలంచి బ్రాహ్మణుఁడు విచారించి దీనముఖముతోఁ దన యెట్టయెదుట నిలిచియుండిన యాకుఱ్ఱని మీఁద జాలిపొడమ నిట్లనియె. "నందా! నీవు మిక్కిలి మంచివాఁడవేకాని యీనడుమఁ గొంచెము చెడుత్రోవలం బడుచుంటివి. కొన్నాళ్ళనుండి నీవు సరిగాఁ బనిచేయుట లేదు. చిదంబరము వెళ్ళుటకు నీకు సెలవిచ్చెదనుగాని ముందుగా నీవు నీచుట్టములుగలిసి చేనుఁగోసి కుప్పవేయుఁడు." ఆపలుకు లమృతధారవలె హాయిగాఁ జెవులఁబడుటయు నందుఁడు పరమానందభరితుఁడై లేడిలాగున గంతులు వేయుచుఁ బొలమునొద్దకుఁబోయి కొన్నిగంటలలో మఱల యజమానుని యింటికివచ్చి బ్రాహ్మణునిఁ బిలిచెను. అంతలో నేల రావలసి వచ్చెనని యజమానుఁడు బయటికివచ్చి వానినడుగ నందుఁడు "స్వామీ! నాతో నొక్కసారి పొలమునకు దయచేయవలయు" నని వాని వెంటఁబెట్టుకొని పొలమునకుఁ బోయెను.

బ్రాహ్మణుఁడు పొలమునకుఁబోయి చూచునప్పటికి నందుఁడు చేను కోయుటయుఁ గోసి కుప్పవేయుటయు నయ్యెను. ధాన్యపుకుప్ప బంగారుకుప్పవలెఁ గన్నులపండువుగ నుండెను. ఒక్కజాములో నెవరిసాయములేక యొక్కమనుష్యుఁడు చేనుఁగోయుట యసంభవమని తన యెదుటనున్నది కలయా నిక్కవమా యని సందేహించుచు బ్రాహ్మణుఁడు కొండొకసేపు రిచ్చవడి చూచెను. చూచిచూచి బ్రాహ్మణుఁ డట్టకేలక ది నిక్కవమేయని నమ్మి నందుఁడు పరమభాగవతో

త్తముఁ డగుటచేతఁ జేను పరమేశ్వరుఁడే తనభక్తునికిఁ బదులుగాఁ గోసియుండవచ్చునని తలంచి మెల్లఁగా వానితో నిట్లనియె. "నంద! నీ వొక్కఁడవు గాదుగదా నీచుట్టము లందఱుఁ గలసినను నేఁడీ పని చేయుట యసాధ్యము. భగవంతుఁడు నీద్వారా నాపొలములో మహా మహిమఁ జూపెను. ఇది నీభక్తికి భగవంతుఁడు మెచ్చినమెప్పు. నీ మాటలనమ్మక పరమమూర్ఖులమగు మాకు దేవుఁ డీరీతిగా దృష్టాంతముఁజూపెను. నందా! నేను చూచినంతవఱకు నీవంటి పరమభాగవతోత్తముఁడు సజ్జనుఁడు లేఁడు. దైవభక్తుఁడగు నిన్ను బానిసను జేసి నేనెంతపాపము చేసికొంటిని. ఈనిముసము మొదలు నేను నీబానిసను. నాధనమంతయు నీది. భక్తవత్సలుఁడగు పరమేశ్వరునితో పరమపాతకి నగు నన్నుఁగూర్చి యించుక విన్నవింపుము" చేను మిక్కిలి త్వరలోఁ గోయఁబడుటచే భగవంతుఁడేవచ్చి కోసెనని బ్రాహ్మణుఁ డభిప్రాయపడెను. భగవంతుఁడు చేనుకోయుట యసంభవముగదా! అటులయిన నిది యెట్లు జరిగెను? భక్తిపరవశుఁ డయిన మనుష్యుఁడు వెఱ్ఱిశక్తిఁ దెచ్చుకొని దుర్ఘటములగు కార్యములఁ జేయవచ్చును.

చేనువేగముగఁ గోసినపక్షమున బ్రాహ్మణుఁడు తన్నుఁ జిదంబరమునకుఁ బోనిచ్చునని నందుఁడు భక్తిపరవశుఁడయి యెక్కడలేని శక్తిఁ దెచ్చుకొని నమ్మశక్యముకాని వీలులేనంతత్వరలోఁ జేనుఁగోసియుండవచ్చును. ఒకటి రెండుదినములలో నందుఁడు చేనుఁగోసియుండఁగా జాములోఁ గోసినాఁడని గంటలోఁ గోసినాఁడని లోకములో మహిమలు వెల్లడియయి యుండవచ్చును.

నందునకు భగవంతుఁడు ప్రత్యక్షమయ్యెనని దృఢముగానమ్మి నందున బ్రాహ్మణుఁడు దానగ్రివర్ణుఁడననియు నతఁడు,కడజాతివాఁడనియు సందేహింపక పాలేరుకాళ్ళకు నమస్కరించెను. హిందువు

లలో వర్ణభేదము విశేషముగ నుండినను వారు తక్కువజాతివారిలో జ్ఞానులెవరైనఁ గనఁబడినప్పుడు వారికి నమస్కరించుటయు గౌరవము సేయుటయుఁగలదు. వైష్ణవుల గురువులగు పన్నిద్దఱాళ్వార్లలోఁ దక్కువజాతివారు గొందఱు కలరు. అయినను వారి నిప్పటికి దేవతార్చన పేటికలలోఁ బెట్టి బ్రాహ్మణోత్తము లనేకులు ప్రతిదినముఁ బూజించుచున్నారు. యజమానుఁడు తనకు నమస్కరించినతోడనే నందుఁడు భయసంభ్రమంబులు పెనఁగొన !వడివడి వానిని లేవనెత్తి "స్వామీ! యీమాలబానిసకు మ్రొక్కుటకు మీరేమి పాపము చేసినా" రని యడిగెను. అందుకు బ్రాహ్మణుఁడిట్లనియె. "నందా! నీవు మాలవుగావు. బానిసవు గావు. నీవు పరమపవిత్రుఁడవు. పరమభక్తుఁడవు. నీవు చిదంబరము వెళ్ళుము. వెళ్ళకమునుపు నన్ను దీవింపుము. నేను నీకుఁజేసిన యవజ్ఞలఁ దలఁపక క్షమింపుము." అని యూరకుండక నందుని రెండుచేతులుఁ బట్టుకొని బ్రాహ్మణుఁడు తన తలమీఁదఁ బెట్టుకొని కడసారి తన్నాశీర్వదించి హితోపదేశముఁ జేసి పొమ్మని వానిని బ్రార్థించెను.

అనవుడు నందుఁ డిట్లనియె. "అయ్యా! "నేను జెప్పవలసిన దేమున్నది? హృదయమున భగవద్భక్తి నిలుపుము. అతనిమీఁద భారమువైచి నీయాలుబిడ్డలను బాలమును సొమ్మును గాఁపాడుకొనుము. నీవంటివారికిఁ జదువురాని మూర్ఖుఁడను నేనింతకంటె నేమి చెప్పఁగలను." ఆయుపదేశమువిని బ్రాహ్మణుఁడు భక్తిరసముఁ గ్రక్కుచున్న వారిమొగముం దేఱిపాఱఁజూచి మరల వానికి నమస్కరించి స్తోత్రముచేసి మంచిమాటలుచెప్పి పంపెను. నందుఁడు బ్రాహ్మణునకుఁ మాటిమాటికి నమస్కరించెను. యజమానుఁడు విడువలేక విడువలేక విడిచి సాగిపోయెను. కొన్నియడుగులు సాగిపోయినపిదప బ్రాహ్మణుఁడు పాలేరు నెలుఁగెత్తి పిలిచి నిలునిలుమని పరుగెత్తుకొని పోయి

వగర్చుచు "నందా! మరల నెప్పుడువచ్చెద" వని యడిగెను. అనవుడు యజమానునకు సేవకుఁ డిట్లనియె. "అయ్యా! యింక నేను వచ్చుట యెక్కడిది? ఇదియే కడసారి చూపు. చిదంబరము వెళ్ళినవాఁడు మరలవచ్చునా? ఈదుష్ప్రపంచమును మరల నేజూడఁజాల. ఇంకనేను మీకుఁ గనఁబడను." ఆమాటయర్థము బ్రాహ్మణుఁడు గ్రహింపలేక పోయెను.

యజమానుఁడు విడుచుటయే తడవుగ నందుఁడు వేఁటకాని వలనుండి తప్పించుకొన్న లేడియట్లు కొడుకునుగన్న గొడ్రాలిలాగు చూపువడసిన గ్రుడ్డివానివలె మేరమీరిన సంతోషమంది చిదంబర మునకుఁ బయలుదేఱెను. మీనాక్షి దేవి యల్లుఁడైన నటరాజస్వా మి నెప్పుడుచూతు నెపుడుచూతునని యూటలూరుచు నటరాజనట రాజ నర్తనసుందరా! యని పాటలుపాడుచు నందుఁడు రెండవతలం పులేక పుట్టలుదాఁటి పుంతలుగడచి చేలగట్లులెక్కి చెట్లనీడలఁజొక్కి తన్[?]యెఱనిమిత్తముపోవు బెబ్బులియట్టు చిదంబరమునకుఁ బోవుచుంట వానిమదిలో నున్నభక్తి యనుభవమునఁ దెలియవలయునేకాని వర్ణింప నలవికాదు. అతఁడప్పుడు పాడినపాట సరిగా నిచ్చటవ్రాయుటకు వీలు లేదుగాని దానితాత్పర్య మీక్రింది పద్యమునఁ బొందుపఱచెద.

సీ. నటరాజ నటరాజ నర్తనసుందర
నటరాజ నటరాజ నాథనంబ
నటరాజ నటరాజ నాపాలిదైవమా
నటరాజ నటరాజ నాదుతండ్రి
నీనామకీర్తన నీపాదములభక్తి
చింతలన్నియుఁ బాపుచేవమందు
భవరోగములనెల్లఁ బాలార్చు పెనుమందు
వెఱపులన్నియుఁదీర్చు వింతమందు

తే. గీ. మామనోవ్యాధు లడఁగించు మంచిమందు
యెల్ల కాలంబు బ్రతికించు నింపుమందు,
ఐహికంబుల మఱపించు నట్టిమందు
దేవ! నటరాజ! నటరాజ! దీనవరద!

అట్లు నందుఁడు పాటలు పాడుచుఁ బోవుచుండ భూమి కంపించెనఁట. వృక్షములల్లాడెనఁట. ఆకసమునుండి వర్షము గురిసెనఁట. నందుఁడు తన్నుఁదానెఱుఁగక వివశుఁడయి యొకసారి నవ్వుచు నొకసారి యేడ్చుచు నేల నడుగు సరిగ నిడక లేడిలాగునఁ బయనము చేసెను. ఒక్కజాములో నూఱుపుట్ల నేలలో నున్న చేనుఁ గోసిన యానందునకు స్వగ్రామమగు అధనూరునుండి కావేరినది పాయ యగు కొల్లడముయొద్దకుఁబోవుట యెంతపని. అతఁడా ప్రయాణమువ లీలఁ జేసెను. అప్పుడు కొల్లడమునది నిండువరదలమీఁద నుండెను.

నందుని మనస్సులో నానందతరంగము లుప్పొంగినట్లే యానదిలో మహాతరంగములు పొడమి పెల్లెగసి పడుచుండెను. ఎట్టయెదుటఁ గానఁబడుచుండిన చిదంబరగోపురమునఁజూచి నందుఁడు పరవశుఁడయినట్లే యానదికూడఁ బరవశమై యావిధమున విజృంభించుచున్నదాయని జను లనుకొనునట్లు ప్రవాహ పూరితమై యుండెను. నటరాజస్వామి కరుణారసమువంటి యాయేటి వరదంజూచి నందుఁడు తనపాలిదైవ మానదిలో నుండెనని నటరాట నటరాజ యని నాట్యమాడి యొడలు తెలియక గంతులువేయసాగెను. అంతలో నొక చిన్న నావ యచటికి వచ్చెను. దానిమీఁద మేనెల్లఁ దెల్లని బూడిదఁ బూసికొని పడవ నడపు మనుష్యుఁడొకఁడు కూర్చుండెను. వానిశరీరమునుండి చెమటలు సెలయేళ్ళవలెఁ బ్రవహించుచు వచ్చెను. నందుఁడు వానింజూచి కేవుసిచ్చుట కొప్పుకొని యాపడవనెక్కినది మొదలు కొని చిత్రవిచిత్రముగా నటరాజస్వామిని స్తవముచేయుచు నాట్యము

దొరిక్క నారంభించెను. యేటిమీఁద నావ నాట్యమాడఁజొచ్చెను. నావమీఁద నందుఁడు నృత్యముచేయసాగెను. నందునిజూచి నావలో నున్న జనులు నాట్యమాడ నారంభించిరి. వారాడఁజూచి పడవవాఁడు తెడ్డొకమూలఁ బాఱవైచి నర్తన మారంభించెను. ఎవ్వరు నడపక యే పడవ పదినిమిషములలో నొడ్డుసేరెను.

చేరినతోడనే నందుఁడు నావమీఁదనుండి క్రిందికిదుమికిపడవ కేవిచ్చుటకుఁ దన జాలెములోఁ దాను బాటుపడి సంపాదించినడబ్బు లేమైన నున్నవేమోయని వెదకికొనుచుండఁ బడవవాఁ డదిగ్రహించి "స్వామీ! నీవు మాలవాఁడవు కావు. నిన్ను దేవుఁడు తనలో నైక్య ము చేసికొనెను. నేను మాలవాఁడను. నీభక్తుఁడను. నేను బడవకేవు నీయొద్దఁబుచ్చుకొనఁజాల"నని మ్రొక్కిపలికెను. పడవలోఁ గూర్చుం డిన మనుష్యులందఱు నందునితోఁ బదినిమిషములుమాత్రమే సహ వాసముచేసియు నాస్వల్పకాలములోనే యతఁడు మహాత్ముఁడని గ్రహించి వానికి భక్తులైరి. పడవవాఁడు తనపడవవదలి వాని నాశ్ర యించెను. వర్తకుఁడు తనసరకుల నావలనైచి వానికడ నిలిచె. కాఁ పువాఁడు తననాగలిమీఁద దృష్టిబోనీయక నందునే చూడసాగెను. అందఱు గుంపుఁ గూడి నడుమ నందుని నిలిపి యతనితోఁగూడి నా ట్యముచేయ నారంభించిరి. చిదంబరగోపురము సుందరమై గంభీరమై వారికన్నులకుఁ గానఁబడెను. ఆగోపురమును జూచినకాలఁది నందుని యానందము మేరమీఱ నతఁడు మేనుమఱచి క్రొత్తశిష్యులతోఁ గలసి బడలికలేక యెక్కువగుననే నాట్యముఁ దొరిక్కెను. అట్లు నాట్యముసేయుచు నెడనెడ గోపురమువంక దృష్టి నిగిడించి భక్తి తత్పరుఁడై యిట్లని నటరాజును స్తుతియించుచుండు. "ఓదేవా! ఎవరి యాజ్ఞవలన నీబ్రహ్మాండములు క్రమము దప్పక తిరుగుచున్నవో, యెవనివలనై నీయాకాశము విశ్వమంతయు నిండియున్నదో, ఎవనిమ

హిమము నీపర్వతములు, నదులు, వృక్షములు చాటుచున్నవో యట్టి నిన్నుఁ దెలిసికొనుటకుఁ జిన్నదోమకన్న హీనుఁడనగు నాకుశక్యమా! ఈఁగకన్ననధముఁడనగు నేనునీచేఁసృష్టింపఁబడిన మహాసముద్రములోని జలబిందువు మాత్రమైనఁ జేయనుగదా! ఆజలబిందువు సయితము నాకంటె మిక్కిలి గొప్పది. గ్రీష్మకాలమందలి ప్రచండసూర్యతాపమును వర్షకాలమందలి చల్లనివానను సమానముగ భరించు నిసుకరేణువు సయితము నాకంటె నెక్కువదై నీకటాక్షమునకుఁ బాత్రమై యున్నది గదా? అనేకచంద్రమండలములు, సూర్యమండలములు, మహాసముద్రములు, పర్వతములు, నదీనదములు, మహారణ్యములు మొదలగువానితో నిండిన యీబ్రహ్మాండగేహమున కధిపతివైన యోపరమయోగీ! నీదృష్టికి నేనెంతవాఁడను. ఓ దేవదేవా! నాకన్నులయెదుట నున్న నీగోపురమువలె నేనును నిశ్చలుఁడనై నిలిచి మహాకాశమువంకఁ జూచుచు ఝంఝూమారుతములు వీచినను లెక్కసేయక యుండువాఁడ."

అట్లు కీర్తియించి నందుఁడు వారలఁ గలిసి మఱికొన్ని యడుగులదూరము ముందు కరిగెను. అప్పుడు గోపురముయొక్క యడుగుభాగము దేవాలయద్వారము వారికన్నులకుఁ గానవచ్చెను. అప్పుడు నందుఁ డినుమడించిన యానందముతో నీక్రిందివిధమునఁ బాడెను.
"ఇదిగోఁ గైలాసద్వారము. ఇదిమంచివారలకొఱకుఁ దెఱచియుండు ద్వారము, సత్పురుషుఁడు తిరిగిరాని ద్వారము. తొల్లిమణిక్కారను మహాత్ముఁడుకోవెలప్రతిధ్వని సేయునట్లు దివ్యగీతములు పాడుచుఁ బ్రవేశించిన ద్వారము. అప్పరను పరమయోగి వేదఘోషము సేయుచుఁ జొరఁబడిన ద్వారము. ఓమిత్రులార! బంధువులార! ఇక్కడనే యీశ్వరుఁ డున్నాఁడు. ఇక్కడనే లేఁడు. ఇక్కడనే భగవంతుఁడు సాకారుఁడై యున్నాఁడు. ఇక్కడనే నిరాకారుఁడయి యున్నాఁడు.

ఇందే యతఁడు నాట్యము సేయు, నిందేయతఁడు నిశ్చలుఁడై యుండు ను. ఇచ్చటనే మూర్ఖులు జ్ఞానవంతు లగుదురు. జ్ఞానులు మూర్ఖులగు దురు. ఇచ్చటనే యీశ్వరుఁ డాకాశమై జ్యోతియై యున్నవాఁడు. ఈదేవుఁడే సృష్టికర్త ప్రళయకారుఁడు.” ఈవిధమున స్తోత్రముచేయు చు వారు పావనమగు చిదంబరక్షేత్రముఁ బ్రవేశించి వికసింపని తామ రపువ్వుచుట్టు జుంజుమ్మని తుమ్మెదలు మ్రోయుచుం దిరుగునట్లు పాటలుపాడుచు గ్రామముచుట్టుం బ్రదక్షిణముచేసిరి. ఆదేవాలయ మున కధిపతులై రెండువేల తొమ్మిదివందల తొంబదితొమ్మిది దీక్షి తారులుండిరి. నటరాజస్వామితోఁగలిసి మూఁడువేలదీక్షితారు లగు దురు. దీక్షితారనఁగా బ్రాహ్మణగురువు. ఆనాఁటి బ్రాహ్మణులు సంస్కృతద్రావిడములు వేదశాస్త్రములు విపులముగఁ జదువుకొని విద్యకుఁ దోడుగ సత్ప్రవర్తన గలిగి యోగ్యతనే గౌరవించుచు వి భూతి పిండికట్లు పిల్లజుట్టుమాత్రమే కలిగి బ్రాహ్మణవేషధారులగు నీకాలపు బ్రాహ్మణులతో నెందును బోలిక లేకయుండిరి. ఆదీక్షితా రులు నందునివెంటవచ్చి వానికంటె నగ్రవర్ణము వారయ్యు వాని కంటె నధములుగాఁ దమ్ముభావించుకొని వానితోపాటు గుడి ప్రవే శింపక యున్న యనుచరులను జూచి యాశ్చర్యము నొందిరి. అందుఁ గొందఱు నందుని మొగమున దేటపడుచున్న బహ్మజ్ఞానమును వాని యందలి యీశ్వర తేజస్సునుం గనిపెట్టిరి. నందుఁడు, వాని శిష్యులు బాడినకీర్తనల శ్రావ్యముగ నాలకించిరి.

ఆప్రదక్షిణములు చేయునపుడు నందుని యుత్సాహము మును పటికంటె వేయి రెట్లధికమయ్యెను. వాని మొగమున వికాసము హె చ్చెను. అదిశరత్కాలము. నందుఁడు ప్రదక్షిణము చేయునప్పటికి సాయంకాలమయ్యెను. ఆదినము కార్తికశుద్ధద్వాదశి యగుటచే నాఁటిరాత్రి యాకాశసరోవరమధ్యమున మొలచిన తెల్లతామరపువ్వు

చందంబునఁ జందమామ యుదయించి మహీమండలమంతయుఁ జల్లని కిరణముల వ్యాపింపఁ జేసి చూచువారలను మహానందసముద్రమున నోలలాడించెను. ఆ చంద్రమండలమునుఁ జూచి నందుఁడు లోని యానంద ముప్పొంగఁ "జందమామ! చందమామ! నన్నుఁ దెలిసికొనెడు దారిఁ జూపు చందమామ" యని పాటలు పాడెనఁట. తక్కినశిష్యులందఱు వానితోఁ గలిసి పాడిరి. అతఁడా సమయమునఁ బాడినపాట లనేకములు కలవు. అవి ద్రావిడభాషలో నుండుటచేత నిందుదహరించుటకు వీలులేదు. చిదంబరములో నడుగు వెట్టినది మొదలు నందుఁడు మూర్తీభవించిన భక్తిరసమో యన్న ట్లు తనశిష్యులతోఁ గలిసి మూఁడుదినము లహోరాత్రములు విసుగువిరామములేక నాట్యమాడి పాటలుపాడి భగవత్కైంకర్యము చేసెను. మూఁడవనాఁటిరాత్రి చిదంబరములోనున్న దీక్షితారులందఱకు నొక్కసారియే స్వప్నము కలిగెనఁట. ఆస్వప్నములో నటరాజస్వామి సాక్షాత్కరించినందుఁడు మాలవాఁడయ్యు మహాభక్తుఁ డగుటచే వానిని నిరాకరింపక బ్రాహ్మణోత్తమునిగ భావింపవలయు నని యాదేశించెనఁట. మఱునాఁడుదయమున దీక్షితారులందఱుఁ గాలకృత్యములం దీర్చుకొని స్నానములఁ జేసి యనుష్ఠానముల నిర్వర్తించుకొని మొగముల విబూదిపెండెకట్లు మెఱయ మెడల రుద్రాక్షమాలికలు వ్రేల దేవాలయమునకుఁ బోయి సభచేసిరి. ఆసభలో నప్పయ్యదీక్షితారను వృద్ధబ్రాహ్మణుఁడు లేచి తనకు నటరాజస్వామి స్వప్నములోఁ బ్రత్యక్షమై యగ్నిస్నానముచేయించినందుని బ్రాహ్మణులలోఁ గలుపుకోవచ్చునని పలికినట్లు సభాసదులకు విన్నవించెను. వయసున నతనికిఁ గనిష్ఠుఁడగుఁ ఉప్పన్న దీక్షితారు తనకుఁ గూడ నప్పయ్య దీక్షితారునకుఁ బోలె కలవచ్చెనని విన్నవించెను. అంతట సుబ్బదీక్షితారు లేచి పైయిరువురు పెద్దలకు నమస్కరించి

తనకుఁగూడ నట్టికలయె వచ్చెననిచెప్పి స్వప్నసామ్యమున కచ్చెరు వడెను. నటరాజదీక్షితారు నట్లే చేసెను. అనంతరము దీక్షితారు లొక్కరొక్కరె లేచి భగవంతుఁడు తమకుఁగూడ నట్లే యాదేశించె నని చెప్పిరి. అంతట దీక్షితారు లందఱు మట్టమధ్యాహ్నము మిడి మిడి యెండలో నొక పవిత్రమైన యగ్నినిర్మించిరి. ఈనడుమ నందుఁడు భక్తివిశేషముచే మూర్ఛిల్లి యప్పుడప్పుడే మేలుకాంచి "నటరాజస్వామి బంగారుపాదములసన్నిధికి నేఁ బోవుచున్నాఁడ" నని యొకపాటపాడసాగెను. ఆపాట ముగిసినపిదప నందుఁడు మఱియొక పాట పాడఁబోవ నెంతకాలము ప్రార్థించినను నటరాజు దర్శనమీయనందుకుఁ జింతాక్రాంతుఁడు కాఁగా గానముచేయుటకు దుఃఖముచేత గొంతు స్వాధీనము గాకపోయెను. అంతలో దీక్షితా రులు వానికడకుఁ బోయి యతఁడు విస్మయమొందునట్లు వానికి నమస్కరించి తమయద్భుత స్వప్నమెఱిఁగించి తమ సిద్ధముచేసిన యగ్నిహోత్రమున్న దక్షిణవీధికిఁ గొంపోయిరి. పరమభాగవతసత్త ముఁడగు నందుఁడు తన్నిమిత్తమేర్పడిన యగ్నిహోత్రమును జూచి యదియు నటరాజస్వామి యనియే భావించి "నాతండ్రియగు నీశ్వ రుని పాదములు చందమామ కిరణములకన్న మలయమారుతము కన్నఁ దేటయూట నీటికన్నఁ దుమ్మెద ఝుంకారములతోనుండు తమ్మిపూలకన్నఁ జల్లఁగా నున్న" వని పలుకుచు నాయగ్నిహో త్రమునం బ్రవేశించెనఁట. ప్రవేశించి మేను కాలకుండ నొకసారి యైన నబ్బాయని బాధపడకుండ శరీరమునకు మచ్చయైనలేకుండఁ జెక్కుచెదరక చల్లనికోనేటిలో దిగి మరలివచ్చి నట్లె నందుఁ డగ్ని నుండి యావలకు వచ్చెనఁట. వచ్చిన యాచండాల బాలునిం జూచి వేదమూర్తులవంటి బ్రాహ్మణోత్తములు దీక్షితారు లిట్లనిరఁట. నందా! నీవుపరమపవిత్రుఁడవు. నిన్నగ్ని దహింపలేదు. జలము తడు

పలేదు. వాయు వార్పలేదు, ఖడ్గము నీమేను పరివేశింపలేదు. నీవు బ్రాహ్మణుఁడవు. నీలోనుండు చండాలత్వ మంతయుఁ గాలిపోయినది. నీవిప్పు డసంపూర్ణుఁడవు. సంపూర్ణుఁడవు, నిరాకారుఁడవు। సాకారుఁడవు, నంతర్వర్తివి, బాహ్యవర్తివి. ఆకాశముకంటె విశాలరూపము గలవాఁడవనియు మహాపర్వతములకంటె సున్నతుఁడవనియు వేదములు ఘోషించుచున్నవి. నీవు స్త్రీవి కావు. పురుషుఁడవు కావు. అచేతనుఁడవు కావు. నిన్నెవ్వ రెఱుంగలేరు. నీవు జ్ఞానాగ్నివలన దగ్ధుఁడవైతివి. ఆమహాగ్ని భూత భవిష్యద్వర్తమానములయందగు నీయజ్ఞానములను గాల్చివేసినది.

అట్లు బ్రాహ్మణులకు వంద్యుఁడై నందుఁడు పరమపవిత్రుఁడయ్యెనఁట. అట్లు మానవుఁ డగ్నిహోత్రములోఁ బడి చెక్కుచెదరక బ్రతికివచ్చుట సాధ్యమగునా యని చదువరులలో ననేకులకు సంశయము కలుగవచ్చు. వారిసందేహనివారణమున కొకయుత్తరముకలదు. నందుఁ డగ్నిహోత్రములో దుమికెనాయని మనము సందేహింపనక్కఱలేదు. మతావేశము ప్రబలమైనప్పుడు మనుష్యులున్మత్తులవలెఁ బ్రవర్తింతురు. నోటికి శూలములు వేసికొనువారు ముండ్లపాన్పులమీఁదఁ బండుకొనువారు, మండువేసంగిలోఁ బంచాగ్ని మధ్యమునఁ దపములు సేయువారు, వర్షశీతకాలముల నీటనిలిచి నీమములు జరుపువారు, నిరాహారులై మేనుఁ గృశింపఁ జేయువారు, మెడకు గండకత్తెరలు వేసికొనువారు హిందువులలో నేఁటికి సైతమెందఱులేరు? తురకలు పీర్లపండుగలో నగ్నికుండములు చేసి పరుగుపరుగున నానిప్పుల కుప్ప మీఁద నడచి మేచేటును బొందకుండ నీవలకు వచ్చుటలేదు? ఆవిధంబుగనే నందుఁడుగూడ భగవంతుఁడే తనకుం దోడని నమ్మినవాఁ డగుటచేఁ దనయేలినవాఁ డగు నీశ్వరుఁడే తన్ను నిరపాయముగ నీవలకుఁ దోడ్కొని వచ్చునని దృఢ

విశ్వాసము గల్గి యా నిప్పులమీఁదనుండి నడచిపోయి యుండ వచ్చును. ఈ విధముగా నగ్నిప్రవేశము జరిగియుండ వచ్చును. అంతియెకాని చాలసేపు చిచ్చులోఁ గూర్చున్నవాఁడనియు దేహము వస్త్రములుఁ గాలలేదనియు నమ్ముటకు వీలులేదు.

అట్లు పావనమైన యగ్నిం బ్రవేశించి వెలుపలకు వచ్చిన తోడనే నందునకు మనస్తాపముతీరెను. అపరిపూర్ణత్వముపోయి పరిపూర్ణత్వము వచ్చెను. దుఃఖమంతయు విచ్చు మొగ్గై సౌఖ్యము గలిగెను. తొల్లిటి మాలతనము పోయి నిజమైన బ్రాహ్మణత్వము కలిగెను. అనంతరము దీక్షితారులు స్వస్తి చెప్పుచు నందుని దేవాలయమునకుఁ దీసికొనిపోయి నటరాజస్వామిని జూపిరి. తల్లినెడఁబాసి దుఃఖపడు బాలుఁడైన జనని కనఁబడినప్పు డంతయాత్రితతోఁ బోఁడు. ఆవు నెడఁబాసిన దూడయైనఁ దల్లిం జూచినప్పు డంతవేగముగాఁ బరుగెత్తదు. మకరందాసక్తిగల గండుతుమ్మెదయైన వికసించిన తామరపువ్వునొద్ద కంత దమకముతోఁ బోదు. నందుఁడు తన చిరమనోరథమగు నటరాజస్వామిని జూచినప్పుడు వానికిఁ గలిగిన యానందము వాని మన స్సెఱుంగును. సర్వభూతాంతర్యామియగు భగవంతుఁ డెఱుంగును. కాని మనుష్యమాత్రు లెఱుఁగరు. అది కవులు వర్ణింపలేరు. వర్ణింపఁదలఁచినను మాటలు దొరకవు. ఏతావునందుఁ దొల్లి యప్పారను మహాభక్తుఁడు నిలిచి నాస్తికులనైన యాస్తికులఁజేయు కృతులుపాడి యీశ్వరుఁబొగడెనో యేనెలవునందు మున్ను మణిక్కాౘరను సత్పురుషుఁడు నిలువంబడి యుపనిషత్తులతో మహేశ్వరుం గొనియాడెనో యేచోట భక్తసార్వభౌముఁడగు తాయమన్నారు నయనారవిందంబులనుండి బాష్పమకరందబిందువులుదొరగఁ దత్ప్రదేశంబు ప్రతిధ్వనులెసఁగ నీశ్వరమహిమానువర్ణనముఁ జేసెనో యేస్థలమును లోకోపకారపరాయణులగు పరమభాగవతోత్తములు

తమ పాదధూళి పరిసారములచేతఁ బవిత్రముచేసిరో యాచోటున నిలిచి నందుఁడు కనకసభయనివ్యవహరింపఁ బడు బంగారుమండపమున గంటలు ఖంగుఖంగుమని మ్రోయుచుండ నటరాజస్వామిని గన్నులారఁజూచి చేతులార మ్రొక్కి మనసార ధ్యానించి సంతుష్టాంతరంగుఁడయ్యెను. అప్పు డప్పయ్యదీక్షితారు దీపారాధనచేసి మాలబ్రాహ్మణు నెదుటఁ బెట్టుకొని నటరాజదేవు నారాధించెను. నందుఁడు తనవంటి భక్తుల కేయసభ వైకవేద్య మగు బ్రహ్మానందముతోఁ దన యేలినవానిని గఱవుదీర నొక్కసారి కౌఁగలించుకొనియెను. అప్పుడు చూచు వారందఱు మహాద్భుతము నందఁ గ్రొత్తగా మాలతనముబాసి బ్రాహ్మణుఁడైన యానందుఁడు పరమేశ్వరమహిమను గానముచేయుచు నటరాజస్వామిలో నైక్యమై సాయుజ్యముక్తిని బొందెనఁట. అప్పుడతఁడు పాడినపాట యర్థమీక్రింది విధమున నున్నది. "నటరాజ నటరాజనాస్వామి నేను వచ్చెదనన్నుఁ గొనిపొమ్ము మనమిద్దఱ మొకటే, నీవే నేను నేనే నీవు."

అట్లు నందుఁడు పరమేశ్వరునిలో నైక్యముగుటయు, నప్పయ్యదీక్షితారు మొదలగు బ్రాహ్మణోత్తములు విస్మితులై కొంతసేపు నిశ్చేష్టులై నోట మాటరాక తెల్లపోయిచూచుచుండిరఁట. పిమ్మటఁ గొంతసేపటికి వారికిఁ దెలివివచ్చుటయు వారు నటరాజస్వామి నీక్రింది విధమున స్తుతియించిరఁట. "నందుఁడు నీభక్తుఁడై వానిమనస్సు నీ కర్పించెను. నీదాసునిభక్తిరసము పరమపావనములగు నీపాదారవిందములు కడుగు జలమయ్యెను. అతని యాత్మ నీకునైవేద్యమయ్యెను. అతని ప్రాణము నీకు హారతియయ్యెను. ఇదియొక్కనాఁడు చేసినది కాదు. బ్రతికియున్నంతకాల మతఁ డట్లు చేసెను. నీవు వేదపుష్పమకరందమవు. నీవు వేదామృతంబవు. నీవుబ్రహ్మానందమవు. నీవు మహానటుఁడవు. పరంజ్యోతివి. పరమదయాళుఁడవు. నాశనరహితుఁడవు.

ఇక్కడికి నందునికథ ముగిసినది. ఈచిన్నకథలో నద్భుతము లు మహిమములుఁ గొన్ని కానఁ బడుచున్నవి. అన్నిఁటికన్న ముఖ్యమైన యద్భుతము నందుఁడు పరమేశ్వరునితో నైక్యమగుట. పురాణాదులలోఁ జెప్పఁబడిన చిత్రకథలన్నిటిని విమర్శింపక నమ్మువారికి నందుని సాయుజ్యముక్తి యద్భుతముగాఁ గానఁబడదు. కాని లోకానుభవమును జక్కఁగా గుర్తెఱిఁగి విమర్శనబుద్ధితో నీచరిత్రమును జదివినవారు మాత్రము దానిని నమ్మరు. ఈసాయుజ్యముక్తి విషయకమైన యథార్థస్థితి యిట్లుండనచ్చును. నందుఁడునటరాజస్వామిదర్శనము చేసినపిదప మునుపటికంటె నెక్కుడుగ భక్తినెఱపుచు లోకవ్యవహారవిముఖుఁడై పరమేశ్వరసేవఁ జేయుచుఁ దనజీవితశేషముఁ గడపి లోకులచేత నుత్తమోత్తముఁ డనిపించుకొని మరణమొంది యుండవచ్చును. అట్టిసజ్జనులు మరణమొందినప్పుడు మనవారు సర్వసాధారణముగ నతఁడు భగవంతునితో నైక్యమొందెనని చెప్పుచుందురు. అంతేకాని యొకమనుష్యుఁడు లోకులందఱుఁ జూచుచుండ నంతర్ధానము నొంది భగవంతునితోఁ గలిసిపోవుట యసంభవము. నందునికంటె నెక్కుడు భక్తిగలవారు విశేషజ్ఞానముకలవారు నానకు చైతన్యప్రముఖులు శంకరరామానుజాదులు సయితము తక్కిన మనుష్యులవలె మృతినొందిరి. మఱియు భగవంతుని యవతారముల ని పురాణములలోఁ జెప్పఁబడిన శ్రీకృష్ణబలరాములు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు సైతము ప్రాకృతమనుజులట్లు కాలధర్మమునొందిరి. అటులుండ సామాన్యమనుష్యుఁడైన నందుఁడు బ్రతికియుండఁగానే సాయుజ్యముక్తిఁ బడసినాఁడను లోకవిరుద్ధమై యుండకమానదు. ఈయాక్షేపణము విన్నవారు కొందఱు మనపూర్వులనేకులు జీవన్ముక్తులయిరని పురాణములవల్ల వింటిమి. నందుఁడు కూడ నట్టిజీవన్ముక్తుఁడు కాఁగూడదాయని యడుగవచ్చును. జీవన్ముక్తియన నెట్టిదో

యించుక తక్కింతము. శంకరాచార్యుడు తన ద్వాదశమంజరికా స్తోత్రమునందు జీవన్ముక్తి నీక్రిందివిధముగ వర్ణించియున్నాడు.

శ్లో. సత్సంగత్వే నిస్సంగత్వం। నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం। నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥

సజ్జన సహవాసమువల్ల నిస్సంగత్వము గలుగును. నిస్సంగత్వమువల్ల నిర్మోహత్వము గలుగును. నిర్మోహత్వమువల్ల నిశ్చలమైన యీశ్వర జ్ఞానము గలుగును. ఆనిశ్చలజ్ఞానము వల్ల బ్రతికి యుండియు ముక్తిపొందిన వాఁడగు నని యీశ్లోకము యొక్క యర్థము. జీవన్ముక్తుఁ డనఁగా బ్రతికి యుండియు ముక్తిఁబొందిన వాఁడు వలె నేయాసలులేక నేకోరికలు లేక నిరంతరము పరమానంద భరితుఁడై యుండు మనుష్యుఁడని యర్థము గాని యొక్కసారి యువ్వెత్తుగ నెగిరి స్వర్గముఁజొరఁబడువాఁడని యర్థముకాదు. సజ్జనసహవాసముచేసి కోరికల జయించి బ్రతికియున్నంతకాలము బ్రహ్మజ్ఞాని యైయుండుట యే జీవన్ముక్తి.

నందుని చరిత్రముఁ జదువుటవల్ల మనము మఱియొక ముఖ్య విషయము నేర్చికొనవచ్చును. ఈశ్వరభక్తునకు వర్ణభేదముతో నవసరములేదు. అతఁడు వేదములు చదువనక్కఱలేదు. శాస్త్రములు చూడనక్కఱలేదు. గంగాదిపుణ్యనదులలో స్నానముచేయనక్కఱలేదు. భక్తియే యీశ్వరుని వశపఱచుకొనును. భక్తియే మనుష్యుని నుద్ధరించును. భక్తియే మోక్షమునకు సోపానశ్రేణి. ఇదియే యీకథ ఫలితార్థము.

సమాప్తము.




(మొదటిభాగము - బంగాళము).

# రాజా రామమోహనరాయలు

రామమోహనరాయలు బంగాళా దేశమునందలి, హుగ్లీమండలములలో ధారానగరమున క్రీస్తుశకము 1774 వ సంవత్సరమున జననమొందెను. అతనితండ్రి రమాకాంతరాయలు, చిన్న జమీందారయియుండి, కొంతకాలము మూర్షదాబాదు నవాబులయొద్ద నుద్యోగముచేసి యాప్రభువులు రాజ్యభ్రష్టులైనపిదప బర్ద్వాను మహారాజునొద్ద కొలువుచేసెను. రామమోహనునితల్లి తారిణీదేవి. సత్ప్రవర్తనకును ,యోగ్యతకును బ్రసిద్ధికెక్కెను. అతని తలిదండ్రు లిరువురు దైవభక్తిగలవారును, మతవిషయమునఁ బట్టుదలగలవారు నైరి. ఆదినములలో పారసీభాషయే రాజభాషగానుండుటంజేసి, రామమోహనుఁడు బంగాళీభాషఁ గొంతనేర్చినవెనుకఁ దొమ్మిదివత్సరముల ప్రాయమున నరబ్బీ, పారసీభాషలు నేర్చుకొనుటకై పాట్నానగరమునకుఁ బంపఁబడెను. అచ్చట రెండుసంవత్సరములలోఁ గుశాగ్రబుద్ధియగునాతఁ డాభాషలలో నుద్గ్రంథము లనేకములుచదివి, సంస్కృత విద్యాభ్యాసముఁ జేయుటకయి పండ్రెండవయేటఁ గాశీకానగరమునకుఁ జని యాభాషలోఁ గొలఁదికాలములోనే బండితుఁడై యుపనిషత్తులంజదవి, తత్సారమును గ్రహించెను. రామమోహనుఁడుపనిషదర్థముఁదలఁ

చి గ్రహించి తనపదునాఱవయేటనే బంగాళిభాషలో విగ్రహారాధన ము నిషేధించుచు నొకగ్రంథము వ్రాసెను. ఇదియే బంగాళీభాష లో మొట్టమొదటి వచనకావ్యము. విగ్రహారాధనము హిందువులు ప్రమాణముగ గ్రహించుచున్న వేదశాస్త్రములచేత నిషేధింపఁబడి నదనియు, మనపూర్వు లగుమహర్షుల మతమున కిదవిరుద్ధమనియు, జనులందఱు శిలావిగ్రహార్చనము విడిచి యేకేశ్వరారాధనము సేయ వలసినదనియు, నీగ్రంథమున నతఁడు స్థాపించెను. తనకొడుకు సనా తనధర్మ మగు విగ్రహారాధనము ఖండించుచున్నాఁడని విని రమా కాంతరాయలు కోపపరవశుఁడై యాయకార్యమునుజేసినందుకు రా మమోహనుని యింటనుండి వెడలనడిచెను. బాల్యమింకను గడచిపో వకమునుపే స్వతంత్రముగ జీవించుటకు తెక్కలురాకమునుపే, యా గర్భశ్రీమంతుఁడై చిన్ననాఁటనుండియుఁ గడుగారాబమునఁ బెఱిగిన యాబాలుఁడాకస్మికముగఁ దండ్రిచే నింటనుండి వెడలనడుపంబడియు స్వభావమున గంభీరుఁడగుటచేత హిందూదేశమునఁ బలుతావులుఁదిరి గి యెట్టకేలకు హిమాలయపర్వతములు దాఁటి టిబెట్టుదేశమునకుఁ బోయి బౌద్ధక్షేత్రమగు లాసానగరముంజొచ్చి యచ్చటిభాషల నల వఱచుకొని,బౌద్ధమతసిద్ధాంతముల గ్రహించెను. ఆస్తికుఁ డగు రా మమోహనుఁడు నాస్తికు లగునచటి బౌద్ధులతో నీశ్వరవిషయములగు చర్చలంజేయ వాదములు ముదిరి భేదములై తుదకు వానికిఁ బ్రాణ భయము నాపాదించెను. మతద్వేషముచేత బౌద్ధగురువులు నిష్కార ణముగా నాబాలునిఁ గడతేర్పఁ బ్రయత్నింపఁగా నచటిస్త్రీలు కొం దఱు వారికడుపుచల్లఁగ వానిని రహస్యముగ దాచి బ్రతికించి యావ లకుఁ బంపిరి. అందుచేత నాఁటనుండి స్త్రీలయెడల గడుఁ గృతజ్ఞుఁడై వారికష్టములఁ దొలఁగింప, నాతఁ డామరణముఁ బ్రయత్నించెను. కొడుకిల్లువెడలుటమొదలు వానికొఱకయి బెంగఁగొని తండ్రిమరల

వానిని బిలిపించి యాదరించెనుగాని, క్రమ్మర నాతఁడు బ్రాహ్మణుల మతాచారములను ఖండించుటచేతఁ దండ్రి వానిని రెండవమారింట నుండి సాగఁదోలెను. తరువాత గొంతకాలమునకు రమాకాంతరాయలు లోకాంతరగతుఁడుగాఁ దారుణీదేవి కడుప్రీతిపిచేఁ గొడుకును బిలిపించి యింట నిలుపుకొనెను. రామమోహనుఁడంతటమస స్థిమితము గలవాఁడయి యిరువదియవయేఁడు మొదలు యిరువదియాఱవయేఁడు వఱకు నింగ్లీషుభాషయందుఁ గృషిచేసి, దానింజులకఁగఁజదువ వ్రాయఁ గలిగెను. ఆభాషకుఁ దోఁడు హెబ్రించి, లాటిను, గ్రీకు, హీబ్రూభాషలయందు సయితమాతఁడు పరిపీణుఁడయ్యె నని చెప్పుదురు. క్రీస్తుశకము 1800 వ సంవత్సరమున రామమోహనుఁడు రంగపురము కలక్టరగు డిగ్బీదొరగారి కచ్చేరీలో చిన్నగుమాస్తాగాఁ బ్రవేశించెను. కాని దొర యాపిన్నవాని చాకచక్యమును దెలివితేటలును గనిపెట్టి, తనయెనుటికి కతఁడు వచ్చినప్పుడు నిలువఁబెట్టి పని పుచ్చుకొననియు చిన్నగుమాస్తాల కుత్తరువుచేయునట్లు చేయననియు, వాగ్దానముచేసెను. ఆచిన్నయుద్యోగమునుండి యతఁడు క్రమక్రమముగ జిల్లాసిరస్తదారుఁడయి తనకృత్యములనుజక్కగనెఱవేర్చి యధికారులమెప్పొందె, 1813వ సంవత్సరమున నుద్యోగముమాని శేషమగుజీవితకాలము లోకోపకారార్థము గడపఁదలఁచి 1814వ సంవత్సరమున గలకత్తానగరమునఁ గాపురముండవచ్చెను. అతఁడు కలకత్తానగరము వచ్చునప్పటికి, మన దేశస్థితి యెటులుండెనో యించుక చెప్పవలసియున్నది. బంగాళాదేశమున శాక్తేయమతమును,చైతన్యుని వైష్ణవమతమును వృద్ధిలో నుండుటచే, శాక్తేయులకు వైష్ణవులకుమతద్వేషములు తఱచుగఁ గలుగుచు వచ్చెను. నరబలులు, శిశుహత్యలు, దేశమందంతటఁ బ్రబలియుండెను. వానికిందోడుగ నతిభయంకరము నమానుషంబు, నసహ్యమున్నగు సహగమన మనుదురాచారమొకటి భారతఖండమం

దంతటను, ముఖ్యముగ వంగదేశమందును దృఢముగనాటుకొనియుం డెను. ఈసహగమనమును భర్తృవియోగముచే నీలోకమున బ్రతుక నిచ్ఛలేక గొందఱు పతివ్రతలు, మనఃపూర్వకముగఁ జేయుచువచ్చిరిగాని, కాలక్రమమున వితంతువు నెట్లో కాల్చిచంపి, యాస్తి వేసికొననలయు ననుజ్ఞాతులును, లోకనిందకు జంకిన బంధుగులును, మగఁడు చనిపోవుటచే నగము వచ్చియున్న యాఁడుదాని యొద్దఁ జేరి, మృతభర్తతో సహగమనముఁ జేసినదానికిఁ బుణ్యముగలుగుననియుఁ గుటుంబమునకు సత్కీర్తి సంఘటిల్లుననియు, వేనోళ్ళఁ బొగడి మనసు విఱిచి భయముపెట్టి, బలవంతముగ నాస్త్రీచే నొప్పించియు, నొప్పుకొననిచో విఱిచికట్టియు స్మశానమునకుఁ దామె దీసికొనిపోయి మండుచున్న నిప్పులపైఁ బడవేసి హృదయము గరగించు నామె యేడ్పు లెవ్వరికి వినఁబడకుండ, భేరీలు వాయించి, నడుమనడుమ మనస్సహమగు బాధచే నామె లేవఁబోయినప్పుడు, వెదురుకఱ్ఱలచేఁ ద్రొక్కి యడఁచిపెట్టించి, యెట్లో నిండుప్రాణముఁ దీసి, కృతార్థులగుచు వచ్చిరి. 1815 వ సంవత్సరము మొదలు 1828 వ సంవత్సరమువఱకు నొక్క కలకత్తానగరమునందే దాదాపుగ నైదువేలమంది సుందరు లీఘోర మరణముపాలైరి. అశాస్త్రీయము నతిక్రూరము ననార్యము నగు నీ పరిత్యక్త రాక్షస కృత్యములఁ జూడలేక రామమోహనరాయ లా దురాచారమును మాన్పుటకయి ప్రయత్నింప నిశ్చయించుకొని కలకత్తానగరము వచ్చినది మొదలు ఆవిషయమై పాటుపడి, యాయాచారమును దుడుముట్టించి భరతఖండస్త్రీలకుపకారము చేయుఁడని దొరతనమువారికి, పలుమాఱు మహజర్లుబంపియుఁ దద్విషయమై తాను కొన్ని చిన్నగ్రంథములను వ్రాసియు, నుపన్యాసములిచ్చియుఁ, బండితులతో వాగ్వాదములు చేసియు, జనులకు దానిక్రౌర్యమున బోధింప సాగెను. కొందిమంది జనులు రామమోహనరాయలు పక్షమువహించిరి

గాని, లక్షోపలక్షలుపూర్వాచారపరాయణులయి సహగమనము లేక పోయినచో హిందూమతము చెడిపోవుననియు, సనాతనమయిన యా యాచారమును గొట్టివేయక నిలుపవలసినదనియుఁ బ్రిభుత్వమువారికి మరల మహజర్లఁబంపిరి. ధాంసులగుపండితులు, రామమోహనరాయలను నిందించుచు గ్రింథములు వ్రాసిపబ్లిజలమెప్పొగనిరి. అప్పటి గవర్నరుజనరలుగారగు లార్డువిలియంబెంటిక్కు దొరగారు రామమోహనరాయల వాదములు యుక్తియుక్తములుగ నున్నవని గ్రిహించి లోకోపకారకమగు నతనియుద్యమమునకుఁ దోడ్పడి యాదురాచారపిశాచము నడుగంటఁ ద్రొక్కఁదలఁచి 1829 వ సంవత్సరముడిశంబరునాలుగవ తారీఖున సహగమనము నిషేధించుచు నొకచట్టము నిర్మించి పుణ్యము గట్టుకొనెను. చూచుటకు, వినుటకుఁ దలఁచుకొనుటకు సయితము నతిదారుణమగు నీయాచారమును నిర్మూలము చేసిన మహానుభావుఁడు రామమోహనరాయలగుటచే భరతఖండమునందలి స్త్రీపురుషు లందఱు నాచంద్రతారకముగ నతనికిఁ గృతజ్ఞులయి యుందురు గాక! రామమోహనరాయలు కలకత్తాకువచ్చిన క్రొత్తలో వేదాంతశాస్త్రమును వేదాంతసారమునుబంగాళీభాషలోనికిఁదర్జుమా చేసెను. 1816-17 వ సంవత్సరములలో నతఁడు ముఖ్యములగు నుపనిషత్తులనింగ్లీషుభాషలోనికిబంగాళీభాషలోనికిభాషాంతరీకరించెను. ఇట్లు వేదాంతరహస్యముల బయలుపఱచినందుకు పూర్వాచారపరాయణులు రామమోహనుని నిందింప నారంభించిరి. ఈమహాత్ముఁడు సంస్కృతముఁజదివి వేదశాస్త్రముల శోధించుటయేగాక అరబ్బీభాష నేర్చుకొనితురకలవేదమగు ఖురానుజదివి, హీబ్రూ, గ్రీకుభాషల నేర్చుకొనిక్రైస్తవులవేదమగు బైబిలు పఠించి తద్గ్రింథముల సారములు గ్రహించి దోషముల బైలుపెట్టనారంభించెను. 1820వ సంవత్సరమున నితఁడుయేసుక్రీస్తుధర్మములనుగూర్చి, బంగాళీసంస్కృతభాషలలో గ్రంథములువ్రా

స్థ్రీప్రకటించి యందు క్రీస్తు మతగురువగును గాని, దేవునికుమారుఁడగుట యబద్ధమని వ్రాసెను. ఇందుచే నచ్చటి క్రైస్తవమతబోధకులకును, రామమోహనునకును గొప్పవివాదములు బైలుదేర క్రైస్తవులు వ్రాసిన దానికి రామమోహనుఁడును, రామమోహనుఁడు వ్రాసినదానికి క్రైస్తవులును నుత్తరప్రత్యుత్తరముల నిచ్చుకొనుచు వచ్చిరి. ఇంతవఱకు రామమోహనుఁడు తానువ్రాసినగ్రంథములన్ని క్రైస్తవమతబోధకుల ముద్రాయంత్రములోనే యచ్చువేయుచు వచ్చెను. ఆమతబోధకులు రామమోహనుని వాక్యములు యుక్తియుక్తములుగ నుండి జనుల యాదరణ బడయుచుండుటచే నీర్ష్యఁ జెంది యతఁడు తమవ్రాఁతల ఖండించుచు నిచ్చిన కడపటి ప్రత్యుత్తరము నచ్చువేయమనిరి. రామమోహనుఁడు పంతము వచ్చినప్పుడు తీసిపోవువాఁడు కాఁడు గావున దానే స్వయముగ నచ్చుకూటమును గొని తనగ్రంథము నచ్చొత్తించెను. ఈయిరువురగ్రంథము లింగ్లాండునకుఁ బోయినప్పు డచ్చటివారు, బంగాళా బ్రాహ్మణుని యుక్తులకును, సర్వతోముఖ పాండిత్యమునకును, వాదనైపుణ్యమునకును జాల మెచ్చుకొనిరి.

ఈసత్పురుషునకుఁ బరిశుద్ధమగు నుపనిషన్మతముపై నభిమాన మెక్కుడు గలుగుటచే భగవద్ధ్యానము నిమిత్తము కలకత్తానగరములో నాత్మసభయను పేర నొకసభ నేర్పఱచెను. పిమ్మట వేదాధ్యయనమునభివృద్ధి చేయఁదలఁచి వేదమందిరమను నొకపాఠశాలను 1817వ సంవత్సరమున స్థాపించెను. ఈమతములోఁ జేరినవారందఱు ప్రార్థనాదికములు చేసికొనుటకు 1830వ సంవత్సరమున నతఁడు బ్రహ్మమందిరమునొకదానిని గట్టించి, దానిపోషణకయి కొంతమూలధనముసయితమొసంగెను. హిందువులకు, మహమ్మదీయులకు, క్రైస్తవులకు నుపయుక్తముగ నుండునటుల నొకమతము నిర్మింపఁదలఁచి, యుపనిషత్తులలోనున్న పరమార్థమును గ్రహియించి, యీమతమును గల్పించెను;

ఆయన వేదములనుమాత్రమే ప్రమాణములని యొప్పుకొనక, బైబిలు, ఖొరాను, జండవస్తమొదలగు మతగ్రంథములలోనున్న సత్యమును ధర్మమును గ్రహింపవలసినదేయనియు, నని యన్నియువేదములవలెఁ బ్రమాణములేయనియు, నమ్మి ప్రజలకు బోధించుచుండెను. బ్రహ్మసమాజమే, పూర్వఋషుల పరిశుద్ధాస్తికమతమని యాయన గట్టిగ నమ్మెను. తాను మతసిద్ధాంతములను, సంస్కరణవిషయములను, ప్రకటించుటకయిసంబంధకౌముదియను నొకపత్రికను స్వభాషలోఁ బ్రకటించుచు వచ్చెను. అతని ప్రతిపక్షులందఱుఁ జేరి ధర్మసభ యనుపేర నొకసమాజము నేర్పఱచి చంద్రికయను నొకపత్రికను బ్రచురించి రామమోహనుని నిందించుటయే ప్రధానముగఁ జేసికొనిరి. మతసంస్కారమందేగాక, సంఘసంస్కరణమునందును నాతఁడు గట్టిపనిచేసెను. స్త్రీపునర్వివాహములు శాస్త్రీయము లనియు, నింద్యములు కావని యునతనియభిప్రాయము. బంగాళాదేశములో కులీనులనునొక తెగబ్రాహ్మణులు గలరు. వారిని పరమపావనులని యచ్చటిజనులు నెక్కుడు గారవింతురు. పవిత్రులగు కులీనబ్రాహ్మణులతో సంబంధము చేయుటకడుగౌరవమని యెంచి యాదేశబ్రాహ్మణులు తమకన్యలకుఁ దగు వరులు దొరకనందున వేలకొలఁది హూప్యముల కట్నములనిచ్చి,యొక్కొక్కకులీనునకు ముప్పది, నలువది, ఏఁబది, యొకప్పుడు నూఱుమంది కన్యలను గట్టఁబెట్టెడి యాచారము గలదు. ఇట్లు వివాహము చేసికొన్న భర్త మృతినొందినప్పుడు నూఱుగురుభార్యలు సహగమనము చేయవలసి యుండెను. దగ్గరనున్నవారు భర్తతోఁ గలిసియు, దూరమున నున్నవారు మగనియొక్క గుడ్డపేలికయో, మఱియే వస్తువో తెప్పించి మీఁద వేసికొని తమున్న యూళ్ళలోఁ జిచ్చుఱికి శరీర త్యాగము చేయుచుందురు.

రామమోహనుఁడే ముగ్గురుభార్యలను వివాహము చేసికొనెను.

మొదటిభార్య చిన్నతనమందే మృతినొందుటంజేసి, యాయన మఱియొకకన్యను వివాహము చేసికొనెను. ఈధర్మపత్ని జీవించియున్నపుడే రామమోహనునకుఁ దండ్రిగారు మఱియొకకన్యనుఁ బాణిగ్రహణముచేయించిరి. బహుభార్యాస్వీకారమువలనఁ గలుగు నష్టములను స్వయముగఁ జూచుటఁజేసి యాదురాచారమును నిర్మూలించుటకయి యతఁడు పరియత్నించెను. కాని వెంటనే కృతకృత్యుఁడు గాఁడయ్యె. ఈసంస్కారములుగాక దేశమున కతఁడింక ననేకోపకారములు చేసెను.

హిందువులకుఁ బాఠశాలలు స్థాపించియాంగ్లేయభాష నేర్పింపుఁడని గవర్నరు జనరలుగారగు, అమ్హారష్టుపరిభువుగారి కొకయుత్తరము వ్రాయుటయేగాక, నిరువురు దొరలతోఁ గలిసి 1817 వ సంవత్సరమున హిందూకళాశాలలు స్థాపించెను. బంగాళీ భాషలో వచనకావ్యములు వ్రాయుటకు దారిదీయుటయేగాక, యాభాషలో లలితపదగర్భితములగు కృతుల ననేకములు రచించెను. ఆకృతులు వంగదేశపు స్త్రీపురుషులిప్పటికిని బాడుచుందురు.

రామమోహనునకుఁ జిరకాలమునుండి యూరపుఖండమును ముఖ్యముగ నింగ్లాండుదేశమును జూడవలయుననియభిలాష యుండెను. స్వదేశమునఁ దనతోడిప్రజలకుఁ జేయవలసిన సత్కార్యములనేకములుండుటంజేసి యదివఱకతనికిఁ బోవీలు చిక్కఁదయ్యె. 1830వ సంవత్సరమున నతనియభిలాషకు ననుగుణముగ నొకయదను గలిగెను. అప్పటిఢిల్లీచక్రవర్తి, పేరునకుమాత్రము సార్వభౌముఁడయి యుండి యేలుటకు రాజ్యము, ననుభవించుటకైశ్వర్యము లేక, తనదీనదశ నింగ్లాండులోని పార్లమెంటు మహాసభవారికిఁ దెలియఁ జేసికొనఁగోరి తాస్వయముగఁ బోఁజాలక తనపక్షమున సీమకుఁ బొమ్మని రామమోహనుని బ్రార్థించి యతనికి రాజాయను బిరుదము నిచ్చి, తగుధనమిచ్చి పంపెను. తనయభిలాషకు, ఢిల్లీశ్వరుని బనికిం దోడుగ రామమోహనునికిఁ గర్తవ్యమిం

కొకటి యుండెను. సహగమనమునిచ్చుటి గవర్నరుజనరలుగారు మా
న్పించిరనుకోపమునఁ బూర్వాచారపరాయణులు, ప్రాచీనమగునాయా
చారమును నిలుపుఁడని పార్లమెంటువారికి పలుమహజర్లనంపిరి. రామ
మోహనుఁడు గవర్నరుజనరలుగారు చేసినపని మంచిదనియు, నాయా
చారము తుదముట్ట నిర్మూలింపవలసినదనియు, ప్రజలవలనఁ గొన్నిమ
హజర్లు వ్రాయించి వానిం జేకొని, స్వయముగ పార్లమెంటువారికి సమ
ర్పింపఁ దలఁచి 1830 వ సంవత్సరము నవంబరు 15 వ తారీఖున నతఁ డింగ్లాండునకుఁ బయనమయిపోయెను. మన మెఱిఁగినంతవఱకు సముద్రి
యానము చేసిన బ్రాహ్మణులలో నితఁడే మొట్టమొదటివాఁడు. అతనికీ
ర్తియతనికన్నముస్నే యింగ్లండునకుఁ బోయి నెలకొనియుండుటచేవా
నినందఱు గారవించిరి. రాజదర్శనము స్వయముగఁ జేయుటయే గాక
యాయనపట్టాభిషేక సమయమున, రామమోహనరాయ లన్యదేశపు
రాయబారులతో సమానముగ గౌరవింపఁబడెను. ఆకాలమున నా దే
శంబుననున్న కవీశ్వరులు, తత్త్వశాస్త్రజ్ఞులు, చరిత్రకారులు, ప్రకృతి
శాస్త్రపండితులు వానిపరిచయము చేసికొనుట గౌరహేతువని యెంచి
స్వయముగ వచ్చి చూచియు, జాబులువ్రాసి ప్రత్యుత్తరములఁదెప్పిం
చుకొనియుఁ దనివినొందిరి. హిందూదేశపు రాజకీయవ్యవహారములవి
షయమై రామమోహనుఁడు పార్లమెంటుకమిటీవారియెదుట కడునిపు
ణముగ సాక్ష్యమిచ్చెను. సహగమనము నుద్ధరింపవలయునని ఛాందసు
లు పంపినమహజర్లు పార్లమెంటుసభవారు విచారణసేయునపుడు రామ
మోహనుఁడు స్వయముగ నచటనుండి తానుదెచ్చిన మహజర్లువారికిస
మర్పించి, చెప్పవలసినసంగతులఁ జెప్పి యాయాచారమురూపుమాయు
నట్లు చేసెను. 1831 వ సంవత్సరముననాతఁడు ఫ్రాన్సు దేశమునకుఁబో
యియచట కొంతకాలమునుండి ఫ్రెంచిభాష నేర్చికొనెను. అచటను
న్నకాలములో నతఁడు ఫ్రెంచిరాజునుసందర్శించి రెండుమూడుమారు

లాయనతో విందు లారగించి గౌరవపాత్రుఁడయి యింగ్లాండునకువ
రలవచ్చి యాంగ్లేయభాషలో కొన్ని గ్రంథములువ్రాసెను. ఆగ్రంథము
ల శైలికిని, నిపుణత్వమునకును, మంచిమంచియింగ్లీషుకవులువాని నగ్గ
డించి మెచ్చుకొనిరి. ఇట్లుయూరపుఖండములో సుప్రసిద్ధుఁడయి కీర్తి
గాంచిన, యామహాపురుషుఁడు మరల స్వదేశమునకు వచ్చి తనయా
త్రావిశేషములఁ దనమిత్రులకుఁ దెలుప నతనికి కాలము లేదయ్యెను.

1833 వ సంవత్సరము సెప్టెంబరునెలలో డాక్టరు కార్పెంటరు
దొరగారు వానిని బ్రిస్టలునగరమునకుఁ బిలుచుకొనిపోయి, గౌరవిం
చెను. అక్కడనుండఁగ నాయనకు, సెప్టెంబరు 10 వ తారీకున జ్వర
ముతగిలెను. పరిజ్ఞానవంతులగు వైద్యులెన్నిచికిత్సలఁ జేసినను, కార్పెం
టరుదొరగారెన్ని శ్రమలఁబడినను, నవియెల్లనిరర్థకములుకాఁగా హిం
దువులభాగ్యదోషమున రామమోహనరాయలు సెప్టెంబరు 27 వ తే
దీనికాలధర్మము నొందెను. అక్కడిమిత్రు లామహాత్ముని బ్రిస్టలు నగర
సమీపమున భూస్థాపితము చేసిరి. పిమ్మట పదిసంవత్సరములకు రామ
మోహనుని ప్రియమిత్రుఁడగు ద్వారకనాథ ఠాగూరుగారు సీమకుఁ
బోయి యాపురుషశ్రేష్ఠునకు నొకసమాధి గట్టించి ధన్యుఁడయ్యెను.

పదునాలుగేండ్ల వయసు వచ్చినదిమొదలు దేశమునిమిత్తము,
దేశస్థులనిమిత్తము, పలుకష్టములఁబడి, యాసుజనుఁడు తుదకు పరదేశ
మున బంధుమిత్రులు లేనిచోట దేశోపకారార్థమై ప్రాణములవిడిచె
ను. ఈలోకోపకారకుని ఋణము భరతఖండవాసు లెన్నటికిని దీర్చు
కొనఁజాలరు. ఈతఁడు కార్యశూరుఁడు. అవసరమయినయపుడు సక
లకష్టములకు లోనై ధైర్యముతో నిలిచి తనకు మంచిదని తోచెడు
కార్యమును నిర్వహించెడువాఁడు, తయామయుఁడు ధర్మశాలి. స్వ
గౌరవమును జక్కఁగఁ గాపాడుకొనుచు నీతిమార్గము ననుసరించువాఁ
డు. మతవిషయమునను స్వదేశవిషయమునను బ్రతిమనుష్యునకు స్వా

తంత్ర్యముండఁదగునని యతనివాదము. ఒకనాఁడు డాక్టరు మిడిలుటన్ అను క్రైస్తవమతబోధకుఁడు రామమోహనునిం బిలిచి క్రైస్తవమత మునంగలియుమనిబోధించి దానివలనబలు కుబడి, ధనము, నధికారము, గౌరవము, కలుగునని నొక్కిచెప్పెను. ఆమాటలువిని రామమోహనుఁ డుకోపోద్దీపితుఁడయితుచ్ఛగౌరవములు సంపాదించుటకయి తానుమత ముమార్చుకొనననని వానితోస్పష్టముగఁ జెప్పియానాఁడుమొదలా దొర గారితోస్నేహము మానెను. గ్రంథవిస్తరభయమున మానవలసెఁగాని రామమోహనుని యౌదార్యవినయశాంతగుణములను దెలుపుకథ ల నేకములున్నవి. అంతటి నీతిశూరుఁడు, లోకోపకారియు, మరలనిప్పటి వఱకును మనభరతఖండమున జనియింపకపోవుటయే, యాతఁడుసుగుణ సంపదలోనద్వితీయుఁడనిచెప్పుటకుఁదార్కాణము. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనునుపనిషద్వాక్యమును నమ్మి యాతఁడు విగ్రహారాధన మునిరాకరించి పరిశుద్ధాస్తికమతము నవలంబించెను. గావున దయామ యుఁడగునాపరబ్రహ్మమే యాతనియాత్మకుశాశ్వతానందమిచ్చుఁగాత

---

# ఈశ్వరచంద్రవిద్యాసాగరులు.

హిందూదేశమున మృతిబొందిన భర్తతో చిచ్చునంబడి చావవలసిన యాఁడువాండ్రను బ్రతికించి దేశమునకు మహోపకారము జేసినయతఁడు రామమోహనరాయలు. అతనిప్రసాదమున బ్రతికినవితంతువులను యావజ్జీవ మిహలోక నరకమగు వైధవ్యమునుండి తప్పించి వారినిమరల ముత్తయిదువలఁ జేసి పసపుకుంకుమలు నిలిపిన పరమోపకారి యీశ్వరచంద్ర విద్యాసాగరులు.

ఈయన బంగాళాదేశ కులీన బ్రాహ్మణుఁడు. ఈతఁడు 1820 వ సంవత్సరమున హుగ్లీమండలములోని వీరసింఘు గ్రామమున నొకనిరుపేదకుటుంబమునఁ బుట్టెను. వాని తాతయగు రామజయబెనర్జీ సన్యాసియై దేశాటనముఁ జేయుచుఁ గాలక్షేపము చేసెను. తండ్రియగు ఠాకరుదాసుబెనర్జీ యొకవర్తకునియొద్ద నెలకు పదిరూపాయల వేతనముగలచిన్న యుద్యోగియయి యుండెను. ఈశ్వరచంద్రుఁడు తన యూర బడిలోనున్నంతవఱకు విద్యనేర్చుకొని తొమ్మిదిసంవత్సరములు ప్రాయమువచ్చినపుడు సంస్కృత కళాశాలలో విద్యనభ్యసించుటకుఁ గలకత్తానగరమునకుఁ బంపఁబడియచ్చట ధర్మశాస్త్రము, వేదాంతశాస్త్రము, కావ్యాలంకారములు, జ్యోతిశ్శాస్త్రము మొదలగువానిని నేర్చి యనేకబహుమానము లందెను. అతఁడు తనపదియేడవయేట పండితకోర్టుమునసబుగా నుండఁదగిన పరీక్షయందుఁ దేరెను. ఆకాలమునం దాపరీక్షలో గృతకృత్యుఁడగుట మిక్కిలి కష్టము. అతఁడా పరీక్షను దేరినతోడనే దొరతనమువారు వానికి న్యాయాధిపతి యుద్యోగము నొసంగిరిగాని యాయూరతిదూరమునను౦డుటచే వానితండ్రి కొడుకును దూరమునకుఁ బంపుట కిష్టములేక యు

ద్యోగము మానిపించెను. అందుచేత విద్యాసాగరుఁడు మఱికొండుసంవత్సరములు కళాశాలలోఁ జదువుకొని సాంఖ్య వైశేషికాది షడ్దర్శనములు నేర్చి ప్రవీణుఁడయ్యె. 1838 వ సంవత్సరమున నాతఁడుచక్కని శైలితోఁ జక్కని సంస్కృతవచనమును వ్రాసినందుకు నూఱురూప్యములును బద్యకవిత్వము జెప్పినందు కేబదిరూప్యములును బారితోషికము బడసెను. మరుచటి సంవత్సరమున నీశ్వరచంద్రుఁడు హిందూధర్మశాస్త్ర పరీక్షయందుఁ గృతకృత్యుఁడయి విద్యముగించి విద్యాసాగరుఁ డను బిరుదమును బడసెను. గీర్వాణభాషనభ్యసించుచుకాలముననే యప్పుడప్పు డించుక యింగ్లీషుభాషను సయితమాతఁడు నేర్చుకొనెను. ఈశ్వరచంద్రుఁడు మొట్టమొదట సంస్కృత కళాశాలలో వ్యాకరణపండితుఁడుగఁ గొంతకాలము పనిచేసి, పిమ్మట 1840 వ సంవత్సరమున ఫోర్టువిలియం కళాశాలలో నెలకు నేబదిరూపాయలు జీతముగల ప్రధాన పండితుఁడుగా నియమింపఁబడెను. ఈ కాలమున దేశాభిమానులలో నగ్రగణ్యుఁడగు బాబు సురేంద్రనాథ బెనర్జీగారి తండ్రిగారగు దుర్గాచరణ బెనర్జీగారి సాహాయ్యమున నీశ్వరచంద్రుఁ డప్పు డప్పుడు మిగులశ్రద్ధతో నాంగ్లేయభాష నభ్యసించెను. 1841 వ సంవత్సరమున సంస్కృతకళాశాల కతఁడు సహాయకార్యదర్శిగా నియమింపఁబడి యాయుద్యోగమున నున్నప్పుడే బేతాలపంచవింశతి యను బంగాళి వచన కావ్యము నొకదానిని వ్రాసి ప్రచురించెను.

ఈశ్వరచంద్రుని పరిశుద్ధశైలియు, రచనా చమత్కృతియుఁ గనుఁగొని దేశస్థులందఱు బంగాళిభాష నంతసవంతముగ మనోహరముగ వ్రాయుటకు వీలున్నదని యప్పుడు గ్రహించిరి. ఆయుద్యోగమున నున్నప్పు డాయనపలుమార్పులఁ జెచ్చి కళాశాలను వృద్ధినొందించెనుగాని చిరకాలముండలేదు. 1846 వ సంవత్సరమున నతఁడు ఫోర్టువిలి

యన్ కళాశాలలో నెల కేనఁబది రూపాయలు జీతముగల మొదటిగు మాస్తాగానే ప్రవేశించియచట నున్న కాలములో నేస్త్రీవిద్యావిషయము న నాదినములలోఁ గడుబరిశ్రమచేసిన బెత్యూన్ దొరగారి స్నేహము సంపాదించెను. మరుచటి సంవత్సరమున మరల నతఁడు సంస్కృత కళాశాలలోఁ దొంబది రూపాయిల జీతముగల పండితుఁడుగాఁ జేరి కొలఁదికాలములోనే యాకళాశాలా ప్రధానోపాధ్యాయుఁ డయ్యెను. మన పండితులు సంస్కృతభాషను విద్యార్థులకు సుబోధకమగు నట్లు తెలుపలేక శిష్యులను బాధపెట్టి తాము బాధపడుటఁ జూచి విద్యాసాగరుఁడు సంస్కృత కళాశాలకుఁ బ్రధానోపాధ్యాయుఁడుగా నున్న కాలమున గీర్వాణభాషను బాలురు చులకనగానేర్చుకొనుటకుఁ గొన్నిపద్ధతులను గనిపెట్టెను. నాఁటనుండియుఁ సంస్కృత విద్యా భ్యాసము సులభ సాధ్యమయ్యె. 1851వ సంవత్సరమున వాని మిత్రుఁ డగు బెత్యూన్ దొర కాలధర్మమునొంద నప్పటి బంగాళా దేశపు గవర్నరు హాలిడే యనునతఁడు బెత్యూన్ పాఠశాలకు విద్యాసాగరు నధికారిగా నేర్పఱచెను. 1885 వ సంవత్సరమున నీ పండితశిఖామణి హుగ్లీ, నద్యా మొదలగు నాలుగు జల్లాలకు పాఠశాలా పరీక్షాధి కారిగ నియమింపఁబడి నెల కయిదువందల రూపాయిల జీతము నార్జింప నారంభించెను. ఈ యుద్యోగమునందున్నపుడె యాతఁడు హుగ్లీ, బర్ద్వాన్ మండలములలో నలువది బాలికాపాఠశాలలు స్థాపించెను.

ఆ కాలమున బంగాళాదేశమునందలి పాఠశాలలకు "యంగ్" ను నొక దొరగారు డైరెక్టరుగా నుండిరి. ఆయన యించుక యధికార గర్వము గలవాఁడగుటచే స్వతంత్రబుద్ధిగల విద్యాసాగరునకుఁ దనపై యధికారితో సరిపడక పొరపులు గలుగుచు వచ్చెను. ఇట్లు క్రమ క్రమముగ మనస్పర్థ లధికమగుచుండ నొకనాఁడు దొరగారు

విద్యాసాగరునిం బిలిచి హిందూకళాశాల ప్రిథానోపాధ్యాయుని యొద్దకుఁ బోయి యొకమాట చెప్పిరమ్మని యాజ్ఞాపించెను. విద్యాసాగరున కాపని స్వగౌరవ భంగకరముగాఁ దోఁచినందునఁ దనతో దొరగారుగూడ వచ్చిన యెడలఁ దానచ్చోటికిఁ బోవుదుననియుఁ దానొక్కఁడు బోనొల్లననియు నతఁడుత్తరము చెప్పెను. విద్యాశాఖ కెల్ల సర్వాధికారియగు తన్నుఁ దనచేతిక్రింది యుద్యోగస్థుఁడు తిరస్కరించుటచే దొరగారు కోపించి నీ విది చేయకతప్పదని విద్యాసాగరునితోఁ బలికెను. విద్యాసాగరుఁడు వెంటనే జేబులోనుంచి యొక కాగితముఁ దీసి తన యుద్యోగమునకు విడుదల వ్రాసియిచ్చి నాకిష్టము లేనిపని చేయుట యిప్పుడు తప్పునా! యని యడిగెను. బంగాళాదేశపు గవర్నరగు "హాలిడే" యనునాతఁ డీశ్వర చంద్రునకు నాప్తమిత్రుఁ డగుటచే నుద్యోగమును మానుకొనవలదని యతఁ డెన్నివిధములనో విద్యాసాగరుని బ్రతిమాలెను. కాని వాని ప్రార్థనలు విద్యాసాగరుని నిశ్చలచిత్తమును జలింపఁ జేయఁజాలవయ్యెను.

ఈ విధముగ దొరతనమువారికొలువు కడముట్టసేయక నడుమనే ముగించి విద్యాసాగరుఁడు నిర్వ్యాపారుండుగాక తన దేశమునకు మునుపటికంటె నినుమిక్కిలిగా నుపకారముఁ జేయఁగలవాఁ డయ్యె. బుద్ధి సర్వతోముఖవ్యాప్తముకాగా నాతఁడు బహుగ్రంథ నిర్మాతయయి విద్యావిశారదుఁడై సంఘ సంస్కారకుఁడైఁ భూత దయాళువై జన్మము చరితార్థముగఁ జేసికొనెను. బంగాళీభాషలో వాని వ్రాతలు మృదువులై మధురములై పరిశుద్ధములై శయ్యా సౌష్ఠవమునకుగణుతి గావించినవి. పై నుదాహరింపఁబడిన గ్రంథములు గాక బంగాళా దేశచరిత్రము, సత్పురుషుల జీవచరిత్రము, బోధోదయము, సీతా వనవాసము మొదలగు గ్రంథములు రచించి ప్రచురించెను. ఇవిగాక సంస్కృతమున కాళిదాస ప్రణీతమగు శాకుంతల

నాటకమును బంగాళీలోనికి భాషాంతరీకరించెను. స్త్రీవిద్యయన్నచో నీతని కభిమాన మెక్కుడగుటచే దద్విషయము యావజ్జీవము నధిక పరిశ్రమ జేసెను. "బెథ్యూను" పాఠశాల యభివృద్ధినొందుటకుఁ గారణము విద్యాసాగరునకు దానిపైఁగల యభిమానము దానివిషయ మయి పడిన పరిశ్రమ కారణములని గ్రహింపవలెను. స్త్రీ విద్య యెడల నీయనకుఁగల యాదరమునుబట్టి బెథ్యూన్ కళాశాలలో మూడవతరగతిలోఁ జదువుకొని ప్రవేశపరీక్షకుఁ బోవఁదలఁచు హిందూబాలికకు విద్యాసాగరుని జ్ఞాపకార్థము విద్యార్థివేతన మొకటియిప్పటికి నీయఁబడుచున్నది. సర్వకళాశాలలలో నాంగ్లేయ పండితులుపాధ్యాయులయి యెంతచక్కఁగఁ బనిచేయుదురో స్వదేశీయులు నట్లే యింగ్లీషుభాషలో పండితులై యుపాధ్యాయులై కళాశాలల నిర్వహింప సమర్థులని లోకమునకుం దెలియజేయుటకయి విద్యాసాగరుఁడు మెట్రొపాలిటన్ కాలేజనుపేర నొక కళాశాలను స్థాపించెను. ఇది బంగాళాదేశములోని సర్వకళాశాలలలో శ్రేష్ఠమయిన దని కీర్తిబడసినది. దొరతనమువారి క్రింది యుద్యోగమును మానుకొనుటచే నాతనికి ధననష్ట మించుకయుఁ గలుగలేదు. పాఠశాలలలో బాలురు చదువుట కుపయుక్తములగు పుస్తకము లదివఱకు బంగాళీ భాషలో లేమింజేసి విద్యాసాగరుఁ డుద్యోగము మానిన పిదప నట్టి గ్రంథములు వ్రాసి ప్రచురించెను. ప్రతిపల్లెయందు ప్రతిపాఠశాలయందు ప్రతిబాలకుఁడు వాని గ్రంథములనే జదువుటచే నాతనికి రమారమి నెల కైదువేల రూపాయలాదాయము కొంతకాలము మూడువేల రూపాయలు రాబడి కొంతకాలమును వచ్చెను. బంగాళా దేశపు పాఠశాలలలో నిప్పటికిని వానిచేత రచియింపఁబడిన సంస్కృత గ్రంథములు బంగాళీ గ్రంథములు చదువఁబడుచున్నవి. ఆ భాషలో రచనా చమత్కృతిగల పండితు లిటీవల బహు గ్రంథ

ములు రచించిరిగాని యవి విద్యాసాగరుని గ్రంథములకు సరిపోల వయ్యె. అందుచేత బంగాళీభాష కతఁడు గ్రంథరూపమునఁ జేసిన మహోపకారమునకు వానియెడ దేశస్థులు కృతజ్ఞులై యున్నవారు.

సంఘసంస్కార విషయమున విద్యాసాగరుఁడు చేసినపని యసమానము. ఇతఁడే హిందూదేశమున స్త్రీపునర్వివాహముల నుద్ధరించిన ప్రథమాచార్యుఁడు. ఇతఁడీపనికిఁ బూనుటనుగూర్చి యొక చిన్న కథగలదు. వాని దగ్గర చుట్టములలో నొకనికూఁతు రతిబాల్యమున వితంతువయ్యెను. తలిదండ్రి లామెం దోడ్కొని మార్గవశమున నీ పండితునియింటికి రాఁగా విద్యాసాగరునితల్లి యాబాలిక చక్కఁదనమును లేఁబ్రాయమును జూచి దుఃఖపడి కొడుకు దగ్గఱకు బోయి నాయనా! నీవింత పండితుఁడవు. ఈబాలికను దుర్గతినుండి తొలగించి వివాహము చేయుటకు శాస్త్రములయం దెచ్చట నాధారములేదా? యని యడిగెనఁట. తల్లిమాటల నాదరముతో విని బాలికయవస్థకుఁ దాను మనసు కరుగవగచి యానాఁడు మొదలతఁడు స్త్రీపునర్వివాహ విషయమున నాధార ములున్నవో లేవో కనుఁగొనుటకై శాస్త్రములు శోధించెను. 1854 వ సం॥ న నతఁడు స్త్రీపునర్వివాహము శాస్త్రీయమని సిద్ధాంతీకరించి విధవావివేకమను పేర నొక చిన్నగ్రంథము వ్రాసెను. ఆపుస్తకము బయలువెడలిన తోడనే బంగాళా దేశమంతయు సంక్షోభను జెందెను. పూర్వాచార పక్షమునను సంస్కారపక్షమునను దేశమునందంతట ననేకసభలు జరిగెను. వాదప్రతివాదములు ప్రచురింపఁబడెను. వంగదేశమునందంతట వ్యాకరణ శాస్త్రమున నసమానుఁడని పేరువడిన యొకమహాపండితుఁడు విధవావివేకమును ఖండించుచు నొక గ్రంథమును సంస్కృతమున వ్రాసెను. ఆగ్రంథము జనులకుఁదెలియని దేశభాషలోనుండుట చేత జనులా గ్రంథమును జదువలేక స్వభాషలో రచింపఁబడినవిద్యా

సాగరుని పుస్తకమును జదివి దాని సత్యమును గ్రహించిరి. ఈశ్వర చంద్రుని ప్రోత్సాహముచేత దొరతనమువారు స్త్రీపునర్వివాహములు చేసికొన్నవారికి పిత్రార్జితమగు నాస్తిలో భాగములు పోవని శాసించుచు 1856వ సం॥న నొకచట్టమును నిర్మించిరి. అదిమొదలు తద్విషయమున బాటుపడి యా మహాత్ముఁడు 1865వ సం॥డిశంబరు 7వ తారీఖున కలకత్తాలోఁ దనయింటిలో మొదటి స్త్రీపునర్వివాహమును జేసెను. అది యకార్యమని యతనిని దేశస్థులు తూలనాడిరి. కులస్థులుబహిష్కరించిరి. ఆప్తబాంధవు లావలకుందొలంగిరి. ప్రాణమిత్రులు బరిత్యజించిరి. ఎల్లకాలము నతని ప్రక్కను నిలిచి పనిచేయుదుమని వాగ్దానములుచేసిన పెద్దమనుష్యులు మొగముల చాటువేసిరి. ఇట్లు దేశస్థులచే విడువఁబడియు విద్యాసాగరుఁడు తనకావించినకార్యంబుశాస్త్రసమ్మతమనియు జగద్ధితకరమనియు నీతిప్రవర్తకమనియునమ్మి యించుకయే నియుఁ జలింపకధైర్యసారముగలిగి పర్వతమువలె చెక్కుచెదరకనిలిచి వివాహము వెంబడిని వివాహము జేయనారంభించెను. ఈపెండ్లిండ్లు వైభవముతోఁ జేయుటంజేసి యిత డప్పులపాలయ్యె. ఆసమయమున ధనికులగుమిత్రులనేకులువచ్చి ద్రవ్యసహాయముచేసి యాదుకొనుటకు రాఁగా విద్యాసాగరుఁడు వారివలన నించుకేనియు సహాయముఁగొనక యాభారము తానేవహించెను. ఇతరులకు ధర్మోపన్యాసములు చేసి తాము దూరమున నుండునట్టి యీనాటి సంఘసంస్కారులుకొందఱివలెఁగాక యాపండితుఁడు తనపూనినపనియందు నిజమయినయభిమానముగలవాఁడగుటచేఁ దనకుమారున కొక వితంతుబాలికను వివాహము చేసి చెప్పెడు మాటలకును జేసెడు చేతలకును వైరుధ్యములేదనిజగంబునకు వెల్లడిచేసెను. ఈతెఱంగున పునఃపరిణయంబునఁ గృతకృత్యుఁడై యంతతోఁదనివినొందక విద్యాసాగరుఁడు కులీనపద్ధతియనుదురాచారముపై ధ్వజమెత్తి దానినినిర్మూలించుటకుఁ బాటుపడెను. ఆదేశ

మున నగ్రిగణ్యులు కులీనబ్రాహ్మణులగుటచే వారిలో నొక్కొకఁడు నలువది యేఁబది యాఁడువాండ్రను బెండ్లియాడి యేభార్యతండ్రి యెక్కుడుకట్నములు కానుకలునిచ్చునో యాభార్య నాదరించుచు తక్కినవారల నిరాకరించుచు పడఁతులను బలువెతలపాలుసేయుచుండును. విద్యాసాగరుఁడు నోరులేని యంగనలపక్షముబూని యనేకసభలుచేసి క్రొత్తగొన కాదురాచారము నిర్మూలింప నొకచట్టము నిర్మింపుఁడని దొరతనమువారికి వేనవేలు జనులచేత వ్రాళ్లుచేయించి మహజర్లు నంపించెను. కాని వితంతువివాహవిషయమునందువలె నతఁడీకార్యమందు సఫలమనోరథుఁడు కాఁడయ్యె. హిందువులు వేదశాస్త్రములు తమకుం బ్రమాణములని వాదములు సలుపుటచే స్త్రీపునర్వివాహాది కార్యము లకార్యములుగావని యాగ్రంథములయందుఁ బ్రమాణవచనములు జూపినచో నంద ఱొప్పుకొందురని విద్యాసాగరుఁడు కొంత కాలము నమ్మియుండెను కాని శాస్త్రప్రమాణమును జూపినవెనుక నయితము హిందువులు పునర్వివాహాదుల నిరాకరించినప్పుడు నిజముగా హిందువులకు వేదశాస్త్రములయందునమ్మకములేదని యాతఁడిటీవల నిశ్చయించుకొనెను. బాలికలకుఁ గడుచిన్నతనమందె వివాహములు సేయుట దురాచారమని యాతని యభిప్రాయము. నమ్మినట్లు నడచుకొనునట్టి యంతఃకరణశుద్ధుఁ డగుటచే విద్యాసాగరుఁడు తనకూఁతులకు వ్యక్తిరాకముందు వివాహములు సేయఁడయ్యె.

విద్యాసాగరుఁడు దయాసాగరుఁడు. ఆర్తజనుల కాపద్బాంధవుఁడు. నిరుపేదలకు నిక్షేపము. మెరమెచ్చులదాత గాక యాతఁడు పేదలకొఱకు నవదలకొఱకు గతిలేనివారికొఱకు నగచి మనఃపూర్వకముగ ననేకదానములు చేసెను. మధుసూదనదత్తను బంగాళీకవీశ్వరుఁ డొకఁ డప్పులపాలయి ఋణములు దీర్పలేక చెఱసాలకుఁ బోవుటకు సిద్ధముగ నున్నపుడు విద్యాసాగరుఁడు ఋణప్రదాతల కాధన

మిచ్చి వాని విడిపించెను. స్థితిచెడియున్న మిత్రుల కుటుంబములకు బంధువుల కుటుంబములకు ధనసాహాయ్యముచేసి వారిగౌరవము చెడకుండునట్లు లేర్పాటులుచేసెను. స్వగ్రామమున బీదబాలురు విద్యనేర్చుకొనుటకై యొక ధర్మపాఠశాలను దనతల్లిపేర స్థాపించెను. తనయూరికిఁ బోయినపుడెల్ల నైదువందల రూపాయిలు విలువగల బట్టలుకొని తీసికొనిపోయి యచ్చట నిరుపేదల కుచితముగఁ బంచిపెట్టుచుండును. స్వగ్రామమున జనులసౌఖ్యమునకయి ధర్మవైద్యశాల నొకదానిని స్థాపించి దానికగు వ్యయమంతయుఁ దానేయిచ్చి నిలిపెను. "ఇండియన్ అస్సోసియేషన్" నను సభవారుకట్టించిన మందిరమునకు వేయి రూపాయిలు దాన మిచ్చెను. "హిందూకుటుంబభరణ నిధి" (Hindu family annuity fund) యనుపేర తక్కువజీతముగలవారి లాభము నిమిత్త మొకసంఘము వీని సహాయమువలననే బయలు వెడలెను. అది వంగదేశమునందలి సంఘము లన్నిటిలో ముఖ్యమయినదని చెప్పవచ్చును. 1868 వ సంవత్సరమున బంగాళమందు దారుణమగు కాటకము సంభవింప విద్యాసాగరుఁడు దొరతనమువారిని బురికొల్పి కఱవుచేఁ బీడింపఁబడువారికిఁ బనులుగల్పింపఁ జేసియు తాను స్వయముగ నన్నసత్రములు వేయించియు దరిద్రుల ననేకుల రక్షించెను. 1869 వ సంవత్సరమున బర్ద్వాను పట్టణములో మన్నెపు జ్వరములు బయలుదేర జనులు తగిన వైద్యసహాయము లేక వందల కొలఁది మృతినొందిరి. అప్పు డీశ్వరచంద్రుఁడు కావలసిన మందులు కొని యక్కడకుం గొంపోయి యచ్చటివారి కుచితముగఁ బంచిపెట్టి సాయము చేసెను.

విద్యాసాగరుఁడు పరులధనము చిల్లపెంకువలెఁ జూచునంతటి సచ్ఛీలుఁడు. ఒకమారతఁడు తనధనమంతయు లెక్కజూచుకొనుచుండ లెక్కలంబట్టి తనయొద్దనుండఁదగిన సొమ్ముకంటె నెక్కువ గానఁబడి

మె. అదిచూచి యీశ్వరచంద్రుఁడు మున్ను తాను పాఠశాలాపరీక్షాధికారిగా నున్నపుడు దొరతనమువారిసొమ్ము కొంతపొరబాటునఁ దన సొమ్ములోఁబడియుండునని యనుమానించి "ఎకౌంటెంటుజనరల్" గారికి వ్రాసియాధనమునుగ్రహింపుమని ప్రార్థించెను. ఆయన యాసొమ్ము దొరతనమువారికి రావలసిన పనిలేదని నొక్కి చెప్పినను వినక విద్యాసాగరుఁ డామిక్కిలిసొమ్ము దొరతనమువారికిచ్చి తనయంతరాత్మను సందేహమునుండి విముక్తిఁజేసెను. ఆహాహా! ఇట్టిపరిశుద్ధ చరిత్రమును ఋజుమార్గవర్తనమును గలవానిని వ్రేలుమడిచి చూపుట యెంతకష్టమో మీరే యెఱుంగుదురు.

"మిస్ మేరీకార్పెంట" రను దొరసాని కలకత్తానగరమునకు వచ్చి దేశమునందలి బాలికాపాఠశాలలను గొన్నిఁటిని జూడవలయునని కోరి వాని జూపుటకు విద్యాసాగరునిం దనవెంటఁ బెట్టుకొని పోయెను. అతఁడామె కాయాస్థానములం జూపి మరలివచ్చుచుండ మార్గమధ్యమున దైవవశమున బండి బోల్తపడ విద్యాసాగరుఁడుదెబ్బలచే స్మృతిదప్పి నేలంబడియె. తగుచికిత్సలు చేసిన పిదప కొంతకాలమున కతఁడు మరలఁ బూటుకొనియెఁగాని తొల్లిఁటి యారోగ్యము దేహదార్ఢ్యము వెండియు రావయ్యె. ఇట్లు దుర్బల శరీరముతోడనే తరువాతనిరువదియైదు సంవత్సరములు గడపెను. సొంతాలుపరగణాలో నున్నకార్మతారుగ్రామమును దనకు నివాసస్థానముగఁ జేసికొని యవసానకాల మచ్చటఁ గడప నిశ్చయించుకొని యతఁ డచ్చటికిఁ బోయియుండెను. 1890 వ సంవత్సరమున డిశంబరు నెలలో తనదేహస్థితి బొత్తిగ చెడిపోవుటచేఁ గొంతకాలము చంద్రసనగరమునకుఁ బోయియుండి యచ్చట స్వస్థతగానక చిట్టచివరకుఁ గలకత్తానగరముఁ జేరి యంతకంతకు క్షీణించి 1891 వ సంవత్సరము జూలై నెల 29 వ తారీఖున విద్యాసాగరుఁడు జీవయాత్రముగించిలోకాంతరగతుఁడయ్యెను.

1877 వ సంవత్సరము జనవరి యొకటవ తారీఖున విక్టోరియారాణీ హిందూదేశచక్రవర్తినీ మహాబిరుదము ధరించినప్పుడు కలకత్తాలో దొరతనమువారు విద్యాసాగరునకు నొక గౌరవపత్రికనుదయచేసిరి. 18౽0 వ సంవత్సరము జనవరినెలలో జరిగిన దర్బారులో దొరతనము వారతనికి సి. ఐ. ఇ. బిరుదము నిచ్చిరి. ఈమహాత్ముఁడు మహాధన వంతుఁడు విద్యావంతుఁడు కీర్తిమంతుఁడునయ్యు వేషభాషలలో సామాన్యులవలెనుండి నిగర్వచూడామణియై యుండెను. నిజమయిన దేశాభిమానమును బరోపకారబుద్ధిని ధర్మకార్యశూరత్వమును వీనియొద్దనుండియే నేర్చుకొనవలయును. విద్యాసాగరుఁడు కృపారసపూర్ణుఁడై గుణరత్ననిలయుఁడై గాంభీర్యనిధియై సత్వసంపన్నుఁడై భంగసంగతుఁడు గాక మరియాదనతిక్రమింపక సాగరశబ్దము తనయందు సార్థకమగునట్టు నడచిన లోకోత్తరచరితుఁడు. క్రిందియుద్యోగస్థులు స్వగౌరవమును జంపుకొని తమయధికారు లేకూఁతలు కూయుమన్న నవికూయుచు నేవ్రాతలు వ్రాయుమన్న నవి వ్రాయుచు నేచేఁతలు చేయుమన్న నవి చేయుచుఁ బ్రజలను వేధించు నీకాలములో నెలకై దువందల రూపాయిలు జీతము గలిగి యధికారము గలిగి గౌరవమును దెచ్చునుద్యోగమును దృణప్రాయముగ నెంచి వదలుకొన్న స్వతంత్రుఁడీ విద్యాసాగరుఁడే. ప్రజలపొగడ్తలకుఁ బొంగక దూషణలకు దుఃఖపడక బహిష్కారమునకు భయపడక కష్టములనుగణనసేయక తనకు ధర్మకార్యమని తోఁచినదానిని విడువక కొనసాగించి "పరోపకారార్థమిదంశరీర" మనుమాట సార్థకముచేసిన మహాత్ముఁ డీశ్వరచంద్రుఁడే. మెత్తని మనసుగలవాఁడయ్యు దృఢచిత్తుఁడు. పరమశాంతుఁడయ్యు దుష్టులకు భయంకరుఁడు. నమ్మినట్లాచరించుటయందును మనసులోనున్నమాట నిర్భయముగఁ బలుకుటయందును బరులసౌఖ్యముకై స్వసౌఖ్యమును మానుకొని కష్టపడుటయందును నతని కతండెసాటియనవచ్చును. అత

ని యౌదార్యము నతని వినయము నతని సౌజన్యము నతనిశాంతము వానివిద్యకు వన్నె వెట్టినవి. దేశమున కీతఁడొనర్చిన మహోపకారమునకు దేశస్థులలోఁ గొందఱు కృతజ్ఞులై వానిగుణగణంబులఁ గొనియాడుచు నెన్నియో పాటలు పద్యములు రచించిరి. అవి యిప్పటికిని బంగాళా దేశమున మారుమూలల సయితము పాడఁబడుచుండును.

# మహర్షి దేవేంద్రనాథ టాగూరు.

టాగూరనుమాట ఠాకూరను పదమునుండి వచ్చెను. ఈశబ్దమునకు జమీందారుఁడని యర్థము. కాఁబట్టి మహర్షి దేవేంద్రనాథటాగూరు మిక్కిలి గౌరవముగల జమీందారు కుటుంబములోనివాఁడనిమనము తెలిసికొనవచ్చును. ఈటాగూరుల సంస్థానము బంగాళాదేశములో జస్సూరుమండలమునయున్నది. దేవేంద్రనాథుని పూర్వులలోనొకఁడగు పంచాననటాగూరు స్వస్థలమును విడిచి కలకత్తానగరమునకుఁ గాఁపురము వచ్చెను. వానికొడుకు జయరామటాగూరు దొరతనమువారియొద్ద గొప్పయుద్యోగముఁ జేసి పాథుర్యఘట్టమున నొకసౌధముఁగట్టి సుప్రసిద్ధుఁడయ్యెను. అతని మునిమనుమఁడగు ద్వారకనాథటాగూరు దేవేంద్రనాథునితండ్రి. ఈతఁడు మిక్కిలియైశ్వర్యముగల జమీందారుఁడయ్యుఁ జక్కఁగ నిఙ్గ్లీషుచదువుకొని న్యాయవాదియై యాపనిలో నపారముగఁ గీర్తియు ధనమును సంపాదించి యంతతో నూరకొనక నిరువురుదొరలంగూడి వర్తకముఁ జేసి కోటీశ్వరుఁడయ్యెను. ఈయన రాజా రామమోహనరాయలకు సహకారియయి సహగమనము నడచివేయుటలోను హిందువుల కింగ్లీషుభాష నేర్పుటకయిహిందూకళాశాలను స్థాపించుటలోను వానికిఁ జాలఁ దోడ్పడి కుడిభుజమట్లుండెను. అంతియగాక రామమోహనుం డింగ్లాండునకుఁ బోయినపిదప వానిచే నెలకొలుపఁబడిన బ్రహ్మసమాజమున కీతఁ డధ్యక్షుఁడయి దానినినిలిపెను. ఎఱిఁగినవారందఱు నితనినిమహారాజా ద్వారకనాథటాగూరనుచుండెడివారు. వానియౌదార్యము మితిమీఱినదగుటచే వంగదేశమునం దేసత్కార్యమును దలపెట్టినను వీనిసాయములేక యది నెరవేరదయ్యె. ఈయనకీర్తియూరపుఖండమునందును హిందూదేశమునందునుసమానము

గవ్యాపించి యుండెను. ఇతఁడు 1841 వ సంవత్సరమున యూరపుఖండమునకుఁబోయి యింగ్లాండు పారిస్సు మొదలగు దేశములకుఁజని యచ్చటి రాజులచేత సముచితముగ మిక్కిలి గౌరవింపఁబడియెను. ఈతఁడిగ్లాండునకుఁ బోయినతోడనే దేశోపకారార్థమై వచ్చి యచ్చట మృతినొందిన రామమోహనరాయల కొరకు గోరి కట్టించెను. యూరపునుండి మరుచటిసంవత్సర మతఁడువచ్చి మరల 1845 వ సంవత్సరముననింగ్లాండునకుఁ బోయి 1846వ సంవత్సరమున తనప్రియమిత్రుఁడగు రామమోహనుని వలె నా దేశమున నేలండనునగరమున మృతినొందెను. ద్వారకనాథునకుఁ గలముగ్గురు కొడుకులలోను దేవేంద్రనాథటాగూరు జ్యేష్ఠపుత్రుఁడు. ఈతఁడు 1817 వ సంవత్సరము మేనెలలో జన్మించెను. తండ్రితల్లికడఁ జిన్ననాఁటనుండియుఁ జను వెక్కువగనుండుటచే నామె మనుమని ననేకపుణ్యక్షేత్రములకుఁ దనతోఁగూడఁ దీసికొనిపోయి త్రిప్పెను. ఇతఁడు తనపితృసఖుఁడగు రామమోహనునిచే స్థాపింపఁబడిన హిందూకళాశాలలో విద్యనభ్యసించెను. బుద్ధిసూక్ష్మతకలవాఁడగుటచే బాల్యమునందే యీతఁడు సంస్కృతము, పారసీ, యింగ్లీషు, బంగాళీభాషల నేర్చుకొని వానిలోఁ బ్రవీణుఁడయ్యెను.

చిన్ననాఁటనుండియు నితని కుపనిషత్తులపై నెంతయునిష్టము. అదియునుఁగాక బ్రహ్మసమాజస్థాపకుఁడగు రామమోహనునియింటికిఁ దఱచుగఁ బోవుచుండుటచే నేకేశ్వరారాధనవిషయము లగుప్రసంగములు వినుచు వచ్చెను. ఆగర్భశ్రీమంతుఁడగుటచే దేవేంద్రనాథుఁడు మహావైభవములననుభవించుచుఁ బెరిగెను. తనబాల్యమునుగుఱించి యతఁడే యొకచోట నిట్లు వ్రాసియున్నాఁడు-

"సంపన్నులగు తల్లిదండ్రులకుం బుట్టి రాజఠీవిగలకుటుంబమున మహావైభవములతోఁ బెరుగుటం జేసి చిన్ననాఁట నేనెన్నఁడు భగవంతుని పేరయినఁ దలపెట్టనైతి. ప్రపంచమునం దందఱు నన్ను గౌరవిం

చువారె. అందఱు నాకు సదుపాయములను జేయువారె. పిలుచుట యె తడవుగ లెక్కకు మీఱిన సేవకులు నాయెదుటఁ జేతులుకట్టుకొని నిలిచెడివారు. ద్రవ్యమన్ననో నేఁ గోరిననిముసముననె యెడలేనిసముద్రతరంగములవలె వచ్చి నాచేతులంబడుచుండెడిది. నేనడుగుటెయాలస్యముగ నాకోరికలెల్లఁ దీరుచువచ్చినవి. సౌఖ్యసంపదలు నన్నాదినములలో భ్రమపెట్ట నేనేమియు నెఱుఁగక మోహసముద్రమునంబడితిని. తాత్కాలికములగు సౌఖ్యములనే జూచుచుంటినిగాని నేనుపరలోకమును భవిష్యత్తును దలఁపనైతిని. నేను ప్రపంచసంబంధములగు మాయలయందుఁ దగుల్కొని యింద్రియసుఖలోలుఁడనై నాయంతరాత్మను లెక్కసేయక భోగపరాయణమైన మనస్సెట్లు త్రిప్పిననట్లుతిరిగితిని. ఈశ్వరానుగ్రహమున నీయవస్థ చిరకాలముండదయ్యె."

దేవేంద్రనాథుఁడు పదునెనిమిది సంవత్సరముల ప్రాయమువాఁడయినప్పుడు ముసలిదియగు వానితండ్రితల్లి రోగపీడితయై మరణమునకు సిద్ధమయ్యెను. గంగాతీరమునఁ బ్రాణములువిడుచుట చాలపుణ్యమనినమ్మి యాదేశస్థులాసన్నమరణులగు మనుష్యుల నేటియొడ్డునకుఁ గొనిపోవుచుందురు. ఆయాచారమునబట్టి దేవేంద్రనాథుని పితామహిని గంగయొడ్డునకుఁ గొనిపోవ నామెయచ్చట వెంటనే మృతి నొందక మూడహోరాత్రములు బ్రతికియుండెను. ఆసమయమున నామె బంధుగులందఱు చుట్టుం గనిపెట్టుకొనియుండిరి. పురోహితులు హరినామస్మరణం జేయుచుండిరి. మూఁడవనాఁడు పున్నమియగుటచే నారేయి పండువెన్నెలలు గాయఁజొచ్చెను. శ్రమజెందినవారి యాయాసము నపనయించుచు మందమారుతము చల్లఁగవీచుచుండెను. అప్పుడు దేవేంద్రనాథునిమనస్సునఁ జిత్రముగ వైరాగ్యము ప్రభవించెను. అదియెట్లు నెలకొనియెనో తెలియుట కాతని స్వవచనముల నీక్రిందఁ బొందుపఱచెదను.

"ఈసమయమున సమస్తపదార్థము లస్థిరములనియు వినశ్వరములనియు నాకుఁదోఁచెను. తోఁచినతోడనే నేనుమునుపటిమనుష్యుఁడనుగాక మారిపోయినవాఁడనైతిని. ధనముపై రోఁతపుట్టెను. నేనప్పుడుకూర్చున్న ప్రాఁతవెదురుచాఁపయె నాకుఁదగినదని తలఁచితిని. వెలలేని తివాసులు మెత్తనిపాన్పులులోనగువానిపై నేవ పుట్టెను. అదివఱకెన్న డెఱుఁగని మహానందము నామనసునం దుదయించెను. అంతకుమున్న నేనింద్రియసుఖలోలుఁడనై యుండినకాలమున మతమననేమియో భగవంతుఁడన నెట్టివాఁడో తెలిసికొనుటకై యత్నించినపాపమునఁ బోవనైతిని. ఆస్మశానభూమి ప్రశాంతమై నిశ్శబ్దముగ నుండెను. ఆయానందము నేను పట్టఁజాలక పరవశుఁడనైతిని. ఆయానందమును వర్ణించుట కేభాషయం దేమాటలుఁ జాలవు."

అనుభవైకవేద్యమై యనిర్వచనీయమై యలోకసామాన్యమై యనన్యదుర్లభమయి యమూల్యమైన యాబ్రహ్మానందమును దేవేంద్రనాథుఁడు రాత్రియంతయు ననుభవించి మరునాఁటినుండియు పిచ్చివాఁడపోలె నేదియోమఱచి చింతించువాఁడపోలె దేనినోపోఁగొట్టుకొని వెదకువాఁడుపోలె మందమతియై తీవ్రమైన చిత్తక్షోభ మనుభవింపసాగెను. నాఁటిరాత్రి యానందమును మఱలఁ దెచ్చుకొనవలయునని యతఁడెంత ప్రయత్నించినను సాధ్యముకాదయ్యె. మనశ్శాంతికొఱకాయనయింగ్లీషుతత్వశాస్త్రములఁ జదువుకొనియెఁగాని తానుగోరినశాంతి రాదయ్యె భగవంతుని సాన్నిధ్యమును బడయవలయునని యతఁడు ప్రతిదినముఁ బలుసారులు ప్రార్థనఁజేయుచువచ్చెను. ఒకప్పుడుదయము మొదలు మధ్యాహ్నమువఱకు నెండలో నతఁడీశ్వరధ్యానము సేయుచుఁ బారవశ్యముజెందియుండ సేవకులు సుకుమారమగు వానిమే నెండచేఁ బడలకుండ గొడుగులు బట్టుచువచ్చిరఁట. ఇట్లు మూఁడు సంవత్సరములు గతించెను.

అతఁడిరువదియొక్క సంవత్సరముల ప్రాయముగలవాఁడైన ప్పుడొకనాఁడు తనగదిలోఁ గూర్చుండగా వారితపుస్తకములోని పత్రి మొకటిచినిగి గాలికిఁగొట్టుకొనివచ్చి యతని ముందటం బడియె. అందొక సంస్కృతశ్లోకముండుటచేఁ దనపురోహితుని దానియర్థమడిగి వానివలనం దెలియఁజాలక బ్రహ్మసమాజ ప్రధానాచార్యుఁడగు నీరామచంద్ర విద్యావాగీశునొద్దకుఁబోయి దానియర్థమడిగెను. ఆపండితశిఖామణి యది యీశోపనిషత్తులోని మొదటిశ్లోకమనియు భగవంతుఁడు జగత్తునంతయు నిండియుండునుగనుక సర్వమీశ్వరమయమే యని యెంచి మనుష్యుఁడు పరులధనమున కాశఁ జేయక తనకున్న దానితోఁ దనివినొందవలయునని, దాని తాత్పర్యమనియునుజెప్పెను. అదివిని దేవేంద్రనాథుఁ డక్కజపడి యుపనిషత్తులలో నెంతెంత యర్థములున్నవో తెలిసికొనఁగోరి యానాఁడు మొదలు సంస్కృతముం జదువుకొని యుపనిషత్తుల నర్థసమేతముగనేర్చుకొనెను. ఈవేదాంతభాగములపై నతనికి మరణమువఱకు నింతింతనరానిభక్తిగలదు. దేవేంద్రనాథు నెఱిఁగినవారు కొందఱతఁడు జ్ఞానియని తెలిసికొని వానియొద్ద వేదాంతము నేర్చుకొనుచువచ్చిరి. వేదాంతవిద్యాభివృద్ధికొఱ కాయన 1839 వ సంవత్సరమున తత్త్వబోధినియను నొకసభ స్థాపించి దేవేంద్రనాథుఁడు తనచెలికాండ్రు బదుగుర నందుఁ జేర్చి వారమునకొకసారి యందఱం గలిసి వేదాంతార్థములఁ జర్చించి జ్ఞానాభివృద్ధి జేసికొనుచు నెలకొకసారి ప్రార్థనలఁ జేయుచువచ్చెను. ఈసభాసంబంధమున నతఁడు తత్త్వబోధిని పత్రిక నొకదానిని బయలుదేరఁదీసి దానికిఁదనమిత్రుఁడగు నక్షయకుమారదత్తును నధిపతిగాఁ జేసెను. ఈసభలో మొదటపలువురు చేరకపోయినను గొలఁదికాలమున నవద్వీపమహారాజగు శ్రీశ్చంద్రరాయలు బర్ద్వాను మహారాజాధిరాజు మొదలగువారనేకులు చేరిరి. 1842 వ సంవత్సరమునం దతఁడు తత్త్వబోధినీసభయొక్క ప్రథమ సం

వత్సరోత్సవమును మహావైభవముతో జరిపెను. ఆయుత్సవమునకాయన నగరములోనున్న వారిఁ జిన్నపెద్దలనక నందఱఁ బిలిచెను. ఊరిలోనున్న తగుమనుష్యు లదివఱకు సభపేరయిన నెన్నఁడు వినియుండ నందున నీయుత్సవమున కెవరు రారుగాఁబోలు నని సామాజికులు చింతించిరి. కాని రాత్రియెనిమిది గంటలకు సభాభవనమంతయు జనులతో నిండి కిక్కిఱిసి కూర్చున్నవారి కూపిరిసలుపన ట్లయ్యెను. సభ యెనిమిది గంటలుమొదలు రెండుగంటలవఱకు జరిగినను వచ్చినవారు నిద్రాహారములుమానుకొని జరిగినచర్యల నెంతయు శ్రద్ధతో నాలకించిరి.

ఇట్లుండి యతఁడు బ్రహ్మసమాజమున కప్పుడప్పుడుపోయి చూచుచుండెను. రామమోహనరాయ లింగ్లాండునకుఁ బోవకమునుపు ప్రార్థనమునిమిత్తము బహ్మసమాజమున కొకమందిరమును నిర్మించి రామచంద్రవిద్యావాగీశుని ప్రధానాచార్యునిగ నేర్పఱచిపోయెను. రామమోహనుఁడు వెళ్లినదిమొదలు సమాజము క్రమక్రమమున క్షీణించినందున విద్యావాగీశుఁడిఁక సమాజమువృద్ధిపొందదని నిరాశజేసికొనియెను. ఉపనిషత్తులు జదువుటచే దేవేంద్రనాథునిమనస్సు పరిపక్వమయి భక్తిజ్ఞానవైరాగ్యములతో నిండినందున నతఁడు పరమేశ్వరుఁడొక్కఁడేయనియు నతఁడు నిరాకారనిర్వికల్పనిరంజనుం డనియు గ్రహించి విగ్రహారాధనము సేయఁగూడదని నిశ్చయించుకొని తన మిత్రులతో నతఁ, డాసమాజమునఁ జేరి తన తత్వబోధినీ సమాజముఁ గూడ నందుఁగలిపి విద్యావాగీశున కానందముఁగలిగించి కొనయూపిరితోనున్న బ్రహ్మసమాజమును బ్రతికించెను. ఇతఁడు చేరుటచేతనే బ్రహ్మసమాజ మొకగొప్పమతమయ్యెను. దానికిఁగావలసిన ధనసహాయమంతయు నతఁడేచేయుచు దానిభారమంతయు నతఁడే వహించుచు సర్వవిధముల దానినివృద్ధిజేసెను. మఱియు వేదాంతశాస్త్రవృద్ధికొఱకు తత్వబోధినీ పాఠశాల నొకదానిని స్థాపించి దానికిఁగావల

సిన ధనమంతయు నతఁడెయిచ్చెను. నాలుగువేదముల నర్థసమేతము గఁజదువుటకు నలుగురు బ్రాహ్మణకుమారులను గాశీపురమునకంపెను. బ్రహ్మసమాజములోఁజేరిన తనమిత్రులలోఁ గొందఱప్పటికిని విగ్రహారాధనము సేయుచుండుటఁజూచి యదిమాన్పింపఁ దలఁచి 1843 వ సంవత్సరమునం దాయన సమాజికులందఱు ప్రమాణపత్రిక నొకదానినిపై వ్రాలు చేయవలయునని తీర్మానించెను. ఆపత్రికపై సంతకములఁ జేయువారు తాము సృష్టిస్థితిలయకారణభూతుఁడగు పరాత్పరు నద్వితీయు మానసారాధనము సేయుటయేగాని విగ్రహారాధనము సేయమనియు రోగదుఃఖపీడితు లగునప్పుడుతప్ప ననుదినము భగవంతుని సేవసేయుదుమనియు దుష్కార్యములఁ జేయమనియు సత్కార్యములఁ జేయఁ బ్రయత్నింతుమనియుఁ బ్రమాణముఁ జేసి వ్రాలు సేయవలయు. ఇట్లుచేయుటకు దేవేంద్రనాథుఁడు మొదలగు నిరువదిమంది పడుచువాండ్రు సిద్ధమై శ్రద్ధాభక్తులతోఁ బవిత్రహృదయములతో వచ్చి రామచంద్ర విద్యావాగీశునియెదుట నిలిచిరి. అప్పుడా వృద్ధబ్రాహ్మణుఁడు బ్రహ్మసమాజమత మభివృద్ధిపొందు మేలుదినములు వచ్చినవికదా యని సంతసించి యానందపారవశ్యమున కన్నులనుండి బాష్పములు విడిచి గద్గదకంఠుఁడై చెప్పఁదలఁచుకొన్న యుపన్యాసము చెప్పనేరక "హా! ఈసమయమున రామమోహనుఁడే యుండిన నెంత యానందించునోకదా." యని పలికి వారిని స్వమతమునం జేర్చుకొనియెను.

ఇట్లు చేరిన కొలఁదికాలములోనే యతనికి క్రైస్తవమతబోధకులతో వివాదము సంభవించెను. అతని తండ్రియొద్దఁ బనిసేయుచుండిన రాజేంద్ర సర్కారను నొక బ్రాహ్మణునిభార్యయు నామె సోదరుఁడును క్రైస్తవమతమునఁ గలియుటకయి యొకబోధకుని యింటికిఁ బోయిరి. తనభార్యను దనకిప్పింపుఁడని మగఁడు కోర్టులో దావా తెచ్చెను. కాని వానిప్రార్థన మరణ్యరోదన మయ్యెను,

అతఁ డంతట దేవేంద్రనాథునితో మొఱఁబెట్టుకొనఁగా నతఁడు క్రైస్తవు॥ దుర్ణయమునకు బిట్టలుకఁ బూని వారి యధర్మవర్తనము నివారింపఁజేయఁ దలఁచి యొక సభఁజేసి కలకత్తాలోనున్న పెద్ద మనుష్యుల నందఱ రావించెను. మతవిషయముల నతనితో భిన్నాభిప్రాయులయ్యు నీయుత్తమ కార్యమున జమీందారులు, మహారాజులు, నుద్యోగస్థులు నాతనితో నేకీభవించి హిందూబాలుర నిమిత్త మొకపాఠశాలను స్థాపించుటకు నిశ్చయించిరి. ఆసభకు వచ్చినవారియుత్సాహ మేమని చెప్పుదు. ఆక్షణమందే యేఁబది వేల రూపాయిలు పాఠశాలకు మూలధనముగ నొసఁగఁబడెను.

ఇరువది యెనిమిది సంవత్సరముల ప్రాయముననే దేవేంద్రనాథుఁ డింతపనిఁ జేయుటచే నక్కజపడి పౌరు లనేకులు బ్రహ్మసమాజము మంచిదేయని యందుఁ జేరిరి. ఈతెఱంగునఁ బనిసేయుచుండ బ్రహ్మసమాజ మతస్థులకు నేది ప్రమాణగ్రంథముగ నుండవలయుననివారిలో వారికి సందేహములు గలిగినవి. అక్షయకుమారదత్తు వేదములుపౌరుషేయములగుటచే నప్రమాణములనియె. కొందఱు వేదములే ప్రమాణములనిరి. కొంతకాలము వాదానువాదములు జరిగిన పిదప దేవేంద్రనాథుఁడుతక్కుంగల సామాజికులు వేదశాస్త్రములుప్రమాణములుగావనియు, బుద్ధి నుపయోగించి చక్కఁగవిచారించి యాగ్రంథములలో మంచియున్నయెడల గ్రహించితదితరములఁద్రోసి వేయవలయుననియు నిశ్చయించిరి. అనంతరము బ్రహ్మసమాజమతస్థులకుధర్మశాస్త్ర మేదయిన నుండవలదాయని సందేహము గలుగ దేవేంద్రనాథుఁడా తెగవారి యుపయోగము నిమిత్తము బ్రహ్మధర్మ మనునొకగ్రంథమునిర్మించెను. ఈగ్రంథమును రచించుటకేండ్లును బూండ్లునుబట్టకయతని కొకనాఁడు మూఁడుగంటలసేపుపట్టెనఁట. తనమిత్రునొకనివ్రాయుమని వేదములనుండియు శాస్త్రములనుండియుఁ దసకుఁగంఠస్థముగవ

చ్చిన కారికల నద్భుతముగఁజెప్పెనఁట. ఈబ్రహ్మధర్మము మొదటసంస్కృతమున వ్రాయఁబడి పిదపనాంగ్లేయభాషలోనికి బంగాళీ మొదలగు స్వదేశభాషలలోనికిని మార్పఁబడి యిప్పుడు దేశమందంతటనుపయోగింపఁబడుచున్నది.

ఇంతదనుక దేవేంద్రనాథుఁడు మొదలగుబ్రహ్మసమాజమతస్థులుతమతమవర్ణములలో నేయుండిరి. 1843 వ సంవత్సరమున దేవేంద్రనాథుని తండ్రియగు ద్వారకనాథటాగూరు లండనునగరములో మృతినొందెను. తండ్రికుత్తరక్రియ లెట్లుచేయవలయునని యతనికి సందేహము జనించెను. బ్రహ్మధర్మప్రకారముచేయుటయుక్తమని దేవేంద్రనాథుఁడుతలఁచెను. టాగూరువంశస్థులు బ్రాహ్మణులగుటచే వేదశాస్త్రముల ప్రకార ముత్తరక్రియలు జరిగింపవలసినదనియు నట్లు జరిగింపనియెడల కుటుంబగౌరవమునకు భంగమువాటిల్లుననియు వానిబంధువులు మిత్రులుపలుమారు నొక్కిచెప్పిరి. దేవేంద్రనాథుఁడవియెల్లఁ బెడచెవినిబెట్టి బ్రహ్మసమాజ ధర్మప్రకారముగఁ దనపైతృకమును నిర్వర్తించెను. అప్పుడుకులస్థులగు బంధుమిత్రులు వానిబహిష్కరించి పరిత్యజించిరి.

ఈమహాత్ముని మహాధైర్యమును దెలుపుట కీపై యంశములు చాలునుకానియితఁడు సత్యసంధుఁడని మహర్షిశబ్దమునకుఁదగినవాఁడనియుఁ దెలుపుట కింకొకముఖ్యాంశముగలదు. జనకుఁడగు ద్వారకనాథుఁడు బ్రతికినన్నాళ్ళు మహారాజవైభవముతో బ్రతికి యనేకదానధర్మముల నేయుటంజేసి యాయనమృతినొందునప్పటికొకకోటిరూపాయలు ఋణముండెను. అతఁడులోకవ్యవహారవేదియున్యాయవాదియునైనందున ఋణప్రదాతలు తన పిత్రార్జితమగు సొత్తుమీఁదికిఁబోకుండఁదగుకట్టుబాటులఁజేసిచనిపోయెనువాణిజ్యవ్యాపారముమీఁదనున్నయాస్తియంతయు నప్పులవాండ్రకొప్పగింపుమనియువారిదిపంచుకొనివచ్చినంతపుచ్చుకొని పోవలయుననియు నేర్పాటులఁజేసి బంధువులు

ఋణప్రదాతలనొప్పించిరి. ఈయేర్పాటు ధర్మస్వరూపుఁడగు దేవేంద్రనాథునకు నిష్టములేకపోయె. అప్పు లిచ్చినవాండ్రు చెడిపోఁగూడదని చెప్పి వారిని రావించి జమీాగ్రామములను దక్కినసొత్తుసదీర్ఘానము నిమిత్తము వారికొప్పగించిసంవత్సరమునకుఁగుటుంబరక్షణముని మిత్త మిరువదివేల రూపాయలుఁ దమకు వాఁచ్చున ట్లొడంబరచెను. అంతియకాక విలువగలనగలు గుఱ్ఱపుబండ్లు మంచిమేడలు మొదలగునవి విక్రయించి ఋణముఁదీర్చెను. వేదములుఁ జదువుటకుఁ గాశీకానగరమునకుఁ బంపిన నలువురు బ్రాహ్మణులను చదువుచాలించి రమ్మనియెను. తాను స్థాపించిన తత్వబోధినీపాఠశాలను గట్టిపెట్టి యామందిరమును విక్రయించెను. ఆఁడువాండ్రెక్కిపోవుట కొకపల్లకినుంచుకొని తక్కినసామానులన్నియు విక్రయించిపూర్వవైభవమంతయుఁగోలుపోయి సామాన్యుఁడట్లు బ్రతికి యతఁడు ఋణవిముక్తుఁడయ్యె. ఆహాహా! ఎగబెట్టుట కంత వీలున్నప్పుడు తానుకష్టపడుచుఁ దండ్రిచేసిన ఋణములు దీర్చుట యామహానుభావునియందుఁ దక్కమఱొక్కనియందుగాంచుటయరిదిగదా! ఋణములఁ దీర్చుటయేగాక ధర్మకార్యములనిమిత్తము తండ్రిచందాల నిచ్చెదనని వాగ్దానములఁ జేసినవారలకందఱకు వాగ్దత్తధనమును వడ్డితోఁగూడ నిచ్చి యామహాత్ముఁడు పితృవాక్యపరిపాలకుఁడయ్యెను. ఇట్టియుదారచిత్తుఁడే దేశముననుండు,నా దేశము ధన్యమయినదిగదా! ఋణప్రదాతలు కొంతకాలమితనిజమీాగ్రామముల స్వాధీనముఁ జేసికొని వ్యవహరించి సరిగానప్పులు దీర్చుకొనలేక సంస్థానము మరల దేవేంద్రనాథునకే యప్పగించి యతనికిఁ దోఁచినట్లప్పులఁ దీర్చుమని వేఁడిరి. అతని సత్యసంధతయందుఁ బ్రజలకెంతనమ్మకముగలదో దీనింబట్టి తెలిసికొనుఁడు. వారివలన సంస్థానముమరలఁ గైకొని దేవేంద్రనాథుఁడు జాగరూకతతో వ్యవహరించిఋణములుదీర్చి తనయాస్తి నిలుపుకొనెను.

ఇట్లు కొంతకాలమునకు దేవేంద్రనాథునకును వానిసహకారులకును గొన్నియభిప్రాయభేదములు గలుగ మనశ్శాంతికై యతఁడు 1856 వ సంవత్సరమునఁ బూర్వకాల మనేకమహర్షులకు నివాసమైనహిమాలయపర్వతములకుం బోయెను. పోయి యచ్చటఁబదునెనిమిదిమాసములుండి మనవేదాంతశాస్త్రమును జక్కఁగఁ జదివి కాలముఁబుచ్చుచు నెడనెడ మహోన్నతమైన యాపర్వతరాజముయొక్క గాంభీర్యమునుంజూచి పరమేశ్వరుని మహిమను గొనియాడుచు మనశ్శాంతిని బడసెను. అతఁ డాకొండలమీద నున్నకాలమునఁ గలకత్తా నగరమునఁ గేశవచంద్రసేనుఁడను పందొమ్మిదియేండ్ల ప్రాయముగల కుశాగ్రబుద్ధియొకఁడు ప్రమాణపత్రికపై సంతకముఁజేసి బ్రహ్మసమాజమునఁ జేరెను. దేవేంద్రనాథుఁడు మంచుకొండమీఁదనుండివచ్చి తనసమాజములోఁ జేరిన యీబాలుని చాకచక్యమునకుఁ బాండిత్యమునకు సద్గుణసంపదకుఁ గడుమెచ్చి వానితోఁ జెలిమిఁజేసి వానితోఁ గలిసి మతాభివృద్ధికయి పనిచేయనారంభించెను. చంద్రసేనుఁడు దేవేంద్రనాథునిపైఁ బితృభావము నిలిపెను. దేవేంద్రనాథుఁడు బాలునిపైఁ బుత్రప్రేమయు శిష్యవాత్సల్యమును జూపెను. ఈగురుశిష్యులిద్దఱు ప్రతిదినముఁ గలిసికొని రాత్రులు ప్రొద్దుపోవువఱకు వేదాంతచర్చలు సలుపుచు పరస్పరజ్ఞానాభివృద్ధిఁ జేసికొనుచుండిరి. ఈయిరువురకూడికచే బ్రహ్మసమాజమతము జనసమ్మతముగాఁ జొచ్చెను. కేశవచంద్రుఁ డింగ్లీషునను దేవేంద్రనాథుఁడు బంగాళీలోను మతోపన్యాసములు చేయనారంభించిరి. బుద్ధిసంపన్నుఁడగు శిష్యుఁడు క్రొత్తక్రొత్తపద్ధతుల నెన్నో యూహించి తెలుప ధనసంపన్నుఁడగు గురువువానినిఁ గొనసాగఁజేసెను. 1859వ సంవత్సరమున దేవేంద్రనాథుఁడు తనకుటుంబముతోఁ బొగయోడనెక్కి సింహళద్వీపమునకుఁ బయనము చేయఁదలఁప బాలుఁడు కేశవచంద్రుఁడు వారితోఁ బయనము

యి పోయెను. ఈప్రయాణమున గురుశిష్యుల స్నేహబంధము మును పటికన్న దృఢమయ్యెను. సింహళమునుండివచ్చినపిదప దేవేంద్రనాథుఁడు బ్రహ్మధర్మప్రకారముగఁ దనకూఁతునకుఁ బెండ్లిచేసెను.

1861 వ సంవత్సరమున వారిరువురుఁ గలిసి "యిండియనుమిఱ్ఱ"రను నాంగ్లేయపత్రిక నొకదానిని ప్రకటింపసాగిరి. అదియిప్పటికి నిదినపత్రికయయి కలకత్తానగరమున వెలువడుచున్నది. దేవేంద్రనాథుఁడుతనప్రియశిష్యుని వానిప్రజ్ఞకుఁ దగినంత గొప్పవానిగఁ జేయవలయునని నిశ్చయించి యొకదినమునఁ బౌరులననేకుల రావించి వారిసమక్షమునఁ గేశవచంద్రుని బ్రహ్మసమాజమతప్రధానాచార్యునిగ నభిషిక్తుని జేసి బ్రహ్మానందుఁడను బిరుదమునిచ్చిబంగరుబందుల చట్రములో నమర్చిన యొకపటమును దంతపుముద్రయుఁ దనరచించిన బ్రహ్మధర్మగ్రంథప్రతియు వానికొసంగి మహావైభవముతో నుత్సవముఁ జేసెను. అదినము మొదలు బ్రహ్మసమాజమతమెంతమహోన్నతదశకు రావలెనో యంత మహోన్నతదశకు వచ్చెను.

ఉపన్యాసములిచ్చుటలో మనహిందూదేశమునఁ గేశవచంద్రునంతవాఁడు మరల జన్మింపలేదనియనేకు లభిప్రాయపడియున్నారు. ఈతని కారణముననే బ్రహ్మసమాజమున నప్పుడనేకులు చేరిరి. కాని యాగురుశిష్యుల స్నేహముచిరకాలమునిలువదయ్యె. దేవేంద్రనాథుఁడు యజ్ఞోపవీతము దీసి పాఱవైచి మతాంతరులతో భోజనాదికములఁ జేయుచుండెనుకాని స్త్రీలను సభలకుదోడ్కొనివచ్చుట యితరవర్ణముల వారితో సంబంధ బాంధవ్యములు జేసికొనుట మొదలగు కొన్ని కార్యముల కిష్టపడఁడయ్యె. కొన్ని విషయములఁ బూర్వపద్ధతుల ననుసరింపఁదలఁచిన గురువునకు నన్నిట నవీనపద్ధతుల నవలంబింపఁదలఁచు శిష్యునకు నభిప్రాయభేదములు గలుగుటంజేసి వారిరువురు చిట్టచివఱకు విడిపోయిరి. దేవేంద్రనాథుఁడు తనమతమున కాదిబ్రహ్మసమాజమని

నామమిడియెను. కేశవచంద్రుఁడు తనమతమునకు హిందూదేశబ్రహ్మసమాజమని పేరుపెట్టెను. అదిమొదలు దేవేంద్రనాథమహర్షి ప్రపంచసంబంధము వదలుకొని యీశ్వరసేవయందె కాలముఁ బుచ్చుచుఁబ్రతిసంవత్సరము హిమాలయమునకుఁ బోవుచుఁ దనపరిశుద్ధజీవనమువలనను బవిత్రచరిత్రమువలనను సత్ప్రవర్తనమువలనను నిర్మలాంతఃకరణమువలనను భూతదయాపరతవలనను బ్రజలచే మహర్షి యనుబిరుదమునొందియాబిరుదమునకుఁ దగినవాఁడనిపించుకొనియెను. ఏటేటబ్రహ్మసమాజసాంవత్సరికోత్సవము జరిగెడుదినముల దక్క మఱియెన్నఁడుఁ నాతఁడుజనుల కగపడెడువాఁడు కాఁడఁట. మిక్కిలి ముదిమిలోసయితము నాతనికి బాల్యమున నున్నంత జ్ఞాపకశక్తి యుండెనఁట. పుణ్యక్షేత్రములలో దేవదర్శనము చేయుటకుఁ బోయినట్లేయీమహర్షి నిహిందువులనేకులు దర్శింప వచ్చెడువారు. ఈయన హిందూదేశమునందలి యనేకభాగములనే గాక బర్మా, సింహళము, చీనామొదలగు విదేశముల సయితము చూచెను.

ఈయనకు మరణకాలమునాఁటికి నలువురు కుమారులు నిరువురుకుమార్తెలు నుండిరి. అందు జ్యేష్ఠకుమారుఁడగు ద్విజేంద్రనాథ టాగూరు పండితుఁడై కొన్ని వేదాంత గ్రంథములురచించెను. రెండవ కుమారుఁడు సత్యేంద్రనాథ టాగూరు గొప్పయుద్యోగములఁ జేసి కొన్నియేండ్లక్రిందట పించను పుచ్చుకొనెను. మూడవకుమారుఁడగు జ్యోతీంద్రనాథ టాగూరును నాలవతనయుఁడగు రవీంద్రనాథటాగూరునుబంగాళీభాషలో మంచి మంచి గ్రంథములు వ్రాసిరి. ఈనాఁటి బంగాళీకవులలో రవీంద్రనాథుఁడే మిక్కిలిగొప్పవాఁడని ప్రసిద్ధిగలదు. కుమార్తెయగు శ్రీమతిస్వర్ణకుమారిదేవియు ననేకచిత్రవచనకావ్యములవ్రాసి ప్రసిద్ధికెక్కి యిప్పుడు బంగాళాదేశమున సివిలు సర్వీసులోగొప్ప యుద్యోగములుచేయు ఘోషాలుగారికి తల్లియయ్యె

ను. ఈమహర్షి 1905 వ సంవత్సరము జనవరినెల 19 వ తేదీ గురువారముమధ్యాహ్నము లోకాంతర గతుఁడయ్యెను. ఈమహాత్ముఁడెంత జబ్బుగనున్నను భగవత్ప్రార్థనము మాని యెఱుఁగఁడు. ఇతఁడు మహారాజుబిరుదమునందుటకు మాఱు తన సత్ప్రవర్తనచే మహర్షి బిరుదమునందెను. ఈరాజయోగి బ్రహ్మసమాజమతస్థుఁడయినను వాని నిమిత్తమన్ని తెగలవారు నన్నిమతములవారు దుఃఖించిరి.

మరణాంతరమున వీనిని గౌరవించుటకు శవము వెంటఁ గాలి నడకను వెళ్ళిన వారిమాట యటుండఁగ గొప్పవారెక్కిపోయిన బండ్లొకమైలుదూరమువఱకు వ్యాపించియుండెను. ఆమహాత్ముని శరీరమును గంగాతీరమున మంచిగంధపుచెక్కలతో దహనముఁ జేసిరి. ఈ రాజయోగిచరిత్రముఁ జదివినప్పుడు సంసారముఁ జేయుచుఁ దారపుత్రాదులతో సుఖించుచు నాత్మసన్యాసముఁ బుచ్చుకొని ముక్తులయిన వసిష్ఠాది మహర్షుల చరిత్రమును జనకాది రాజయోగులచరిత్రము జ్ఞప్తికివచ్చును.



# కేశవచంద్రసేనుఁడు.

కేశవచంద్రసేనుఁడు 1838వ సంవత్సరము నవంబరు 19వ తారీకునఁ గలకత్తానగరమున జన్మించెను. అతనిపూర్వులు హుగ్లీనదీతీరముననున్న గరీఫాగ్రామమున వసియించెడివారు. ఈకుటుంబమువారు పూర్వము బంగాళమును బాలించిన సేనరాజుల సంతతిలోఁ జేరినవైద్యకులస్థులు. ఈతనితాత యగురామకమలసేనుఁడు స్వగ్రామమునువిడిచి కలకత్తాకు వచ్చి మొదట నొకయచ్చుకూటములో నెనిమిదిరూకలుజీతముగల చిన్నయుద్యోగములోఁ జేరి క్రమక్రమమునఁ దనబుద్ధికుశలతచేతను స్వయంకృషిచేతను బాగుపడి నెలకు రెండువేలరూకలుజీతముగల బ్యాంకుదివానుపని చేసి సుప్రసిద్ధుఁడై బంగాళదేశమునందంతటఁ దనకుటుంబమునకు మిాహాఖ్యాతిఁదెచ్చెను. అతఁడు విద్యావిశారదుఁడయి యింగ్లీషు బంగాళినిఘంటువు నొకదాని నొనరించి స్వభాషకు మహోపకారముఁ జేసెను. ఆయనకు నలుగురుకొడుకులుండిరి. వారిలో పేరీమోహనుఁడు రెండవయతఁడు.

ఆపేరీమోహనుఁడు కలకత్తాటంకశాలలోఁ గొంతకాలముదివానుగాఁబనిచేసి తనతండ్రిగతించినమూఁడేండ్లకు (అనగా 1848 వసంవత్సరమున) కాలధర్మమునొందెను. ఆయన ముప్పదినాలుగేండ్లచిన్నప్రాయముననే మృతినొందినను జనులచే మంచివాఁడనుచు నెన్నఁబడుచువచ్చె. మొత్తముమిాఁద తనస్వప్రసిద్ధికన్న రామకమలసేనునికొడుకగుటచేతను కేశవచంద్రసేనునితండ్రి యగుటచేతను నధికప్రసిద్ధివచ్చెను- ఆయనకుమారులుముగ్గురిలో కేశవచంద్రసేనుఁడు మధ్యముఁడయి తండ్రిపోవునప్పటికి పదియేండ్లప్రాయము గలిగి యుండెను. తండ్రిబాల్యమున గతించినను వానియదృష్టవశమునఁ దల్లిమిక్కిలి తెలివిగల దగుటచే నెక్కుడు జాగరూకతతో వానిం బెంచెను.

కేశవచంద్రసేనుఁడు చిన్నతనమున నన్నియుమంచివస్తువులెకావలయు ననికోరి మంచిబట్టలు మంచిపెట్టెలుపుచ్చుకొనియవిమెవ్వరు ముట్టుకొనకుండ జాగ్రత్తపెట్టుకొనుచుండువాఁడు. అతఁడుస్వభావముచేతనేశాంతుఁడును సాధువునై దుశ్శీలము లేకచులకనఁగఁ గోపముఁదెచ్చుకొనక సౌమ్యుఁడయి యుండెను. కొంతకాలమింటివద్దస్వభాషనేర్చుకొనినపిదప పదునొకండేండ్లప్రాయమున వానినింగ్లీషువిద్యనిమిత్తముహిందూకళాశాలకుఁ బంపిరి. విద్యార్థిగా నన్నపుడతఁడు మిక్కిలిపాటుపడుచు ప్రతిసంవత్సరపరీక్షాంతముననొకటిరెండుబహుమానములనందుకొనుచు 1850వ సంవత్సరమునఁబరీక్షలోఁ గృతకృత్యుఁడయిపెద్దగణితశాస్త్రగ్రంథము నొకదానినిబహుమానముగఁ బడసెను. అప్పటినుండియు వానినెఱిఁగినవారుపెద్దపుస్తకమును బుచ్చుకొన్నచిన్నపిల్లవాఁడని చెప్పుకొనుచు వచ్చిరి. చిన్ననాఁట నితనియందు బొడగట్టిన బుద్ధిసూక్ష్మతను బరిశ్రమను సౌజన్యమును జూచియితఁడు గొప్పపరీక్షలందేరు ననియొజ్జలుతలంచిరి. కానివారికోరికలుకొనసాగినవికావు. ఏలయన 1852వ సంవత్సరమున హిందూకళాశాలాధికారులకును దత్తపోషకులకును వివాదములు పొడమినందున వేఱొకకళాశాలయచ్చటస్థాపింపఁబడఁగాఁ గేశవచంద్రుఁ డానూతనపాఠశాలకుఁ బోయి యావఱకుఁ జదువుకొన్నదానికంటె పైతరగతిలోఁ జేరెను. రెండేండ్లలో నీక్రొత్తకళాశాలయెత్తివేయఁబడగాఁ గేశవుఁడుమరలహిందూకళాశాలకేవచ్చి చేరెను. ఈమార్పులవలన విద్యాభంగము గలుగుటచే నతఁడటుమీఁదఁబెద్దపరీక్షలలోఁ దేఱఁజాలఁడయ్యెను. అయిననుదత్కళాశాలలో 1858వ సంవత్సరమువఱకు నతఁడు విద్యాభ్యాసముచేసిచివరరెండేండ్లలోఁ దర్కవేదాంత శాస్త్రములలో గట్టికృషిచేసెను. ఇంగ్లీషు కవులలోవానికి షేక్స్పియరు మిల్టనుకవులపై నెక్కువ యభిమానము.

చిన్నతనమునుండి వానికి దైవప్రార్థనమువలన లాభముగ

లదని గట్టినమ్మకముండెను. మొదటినుండియు నితనికి క్రైస్తవమతబో ధకులతోఁ బరిచయ మెక్కుడుగఁ గలదు. వారిసహాయమునను దక్కిన మిత్రుల ప్రోత్సాహమునను నితఁడు "బ్రిటీషు యిండియాసంఘ"మ నుపేర నొకసమాజమును నాంగ్లేయభాషాభివృద్ధికొఱకును ప్రకృతి శాస్త్రజ్ఞాన సంపాదన కొఱకును స్థాపించెను. ఇదిగాక జ్ఞానాభివృద్ధి కొఱకు నింక నెన్నియో సమాజములను సంఘములను స్థాపించెను. 1855 వ సంవత్సరమునఁ జంద్రసేనుఁడు సాయంకాలపాఠశాల నేర్ప ఱచి యక్కడకు వచ్చువారికి నీతులంగూర్చియు మతముంగూర్చియు నింగ్లీషుభాషలోని గొప్పగొప్ప సంగతులంగూర్చియు నుపన్యసించు చువచ్చెను. అతనికి షేక్స్పియరు వ్రాసిన నాటకములపైఁ గలయభి మానముచే వానిం బ్రయోగించునిమిత్త మొకనాటకసంఘ మేర్ప ఱచి దానిలోఁ దానుగూడ నుత్తమపాత్రిలఁ గయికొని జనరంజక ముగ నభినయించె నని చెప్పుదురు. సాయంకాల పాఠశాల మూడు నాలుగేండ్లలో నంతరింపఁగాఁ గేశవుఁడు వేదాంతచర్చలు సలిపి ప్రార్థనాదికములు సలుపుటకు "పరస్పర భ్రాతృభావ సమాజము" (Good Will Fraternity)నేర్పఱచెను. ఆ సమాజమునఁ బలుమారు కేశవుఁడు పరమేశ్వరుఁడు మన కెల్లరకుఁ దండ్రియనియు మనుజు లందఱు సోదరులనియు నింగ్లీషున బోధించుచు వచ్చెను. ఆ సంవత్స రమందే కేశవచంద్రసేనుఁడు బ్రహ్మసమాజమతమందుఁ జేరి తత్ప్రతిజ్ఞాపత్రికమీఁద సంతకముఁ జేసెను. అందు తాను జేరిన విష యమునుగూర్చి యతఁడిట్లు వ్రాసియున్నాఁడు.

"దేశమునం దిప్పుడున్న తెగలు, దేవాలయములు మొదలగు వానిపై నమ్మకములేక మంచిమతమేదని నేను విచారించుచున్న సమ యమునఁ గలకత్తాబ్రహ్మసమాజగ్రంథ మొకటి నాచేఁ బడెను. అందు "బ్రహ్మసమాజమన నేమి" యను ప్రకరణమును జదువఁగా

నది నా మనస్సునం దున్న మతమునకు సరిపడియె. ప్రపంచమునందలి యే గ్రంథముగాని యాత్మావబోధమునకు సరిరాదనియు భగవం తుఁ డంతరాత్మకు స్వయముగ గోచరుఁడగునపుడు వెలుపలనుండు నుపదేష్టలతోఁ బనిలేదనియుఁ బ్రతిమనుష్యుఁడు నాత్మైకవేద్యుఁ డగు నా పరబ్రహ్మమునకే మ్రొక్కవలయుఁగాని తదన్యవస్తువులకు మ్రొక్కఁగూడదనియు నాయభిప్రాయము. అట్లు తోఁచినతోడనే నేను హిందూదేశమునఁ బరిశుద్ధాస్తిక మతమును బోధించు బ్రహ్మ సమాజమునఁ జేరితిని."

1859 వ సంవత్సరమున బ్రహ్మమతపాఠశాల స్థాపింపఁబడఁగా గేశవచంద్రుఁడు దేవేంద్రనాథునితోఁ గలిసి భగవదాస్తిక్యమును గూర్చి వరుసఁగాఁ గొన్నియుపన్యాసముల నిచ్చెను. అటుపిమ్మట నతఁడు తనచేత నిదివఱకు స్థాపితమయిన నాటకసంఘముచే విధవా వివాహ మను నాటకమును బ్రయోగింపఁ జేసెను. అది ప్రదర్శింపఁ బడినప్పుడు పౌరు లనేకులు వచ్చినందున నగరమం దంతటఁ బెద్దసం క్షోభము గలిగెను.

కేశవుని బంధువులు వాని నేదైన దగిన యుద్యోగములోఁ బ్రవేశపెట్టఁదలఁచి యతనికి ఇరువది రూకల జీతముగల గుమాస్తాపనిని బంగాళాబ్యాంకులో నిప్పించిరి. ఒక సంవత్సరములోనే వానిజీతము ద్విగుణమయి యింకను వృద్ధిపొందునట్లు గనిపించెను. ఇట్లుండ బ్యాంకుపై యధికారి యగుదొర తనబ్యాంకు సంబంధమగు నేసంగ తులును క్రింది యుద్యోగస్థు లెవ్వరికిఁ జెప్పఁగూడదని యానతిచ్చి యానిబంధన కొడంబడినట్లందఱు నొకకాగితముపై వ్రాలు చేయ వలయునని యాజ్ఞాపించెను. ఉద్యోగస్థులలోఁ బెద్దలు చిన్నలు నిస్సం శయముగ వ్రాలుచేసినను గేశవచంద్రుఁడు సంతకముఁ జేయుఁడయ్యె. ఆదొర యీమాటవిని మండిపడి వానిం దనయొద్దకుఁ బిలిపించె. ఆ

యధికారి చండశాసనుఁడగుటచే కచేరీవారందఱుఁ గేశవచంద్రునిపని యేమగునోయని గడగడ వడంకఁజొచ్చిరి. దొర వానింబిలచి యేల వ్రాలు చేయనైతివని యడుగఁ జంద్రసేనుఁడు సింగపుఁబిల్లవలె వాని యెదుట నిలిచి యిట్లనియె. "ఇతరులతో నేసంగతులు చెప్పఁ దగినవో, యేవి చెప్పఁదగనివో యేర్పఱుపక మీరు వ్రాలు చేయుమనుట మంచిదికాదు. ఏసంగతులు చెప్పకుండుట యసాధ్యము. వ్రాలు చేసినపిదప ప్రతిజ్ఞఁదప్పుట యనుచిత మని నేను మొదటనే సంతకము చేయనైతిని." ఆమాటలు విని దొర వాని పరిశుద్ధమనస్సునకును సత్యమునందలి గౌరవమునకును సంతసించి శిక్షించుటకు మారు మెచ్చుకొని పంపి యదిమొద లతని యందు మిక్కిలి గౌరవమును దయయును జూపుచువచ్చెను. అయినను 1861 వ సంవత్సరమున నతఁడాయుద్యోగమును మానుకొనెను. పిమ్మట కొన్నిమాసములు తప్ప తక్కిన జీవితకాలమంతయు బ్రహ్మసమాజ మతబోధనమందె గడపెను. బంధువుల ప్రోద్బలముచే నతఁ డాయుద్యోగమునఁ జేరెను. కాని మొదటినుండియు వానిమనస్సున నీ సత్కార్యముఁ జేయవలయుననియే తలంపుండెను.

1860 వ సంవత్సరమునం దాయన "బంగాళాదేశపు బాలకులారా! ఇది మీ నిమిత్తమే" యనుశీర్షికగల చిన్నగ్రంథము నొకదానిం బ్రకటించి దానివెనువెంటనే యట్టి గ్రంథముల మఱిపంద్రెండింటినిగూడ బ్రచురించెను. ఆ సంవత్సరముననే యతఁడు మతబోధన నిమిత్తము ప్రప్రథమమునఁ గృష్ణనగరునకుఁ బోయెను. ఆయన యక్కడ క్రైస్తవమతబోధకులతో వాదముసలిపి వారి నోడించి నందున నచ్చటి పండితులందఱుఁ దమమతమును నిలిపిన మహాత్ముఁ డని వానిం గొనియాడిరి. పిదప దేవేంద్రనాథుఁడు సకుటుంబముగా సింహళద్వీపమునకు నావికాయాత్ర జేయఁ గేశవచంద్రుఁడు తనవారికి

దెలియకుండఁగనే వారితోఁ బయనమయి పోయెను. ఆపయనమునందె వారి కిరువురకును మైత్రి యధికమయ్యెను. అచ్చటినుండివచ్చిన పిదప సంగీతసేవ లనుపేర కలకత్తా నగరమున భజన సమాజము లేర్పఱచి యతఁడచ్చట మతచర్చలు సేయుచువచ్చెను. 1861వ సంవత్సరమున హిందూదేశదర్పణమని యర్థమువచ్చు "ఇండియను మిర్రి" రను పత్రికను గొందఱు మిత్రుల సాయమున బయిలుదేర దీసి పక్షమున కొకసారి ప్రకటించుచు వచ్చెను. ఈ పత్రిక క్రమంబున దినపత్రికయై కేశవచంద్రసేనుని పెదతండ్రి కుమారుఁడగు నరేంద్రనాథసేనుగారిచే నిప్పటికిని గలకత్తా నగరమున మిక్కిలి ప్రసిద్ధముగఁ బ్రకటింపఁబడుచున్నది. మరుచటిసంవత్సరమున నతఁడు దేవేంద్రనాథుని సాయమునఁ గలకత్తా కళాశాలను స్థాపించి యందు తాను నీతిని గూర్చియుఁ బరిశుద్ధాస్తిక మతమును గూర్చియు బోధించుచు వచ్చెను.

1862 వ సంవత్సరమందే దేవేంద్రనాథుఁడు కేశవ చంద్రసేనుని బ్రహ్మసమాజ మతమునకుఁ బ్రధానాచార్యునిగ నేర్పఱచి యొక పెద్దసభఁజేసి యందతని నభిషిక్తుఁ జేసెను. ఆయుత్సవము మహావైభవముతో నిర్వర్తింపఁబడినది. ఆయభిషేక సమయమునఁ గేశవచంద్రుఁడు తనభార్యను సభకురమ్మని పిలువఁ జుట్టములందఱు నట్టిపని వలనుపడదని పెద్దపెట్టున గోలపెట్టిరి. అయిన నతఁడు పట్టిన పట్టు వదలక తన భార్యను సభకుం దీసికొనిపోయెను. వెంటనే తత్ఫలముగ సోదరులును పెదతండ్రియు వానినింటికి రానీయక బహిష్కరించిరి. కాని కేశవచంద్రునకు దేవేంద్రనాథ మహర్షి తనయింట బసయిచ్చి యాదరించి వెల్తి లేకుండఁ జేసె. అది మొదలు బ్రహ్మసమాజ మతస్థులకు భార్యలు సహచారిణులుగ నుండి సభలకు వచ్చి ప్రాముఖ్యతను గాంచుచు వచ్చిరి. కాలక్రమమున సఖ్యత కుదురఁ గేశవచంద్రుఁడు పితృగృహముఁ బ్రవేశించుటకుఁ బెద్దలుసమ్మతించిరి.

అనంతరము కేశవచంద్రసేనుఁడు స్వమత బోధనమునకై బొంబాయి చెన్నపట్టణము మొదలగు మహానగరములకుఁబోయెను. ఆ స్థలములయం దతని కమిత గౌరవము జరిగెను. ఆ పురములయందు బ్రహ్మసమాజమతము స్థాపింపఁబడియె. అక్కడనుండి యాతఁడు కలత్తాకు వచ్చినపిదప దేవేంద్రనాథునకును కేశవచంద్రునకును నభిప్రాయ భేదములుగలిగి యవి తుదకు వివాదముగఁ బరిణమించెను. ఆభేదకారణ మిది. కేశవచంద్రునకు స్త్రీపునర్వివాహములు సలుపుట, నన్యజాతుల తోడి వివాహ సంబంధములు చేయుట,న్యాయమనియుఁ గర్తవ్యమని యుఁ దోఁచ వానికిఁ బ్రోత్సాహముచేసెను. దేవేంద్రనాథున కీరెండు ను బొత్తుగఁ గిట్టవు. అంతియకాక కేశవచంద్రుఁడు బ్రహ్మమతస్థులు యజ్ఞోపవీతము ధరింపఁగూడదనియు నది తీసివేయవలయుననియుపట్టు బట్టెను. కాని దేవేంద్రనాథుఁ డేమార్పును లేశము నంగీకరించఁడయ్యె ఈవివాదములు క్రమ క్రమముగ వృద్ధినొంద కేశవచంద్రుఁడును వాని మిత్రులు కొందఱును 1866 సంవత్సరమున నాది బ్రహ్మసమాజము నుండివిడిపోయి 11 వ నవంబరు 1866 వ సంవత్సరమున తమ సమా జమునకు హిందూదేశ బ్రహ్మసమాజ మనిపేరుపెట్టి యంతటినుండి యుఁ దాముననమ్మిన యామతమును బోధింప నారంభించిరి. ఆయేఁడు మార్చినెలలో నతఁడు యేసుక్రీస్తుజీవితమును గూర్చి యద్భుతమగు నుపన్యాసమును జేసి యందేసుక్రీస్తుయొక్క సద్గుణములు గొనియాడి యతఁడు సామాన్యమనుష్యునివంటివాఁడు గాక దివ్యపురుషుఁడని యొప్పుకొనెను. ఈయుపన్యాసములు కలకత్తాలో సంక్షోభమును గలిగించెను. కేశవుఁడు కొద్దికాలములోఁ దమ మతమునఁ గలియునని క్రైస్తవులు తలంచి యుప్పొంగిరి. అతఁడు క్రైస్తవుఁడై మతభ్రష్టుఁ డగుచున్నాఁడని హిందువులునిందించిరి. కాని యచిరకాలములోనే యతఁడు చేసినమఱియొక యుపన్యాసములో నేసుక్రీస్తు తక్కిన మ

తోద్ధారకులతోటి పాటివాఁడేగాని యంతకంటె నెక్కువవాఁడు గాఁడని చెప్పినప్పుడు క్రైస్తవులు తెల్లబోవుటయు హిందువులు సంతసించుటయు సంభవించెను. పిమ్మట కేశవచంద్రుఁడు మతబోధ సేయుటకై తూర్పు బంగాళా దేశమంతయుఁ దిరుగ పూర్వాచార ప్రియులగు పండితజనుల కతనియందుఁ గలిగిన గౌరవమునుజూచి తమ మతమును గాపాడుకొనఁ జొచ్చిరి. ఆప్రదేశమునుండి వచ్చిన పిదప బ్రహ్మమతస్థు లీశ్వరోపాసనముఁ జేయుటకుఁ దగిన తావు లేకుండుటఁ జూచి 18ö6 వ సంవత్సరమున 24 వ జనేవరు దినమున బ్రహ్మమందిరము నిర్మించుటకు శంఖుస్థాపన చేయించెను.

ఇది కట్టించిన వెనుక నతనియెడ జనులకు గౌరవమధికమయ్యె. తరువాత రెండుమాసములకుఁ బ్రయాగ బొంబాయి మొదలగుననేక నగరముల కరిగి సంఘమత సంస్కారములఁ గూర్చి వినువారి మనస్సులు పరవశములగునట్లుపన్యసించిమాన్స్ రునగరమును జేరెను. ఇక్కడనుండఁగా నితఁడు బ్రహ్మమతములో గొప్పమార్పును దెచ్చిపెట్టెను. ఇంతవఱకు బ్రహ్మమతస్థులు సాధారణముగఁ బ్రార్థనము చేసి తమ లోఁదామభగవద్ధ్యానముచేసికొనుటయేకాని యుత్సవము లెఱుఁగరు.

అది మొదలు బ్రహ్మమతస్థులు పాటలు పాడుచు భజనలు సేయుచు నగరమున నుత్సవములు చేసి జన సామాన్యమునకీమతముపై నిష్టమును భక్తియుఁ గలుగునట్లు చేసిరి. ఇందుచేఁ గేశవునియెడల జనుల కనురాగ మతిశయమై యాయనురాగము భక్తిగాఁ బరిణమించి తుదకు వానిని భగవంతుఁడని జనులు పూజించునంతవఱకువచ్చెను. కేశచంద్రునియందు జనులకాకస్మికముగఁ గలిగిన యాయమిత గౌరవము భక్తియు వాని యనుచరులకే కొందఱకు వానిపై ద్వేషమునుగలిగించెను. నాఁడు మొదలు వానియనుచరులు రెండుకక్షులుగా నేర్పడి యొక తెగవారాతనిని భక్తిశ్రద్ధలతోఁ బూజించుటయు రెండవ తెగ

వారాతని చేష్టల ననుమానించి యట్టి పూజ కనర్హుఁడని చెప్పుటయు సంభవించెను.

హిందూదేశమున కప్పటి గవర్నరు జనరలుగారగు లారెన్సు ప్రభువుగారితో కేశవచంద్రుని కప్పటి కొక్క సంవత్సరముక్రిందట పరిచయము గలిగెను. అందుచే నితఁడు మాంఘీరులో నుండఁగా నా ప్రభువు సిమ్లానగరమునకు రమ్మని వానిని సన్మార్గపూర్వకముగ పిలువ నక్కడ కరిగెను. ఆకాలమున రాజప్రతినిధిగారితో మాట లాడి యితఁడు బ్రహ్మమతస్థుల వివాహములను శాస్త్రీయముగఁ జే యుట కొకశాసనమును నిర్మించుట యావశ్యకమని కనఁబఱచెను. గవర్నరుజనరలుగారు కేశవచంద్రుని యాలోచన మంచిదని యొప్పు కొని యట్టిశాసనము నొకదానిని నిర్మింపఁ బూనుకొనెను. తరువాత నతఁడు కలకత్తాకువచ్చి బ్రహ్మమందిర నిర్మాణమును వేవేగముగించి 1869 వ సంవత్సరము 7 వ ఆగష్టునతద్గృహప్రవేశోత్సవమును జేసెను.

1870 వ సంవత్సరము ఫిబ్రేవరు 15 వ తారీఖున కేశవచంద్రుఁడిగ్లాండు దేశమునకుఁ బ్రయాణమైపోయి 21 వ మార్చిని లండ ననగరముచేరి యక్కడనున్న లారెన్సుప్రభువుగారివలనను మఱికొందఱివలనను సగౌరవముగ నాదరింపఁ బడెను. ఆయన యేపట్టణము నకుఁ బోయిన నాపట్టణమున జనులందఱు వానినమిత గౌరవముచేసి మిక్కిలి యుత్సాహముతో వానియుపన్యాసముల వినిరి. అతఁడా దేశమున పదునాలుగు ముఖ్యపట్టణములకుం బోయి యచ్చటి జనులకు వీనుల విందుగా మతము వేదాంతము నీతి హిందూదేశ పరిపాలనము మొదలగు నంశములగూర్చి మహోపన్యాసముల నిచ్చి యం దఱిచేతఁ గొనియాడఁ బడియె. అతని కీర్తివిని యాంగ్లేయ తత్వశాస్త్రజ్ఞుఁడగు మిల్లుదొరయు సంస్కృతపండిత శిఖామణియు వేదాంగ వేద్యుఁడునగు మాక్సుమలరుదొరయు మఱియు ననేకులు వానిదర్శ

నముచేసి సంతుష్టాంతరంగులైరి. ఇంగ్లాండుదేశపు మంత్రులలోనగ్రగణ్యులగు "గ్లాడుస్టను" గారిని "డిసురైలి" గారిని జూచి కేశవచంద్రుఁడు వారితో మనదేశ వ్యవహారములను గూర్చి ప్రసంగించెను. ఆదేశమందంతట నతని యశము వ్యాపించుటచే నలువది పట్టణముల సమాజములవారు తమయూళ్లు వచ్చి యుపన్యాసములిమ్మని వానిం బ్రార్థించిరి. కాని తీరికలేమి నతఁడు వారి యభిలాషఁ దీర్ప జాలఁడయ్యె. మొత్తముమీఁద నతఁడక్కడ నున్నకాలములో రమారమి డెబ్బది సభలలో మాటలాడి నలువదివేల జనుల కుపన్యసించెను.

ఈగౌరవము లన్నిఁటికంటె వేయిరెట్లెక్కువ గౌరవము వానికి జరిగెను. ధర్మస్వరూపిణియుఁ గాంతాజనమతల్లియు భరతఖండప్రజలకుఁ దల్లియు నగు శ్రీవిక్టోరియా రాణీగారతనికి దర్శనమిచ్చి సంభాషించి వాని ప్రతిబింబమును వానిభార్య ప్రతిబింబమును(ఫోటోగ్రాపు) వారివలనం గ్రహించి తన ప్రతిబింబమును తనభర్తయగు నాల్బర్టు ప్రభువువారి ప్రతిబింబమును వానికిచ్చి గౌరవించెను. కేశవచంద్రసేనుని గౌరవించుటకు "మిస్ కార్పెంటరు" యను నామె బ్రిష్టలునగరమున హిందూదేశ క్షేమకరములైన ప్రసంగములు చేయుటకు "నేషనల్ ఇండియన్ అసోసియేషను" ననుపేర నొక సమాజము నేర్పఱచెను. బ్రిష్టలు నగరమున కతఁడు పోయినప్పు డప్పటికి రమారమి నలువదేండ్లక్రిందట స్వదేశమువిడిచి యిగ్లాండునకుం బోయి దేశోపకారార్థమై ప్రాణములువిడిచి కీర్తిశేషుఁడైన రాజా రామమోహనరాయల సమాధిని జూడఁబోయి మృతజీవుఁడైన యామహాత్మునియందలి గౌరవముచే మోకాళ్లపయిం బడి నమస్కరించి యాబ్రహ్మసమాజ స్థాపనాచార్యుని యాత్మకు మోక్షమొసంగుమని భగవంతుని బ్రార్థించెను. బాల్యమునుండియు నితనికి కవికులసార్వభౌముఁడగు షేక్స్పియరుమీఁద నత్యంతాభిమాన ముండుటచే నాకవిజన్మస్థానముఁ జూడ నభిలాషగ

లుగ "నావను" నదిమీఁదనున్న (స్టాటుఫరుడు) గ్రామమునకుఁ బోయి యా తఁడు కాపురముండిన కుటీరమును వానిపుట్టిన చిన్నగదియు నతఁడు నాటకములు వ్రాసికొన్న బల్లయుఁ జూచి సంతసించి పిమ్మట నాతని సమాధియొద్దకుఁ బోయి ముప్పదియెనిమిది నాటకములు రచియించి నాగరికులగు సకలజగజ్జనులచేఁ గొనియాడఁబడునాకవిరాజునుద్దేశించి వినయమున నమస్కరించి తనకుఁ గల గౌరవమును వెల్లడించెను.

అనంతర మతఁ డింగ్లండు దేశమునుండి 1870 వ సంవత్సరము సెప్టెంబరు 17 వ తేదీని బయలుదేరి అక్టోబరు 15 వ తేదీని బొంబా యినగరముఁ జేరెను. చేరినతోడనే యచ్చటిజను లతని కపూర్వమ యిన గౌరవముఁ జేసిరి. అచ్చటనుండి యతఁడు కలకత్తా నగరమునకుఁ బోవ స్వదేశస్థులందఱు బొంబాయినగరమునందు జరిగినయుత్సవము కంటె గొప్పయుత్సవముఁ జేసి వానిని సన్మానించిరి. ఇంగ్లాండునుండి వచ్చినస్వల్పకాలములోనే కేశవచంద్రుఁడుమన దేశస్థులసంఘవృద్ధికిని నీతివృద్ధికిని హిందూసంస్కరణసమాజము నొక్కదానినిఁ నేర్పఱచెను. ఆ సంస్కార మీక్రిందివైదువిధములుగఁ జేయుటకుఁ బ్రారంభించెను. 1 జ్ఞానము బీదలకు సయితము గలుగుటకు గ్రంథములవ్రాసితక్కువ వెలకు వానినమ్ముట. 2 తగినవారికి దానముచేయుట. 3 స్త్రీల యభి వృద్ధికయి పాటుపడుట. 4 దేశమునందంతట విద్యవ్యాపింపఁ జేయుట. 5 మద్యపానాది దురాచారములు దేశమునఁ బ్రబలకుండునట్లుపనిచే యుట. ధనహీనులకుఁ దక్కువవెలకుఁ బత్రిక లంద జేయవలయునను తలంపుతో సులభసమాచారమను పేరవారమునకొకసారి పైసచందా తోఁ బత్రికనొకటి ప్రకటింపఁ జొచ్చెను. స్త్రీలకొక బోధనాభ్యాసన పాఠశాల (నార్మల్ స్కూలు) స్థాపించి యతఁడు స్త్రీవిద్యాభివృద్ధిఁగా వించెను. కొంతకాలము గడచిన పిదప "భామాహితార్థినీసభ" యొ కటి స్థాపింపఁబడి దినదినాభివృద్ధి నొందుచుండెను. ... స్థాపనలు మొద

లగునవి నేర్పియనేకులకు మంచివృత్తులు కల్పించుట కొకపాఠశాలను గూడ నీయనస్థాపించెను.

దేశమునందున్న బ్రహ్మమతావలంబుల సందఱ నొక్కదారిని తెచ్చుటకయి ప్రయత్నించి 1874 వ సంవత్సరమున భరతాశ్రమము నస్థాపించెను. కేశవచంద్రుఁ డిందునిమిత్తము పెద్దదొడ్డియుఁ దోఁటయుఁగల యిల్లుకొని యితరపట్టణములనుండి బ్రహ్మమతస్థుల భార్యలు బిడ్డలువచ్చి యచ్చటనే భుజించుచు విద్య నేర్చుకొనుటకుఁ దగిన యేర్పాటులఁ జేసెను. ఆసంవత్సరమునందె మార్చినెలలో గవర్నరు జనరలుగారు బ్రహ్మ మతస్థుల వివాహములనుగూర్చి కేశవచంద్రుని యభిప్రాయ ప్రకార మొక శాసనము నిర్మించెను. భరతఖండమున సంస్కర్తగాఁ దాను చేసిన కృషికి ఫలము నేఁటికిఁ గలిగినదని యాశాసనము నిర్మింపఁబడినప్పు డతఁడు సంతోషించెను.

1875 వ సంవత్సరము మొదలు 1878 వ సంవత్సరమువఱకు నతఁడు బ్రహ్మసమాజ మతమును దగినస్థితిలో నుంచుటలో పరిశ్రమఁ జేసెను. అదిమొద లతఁడు తనమతస్థులకు వైరాగ్యమునుబోధించి కలకత్తానగర సమీపమున నొకతోఁటంగొని తానును విరాగియయి యందుండెను. తరువాత కలకత్తానగరముననే పెద్దయిల్లునొకదానినిఁ గొని "పద్మకుటీర' మని దానికిం బేరుపెట్టెను. అయింటిలో నొక పెద్దగది బ్రహ్మమతస్థుల నిమిత్తము ప్రత్యేకముగ వదలివేయఁబడెను. క్రమక్రమమున తనమిత్రులను శిష్యులను దనయింటి సమీపముననే బసలుకొని కాపురముండునట్లు ప్రోత్సాహపఱచి బ్రహ్మమతస్థులయగ్రహార మొకటి యేర్పఱచెను. పద్మకుటీరమందున్న కాలమున నీతఁడు ధనవంతుఁడు గాకున్నను గొప్పయుద్యోగస్థుఁడు గాకున్నను నెంతెంత వారికి దర్శనములీయని మహారాజులు గవర్నరులు గవర్నరు జనరలు వానియింటికి స్వయముగావచ్చి దర్శనముచేసి మాటలాడి పోవుచు

వచ్చిరి. ఈతఁడేకార్యముచేసినను నది యీశ్వరాదేశ మని నమ్మి యట్లు చెప్పుచువచ్చెను. వయసుముదిరిన కొలఁది నితనికి లోకమున గౌరవము హెచ్చసాగెను. తానుగావించిన యవివేక కార్యములు గూడ భగవదాదేశమున జరిగినవని యతఁడు చెప్పుచుండుటచే నతని యనుచరులలోఁ గొందఱి కతనిపయి నసూయ పొడమెను.

ఇట్లుండ నతఁడు కుమార్తెకుఁ బెండ్లి సేయఁదలఁచి కచిబిహారు మహారాజును వరునిగా నంగీకరించెను. పెండ్లికుమార్తెకు పదునాలుగేండ్లయిన నిండలేదు. పెండ్లికుమారుఁడు రమారమి పదునేడేండ్లవాఁడు. బ్రహ్మమత నిబంధనలఁబట్టియు కేశవచంద్రుని ప్రోత్సాహముచేతనే దొరతనమువారు నిర్మించిన చట్టముఁబట్టియుఁ బెండ్లికూఁతురు పదునాలేండ్లకుఁ దక్కువగాను పెండ్లికొడు కిరువది యేండ్లకుఁ దక్కువగ నుండరాదు. అదియెగాక కచిబిహారురాజు బ్రహ్మమతస్థుఁడుకాఁడు. వివాహము బ్రహ్మధర్మప్రకారము గాక బ్రాహ్మణధర్మప్రకారము జరుగవలసివచ్చెను. ఈకారణమునుబట్టి యతని యనుచరు లావివాహమునకు సమ్మతింపవలదని కేశవచంద్రునితో నొక్కిచెప్పినను వారిమాటలు వినక యతఁడది యీశ్వరాదేశమని చెప్పి దాటఁజూచినను దన కుమార్తెకు మంచి సంబంధము దొరికి నదిగదా యను కక్కురితిచేత స్వమతధర్మములు సరకుసేయక యనుచరుల హితోపదేశముల లెక్కగొనక లోకనిందకొడిగట్టి నిర్మలమగు తన వర్తనమున కొకమచ్చ దెచ్చుకొనెను.

కేశవచంద్రసేనుఁడు మొదట తన యల్లుఁడు బ్రహ్మమతస్థుఁడు గాకున్నను క్రమక్రమమున నతఁడు తన మతమునఁ గలియవచ్చుననియు ధనవంతుఁడగుటచే నతని కలయికవలన స్వమతము ప్రబలము కావచ్చుననియుఁ దలఁచి యీవివాహమునకంగీకరించెనని కొందఱియభిప్రాయము. అట్లయినచో నతని యుద్దేశ్యముకొంతవఱకు మంచిదని

మే చెప్పవచ్చును. అతని యనుచరుల కిదివఱకే లోలోపల రవులు చున్న యసూయాగ్ని యీవివాహమూలమున పెద్దమంటమై ప్రబలెను. అప్పుడు పండిత శివనాథశాస్త్రి మొదలగు వానియనుచరులు కోపించి కేశవచంద్రసేనుఁడు బ్రహ్మసమాజమునకుఁ బ్రధానాచార్యుఁడుగ నుండఁదగఁడని వానిం దొలఁగింపఁ బ్రయత్నించిరి. కేశవచంద్రుఁడు పోలీసువారిసహాయమునుగైకొని ప్రతిపక్షులఁబాఱఁదోలి స్వస్థానమును బలపఱచుకొనెను. వెంటనే శివనాథశాస్త్రిప్రముఖులు కేశవచంద్రుని హిందూదేశ బ్రహ్మసమాజమునుండి విడిపోయి సాధారణబ్రహ్మసమాజమును 15 వ మేయి 1878 వ సంవత్సరమున స్థాపించుకొనిరి.

1880వ సంవత్సరము మొదలుకొని కేశవచంద్రుఁడు నవీనసిద్ధాంతమని మతమునందు మునుపున్న దానికంటె క్రొత్తపద్ధతులు కొన్నిటిఁ జేర్చెను. ఈసిద్ధాంతమునుబట్టి మనుష్యుఁ డధికవైరాగ్యమునుబూని లోకసంబంధమును సాధ్యమైనంతవఱకు విడచి పరమేశ్వరభజన ధ్యానాదులయందుఁ గాలము గడపవలయును. ఈనవీనపద్ధతులఁ జక్కఁగ జనులకు బోధించుట కతని కవకాశములేకపోయెను. ఏలయన 1883వ సంవత్సరము మొదలు కేశవచంద్రుఁడు రోగపీడితుఁడై కొంతకాలము బాధపడి తుదకు 1884వ సంవత్సరమున జనవరి 8వ తారీఖున లోకాంతరగతుఁడయ్యెను. మతవిషయమున నభిప్రాయభేదము లెట్లున్నను నీదేశోపకారియకాలమరణమునకు వగవని వారు లేరు. అతని మరణవార్త యింగ్లండు దేశమునందుఁ దెలసినపుడు శ్రీవిక్టోరియా రాణిగారు వాని మరణమును విని చింతిలి తత్కుటుంబమునోదార్చుచుఁ దమ ప్రతినిధియగు రైపనుప్రభువుద్వారా వర్తమానమంపిరి. గవర్నరుజనరలుగారగు రైపన్‌ప్రభువుగారును కేశవచంద్రునిమరణము హిందూదేశమునందంతట విషాదము గలిగించెనని వాని

కుటుంబమున కుత్తరమువ్రాసిరి. హిందువులొక్కరేగాక యింగ్లీషు వారును వాని సుగుణములఁగూర్చి యొండొరుల మించునట్లు స్తోత్ర ముఁజేసిరి. ఆసంవత్సరము 30వ జనవరుసాయంకాలము కలకత్తామందిరమున కేశవచంద్రుని జ్ఞాపకార్థ మొకగొప్పసభ చేయఁబడెను. దానికి దొరతనమువారి యాలోచన సభలో నగ్రగణ్యులగు సర్. విలియమ్ హంటరు దొరగా రగ్రాసనాధిపతులైరి. అన్నిమతముల వార లన్నితెగలవారు వాని మతమునుగూర్చి శోకించి యుపన్యాసముల నిచ్చిరి. బి. యే. మొదలగు శాస్త్రపరీక్షలయందుఁ గృతార్థులైన విద్యార్థులకుఁ బట్టము లొసఁగు కాలమున వారికి హితోపదేశముఁజేయుచు ఆనరబిల్ రెయినాల్డ్సు దొరగారు సందర్భవశమున కేశవచంద్రుని పేరెత్తి వాని యోగ్యత నగ్గడించి వానిమార్గము నవలంబించి యంతవాండ్రగమ్మని నొక్కి చెప్పెను.

అంద ఱన్నివిధములఁ గొనియాడుటకు నాతనియందలి సద్గుణములె కారణములుగాని వేఱొకటిగాదు. అతఁడన్నదమ్ములతోఁ బంచుకొన్న ధనమంతయు బీదలగు బ్రహ్మసమాజమతస్థులకై వ్యయముజేసెను. ఇంతకంటె నౌదార్యవంతులఁ జూడఁగలమా ? హిందూదేశమునఁ బూర్వమహర్షులయొక్క పరిశుద్ధాస్తిక మతమును నిర్మల వర్తనమును వైరాగ్యమును నెలకొలుపుటకై జీవితమునంతయు నతఁడు ధారవోసెను. అంతియెగాని కొందఱనుకొనునట్లు తమ స్వమతాభిమానము లేనివాఁడుగాఁడు. మంచి యెచ్చటనున్నను గ్రహించుట మనుష్యధర్మమని నమ్మి యాయన యితరమతములయందలి శ్రేష్ఠ ధర్మములపైసైతము గౌరవముఁ జూపెడివాఁడు. త్రాగుబోతుతనము తలయెత్తకుండ నడఁచుటకును దిక్కుమాలిన వితంతువుల నొక్కకడఁ జేర్చుటకును నధోగతినున్నస్త్రీల నున్నతదశకుఁ దెచ్చుటకును భగవంతునియెడ నిజమైన భక్తి నెలకొల్పుటకును నాయన మిక్కిలి పా

టుపడియెను. దొరతనమువారిచ్చు బిరుదముల కెన్నఁడతఁ డాసపడ
డయ్యె. బంగాళాగవర్నరుగారొకమా రతని కలకత్తాకు మ్యునిసి
పల్ కమీషనరుగా నియమింపఁదలఁప నతఁడాగౌరవము నంగీకరింపఁ
డయ్యె. విక్టోరియారాణీగారు హిందూదేశచక్రవర్తినియైనపుడు ఢిల్లీ
లో జరిగిన దర్బారులో దొరతనమువారతనికిబంగారుపతకము నీయ
రాఁగా దాని స్వీకరింపఁడయ్యె.

ఇందూరుసంస్థాన ప్రభువగు హోల్కారు మహారాజుగారు
జయపూరు మహారాజుగారు మొదలగు మూర్ధాభిషిక్తులు తన్ను ప్రాణ
స్నేహితునిగాఁ జూచుకొని యాదరించునాఁడును కేశవచంద్రుఁడు నిగ
ర్వియై యనేకసేవకులున్నను దనయన్నము దాను వండుకొనుచు సా
మాన్యులతోఁ గలసిమెలసి వారిసుఖదుఃఖములు తనవిగా ననుభవిం
చుచుండెను. అతనివిగ్రహ మాజానుగుల పొడుగుగలది. బాహువులు
దీర్ఘములు. వక్షస్థలము విశాలము. అతని ముఖవర్చస్సు జనుల నాక
ర్షించునదియై రాజకళను గలిగియుండును.

బ్రహ్మసమాజ మొకమతముగా హిందూదేశమున వ్యాపిం
చుట కితఁడే కారణము. ఈతని యుపన్యాసము లసాధారణములు.
కుంభవృష్టులు నేలఁ గురిసినట్లతిచాకచక్యముతో నుపన్యసించుటకును
వినువారి సమ్మోహనాస్త్రముచేఁ గట్టఁబడునట్లు నిశ్చేష్టితులుగఁ జేయు
ట కతఁడే సమర్థుఁడు. ఇంతటి మహావక్త హిందూదేశమున నదివఱ
కెన్నఁడు నుద్భవింపలేదు. స్వల్పలోపము లొకటిరెండున్నను కేశవ
చంద్రుఁ డనేకసద్గుణసంపన్నుఁ డగుటచే సర్వసజ్జన స్తవమునకుఁ
బాత్రుఁడు.

---

# వివేకానందస్వామి.

ఆసేతుహిమాచలమగు భరతఖండమునందంతటఁ గీర్తివ్యాపించియున్న నీమహాత్ముని చరిత్ర మెక్కడమాకు సమగ్రముగా లభింపలేదు. అందుచే నీతని చరిత్రము సంగ్రహముగా వ్రాయవలసివచ్చినది.

ఈయన బంగాళా దేశస్థుఁడగు శూద్రుఁడని కొందఱు క్షత్రియుఁడని కొందఱుఁ జెప్పుచున్నారు. పూర్వాశ్రమమునందీయన పేరు నరేంద్రనాథదత్తు. సన్యసించిన వెనుక నీయన వివేకానందస్వామియని పేరుపెట్టుకొనెను. నరేంద్రనాథదత్తుయొక్క తల్లిదండ్రు లెవ్వరో వారెట్టివారో యాతని బాల్య మేవిధముగా గడుపఁబడినదో మనము తెలిసికొనుటకుం దగిన యాధారములేవియు లభింపలేదు. కాని యాతనితండ్రి కలకత్తానగరవాసుఁడేయనియు నరేంద్రనాథదత్తు తత్పట్టణమునందే పుట్టి పెరిగి యింగ్లీషువిద్య చదువుకొని తుదకు పట్టపరీక్షయందనఁగా బి. యే. పరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెనని కొన్నిగ్రంథములం జదివినారము. ఈయన ప్రథమమందు బ్రహ్మసమాజమతాచార్యుఁడగు కేశవచంద్రసేనునితోఁగలసి యామతాభిమానము గలిగియుండెనఁట. అనంతరము శ్రీరామకృష్ణపరమహంసయొక్క మహిమలు విని యతనిశిష్యుఁడైన నరేంద్రనాథదత్తు వానియనుగ్రహము వలన వేదాంతవిద్యోపదేశమునొంది బ్రహ్మజ్ఞానసంపన్నుఁడై గురువుగారి మరణానంతరమున లౌకికవ్యాపారములపై విరక్తిపొడమ సన్యసించి వివేకానందస్వామి యనుపేరం బ్రసిద్ధుఁడై తన జీవితశేషమంతయు లోకోపకారార్థమై గడపి యుపనిషన్మతమును భరతఖండమునందేగాక యమెరికాఖండమునందును యూరపుఖండమునందును బోధించెను. ఈయన సన్యసింపకమునుపును సన్యసించిన వెనుక, కొంతకా

లమును మన దేశమందేయున్నను వానిపేరెవ్వరికిం దెలియరాదయ్యె. అమెరికాఖండమునకుఁ బోయినవెనుకనే యాతనియందణగియున్న జ్ఞానవిశేషమంతయు బయలుపడుటయు నందుమూలమున లోకమంతయు నతని నెఱుఁగుటయు సంభవించెను.

అమెరికాఖండమున యూనైటెడ్డుస్టేట్సను దేశముగలదు. అందు షికాగోయను గొప్పనగరమున్నది. ఆదేశస్థులందఱు కోట్లకొలఁది ధనము చందాలమూలమునఁ జేర్చి షికాగోనగరమున 1893 సం॥రమున గొప్పప్రదర్శనము జరిగించిరి. ఆప్రదేశమునం దేదేశపుమనుష్యులు మున్నెన్నఁడు జూచియుండని చిత్రములు చూచునట్లును విని యెఱుఁగని సంగతులు వినునట్లును తత్కార్యనిర్వాహకులేర్పరచిరి. ఆప్రదేశమునందె సర్వమతములఁగూర్చియు జర్చలుజరుపఁదలంచి మతమహాసభ (Parliament of Religions) నొకదాని నచ్చటివారుకూర్చిరి. ఆమతమహాసభకు వివిధదేశములనుండి వివిధమతములవారు తమతమ మతములయందలి మేలిసంగతుల ప్రపంచమునకుఁ దెలియునట్లచ్చట నుపన్యసింపఁదలంచి యానగరమునకుంబోయిరి. వివేకానందస్వామియుఁ బవిత్రమైన యుపనిషన్మతమును బ్రహ్మవిద్యను నాగరికతతోఁ దులతూఁగుచున్న పశ్చిమఖండవాసులకు నమెరికాఖండవాసులకుఁ దెలుపఁగోరి యామతమహాసభకుఁ బోవసమకట్టెను. కాని ప్రయాణము ధనమూలముగదా. అదివఱకె సన్యసించియున్న యామహాత్మునకు ప్రయాణమునకుఁ గావలసిన ధనము చిక్కకపోవుటచేతను తనదేశస్థు లెవ్వరుఁ దనపూనికకుఁ దోడుపడకపోవుటచేతను వివేకానందుఁడు చెన్నపట్టణమువచ్చి తనయుద్యమ మచ్చటి పెద్దమనుష్యుల కెఱిఁగించెను. నివురుగప్పిన నిప్పువలెనున్న యతనిజాడ నెఱిఁగి చెన్నపురివారు కొంతధనమిచ్చి యాయన నమెరికాఖండమునకుఁ బంపిరి.

స్వమతములంగూర్చి యుపన్యసించుటకు షికాగోనగరమునకు మన దేశమునుండి వెళ్ళినపురుషుఁడొక్కఁడేగాఁడు. బ్రహ్మసమాజమత

పక్షమునప్రతాపచంద్రముజుందారునుబౌద్ధమతపక్షమునధర్మపాలుఁడు ను మనదేశమునుండియే వెళ్ళిరి. కాని వీరిద్దఱికంటెను మతసంబంధ ములగు చర్చలు సేయుటకు వెళ్ళిన తక్కిన పురుషులకంటెను వివేకా నందస్వామికొక్కనికే యధికఖ్యాతి గలిగెను. చూపరులమనస్సుల నాకర్షించు మూర్తియు మంచి ముఖవర్చస్సును గంభీరమైన కంఠ నాదమును గలిగి కాషాయాంబరములు ధరించిన యా హిందువును జూచినదిమొదలమెరికా ఖండవాసులకు వానియందొక విధమైన యనురాగ ముదయించుటచే నాతఁడుచేయు నుపన్యాసముల వారు శ్రద్ధతో నాలకింపఁ జొచ్చిరి. వివేకానందస్వామి యమెరికాకు పోక మును పచ్చటిజనులకుమతమునుగూర్చియు మననాగరికతనుగూర్చియు నంతగాఁ దెలియదు. మనలను బాగుచేయు నెపమున మనదేశమునకు వచ్చు క్రైస్తవమత బోధకులు మరల స్వదేశమునకుఁ బోయినప్పుడు హిందువులమతము దుర్మత మనియు వారు మనుష్యజాతిలో నెంచఁ బడఁ దగినవారు కారనియు నప్పుడప్పుడు చెప్పుచుందురు. కావున నచ్చటిజను లామాటనువిని మన విషయమున నెంతయు నధమాభి ప్రాయమును గలిగియుండిరి.

వివేకానందస్వామి బోధనలు వినినవారి కందఱకు నట్టి యభి ప్రాయములు పోయినవి. ఈయన యా దేశమున బోధించినది వేదాంత మతము. అనఁగా నుపనిషత్తులలోని మతము. ఆయనకు శంకరాచార్యునియందును రామానుజాచార్యునియందును మిక్కిలి గౌరవము గలదు. వేదాంతమతము సర్వోత్కృష్ట మయినదనియు నిది తక్కిన మతములవంటిది గాదనియు మహమ్మదీయమతము క్రైస్తవమతము మొదలగునవి యొక్కొక్క పురుషునిమీఁద నిలిచి యున్నవనియు నాపురుషుఁడు లేఁడనిగాని యా పురుషునియందట్టి మహిమలు లేవనిగాని నిర్ధారణ చేయఁబడినప్పుడు తప్పక యామత

ములు నశింపవలసి యున్నవనియు వేదాంత మతమెవరో యొకపురుషునిమీఁద నిలిచియుండలేదు గావున నది సర్వకాలములయందు సర్వదేశములయందు సకలజాతులవారికి నవలంబనీయ మనియు నతఁడు బోధించెను.

పీఠములమీఁదనెక్కి మనకు గురుస్వాములమని చెప్పుకొనుచు సన్యాసులయ్యు జమీందారులకంటె నెక్కువభోగముల ననుభవించు మతగురువులు నశించినప్పుడుగాని మనదేశ మభివృద్ధిపొందదని యాయన పలుచోట్ల నొక్కిచెప్పెను. వేదాంతవిద్య జాతిభేదములేక సకల జనులకు నుపదేశింపఁ దగినదనియును, చండాలాది నీచజాతులకుఁ గూడ విద్యాబుద్ధులుచెప్పి బాగుచేయవలసిన భారము మనమీఁద నున్నదనియు నీచజాతులు హీనస్థితిలో నుండుటచేతను మనదేశము చెడిపోయినదనియుఁ గావున వారిస్థితిని జక్కఁజేయుటకు మనమందఱము పాటుపడవలసినదనియు వివేకానందస్వామి యనేకోపన్యాసములలోఁ బ్రసంగించుచు వచ్చెను. అంతియగాక తాను చనిపోవులోపుగ పదిమంది మాలవాండ్రనయిన నుత్తమబ్రాహ్మణులుగఁ జేసి మృతినొందుదునని చెప్పెను. కాని యీ కార్యము నెరవేరక ముందె యాయన మృతిపొందెను. తక్కువజాతులవారి నున్నతస్థితికి దెచ్చుట కీయన కిష్టమే. ఆ విషయమున నొక యుపన్యాసమందాయన యిట్లు చెప్పియున్నారు. "బ్రాహ్మణులు మొదలగు నగ్రవర్ణములవారు తమయాచార వ్యవహారములు వదలుకొని తక్కువ జాతులలోఁ గలియఁగూడదు. కాని మాలవాండ్రు మొదలగుతక్కువ జాతులవారికి వేదశాస్త్రములు మొదలగు విద్యలుచెప్పి వారి నగ్రవర్ణజులతో సమానులుగఁ జేయవలయును. ఇదియే నీచజాతుల నున్నతస్థితికిఁ దెచ్చుట"

అమెరికాఖండమునందు మతమహాసభ ముగిసిన వెనుక వివే

కానందుని యుపన్యాసముల నెంతవినినం దనివితీరక యచ్చటివా రనేకులు కొంతకాలము తద్దేశముననుండి యుపన్యాసముల నింక నిమ్మని ప్రార్థించిరి. అందుచేత నాయన మఱి రెండు సంవత్సరము లచ్చట నుండవలసి వచ్చెను. ఆ కాలమునందాయన ప్రతిదిన ముద యము మధ్యాహ్నము సాయంకాలము వేఱు వేఱు స్థలములయందు ప్రజలడిగిన మతవిషయములఁగూర్చి యుపన్యసించుచు స్థలాంతరముల నుండి వచ్చిన పెక్కుజాబుల కుత్తరములు వ్రాయుచు నిమిషమయిన వ్యవధిలేకయుండెను. అమెరికాఖండమునందున్న యనేక సంఘములు సమాజములు సభలు నొకదాని నొకటి మించునట్లు గౌరవపురస్కర ముగా వానిని రావించి యాతఁడు చేసిన యుపన్యాసముల విని సంత సించెను. ఆ దేశమునందు నాస్తికులుండుటచేత వారందఱు స్వామిని తమతమ సమాజములకుఁ బిలిపించి యీశ్వరుఁడున్నాఁడని ఋజువు చేయుమని యాయన నడిగి యనేక విషమప్రశ్నలువేసి పెక్కు చిక్కులం బెట్టిరి. కాని యతఁడు వారి కాధారములయిన ప్రకృతి శాస్త్రములచేతనే వారి నోళ్ళడచి యీశ్వరాస్తిక్యమును స్థాపించి యాసమాజములలో నెగ్గి వచ్చెనఁట. అమెరికా ఖండమునం దతఁడు న్నకాలములో కొందఱు నాస్తికులాస్తికులయిరి. కొందఱు క్రైస్త వులు స్వమతముల విడిచి వివేకానందస్వామికి శిష్యులై తమ పూర్వ నామములఁ గూడ మార్చుకొనిరి. ఒకదొరగారు యోగానందస్వామి యని పేరుపెట్టుకొనిరి. ఒక దొరసాని తనతొల్లిఁటి పేరువిడిచి నివే దితయను పేరంబరగుచున్నయది. ఆమెయే హిందూదేశమునకువచ్చి కలకత్తా. కాశీ మొదలగు నగరములలో మన మతవిషయములగు నుపన్యాసములనిచ్చి కొన్ని గ్రంథములను గూడ రచియించినది.

వివేకానందుఁ డింక కొంతకాలమువఱకు జీవించియున్న పక్ష మున నమెరికాలో కాలిఫోర్నియా యను మండలమున నొక దేవా

లయమును గట్టింపవలయునని సంకల్పించుకొనిరి. ఇట్లమెరికాఖండ ములో నతఁడు వేదాంతమతమునుగూర్చి రెండు సంవత్సరములు కొంతపనిచేసి స్వదేశమును జూడవలయునని బయలుదేరి ముందుగా సింహళద్వీపమునకు రాజధానియైన కొలంబో నగరమున దిగెను. ఆనగరమున నతఁడు దిగినాఁడనువార్త వినినదిమొదలు మనదేశ స్థులు జగత్ప్రసిద్ధిని గాంచిన యీ మహాత్ముని దమతమ పట్టణముల కెప్పుడు రావించి వాని వాక్యామృతము నెప్పుడు గ్రోలుదుమాయని యువ్విళ్ళూరుచు, వానిని గౌరవపూర్వకముగాఁ బిలిచిరి. వివేకానంద స్వామి కొలంబోనుంచి బయలుదేఱి పూర్వము తనకు సహాయము చేసి తన్నమెరికాఖండమునకుఁ బంపిన చెన్నపురివాసులయెడలఁ గృత జ్ఞుండయి వారిని జూడవచ్చెను. ఆసమయమునఁ జెన్నపురివాసు లాయ నకుఁ గావించిన మహాగౌరవముఁ జూచి తీరవలయును; కాని వర్ణింప నలవికాదు. అతఁ డచ్చటఁ గొన్ని యుపన్యాసములనిచ్చి యనంత రము కలకత్తా నగరమునకుఁ బోయెను. తమ దేశములో నున్నంత కాల మాయన పరిజ్ఞల నించుకయు నెఱుంగని బంగాళా దేశస్థులు విదేశములలో మిక్కిలి పేరువడసిన యీ సన్యాసిని మిక్కిలి గౌర వించి వాని యుపన్యాసములవలన లాభము పొందిరి. పిమ్మట వివే కానందుఁడు బొంబాయి, యలహాబాదు మొదలగు పరిదేశములకుఁ బోయి దాదాపుగ హిందూదేశమంతయుఁదిరిగి వేదాంతమత మంద ఱకుపదేశించి యనంతర మింగ్లాండు దేశమునకుఁ బోయెను.

అక్కడ చతుర్వేదముల పారమును జూచినవాఁడును శాస్త్ర ముల రహస్య మెఱిఁగినవాఁడును స్మృతుల ధర్మమును తెలిసినవాఁ డును సంస్కృత భాష కూలంకషముగ నేర్చినవాఁడును విద్యాసము ద్రుఁడునగు మోక్షమూలరు పండితుఁడు నివసించియుండుటచే వివే కానందుఁ డామహాపురుషుని దర్శించుటకుఁ బోయెను. వేదాంత

విద్యాభిమానులగు నా పండితు లిరువురు నొండొరులఁ గౌఁగలించు కొని హిందూదేశమును గూర్చి చాలసేపు ముచ్చటించి యొకదినము సంతోషమున గడపిరి. వివేకానందుఁడు మోక్షమూలరు పండితు నితోఁ గలసి యాతనియింటనున్నపుడు మహర్షితోఁ గలసి యొక యాశ్రమమున నున్నట్టె యున్నదని చెప్పెను. వివేకానందస్వామి యింగ్లాఁడులో నున్నపుడు తద్దేశస్థులు వాని నుపన్యాసములను మిక్కిలి శ్రద్ధతోను గౌరవముతోను వినిరి. వివేకానందస్వామికి సంఘసంస్కారమునం దిష్టములేదనియు హిందువులందఱు పూర్వా చారప్రకారము తప్పక నడచుకొనవలసినదని యాయన యభిప్రాయమనియుఁ గొందఱు చెప్పుచున్నారు. కాని వారి మాటలు సరికావు.

వివేకానందస్వామి తాను స్వల్పసంస్కారములఁ జేయువాఁడనుగాననియు సంస్కర్తలకంటెనెక్కువసంస్కర్తననియుఁగొన్నికొన్ని యుపన్యాసములలోఁజెప్పెను. ఆయనచరిత్రమునుచక్కగాపరీక్షించిన వారికి మొదటినుండియునాయనసంస్కర్తయేయనితోఁచకసమానదు. కలియుగమందుసన్యాసము బ్రాహ్మణులకే నిషిద్ధమని యున్నది. అట్లుండఁగాఁ దాను బ్రాహ్మణేతరుఁడయ్యు వివేకానందస్వామి సన్యసించుటయే యొకసంస్కారము. అట్లుసన్యసించి సన్యాసిధర్మములనె అపుచు కర్మభూమి యగుభరతఖండమునందుండక మహాసముద్రము దాఁటి నౌకాయాత్రలుచేసి కర్మబాహ్యము లగు మ్లేచ్ఛదేశములకుఁ బోయి జాతి, మత భేదములులేని క్రైస్తవులతోఁ గలసిమెలసి చిర కాలమునుండి వారియిండ్ల భోజనములుచేసి మనవారియభిప్రాయ ప్రకారముగ బ్రాహ్మణులకొక్కరికే యుపదేశింపఁబడఁ దగిన వైదిక ధర్మములను బ్రహ్మవిద్యను ననార్యులగుమ్లేచ్ఛుల కుపదేశించి మన మతమునకు విరుద్ధముగా జరించిన వివేకానందస్వామి సంస్కారము

నకు విరోధియనిపలుకుట కేవలహాస్యాస్పదముగాదా ! ఆయన చేసిన యుపదేశమిది :—"ఇంగ్లీషువారు చేయుచున్నా రనుకారణముచేతనే పనిచేయనలదు. అది మంచిదేయైన పక్షమునఁ జేయవలయును. మన శాస్త్రములఁజదువకుండనిరాకరింపవద్దు. మనమతగ్రంథములన్నియుం జదివియందులోనున్న మంచి గ్రహింపవలయును. మనశాస్త్రములలో దేశాభివృద్ధికి భంగకరములయిన సంగతు లనేకములున్నవి. వానిని మంచివానిగ మార్చుకొని మనమభివృద్ధిపొందవలయును. మనమందఱము మూఢవిశ్వాసములోఁ బడియున్నారము. ఆమూఢవిశ్వాసము నశించినప్పుడుగాని దేశముబాగుపడదు. విదేశప్రయాణములు హిందువులందఱు యథేచ్ఛముగా జేసి యాయాదేశములందున్న క్రొత్త విద్యలు నేర్చుకొని మనదేశమును బాగుచేయవలసినదేగాని దేశమును విడిచిపోవుట తప్పుగాదు." ఈ మొదలగుసంగతులే యతఁడుతన యుపన్యాసములలోఁ దఱచుగఁజెప్పుచు వచ్చెను. మతమునందు సంఘమునందు ననేకసంస్కారముల నాయన చేయసంకల్పించెను. విదేశప్రయాణము మొదలగు సంస్కారములం దాయనకు మిక్కిలియిష్టమని తెలియజేయుటకై యాయన జపానుదేశమునుండి వ్రాసిన జాబును నుపన్యాసములలోఁ గొన్నిభాగముల నీక్రిందఁ దెలిఁగించి యుదాహరించుచున్నాము :—

"జపానుదేశస్థులు ప్రస్తుతకాలమున కనుగుణముగా నడుచుకొనుట యావశ్యక మని తెలిసికొనిరి. వారు తమదేశస్థులలో నొకఁడు కనిపెట్టిన క్రొత్తఫిరంగులతో సన్నాహము చేయఁబడిన యొకమహాసేనను సిద్ధముచేసియున్నారు. ఆఫిరంగులు తక్కిన దేశములవారికిఁదీసిపోవు. అగ్గిపుల్లల యంత్రశాలలు చూచువారికి మిక్కిలి వినోదమును గలిగించుచున్నవి. జపానువారు ప్రతివస్తువును తమదేశమునందే చేసికొనుటకు ప్రయత్నించుచున్నారు. ఈకాలపు నాగరికత నిచ్చటిమ

తగురువులుగూడ నేర్చి యవలంబించినారు. జపానువారిగొప్పతనమం తయు నేనొక్కజాబులో వ్రాయఁజాలను. కాని మనవాండ్రిలో ప ఋచువాండ్రు సంవత్సరమునకుఁ గొండఱుచొప్పున వచ్చి యీ దేశ మును జూతురుగాక యనికోరుచున్నాను. వా రిట్లున్నవారు. మీరె ట్లున్నవారు? యావజ్జీవము శుష్కప్రియములు పలుకుచు కాలముపా డుచేయుచున్నారు. ఒకమారువచ్చి యీ దేశస్థులనుజూచి సిగ్గుపడి త లలువంచుకొనుఁడు. కూర్చుని ముసలివాండ్రివలె కదలలేక యిల్లువిడి చిన జాతిపోవునని భయపడుచున్నారా? వేయియేండ్లనుండి మూఢవి శ్వాసములో మునిఁగి తేలుచు నీయన్నముముట్టవచ్చు నాయన్నము ముట్టఁగూడదను కుశ్శంకలతోఁ గాలమంతయుఁగడుపుచు భూతదయ నంతను జంపుకొని మీరిప్పుడున్నారు. చచ్చిచెడి పుస్తకములనువల్లె నవేసి పెద్దపరీక్షలయందుఁ దేఱి యేకచేరీలోనో ముప్పదిరూపాయల గుమాస్తాపనికి దేవులాడుటయో లేక ప్లీడరగుటయో మీపురుషార్థ ముగానున్నట్లు గానఁబడుచున్నది. మీపుస్తకములను మీ బి. యే. గౌనలును మీపట్టాలును ఖిమ్ముల్లను ముంచివేయుటకు సముద్రము లో నీరులేదా? రండి. పౌరుషము దెచ్చుకొనుండి. మీ కూపములు విడిచి బయటికి రండి. ఇతరజాతు లేవిధముగా మహాభివృద్ధిని బొం దుచున్నవో చూడుఁడి. వెనుకకుఁజూడక ముందడుగేవేయుఁడి."

వివేకానందస్వామి వర్ణములవిషయమున నొక యుపన్యాస ముచేయుచు నిట్లనియె. ఒకవర్ణమునకుఁ దక్కినవర్ణములకంటె నె క్కువ యధికారము గౌరవము నిచ్చుదినములు గతించిపోయినవి. అవి మరలరావు. వానిని గురించి మనము పోరాడుచున్న పక్షమున మనము క్రమక్రమంబున బలహీనుల మగుదుము. ఈ వర్ణవిషయ మున మహమ్మదీయ మతముగూడ కొంతపని జేసినది. మహమ్మ దీయ పరిపాలన మధమ జాతులకును బీదలకును విముక్తి గలుగఁ

జేసినది. అందుచేతనే హిందువులలో నైదవవంతు జనులు తురక లైరి. ఇదియంతయు బలవంతముగా ఖడ్గములోనే వారుచేసిరని మన మనరాదు. అట్లనుట కేవలము పిచ్చి. మనమేమియు సేయక యూర కున్న పక్షమున నీ చెన్నపురి రాజధానియందలి జనులలో సగము క్రైస్తవు లగుదురు. నేను మలబారు జిల్లాలో నొక చిత్రమయిన యాచారమును జూచితిని. మాలవాఁడు బ్రాహ్మణులు నడచునట్టి దారిని నడువరాదు. ఆ మాలవాఁడే క్రైస్తవుఁడో మహమ్మదీయుఁ డో యై వచ్చినప్పుడు మనము వానిని స్పృశియించుటకైన సందే హింపము. దీనినిబట్టి మనమేమి తెలిసికొనవలయును? ఆ మలబారు లోనుండు వారందఱు పిచ్చివాండ్రనియు వారియిండ్లు పిచ్చివాండ్ర వైద్యశాలలనియు గ్రహింపవలయును. ఇట్టి దురాచారములుగల జాతులవా రుండుట తలవంపులుగావా? శూద్రుఁడు వేదము విన్నప క్షమున వానిచెవిలో సీసము కరిగించి పోయవలయునఁట! వాఁడు వేద ముచ్చరించిన నాలుకకోయవలయునఁట! ఇట్టి భయంకరవాక్య ములుగల గ్రంథము లనేకములు మనపూర్వులువ్రాసినవి యున్నవి. అట్లు వ్రాసినపాపాత్ములనేకులు ప్రతిస్థలమునందు ప్రతికాలమునందు నుండుచు వచ్చిరి."

ఈకాలమునందు వర్ణభేదములనుగూర్చి యెన్నోవివాదము లు పొడముచున్నవని నేను విచారించుచున్నాను. ఇట్టివాదము లుం డఁగూడదు. ఇవి యుభయులకు నందుముఖ్యముగ బ్రాహ్మణులకు మంచిదిగాదు. ఏలయన నగ్రవర్ణములకుఁ గల ప్రత్యేకగౌరవము లడుగంటినవి. కావున బ్రాహ్మణుఁడు తక్కినవర్ణములవృద్ధికొఱకు పాటుపడవలయును. అట్లుచేసినవాఁడు దాని నెంతకాలము చేయునో యంతవఱకు బ్రాహ్మణుఁడు. అట్లుచేయక ధనార్జనము చేసికొన్న వాఁడు బ్రాహ్మణుఁడుకాఁడు.

శూద్రులకు నేనొక్కమాట చెప్పుచున్నాను. మీరు తొందరపడక వేచియుండుఁడు. వంకదొరికినప్పుడెల్ల బ్రాహ్మణులతో వివాదములాడవద్దు. ఏలయన నింతకాల మణఁగియుంట మీలోపమే. బ్రహ్మవిద్యయు సంస్కృతమును మిమ్మెవ్వరు నేర్చుకొనవద్దనిరి? ఇంతకాలము మీరేమిచేయుచుంటిరి? ఇన్నాళ్ళుసోమరులై యుండియెవ్వరో మీకంటె నెక్కువ తెలివితేటలు నెక్కువచాకచక్యము నెక్కువయదృష్టము గలిగియున్నారని యిప్పుడు మొగముముడుచుకొనిన నేమిలాభము? మీరు సంస్కృతము మొదలగునవి చదువుకొని బ్రాహ్మణులుగండు. మనమందఱ మొక్కయాలోచనమీఁద నడచినప్పుడు బలవంతుల మగుదుము. మనోనిశ్చయమే బలము. దీనికొక్క తార్కాణముచెప్పెద వినుఁడు. నాలుగుకోట్లమంది యిగ్లీషువారు ముప్పదికోట్లమంది హిందువుల నెట్లుపరిపాలించుచున్నారు? ఆనాలుగుకోట్లజనులు నొక్కయాలోచనపై నడచుచున్నారు. అందుచే నపరిమితమైనబలము వారికిఁ గలిగినది. మీముప్పదికోట్ల జనులు నొకరికొకరి సంబంధములేకుండ ముప్పదికోట్లవిధముల నడుచుచున్నారు. అందుకే మీగతి యిట్లున్నది.

వివేకానందుని గ్రంథములలో నిట్టిసంగతులనేకము లున్నవి. చోటుచాలమి నిచ్చటవ్రాయుటకు వీలులేదు. వివేకానందస్వామియత్యంతమైన దేశాభిమానముగల సత్పురుషుఁడు. మనయార్యులగొప్పతనమును మనమతముయొక్క ప్రాశస్త్యమును లోకమునకు వెల్లడిచేయవలయు నని బాల్యమునందె సన్యసించి ఖండాంతరంబులకుఁబోయి చక్కఁగాఁ బనిచేసెను. ఈయన సంకల్పములన్నియు నెఱవేఱకమున్నె మన దురదృష్టమున బాల్యమునందె పరలోకగతుఁ డయ్యెను. ఈయన శిష్యులగు నభేదానందస్వామి శారదానందస్వామి మొదలగువారు వానిమార్గము ననుసరించియే పనిచేయుచున్నారు.

# ద్వారకనాథమితర్.

ఇతఁడు బంగాళా దేశములో హుగ్లీమండలమునందలిఅంగునిశీయను గ్రామమున 1833 వ సంవత్సరమున జన్మించెను. వానితండ్రి హుగ్లీకోర్టులో నొకన్యాయదిగా నుండెను. ద్వారకనాథుఁడు తక్కిన పిల్లలతోడిపాటు గ్రామమునందలి బడిలోఁ జదువనారంభించెను. ఆతఁడేడేండ్లవయసువాఁడయినప్పుడు ఇంగ్లీషుచదువుటకు హుగ్లీపాఠశాలలోఁబ్రవేశించెను. 1846 వ సంవత్సరము కాలేజీస్కూలులో రెండవ తరగతిలోఁజేరెను. అక్కడ చదువునప్పు డతఁడు బుద్ధికుశలతకుమిక్కిలి ప్రసిద్ధికెక్కి నెలకెనిమిది రూపాయలు జీతముగల విద్యార్థివేతనము సంపాదించెను. తరువాత 1849 సం॥రమున రాణీకాత్యాయనీ యను నామెయిచ్చిన నెలకు పదునెనిమిదిరూపాయలు జీతముగలవిద్యార్థివేతనముసంపాదించి ద్వారకనాథుఁడు 1850 వ సంవత్సరమున విద్యార్థివేతనములకై ప్రయత్నము చేయువారందఱిలో నగ్రగణ్యుఁడై నిలిచె. 1851 వ సం॥రమున సంవత్సరాంత పరీక్షయందుఁ గృతార్థుఁడై నెలకు నలువదిరూపాయలుచొప్పున విద్యార్థివేతనముం బడసెను. 1853వ సం॥రమున ఆంగ్లేయభాషలో మిక్కిలి ప్రశస్థమైనయుపన్యాసమువ్రాసినందు కతఁడు బంగారుపతకమును మరుసటిసంవత్సరమున మఱి రెండుబంగారుపతకములను బహుమానములుగాఁబడసెను. విద్యార్థిగానున్నపు డతనికి దేశచరిత్రములఁ జదువుటయందు మిక్కిలి యభిరుచియుండెను. ఆతనికి గణితశాస్త్రమునం దమితప్రజ్ఞయుండుటచే మిక్కిలి చిక్కుగల లెక్కల నవలీలఁగా నతఁడు చేయుటజూచి యుపాధ్యాయుఁడొకనాడతనితో నిట్లనియె. "హిందువులలో స్వతస్సిద్ధమగు బుద్ధికుశలత గలవాఁడవు నేనెఱిఁగినంతవఱకు నీవొక్కఁడవే" యని పలికెను.

ద్వారకనాథుఁడు చదువుముగించి పాఠశాలవిడిచినతోడనే దైవయోగమునఁ దండ్రి పరలోకగతుఁడగుటచే నేదేని యుద్యోగమునుసంపాదించి కుటుంబపోషణముఁ జేయవలసివచ్చెను. దొరతనమువారిచేతిక్రింద నేదేనియుద్యోగముఁ జేయుటకతని కెంతమాత్రమిష్టము లేనందున నెట్లైన శాస్త్రపరీక్షయందుఁ గృతార్థుఁడై న్యాయవాదిగానుండవలయునని యతఁడుసంకల్పించుకొనెను. కాని దారిద్ర్యముచేతఁదనమనోనిశ్చయమునుమార్చుకొని కలకత్తాలో పోలీసు మేజస్ట్రీటుకచేరీలో నెలకు నూటయిరువది రూపాయిలు జీతముగల యుద్యోగమొకటి కాళీవచ్చినందున యతఁడు దానింగూర్చి ప్రయత్నించి యందుఁ జేరె. చేరి యందు చిరకాల ముండక ద్వారకనాథుఁడు శాస్త్రపరీక్షకుఁ జదివి యందుఁగృతార్థుఁడై న్యాయవాదియయ్యెను. న్యాయవాదియై తనపనిలో మంచిపేరు సంపాదించుటకై చాల పరిశ్రమచేసెను. న్యాయవాదుల కెంతబుద్ధికుశలతయున్న నెంతప్రజ్ఞయున్నఁ దమసామర్థ్యముం జూపుటకుఁ దగినసమయము రావలయునుగదా!

ద్వారకనాథుఁడు మొదటినుండియునదృష్టవంతుఁ డగుటచేపనియారంభించిన యాఱుమాసములకే యొకపెద్దవ్యాజ్యమునకొకగొప్ప న్యాయవాదికి సహాయుఁడుగా నేర్పరుపఁబడెను. అతనిభాగ్యవశమున నావ్యాజ్యము విచారణకు వచ్చినప్పు డాపెద్దన్యాయవాది యూరలేక పోవుటచేద్వారకనాథుని తెలివి తేటలుగనఁబఱచుటకుమంచియదనుదొరకెను. తనవృత్తియందు మిక్కిలియారి తేరినవాఁడు గాకపోయినను ద్వారకనాథుఁడు న్యాయాధిపతుల (జడ్జీ) మనస్సులకు నచ్చునట్లు వ్యాజ్యమునందలి సంగతులెల్ల నరఁటిపండొలిచిచేతికిచ్చినట్లుచెప్పి బోధించివాదించెను. దీనితో నతనికి మంచిపేరుగలుగఁ గీర్తి దేశమందు వ్యాపించెను. ఆతని సమకాలికుఁడై న్యాయవాదిగానున్న యొకదొర ద్వారకనాథుని యప్పటి తెలివి తేటలఁగూర్చియిట్లువ్రాసెను. "ద్వారకనాథుఁడు

వాదనకు దిగినప్పుడు నాతోఁగలసి పనిచేసినను నాకెదుటిపక్షమునం బనిచేసినను నాకును వినువారి కందఱకును మిక్కిలి యద్భుతమును గొలుపుచుండువాఁడు."

1862 వ సం॥రమున బంగాళా దేశమందగ్రన్యాయసభ అనఁగా హైకోర్టు స్థాపింపఁబడెను. అది యేర్పడినది మొదలు ద్వారకనాథుని ఖ్యాతి యంతకంత కెక్కువయ్యెను. ఖ్యాతితోఁగూడ ధనార్జనము నతిశయించెను. ఏలయన నతఁడాన్యాయసభలోఁ బనినారంభించునప్పటికి వానికంటె నెక్కువయభ్యాసము నెక్కువపేరుగల న్యాయవాదులిరువు రుండిరి. వారిరువురిలో నొకఁడు మృతినొందుటయు రెండవ యతఁడు న్యాయాధిపతి యగుటయుఁ దటస్థించెను. అందుచే నతఁడచ్చటి న్యాయవాదుల కెల్ల నాయకుఁడయ్యెను. ఆకారణమున దేశస్థులందఱుఁ బనివచ్చినపు డతని సహాయమునే కోరుచువచ్చిరి. న్యాయవాదిగానున్నపు డతఁడు నిర్భయుఁడై స్వతంత్రుఁడై యుండి పేదల కేవియేని చిక్కులు సంభవించినపుడు ధనము గ్రహింపకయే వారిపక్షముబూని వాదించుటకు సిద్ధముగ నుండును.

మన దేశమునకింగ్లీషువర్తకులుకొందఱువచ్చి బంగాళాపరగణాలో నీలిమందు, కాఫీవిత్తులు, తేయాకు మొదలగు సరకులు పండించి లాభ మపారముగ గ్రహించుచున్నారు. 1865వసంవత్సరమందాదొరలు కొందఱును బంగాళా దేశపుజమీందారులు కొందఱునుగలసిశిస్తులనిమిత్తము రహితులను బాధించి వారిపై హైకోర్టులోగొప్పవ్యాజ్యము తెచ్చిరి. అప్పుడు ద్వారకనాథుఁడు దీనదశలోనున్న రహితులపక్షముఁ బూని వాదించెను. ఆవ్యాజ్యములు కలకత్తాహైకోర్టులో పదునైదుగురు జడ్జీలు విచారణచేసిరి. ఆవ్యాజ్యము విచారణ మనేకదినములుపట్టెనందునద్వారకనాథుఁడుప్రతిదినముపదకొండుగంటలకులేచిసాయంకాల మైదుగంటలవఱకు నిలువంబడియే వాదనసేయుచు దేహమలసినను

తనవాదనమాత్రము బలహీనము గాకుండునట్లుచెప్పి చూచువారికంద ఱకు మహాద్భుతమునుగొలిపెను. ఆవ్యాజ్యమున న్యాయసభలో నిము ఖ్యన్యాయాధిపతి ద్వారకనాథునిపై యించుకకక్షుబూని మాటిమాటికి యక్షప్రశ్నలవంటి ప్రశ్నలు వేసియాతనిం దడఁబడఁ జేయుటకుఁబ్రయ త్నముచేయుచువచ్చెను. కాని యాదిట్టరి యొక్కప్రశ్నకైనను దడఁ బడక న్యాయాధిపతులందఱు నివ్వెరపడునట్లు ప్రత్యుత్తర మిచ్చెను. ఈవ్యాజ్యమున నితఁడు చూపిన యసాధారణ ప్రజ్ఞచేత ననంతరము కొన్ని దినములలో దొరతనమువారి న్యాయవాది (గవర్నమెంటు ప్లీడరు) గా నేర్పఱుపఁబడెను. దీనిలోనుండియె యతఁడు కొలఁదికా లమున హైకోర్టు జడ్జీగా నియమింపఁబడెను.

అదివఱకుశంభునాథపండితుఁడనునతఁడాహైకోర్టులోన్యాయా ధిపతిగా నుండెను. ఆతఁడె బంగాళా హైకోర్టులో మొట్టమొదటి న్యా యాధిపతి. ఆతఁడు 1867వ సంగిరమునజూనునెలయాఱవ తేదినిలోకాం తరగతుఁడయ్యె. అప్పటికి ద్వారకనాథుఁడు ముప్పదిమూడేండ్లవయసు వాఁడు. ఇదివఱకు హిందూదేశమున హైకోర్టుజడ్జీలుగా నియమింపఁ బడినస్వదేశస్థులలో నింతచిన్నవయసువా రెవ్వరును లేరు. ఇంతటిపిన్న ప్రాయమువాని నంతటి మహాపదవికి దొరతనమువారు నిశ్శంకముగా నియమించుటచేత నేయాతఁడెంతటిబుద్ధిశాలియో యెంతటిప్రజ్ఞావంతుఁ డో మన మూహింపవచ్చును. ద్వారకనాథుఁ డాఱుసంవత్సరము లా హైకోర్టునందు న్యాయాధిపతిగానుండెను. అప్పటిముఖ్యన్యాయాధిప తియగు సర్ బార్నిసుపికాకుదొరగారుతనతోడిజడ్జీయగుద్వారకనాథు నియభిప్రాయములతో దఱచుగ నేకీభవించుచు నెప్పుడైన నభిప్రాయ భేదముగలిగినప్పుడు మిక్కిలిజంకుతో భేదించుచుండునఁట. అతఁడుగ డుసుపోకడలఁబోయి మోసముపన్ని కువాదములుచేయువారినిఁజూచిన మిక్కిలియసహ్యపడి యట్టివారిగర్వభంజనము చేయుచువచ్చెను. అం

దుచే నతనిమీఁదఁగొందఱకాగ్రహము ననిష్టముగలుగ వార్తాపత్రిక లలో వారతని నిందింప నారంభించిరి. ద్వారకనాథుఁడావాత్రల నిం చుకేనియు సరకుసేయఁడయ్యెను. అయిననుముఖ్యన్యాయాధిపతియగు పీకాకుదొరగారు ద్వారకనాథునిపై గల యభిమానముచే జననిందా స్పదుఁడగుటకునిష్టపడక వానినాయపవాదమునుండితప్పింపవలయునని యొకమారు కచ్చేరీలో నున్నపుడే యిట్లనియె. "నే నీద్వారకనాథుని న్యాయవాదిగా నున్నకాలమునుండియు నెఱుఁగుదును. కొంతకాలము నుండి యితనిసాటి న్యాయాధిపతినై యుంటిని. కాబట్టియతని స్వభా వమునుగూర్చియు నతని నడతనుగూర్చియుఁ దక్కినవారికంటె నాకె క్కువదెలియుట కవకాశమున్నది. నేనిప్పు డాయనయెదుట మాటలాడు చున్నను ద్వారకనాథుఁడుమిక్కిలివిద్యావంతుఁడనియుసమర్థుఁడనియు నిగర్వచూడామణియనియు మంచిస్వభావముగలవాఁడనియు దయా ళువనియు స్నేహపాత్రుఁడనియు స్వతంత్రుఁడనియుఁ జెప్పవలయు ను. అతఁడు తనకు సరియనితోఁచిన యభిప్రాయ మెవరు భిన్నముగా జెప్పినను విడువక దాని ననుసరించియే యుండును. అది తప్పనితోఁచి నప్పు డెవరుచెప్పకయే దానిని విడుచును."

ద్వారకనాథుఁడు తీరికయున్నప్పుడు ఫ్రెంచి లాటినుభాషల యందుఁ బరిశ్రమఁజేయుచువచ్చెను. ఫ్రెంచిభాషలో నతఁడు చదివిన గ్రంథములలో కోమ్టి (Comte) యను తత్వశాస్త్రజ్ఞుఁడు రచించిన గ్రంథములపై నతనికి మిక్కిలి యభిమానము. అతని గ్రంథభాం డారమున రమారమి వేయి మంచి ఫ్రెంచిగ్రంథము లుండెను.

అతనికి 1868 వ సంవత్సరమున విషూచిజాడ్యము తగిలెను. కాని యది యదృష్టవశమునఁ గుదిరెను. 1872వ సం॥రమున నతఁడు కీళ్ళనొప్పులు జ్వరమువలన కొన్నిదినములు బాధపడెను. తరువాత జ్వరమ్మువదలినను దాని దోషములు విడువవయ్యెను. 1873 వ సంవ

త్సరము నవంబరు నెలలో నాయనకు కంఠములో కురుపు వేసెను. అట్లుండియు నతఁడు కొంతకాలము పని చూడఁగలిగెను. కాని క్రమ క్రమంబున రోగము ప్రబలమగుటచే నతఁడు పనిమానుకొని ప్రాణ మునం దాశవదలుకొని కలకత్తానగరమును విడిచి తన కడపటిదినము లు పుచ్చుటకు స్వగ్రామముఁ జేరెను. అట్లు కొంతకాలము రోగపీడి తుఁడై 1874 వ సంవత్సరం ఫిబ్రేవరు 25 వ తేదీని నలువదియవ యేఁట కాలధర్మము నొందెను.

న్యాయాధిపతిగాఁ గూర్చున్నప్పు డతఁడు ప్రజలకు సరిగా న్యాయమునొసఁగి హిందువులుకూడ న్యాయాధిపత్యముచేయుటకుఁ దగుసామర్థ్యము జ్ఞానముగలవారని దొరతనమువారికిఁ దోఁచునట్లు ప్ర వర్తించెను. అతని మరణమునుగూర్చి విచారించుచు తోడిన్యాయాధి పతి యొకఁ డీవిధముగాఁజెప్పెను. "అతని యధికవైదుష్యము యుక్తా యుక్త వివేచనజ్ఞానము న్యాయదృష్టి బుద్ధికుశలత యద్భుతమైన జ్ఞా పకశక్తి మంచితనము మొదలగుగుణములం బట్టి యతఁడు తోడి న్యాయాధిపతులకు సాటిలేనిసహకారిగానుండును. అతనితోఁగూర్చుం డి పనిచేయుట మిక్కిలి సంతోషకరముగా నుండెను. ఇంగ్లీషుభాష యందలి యతని పాండిత్యమునుజూడ నాభాష యతనికి విధేయురాలై యున్నట్లు గనఁబడును. ఇంగ్లీషుభాషను మాతృభాషగాఁ గలిగినదొ రలు సయితము ద్వారకనాథున కాభాషయందుఁగల యభిరుచి ప్రవే శమునుబట్టి మిక్కిలి యక్కజపడుచువచ్చిరి."

గొప్పయధికారమును వహించినవారు తమయధికార ప్రాబ ల్యమునుజూపి తక్కువవారిని బాధపెట్టినప్పుడు ద్వారకనాథుఁ డది చూచి సహింపక యట్టియధికారులను గట్టిగ మందలించుచుండును. ఇంటియొద్ద నతఁడు మిక్కిలి వినయవృత్తి గలిగి సర్వజన సులభుఁడై యౌదార్యగుణమునఁ బ్రసిద్ధికెక్కియుండెను. 1871 వ సం॥రమున నతని

పెద్దభార్య మృతినొందెను. ఆమెకిరువురు బిడ్డలు. ప్రథమకళత్రము పోయిన మరుసటి సంవత్సరమున నతఁడొక కన్యను వివాహమాడెను. కాని యామెను వివాహమాడిన యచిరకాలములోనే లోకాంతరగతుఁడయ్యెను. ఆయనకు నిరంతరము చదువుకొనుటయందె మిక్కిలి యాసక్తి. చదివినది జ్ఞాపకముంచుకొనుటలో నంతవాఁడు సాధారణముగా నుండఁడు. ఒకమారాయన కొన్నిసంపుటములుగల యూరపుదేశ చరిత్రమును పదునైదు దినములలో సమగ్రముగాఁ జదివి చదివినది తనకు జ్ఞాపకమున్నదో లేదో తెలిసికొనుట కాగ్రంథమునందు తన్నుఁ బరీక్షింపుమని యొకమిత్రునిఁ గోరెను. ఆమిత్రుఁడు పలుభాగములయందు పలుప్రశ్నలు వేయ నాప్రశ్నల కన్నిఁటికిఁ దేలిపోక యుత్తరములు చెప్పుటయేగాక ద్వారకనాథుఁడు మూలగ్రంథమునందలి వాక్యములను సయితము కంఠపాఠముగ నప్పగించి మిత్రున కాశ్చర్యము గలిగించెను. యూరపుఖండమంతయు జయించిన శూరశిఖామణియగు నెపోలియన్ బోనపార్టియం దతనికి మిక్కిలి యభిమానముండుటచే నాతని ప్రతిరూపమును వానిగదిలో నుంచుకొనెను. హరిశ్చంద్ర ముఖర్జీ యనునతఁడు వాని బాల్యస్నేహితులలో నొకఁడు. ఆముఖర్జీ 1858 వ సం॥రమున మృతినొందఁగా వాని యకాలమరణమునుగూర్చి ద్వారకనాథుఁడు మిక్కిలి దుఃఖించెను.

ద్వారకనాథున కొకచిత్రమైన యభ్యాసముగలదు. అతఁడు న్యాయవాదిగా నున్నకాలమున కోర్టువారియెదుట వాదముసేయునప్పు డొకపేనాకలముల రెండుచేతులతోఁ బట్టుకొని యది ముక్కలగునట్లు మెలివేయుచుండును. అతఁడాకలము నెంతవడిగా మెలివేయుచుండునో యతనినోటనుండి మాట యంతవడిహెచ్చి వాదము ప్రబలుచుండును. కలము క్రమక్రమముగా సలిగి విఱిగి చేతిలోనుండి పూర్తిగా జాఱిపడినప్పు డాయన యేమియుందోఁచక వాదముసే

యలేక నిలువఁబడునఁట. అందుచే గుమాస్తాయొకఁడు పేనాకలముల కట్టయొకటి చేతితోఁ బట్టుకొని సిద్ధముగనుండి యజమానుని చేతికలము విఱిగిపడిన తక్షణమే మఱియొక కలము నవ్యవధానముగాఁ జేతిలోఁ బెట్టుచుండును.

ద్వారకనాథుఁడు గొప్పయుద్యోగములోనున్నను న్యాయము చెప్పవలసివచ్చినప్పుడు తనపై యధికారులకు సయితము జంకక స్వతంత్రుఁడై వ్యవహరించుచుండును. అంతటివిద్యయు, విద్యకుందగిన సత్ప్రవర్తనము దానికిం దగిన మహోన్నతపదవియుఁ గలిగిన యీ మహాపురుషుఁ డంతటి చిన్నతనమందు బోవుటచే నతని యకాలమరణమునుగూర్చి దేశస్థులందఱు విచారించిరి.



# కృష్ణదాస్ పాలు.

హిందూ దేశమున వార్తాపత్రిక కధిపతియైయుండి మహాప్రఖ్యాతిగాంచిన పురుషులలో నితఁ డగ్రగణ్యుఁడు. ఇతఁడు 1838 వ సంవత్సరమున జన్మమొందెను. అతనితండ్రియగు నీశ్వరచంద్రపాలుఁడు మిక్కిలి బీదవాఁడు. కృష్ణదాసు మొట్టమొదట నొకపాఠశాలలోఁ బ్రవేశించి యచ్చట బంగాళాభాషను జదివి యాభాషలో నతనికిఁగల ప్రవీణతకు నొకవెండిపతకమును బహుమానముగఁ బడసెను. అతఁడు పదేండ్ల ప్రాయముగలవాఁ డయినప్పు డింగ్లీషుఁ జదువ నారంభించి 1853 వ సంవత్సరమున నాయింగ్లీషు పాఠశాలను విడిచెను. బడిమానిన వెనుక కృష్ణదాసుపాలుఁడు కొన్నినాళ్ళు క్రైస్తవమత బోధకుఁడై కలకత్తాలోనున్న రివరెండు మిన్నిదొరగారివద్ద విద్యనభ్యసించెను. అనంతర మతఁడు కలకత్తాలో విద్యావిషయములగు చర్చలను స్వేచ్ఛగా జరుపుటకు స్థాపింపఁబడిన యొకసమాజములోఁజేరి యచ్చట రివరెండు మార్గన్ దొరగారు మొదలగు గొప్పవారు చేయు నుపన్యాసములను విని యందువలనఁ గలిగిన లాభములను బొందుచువచ్చెను.

1854 వ సంవత్సరమున నతఁడు మరలఁ జదువఁ దలఁచి రాజేంద్ర దత్తుగారిచే స్థాపింపఁబడిన హిందూ మెట్రాపాలిటన్ కాలేజీ యనుకళాశాలలోఁజేరి యచ్చట మూఁడుసంవత్సరములవఱకుఁజదివెను. విద్యార్థిగా నున్ననాఁడు మొదలుకొని యతనికి రాజకీయవ్యవహారములయందు మిక్కిలియభిమానము. అతఁడువ్రాసిన వ్రాతలు నతఁడిచ్చిన యుపన్యాసములు చూడ నంతచిన్నవయసువాని కింతశక్తియెట్లుగలిగెనాయనితోఁచును. పెద్దలెవరితోనైన నతఁడనకభిప్రాయభేదములు

కలిగినప్పుడు మొగమోటముచేత నూరకొనక తనయభిప్రాయమునిర్భయముగఁజెప్పుధైర్య మతనియొద్దనుండెను. అంతధైర్యముండుటచేతనే యొకమా రతఁడు బంగాళాదేశమం దంతట ప్రసిద్ధికెక్కిన మహా పండితుఁడు డాక్టరు డఫ్ దొరగారి మాటలనే ఖండించి పూర్వపక్షము చేసెను. ఆకాలమున బంగాళాదేశమందు జార్జి-తాంసన్ అనుదొరగలఁడు. ఆయన రాజకీయ వ్యవహారములనుగూర్చి దిట్టమయినయుపన్యాసములనియ్యఁదొడఁగెను. అతఁడువాగ్నైపుణికిఁబ్రసిద్ధికెక్కెను. ఆదొరగారిని కృష్ణదాసుపాలుఁడొకనాఁడు తనసమాజములో జరుగు నొకసభకునధ్యక్షునిగా నుండుమని పిలిచెను. ఆదొరగారు విద్యావిషయములగు చర్చలను జేయునట్టి చిన్నసమాజములలోఁ దనవంటివాఁడుపన్యసింపఁదగదనియు విశేషించి తన రాజకీయ వ్యవహారములఁ గూర్చియే కాని యితరవిషయములనుగూర్చియుపన్యసింపననియుఁజెప్పి హిందూ పేట్రియేటను వార్తాపత్రికను దీసి చూపి యాపత్రికాధిపతియొక్కఁడే హిందువులలో రాజకీయ విషయములగూర్చి గ్రహింపఁగల సమర్థుఁడనియుఁ దక్కినవారికిఁ జెప్పినను దెలియవనియు గర్వోక్తిగాఁబలికెను. ఆమాటలు విని కృష్టదా సాదినము మొదలుకొని తానుగూడహరిశ్చంద్రముకర్జీయంతవాఁడు కావలయునని నిశ్చయించుకొనెను. అదిమొద లతఁడు పేట్రియేటుపత్రికను తప్పక చదువుచు వచ్చెను. ఆతఁడు కడుబీదవాఁడగుటచే పత్రిక తెప్పించుకొనుటకు ధనములేక సమాజకార్యదర్శినడిగి తెచ్చుకొని చదువవలసివచ్చె. ఈపత్రికగాకయింగ్లీషు భాషలో ప్రకటింపఁబడు నితరపత్రికలగూడఁ జదువుచు వాని కప్పుడప్పుడు తనకుఁ దోఁచిన సంగతులనువ్రాసి పంపుచు నితరగోష్ఠిని విడిచి యతఁడు విద్యాగోష్ఠియందె కాలము పుచ్చుచుండెను.

ఆతఁడు హిందూ పేట్రియేటుపత్రికకుఁగూడకొన్ని సంగతులు వ్రాసి పంపెను. తానువ్రాసినవ్రాత యాపత్రికలో ప్రకటింపఁ బడిన

ప్పుడు వానికిఁ గలిగిన యానంద మింతింతయని చెప్ప నలవికాదు. క ళాశాలలో విద్యాభ్యాసము ముగించిన వెనుక కృష్ణదాసాక,జిల్లాజడ్జీగా రి కచ్చేరిలో ట్రాన్సులేటరు(అనఁగా ఇంగ్లీషునుండి స్వభాషకును స్వ భాషనుండి యింగ్లీషునకును తర్జుమాచేయునుద్యోగస్థుఁడు) గా నియ మింపఁ బడెను. కొన్ని దినము లతఁడు పనిచేసిన వెనుక కృష్ణదాసుఁ డా యుద్యోగమునకుఁ దగఁడని జిల్లాజడ్జి వానినితీసివేసెను. తరువాత సర్ వి లియంగ్రెదొరగారు వానికి మంచియుద్యోగము నొకటి యిచ్చిరిగాని యతఁ డందుఁబ్రవేశింపఁడయ్యె. అతఁడు గ్రంథములు వార్తాపత్రికలు మితిమీరునట్లుమిక్కిలి యాసక్తితోఁ జదివి యెక్కువప్రజ్ఞ గలవాఁడ యినను వానిదారిద్ర్యము తెలివి తేటలను పైకిరానీక యణఁచిపెట్టెను. తానుచేరియున్న సమాజమునకు నెల నెల కియ్యవలసిన చందానైన నతఁ డియ్యలేకపోవుటచే సమాజమువారు వానిం గరుణించి నెలచం దా నియ్యనక్కఱ లేకుండఁ జేసిరి. ఆ కాలమునం దతని యవస్థనెఱింగిన యతనిమిత్రుఁ డొకఁడు వానిఁగూర్చి యిట్లువ్రాసియున్నాఁడు. "కృష్ణ దాసుఁగు కలకత్తాలో మారుమూలసందులో కూలిపోవుచున్న యొక పాడుకొంప యరఁగుమీఁద చింకిచాఁపమీఁదఁ గూరుచుండి పైచిల్లు లలోనుండి సూర్యకిరణములు శరీరమునఁ దగులుచున్నను లెక్కసేయ క పుస్తకములఁ జదువుకొనుచు పత్రికలకు వృత్తాంతములు వ్రాయు చుఁ బెక్కుసారులు గనఁబడియెను. అతఁడు పేదయయ్యునున్నతస్థితి కివచ్చుటకు మిక్కిలి పాటుపడియె".

1857వ సంవత్సరమున నతఁడు కొందఱు స్నేహితుల సహాయ మునఁ గలకత్తాలోనొక మాసపత్రికనుప్రకటింపఁజొచ్చెను, కాని వాని దారిద్ర్యదోషమున నది యాఱుమాసములకే యంతరించెను. కాన్పూ రునగరమున సెంట్రల్‌స్టార్ (మధ్యనక్షత్రము అనిఅర్థము) అను నింగ్లీ షుపత్రికయొకటి బయలుదేర కృష్ణదాసుఁడు దాని కుపవిలేఖకుండుగా

నుండి కలకత్తానుండియే వ్రాయుచునుండెను. అప్పుడప్పుడు హిందూపేట్రియాట్ పత్రికకుఁగూడ నతఁడు సంగతులనువ్రాసిపంపుటఁగలదు. కనుక 1857 వసంవత్సరమున హిందూదేశమున బయలుదేరినసిపాయి పితూరీనిగురించి యెన్నోసంగతుల నతఁడు వ్రాసి పంప నాపత్రికాధిపతియగు హరిశ్చంద్రముకర్జీ వానివ్రాతనేర్పును జూచి దైవానుగ్రహమున నతఁడు చిరకాలము బ్రతికియుండెనా దేశమునకు మహోపకారము గలుగఁ గలదని తెలిసికొనెను.

పత్రికలకు వృత్తాంతము వ్రాయుటయేగాక బంగాళాదేశ పాలకుల యోగ్యతాస్థాపనయను నంశమును గూర్చియు నీలిమందువ్యవసాయమునుగూర్చి యుమఱికొన్ని యంశములఁగూర్చియు నతఁడుచిన్న చిన్న గ్రంథముల వ్రాసెను. ఇందు మొదటియుపన్యాసము కలకత్తా స్మాల్ కాజుకోర్టులో జడ్జీగారు హరిశ్చంద్రగోషుగారి కంకితముచేయఁబడినందున నతఁడే కావలసినధనమిచ్చి దానిని ముద్రింపించెను. ఆయుపన్యాసము బంగాళాదేశస్థుల మనస్సుల నాకర్షించుటచే నది మిక్కిలి బాగున్నదని కొన్ని పత్రికలును బాగులేదని కొన్ని పత్రికలు విమర్శింప నారంభించెను. తరువాత నాయుపన్యాసము వ్రాసినయతఁడు 19 సంవత్సరముల వయస్సుగల విద్యార్థియని వార్తాపత్రికలమూలమునఁ దేటపడినప్పుడు జనులంద ఱాశ్చర్యము నొందిరి. 1861 వ సంవత్సరమున హిందూపేట్రియేటు పత్రికాధిపతియగు హరిశ్చంద్రముఖర్జీ మృతినొందెను. అతని వెనుక నాపత్రిక యనేకుల చేతులలోఁబడి తిన్నగ జరుపఁబడక యెట్టకేలకు కృష్ణదాసపాలుని యధీనమయ్యెను. హిందూపేట్రియాట్ అనఁగా హిందూదేశాభిమాని యని యర్థము. ఆపత్రిక కృష్ణదాసపాలుని యాధిపత్యమునందు హిందువులచేఁబ్రకటింపఁబడు నన్నిపత్రికలకంటె నెక్కువపేరు నెక్కువచందాదారుల సంఖ్య గలదై వర్ధిల్లెను. హరిశ్చంద్రముఖర్జీ చనిపోయినతోడనే కృష్ణదాసు

బ్రిటిషుయిండియన్‌సంఘమునకు సహాయకార్యదర్శియై పిమ్మటఁ గొంతకాలమునకు ముఖ్యకార్యదర్శియయ్యెను. హిందువులచే వ్రకటింపఁబడు పత్రికలలో ప్రధానమగుదాని కధిపతియగుటచేతను గొప్పసంఘమునకు కార్యదర్శియగుటచేతను కృష్ణదాసుపాలుఁడు కొలఁదికాలములో నేయున్నతస్థితికి లేచెను.

1863 వ సంవత్సరమున నతఁడు మునిసిపల్ కమీషనరుగా నేర్పఱుపఁబడెను. 1872 వ సంవత్సరమున నతఁడు బంగాళాదేశపుశాసననిర్మాణసభకు సభ్యుఁడుగా దొరతనమువారివలన నియమింపబడెను. 1877 వ సంవత్సరమున శ్రీవిక్టోరియారాణీగారు చక్రవర్తినీ బిరుదము వహించినప్పుడు ఢిల్లీనగరమున జరిగిన గొప్పదర్బారులో కృష్ణదాసుపాలునకు దొరతనమువారు రావుబహద్దరు బిరుదము నిచ్చిరి. మరుచటిసంవత్సరమున నతనికి సి.ఐ.యి. యనుబిరుదము వచ్చెను. 1883 వ సంవత్సరమునం దాయన బ్రిటిషుయిండియన్ సంఘమువారిచేత గవర్నరుజనరల్‌గారి శాసననిర్మాణసభకు సభ్యుఁడుగా బంపఁబడెను. ఈయుద్యోగములన్నిటిలోనుకృష్ణదాసపాలుడు మిక్కిలి పాటుపడిమంచిపేరు సంపాదించెను. కొంతకాలము దీర్ఘవ్యాధిచే బీడింపబడి 1884 వ సంవత్సరమున జూలై 24వ తేదీని మృతినొందెను. పత్రికాధిపతిగానున్నకాలమున విమర్శనము లేవిమైన చేయవలసివచ్చినప్పు డతఁడు పక్షపాతములేక మర్యాద నతిక్రమింపక చేయుచువచ్చెను. అట్లున్నను వానికొకసారి యధికారులతో వివాదము రాకతప్పినదిగాదు.

1866 వ సంవత్సరమున బంగాళాదేశమునకు గవర్నరుగానున్న సర్ సిన్ బీడెన్ దొరగారు కృష్ణదాసపాలుఁ డప్పటి కఱవునుగురించి తనపత్రికలో వ్రాసినకొన్నిసంగతులకు బహిరంగమైన సభలో ప్రత్యుత్తరములు చెప్పిరి. 1874 వ సంవత్సరమున నప్పటివగర్నరు సర్ జార్జికెంబెల్ దొరగారు హిందూపేట్రియేటుదొరతనమువారియెడల న

నిష్టముగల పత్రికయని స్పష్టముగా వ్రాసిసిరి. అందుకు కృష్ణదాసుఁడూ రకొనక తగిన ప్రత్యుత్తరము వ్రాసిపంపెను. ఇట్లొకరిద్ద రధికారులు పత్రికపైనలుక బూనినను క్రమక్రమంబున దొరతనమువారాపత్రికపై నభిమానము వహించి హిందువుల యభిప్రాయము తెలుసుకొనుటకు తత్పత్రికయే ముఖ్యాధారమని యెఱిఁగిరి. కృష్ణదాసుఁడుగట్టిసామర్థ్యముతో పత్రిక నిరువదిమూఁడు సంవత్సరములు నడిపెను. గవర్నరుజనరలుగారి యాలోచనసభలో సభ్యుఁడుగా నుండిన యిల్బర్టు దొరగారు కృష్ణదాసుపాలునిపత్రికాధిపత్యమునుగూర్చి యొకసారి యిట్లుచెప్పిరి. "తనతోటివారు పాఠశాలల విద్యార్థులుగానుండునట్టి యీఁడుననే దేశమందు పురాతనమైనపత్రిక కధిపతియై కృష్ణదాసుపాలుఁడు సర్వతోముఖమగు పాండిత్యముచేతను మిక్కిలి శాంతముచేతను నిష్పక్షపాతబుద్ధిచేతను 23 సంవత్సరములుపాటుపడి దక్షతలేక యణఁగిపోవుటకుసిద్ధముగానున్నపత్రికను మంచియున్నతస్థితిలోనికిఁ దెచ్చెను." ఆనాఁటి హిందువులలో నెవరికినింగ్లీషుభాషయొక్క మర్మముకృష్ణదాసపాలునకు దెలిసినంతగాఁ దెలియదని జనుల యభిప్రాయము. కలకత్తారివ్యూ యను పత్రికయొక్క యధిపతి కృష్ణదాసునుగురించి యిట్లు వ్రాసెను. "స్వచ్ఛమై మృదువై మనోహరమై యింగ్లీషు వ్రాయనుమాటలాడనునేర్చిన ప్రాచీనహిందువులతెగ కృష్ణదాసుపాలునితో నంతరించినది. ఉపన్యాసము లిచ్చుటలోను వెనుకదీయక వాదించుటలోను నితనికి మిక్కిలి సామర్థ్యముకలదు. హిందువు లనేకు లింగ్లీషుభాషనుచక్కఁగ మాటలాడఁ గలరు, కానిసందర్భసిద్ధియందును భాషాసౌష్టవమునందును హేతుకల్పనమునందునుకృష్ణదాసుపాలునివంటివారుమిక్కిలితక్కువగా నున్నారు. ఇంగ్లాండులోనే పుట్టిపెరిగి యింగ్లీషునే స్వభాషగా నభ్యసించిన పెక్కుదొరలకంటెకృష్ణదాసుపాలున కేయింగ్లీషుభాషయెక్కుడువశమైనట్లుకనఁబడునని యింగ్లీషువార్తాపత్రికలేకొన్నివ్రాసినవి."

కృష్ణదాసుపాలుని మరణమునుగూర్చి దేశస్థులందఱు విచారించిరి. అప్పటి గవర్నరు జనరల్ గారగు రైఫన్ ప్రభువుగారుశాసననిర్మాణసభలో కృష్ణదాసుని మరణమునుగూర్చియిట్లనిరి. "అతనిబుద్ధికుశలత యసాధారణమైనది. ఈసభలో నతఁడు మాటలాడుచున్నప్పుడువిన్నవారందఱు వానిపాండిత్యవిశేషమునంగీకరించియేయున్నారు. కృష్ణదాసు పాలునియొద్ద మూఁడు మంచిగుణము లుండినవఁట. 1.సమమైన యాలోచన శక్తియు, 2. తాను నమ్మినపనిచేయుటలో ధైర్యము 3. కోపము లేకపోవుట. ఈమూఁడు నుండుటచే నతఁడు దేశస్థులయొక్కయు నధికారులయొక్కయుమెప్పువడసెను." సర్ రిచార్డు టెంపిల్‌గారు నాకాలపు మనుష్యులు కార్యములు- అను గ్రంథము రచియించి యితనింగూర్చి యిట్లువ్రాసిరి. "గవర్నరుజనరలుగారి సభలోనున్న హిందువులలో కృష్ణదాస్‌పాలను నతఁడె సమర్థుఁడు. రాజామాధవరావుగారితరువాతహిందువులలోనిన్ని సంగతులు తెలిసినయతఁడితఁడొక్కఁడే. శాసననిర్మాణసభలో దొరతనమువారికతఁడుమిక్కిలి సహాయుఁడుగా నుండెను.

కృష్ణదాసపాలునకు కుటుంబ సౌఖ్యముసరిగా నుండలేదు. అతనికి మొట్టమొదట 1856 వ సంవత్సరమున వివాహమయ్యెను. ఆభార్యవలన నతని కిరువురు కొడుకులు గలిగి బాల్యమునందె మృతినొందిరి. పిదప 1872 వ సంవత్సరమునం దాభార్య మృతినొందఁగానతఁడు1874 వ సంవత్సరమునమరల వివాహము చేసికొనెను. ఈరెండవ భార్యవలన నతనికి కుమారుఁడు కలిగెనుగానివాఁడును శైశవమునందెమృతినొందెను. అతఁడు నిగర్వియై డంబములేకసామాన్యునివలెనేజీవితకాలము గడపెను. అతఁడు స్వమతాభిమానముగల హిందువుఁడైనను సంఘసంస్కారమునకు విరోధికాఁడు. సంస్కారముమెలకువగానునెమ్మదిగాను జరుపవలయునని యతని యభిప్రాయము. అతఁడు న్యాయదృష్టిగల

స్వతంత్రుఁడు. బిరుదుల నిమిత్తము దొరతనమువారి నెన్నఁడునాశ్రయింపలేదు. అయాచితముగా బిరుదులువచ్చినప్పుడువానినిగ్రహింపక పోలేదు. అతఁడు తనకురావుబహద్దరు బిరుదము వచ్చినప్పుడు పత్రికలో నిట్లువ్రాసెను.

"మాపేరు రావుబహద్దరులలో నగపడుటచే మేము మిక్కిలి యాశ్చర్యము నొందినారము. మే మేనేరము చేసినామని మా కీశిక్ష విధింపఁబడినదో తెలియఁజాలము. మాకు బిరుదులు పొందవలయునని యాసలేదు. మేము చేసిన సేవకు సంతసించిదయామయులై యధికారులు మాకీగౌరవమును దయచేసినందుకు కృతజ్ఞులమై యున్నారము. మాకీసంగతి ముందు తెలిసినమామాటసాగెడుపక్షమున మేము మాజోలికెవరు రావలదనియు బిరుదులుగిరుదులుమాకవసరము లేవనియు వానిందప్పక వేఁడుకొనియుందుము."

ఈపైవాక్యములఁబట్టియు నింకఁ దక్కిన సంగతులఁబట్టియు కృష్ణదాస్‌పాలుఁడు 19వ శతాబ్దమునఁ బుట్టిన దేశాభిమానులలో నొకడనియు వానిమార్గము ననుసరించుటకు మన మందఱముఁ బ్రయత్నము చేయుచుండవలయు ననియుఁ జదువరు లీతని చరిత్రమువలన గ్రహింతురుగాక!

---

# హారిశ్చంద్రముకర్జీ

ఇతని ప్రతిమ మాకుదొరికినదికాదు. ఈయన బంగాళా దేశపు కులీన బ్రాహ్మణుఁడు. తండ్రియగు రామధనముకర్జీ మిక్కిలిబీదవాఁడు. వీరిద్దరన్న దమ్ములు. ఈయన యన్నగారిపేరుహారెన్‌చంద్రముకర్జీ

హారిశ్చంద్రముకర్జీ 1824 వ సంవత్సరమున కలకత్తాకు సమీపమునను్న భవానీపురమునబుట్టెను. ఆతఁడయిదేండ్లవయసుగలవాఁడయినప్పుడు తన యూరిబడిలో స్వభాషకొంతవఱకుఁ జదువుకొనియేడవయేట నింగ్లీషు నారంభించి బీదవాఁడగుటచే జీతములేకుండనొకపాఠశాలలోఁ జేరి పదునాలుగు వత్సరములువచ్చువఱకు నచ్చటవిద్యనభ్యసించెను. అతని కుటుంబము మిక్కిలి దారిద్ర్యముచేబాధపడుచుండుటచే నితఁడు చదువుమాని యేమైన సంపాదించి సంసారమువహింపవలసినవాఁడయ్యెను. అందుచే హారిచ్చంద్రముకర్జీ జనుల కర్జీలునుత్తరములు బాకీజాపితాలువ్రాసి కుటుంబమును బోషింపఁజొచ్చెను. అట్టి పనులవలన సొమ్ముసరిగా రాకపోవుటచే నతని బీదతనముతగ్గలేదు సరికదా యొకసారిఆపూటకుఁగూడబియ్యపుగింజలు లేకయింటిలోనున్న రాగిబిందె తాకట్టువేసికొందలఁచుకొన్నంత దురవస్థపట్టెను. అంతలో నొక జమీందారుని యేజంటువచ్చి వానిచే నొకయర్జీ వ్రాయించుకొని రెండురూపాయలిచ్చి బింది తాకట్టు అవసరము లేకుండఁజేసివాని గౌరవమును గాఁపాడెను. కుటుంబ మేవిధముచేతను గడచెడువిధము కనఁబడకపోవుటచే హారిశ్చంద్రముకర్జీ యొకరివద్ద పదిరూపాయలుజీతముగల గుమాస్తాగా కుదిరెను. అతఁ డాయుద్యోగమునైన పదికాలములపాటుంచుకొనక యజమానితో వివాదపడి కొద్దికాలములోనే యాపని మానుకొనెను. అది మానుకొనిన కొన్నినాళ్ళకు మిలిటరీఆడి

టరుగారి కచేరీలో ననగా సేనల కర్చులు వ్రాయునట్టి కచేరీలో నెల కిరువదియైదు రూపాయలు జీతముగల యుద్యోగమతనికి దొరకెను. ఆయుద్యోగమునం దాయన నిరుపమానమైన బుద్ధికుశలతను శ్రద్ధను పై యధికారులయెడ వినయమునుఁ జూపుటచే నతని తెలివితేటలు గ్రహించి వానికి గ్రమక్రమముగా నధికారులు నాలుగువందల రూపాయలవఱకు జీతము వృద్ధిచేసిరి.

ఉద్యోగములోఁ బ్రవేశించినను ముకర్జీ సాయంకాలమునందు నుమఱియు తీరికయైనపుడెల్లను భాషాభివృద్ధికొఱకై యింగ్లీషుగ్రంథములను వార్తాపత్రికలను విసుగులేక చదువుచువచ్చెను. గొప్పవారియుపన్యాసములు వినుటయందు మిక్కిలి యాసక్తిగలవాఁడగుటచేనతఁడు భవానీపురమునుండి నాలుగుమైళ్లునడచి కలకత్తాకువచ్చి డాక్టరుడఫ్ దొరగారి యుపన్యాసములు వినిపోవుచుండువాఁడు. కలకత్తాలోనున్న పుస్తకభాండారసమాజమందు తా నొక సభ్యుఁడుగాఁ జేరి యందున్న పుస్తకములన్నియుఁ జదివెను. ఆయుద్యోగములోపవేశింపకమునుపే యతఁడు కొన్నివార్తాపత్రికలకుఁ గొన్నివృత్తాంతములను వ్రాసిపంపుచువచ్చెను. 1853 వ సంవత్సరమున కలకత్తానగరవాసులు ఈస్టిండియా కంపెనీవారికి మహజరొకటి పంపఁదలఁచి దానినింగ్లీషుభాషలో మృదుశైలితో వ్రాయఁగలవాఁడు హరిశ్చంద్రముకర్జీ యొక్కఁడేయని యతని నాపనియందు నియోగించిరి. దీనింబట్టివానికింగ్లీషుభాషయందెంతపాండిత్యముగలదో మనము తెలిసికొనవచ్చును.

1854 వ సంవత్సరమున కలకత్తానివాసులగు శ్రీనాథగోషు గిరీశచంద్రగోషు క్షేత్రచంద్రగోషు నను ముగ్గురన్నదమ్ములు, హిందూపేట్రియేటను పత్రికను బ్రకటింపఁబూనిరి. హరిశ్చంద్రముకర్జీ యాపత్రికకు వృత్తాంతములు వ్రాయుచు దానిపైమిక్కిలి యభిమానముగలవాఁడయ్యెను. కొంతకాలము గడచునప్పటికి పత్రికాస్థాపకులగు

నన్నదమ్ములకుఁ బత్రికపైనభిమానము తగ్గుటయు ముకర్జీకి హెచ్చు టయుసంభవింపగా నెట్టకేలకు ముకర్జీయొక్కఁడే దానింబ్రకటించు భారమును బూనెను. అదివఱకాపత్రిక ముద్రింపఁబడు ముద్రాయం త్రిముమఱియొకరికి విక్రియింపఁబడుటచే నతఁడు పత్రికనిమిత్తముమ ఱియొకయచ్చుకూటమును గొని తనయన్నగారినే పత్రికకు ముద్రా శాలకుగార్యనిర్వాహకుఁడుగా నేర్పఱచి యసాధారణప్రజ్ఞతో దానిని నడపఁ జొచ్చెను.

1856 వ సంవత్సర ప్రాంతమున స్త్రీపునర్వివాహవిషయముల తో బంగాళాదేశమంతయు నట్టుడికినట్లుడుకఁజొచ్చెను. హరిశ్చంద్రి ముకర్జీఈశ్వరచంద్రివిద్యాసాగరుని పక్షముబూని సంఘసంస్కారము మంచిదేయని పత్రికాముఖమున వాదించి సంస్కర్తలకుఁ దగినసా యముచేసెను. అప్పటి గవర్నరుజనరలుగారగు డల్‌హావుసీ ప్రభువుగా రుహిందూదేశమునందలి పెక్కుభాగములను గలుపుకొని కంపెనీవా రియేలుబడిక్రిందకుఁ దీసికొనివచ్చెను.

తరతరములనుండి యేలుచున్నరాజులను రాజ్యభ్రష్టులుగాఁజే యుట యన్యాయమని హరిశ్చంద్రిముకర్జీపలుమారు నిర్భయముగ వాదించెను. డల్‌హావుసీప్రభువుగారి తరువాత గవర్నరుజనరలుగావ చ్చినకానింగుప్రభువుగారికాలమున సిపాయిపితూరీ రాఁగాముకర్జీచాల పాటుపడి సిపాయీలకు దొరతనమువారికి మనస్పర్ధలు దొలఁగించిసం ధిచేసెను. ఆంగ్లేయపత్రికాధిపతులగు దొరలు కొందఱుసిపాయిపితూ రీసంబంధముగల స్వదేశస్థుల భూములు మొఖాసాలు నగ్రహారములు దీసికొని గవర్నమెంటువారు దొరలకిచ్చుట బాగుండునని వ్రాసిరి. ఆ ట్లుచేయుట ధర్మవిరుద్ధమనియుఁ బ్రజలకోపము నణఁచుటకుమారువ రింత హెచ్చించుననియుఁ దనపత్రికలో వ్రాసిముకర్జీదొరతనమువారు మానునట్లుచేసెను. బంగాళాదేశమునకుఁ గొందఱు దొరలువచ్చి సీలి

మందుఃతోఁటలు వేయించి దానివలన చాలలాభముతీయుచురహితుల కేమియు లాభము మిగులనీయక వారిని మిక్కిలి బాధపెట్టఁజొచ్చిరి. అప్పుడు రహితులందఱు భూస్వాములమీఁద కట్టుగట్టి నేలదున్నక నీలిమందు పండింపక తిరుగుబాటుచేసిరి. అప్పుడుభూస్వాములారహితులను కోర్టులలోదింపి మరింత పీడింపసాగిరి. ఆసమయమున హరిశ్చంద్రముకర్జీ యానిరుపేద రహితులపక్షము బూని వ్యాజ్యములకై వారువచ్చినప్పుడు వారికన్నముపెట్టి బట్టలిచ్చి యర్జీలు వ్రాసిపెట్టి ప్లీడర్లనుగుదిర్చి యెన్నివిధములనో వారినాదరించెను. నీలితోఁటలయజమానులు వ్యాజ్యములో నోడిపోయినందున ముకర్జీపయి కడుపులోనక్కసునిలిపి వానిపైఁ గొన్నినేరములను మోపి వ్యాజ్యములనుదెచ్చిరి. అవితీర్పుగాకమునుపే 18౬౧ వ సంవత్సరమున హరిశ్చంద్రముకర్జీయకాలమరణము నొందెను. అతనిమీఁది వ్యాజ్యములతని మరణాంతరమునవానికి వ్యతిరేకముగా తీర్పు చేయఁబడుటచే నీలితోటల యజమానులు వానియిల్లువాకిలి నమ్మించి సొమ్ముగ్రహించిరి. హరిశ్చంద్రముకర్జీపత్రికాధిపతులగు హిందువులలో మొట్టమొదటివాఁడని చెప్పవచ్చును. బ్రతికినది స్వల్పకాలమైనను జీవితమంతయు నతఁడు పరోపకారార్థమై గడపిన పుణ్యపురుషుఁడు.

# రాజేంద్రలాలు మైత్రా.

రాజేంద్రలాలు మైత్రాయను నతఁడు బంగాళాదేశములో గౌరవముగల శూద్రకుటుంబములో పుట్టినవాఁడు. ఆయన 1824వసంత్సరమున సూరాయను గ్రామమున జన్మించెను. వానితండ్రి పేరుజనమేజయుఁడు. ఆయనకుఁ గలిగిన యాఱుగురుకుమారులలో రాజేంద్రలాలుమైత్రా రెండవవాఁడు. ఈమైత్రాను జిన్నతనముననుండియుఁగలకత్తానగరమున నున్న వాని మేనత్త పెంచెను. ఆమేనత్తయీబాలకునిపెంచుకొని తనకున్న సొత్తునంతయు నీయవలయునని తలంచెను. కానియట్టిపెంపు శాస్త్రసమ్మతము గాకుండుటచే నూరకొనవలసి వచ్చెను. ఆబాలకుఁడు స్వభాషయగు బంగాళిని తనకులగురువునొద్ద నేర్చుకొని యనంతరము కలకత్తాలో సుప్రసిద్ధికెక్కిన రెండుపాఠశాలలలో నింగ్లీషు నభ్యసించెను.

ఆకాలముననే యీబాలకుని మేనత్తమృతినొందఁ గుమారునకు విద్యచెప్పించవలసినభారముజనమేజయునిపైఁబడెను. కుమారుఁడుకుశాగ్రిబుద్ధియని యెఱుంగుటచే తండ్రి వానిచదువును మానిపింపఁ జాలఁడయ్యె. కాఁబట్టి జనమేజయుఁడుచక్కఁగ విచారించి తన పిల్లవానికి విద్యార్థివేతనము నిచ్చునట్టి పాఠశాలలో నెందైనఁ బ్రవేశ పెట్టుట కర్తవ్యమని నిశ్చయించుకొనియట్టిబడి యెక్కడనున్నదని వెతకనారంభించెను. ఆకాలమునఁ గలకత్తానగరమున వైద్యకళాశాల (మెడికల్‌కాలేజీ) లో దొరతనమువారొక్క విద్యార్థికినెలకెనిమిది రూపాయలవంతున జీతమిచ్చి వారియొద్దనుండియేమియు మరల గ్రహింపకయే వైద్యశాస్త్రము చెప్పుటకేర్పాటుచేసిరి. ఆపాఠశాలాధికారులురాజేంద్రలాలు మైత్రానుగూడ నట్టివిద్యార్థిగఁ దీసికొనిరి. కానియప్పుడే యతనికి

దురదృష్టవశమున దారుణజ్వరము సంభవించుటచే నతఁడందు వెంట నే చేరలేకపోయెను. రాజేంద్రుఁడు పదునైదేండ్ల ప్రాయముగలవాఁడ యినప్పుడనఁగా 1839వ సంవత్సరమున వైద్యకళాశాలలో పైనపేర్కొ నబడిన పద్ధతిని విద్యార్థి యయ్యెను. కళాశాలలో నతఁడుచేసిన విద్యాభివృద్ధి మిక్కిలి ప్రశంసనీయమై యుండెను.

ఆతని బుద్ధికుశలతవిని మహర్షి దేవేంద్రనాథ టాగూరుగారి తండ్రియగు ద్వారకనాథ టాగూరుగారు మైత్రానింగ్లాండు దేశమున కుఁ దీసికొనిపోయి యక్కడ విద్య పరిపూర్తిచేయింతునని చెప్పెను. కాని తండ్రి మైత్రాను విదేశమునకుఁబంపఁడయ్యె. ఆవైద్యకళాశాల లోనున్న కాలముననే రాజేంద్రుఁడు కేవలము తనయశ్రద్ధచేత వారి తనమువారి కైదువందల రూపాయిలు నష్టము గలిగించెను. ఒకనాఁడ తఁడు కొన్ని లోహములను గరగించుచుండెను. అట్లుకరగించుటకుప్లా టినం అను మిక్కిలి విలువగల లోహముతో చేయఁబడిన మూసయొ కటి తెచ్చి దానిని నిప్పులమీఁదఁ బెట్టి యాలోహమందు వేసి కరగింప నారంభించెను. కొంత సేపటికి రాజేంద్రుఁడుతనప్రయత్న మెంతవఱకు నెరవేరినదో తెలిసికొందమనిచూచునప్పటికి మూసయేకరగిపోయెను. అది చూచి బాలుఁడగు రాజేంద్రుఁడు భయమున గడగడవడఁకుచు తనయొజ్జయగు ప్రకృతిశాస్త్రపండితున కాసంగతి విన్నవింప నతఁడు వానిని చీవాట్లుపెట్టికళాశాలకు నధికారియగు డేవిడు హైరుదొరగారి కాసంగతిదెలియఁజేసెను. ఆదొరగారును రాజేంద్రునిపిలిపించి వానిం దిట్టకకొట్టక కళాశాలలోనుండి తీసివేయక యట్టిపనులయెడలముందు జాగరూకతతో మెలంగవలయునని చెప్పి మందలించి పంపెను.

రాజేంద్రుఁడు వైద్యకళాశాలలోఁ జిరకాలముండలేదు. అచటి విద్యార్థులు కొందఱుదుష్ప్రవర్తకులై సంచరించినందున నధికారులు వారి నడతం గూర్చి విచారణసలిపిరి. ఆరాజేంద్రుఁ డాచెడునడతగల

బాలకులలో నొకఁడు కాఁడుగాని యాదుర్మార్గులను బట్టియిమ్మనియధికారులు వాని నడిగినప్పుడు తనమిత్రులను బట్టియిచ్చుట కిష్టములేక యతఁ డూరకొనియెను. అదికారణముగనధికారులు వానిని కళాశాలలోనుండి కొంతకాలము వెడలఁగొట్టిరి. రాజేంద్రుఁడుమరలనావైద్యశాలకునధికారులు రానిచ్చినను రాఁదలఁపడయ్యె. ఆవైద్యపాఠశాలలో నుండఁగానే యతఁ డాంగ్లేయభాషలో మంచిసాహిత్యముగల కామరాన్ అనుదొరవద్ద నింగ్లీషుచదివి యందుగట్టి కృషిచేసెను. ఈ కామరాన్ దొరయొద్దనే రాజేంద్రుఁడు హూణభాషాపదములను బ్రయోగించుటలో నిరుపమానమయిన ప్రజ్ఞను సంపాదించెను.

అనంతర మతఁడు ధర్మశాస్త్రముఁ జదువనిశ్చయించి న్యాయవాదిపరీక్షకుఁబోయెను. కానియాసంవత్సరము ప్రశ్నాపత్రములుముందుగా వెల్లడియగుటచేఁ బరీక్షకులు జరగిన పరీక్ష నిరర్థకము చేసిరి. అందుచే పరీక్షలోఁ గృతకృత్యుఁడయి తీరవలసిన రాజేంద్రునకు నష్టము సంభవించెను. రాజేంద్రలాలుమైత్రా వైద్యుఁ డగుటకుఁ గాని న్యాయవాది యగుటకుఁగాని యోగము లేకపోయెను.

పిమ్మట చేయవలసిన దేమియులేక యతం డనేకభాషలఁ జదువుటకుఁ బ్రారంభించెను. అదివఱకే వానికి పారసీభాష చక్కఁగ వచ్చును. అప్పటికి సంస్కృతమందు వాని పాండిత్యము కొంచెమైయుండుటచే ముఖ్యమయిన యాభాషలో నధికకృషిచేయుట కతఁడు నిశ్చయించుకొనెను. అదిమొదలు రాజేంద్రుఁ డాభాషలో నధికపాండిత్యము సంపాదించి గొప్పగొప్పవిద్వాంసుల మెప్పువడసెను. గ్రీకు లాటినుభాషలను మునుముందునేర్చి యనంతరము ఫ్రెంచి జర్మను భాషలను జదివి పిమ్మట హిందీ ఉరుదు భాషలనభ్యసించి మొత్తముమీఁద పదిభాషలను జదువ వ్రాయ మాటలాడఁగల పండితుఁడయ్యెను. ఎన్నిభాషలు తనకువచ్చినను తనభాషలు తనకన్నము పెట్టఁజాలవని యెఱిఁగి రా

జేంద్రుఁడేదైనయుద్యోగములోఁ బ్రవేశింపవలయునని నిశ్చయించుకొని 1846వ సంవత్సరమున బెంగాలు ఏషియాటిక్కు సొసైటియను సంఘమునకు సహాయకార్యదర్శియు గ్రంథభాండారసంరక్షకుఁడునయ్యెను. అప్పటికతని వయస్సిరువదిమూఁడు సంవత్సరములు. ఈయుద్యోగమువలన నుపయోగములగు ననేకగ్రంథములు వాని స్వాధీనములో నుండుటచే నతఁడువానినన్నిటినిజదివి సారముగ్రహించి జ్ఞానాభివృద్ధి చేసికొనఁజొచ్చెను. ఆసంఘముయొక్క కార్యదర్శుల సహాయమున నతఁ డింగ్లీషుభాషలో మంచిశైలినివ్రాయుటకలవఱచుకొని కొలఁదికాలములోనే పై సహాయము లేక స్వయముగ మంచి వ్రాతలువ్రాయ నేర్చెను. ఆసంఘమువారి గ్రంథము లన్నియు సరిగా జాబితావ్రాసి యమర్చి తనకు తీరికయున్నప్పుడు సంఘమువారి మాసపత్రిక కేవైన వృత్తాంతములు వ్రాయుచువచ్చెను. అట్లు కొన్నినాళ్లువ్రాసి 1850వ సంవత్సరమున రాజేంద్రుఁడు భాషాగ్రంథములను ప్రకృతిశాస్త్రములను వ్రాసి ప్రకటించుటకై వివిదార్థ సంగ్రహమను పేరుగల యొక మాసపత్రికను బంగాళాభాషలో స్వయముగ బొమ్మలతోఁ బ్రకటింప నారంభించెను. అట్లతఁడు పత్రిక నేడు వంవత్సరములు ప్రకటించి మరుచటి సంవత్సరమున మైనరు జమీందార్లకు విద్యచెప్పు పాఠశాలకు నధ్యక్షుఁడుగ నియమింపఁబడెను. ఇందుమూలమున నతఁడు పాఠశాలలోఁ జేరిన జమీందార్ల బిడ్డలకు సంరక్షకుఁడయ్యెను. ఈజమీందారీ పాఠశాల యేకారణముచేతనో దొరతనమువా రనుకొనినంత వృద్ధిని బొందకపోవుటచే 1880 వ సంవత్సరమున నది యెత్తివేయఁ బడుటయు రాజేంద్రలాలున కుపకారవేతన (పించను) మిచ్చుటయు సంభవించెను.

రాజేంద్రలాలు దొరతనమువారు తనకప్పగించిన యాపనిని మిక్కిలి శ్రద్ధగాను ప్రభువులకుఁ దృప్తికరముగాను నిర్వర్తించెనని

చెప్పకొనక తప్పదు. అప్పటి బంగాళా గవర్నరుగారు జమీందార్ల పాఠశాల విషయమున రాజేంద్రుఁడు చేసిన పనిని మెచ్చుకొనుచు నిట్లువ్రాసెను. "ఇట్లుపాఠశాలను పరిపాలించుట మిక్కిలి కష్టసాధ్యమయిన పనియయినను పాఠశాలఁ గాంచిన వృద్ధి దాని పరిపాలకునకు మిక్కిలి ప్రతిష్ఠఁ దెచ్చుచున్నది. ఈకాలమున బంగాళాదేశములో జక్కఁగ వ్యవహరించుచున్న జమీందార్లనేకులు గలరు. వారందఱు రాజేంద్రలాలుమైత్రాయొక్క శిష్యులే యగుటచేఁ దమకట్టి సామర్థ్య మీరాజేంద్రుని శుశ్రూషవల్లనే గలిగినదని యొప్పుకొని తమకృతజ్ఞత ననేకపర్యాయములు చూపియున్నారు.

రాజేంద్రలాలుమైత్రా కేవలము ప్రాచీన విద్యలయందె తన కాలముఁ బుచ్చెను. అతఁడు చేసిన పరిశ్రమ యంతయు నేసియాటిక్కు సంఘమువారి మాసపత్రికలోను తదితర పత్రికలలోను స్పష్టముగఁ గనఁబడును. అతఁడు రచియించిన గ్రంథములలో ముఖ్యమైనవి ఉత్కలదేశ ప్రాచీనచరిత్ర, బుద్ధగయ ప్రాచీనచరిత్ర యనునవి రెండు. అప్పుడప్పు డతఁడు వ్రాసిన వ్యాసములు "ఇండోఆర్యనులు" అనుపేర రెండు సంపుటములుగ ముద్రింపఁబడి యున్నవి. ఆయన మునిసిపల్ కమీషనరుగా కూడ నుండెను. ఆయుద్యోగమున నతఁడు కావలసినంత స్వాతంత్రముఁ జూపి న్యాయముకొఱకుఁ బోరాడుచు వచ్చెను. అప్పుడప్పుడాయన హిందూపేట్రియేటు పత్రికకుఁ గూడ కొన్నిసంగతులు వ్రాయుచుండువాఁడు. కృష్ణదాసుపాలుని మరణానంతరమున పేట్రియేటు పత్రిక నితఁడె నడపెనని చెప్పవచ్చును. కాని యాపత్రిక నడపుటకుఁ గావలసినంత యోపిక యతనికి లేకుండుటచే నాపని యతనికి కష్టమని తోఁచెను. ఇట్లు తేజోవంతమైన జీవయాత్ర నఱువదియేడు సంవత్సరములవఱకుఁ జేసి రాజేంద్రలాలుమైత్రా 1891 వ సంవత్సరమున పక్షవాతరోగముచేతఁ గాలధర్మమొందెను.

మేధావంతుఁడై మిక్కిలిపూనికతో పాటుపడుమనుష్యుఁడెంతయభివృద్ధినొందునో రాజేంద్రలాలుని చరిత్రమువల్ల తెలిసికొనవచ్చును. ఆంగ్లేయభాషలో వ్రాయుటకుమాటలాడుటకు నతనికద్భుతశక్తిగలదు. సర్ రిచర్డు టెంపిలు దొరగారు "ఆకాలము మనుష్యులు కార్యములు" అను నర్థముగల యాంగ్లేయ గ్రంథమును వ్రాయుచు రాజేంద్రునిఁగూర్చి యిట్లువ్రాసిరి. "ఆంగ్లేయభాషను పరదేశభాషలను నేర్చిన పండితులలో నితఁడగ్రగణ్యుఁడని చెప్పవచ్చును. పూర్వ హిందువుల యద్భుత ప్రజ్ఞలం దలంచి యతఁడు మిక్కిలి యక్కజమును గరువమును బొందును. నేనాఁటి హిందువులదురవస్థను గూర్చి మిక్కిలి వగచుచుండువాఁడు." మోక్షమూలరుపండితుఁడు తనగ్రంథములలో నొకదానియందు వీనినిఁగూర్చి యిట్లువ్రాసెను. "రాజేంద్రలాలు మైత్రుఁడు వృత్తిచేత పండితుఁడేగాక గట్టివిమర్శకుఁడు. ఏషియాటిక్ సంఘమువారియొక్క మాసపత్రికకనేకములగు విషయములనువ్రాసి యతఁడు హిందూదేశ ప్రాచీనవిద్యలనుగూర్చి యీవఱకు తప్పులగు నభిప్రాయములుగల తన దేశస్థులందఱికంటె నెక్కువవాఁడని తేటపఱచెను.

అతఁడు వ్రాసినగ్రంథములన్నియు నేఁబది. అవి నూటయిరువదియెనిమిది సంపుటములుగ విభజింపఁబడియున్నవి. ఆగ్రంథముల యందలి పుటలు ముప్పదిమూఁడువేలకంటె నెక్కువ గలవు. ఈసంపుటములు హిందూదేశప్రాచీన విషయములు, సంస్కృతమునుండి చేసిన భాషాంతరీకరణములు, స్వతంత్రముగ బంగాళీభాషలో రచించి గ్రంథములు, సభలోనిచ్చిన యుపన్యాసములు, పత్రికలకువ్రాసినసంగతులు గలవై యాతనిసర్వతోముఖ పాండిత్యమును వెల్లడిచేయుచున్నవి.

1885 వ సంవత్సరమున ఏషియాటిక్కుసంఘమున కతఁడధ్య

ష్టుఁడయ్యెను. అదివఱకు హిందువుల కెవరికి నంతటి గౌరవము పట్టి యుండలేదు. కావున రాజేంద్రలాలుమైత్రునకింతటిగౌరవము గలిగి నందులకు దేశస్థులందఱు మహానందభరితులైరి. 1886 వ సంవత్సరమున కలకత్తాలో దేశీయమహాజనసభ జరిగెను. అది రెండవసభ. హిందూదేశము నంతనుండియు దేశీయమహాసభకుఁ బ్రతినిధులుగావచ్చు పెద్దమనుష్యులను సన్మానము చేయుటకైయొకసభ యేర్పడెను. ఆసభకు నగ్రాసనాధిపతిగా నుండుటకు రాజేంద్రలాలు మైత్రునికంటె సమర్థుఁడు లేఁడని కలకత్తానగరవాసులు వాని నైకకంఠ్యముగ నధ్యక్షునిఁ జేసిరి. ఇంతియగాక యతఁడు బ్రిటిషుయిండియా సంఘమునకుఁ గూడ నగ్రాసనాధిపతియై యుండెను. ఈసంఘములో బంగాళాదేశమునందుగల గొప్పజమీందారులు విద్యావంతులుసభికులుగానుండిరి. అట్టిసంఘమున కతఁడు సభాధ్యక్షుఁడుగా నుండుటచేతనే జనులకతనియం దెంతగౌరవమున్నదో తెలిసికొనవచ్చును.

ఈసంఘము దేశమున కెంతయు నుపకారము జేసినది. ఇట్లు చేయుటకు సభాధ్యక్షుఁ డగు రాజేంద్రుఁడే ముఖ్యకారణమని ప్రజలనుకొనిరి. అతని పాండిత్యమును పరిశ్రమను గనిబెట్టి హిందువులేగాక యితరదేశస్తు లనేకులు వానిని తమతమదేశములందున్న విద్యావిషయిక సభలలో సభ్యునిఁ జేసికొనిరి. కలకత్తాయూనివరుసిటీవారు వానికి డాక్టరనుబిరుదము నిచ్చిరి! డాక్టరుశబ్దమున కిక్కడ వైద్యుఁడనే యర్థముగాదు. డాక్టరనఁగా పండితుఁడు, ప్రకృతిశాస్త్రము ధర్మశాస్త్రము మొదలగువానియం దసాధారణ ప్రజ్ఞగల పండితులకుఁ దఱుచుగా నిట్టి బిరుదములు విద్యాశాఖవారిచ్చుచుందురు. దొరతనమువారు వానియందు తమకుఁగల గౌరవమునుబట్టి సి. ఐ. ఇ. రావు బహదూరు రాజా యనుబిరుదముల నిచ్చిరి. 1887 వ సంవత్సరమునందు జరిగిన దర్బారులో సర్ ఆష్లీఇడెం దొరగారు రాజేంద్ర

లాలునితో నిట్లనిరి. "కోర్టుఅఫ్‌వార్డ్సువారి యధీనమునం దుండిన మైనరుజమీాందారుల విద్య మీాచేతులలో నుంచబడినది. అందుచేత బంగాళమునందున్న జమీాందారులలో ననేకులు మీాఋణమును దీర్చుకొనఁజాలరు. మీారు సంస్కృతభాషలో నధికపాండిత్యముసంపాదించి జగద్వ్యాప్తమైన కీర్తిని సంపాదించినారు. మీా ప్రజ్ఞలన్నియు నెఱిఁగి దొరతనమువారు మీాకు రావుబహదూరు బిరుదము నిచ్చినారు."

తన దేశస్థుల కెపుడైన కూడనియపకారము జరిగినపుడు దానిని బయలుపెట్టి మిక్కిలికఠినోక్తులతో దానింగూర్చి ప్రశంసించుచు వచ్చెను. దీనికొక్క యుదాహరణము చెప్పవలసియున్నది. నీలిమందుతోఁటల యజమానులు బంగాళా దేశమునందలి రహితుల కొత్తుకు కలుగఁజేసి బాధించినపుడు రాజేంద్రలాలు దిక్కుమాలిన రహితుల పక్షముఁబూని తోఁటలయజమానుల ప్రవర్తనము సరిగానుండలేదని కలకత్తాలో నొకమహాసభలోఁ బలికెను. ఇట్లతఁడు బహిరంగమైన సభలో తమ్ము నిరసించినాఁడని కోపించి నీలిమందుతోఁటలయజమానులగు నాంగ్లేయులుకొందఱు కడుపుమంటతీరక ఫొటోగ్రాఫిక్ సంఘమునఁజేరి రాజేంద్రలాలుమైత్రిని సంభాషణము సరిగానుండలే దని ఖండించి యతని నాసంఘములోనుండి దొలఁగింపఁ బ్రయత్నించిరి. రాజేంద్రుఁ డాసంఘములో చిరకాలమునుండిసభ్యుఁడుగా నున్నందున వానిం దీసివేయుటకు వీలులేక యాదొరలు తుదకిట్లు తీర్మానముచేసికొనిరి. "నగరమందిరమున రాజేంద్రలాలుమైత్రిఁడు చేసినయుపన్యాసమునందలి మాటల నీసంఘమువారు వినియందు మొదటినుండి చివరవఱకు నబద్ధములేయుండుటచేత నట్టియుపన్యాసమిచ్చినయతఁడీ సంఘములో సభ్యుఁడుగానుండుటకు తగడని నిశ్చయించి యట్టివానిందీసివేయుట కిప్పటి నిబంధనలలో నేవియు

నాధారములు గనబడకపోవుటచే రాజేంద్రలాలు తనంతటతానే యీ సంఘమునుండి మానుకొనవలయునని యిందుమూలముగా తెలియఁ జేయుచున్నారు."

మేజర్ థల్లియర్ దొరగారు రాజేంద్రునిపక్షముబూని యత నివలన లోపము లేదనియు ననేకపర్యాయములు నాంగ్లేయులు పెక్కండ్రు హిందువుల నింతకంటె నెక్కుడు కఠినోక్తులతో నిందించిరనియు రాజేంద్రలా లాంగ్లేయుల నందఱిని తిరస్కరింపలే దనియు తప్పుచేసిన నీలిమందుతోఁటల యజమానులనే నిరసించెననియు సంఘమువారట్లు తీర్మానము చేయఁగూడదనియు వాదించెను. హ్యూముదొరగారు మొదలగు కొందఱాంగ్లేయులు థల్లియరుదొరగారితో నేకీభవించిరి. కాని యీసంఘమువారిలో నెక్కువమంది రాజేంద్రునకుఁబ్రతిపక్షులుగా నున్నందున వారిమాటలు సాగవయ్యె. అది కారణముగ రాజేంద్రలాలుతోపాటు థల్లియరుదొరగారుకూడ నాసంఘమును విడిచిరి.

అతని మరణానంతరమున వానింగూర్చి వ్రాసిన స్వదేశపత్రికలు రాజేంద్రలాలుమైత్రుఁడు రామమోహనరాయలుకంటెను, కేశవచంద్రసేనునికంటెను, మేధావంతుఁడనియు మేధావంతుఁడేగాక విద్యావంతుఁడనియు వానిమరణము దేశమునకంతకు నష్టముఁగలిగించెననియు విచారించెను. పదిభాషలలో నిరర్గళపాండిత్యము గలిగి సంస్కృతమునం దింతింత యనరాని ప్రజ్ఞగలిగి యింగ్లీషులో నాంగ్లేయులకు నయితేము నీర్ష్యఁ బొడమింపఁగల సామర్థ్యము గలిగి ప్రపంచమునందుండిన సమస్తవిద్యాసంఘములలోను సభ్యుఁడుగా నున్న హిందువుఁడు పందొమ్మిదవశతాబ్దమున రాజేంద్రలాలుఁడొక్కఁడే యని తెలిసికొనవలయును.

---

# కృష్ణమోహన బెనర్జి

ఈయన ప్రతిమయు మాకు దొరకలేదు. ఈయన బంగాళా దేశ బ్రాహ్మణుఁడు. ఈయనతండ్రి పేరు జీవన్‌కృష్ణ బెనర్జీ. ఈకృష్ణమోహనుబెనర్జీ 1813 వ వంవత్సరమున మేనెలలోఁ గలకత్తానగరములో నుదయించెను. అయిదేండ్లవయసువాఁడైనప్పు డతఁడు విద్యారంభముచేసి బంగాళీభాషలోఁ జదువుటయు వ్రాయుటయు లెక్కలు సేయుటయు నేర్చికొనెను. తరువాతఁ గొంతకాలమున కాయన హిందూకళాశాలకుఁబోయి యచ్చట నాంగ్లేయభాషను సంస్కృతమును నేర్చికొనియెను. 1828 వ సంవత్సరమున కృష్ణమోహనుని తండ్రి విశూచి జాడ్యమువలన లోకాంతరగతుఁడయ్యెను. పితృవియోగముచేత విద్యాభ్యాసము చక్కఁగా సాగనందున నతఁడు నెలకు పదియాఱు రూపాయలు విలువఁగల విద్యార్థి వేతనమును సంపాదించి చదువనారంభించెను. మఱుచటి సంవత్సరము వానికి ఢిల్లీకళాశాలలో నొకయుపాధ్యాయకోద్యోగమయ్యెను. కాని కొన్ని గృహసంబంధములగు నిబ్బందులచేత పోఁజాలక యతఁ డాసంవత్సరము నవంబరులోనే హేరుదొరగారి పాఠశాలలో నుద్యోగము సంపాదించెను. ఆకాలమున బంగాళా దేశమున దృఢచిత్తులగు పడుచువాండ్రు కొంద ఱొక సంఘముగాఁ జేరి హిందూమతమును నిర్మూలింపవలయునని నిశ్చయించుకొని తద్విషయమయి పాలుమాలిక లేక పాటుపడఁజొచ్చిరి. కృష్ణమోహనుఁడు గూడ నాసంఘమునఁ జేరి తద్విషయమున గట్టి పనిఁ జేయుటకు నొక యింగ్లీషు వార్తాపత్రికను బ్రకటింపఁ జొచ్చెను.

కృష్ణమోహనుని పద్ధతులు బంగాళీల కందఱకు మహాగ్రహమును దెప్పించెను. ఆగోలఁజూచి యతని స్వజనముగూడ వాని నింట

నుండి యవ్వలకుఁ బంపివేసెను. మొదటినుండియు నతనికి క్రైస్తవ మతబోధకులు మిత్రులుగా నుండుటచే వానికిఁ గ్రైస్తవమతముపై నత్యంతాభిమానము బొడమెను. ఆయభిమానము కతమున నతఁడు పలుమారు బైబిలు మొదలగు గ్రంథములు చదివి యెట్టకేలకు 1832 సంవత్సరమునఁ గ్రైస్తవమతము నవలంబించెను. డాక్టరు ఢఫ్ దొరగారు సమయమున ప్రధానాచార్యుఁడై పరిశుద్ధస్నానము చేయించి వాని నామతమునఁ గలిపిరి. కలిపినవెంటచే కృష్ణమోహనుఁడు కొంతకాలమునకుఁ బ్రయాగమండలమునఁ బ్రయాణముచేసి 1835 వ సంవత్సరమున తనభార్యను తనస్వాధీనము చేసుకొనెను. తరువాత చర్చిమిషనుస్కూలులో నుపాధ్యాయుఁడై కొంతకాలముండి యవ్వలనొక చర్చికధికారియై యచ్చటి పనులను మిక్కిలి సామర్థ్యముతోఁ నెఱవేర్చుచుండెను. తాను గలియుటయేగాక కృష్ణమోహనుఁడు తనతోడి హిందూబాలకుల ననేకులఁ గ్రైస్తవమతమునఁగలిపెను. 1852 సంవత్సరమున బిషప్సుకళాశాలలో నతఁ డుపాధ్యాయుఁడుగాఁ బ్రవేశించి 1858 వ సంవత్సరమువఱకు నచ్చట పనిచేసెను. ఈయన తాను ప్రవేశించిన క్రైస్తమతమునందు మిక్కిలి యభిమానము గలవాఁడై యామతమును తన దేశస్థులకు బోధించుచుఁ దద్విషయమున ననేక గ్రంథములు బంగాళీలోను నింగ్లీషులోను వ్రాసి ప్రచురించెను. ఈయన పదిభాషలలో పండితుఁడు. ఓఢ్రభాషయందు సంస్కృతభాష యందు బి. ఏ. మొదలగు పరీక్షలకుఁ జాలకాల మతఁడు పరీక్షకుఁడుగా నియమింపఁబడెను. ఈయన వ్రాసిన గ్రంథములలో రెండు ముఖ్యమయినవి గలవు. అందొకటి హిందువుల వేదాంతశాస్త్రవిషయమయిన సంభాషణ పూర్వకముగా నున్నది. ఈపుస్తకము మన దేశమున కింగ్లాండునుండి వచ్చుదొరల కత్యంతోపయుక్తముగానున్నది. రెండవగ్రంథము క్రైస్తవమతమునందలి సత్యమునుగూర్చి

వేదములలోఁ బ్రమాణము లున్నవని చెప్పుచున్నది. వేదమందున్న ప్రజాపతిశబ్దము యేసుక్రీస్తునకే యర్థమిచ్చుచున్నదని యతఁడీగ్రంథమునందు సాధించెను.

కృష్ణమోహనబెనర్జి క్రైస్తవమతములోఁ గలసిన కొంతకాలమువఱకు మిక్కిలి మతావేశముగలవాఁడై తక్కిన మతస్థులను గఠినముగాఁ దూలనాడుచువచ్చెను. కాని వయస్సు ముదిరినకాలఁది యన్యమతసహనముఁ గలవాఁడై సమస్తజనముల యెడల ప్రేమగలవాఁడై యందఱి గౌరవమునకుఁ బాత్రుఁడయ్యెను. క్రైస్తవమతబోధకులు దేశస్థులగు బీదలయెడల పరమదయాళులై వారి కనేకోపకారముల చేసినపక్షమునఁ గ్రైస్తవమతమునందుఁ బ్రజల కాదర మెక్కుడుగలుగునని యాయన యభిప్రాయపడి తక్కువజాతులవారికిఁ బలుమారు లుపకారములు సేయుచువచ్చెను. అందుచేత తనమతాభివృద్ధి యెటులున్నను, ప్రజానురాగము మాత్రము మతనియందు హెచ్చుగా నుండెను. క్రైస్తవసంఘమువా రీయనకు "రివరెండు' అను బిరుదము నిచ్చిరి. విద్యాశాఖవారనఁగా యూనివరుసిటీ వారతనికి మహాపండితుల కీయఁదగిన యల్. యల్. డి. యను బిరుదమునిచ్చి గౌరవించిరి. ఈయన 1885 వ సంవత్సరము మేయి నెలలో కాలధర్మము నొందెను. ఆకాలమందు బంగాళాదేశములో విద్యావిషయకములు దేశాభిమాన విషయకములు రాజకీయవిషయకములు నగు ప్రసంగములు కృష్ణమోహనబెనర్జీ లేనివిలేవు. ఇతఁడు మతాంతరుఁడైనను దేశాభిమానులలో నొకఁడు.



# మధుసూదనదత్తు.

మధుసూదనదత్తు బంగాళాదేశములోని జస్సూరు జిల్లాలో సగందరి యనుగ్రామమున 1824 వ సంవత్సరమున జన్మించెను. వాని తండ్రియగు రాజనారాయణుఁడు 'సాదరుదివానీఅదాలత్' కోర్టులో న్యాయవాదిగా నుండెను. ఆయనకు నలుగురుభార్యలు. ఈమధుసూదనుఁడు జ్యేష్ఠభార్య కుమారుఁడు. ప్రారంభమున నతఁడందఱు బాలకులవలెనే మాతృభాషయగు బంగాళీని కొంతకాలము నేర్చికొని యనంతరమున 1837 వ సంవత్సరమున హిందూకళాశాలలోఁ జేరెను. ఆకళాశాల యాకాలమున డిరోజియోయను దొరగారిపరిపాలన ముక్రింద నుండెను. ఆయన బంగాళాబాలకుల పరివర్తనమును జక్కఁజేసి విద్యాబుద్ధులు చెప్పి పనిచేయుటలోఁ జాలపని చేసెను. ఆయనకు శిష్యులై విద్యనేర్చికొనిన బంగాళాబాలకు లనేకులు సంఘసంస్కారప్రియులై హిందూమతములోనుండు దురాచారములను దొలఁగించుటకై పాటుపడిరి. మధుసూదనదత్తును వారిలో నొకఁడయ్యెను.

ఆపడుచువాండ్రిందఱు సంఘదురాచారములను దొలఁగించి దేశమున కుపకారము జేయఁదలంచుటయే గాక రాజ్యాంగవిషయములయందుఁ గూడఁ బనిచేసి భరతఖండము నున్నతస్థితికిఁ దెచ్చుటకును స్వభాష నభివృద్ధిచేయుటకును సంకల్పించిరి. అంతియగాక తామభ్యసించిన శాస్త్రవిద్యలచేత తామాంగ్లేయభాషలోఁ గూడ కవనముచెప్పి చిత్రవచనకావ్యముల రచించి ప్రసిద్ధిఁ గాంచఁగలవారమని నమ్మియుండిరి. మధుసూదనదత్తును దనమనంబున నిట్టినమ్మకముగలవాఁడె. అతఁడు 1837వ సంవత్సరముమొదలు 47 వ సంవత్సరమువఱకు హిందూకళాశాలలోవిద్యార్థియైయుండియాకాలమున నేయింగ్లీషుభాష

లోననేకపద్యములరచించెను. అప్పుడుహిందూకళాశాలలోఁజదువుకొనువిద్యార్థులందఱిలో మధుసూదనదత్తుబుద్ధికి బృహస్పతియనిపేరుపడెను. అతఁడు తఱచుగా మోహము దేశాభిమానము మొదలగువిషయములఁగూర్చియింగ్లీషులో పద్యములు వ్రాయఁజొచ్చెను. వానికి బాల్యమునుండియు నింగ్లాండు దేశముఁజూడవలయుననుకుతూహలముగలదు. ఆదేశము తానెన్నఁడు జూడగలుగుదునో యని యౌత్సుక్యము నొందుచు నింగ్లీషులోనొక చిన్నపద్యమును వ్రాసెను. ఆపద్యమెంతయు మనోహరముగా నుండును.

హిందువులలో సామాన్య బాలకుల కేచిన్నతనమందనేకులుపిల్లనిచ్చి పెండ్లిచేయుచుందురు. అట్టియెడ కుశాగ్రబుద్ధియై విద్యనభ్యసించుచున్న మధుసూదనదత్తువంటివానికి సంబంధములువచ్చుటయాశ్చర్యముగాదు. అందుచేత నతనితండ్రి కుమారునకు వివాహము చేయనిశ్చయించి యొకచిన్నపిల్లను గుదిర్చి తద్విషయ ప్రయత్నములు చేయ నారంభించెను. నలుగురు భార్యలం గట్టుకొని నానాయవస్థలం బడుచున్న తండ్రి తనకుఁ గూడ చిన్నతనమందే వివాహముచేయఁదలంచినప్పుడు మధుసూదనదత్తునకు వివాహ మిష్టములేకపోయెను. అతఁడు తన యనిష్టము సూచించియు తనమాటసాగదనితలంచినివాహసమయమున నిల్లువిడిచిపోయెను. పోయి క్రైస్తవమతబోధకులగు నాంగ్లేయుల శరణుజొచ్చియదివఱకెక్రైస్తవమతములోఁగలిసియున్న కృష్ణమోహనబెనర్జీసహాయమునఁనాలుగుదినములెవ్వరికింగనఁబడకుండ దాగియుండెను.

ఎట్టకేలకు 1843 వ సంవత్సరమున ఫిబ్రేవరు నెలలో నతఁడు క్రైస్తవమతములోఁగలసి యానాఁడు మొదలుమైకోలుమధుసూదనదత్తనుపేరఁ బరగుచుండెను. మైకోలనునది యతఁడు క్రైస్తవమతములోఁ గలసినప్పుడు కలిగిన నామము. అతనితండ్రి వానియిష్టములే

కుండ బలవంతముగ వివాహము చేయఁదలంపకపోయినపక్షమునమ ధుసూదనదత్తు క్రైస్తవమతములోఁగలియకతనసహాధ్యాయులవలెనే పేరునకైన హిందువుఁడై స్వమతమునందే యుండును. కానియతనికిఁ గలిగిన నిర్బంధమువలన నతఁడు స్వమత పరిత్యాగముచేసి కృష్ణమోహనబెనర్జీవలెనే మతాంతరుఁడు కావలసివచ్చెను. పుత్రవాత్సల్యమతిశయముగాఁగల రాజనారాయణుఁడు మతభ్రష్టుఁడైనయాకొమరునకెప్పటియట్లధనమిచ్చి బిషపుకాలేజీలో నాలుగుసంవత్సరములుచదువుచెప్పించెను. కాని కొన్నికారణములవలన కొడుకునకుం దండ్రికి మనస్పర్థలు పొడమ రాజనారాయణుఁడు కుమారునివిడిచినందునమధుసూదనుఁ డసహాయుఁడై యుండవలసివచ్చె.

ఆకాలమున చెన్నపట్టణమునుండి కొందఱు బాలకులువచ్చి బిషపుకాలేజీలో విద్యార్థులై కలకత్తాలోఁజదువుచుండిరి. ఆవిద్యార్థుల ప్రోత్సాహముచేత చెన్నపట్టణమునకుఁ బోయి కొంచెము బాగుపడవచ్చునని కలకత్తావిడిచి యాపట్టణమునకుఁబోయెను. చెన్నపట్టణమునకు వచ్చినపిదప వానిస్థితి మునుపటికన్న హీనముఁకాగా నతఁడుదారిద్ర్యబాధమిక్కుటముగాననుభవించి పొట్టపోసికొనుట కేయుపాయమును గానకయింగ్లీషువార్తాపత్రికలకు వృత్తాంతములనువ్రాసి దానిచేఁగొంతధనమును సంపాదించి జీవయాత్ర గడపుచుండెను. ఆనిరుపేదతనమందును మధుసూదనుఁ డింగ్లీషుకవనము మానక యందుఁగృషిచేయుచు 1849 వ సంవత్సరమున "చెఱలోనున్నస్త్రీ"యనుశీర్షికతో నాకమనోహరమైన పద్యకావ్యమును రచించెను. ఆకావ్యమును జెన్నపురమందలి స్వదేశీయులు నాంగ్లేయులుఁగూడగడుమెచ్చిరి. ఇంగ్లీషుకవులలోఁ గడు ఖ్యాతివహించిన స్కాటుబేరను మొదలగువారికవనములకు దత్తుకవనము దీసిపోదని యొకయింగ్లీషువార్తాపత్రిక తనయభిప్రాయము నిచ్చె. ఈపద్యకావ్యమును మధుసూదనుఁడు కలకత్తాలోను

న్న బెత్యూను దొరగారికిఁ బంపినప్పు డాయన దానిం జదివి మహానంద భరితుఁడై మధుసూదనదత్తునకు నొకజాబు వ్రాసి దానిలో "నీవాంగ్లే యభాషలోఁ జేసినపరిశ్రమను స్వభాషలోనే చేసి దానికై యుప యోగించినకాలము నీస్వభాషకై యుపయోగించి గ్రంథములురచించి నపక్షమున నీవు దేశోపకారము స్వభాషాభివృద్ధియుఁ జేయుటయేగాక నింతకంటె నెక్కుడు ప్రసిద్ధినిగాంచఁగలవుసుమీ" యనిహితోపదేశ ము చేసెను. ఆయుపదేశమును మన్నించి దత్తువెంటనే కలకత్తానగర మునకు 1856 వ సంవత్సరమున వచ్చెను.

చెన్నపురమందెనిమిదిసంవత్సరములువసియించినను వానిభాగ్య ముకనుబొమ్మమీఁది వెండ్రుకలవలెనెదుగుబొదుగులేక, కలకత్తానుండి బయలుదేరినప్పు డెట్లుండెనో మరల కలకత్తాకువచ్చినప్పుడ ట్లేయుండె ను. జీవనాధార మేదియులేకపోవుటచే నతఁడు రాఁగానే కలకత్తా పో లీసుకచ్చేరిలో నొకగుమాస్తాపనిసంపాదించి తెలితేటలుగలవాఁడగుట చే కొలఁదికాలములోనే తర్జుమాచేయు నుద్యోగస్థుఁడయ్యెను. ఇట్లు బ్రదుకుతెరవు కొంచెము దొరకుటచే స్వస్థమైన మనస్సుతో దత్తు బెత్యూ ను చెప్పిన హితోపదేశముచొప్పున నడువఁదలంచి బంగాళీభాషలోను న్న గ్రంథములను సమగ్రముగఁ జదివి 1858 వ సంవత్సరమున శర్మిష్ఠ యను నొక నాటకమును రచించి ప్రకటించి మరుసటి సంవత్సరము న పద్మావతియను మఱియొక నాటకమును వ్రాసెను. ఈనాటకము ర చించిన వెంటనే యతఁడు రెండుప్రహసనములు వ్రాసెను. అందొకటి బంగాళాబాలకుల దురాచారములనుగూర్చియుఁ రెండవది బంగాళాదే శ వృద్ధులు భోగపరాయణత్వము కపటమును గూర్చియు వ్రాయఁబడె ను. ఈగ్రంథములవలన నతనికి గొంతపేరు గలిగెనుగాని వానికిమిక్కి లిఖ్యాతి యతఁడు తరువాత రచియించినపద్యకావ్యములవలనఁగలిగె ను. మొదటినుండియు నతనికిఁ బద్యములలో యతిప్రాసము లుండుట

యిష్టము లేదు. అందుచేత యతిప్రాసములు లేనిపద్యములు వ్రాయుట మంచిదనియట్లుచేయనిశ్చయించెను. యతిప్రాసలు లేనివట్టిపద్యములు రసవంతముగా నుండవని యానాఁటిపండితులునైకకంఠ్యముగ నమ్మిరి. ఇతరులమాటయేల? మధుసూదనదత్తునకు నధికసహాయకారియైవాని కిం బ్రోత్సాహముకలుగఁజేసిన మహారాజా జ్యోతీంద్రమోహనటాగూరుగారే యట్టికవిత్వమును గూర్చి సందేహించిరి. అయిననుదత్తు యతిప్రాస శూన్యమైన కావ్యమును రచియించుటకుఁ గృతనిశ్చయుఁ డగుటచే టాకూరుగారు దాని నచ్చువేయించుటకు వాగ్దానముచేసిరి. ఆసహాయమును జూచుకొని మధుసూదనుఁడుతిలోత్తమయను నిర్యతి ప్రాసకమయిన పద్యకావ్యమును రచియించి 1860 వ సంవత్సరమునఁ బ్రకటించెను. అపూర్వరచనగల యాపద్యకావ్యము ప్రకటింపఁబడిన తోడనే బంగాళా దేశమున గలిగినఁ కళవళము రమేశచంద్రదత్తుగారీక్రింది విధముగా వర్ణించియున్నారు.

"నిర్యత్రిపాసకమయిన యీగ్రంథముకనఁబడినతోడనే పండితమండలమంతయు నాశ్చర్యమునొందెను. కల్పనాగౌరవము వర్ణనాచమత్కృతి శయ్యామృదుత్వము మొదలగునవి యందు లేవనియెవ్వరుననఁజాలరు గాని యతిప్రాసలు దీసివేయుటకు సాహసించినందులకిష్టపడక పండితులందఱు వానిపుస్తకము చెడిపోయినదనిపలికిరి. ఈసాహసమునకుఁగొందఱు వానిని బరిహసించిరి. కొందఱునిందించిరి. ఈశ్వరచంద్రగుప్తుఁడు మొదలగు ప్రాచీనపద్ధతికవులును విద్యాసాగరుఁడుఆక్ష్యకుమారబెనర్జీమొదలగు నవీనపద్ధతికవులును దత్తుయొక్క గ్రంథము యతిప్రాసలు తీసివేసినందునదుష్కావ్యమైనదనియభిప్రాయమిచ్చిరి. మంచి మెచ్చుటనున్ననుదానినిమెచ్చుకొనునట్టిగుణగ్రహణపారీణుఁడు విద్యాసాగరుఁడు తిలోత్తమ భ్రష్టకావ్యమనిపలికెను. విద్యాసాగరుఁడే యట్లన తక్కువప్రజ్ఞఁగల తక్కిన కవులందఱు దత్తును గేలికొట్టి దూషించిరని వేఱచెప్పనేల!"

ఇట్లనేకులు గ్రంథమును గ్రంథకర్తను నిరసించినను మెచ్చుకొను వారుకొందఱు లేకపోలేదు. జ్యోతీంద్రమోహనటాగూరు డాక్టరు రాజేంద్రరాలుమైత్రా మొదలగు రసికులుకొందఱు తిలోత్తమయందలిరసములను గ్రహించి కవినిం బొగడఁజొచ్చిరి. జ్యోతీంద్రమోహనటాగూరు కావలసిన ధనమిచ్చి గ్రంథము నచ్చొత్తించెను. రాజేంద్రలాలుమైత్రుఁడు బంగాళీభాషలో యతిప్రాసశూన్యమైన కవిత్వమును గ్రొత్తగాఁ దెచ్చిపెట్టినందుకు సంతసించి దత్తును బొగడెను. రాజనారాయణ భాసుఁడను పండితుఁడు తద్గ్రంథవిషయమున నిట్లు వ్రాసెను. "దేవేంద్రుఁడు బంగాళీభాషను మాటలాడఁదలంచుకొనునేని నిశ్చయముగా నతఁడీ గ్రంథములోనున్న శైలినే మాటలాడును. ఆగ్రంథకర్తయొక్క మహోన్నతములయిన కల్పనలను స్వభావవర్ణనమునఁగల ప్రజ్ఞయు రసపుష్టిజేయుటలోఁగల సామర్థ్యము పదలాలిత్యము విశేషించి పద్యముల నడకయు మమ్ము మహానంద భరితులఁజేయుచున్నవి."

ఇటు తిలోత్తమ యను గ్రంథము చక్కఁగా నుండలేదని విరుద్ధాభిప్రాయముల నిచ్చిన పండితులు మఱికొన్ని దినములకు మధుసూదనదత్తు రచియించిన మేఘనాధవధ యను మఱియొక కావ్యమును జూచి చిన్న బుచ్చుకొనిరి. ఆపండితు లందఱుఁ జిట్టచివరకు మేఘనాథవధ మిక్కిలి సుందరముగా నున్నదని యొప్పుకొనక తప్పదయ్యె. అట్లొప్పుకొన్నవారిలో నగ్రగణ్యుఁడు గుణగ్రహణ పారీణుఁడు నగు విద్యాసాగరుఁడే. మహాభారతము బంగాళీబాషలో వ్రాసిన కాళీప్రసన్న సింహుఁడు మధుసూదన దత్తుయొక్క బుద్ధికుశలతకు మెచ్చి యీకవిపేరుపెట్టి యొక విద్యాసంఘము నేర్పఱిచెను. అ సంఘముననే దత్తు కృష్ణకుమారి యను నాటకమును, నప్పటికి సమాప్తముకాని వీరాంగన యను పద్యకావ్యము రచించెను.

1862 వ సంవత్సరమున మధుసూదనుఁడు యూరపుఖండమునకుఁ బయనమయి తన చిరమనోరథమును నెఱవేర్చుకొనెను.

అప్పు డతఁ డింగ్లాండునకుఁ బోయి యా దేశమున నైదు సంవత్సరములుండి బారిష్టరు పరీక్షకుఁ జదివి 1867 వ సంవత్సరమున మరల మన దేశమునకువచ్చి కలకత్తా హైకోర్టులో బారిష్టరుగాఁ బనిచేయఁ జొచ్చెను. ప్రారంభము సరిగానే యుండెను. కాని వాని వృత్తిలో వానికి రావలసినంత పేరుమాత్ర మెందుచేతనో రాలేదు. బారిష్టరయిన పిదప నతఁ డాఱు సంవత్సరములు మాత్రిమే జీవించి యుండెను. ఆ కాలమయినను సుఖముగా గడువక కష్టములతోను దారిద్ర్యముతోను మనస్తాపములతోను వెళ్ళెను. ఆయన 1873 వ సంవత్సరమున అల్లిపురము నందలి యాసుపత్రిలో కాలధర్మమునొందెను. మరణమునకు సిద్ధముగానున్న కాలమునందును మధుసూదనదత్తు బంగాళీభాషలో మాయకనా రనుపద్యకావ్యమును వ్రాసి తన జీవిత మెట్లు దుఃఖకరముగా ముగిసెనో దానిలో కథయు నంతదుఃఖ కరముగా ముగించెను.

వెనుక నతఁడు చెన్నపురిలో నున్నపుడు నీలిమందుపంట పండించునొక యింగ్లీషువారి కొమార్తెను పెండ్లి యాడెను. కాని యీవివాహము వానికి సుఖప్రదము గాకపోవుటచే నతఁడు భార్య వలన విడుదల పత్రిక పుచ్చుకొని మఱియొక దొరసానిని పెండ్లి యాడెను. ఈ రెండవ భార్య వానికి మిక్కిలి యనుకూలమై ప్రవర్తించుటయేగాక వాని సుఖదుఃఖములను సమానముగ ననుభవించి యతనికన్న మూఁడుదినములు ముందుగా మృతినొందెను. ఈరెండవ భార్యవలన వాని కిరువురు కొమారులు గలిగిరి.

మధుసూదనదత్తు బంగాళాదేశములో పందొమ్మిదవ శతాబ్దమందలి మహావిద్యావంతులలో నొకఁడు. ఆతఁడు మహాకవియేగాక

గొప్పసాహిత్య చక్రవర్తి. హిందూ కళాశాలలోఁ జదువుకాల మున నతఁ డింగ్లీషును పారసీభాషను జదువుకొనెను. బిషపు కాలేజీలో గ్రీకు లాటిను సంస్కృతమును నేర్చెను. చెన్నపురమందున్న పుడు తెనుఁగును ద్రావిడమును నభ్యసించెను. యూరపు ఖండమునకు వెళ్ళి నప్పుడు ఫ్రెంచి జర్మనీ ఇటాలియను, హీబ్రూ భాషలయందు బ్రవేశము సంపాదించెను. బంగాళీభాష వచ్చునని మనము వేఱుగఁ జెప్పనక్కఱలేదుగదా!

మధుసూదన దత్తున కుపకారము చేసిన మిత్రులలో నిద్ద ఱుముఖ్యులు గలరు. ఒకఁడు మనోమోహను ఘోషు. రెండవ యతఁ డీశ్వర చంద్ర విద్యాసాగరుఁడు. ఒకమారు మధుసూదన దత్తు ఋణబాధచేతఁ జెరసాలకుఁ బోవలసినవాఁడై యుండగా నా సొమ్ము ఋణప్రదాతలకిచ్చి విద్యాసాగరుఁడు వానికి కారాగృహ బాధ తప్పించెను. మధుసూదనుఁడు తన మరణకాలమున దిక్కు మాలిన తన యిరువుర కుమారులను మనోమోహనఘోషునకు నప్ప గించెను. ఆయన చందాలు వేయించి సొమ్ముపోగుచేసి తలిదండ్రులు లేని యాబిడ్డలను పెంచి పెద్దవారిగఁ జేసెను.

పైకేలు మధుసూదనదత్తుయొక్క జీవితచరిత్రము నెఱిఁగిన వారందఱు నేర్చుకొనవలసిన మంచినీతు లొకటిరెండు గలవు. అతి బాల్యవివాహంబులే మన దేశంబునకు సమస్తవిధములగు నష్టము లను దెచ్చుచున్నవనియు నట్టివివాహములు చేయుట మానినప్పుడు గాని దేశమభివృద్ధినొందదనియు బాలికలకు భర్తలను బాలురకు భా ర్యలను దెచ్చునపుడు వారి కిష్టము లేనివాండ్రం దేగూడదనియు నిం దువలన మనము గ్రహింపవలసియున్నది. మధుసూదనదత్తుయొక్క తండ్రి యీరహస్యము గ్రహింపలేకపోవుటచేతనేగదా కుశాగ్రబు ద్ధియై విద్యాసంపన్నుండై వివేకియై బంధుమిత్రులకు మహానందము

నోడఁగూర్పఁజాలువాని కుమారుఁడు మతాంతరుఁడై తలిదండ్రులకు శాశ్వతమయిన దుఃఖమును గలిగించెను. అది యటుండ మనమునే ర్చుకొనవలసిన యంశ మింకొకటి యున్నది. కవిత్వము చెప్పుటలోఁ గాని మఱియేయితర విషయములోఁగాని పదుగురు నడచుదారింబోక తనకు మంచిదని తోఁచిన క్రొత్తపుంతనుదొక్కినవారిని జనులుమొ ట్టమొదట నిందింతురనియు దానిమంచి కాలక్రమంబున వెల్లడియైన కొలఁది ప్రజలు వానిని గౌరవింతురనియుఁ గూడ మనమిందువలన నెఱుంగవలసియున్నది.



# బంకించంద్రచటర్జీ

ఇతఁడు 1838 వ సంవత్సరమునజన్మించెను. వానితండ్రియగు యాదవచంద్ర చటర్జీ యింగ్లీషు ప్రభుత్వమువారిక్రింద నొకడిప్యూటీ కలక్టరుగా నుండెను. బంకించంద్రుఁడు మొదట నింగ్లీషుహుగ్లీ కాలేజీలోఁ జదువుకొని పిమ్మట విద్యాసమాప్తికై ప్రెసిడెన్సీ కాలేజికిఁ బోయిచదివెను. బంగాళా దేశమునందు మొట్టమొదట బి. యే. పరీక్షయందుఁ గృతార్థుఁడైన విద్యాకుశలుఁడితఁడే. అతఁడు తొలుదొల్త పత్రికాధిపతిగనుండి జీవితకాలము గడుపఁ దలఁచెను. ఈతలంపుండుటచేతనే యతఁడు బి. యే. పరీక్షయందుఁ గృతార్థుఁడు గాక మునుపే "ప్రభాకర" యను స్వభాషాపత్రికను నడపుచున్న యీశ్వరచంద్రగుప్తుఁడనువానియొద్దకుఁబోయి పత్రికనడుపుపని కొంతకాలమునేర్చుకొనియెను. కాని యతఁడు తాననుకొన్నట్లు పత్రికాధిపతి గాఁడయ్యె. ఏలయన పట్టపరీక్షయందుఁ దేరినతోడనే గవర్నమెంటువారు వానికి డిప్యూటికలక్టరుపని నిచ్చెదమన జీతమున కాసపడి యతఁడాయ్యుద్యోగమునఁ జేరెను.

పత్రికాధిపతి గాఁదలఁచుకొన్నందువలన వానికొకలాభము గలిగెను. ప్రభాకరపత్రికాకార్యాస్థానమున నున్న కాలముననతఁడనేక స్వభాషాగ్రంథములు చదువవలసివచ్చినందునఁ గొంత పాండిత్యమతనికందులోఁ గుదిరెను. దానింబట్టి యతఁడు వచనగ్రంథములను జేయసమర్థుఁడై గొప్పయుద్యోగములో నున్ననుదీరికచేసికొని గ్రంథరచనావ్యాసంగమును మానక చేయుచుండెను. మహాకవియగుమధుసూదనదత్తు బంగాలీభాషలో మృదుమధురకవిత్వము, చెప్పియానాఁటిగొప్పకవులకు సయితము నాశ్చర్యమునుగలిగించుచుండెను. బంకించంద్రుఁడు

మధుసూదనదత్తు ననుసరించి నిర్యతిప్రాసమగు కవిత్వముచెప్పఁబూను కొనెను. ఎంతకృషిచేసినను బంకించంద్రునకుఁ గవిత్వములో మధుసూద నున కలవడిన లలితశయ్య యలవడకపోవుటచే నది తనకుఁదగదనిమా నుకొని వచనకావ్యములలోఁ గృషిచేయ మొదలుపెట్టెను.

చటర్జీ యింగ్లీషుభాషలోనిచిత్రవచన కావ్యములను( ovels) విసువును తనివియులేక యహోరాత్రిములు చదువుచుండెను. అందు లో ‘సర్ వాల్టరుస్కాటు’ అను మహాకవి రచియించిన వీరరసప్రధాన ము లగు చిత్రవచనకావ్యములయం దతనికి మిక్కిలితమకము. అవిచ దివినపిదప స్కాటువ్రాసిన గ్రంథములను మరల బంగాళీభాషలో వ్రా యుట యసాధ్యమయినను స్కాటుమార్గమునననుసరించిస్వభాషలో స్వకపోలకల్పితముగఁ గొన్నిచిత్రివచనకావ్యములువ్రాయవచ్చుననిన మ్మి యతఁ డాపనికిఁ బూనుకొనెను. 1864 వ సంవత్సరమునందతఁడు దుర్గేశనందిని యనుదేశచరిత్ర గర్భితమయిన మొట్టమొదటిచిత్రవ చన కావ్యమును రచించెను. అదియే యిప్పటికిని బంకాళీవచనకావ్య ములలో నగ్రగణ్యమని కొనియాడఁబడుచున్నది. ఇందలికల్పనమతిచి త్రము. స్థలపదార్థాదివర్ణనము శ్లాఘ్యము. కథ మిక్కిలి మనోహరము. బంగాళీభాషలో మరల నటువంటికల్పితవచనకావ్యమిప్పటికింబుట్టలే దు. మధుసూదనదత్తును బరిహసించినట్లెబంకించంద్రునిఁగూడజనులు క్రొత్తమార్గమునవచనకావ్యములునిర్మించినందుకుబరిహసించిరి. ప ట్టుమని పదిబంతులు సరిగవ్రాయుటకు సమర్థులుండరుగానిసరసముగ నొకరు వ్రాసినదానిని విమర్శకులమని పేరుపెట్టుకొనినిందించియపహా స్యము చేయుట కనేకులులుందురుగదా! బంకించంద్రునిగ్రంథమునశై లిమనోహరముగా లేదనియు సందర్భసిద్ధిపొందుపడలేదనియువర్ణనము లుండవలసినట్లుండలేదనియుఁ గొందఱుపండిత మనుష్యులువాని వ్రా తలను ఖండించిరి. కాని యతఁడు వారి విమర్శనములనుజూచివగవక

తనపూనినపని మానక బంగాళీభాషకుఁ జిత్రవచనకావ్యము లనియెడు క్రొత్త యలంకారములను దెచ్చిపెట్టెను.

తరువాత నతఁడు మరికొన్ని వచనకావ్యములనుగూడ రచించెను. అందు ముఖ్యమయినవి కపాలకుండలయనునదియు మృణాళినియనునదియు. కపాలకుండలయనుకథ కేవల కల్పితమయి శాక్తేయమతమునందుగల ఘోరకృత్యములను వెల్లడిచేయును. మృణాళినిబంగాళీల యాచార వ్యవహారములఁ దెలుపునట్టికథ. 1872 వ సంవత్సరమున బంకించంద్రుఁడు వంగదర్శినియను నొకమాసపత్రికను బ్రకటింపనారంభించెను. ఇది కేవలము విద్యావ్యాసంగములుగలదై జనరంజకమై స్వల్ప కాలముననే యనేకులచేతఁ జదువఁబడుచుఁ బ్రసిద్ధికెక్కెను. అదివఱకతఁడు వ్రాసిన వచనకావ్యములన్నియుఁ బూర్వవృత్తాంతములనే దెలుపుచు వచ్చినందున నన్నియు నొక్కవిధముగానే యుండఁగూడదని బంగాళీదేశమున నాకాలమునసంఘస్థితియెట్లున్నదో దానినివర్ణించు నొకటిరెండుగ్రంథములనువ్రాసెను. అవి వంగదర్శినిలోఁ బ్రకటింపఁబడి మిక్కిలి రసవంతములై యున్నయవి. సంఘస్థితినివర్ణించినవచనకావ్యములలో విషవృక్షమనునది మిక్కిలి చిత్రమయినది. అదియు వంగదర్శినియందు నెల నెలకుఁ బ్రకటింపఁ బడుచు వచ్చెను. దాని రమణీయకమునుబట్టి యది యింగ్లీషు భాషలోనికిఁ గూడ తర్జుమా చేయఁబడినది. ఆకారణమున బంకించంద్రుని పేరు ఫ్రెంచివారికి నింగ్లీషువారికిఁ దెలియవచ్చెను.

ఇతఁ డింక ననేక వచనకావ్యములు రచించె. అందుముఖ్యమయినవి దేవీఛందూరాణీ,ఆనందమఠము మొదలగునవి.ఇతఁడు మొదట నుండియుఁ బూర్వాచార పరాయణుఁడు. సంఘసంస్కారము బ్రహ్మసమాజమతము మొదలైన వతని కంతగాకిట్టవు. ఇతఁడు వయసుముదిరిన కాలఁది మతమునం దత్యంతాసక్తిఁగలవాఁడై కృష్ణునిమహిమలు

గొనియాడుచు నొక గ్రింథమువ్రాసెను. అందు శ్రీకృష్ణుఁడుసద్గుణ సంపన్నుఁడనియు నతనింగూర్చిభాగవతాదిగ్రంథములలో వ్రాయఁబడి నదంతయుఁ గేవలము కవికల్పితమగు నబద్ధమనియునతఁడువ్రాసెను. ఈయన వేదములం జక్కఁగఁ జదివినవాఁడు. ఈయనకుగవర్నమెంటు వారు రాయబహద్దురనియు సి. ఐ. ఇ అనియు బిరుదుల నిచ్చిరి. ఈయన 1894 వ సంవత్సరమున మృతినొందెను.



# ప్రసన్న కుమార టాగూరు.

ఈయన 1803 వ సంవత్సరమున జన్మించెను. ఈతనివలన టాగూరు కుటుంబమునకు మిగుల వన్నెయు వాసియుఁ గలిగినవి. ఇంటియొద్ద నతఁడు హిందువుల కట్టుబాటులలోనే పెరుగుచునాకాలమునకుఁదగినరీతిగాఁగొంచెమింగ్లీషుగూడ జదివెను. మొట్టమొదట నతఁడు ఛాందసుఁడై యున్నను తరువాతకొంతకాలమునకు రాజారామమోహనరాయలవారిమైత్రి గలుగుటఁజేసి యతఁడు హిందువుల యాచారములలో నేవిమంచివి యేవిచెడ్డవని శోధింపనారంభించెను. ఇట్లుశోధించిశోధించి యతఁడు దేశస్థులకొకవిజ్ఞాపనమువ్రాసి ప్రకటించెను అందులో విగ్రహారాధనముచేయుట యనుచితమనియుసర్వలోకసృష్టికర్తయు సర్వనియామకుఁడునగుపరమేశ్వరుని మానసికపూజచేయవలయుననియు నతఁడు నొక్కివ్రాసెను. అతఁడు బుద్ధిస్వాతంత్ర్యమును గనఁబఱుచుట యొక్కమతవిషయముననేగాదు. ఇంక ననేక విషయములంజూపెను. తాను స్వయముగజమీందారుఁడయ్యుజమీందారు లుద్యోగములు చేయఁగూడదను గర్వము లేక సామాన్యులవలెనే తానును శాస్త్రములఁ జదివి పరీక్షలయందుఁ దేరి న్యాయవాదియయ్యెను.

ఈపనిలోఁ బ్రవేశించునపుడు ప్రసన్నకుమారుని మిత్రుఁడొకఁడు వచ్చి యట్టిగొప్పకుటుంబమునబుట్టినసంపన్నునకున్యాయవాదిగ నుండుట యవమానకరమనియు నిరర్థకమనియుఁ జెప్పి,మందలించెను. ప్రసన్నకుమారుఁడప్పు డతనితో నిట్లనియె. "మనస్సు గృహమందు జరుగవలసిన యన్నిపనులను జక్కపెట్టుకొను భార్యవంటిది.నాకునీలిమందుతోఁటలు, ఆముదపుయంత్రములు చాలగలవు. అందులోనాక న్యాయముగ నష్టములు కలుగుచున్నవి. నాకు నష్టములు తెచ్చినవారి

మీాద వ్యాజ్యములు తెచ్చితిని. కాని న్యాయవాదుల తెలివితక్కు వ వాదములచేత నావ్యాజ్యములుపోయినవి. అందుచేత నే నేశాస్త్ర ములు చదువుకొని న్యాయవాదినై నావ్యాజ్యముల నేనే వాదించెద ను." అనిచెప్పి న్యాయవాదియై యాపనిలో మిక్కిలిబుద్ధికుశలతఁజూ పి చాలప్రసిద్ధికెక్కెను. ఇట్లు కొంతకాలము జరిగినపిదప కలకత్తాకో ర్టులో నదివఱకు గవర్నమెంటు ప్లీడరుగానున్న యొకదొర పనిమా నుకొని స్వదేశమునకుఁబోగా దొరతనమువా రాయుద్యోగమును ప్రిసన్నకుమారునకిచ్చిరి. ప్లీడరుపనివల్ల నతఁడు సం॥రమునకు లక్షయే బదివేల రూపాయల నార్జించెను. ఆధనముతోడను సంస్థానమువల్ల వచ్చినధనముతోడను ప్రిసన్నకుమారుఁ డనేకభూములను కొని జమీా చాల వృద్ధిపఱచెను. శ్రీమంతులగు గొప్ప వంశస్థులలో నుద్యోగము మునకు వచ్చినవారిలో నితఁడే మొట్టమొదటివాఁడు. హిందూకళా శాలలో నతఁడొక సభికుఁడై దానియభివృద్ధిని గూర్చి చాల పాటు పడియె.

తనకుమార్తెయు మనుమరాలును విద్యావతులు గావలయునని సంకల్పించి యింటియొద్దవారికి విద్యనేర్పించెను. కొంతకాలము గడచి నపిదప ప్రిసన్నకుమారుఁడు అనువాదకమను పేర బంగాళీభాషలో నొకపత్రికను, సంఘసంస్కారియను పేర నొక యింగ్లీషుపత్రికను బ్రకటింపనారంభించి సంఘసంస్కరణము రాజకీయ వ్యవహారము మతము విద్యమొదలగు విషయములంగూర్చి జనుల బుద్ధులు వికసిం చునట్లు మంచివ్రాతలను వ్రాయుచువచ్చె. రాజారామమోహనరా యలు సహగమనమును మానుపింపవలయునని చేసినప్రయత్నమునకు విరుద్ధముగాస్వదేశస్థులుకొందఱు సహగమన ముండితీరవలయుననియు దానిని మానుపింపఁగూడదనియు నింగ్లాండు రాజుగారికిని పార్లమెం టుసభవారికిని మహజరు వ్రాసిపంపిరి. కాని యామహజర్లను లెక్క

సేయక యింగ్లండు రాజుగారు సహగమనము చేయఁగూడదనియే శా సించిరి. అట్లు శాసించినందుకు శ్రీరాజుగారికిని బార్లమెంటుసభవా రికిని జనులుకృతజ్ఞతఁ దెలుపుటకై ప్రసన్నకుమారుఁ డొక పెద్దసభ చేయించెను. ప్రసన్నకుమారుఁడు మహాదాత. పూర్వము గొప్పదశ లోనుండి కాలవశమున పేదలై యభిమానమున కింటనుండి యిడు మలఁబడువారి కనేకులకు నెలనెలకు జీతములిచ్చి సహాయములుచేయు చువచ్చెను. తన సేవకులలో నెవరికి రోగమువచ్చినను వారికౌషధ ములను గొనితెచ్చి వైద్యులచేత మందులిప్పించి వారిని బిడ్డలవలెఁ గనిపెట్టుచుండును.

ఆయన పుస్తకభాండారము మిక్కిలి పెద్దది.అందు బహుగ్రం థములుండుటచే హైకోర్టుజడ్జీలు తక్కిన పెద్దమనుష్యులు విద్యార్థులు కావలసినప్పుడు స్వేచ్ఛగవచ్చి జదువుకొనుచువచ్చిరి. ఎల్లకాలముఁ గలకత్తాలోనే వసియింపక ప్రసన్నకుమారుఁడు తఱచుగ తనసంస్థా నమునకుఁబోయి చూచుకొనుచు వ్యవహారమంతయు దివానులమీఁ దనే వదిలివేయక రహితులతోఁ గలిసిమాటలాడి వారిసుఖదుఃఖము ల నెఱుఁగుచు వారిసౌఖ్యమునిమిత్తము వైద్యశాలలు గట్టించి రహి తులకు భారమైనప్పుడు వారియొద్దనుంచి పన్నుపుచ్చుకొనక వారిని వేవి ధములఁ గనిపెట్టెను. దొరతనమువారు హిందూదేశ శిక్షాస్మృతి (ఇండియన్‌పీనల్‌కోడ్డు) వ్రాయించినప్పుడు ప్రసన్నకుమారుఁడు వారికి మిగులఁదోడ్పడియెను. గవర్నరుజనరలుగారి యాలోచనసభలో మొ ట్టమొదటసభ్యుఁడైన హిందువుఁ డితఁడే. కలకత్తా యూనివరుసిటీకి నతఁడు మూఁడులక్షలరూపాయలు దానముచేసి దానివడ్డి నింగ్లీషుధ ర్మశాస్త్రము (లా)ను నేర్పించుటకు వినియోగింపుమని యానతిచ్చె ను. అతని కుమారుఁడు జ్ఞానమోహనటాగూరు క్రైస్తవుఁడై యిం గ్లాండునకుఁబోయి బారిష్టరై వచ్చెను. హిందువులలో నతఁడే మొ

దటి బారిష్టరు. అతనికి గవర్నమెంటువారు సి. ఐ. ఇ. అను బిరుద మునుగూడ నిచ్చిరి. అతఁడు 1862 వ సంవత్సరమున మృతినొందెను. ఆతని యోగ్యతనుబట్టి కలకత్తానగరవాసు లాయన జ్ఞాపకార్థము స్ఫటికశిలతో వాని ప్రతిరూపమును జేయించి నిలిపిరి. అది యిప్పటికి నున్నది.

---

# మానమోహనఘోషు

ఈతఁడు హిందూదేశమందు సుప్రసిద్ధిఁగాంచి 1903 వ సంవత్స రమున చెన్నపట్టణమందుజరిగిన దేశీయమహాసభ కధ్యక్షుఁడగు లాల్మోనహఘోషుగారి సోదరుఁడు. ఆయనది డక్కాజిల్లాలోని విక్ర మపురము కాపురము. కులమున నితఁడు కాయస్థుఁడు. అతని తండ్రి యగు రామలోచనఘోషు సబుజడ్జి యుద్యోగముచేసి రాజారామ మోహనరాయలువారు తలపెట్టిన సంఘసంస్కరణ మహాకార్యమునం దభిమానముకలిగి వానికి కుడిభుజమై పనిచేసెను. మానమోహనుఁ డు 1844 వ సంవత్సరము 13 వ మార్చినాఁడు జన్మించెను. బాల్య మందితఁడు కిష్ణఘరుపాఠశాలలోఁ జదువుకొనెను. 1859 వ సంవత్సర మున మార్చినెలలో మానమోహనుఁడు ప్రవేశపరీక్షయందుఁ గృతా ర్థుఁడై 1861 వ సంవత్సరమున కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజీలోచేరె ను. అచ్చట నతఁడొక్కవత్సరము మాత్రమే చదివి మరుచటి సంవ త్సరము సివిల్సర్వీసుపరీక్షకు చదువుకొనుట కింగ్లాండునకుఁబోయెను. 1860 వ సంవత్సరమునందు(అనఁగా మోహనుఁడు క్రిష్ణఘరునందున్న కాలముననే) బంగాళాదేశమున నీలిమందు కలవుపట్టెను. ఆకలవువలన ననేకులుచెడిపోయిరి. ఆక్షామమువలనఁ గలిగిన దారుణకష్టములంగూ ర్చి మానమోహనుఁడు 'హిందూ పేట్రియాటు' అనుపత్రికకుఁ దఱు చుగా లేఖలనువ్రాసి పంపుచుండువాఁడు. ఆపత్రికాధిపతియైన హరి శ్చంద్రముఖర్జీ మృతినొందుటయు నదికారణముగాఁ దత్పత్రికక్రొ త్తచేతులలోనికిఁ బోవుటయుఁ జూచి మంచిపత్రిక మఱియొకటిస్థాపిం పవలెనని నిశ్చయించి మానమోహనుఁడు మఱికొందఱి సాయమున 'హిందూదేశదర్పణము' అనియర్థమిచ్చు 'ఇండియన్ మిర్రరు' పత్రి కను ప్రకటింపఁజొచ్చెను. అది ప్రారంభమునఁ బక్షపత్రికగ ప్రకటిం

ప్రబడుచు వచ్చెను. ఆపత్రికయే యిప్పుడు దినపత్రికయైకలకత్తాలో మిక్కిలి పేరుపడి యున్నయది.

మానమోహనుఁడు సహజముగ మిక్కిలి తెలివి తేటలు గలవాఁడయ్యు 1864 వ సంవత్సరమునందును 1865 వ సంవత్సరమునందును గూడ సివిలుసర్వీసు పరీక్షలోఁ గృతార్థుఁడు కాలేకపోయెను. అతఁడు పరీక్షయందుఁ దప్పిపోవుటకు వాని తెలివితక్కువ కారణముకాదు. అదివఱకున్న నిబంధనలుకొన్ని మారుటచేతను సంస్కృతము మొదలగు కొన్ని ప్రాగ్దేశపు భాషలకు మునుపటి విలువ తగ్గిపోవుటచేతను మానమోహనుని కృషి వ్యర్థమయ్యెను. ఇంగ్లాండు దేశములో హిందూదేశస్థులకు జరుగు సివిల్ సర్వీసుపరీక్షనుగూర్చి యతఁడొకచిన్న పుస్తకమునువ్రాసి యందులో నింగ్లీషువారికిఁగల లాభములను మనకుఁగల ప్రతిరోధములను జక్కఁగ విమర్శించి వివరించెను. అతఁడు సివిలుసర్వీసు పరీక్షకుఁ జదువుచున్న కాలముననే 'బారిష్టరు'పరీక్షకు గూడ జదువనారంభించి మొదటిదానిలోఁ నెఱవేఱు యోగము లేకపోయినను రెండవదానిలోఁ గృతార్థుఁడై 1866 వ సంవత్సరమున బారిష్టరై వచ్చెను. చదువంతయు ముగియకమును పే తండ్రి పరలోకగతుఁడగుటచే మానమోహనుఁడు పరీక్షకాగానే స్వదేశమునకు వచ్చి 1867 వ సంవత్సరము జనేవరు 10 వ తారీఖున కలకత్తా హైకోర్టులో న్యాయవాదిగాఁ జేరెను.

కలకత్తా హైకోర్టులో నితఁడే మొట్టమొదటి బారిష్టరు. ఆ కోర్టులోపనిచేయుచున్న నితనితోడిబారిష్టరులగు తెల్లవారు నల్లవాఁడని మానమోహనుని దమతోసమానముగ గౌరవింపక యలుసుఁగ జూచుచు మీఁదుమిక్కిలి యతఁడు నిర్ణీతకాలము బారిష్టరుతరగతిలో జదువలేదనునెపమునఁ బనికనర్హుఁడని దీసివేయించుటకుఁబ్రయత్నించిరి. ఓర్వలేమిచే వారలుచేసిన యాక్షేపణములన్నియుఁ మహాధైర్యసం

పన్నఁడు దృఢచిత్తుఁడునగు మానమోహానుని యెడ వ్యర్థములయ్యెను కాలక్రమమున మానమోహానుని దెలివితేటలు బయలుపడుటచే దొరతనము వారతనికి కలకత్తాప్రిసిడెన్సీ మేజస్ట్రీటుపని నియ్యఁదలఁచిరి. కాని యతఁ డంగీకరింపఁడయ్యె.

ఇగ్లాండునుండి వచ్చినది మొదలు మానమోహానుఁడు సివిలుసర్వీసు పరీక్షలో హిందువులకు జరుగు నక్రమములనుగూర్చి వరుసగ కొన్ని యుపన్యాసముల నిచ్చెను. 1869 వ సంవత్సరము ఏప్రిల్ 20 వ తారీఖున నింగ్లీషువిద్యాభ్యాసము బంగాళీలకుఁ జేయుచున్న చెఱుపును గూర్చి యతఁడొక యుపన్యాసము చేసెను. అది దేశమందు చాలసంక్షోభము గలిగించెను. హిందువులలో ననేకులకు మానమోహానునిపై మహాగ్రహము కలిగెను. బారిష్టరుపనిలో మానమోహానునకు హిందువులలోను నింగ్లీషువారిలోను నెవరికిఁ గలుగునంత పేరుంబ్రతిష్ఠయు లభించెను. అతఁడు పనిలో ప్రవేశించిన స్వల్పకాలముననే యొక గొప్పవానిమీఁద పెద్దయభియోగము వచ్చెను. ఆనేరస్థుఁడు తన పక్షము వాదించుటకుఁ జిరకాలానుభవముగల గొప్పన్యాయవాది నొకని నేర్పఱచుకొని వానికి సహాయుఁడుగనుండుటకు మానమోహానునిఁ గూడ నియమించుకొనెను. దైవవశమున నభియోగము విచారణకు వచ్చునప్పటికి మొదటియతఁడు చనిపోవుటం జేసి యాకార్యభారమంతయు మానమోహానునిమీఁదఁ బడెను. ఆవ్యవహారమున మానమోహానుఁడు గెలువఁజాలఁడయ్యెను. కాని వాదము సలుపుటలో నతఁడుచూపినసామర్థ్యమునకు బుద్ధికుశలతకు మెచ్చి ప్రధానన్యాయాధిపతివానిని శ్లాఘించెను. కాలక్రమముననతఁడు జనుల సన్మానమునకు నాదరమునకుఁ బాత్రుఁడై తఱుచుగ క్రిమినలువ్యవహారములలోఁ బనిచేయుచుఁ గొన్నియెడల ముద్దాయిలకడనుండిధనముగ్రహింపకయేధర్మార్థము పనిచేయుచు నిరపరాధులఁ బెక్కండ్రనురినుండి దప్పించి పుణ్య

ముగట్టుకొనెను. బంగాళమునందున్న పోలీసువారియొక్కయు మేజస్ట్రీటులయొక్కయు నక్రమములను బలుమారతఁడు వెల్లడిచేయుటఁ జేసి వారి కితనిపై రీశ్వరవైరైయుండెను. 1882 సంవత్సరమున నవద్వీపమునందు వసియించు మాలక చందచౌకిదారను నిరుపేదరహితుమీఁద తొమ్మిదియేండ్లవయసుగలతనబిడ్డను చంపినట్లునేరము మోపఁబడిశిక్ష వేయంబడెను. ఆవ్యవహారములో మానమోహనుఁడు ధర్మార్థము పనిచేసి చాలశ్రమపడి శిక్ష కొట్టివేయించి వానిం బ్రతికించెను. ఇది యొక్కటియేగాదు. వ్రాయఁదలంచుకొన్న నతఁడుచేసిన ధర్మకార్యము లనేకములు గలవు.

మానమోహనుఁడు చేసినమేలు మరువక యాకాఁపువాఁడాఋణము సంవత్సరమునకు రెండుసారులు మానమోహనుని దర్శనముచేసి యోపినకొలఁది వానికి బహుమానము లిచ్చుచువచ్చెను. సాక్షుల నడ్డుప్రశ్నలు వేయుటలో మానమోహనున కధికప్రజ్ఞకలదని చెప్పుదురు. ఒకమారొక డిప్యూటీకలెక్టరుగారొకవ్యవహారమున సాక్షిగ వచ్చి మానమోహనుని ప్రశ్నలధాటి కాఁగఁజాలక యొకమాట కొకమాట సంబంధములేనట్లవకతవకల నెన్నేని పలికి చిట్టచివఱకు సంభ్రాంతుఁడై మూర్ఛపోయెను.

ఈయనకుఁజిన్నతనమునుండియు స్త్రీవిద్యయం దత్యంతాభిమానము గలదు. ఆకారణమున 1873 వ సంవత్సరము మార్చినెలయందతఁడు బెతూ్యనుకాలేజీవ్యవహారములఁ జూచుటకుఁ దత్పరిపాలనాసభలో నొకసభ్యుఁడయ్యెను. పిమ్మటఁగొన్నినాళ్ళకతఁ డాసభకుఁ గార్యదర్శియై దత్కార్యముల నతిశ్రద్ధతో నిర్వహించెను. 1885 వ సంవత్సరమున నింగ్లాండు ప్రజలకు మనదేశస్థితులను జక్కఁగా విన్నవించుటకు మనవారొక్కొక్క రాజధానినుండియొక్కకని బంపఁదలంచి బంగాళమునుండి మానమోహనుని బంపిరి. హిందూదేశీయమహాసభ పుట్టిన

దిమొదలు మానమోహనునకు దానియం దభిమానమే యుండెను. అందుచే 1890 వ సంవత్సరమున కలకత్తానగరమునందు జరిగిన యా అవదేశీయమహాసభ నిర్వహించుట కేర్పడిన సమ్మానసంఘమున కితఁ దధ్యక్షుఁడయ్యెను. అంతేగాక 1896 వ సంవత్సరమున కృష్ణఘురునగరములో జరిగినబంగాళా రాజధానిసభకధ్యక్షుఁడుగనియమింపఁబడెను. హిందూదేశమునం దిప్పటికిని కలక్టర్లకు సిస్తు వసూలుచేయు నధికార మేగాక నేరముల విచారించి దోషుల శిక్షించు నధికారము గూడకల దు. ఆరెండధికారము లొకపురుషునియందే యుండుటచేఁ బ్రజలకు చిక్కులు మిక్కిలి సంభవించుచున్నవని నమ్మి మానమోహనుఁడాయధికారము వేఱువేఱుపురుషుల కియ్యవలసినదని పట్టుపట్టి వాదించెను.

దేశీయమహాసభలో చర్చింపఁబడు నంశములలో నిదిప్రధానమైనది. ఆవిషయమున మానమోహనఘోషుయొక్క వాక్యములు ప్రమాణములు. అతఁడు 1895 వ సంవత్సరమున నింగ్లాండునకుఁబోయి యీయంశ మాదేశస్థులకు నచ్చఁజెప్పెను. ఆసంవత్సరమునపునహానగరమున జరుగు దేశీయమహాసభకు వచ్చుటకు వీలుండదేమోయనుభయమునత్వరపడి స్వదేశమునకు వచ్చి యాసభలోకూడయీయంశమును విపులముగఁ జర్చించెను. అనంతర మతఁడు కలకత్తాకువచ్చి రివిన్యూ మేజస్ట్రీటు యధికారములు రెండును జేతిలోనున్న యుద్యోగస్థులుచేసినతీర్పులను వానిలో జరిగిన యన్యాయములను రెండుసంపుటములుగఁ బ్రకటించి యీమార్పుచేయుట యావశ్యకమని యందఱకుఁ దోఁచునట్లు చేసెను. మానమోహనునివ్రాఁతలకును బలుకులకును 'సర్ చార్లసు ఇల్లియటు' అను బంగాళాదేశపు గవర్నరొక వార్తాపత్రికలోఁబ్రత్యుత్తరమిచ్చెను. ఆదొరగారియుక్తులకుఁదగినప్రత్యుత్తరములుమానమోహనుఁడీయఁదలంచుచుండఁగనెవానినంతలో మృత్యుదేవ

తతనపొట్టం బెట్టుకొనిమె. 1896 సంవత్సరము అక్టోబరునెలలో మాన మోహనుఘోషు స్వస్థానమగుకిృష్ణఘరు నగరమున మృతినొందెను.

మానమోహనుఁడుకలసిమెలసియుండుస్వభావముగలవాఁడు.ఎదుటివారిమనస్సు నొచ్చునేమో యనుభయమున నతఁ డెల్లపుడు మృదుభాషియైదయాళుఁడైయుండెను.సర్వవిధములచేత నతఁడు సజ్జనుఁడనిచెప్పవచ్చును.హిందువులయెడ నతని కెంతయాదరముగలదో విదేశీయులగునాంగ్లేయుల యెడలను నంతేయాదరముగలదు. అతనియెడ వారిరువురకుఁగూడ నంతేయాదరముగలదు. అతఁడు మృతినొందినపుడు 'నేషనల్ ఇండియన్ అసోసియేషన్' అనుసంఘమువారు హిందువులకు నాంగ్లేయులకు నైకమత్యము నొడగూర్చుటలోను స్త్రీపురుషులవిద్యాభివృద్ధిచేయుటలోను మానమోహనఘోషు చాలశ్రమపడినాఁడని వానియెడల దేశస్థులు కృతజ్ఞులై యుండవలెననియొకతీర్మానమువ్రాసిరి అతఁడుచేసిన దానము లనేకములుగలవు. నిరుపేదలగు దోషులకును విద్యార్థిసంఘములకును సత్కార్యములకునుధనలోపముచేఁబడిపోవుటకుసిద్ధముగనుండు వార్తాపత్రికలకు మానమోహనుఁడు కల్పవృక్షమైయడుగుటయె తడవుగ ధనసాహాయ్యముచేయుచుండెను.మందభాగ్యుఁడగు బంగాళీకవి మధుసూదనదత్తునకుమానమోహనుఁడుచేసినసాయమింతింతయనరానిది.మధుసూదనదత్తుమరణకాలమునతల్లిలేనితనయిరువురు కుమారులను సంరక్షింపుమనిమానమోహనున కప్పగించెను. పరమదయాళువగు మానమోహనుఁడు తనమిత్రుండు చరమావస్థలో చేసిన ప్రార్థనమును మనసున నుంచుకొని యాబాలకుల సంరక్షణకై యొకచిన్నసంఘము నేర్పఱచి విద్యాబుద్ధులు చెప్పించెను. మానమోహనుని దయచేతనే యాబాలకులు విద్యావంతులై దొరతనమువారియొద్ద నుద్యోగము సంపాదించి సుఖించిరి.




(రెండవ భాగము-బొంబాయి.)

# స్వామి దయానందసరస్వతి.

ఈయన హిందూదేశమునందు, ఆర్యసమాజ మను క్రొత్త మతమును స్థాపించిన మహాత్ముఁడు. ఈతఁడు ఘూర్జరదేశములో నున్న "కతేవారు" సంస్థానమునందు మోర్వీ యనుగ్రామమున 1825 వ సంవత్సరమున జన్మించెను. తల్లిదండ్రులపే రెవ్వ రెఱుంగరు. ఆయనతండ్రి యాగ్రామమునకు జమాదారుగా నుండుటయేగాక స్వల్ప ధనవంతుఁడై వడ్డీవ్యాపారముచేయుచు సుఖముగఁ గాలక్షేపముచేయువాఁడు. మతమున నతఁడు పరమశైవుఁడు. అతనిభార్యయుఁ బాతివ్రిత్యంబునకు సౌజన్యతకుఁ జాలపేరువడినది. దయానందున కైదవయేట నక్షరాభ్యాసమయ్యెను. అదిమొదలెనిమిదవయేఁడు లోపుననే దేశభాషను సంస్కృతమును దనయీడుపిల్లలకంటె నెక్కువ తెలివితో నతఁడు నేర్చుకొనెను. ఎనిమిదవయేట నుపనయనము జరుగుటచే నప్పటినుండియుఁ దండ్రివానికి శైవమతరహస్యముల నుపదేశించి పార్థివలింగపూజనము ప్రతిదినము చేయించి రుద్రాధ్యాయములోఁ జెప్పఁబడిన విధుల నన్నిఁటినిఁ గ్రమముగఁ జేయుమని కుమారుని బలవంతపెట్టఁజొచ్చెను. దయానందుఁడు సహాయముగ బలహీనుఁడగుటచే నతఁడంత చిన్నతనమునఁ బెద్దలు చేయవలసిననీమము లన్ని

యుం జేసినచో శరీరస్థితి చెడునని యప్పుడప్పుడు తల్లి మొఱపెట్టుకొనుచు వచ్చినను వినక తండ్రి వానిచే నట్టినియమములం జేయించుచుండెను. ఎనిమిదవయేఁడు మొదలు పదునాలుగవయేఁడువఱకు దయానందుఁడు శ్రద్ధతో విద్యనేర్చి కొన్నికావ్యములను జాలవఱకు వ్యాకరణమును యజుర్వేదసంహితను ముగించెను. అప్పుడు తండ్రి వానిని బరమ శైవుఁడుగఁ జేయఁదలఁచి 1839 వ సం॥ రమున మహాశివరాత్రినాఁడు దానికి ముహూర్త మేర్పఱచెను. అప్పటికి దయానందునకు శరీరమునందు స్వస్థత లేనందున దినమంతయు నతఁ డుపవాసముండ లేఁడనియు రాత్రి జాగరము చేయ లేఁడనియు లింగధారణము మఱియొకప్పుడు చేయవచ్చుననియుఁ జెప్పి యప్పుడాపని మానుమని తల్లి యనేకవిధములఁ దండ్రినిఁ బ్రతిమాలుకొనియెను. కాని యతఁ డామాటఁ బెడచెవినిఁబెట్టి యది యప్పుడే జరిగితీరవలె నని పట్టు బట్టెను. అందుచే దయానందుఁడు శివరాత్రినాఁ డుదయమున స్నానముచేసి మడిగట్టుకొని తండ్రింగూడి శివాలయమునకుఁ బోయి దినమెల్ల నుపవసించియుండెను.

ఆలయమంతటను జనులు ఓంహర, ఓంహర, మహాదేవ, యని కేకలువేయుటచే గుడిప్రతిధ్వనులిచ్చెను. రాత్రిభక్తులందఱు జాగరము చేయఁదలంచి కష్టపడి రెండుజాములవఱకు మేలుకొని నిద్రనాపుకొనలేక యెక్కడివారక్కడనే కటికినేలం బండుకొని నిద్రించిరి. జాగరముచేయకపోయినచో ఫలము చెడునేమోయని భయపడి బాలుఁడు దయానందుఁడు మాత్రము కన్నుమూయక శివవిగ్రహమువంకఁ జూచుచుఁ గూర్చుండెను. అట్లుండ నావిగ్రహమువిూఁద నొక చిట్టెలుక ప్రాకి దేవునకు నైవేద్యము నిమిత్తము పెట్టినవస్తువులఁ గొన్నిఁటిని నెత్తుకొనిపోయెను. అది చూచినతోడనే దయానందునిమనస్సు పరిపరివిధములఁబోవఁ దనలోఁ దా నిట్లని వితర్కించుకొనియె.

"ఈ రాతిబొమ్మ నందిపై నెక్కి త్రిశూలము చేతఁబట్టుకొని సృష్టిస్థితిలయములు చేయఁగలమహాదేవుఁడేనా! అట్లయినం దనమీఁద నెలుక ప్రాకి తననిమిత్తముంచినపండ్లు నెత్తుకొనిపోవుచుండ దాని నదలింపఁ జాలఁడేమి? ఈనల్లరాయి దేవుఁడుగాఁడు." అని కొండొక సేపుఁ దలపోసి నిదురించుచున్న తండ్రిని లేపి సంశయమునివారింపుమని యడిగెను. తండ్రి శ్రమపడి చాలసేపు శివమహాత్త్వమును బోధించెను. కాని కుమారున కది తృప్తికలిగింపదయ్యె. అందుచే మఱలఁ దండ్రి నిద్రపోయినపిదప తెల్లవారుకడ దయానందుఁడు రాళ్లు దేవుళ్ళు గావని గట్టినమ్మికతో గుడి విడిచి యింటికిఁజని జరిగినచిత్రకథ తల్లికిఁ జెప్పి యుదయముననే కడుపునిండ భుజియించి వ్రతఫలముఁ జెడఁగొట్టెను. తండ్రి యింటికివచ్చి వాని మూర్ఖతకుఁ గనలియూరకుండెను. ఒకప్పుడు స్వల్పకార్యముల వలననే గొప్పసంగతులు జరుగుచుండును. గుడిలో దేవునిమీఁద నెలుక ప్రాకఁబట్టియేకదా దయానందుఁడు ఱాళ్ళు దేవుళ్ళుగావని నమ్మవలసివచ్చెను.

అదిమొదలు దయానందుఁడు జన్మాంతరము వఱకుఁ దాను విగ్రహారాధనముఁ జేయకపోవుటయేగాక రాతిబొమ్మలకు మ్రొక్కి పూజింపఁగూడ దని లోకమునకుఁ బోధించెను. ఇట్టి నమ్మికగలిగిన స్వల్పకాలములోనే వానిమనస్సు వైరాగ్యనిష్ఠితమగునట్లు గృహమున రెండుకష్టములు సంభవించెను. అందు మొట్టమొదట నింట నందఱకు ముద్దులమూటయై మిక్కిలిగారాబమునఁ బెఱుగుచుండిన యాతని చెల్లెలు సాయంకాలమువఱకు జబ్బులేక యాడుకొని రాత్రియాకస్మికముగ నేదో జబ్బువలనఁ గొంచెముసేపు బాధపడి మృతినొందెను. తలిదండ్రులు బంధువులు నెత్తినోరుగొట్టుకొని దారుణముగ దుఃఖించుచుండఁగ దయానందుఁడు నిశ్చేష్టుఁడై మొద్దువలెఁగూర్చుండి "ఈశ్వర సంకల్పము చిత్రమైనది. క్షణములో వచ్చునది మనకుఁ

దెలియదుకదా? మానవజీవితము నీటిబుగ్గవంటిది. అందఱకుఁ జా వె ప్పుడో యున్నదే. సంసారము కేవలము దుఃఖకరము. నేనుగూడ నె ప్పుడో నిట్లే మృతినొందవలసినవాఁడనే" యని తనలోఁ దాను విచా రించుకొనియెను. ఇదియైన కొలఁదికాలమునకే దయానందునియెడ మిక్కిలి ప్రేమగల పినతండ్రి కాలధర్మము నొందెను. ఈరెండు మరణములచేత దయానందుఁడు మిక్కిలి విరాగియై చెలికాండ్రతోను జుట్టములతోను సంసారము దుఃఖభాజనమని చెప్పుచు నెల్లప్పుడునేదో గొప్పయుపద్రవము సంభవించినట్లు వికాసములేక మొగముముడుచు కొనియేయుండఁజొచ్చెను. కుమారుఁడు విరాగియగునేమోయనుభయ మునఁదలిదండ్రులు వానికిసత్వరము పెండ్లిచేయఁదలంచిరి. వివాహమ తనికిష్టములేనందున నదియెట్లైన దప్పించుకొనఁగోరి చదువునిమిత్తము తన్నుకాశీపంపుమని తల్లిదండ్రులఁ బ్రార్థించెను. ఒక్కఁడేకొడుకగుట చేవానిని దూరదేశమునకంప నిష్టములేక తమయూరికినాలుగుక్రోసుల దూరమున నొకపల్లెలోనున్న తమపురోహితునియొద్దకుఁ బంపిరి. ఆపు రోహితుఁడువానివిలక్షణములఁజూచివాని స్థితియశుభసూచకముగనుం డెననితలంచి తనయొద్దనుంచుకొనక కొన్నినాళ్ళలోనేవాని నింటికిఁబంపి వేసెను. వైరాగ్యమంతకంతకు ముదిరిపోవుచున్నదని తలిదండ్రులు భయపడి విరాగికి భార్యయేకాలిబంధముగ నుండుననినమ్మి కొడుకున కుఁబెండ్లిచేయఁదలచి పనులు వడివడిఁజేసిరి. ఎంతప్రయత్నించిననుదన కావివాహోపద్రవము తప్పినదికాదని విచారించి దయానందుఁడుతాన క్కడనున్నచో నొకపిల్లనుదెచ్చి కట్టిపెట్టకమానరని యాబాధతప్పించు కొనుటకై యొకనాఁ డిల్లువిడిచి పాఱిపోయెను. తరువాత నతఁడుజన్మ మధ్యమం దెన్నఁడు స్వగృహంబునకు వచ్చియుండలేదు.

ఇట్లు బయలుదేరి దయానందుఁడు రాత్రిప్రొద్దుపోవునప్పటికొ కగ్రామముఁజేరి యచటనిదురించి మరలజాము రాత్రియుండఁగలేచి తె

ల్లవారునప్పటికి పదిక్రోసులదూరముపోయెను. రాత్రికొడుకింటికి రాకపోవుటచేఁ దలిదండ్రులు బెంగపెట్టుకొని సేవకులనునాలుగుదిక్కులకు బిడ్డనువెతకి తెమ్మనిపంపెను. వారుచుట్టుప్రక్కలయూళ్ళు తిరిగితిరిగి యెందునుం బాలునిఁగానక విసికివేసారి యింటికివచ్చిరి. తలిదండ్రులు బిడ్డనియెడ నాసవిడిచి దుంఖితులైయూరకొనిరి. దయానందుఁడువివాహబాధతప్పినందుకు సంతసించుచుఁ బయనమైపోయి త్రోవలోఁ దన శరీరముమీఁదనున్న మురుగులు మొదలగునగలనుదీసిబ్రాహ్మణులకు దానమిచ్చి యొకబ్రాహ్మణు నాశ్రయించి కావిగుడ్డలు సంపాదించిబ్రహ్మచర్యాశ్రమమునం బ్రవేశించెను. జ్ఞానవంతులగు సన్యాసులుసాధువులు బైరాగులు, ఎక్కడనున్నారని తెలిసిన నది యెంతదూరమైనసరే యచటకుఁబోయివారిని సేవించి యతఁడుజ్ఞానముసంపాదించుచుండును. సిద్ధిపురమను నొకపుణ్యక్షేత్రమున జరుగఁబోవు తిరునాళ్ళకుఁబోవఁదలఁచి కొందఱు సన్యాసులంగలసి యతఁడుండవానినివానితండ్రినెఱిఁగిన యొకమనుష్యుఁడు వాని నానవాలుపట్టి పోవుచోటు తెలిసికొని రహస్యముగఁ దండ్రికి జాబువ్రాసెను.

ఆవార్తవిని తండ్రి మహానందభరితుఁడై మెఱియలవంటిబంట్లను పదుగురఁదోడ్కొని సిద్ధపురమునకువచ్చి రెన్నాళ్ళు రేయింబవళ్ళు వెదకి యెట్టకేలకుపదిమందిసన్యాసులనడుమఁగూర్చుండఁగఁగుమారు నానవాలుపట్టియక్కడనేవాని కాషాయవస్త్రములంజింపివేసి యనుచితమగు నాపనిచేసినందుకు దూషించి జాగ్రత్తగాఁగాపాడుమనివానిని సేవకులకప్పగించెను. ముష్కరులగు నాబంటులు వానినిట్టట్టుఁ గదలనీయక గడుజాగరూకతతో నాదినమంతయుఁగాచిరి. నిద్రయెట్టిపనినైనను మరపించునుగదా. ఆబంట్లురాత్రియంతయుమేలుకొని తెల్లవారగట్లకనుమూసి నిద్రించిరి. తాను మరల దండ్రిచేతఁ బడినందుకువిచారించుచు దయానందుఁడు కన్నుమూయనందునబంట్లునిదురింపఁగానేయ దేస

మయమని లేచి మెల్లమెల్లగ నావలకుఁబోయి గబగబపరుగెత్తి కొంత దూరముపోయి తానెటువోయిన బంట్లుపట్టుకొనకమానరని యొకయాలయములో మఱ్ఱిచెట్టెక్కి చిట్టచివరకొమ్మమీఁద నేరికింగనఁబడకుండ నాకులమధ్య గూర్చుండెను. తండ్రి బాలునింగానకబంట్లం దిట్టికొట్టి మరలవానివెదకి తేరఁబంచెను. ఆబంటులు సిద్ధిపురమునఁ బ్రతిగృహము ప్రతిచోటు వెదకివెదకి వానినిగానకవిసికిరి. కొందఱుబంట్లుదయానందుఁడుగూర్చున్న చెట్టుక్రిందను గుడిలోను వెదకిరి గాని దయానందుఁడునిశ్శబ్దముగఁగూర్చుండుటచే వానింగనుఁగొనలేకపోయిరి. తండ్రివిఫలప్రయత్నుఁడై మరల యెప్పటియట్లు తనయూరికిఁబోయెను.

దయానందుఁ డాపగలంతయుఁ జెట్టుమీఁదఁగూర్చుండి రాత్రిదిగివచ్చిపయనమైపోయెను. దొరికినప్పుడన్నమును దినుచు దొరకనప్పుడుపవసించుచు నిదురవచ్చినచోటనేపండుకొనుచు నాబాలుఁడు దేశములవెంబడిబయలుదేరెను. ఆపయనములో నొకసారియెలుఁగుగొడ్డొకటి వానిపై బడవచ్చెను. దయానందుఁడుమనశ్చాంచల్యములేకధైర్యముదెచ్చుకొనియెలుఁగునకెదురుగనిలిచిదానిముక్కుమీఁదనొకగుద్దుగుద్దెను. ఆదెబ్బతోడ నదినెత్తురు గ్రక్కుకొనుచు నఱచుచుఁ బాఱిపోయెను. మఱియొకనాఁడతఁడొకయూరికిఁబోవ నచటిదేవాలయధర్మకర్తయగు మహంతు వానినాదరించి తనయొద్దనుండిగుడిపెత్తనముసేయుమనియుఁ గావలసినధనమిత్తుననియుఁబలికెను. "ధనముగావలసినచో మాయింటి యొద్ద తండ్రికడనేయుండును. నాకక్కఱలే" దని చెప్పియచ్చోటువాసిపోయెను. మఱియొకసారి యతఁడొకయడవిలోనుండిపోవుచుదారితప్పి ముండ్లకంచెలలోఁబడెను. వెనుకకువెళ్ళినచోఁబోదలఁచినగ్రామముసత్వరముగఁ జేరవీలులేదనియాముండ్లత్రోవనేపట్టికాళ్ళనిండ ముండ్లుగ్రుచ్చుకొన్ననుశరీరముగీచుకొనిపోయినను లెక్కసేయకగమ్యస్థానమును జేరెను. వేఱొకసారినర్మదాసాగరసంగముకడ నెవరో మహాత్ముఁడున్నా

డనివినియచటికిఁబయనమైపోయెను. దారిలోఁబ్రహ్మదండిముండ్లువిఱిగి కాళ్ళనెత్తురువరదలై మాంసముపైకిఁగనఁబడునట్లుతొక్కలూడినను సరకుసేయక దయానందుఁడాపయనముచేసిచేసి యొకనాఁడుసాయంకాలమునడువలేకయొకయూరుబైటచెట్టుక్రిందయొడలెఱుంగక నిద్రించెను.

ఆరాత్రి యాగ్రామస్థులు పెద్దయుత్సవమేదో చేసికొనుచు దివిటీలతో నూరుబైటకువచ్చిరి. ఊరుపెత్తనదారు, మఱికొందఱు చెట్టుక్రింద నిద్రించుచుండిన బాలునిచుట్టుమూగి లేపి యూరిలోనికిరమ్మనిరి. ఆతఁడునడిచి రాఁజాలనని చెప్ప వానియందు పరమభక్తుఁడై పెత్తనదారు వడివడి నింటికిఁబోయి పాలుపండ్లుపంపి యారాత్రివాని కపాయము రాకుండఁ దనమనుష్యులను వానికిఁగావలియుంచెను. మఱునాఁడక్కడనుండి బయలుదేఱి దయానందుఁడుమహాత్మునిఁజూచిసన్యాసాశ్రమమును స్వీకరించితనజ్ఞానమునింకను వృద్ధిచేసుకొనఁగోరి మథురాపురమున నొకగొప్పపండితుఁడున్నవాఁడనివిని యచటికరిగెను. ఆపండితునిపేరు విరజానందుఁడు. విద్యగఱపుటలోనతఁడుప్రాచీనపద్ధతిలోనివాఁడు. శిష్యులకు శాస్త్రములు నేర్పునపుడు ఋషికృతములగు ప్రాచీనశాస్త్రములనేగాని నవీనులుచేసినసిద్ధాంతకౌముది మొదలగుగ్రంథములను నేర్పుట కిష్టము లేనివాఁడు.

దయానందుఁ డాయనవద్దకుఁబోయితనరాకకుఁగారణమెఱిఁగింపసన్యాసికిఁదాను చదువు చెప్పనని విరజానందుఁడుపలికెను. ఎట్లయిన తన్ననుగ్రహింపుమని దయానందుఁడువానిపాదములమీదపడియెంతయుఁ బ్రార్థింప విరజానందుఁ డెట్టకేలకుఁగృపాళువై శిష్యుఁడుగ వానినిఁ బరిగ్రహించి యదివఱకతఁడుచదువుకొన్నగ్రంథములన్నియుయమునలోఁబాఱవేయించి వెనుకటిచదువు మఱచిపోయినట్లెయెంచుకొమ్మని మఱల నక్షరాభ్యాసముచేసి వానికిఁజదువుచెప్ప నారంభించెను. దయానందుఁ డదివఱకే జాలచదువుకొన్నవాఁడు. విశేషించికుశాగ్ర

బుద్ధియు నగుటచే విద్యానిధియగు విరజానందుఁడు చెప్పినదంతయు నతఁడు సూక్ష్మముగ గ్రహించెను.

మధురాపురములో మాధుకరముచేసికొని చదువుకొనుచుదయానందుఁడు గురువునకు సంతుష్టిగలిగించినందున విరజానందుఁడు శిష్యునిపై జాలిఁగొని దానేవానిభోజనమునకుఁగావలసిన సొమ్మిచ్చుచుండెను. అట్లుండి యతఁడునాలుగువేదములుషడంగములుషట్ఛాస్త్రములు స్మృతులుచదువుకొనెను. విద్యాపరిపూర్తియైనతోడనే దయానందుఁడు గురువునకు నమస్కరించి "స్వామీ! నేనునిలుపేదను. గురుదక్షిణనియ్యఁజాల. నేనేమిచేయవలయునో సెలవీయవలయు"నని వినయమునమనవియొనర్ప గురువు పరమానందభరితుఁడై తనకుధనమియ్యనక్కఱలేదనియుఁ జిరకాలమునుండి సత్యమయిన మతమునులోకమునకుబోధింపవలయునని తాను దలంచితిననియుఁ దనకుఁగన్నులులేకపోవుటచేఁదానట్టిపని జేయవీలులేకపోయెననియుఁ దనకుమనోభీష్టమగునాకార్యమును జేయుటయే తనకు గురుదక్షిణ యిచ్చుటయనియుఁ జెప్పియాపనిఁ జేయుమని సెలవిచ్చి వానినంపెను.

గురునియాజ్ఞ శిరసావహించిదయానందుఁడుమధురాపురమువిడిచి కొన్నికొన్ని గ్రామములలో వేదమతముబోధించెను. అంతలో హరిద్వారతీర్థము సమీపించెను. హరిద్వారముహిందువులపుణ్యతీర్థములలోనగ్రగణ్యమయినది. గంగానదియాపట్టణముయొద్దనేహిమవత్పర్వతముమీఁదనుండి భూమిమీఁదికిదిగును. సంవత్సరమునందుబహుతిమాసమున దేశమంతటనుండి తీర్థవాసులీపట్టణముఁజేరుచునేయుందురు. ప్రత్యేకముగనచ్చటతీర్థమువచ్చినప్పుడుచేరుజనులసంఖ్యమితిమీఱియుండును. అట్లువేనవేలు జనులుచేరినసమయమునఁ దనమతముబోధింపవలయునని దయానందుఁడుసంకల్పించితీర్థము జరుగుట కొకనెలముందు హరిద్వారముఁ జేరెను. చేరి రాత్రియనక పగలనకయానెలదినములును

దరువాత తీర్థదినములలోనుదయానందుఁడెత్తగు నొకకొండపైనిలిచి వాక్ప్రవాహమునుదొర్లునట్లుపన్యసించి విగ్రహారాధనముఁజేయఁగూడదనియునదీజలములలోమునిఁగినంతమాత్రమున మోక్షము లేదనియు బోధించెను. ఆజానుబాహుఁడగునతనిమూర్తియు గంభీరమగువానికంఠధ్వనియుఁ జూచివినినవారికివానియందుపరమభక్తి కుదిరెను. విగ్రహారాధనముఖండించుటచేనతనిసాహసమున కందఱచ్చెరువుపడిరి. అతని మాటలనొకసారివినినవారు తఱచుగ వానిపక్షమేదిరుగుచువచ్చిరి. అతనిబోధలవలనవిగ్రహారాధనముమంచిదని బోధించుబ్రాహ్మణులకుఁ గొంతనష్టము గలిగినందున వారతనినిందించిరి. ఆనిందనములకులెక్క సేయక జనులతో వాదనలుసేయునపుడు తన కెక్కువచిత్తశాంతియు నెక్కువనోపికయు నుండవలయునని యాగుణముల నలవఱచుకొనుటకు రెండేండ్లడవికేగితపస్సుచేసెను. ఆతపస్సుముగిసినపిదప దయానందుఁడు మరల తనపని నారంభించి గంగాతీరమున నున్న కాన్పూరునగరమునకు వచ్చెను. ఆనగరమున హలధరోజుఁ డనుమహాపండితుఁడుఁ డొకఁడుండెను.

విగ్రహారాధనము దుష్కార్య మని దయానందుఁడు బోధింపఁగానే యాయూరిపండితు లదిసహింపలేక హలధరునితో వాదింపు మని వాని నడిగిరి. అతఁ డందుకు సమ్మతించి సభ గావింపు మనియెను. అప్పుడు జరిగిన సభకు వేనవేలు జనులు వచ్చిరి. కానుపూరు నగరమం దశిష్టాంటుకలెక్టరును సంస్కృతభాషాపరిచితుఁడు నగు "తేరా" యను దొరగా రుభయుల వాదములు విని తీర్పుచెప్పుటకు మధ్యవర్తిగ నేర్పడియెను. అప్పు డతివిచిత్రముగ హలధర దయానందులకు వాదోపవాదములు జరిగెను. విగ్రహారాధనము మంచిదని హలధరుఁ డెన్ని ప్రమాణములు చూపినను దయానందుఁడు వాని నన్నింటి నవలీలగ ఖండించెను. దయానందుని ప్రమాణములు

ప్రబలముగ నుండుటయు, హాలధరుని ప్రమాణములు దుర్బలముగ నుండుటయు గ్రహించి "తేరా" దొరగారు తానక్కడ నటమీఁద నుండనక్కఱలేదని దయానందునియొద్ద సెలవుపుచ్చుకొని వెళ్ళెను. అతఁడు పోయినతోడనే హాలధరుని పక్షమున వచ్చిన పండితులు తాము గెలిచితిమని కేకలువేయుచు లేచి హాలధరు నొక బండిమీఁదఁ గూర్చుండఁబెట్టి యూరేగించుచుఁ దీసుకొనిపోయిరి. ఆ సాహసమున కచ్చెరువడి యెవరుగెలిచిరో సత్యమును దెలుపుమని దయానందునిపక్షమువారు దొరగారికి వ్రాసిరి. ఆదొరగారును జరిగినపనికి విస్మితుఁడై దయానందుఁడే గెలిచెననియు హాలధరుఁ డోడిపోయెననియుఁ దానాసంగతి వ్రాతమూలముగా దయానందునకుఁ దెలియఁజేయఁ దలంచుచుండెననియు వ్రాసి ప్రత్యుత్తర మంపెను. అనంతరము (అనగా 1869 వ సంవత్సరమున) దయానందుఁడు హిందువులకు భూలోక కైలాసము, విద్యలకు నిధానము, పుణ్యభూములలో నగ్రగణ్యము నగు కాశీనగరమునకుఁబోయెను.

వందలకొలఁది దేవాలయములు వందలకొలఁది విగ్రహములు నున్న యన్నగరమున నీస్వామి విగ్రహారాధనము వేదవిరుద్ధమని బోధింపనారంభించినతోడనే బ్రాహ్మణులు రోషావేశపరవశులై రాజుతోఁ జెప్పిరి. అప్పుడు కాశీరాజగుశివప్రసాదుగారు వారణాసి పండితులతో వాదించి వాదము నిలబెట్టుకొమ్మని దయానందునకు వర్తమాన మంపిరి. వాదనల కెప్పుడును దయానందుఁడు వెనుకదీయువాఁడుఁ గాఁడు గావున తానందుకు సిద్ధముగా నుంటినని ప్రత్యుత్తరమంపెను. ఆసంవత్సరము 16వ నవంబరున నొకమహాసభ జరిగెను. దాని కిరువదివేలమందికంటె నెక్కువజనులు వచ్చిరి. జగత్ప్రసిద్ధులగు విశుద్ధానందుఁడు, బాలశాస్త్రి మొదలగు దిగ్గజములవంటి పండితు లనేకు లాసభకు వచ్చిరి. దయానందసరస్వతి యాయందఱపం

డితులకు నోళ్ళాడకుండునటులు నాలుగు వేదములలోనుండియుఁ దన వాదమున కుపపన్నముగ ననేకప్రమాణములఁజూపి సభవారినిదిగ్భ్రాంతులఁ జేసెను. శివప్రసాదు తెల్లఁబోయెను. పండితులు మొగమొగంబులఁ జూచుకొనిరి. ఆవాదమున దయానందస్వామి సంపూర్ణముగాఁ గాశీవిద్వాంసుల నోడించెను. ఆవిజయమునుగూర్చి హిందూ పేట్రియాటు పత్రిక వ్రాయుచు దయానందుని ప్రజ్ఞాదికములను జాల వర్ణించెను.

అనంతరము 1870 వ సంవత్సరము జనవరి నెలలోఁ గొందఱు పెద్దమనుష్యులప్రార్థనమున దయానందస్వామి కలకత్తాకుఁ బోయెను. మతవిషయములను దనతో వాదింప నిచ్ఛగలవారువచ్చి వాదింపుఁడని పిలుచుచు నితఁడు జాబు లచ్చువేయించి పండితులకుఁ బంపెను. ఆపత్రికలఁ జూచుకొని యచ్చటిపండితులు వానితో మతవిషయములో ననేకవాదములుచేసి యోడిపోయిరి. పండితులనోడించి దయానందుఁడు కలకత్తాలోఁ బెద్ద సభచేసి సాయంకాలము మూఁడుగంటలు మొదలు నాలుగంటలవఱకు సంస్కృతభాషలో నుపన్యసించి జనులను మహానందసముద్రములో ముంచెను. సంస్కృతము వినిన వాని నోటినుండియే వినవలయు నని యచ్చటిపండితులంద ఱైకకంఠ్యముగఁ బలికిరఁట. ఆయన హిందీ, మరాతీ, గుజరాతీ, సంస్కృత మను నాలుగుభాషలలో ననర్గళధారగ మాటలాడఁగల సామర్థ్యముగలవాఁడు. ఏవిషయమును బ్రసంగించునపుడైనఁ బ్రమాణములు వందల కొలఁది యతఁడు చూపశక్తిగలవాఁడు. వేయేల! నాలుగువేదములు వానికి వశములయియుండె నని లోకులు చెప్పుకొనిరి. అతఁడు కలకత్తాలో నున్నకాలమున కేశవచంద్రసేనుఁడు వానిని సందర్శించి మైత్రిచేసి వేదాంతవిషయము లనేకములు వానితోఁ జర్చించి క్రొత్త సంగతులు నేర్చుకొనియెను. ఈగెలుపు లన్నిఁటినిఁగూర్చి యానాఁటి

వార్తాపత్రికలే స్వామిని వేయినోళ్ళం బొగడుచువ్రాసినవి. స్వామి కలకత్తానగరమువిడిచి ప్రయాగ, కాన్పూరు మొదలగు పట్టణముల కుంబోయి తనసిద్ధాంతము బోధించికొంతకాలమూపాంతమునం గడపి బొంబాయినగరవాసులు తన్ను రమ్మని ప్రార్థింప 1874వ సంవత్సరమున నచ్చటికరిగెను.

బొంబాయినగరవాసులు స్వామిని దద్దయు నాదరించి వాని యుపన్యాసములం గడుశ్రద్ధతో వినిరి. దయానందుం డాపట్టణమున దేవాలయధర్మకర్తలగు షోక్లీగోసాయినులతో విగ్రహార్చనమును గుఱించి వాదించియోడించి యచ్చట నార్యసమాజముస్థాపించి మరల నుత్తరహిందూస్థానమునకుం జనియెను. తోవలో నతనియొద్దకు చంద్రపురగ్రామవాసి యగు మునిషీప్యారులా లనునతఁడు వచ్చి హిందూక్రైస్తవ మహమ్మదీయ మతములలో దేనియందు సత్యము గలదో తెలిసికొనుట కాయామతస్థులచేత నుపన్యాసము లిప్పింపవలయునని తానుకోరుచుంటి ననియు మహమ్మదీయక్రైస్తవమతస్థులుపన్యసింప నంగీకరించిరనియు హిందూమతపక్షమున విజయంచేసి యుపన్యసింపవలసినదనియు స్వామినిగోరెను. స్వామి దానికంగీకరించి యాగ్రామమునకుంబోయి మూఁడు దినములు వారితోవాదించి హిందూమతపక్షమున నుపన్యాసములిచ్చి క్రైస్తవులకు మహమ్మదీయులకుం బరాజయము కలిగించెను. ప్రతివాదమందు దయానందుఁడు గెలుచుచుండినను గెలుపొందితి ననుగర్వములేక యోడిపోయినవారి యెడలం బరమదయాళువై మునుపటికంటె నెక్కుడు వినయసంపత్తి చూపుచుండును. అందుచేత నచ్చటికిం గ్రైస్తవమతపక్షమునవచ్చిన రివరెండుస్కాటుదొరగారికి, మనస్వామికి నభిప్రాయభేదములున్నను మైత్రిగలిగెను. పిమ్మటం గొంతకాల మక్కడక్కడ తనమతమును బోధించి స్వామి 1877 వ సంవత్సరమున ఢిల్లీపట్టణమున జరిగినదర్బా

రును జూడఁబోయి యచ్చోటికి వచ్చిన మహారాజులకు జమీందారులకు తన సిద్ధాంతము నుపదేశించెను. ఆమాటల మాధుర్యముఁ జవిచూచి యంతతోఁ దనివి నొందక పంజాబు దేశస్థులు తమ దేశమునకు రమ్మని వానిం బ్రార్థించిరి.

వారిప్రార్థన మంగీకరించి దయానందుఁడు పంజాబు దేశమునకుఁ జని యచటనేకస్థలములలో నార్యసమాజములను స్థాపించెను. ఎందుచేతనోగాని యాయార్యమతము పంజాబు దేశమునందు మిక్కిలి మెక్కువవృద్ధిఁ బొందెను. సాధారణముగా నాదేశమునం దార్యసమాజము లేనిగ్రామమే లేదు. పంజాబు దేశమునుండి దయానందస్వామి రాజపుత్రస్థానమునకు వచ్చి యుదయపురమహారాణావారిచేత ప్రార్థితుఁడయి యానగరమున నెనిమిదిమాసములు వసించెను. రాణావారాకాలములో మనుస్మృతిచదివి రాజ్యతంత్రము నిర్వహించు విధమును నేర్చుకొనిరి. రాజుగారింజూచి యదివఱకెన్నఁడు పుస్తకముఁ బట్టియెఱుఁగని యుద్యోగస్థులుభక్తిశ్రద్ధలతో స్వామియొద్ద జదువనారంభించిరి. సంస్థానమంతయుఁ గ్రమక్రమముగఁ జక్కఁబడెను. అక్కడ నున్నకాలములో రాణాయొకనాఁడు దయానందునిఁ జూచి "స్వామీ! మాయూరిలో గొప్పకోవెలయున్నది. దానికెన్నియో మాన్యములున్నవి. మీరు విగ్రహారాధన మంచిదిగాదని చెప్పుట మానినపక్షమున మిమ్మాగుడికి మహంతునిఁ జేసి యాసొత్తు మీయధీనముచేసెద" నని పల్కెనఁట. అప్పలుకులు విని దయానందుఁడు మహాకోపోద్దీపితుఁడై యట్టిదుర్భాషలనెన్నడు నాడవద్దనియు నెన్నికోట్లధనమిచ్చినఁ దాఁ జెప్పఁదలఁచుకొన్నది చెప్పకమాననని యు పలికి రాజుంగట్టిగ చీవాట్లుపెట్టెను. రాజు భయపడి వానిపాదములపైఁబడి క్షమింపుమని వేఁడుకొనెను. అనంతరము దయానందుఁడు షాపూరు మహారాజుగారి పట్టణమునకుఁబోయి యచ్చట గొన్నాళ్ళుం

డి వానికి రాజధర్మములునేర్పెను. అచటనుండఁగనే జాడుపూరుమహా రాజుగారు తమయూరువచ్చి తమ్ముపవిత్రులఁజేయుమని వానింబ్రార్థించెను. ఆవేఁడుకోలువిని మనస్వామి జాడుపురమును ప్రవేశించెను. అప్పటికి జాడుపుర మెట్లుండవలయునో యట్లుండెను. మహారాజునాంజ హాన్ అనువేశ్యాంగన వలలోఁ దగులుకొని రాజ్యతంత్రములకు విముఖుఁడైయుండెను. మంత్రులు తక్కిన యుద్యోగస్థులు తగనిపన్నులు గట్టి ప్రజల వేధింపఁజొచ్చిరి. రాజబంధువులు రాజుకంటె నెక్కుడు దుర్ణీతిపరులైరి. వేయేల సంస్థానమంతయు వర్ణింపరానిదురవస్థలోనుండెను. దయానందుఁ డచ్చటికిఁబోయిసంస్థానస్థితిఁగనిపెట్టి రాజును మంత్రులను మంచిత్రోవకు త్రిప్ప ప్రయత్నించెను. రాజు బాగుపడినచో తమయాటలు సాగిరావనిదమపాలిటికీయతియెక్కడదాపురించెనని విచారించి యుద్యోగస్థులు కొందఱుస్వామియెడ ద్వేషముఁబూనిరి. అది యటుండ వెలయాలుపొత్తులు మరగినందు కతఁడు రాజునుపలుమాఱు చీవాట్లుపెట్టెను. ఒకనాఁడు దయానందసరస్వతిమహారాజును సందర్శించుట కంతఃపురమునకువచ్చెను. ఆయనవచ్చునప్పటికి మహారాజుగారు నాంజహానుతోఁగలసి ముచ్చట లాడుచుండిరి. స్వామి నల్లంతదవ్వులఁ జూచినంతనె మహారాజు దద్దిరలాడి మిండకత్తెనావలకుఁబొమ్మనియానతిచ్చెను. అంతలో స్వామి యచ్చటకువచ్చినందున నదియావలకుఁబోవునప్పు డాయనకంటఁబడెను. పడుటయుకలియుగశుకయోగీంద్రుఁడగు నామహాత్ముఁడుదుర్ణీతిపరుఁడగుమహారాజుదుర్వినయము సహింపక కోపముపట్టఁజాలక తూలనాడి తలవాయునటులచీవాట్లు పెట్టెను. ఆమాటలు చాటుననుండి వేశ్యాంగనవిని తనవలపుకానికిం దనకునెడఁబాటుచేయఁ దలంచిన యాపురుషునిఁ గడతేర్ప నిశ్చయించెను. ఆసాయంకాలము దయానందునకు మహారాజుగారు పాలుపంపునప్పుడా దురాత్మురాలు పాలలోఁగొంచెము విషముగలిపి చంపించెను. అదియెఱుఁ

గక స్వామి యాపాలు పుచ్చుకొన్న వెంటనే చంపునదికాదు గావున వానినొక్కమాసము బాధపెట్టెను.మహారాజున కీసంగతి తెలిసినతోడనే సంస్థానమునందలి వైద్యులనందఱ రప్పించి చేయవలసినచికిత్సల నన్నింటిని చేయించెను. ఎన్నిచేసినను రోగముమాత్రముతిరుగకయుం తకంత కెక్కువయ్యెను. ఆశలేదని తెలిసినప్పుడు స్వామిజాడ్పూరు విడిచి యజమీరునకుఁబోయెను. ఎంతబాధపడుచున్న నబ్బా యన్న మాటయైన నోటరానీయఁడయ్యె. 1883 వ సంవత్సరము సెప్టెంబరు 30 వ తారీఖున విషప్రయోగము జరిగెను.అదిమొదలొకనెలతీసికొని యామహాత్ముఁడు భరతఖండముయొక్క దురదృష్టవశమున 31 వ అక్టోబరు తారీఖున శరీరమువిడిచి శాశ్వతపదవినొందెను. చనిపోవునాఁడు ముండనముచేయించుకొని స్నానముచేసియందఱనావలకుఁబొమ్మని యొంటిగ నీశ్వరుఁబ్రార్థించి తెలివితో ప్రాణముల వదలెను.ఈశ్వరుని యందుదృఢవిశ్వాసముతోడను, సర్విచారముగను, నిర్భయముగను బ్రాణములువిడుచుచున్న యామహాయోగియొక్క చరమావస్థజూచి యద్భుతపడియదివఱకు దేవుఁడు లేఁడని వాదించునాస్తికుఁడొకఁడుతక్షణమ యాస్తికుఁ డయ్యెనట. ఆర్యసమాజమతము స్థాపించి భరతఖండము నుద్ధరింపఁదలఁచిన యామహానుభావుఁడు తుదకీవిధముగా వేశ్యాంగనచేత మృతినొంద వలసివచ్చె.

దయానందునిజీవితము సంగ్రహముగఁ దెలిపితిమిగనుక నింక నాతని మతసిద్ధాంతము గుణగణములుఁ జెప్పవలసియున్నవి.ఆయనమతమునకు వేదమే ముఖ్యాధారము. వేదమేనిత్యమనియునందుచేతనీశ్వరదత్తమనియుఁ దత్కారణమునఁబరమప్రమాణమనియునతఁడుజెప్పుచువచ్చెను. ఆయనమతప్రకారము పురాణములు కల్పింపఁబడినకట్టుకథలు. అబద్ధములు దుర్బోధకములునగు నీపురాణముల మూలము ననే మనదేశ మింతదుస్థితికి వచ్చినదని యాయన పలుమారుచెప్పుచు

వచ్చెను. వేదమునఁ దప్ప మఱియొక గ్రంథమెన్నఁడాయన ప్రమాణము గ గ్రహింపలేదు. వేదములు బ్రాహ్మణులొక్కరేచదువుట కేర్పడిన పుస్తకములు కావనియాయన నమ్మెను. నదులలో జలముసూర్యుని తేజస్సు సకలజాతులవారి కెట్లుపయోగములుగ నున్నవో యట్లే వేదములుఁగూడ బ్రాహ్మణుల కేగాక శూద్రులకు స్త్రీలకు మాలలకునయితముఁ జదువఁదగినవని యాయనచెప్పెను. వర్ణభేదము పుట్టుకనుబట్టి యుండఁగూడదని యతనిసిద్ధాంతము. గుణములనుబట్టియు వృత్తినిబట్టియు విద్యను బట్టియుఁ జండాలుఁడైన బ్రాహ్మణుఁడు గావచ్చును. విద్యాగుణహీనుఁడు బ్రాహ్మణుని కడుపునఁబుట్టినవాఁడు చండాలుఁ డేయగును. స్త్రీవిద్య తప్పకప్రోత్సాహము చేయతగ్గదనియునాఁడువాండ్రు చదువుకొననిపక్షమున దేశము మూర్ఖభూయిష్టమగుననియునతఁడు బోధించుచువచ్చెను. బాలికలకు యుక్తవయసు రాకమునుపుచిన్నతనమందె వివాహముచేయుట యశాస్త్రీయమనియు నతిబాల్య వివాహములవలన దేశజనులందఱు బలహీనులై యున్నవారనియు నందుచేత మగవాని కిఱువదియైదు సంవత్సరములువచ్చినతరువాత నాఁడుదానికిఁ బదునాఱేండ్లుదాటినపిమ్మట వివాహములుజరుపవలసినదనియునతఁడు వాదించెను. వితంతువులు మరల వివాహముఁ జేసికొనఁగూడదని వేదమునందెచ్చటఁ జెప్పఁబడలేదు. కాఁబట్టి యా వివాహములు మంచివే యని యతనినమ్మకము. ఆయనసిద్ధాంతప్రకారముహిందువులందఱు విదేశములకుఁ బోయి నౌకాయాత్రలుచేసి రావచ్చును. అట్లుచేసినందువలన వారి జాతిమతములు చెడవు. వివాహాదులు వేదమంత్రముల తోనే జరుగవలయును.

ఆర్యసమాజమతములోఁ జేరినవారికిఁగొన్ని వైదికకర్మలుగూడ విధింపబడియున్నవి. వేదములేప్రమాణములని చెప్పుట, వైదికకర్మలు గొన్ని విధించుట తప్ప మఱి దయానందుఁడు బ్రహ్మ

సమాజమతస్థులవలెనే దేశాభివృద్ధికరములగుమార్పులం జేసెను. ఈమహాత్ముం డీమార్పులుచేసి ప్రాచీన వైదికమతమునిలుపఁ దలఁప పూర్వాచారపరాయణు లదియొకక్రొత్తమతముగ భావించివానినిదూషించి యనేకవిధముల బాధించియొకానొకప్పుడుచంపుటకుఁగూడఁబ్రయత్నించిరి. ఒకమాఱొక జమీందారుఁడు వానితోఁగొన్నియంశములు ముచ్చటించితనవాదము పూర్వపక్షమగుటచే నప్పుడె దయానందునిఁ గొట్టఁబోయి వీలులేక యూరకొని రాత్రి దయానందునిం జంపుమని నలువురుమనుష్యులనంపెను. అప్పుడు దయానందుఁ డూరు బైట నొక చిన్నపాకలో నివసించుచుండెను. ఆనరహంతకులు నడిరేయివచ్చి స్వామిని బిలువ నతఁడు పాకవెడలి యావలకువచ్చెను. పరమశాంతమును పవిత్రతను వెదజల్లు నాతని విగ్రహమును జూచినతోడనే హంతకులు తమచేయఁదలఁచిన ఘోరకృత్యమును మాని పాఱిపోయిరి. మఱియొకసారి వైదికబ్రాహ్మణుఁడొకఁడు భక్తిగలవానివలె వెళ్ళివిసముగలిపిన తాంబూలపుబీడా స్వామికిచ్చెను. కపటమెఱుఁగనియాస్వామియదితిని విషబాధితుఁడైవమనమునకుమందుపుచ్చుకొని యెట్టెటో బ్రదుకగలిగెను. ఆయనకున్న ధైర్యమసాధారణము. ఎవరికింజంకువాఁడు కాఁడు. ఒకమాఱుహిందుమతమునుగూర్చి యొకగ్రామములో ముచ్చటించుచు నడుమ క్రైస్తవమతమును ఖండించెను. అక్కడికివచ్చి యుపన్యాసము వినుచుండిన జిల్లాకలెక్టరు దొరగా రుపన్యాసమును మాని వేయవలసినదనియు నట్లు చేయనిచో దండింపవలసివచ్చుననియు, వర్తమానమంపెను. అదివిని స్వామి నవ్వి నన్నెవ్వరు నేమిచేయలేరని పలికి మఱింతదృఢముగ నుపన్యసింపఁ దొడగెను. మఱి యొకమారు స్వామి తనచిరమిత్రుఁడగురివరెండుస్కాటుదొరగారిని జూచుటకువారిచర్చికిబోయెను. స్కాటుదొరకుస్వామియందు మిక్కిలిగౌరవముండుటచేవానినిలోపలకుఁదీసికొనిపోయి వేదాంతవిషయమేదియైననుపన్యసింపుమనికోరెను.

అట్లేయని స్వామియుపన్యసింప నారంభించి క్రైస్తవమతముఖండించి స్వమతమును బోధించెను. అంతమంది దొరలయెదుట క్రైస్తవులగు డిలో క్రైస్తవమతమును ఖండించిన యాతని ధైర్యమెట్టిదో గనుఁడు.

మఱియొకసారి హిందువులనేకులు స్వామిని గౌరవించియొక దేవాలయములోనుపన్యాసమిమ్మని ప్రార్థించిరి. దేవాలయములోనుండుటచే విగ్రహారాధనము మంచిదికాదని యతఁడు చెప్పఁడని వారుతలంచిరి. స్వామి దేవవిగ్రహమున కెదురుగ నొకరాతిమంటపముమీఁదనిలిచి యుపన్యసించుచు నడుమవిగ్రహములమాటరాఁగా తనకాలిక్రిందనున్న మంటపపురాళ్ళెట్టివో గుడిలోనున్న యాదేవవిగ్రహము నట్టిదేయని పలికెను. అతని ధైర్యమునకు సభికులందఱాశ్చర్యపడిరి. తాను నమ్మినసంగతి నతఁడు మొగమోటములేక చెప్పఁగలిగెను. మంచిదని నమ్మినపని స్వయముగ నాచరించెను. ఆయనకు సత్యమునందుగల యాదర మింతింతయనరాదు. ఒకసారి బ్రాహ్మణులనేకులు వానియొద్దకువెళ్ళి "స్వామీ! మీ రెవరో యవతారపురుషులు. మీమతమంతయు బాగున్నదిగాని విగ్రహములను దూషించుట బాగులేదు. విగ్రహదూషణమానుదురేని మిమ్ము మేము గురువుగ నంగీకరింతుమ" మనిపలికిరి. ఆపలుకులు విని స్వామి కోపించి నన్ను మీరు గురువుగా నొప్పుకొనకున్ననుసరే నేను సత్యమును విడువను. నేను నమ్మినదానిని జనులకు బోధించెదను. అని కఠినముగఁ జెప్పెను.

దివ్యజ్ఞానమను పేరుగల (థియసాఫికలుసొసైటీ) వారు దయానందస్వామిని దనసంఘమున కధ్యక్షుఁడుగ నేర్పఱచిరి. కాని యాసమాజస్థాపకురా లగు బ్లావట్స్కీ దొరసానిగా రొకగ్రామములో దేవుఁడు లేఁడని యుపన్యసించెనని విని యీస్వామి యాసమాజముతో సంబంధము వదలుకొనెను.

ఆయనశరీరమింగ్లీషువారిశరీరమువలె తెల్లఁగనుండును. మనుష్యుఁ

డాజానుబాహుఁడు. ఆయనవిగ్రహము జూచినవా రందఱికి తక్షణ మే వానియందు భక్తి కుదురును. దయానందుఁడు పరమశాంతుఁడు, భూతదయాళువు, సుగుణరత్నాకరుఁడు, జితేంద్రియుఁడు, మహాపండితుఁడు. నాలుగు వేదములకు స్వయముగ వ్యాఖ్యానము వ్రాసెను. శంకరాచార్యవిద్యారణ్యస్వాములతరువాతనింతటిపండితుఁడునింతటిమతబోధకుఁడుభరతఖండమునను ద్భవింపలేదనియనేకులుపలికిరి. ఆయన మతములో నిప్పుడు లక్షలకొలఁది చేరియున్నారు. అందు కొందఱు మహారాజులుగూడ గలరు. ఆయనమతములో మనముచేరినఁ జేరకున్న దేశమునకు మహోపకారముఁ జేయఁదలఁచిన మహాత్ముఁడగుటచే దయానందసరస్వతీస్వామి హిందువుల యందఱి గౌరవమునకుఁ బాత్రుఁడు.

ఈయన స్థాపించిన మతము దేశాభివృద్ధికి మిక్కిలిసహాయకరముగ నున్నది. వేదమునే పరమప్రమాణముగా నితఁడు గ్రహించుటచేత నితనిమత ముత్తరహిందూస్థానములో మిక్కిలి వ్యాపించుచున్నది. ఈమతస్థులు వివాహములు వేదమంత్రప్రకారముగాఁ జేసికొందురు. మనమతములోనుండి మహమ్మదీయమతములోగాని క్రైస్తవమతములోఁగాని కలిసి చెడిపోయినవారిని మరల నీమతస్థులు తమమతములోఁ గలుపుకొందురు. అంతియెగాక యితరమతస్థుఁ డెవఁడైన మనమతములోఁ జేరఁదలఁచుకొన్నపక్షమున వానినిఁగూడ నిరాటంకముగాఁ జేర్చికొందురు. ఈమతస్థులలో గొందఱు సన్యాసులై జనులంద ఱాసత్యమతము నవలంబించవలసినదని బోధించుచున్నారు. ఈమతవ్యాప్తినిమిత్తము లోకోపకారు లనేకులు పత్రికలు స్థాపించి యున్నారు. శ్రీమంతులగు కొందఱు పాఠశాలలను, సర్వకళాశాలలను స్థాపించి తక్కినపాఠములతోపాటు ఈమతసిద్ధాంతములను గూడ బాలురకుఁజెప్పించుచున్నారు. అల్పకాలమున నీమత మింతయభి

కముగ దేశమున వ్యాపించుటకుఁ గారణము దయానందసరస్వతీస్వామియొక్క గొప్పతనమే యని తెలియవలయును. ఈయనయొద్ద పాండిత్య మెంతయున్నదో సత్ప్రవర్తన మంతియయున్నది. చిన్నతనమునందే వివాహమక్కఱలే దని వైరాగ్యమునుబూని సన్యసించిన మహాత్ముఁడు శంకరాచార్యునితరువాత నీతఁడొక్కఁడే యని తోచుచున్నది. ఆయనపాండిత్యమును, శాంతమును, యోగ్యతనుఁజూచి రాజాధిరాజులు సయితము గడగడవడంకి ఆయన చెప్పినచొప్పునఁ జేయుచు వచ్చిరి. దక్షిణదేశమం దార్యసమాజమత మిప్పటికి వ్యాపింపకపోవుటచే దయానందుని పేరు తఱచుగ నీప్రాంతములవారికిఁ దెలియదుగాని యుత్తరహిందూస్థానమున వానిపేరెఱుఁగనివారు లేరు. ఈయనచరిత్రమును జదివినవా రందఱును ఆయనవలెనేసత్యాదరము దైవభక్తి మొదలగు సద్గుణంబులు కలిగి వర్థిల్లునట్లు దైవ మనుగ్రహించుఁగాక.





సర్ జేమ్సెట్జీ జీజీభాయి.

# సర్ జేమ్సెట్జీ జిజీభాయి

ఘూర్జర దేశమున బరోడాయనుస్వదేశసంస్థానమొకటిగలదు. అంద లి నవసారీ యనుగ్రామమున జీజీభాయి 1783 వ సంవత్సరము జూలై 15 వ తారీఖున జన్మించెను. వానితలిదండ్రులు పేదలయ్యు గౌరవాస్పదులయి యుండిరి. ఇతఁడు పారసీజాతివాఁడు. ఈ పారసీలు ఘూర్జర దేశమందును మహారాష్ట్ర దేశమందంతటను వసించుచున్నారు. వీరు విద్యయందు రూపమునందు ధనమునందు నసమానులు.

జిజీభాయి చిన్నతనమందే మాతాపితృవియోగ మొందుటచే మామగారియొద్ద బొంబాయినగరమున నుండవలసివచ్చెను. కొంత కాలము ముందు పనినేర్చుకొని పిమ్మట నతఁడు మామగారితోఁ గలసి వర్తకవ్యాపారము జేయనారంభించెను. మనస్వదేశములోనేగూర్చుండి యెంతవర్తకముఁ జేసినను విశేషలాభములు గలుగ వనియు ను విదేశములతో వర్తకము చేయుటచేతనే చాలలాభములు గలుగుననియును జిజీభాయి గ్రహించి తన బంధువుఁడగు మఱియొక పారశీకవర్తకునితోఁగూడి పదునాఱవయేఁటనే చీనాదేశమునకుఁ బోవ పయనమయ్యెను.

స్వదేశము విడచివెళ్లునప్పు డతఁడు తనయాస్తినంతయు వెంటఁదీసికొనిపోయెను. ఆయాస్తియెంత యందురేని నూటయిరువది రూపాయిలు. చీనాదేశమున కరిగి కొంతకాలమే యచ్చటనుండి స్వదేశమునకు వచ్చి స్వయముగ దానే వ్యవహరింపఁదలఁచి పెట్టుబడి నిమిత్తము ముప్పదియైదువేలరూపాయిలు ఋణముదీసికొని యతఁడు మరల చీనాకుఁబోయెను. ఇదిగాక యతఁడు చీనాకు నాలుగుసారులు పోయెను. అందు 1806 వ సంవత్సరమునఁ జేయఁబడినకడపటిప్రయా

ణము కొన్నియపాయములతో నిండియున్నది. ఆప్రయాణమున బ్రిన్సువిక్కను పేరుగల యోడమీఁద దా ననుభవించిన కష్టము లన్నియు జిజీభాయి గుజరాతీభాషలో దనమిత్రునిఁ కొకయుత్తరమువ్రాసెను. ఆయుత్తరములోని సంగతులఁ గొన్నిటి నిందు బొందుపఱచుచున్నాము.

"మేమెక్కినయోడను ఫ్రెంచివారు పట్టుకొనిరి. మాదురదృష్టమునకుఁదోడు మాయోడకొంతనడచి మెరకయెక్కెను. ఒడ్డునకు మమ్ముఁ బోనిమ్మని యోడమాలిని మే మెంతయుఁ బ్రతిమాలితిమిగాని తనపై యధికారి యుత్తరువులేదని యతఁడు మాకోరిక నిరాకరించి కొంతదూరము సాగిపోయినవెనుక మమ్ముదిగనిచ్చి మా సరకులు మాకిచ్చెదమని వాగ్దానము చేసెను. ఆమఱునాఁడుఅడ్మిరల్ (అనఁగా నావకుసర్వాధికారి) మాకుదర్శనమియ్య మాసిలుగుల మేమువారికి విన్నవించుకొని మమ్మొకదరిఁజేర్పుఁ డనిప్రార్థించితిమి. ఆయనమాయందనుగ్రహించి మామూటలుముల్లెలు పుచ్చుకొమ్మనియెనుగాని మావర్తకపుసరుకులుమాత్రము మాకియ్యనొల్లఁడయ్యె. ఆయన పిమ్మట మాసామాను శోధించి నాయొద్దనున్నబియ్యపుమూట రెండుమల్లుతానులు మొదలగు కొన్నివస్తువులం దీసికొని నాబట్టలపెట్టెనాకిచ్చెను. బియ్యపుబస్తాయొకటియిమ్మని నేను వేఁడుకొంటినిగాని యామహాత్ముఁడు నామొఱ వినఁడయ్యె. అప్పుడునాసరకులన్నియు నొకపెట్టెలోవేసికొని తక్కినవారితోఁ గలిసి యోడ దిగిపోతిని. ఓడదిగి యొడ్డుచేరినపిదప మేము "కెప్టెన్ గ్రాంటు" అను నొకయింగ్లీషునావికునిఁ జూచితిమి. ఆయన మాయలమట విని జాలిపడి యెంతయు నాదరించె. ఎట్లయినను ఫ్రెంచివారిచేతినుండి తప్పించుకొంటిమని సంతసించితిమి. మాలో "టర్నర్" అనుపేరు గల యొకయింగ్లీషుదొరగా రుండిరి. ఆయనయొద్దమూఁడువేలడాలరులసొమ్ముండె

ను. ఆసొమ్ముతో మేముకొంతకాలము గడపితిమి. ఒకడోలరు రెండు రూపాయలన్నరకుసమానము. ఆదినములలో బెద్దబియ్యపుకాటకము సంభవించుటచే ముప్పదియైదుడోలరులిచ్చినను మాకొకబియ్యపుబస్తా దొరకుట యరుదయ్యెను. అందుచేతనొక్కొక్కమనుష్యుఁడుదినమున కరపౌనుబియ్యముకంటెనెక్కువతినఁగూడదనినియమమేర్పరచుకొంటి మి. గొఱ్ఱెమాంసమొకటి మాకుకావలసినంత లభించుచువచ్చెను. ఈ విధముగాఁ గష్టములఁ బడుచు గ్రాంటుదొరగారిదయచేత మేమెట్టులో మఱియొకయోడ నెక్కఁగలిగితిమి. మందభాగ్యులెక్కడికిఁబోయినను విపత్తులు విడువవుగదా! ఆయోడకలాసులకు మాపైనిశ్రేతుకాగ్రహ ముగలిగెను. అందుచేవారు మమ్మవమానింపఁ దొడగిరి. అంతియగా క నేను నాతోనున్న నలుగు రింగ్లీషువారుమఱియొకమహమ్మదీయుఁ డు మేమాఱుగురముగలసితన్నుఁజంపుటకొకకుట్రపన్నుచున్నారమని మాపయి ననుమానపడి యాయోడయధికారి మాకు సంకెళ్ళు వే యించి యంతతోఁ బోక మాకింకను దారుణదండనవిధింతునని బెదరిం చెను. కీడులో మేలన్నట్లు నాతో నున్న నలువురి దొరలలో నొకనికి ఫ్రెంచిభాష వచ్చి యుండెను. ఆభాషతో నతఁడు నావయధికారితో మాస్థితిగతులవిస్పష్టముగఁజెప్పిమాసామానుల పరీక్షింపుమని వేడగా నతఁడు సరేయనిశోధించి మాయొద్దప్రాణములు తీయునాయుధములే వియు లేవనిగ్రహించి మమ్ము విడిచిపుచ్చెను. ఇట్లుమాకష్టము లనం తములయి యుండెను. అటులుండ నాసమయమునడెన్మార్కుదేశము వారియోడ కలకత్తాకుఁ బోవుచుండెను. గ్రాంటుదొరగారు మమ్మా యోడమీఁద నెక్కించి బంగాళాదేశమునకుఁ బంపుదుమనివాగ్దానము చేసి యాయోడయధికారితోఁజెప్ప తన నావమీఁద స్థలములేదని య తఁడు ప్రత్యుత్తరమిచ్చెను. మేమేదో యొకమూలనిరికికూర్చుండికా లక్షేపము సేయఁగలమని మరల వానికి వర్తమానమంప నతడంగీకరిం

చి నన్నును నాతోనున్న తురకవానిని నావయెక్కించుకొనుటకు నెనిమిదివందల డోలరులు (అనఁగా రెండువేలరూపాయలు) కావలయునని యడిగెను. ఈయోడ కిరాయి మిక్కిలియెక్కువగానున్నదనియభిప్రాయపడి గ్రాంటుదొరగారు కొంతతగ్గింపుమని మాపక్షమునుబూనికొంతవఱకు వాదించిరి. కాని యాయోడయధికారి పట్టినపట్టువిడువనందున గ్రాంటుగారు స్థితిగతులు చూచియాయోడదాఁటిపోయినచో మరలనేయోడయుకు దొరకదనియు దొరకినను కిరాయి యింతకంటెతక్కువయుండదనియుసీనకుమగొడ్డుమాంసముతక్క భోజనపదార్థము లేవియు దొరకవుగావున మిక్కిలియవస్థపడవలసియుండు ననియుఁజెప్పియాబేరముఁదొప్పుకొమ్మని నాకుపదేశించిరి. ఆయుపదేశమును శిరసావహించి తురకయు నేనును చెరియెనిమిదివందల శిఖారూపాయలుకలకత్తాలోనోడయధికారులకిచ్చునట్లొప్పుకొని పత్రములవ్రాసియిచ్చియోడయెక్కితిమి. మొదట మేమెక్కినయోడలోనుండియొకబియ్యపుబస్తానెట్లయిన మాకిప్పింపుమని గ్రాంటుదొరగారిని వేఁడుకొంటిమి. అతఁడట్లేయని యాయోడయధికారికొకచీటివ్రాసి పంపనతఁడుమాకోరికనిరాకరించె. అప్పుడు ముప్పదిడోలరులకు మేముమణుగున్నరబియ్యముకొంటిమి. అదిగాక నేను వెనుకదొంగతనముగాదాఁచుకొన్నబియ్యమొకయరబస్తాయుండెను. ఈసరకులతో బయలుదేరునప్పుడుగ్రాంటుదొరగారు మేమెక్కిన యోడయధికారితోమమ్ముదయతోనాదరింపుమని చెప్పెను. ఎవరెంత చెప్పినను మాదురదృష్టము మమ్మువిడువదయ్యె. పదునాఱువందలరూపాయిలుపుచ్చుకొనియాయోడయధికారితురకనునన్ను సామాన్యపుడింగీపడవలలోఁగూర్చున్నప్పుడున్నంత సౌఖ్యమైనను లేనిచోటుల గూలనేయుటయేగాక యెంత యనాదరణముసేయవలయునో యంత యనాదరణము చేసెను. మాకును మఱియేడుగురు మనుష్యులకును వంటచేసికొనుటకుఁ బ్రాగుటకు దినమునకొకకుండెడు

నీరతఁడు పంపుచువచ్చెను. ఆయోడయెక్కినదిమొదలుపదునైదుదిన ములవఱకు మామందభాగ్యముచేత మేము పడినయిడుమలిట్టిటివని నే నువ్రాయఁజాలను. తరువాత నాలుగైదు దినములకు (అనగా డిశంబ రు 5 వ తారీఖున నర్ధరాత్రిమున) మేము కలకత్తానగరము సురక్షిత ముగాఁ జేరితిమి.

ఇట్లుచచ్చిచెడి యెట్లో కలకత్తాచేరిజీజీభాయికొన్నినాళ్ళచ్చట నుండి బొంబాయినగరమునకుఁబోయెను. ఆపురమున కొంతకాలముం డిమరల చీనాదేశమున కింకొకసారి నావికాయాత్రచేసి 1807 వ సంవ త్సరము తిరిగివచ్చి బొంబాయిపురమున స్థిరముగఁ గాపురముండెను. అదిమొదలు వర్తకవిషయమున నతఁడు తిరిగిప్రయాణముచేయలేదు. ఆనగరమునందే యతఁడు ముగ్గురుభాగస్వాములతోఁగలసియొకవర్తక సంఘముస్థాపించిమిక్కిలిపాటుపడిజాగరూకతతోవ్యవహరించి 1827వ సంవత్సరమునకురమారమిరెండుకోట్లరూపాయిలుసంపాదించెను.ఆహా హా!నూటయిరువదిరూపాయిలతోజీవయాత్రనారంభించినయీపేదయి రువదియైదుసంవత్సరములలోనెంతధనికుఁడయ్యెనో చూడుఁడు. దీనికిఁ గారణమేమి! మనకు దైవమింతియేయిచ్చెనని నింద్యమయినసంతుష్టి నొంది"కూపస్థమండూకమువలె" స్వదేశముననేయుండి యిడుమలఁ బడక పిన్ననాఁటనుండియు విదేశములలో విరివిగా వాణిజ్యమును సేయుటయే దీనికిఁ గారణము.

అతఁడు ధనమార్జించు నుపాయ మెంతబాగుగ నెఱిఁగియుండె నో పాత్రాపాత్రమెఱిఁగి బీదలనిమిత్తము దానినివిని యోగించు నుపా యము నంతబాగుగనేయెఱిఁగియుండెను. పునహా బొంబాయి సూరతు మొదలగుపట్టణములు ఘూర్జరదేశమునందలి నవసారీమొదలగుగ్రామ ములు చూచినవారికి జీజీబాయియొక్క యౌదార్యముభూతదయాళు త్వము తప్పక తెలియును. కృపాసముద్రుఁడగు నీపారసీకులస్థుఁడుమహా

రాజు లిచ్చినట్లుమితిమీరినధన రాసులుదానములిచ్చి ధర్మవైద్యశాల లు, పాఠశాలలు, చెరువులు, సత్రములు, బాటలు, నూతులు, మొద లగువానిని నిర్మింపజేసి లోకోపకార పారీణుఁడయ్యెను. ఈదానములు సేయుటలో జాతివర్ణమత భేదములనతఁడెన్నడు పాటింపలేదు. ఈదానక ర్ణునికీర్తిసకలదేశవ్యాప్తమగుటచే శ్రీవిక్టోరియామహారాజ్ఞిగారు వాని యౌదార్యమునుమెచ్చి 1842 సంవత్సరమున నైటనుబిరుదమునిచ్చెను.

అత్యంతగౌరవసూచక మగునీబిరుదు పొందినవారిలో హిందూ దేశమున జీజీభాయియే మొట్టమొదటివాఁడు. ఆబిరుదువచ్చినప్పుడు వానిస్వకులము వారగు పారసీలు చాలసంతసించి వానినిగౌరవించిరి. ఆబిరుదమును వానికిచ్చినప్పుడు బొంబాయిగవర్నరుగారు సర్ జార్జి ఆండర్సన్ దొరగారిట్లు పలికిరి. "నీవు రాజులిచ్చినట్లు దానములిచ్చి మానవకోటి దుర్దశను దొలఁగించియీయపూర్వగౌరవమునకుఁబాత్రు డవయితివి." 1843వ సంవత్సరమునందతఁడు బ్రిటిషుగవర్నమెంటువా రివలన నొకబంగారుపతకమును బహుమానముగఁబడ సెను. అమితమ గు దేశాభిమానము, సౌదార్యముగలుగు వాఁడగుటచేవానికాపతకమీ యఁబడినట్లు దానిమీఁదనే వ్రాయబడియున్నది. అప్పటిబొంబాయి గవర్నరుగారగు సర్ జార్జిఆర్థరుదొరగా రాపతకమును ఆయనకిచ్చిన ప్పుడిట్లనిరి. "నీవు దేశోపకారార్థము కేవల సత్కార్యములనిమిత్తమే తొమ్మిదిలక్షలరూపాయిలు దానముచేసియుంటివని యనేకులవలనవిని యుంటిని. ఇట్టియౌదార్యము దేశాభిమానము సూచించు ధర్మకార్య ములను శ్రీరాణిగారు తగునట్లు గుర్తెఱుంగుదురుగాక."

ఆతనిధర్మకార్యములుప్రత్యేకముగనొకజాతికి నొకదేశమునకు నేర్పడియుండలేదు. ఆంగ్లేయసైనికులు స్వదేశపుసిపాయిలుగూడమం చునెలవులగు కాబూలుకొండలనడుమ యుద్ధము భూములకు బలియగు చున్నప్పుడు ఐర్లండునందునుస్కాట్లండునందునుగాటంబులగుకాటకం

బులచే జనములు మలమలమాడి హాహాకారములతో నలమటబడినప్పు డు,క్రిమియాయుద్ధమునందుదిక్కులేకశూరశిఖామణులనేకులు నిహతులైనప్పుడునాథలగువారిభార్యలు బిడ్డలుదురవస్థననుభవించుచుండ వెనుదీయక యీదానకర్ణుఁడే గొప్పసాహాయ్యములఁ జేయుచు వచ్చెను. ఫ్రాన్సుదేశమున 1856వ సంవత్సరమున నొకనదిపొంగి దేశమునకు మిక్కిలి చెఱుపుచేసెను. ఆవరదలవలన విపత్తులఁబడినవారికిఁ బంచిపెట్టుమని యిక్కడనుండి యైదువేలరూపాయిలంపెను. ఆమహోపకారమునకు ఫ్రెంచివారు మిక్కిలి సంతసించి వానికిఁ గృతజ్ఞులయి వందనములఁ జేసిరి.

1856 వ సంవత్సరమునజీజీభాయియొక్కవిగ్రహమొకటినిర్మించిబొంబాయినగరమునఁ బెట్టవలయునని జనులు సభచేసిరి.ఆసభకప్పటిగవర్నరు గారగు నెల్ఫినిష్టన్ప్రభువుగారగ్రాసనాధిపతిగా నుండిరి. ఆవిగ్రహమునకురమారమియేఁబదివేలరూపాయిలయినవి. ఆతఁడిప్పుడులేకపోయినను వానికీర్తి దేహమో యన్నట్లావిగ్రహమిప్పటికి బొంబాయిపురమందిర మలంకరించుచున్నది. ఈతనిభార్యదాతృత్వమున నీతనిమించినది.బొంబాయినగరమునకుసాలసత్తీయనుచిన్నద్వీపమునకు నడుమనున్న వంతెన యీతనిభార్యచేసినదానమువలననేకట్టఁబడినది. ఆవంతెన ముగింపబడినప్పుడు గవర్నరుగారగు సర్ జార్జి ఆర్థరుదొరగారు జీజీభాయిగారిభార్యను గొనియాడుచునీక్రిందివిధముగాఁ బలికిరి.

“1841వ సంవత్సరమున వర్షకాలమందొకనాఁడు రమారమి యిరువదిపడవలు బొంబాయినుండి సాలసత్తికి గొందఱుమనుష్యులందీసికొనిపోవుచు మునిఁగిపోయెను. ఈయుపద్రవముచే జనులనేకులు మృతినొందిరి. జీజీభాయిగారిభార్య యతిదారుణమగు నీవర్తమానమునువిని ఖేదపడి యక్కడ యొకవంతెన దొరతనమువారేలకట్టింపగూడదని కొందఱినడిగి ప్రాణాపాయమును నివారించునట్టి సత్కారములను జే

యుటకు దొరతనమువారు సొమ్మువెచ్చించుటకుఁ బూనుకొనరని త నస్వంతసొమ్మిచ్చి యామహాకార్యమును తానే నిర్వహింప నిశ్చయించుకొని యాపనికెంతసొమ్మగునో తెలియఁజేయుమనియింజనీరుల నడిగెను. అప్పుడు కొందఱింజనీర్లు చక్కఁగావిచారించి యాకార్యమున కుషదియేడువేలరూపాయిలుసరిపోవుననియంచనావేసిరి. సాధారణముగా గొప్పపనులకుఁగావలసినసొమ్మునకు, ఇంజనీరులు వేయునంచనాలకు సంబంధముండదని మీరందఱెఱుంగుదురు. ఈవంతెనకు వారువేసిన యంచనాసొమ్ము నిజముగాఁ గావలసినసొమ్ములో మూడవవంతై యుండెను. దయాస్వరూపిణి యగు జీజీభాయిదొరసానియింజనీరువారు కోరినసొమ్మంతయు(అనఁగానఋవదియేడువేలరూపాయిలు)నిచ్చి తన సంకల్పించిన ధర్మకార్యమునెరవేరుననియువ్విళులూరుచుండ నింజనీరులు సొమ్మంతయు బనిలో మూడవవంతున కేసరిపెట్టికాళ్ళుచాపుకొని కూర్చుండిరి. పనియాగిపోయినదని విని యాయిల్లాలు మరల నిరువది మూడువేలరూపాయిలు నిచ్చి(అనఁగా లక్షపూర్తిచేసి) పని కొనసాగింపు మనియెను. ఆధనముతోఁగూడ కార్యము తుదముట్టకపోవుటచే నామె వెండియుఁ బదివేలరూప్యము లిచ్చెను ఆసొమ్మునుసరిపోకపోవుటచే బొంబాయిదొరతనమువారుహిందూదేశపపాలనము సేయుచున్న ఈస్టిండియాకంపెనీ డైరక్టర్ల కుధనసహాయము సేయుమనివ్రాసిరి. ఆ డైరక్టర్లవద్దనుండియెంతకాలమునకుఁ బ్రత్యుత్తరము రాకపోవుటచేజీజీభాయిదొరసానిగారు మిక్కిలిచింతించియెట్లయినప్రారంభింపఁబడినకార్యము కొనసాగింపవలయుననియదివఱకిచ్చినమొత్తముగాక మరలనొకసారినాలుగువేలు వేరొకసారి యాఱువేలుమఱియొకసారిపదివేలుమొత్తము మీఁదనిరువదివేలరూపాయిల నిచ్చెను. ఈధనముతోనిదివఱకామెయిచ్చినధనమంతయు లక్షముప్పదివేలయ్యెను. చాలకాల మాలస్యముచేసిచేసి యింగ్లాండులోని డైరక్టర్లు ఎట్టకేల కటమీఁద గావలసి

నసొమ్మంతయుఁ దామే పెట్టుకొని యాకార్యము సమగ్రముగఁ జేయింతుమని యానతిచ్చి యాపరికారము పనిచేయించిరి. కాని కొంత సొమ్ము వ్యయము చేసిన తరువాత డైరెక్టర్లు సొమ్ము లేదను నెపమున పని నిలుపు సేయుచున్నట్లు మొన్ననే నాకుఁ దెలిసినది. ఈమాట వినినతోడనే దానము చేయుటకు విసువులేని మాజీజీబాయి దొరసానిగారు మును ఇచ్చిన సొమ్ముగాక వంతెన పూర్తి చేయుటకి ఇరువది రెండు వేల రూపాయిలును గట్లు వేయుటకైదువేల రూపాయిలును దయచేసియున్నది. దయాతరంగిణి యగు నీసాధ్వి యిప్పటికొక లక్ష యేబది వేల రూపాయిల నీయొక్క కార్యమునకే యిచ్చియున్నది. దేశస్థులలో నిరుపేదలు తమకుఁగావలసిన వస్తువులను దాము తెచ్చుకొనజాలరు గావున వారికిం గలుగు లోటుపాటులను సవరించు భారము భాగ్యవంతులది యని యాసాధ్వియభిప్రాయము".

అనియాగవర్నరుగారు కొండొకసేపామెను మఱి కొండొకసేపామె భర్తను వారు చేసిన పాత్రదానములనిమిత్తముఁ గొనియాడి మొత్తము మీఁద జీజీభాయి కుటుంబము వారు ధర్మకార్యముల నిమిత్తము లక్షపౌనులనఁగా నిప్పటి ధరప్రకారము పదునైదు లక్ష రూపాయిలు దానమిచ్చెనని సభ్యులకుఁ దెలిపెను.

1858వ సంవత్సరమున విక్టోరియా దేవిగారు మన దేశమును కంపెనీయధీనమునుండి తన యేలుబడిక్రిందికిఁ దీసికొనినప్పుడు జీజీభాయిగారికి 'బేరొనెట్' అను బిరుదము నిచ్చిరి. ఈగౌరవ మింతకుముందేగాక యిటీవల సయితము మన దేశస్థులలో నెవరికిం గలుగలేదు. దయాసాగరుఁడగు నీమహాత్మ 1859 వ సంవత్సరమున ననఁగా డెబ్బది యాఱేండ్ల ప్రాయమునఁ గాలధర్మము నొందెను.

ఆయన చనిపోయినాఁడను మాటయే కాని చేసిన సత్కార్యముల వలన నిప్పటికి జీవించియున్నాఁడని మనము గ్రహింపవలయును. ఈజీజీభాయి చరిత్రమువలన మనము నేర్చుకొనవలసిన నీతులు కొన్ని యు

న్నవి. అందు మొదటిది స్వతంత్రవృత్తిసంపాదించుకొనుట. మన దేశములోఁ జదువుకొన్న వారందఱు దొరతనమువారి నాశ్రయించియేదో యుద్యోగము సంపాదించి జీవితమంతయు సందులోనేగడుపుచు ననేక బాధలు పడుచున్నారు. అట్లుచేయుటతప్పు స్వతంత్రవృత్తినిసంపాదించుకొనవలయునేకాని యెల్లకాలము దొరతనమువారినేనమ్ముకొనియుండఁగూడదు. జ్ఞానమునిమిత్తముచదువుకొనవలయునుగానియుద్యోగము నిమిత్తము చదువుకొనఁగూడదు. తగినజ్ఞానము సంపాదించుకొనిస్వతంత్రవృత్తి నవలంబించుట పురుషలక్షణము. జీజీభాయియీసిద్ధాంతము నమ్మినవాఁడగుటచే స్వతంత్రవృత్తి నవలంబించి యెన్నియిడుమలకైన నోర్చి యంతటిగొప్పవాఁడయ్యెను.

రెండవది విదేశప్రయాణము. విదేశములకుఁబోవుటతప్పని తలఁచినంతకాలము మన దేశస్థులుదారిద్ర్యముననుభవింపుచునేయుందురు. నిరుపయోగములగు నిబంధనములఁబెట్టుకొని సంకెళ్లుతగిలించుకొన్నవానివలె విదేశములకుఁబోజాలక మన దేశముననే తిరుగుచుండుటచే మనయవస్థ యింతవఱకు వచ్చినది. విదేశములతో యథేచ్ఛముగవర్తకముఁ జేయుటచేతనే జీజీభాయి మిక్కిలి గొప్పవాఁడయ్యెను.

మూఁడవది దాతృత్వము. మన దేశములో దాతలసంఖ్య యధికముగానేయున్నది. కాని యీదాతలందఱు పాత్రాపాత్రము నుచితానుచితము నెఱుఁగక దానములు సేయుచున్నారు. కేవలముబ్రాహ్మణులనిమిత్తమే యుపయోగించు సత్రములకు నెవ్వరికినుపయోగములేని దేవాలయములకు నిమ్మన్నచో మన దేశస్థులు ముందంజవేయుదురు. దిక్కులేనివారికిసత్రములు వేయించుట మొదలగు సత్కార్యములుమన వారిదివఱకెఱుఁగనే యెఱుంగరు. బ్రాహ్మణులు గానివారికి దానము సేయుట పాపహేతువని మనవారికి దురభిప్రాయముగలదు. జీజీభాయిగారి చరిత్రమువలన నట్టిదురభిప్రాయములు పోవుగాక.

# సర్ మంగళదాస్ నాథూభాయి

మంగళదాస్ నాథూభాయి 1832వ సంవత్సరము అక్టోబరు నెలలో బొంబాయినగరమున జన్మించెను. అతఁడు గుజరాతీలలో కపూల్ బనియా తెగలోఁ జేరినవాఁడు. అనగా నొక తెగకోమటియని యర్థము. అతని పూర్వులు కతేవారు ద్వీపకల్పమునందలి గోగ్లాయను పట్టణమునుండి వచ్చి బొంబాయిలో నివసించుచుండిరి. మంగళదాసుయొక్క తాతయగు రామదాసు మనోహరదాసు కాలమున నీకుటుంబము ధనవంతమై ప్రఖ్యాతిఁ గాంచెను. ఇతని తండ్రియగు నాథూభాయి రామదాస్ శెట్టికుమారుఁడు మంగళదాసు పదునొకండు సంవత్సరముల ప్రాయము గలవాఁడై నప్పుడే మృతినొందెను. మంగళదాసు కొంతకాల మాంగ్లేయభాష ప్రారంభించి పాఠశాలలోఁ జదివి తరువాత నొక యుపాధ్యాయునిఁ బెట్టుకొని యింటియొద్ద నింగ్లీషు నేర్చుకొనెను. అతనికి బదునాఱవయేఁట రుక్మిణీభాయి యను నామెనిచ్చి బంధువులు వివాహము చేసిరి. తరువాత రెండు సంవత్సరములకు నసఁగా యుక్తవయస్సు వచ్చిన తరువాత వాని యాస్తి వాని కప్పగించిరి.

చిన్నతనమునుండియు మంగళదాసునకుఁ దనసంఘమునందుఁ బ్రబలియుండిన దురాచారములఁ దొలగించికొన్ని మార్పులు చేయవలెనని తలంపుండెను. కపూల్ కోమటులు చేయు హోళీపండుగలో నాగరికులు చేయఁగూడని మద్యపానాది దుర్వ్యాపారములు పెక్కులుండెను. మంగళదాసు కార్యముల నివారించి పండుగ సలక్షణముగా జరుగునట్లు కొన్ని యేర్పాటులు చేసెను. ఆ యేర్పాటులు మంచివగుటచే జనసమ్మతములుగ నుండెను. గుజరాతీ దేశమున పీఠస్థులగు మతగురువులకు మహారాజులని పేరు. గోముఖవ్యాఘ్రములగు నా మహారాజులు గురువులని పేరు పెట్టుకొని నిజముగా మహారాజులకన్న నెక్కువ భోగము లనుభవించు

చు మతము పేరుపెట్టిశిష్యులకు దుర్నీతులనుబోధించుటయేగాక యెంతమోటవాండ్రయిన సిగ్గుపడవలసిన నీతిబాహ్యకర్మములస్వయముగఁ జేయుచుందురు. ఈగురువులందఱుఁ వల్లభాచార్యమతస్థులు. ఈయాచార్యులుచేయు దౌర్జన్యములు చూచి సహింపలేకమంగళదాసు వారి దుర్మార్గములబయలుపెట్టఁదలఁచెను. అతనితలంపున కనుకూలముగఁ నా కాలమున కెరసస్ దాస్ మూల్జీయను యథార్థవాదియొకఁడుబయలు దేరి సత్యప్రకాశికయను నొకపత్రిక స్థాపించియందులో నీమహారాజులు చేయునీతిమాలినపనులను వెల్లడింపుచురాఁగా మంగళదాసు వానికిఁదోడ్పడి కుడిభుజమయి పనిచేసెను. ఆమహారాజులలో నొకఁడుమూల్జీగారిమీఁదఁ బ్రతిష్టానష్టమునకు వ్యాజ్యము తేగానప్పుడు నాథూభాయి వానికభయమిచ్చి వేయివిధముల కనిపెట్టుటయేగాక తానువానిపక్షమున సాక్ష్యముఁగూడ నిచ్చెను. మంగళదాసుసాక్ష్యము నేరమునువిచారించినజడ్జిలకు మంచియభిప్రాయమును గల్గించెను. అందుచేత తీర్పువ్రాయునప్పుడు జడ్జిలలో నొకరిట్లనిరి. "తనమతములోఁ జాలదురాచారము లున్నవని దృఢమయిననమ్మకముతనమనస్సులో లేనిపక్షమున మంచిస్థితియుగౌరవమునుగల మంగళదాసువంటి పెద్దమనుష్యుఁ డుకోర్టుకువచ్చి, కులస్థులయొక్కయు బంధువులయొక్కయు దూషణకైననోర్చి యేల సాక్ష్యమిచ్చును." అదివఱ కతనివర్ణమునకు వంశపరంపరగా వచ్చునట్టికులపెద్ద యొకఁడుండెను. వర్ణపుఁగట్టుబాటులలో నతఁడెంత చెప్పిన నంత జరుగుచువచ్చె. వర్ణవ్యవహారము లెల్ల నొక్కమనుష్యునిపెత్తనముమీఁద నుంచుట మంచిదికాదనియాతఁడుకులస్థులనందఱఁ జేర్చి, కులపెద్దవంశపరంపరగా వచ్చుటయనుచితమని చెప్పి, యెప్పటికప్పు డొకపెద్దనేర్పఱచుకొమ్మనియుపదేశించి తనమాట వారందఱువినునట్లుచేసెను. అంతతోఁబోనీయక వెనుకపెత్తనముఁ జేసిన సెట్టిమీఁద వ్యాజ్యము తెప్పించి యతనియొద్ద ధర్మవ్యయమునిమిత్త

మున్న సొమ్ముతీసికొనికులస్థులుధర్మమునిమిత్తమిచ్చినసొమ్ము యెక్కువమంది యభిప్రాయము ననుసరించి వ్యయముచేయవలసిన దేకానియొక్కకుల పెద్దమాటచొప్పుననే జరుగఁగూడదని యేర్పాటుచేసెను. మంగళదాసు నాథూభాయికి మొదటినుండియువిద్యాభివృద్ధిఁ జేయవలెనని యభిలాష గాటముగానుండెను. 1862వసంవత్సరమున బొంబాయిపురవాసులగు కొందఱు పెద్దమనుష్యులు మగపిల్లల కొక పాఠశాల స్థాపింపఁదలఁప దాని కాతఁడు సహాయముచేసెను. హిందూదేశములోఁ బెద్దపరీక్షలయందుఁగృతార్థులయిపిదపవిదేశములయందుఁజదువ నుద్దేశించువారినిమిత్తమతఁడిరువదివేలరూపాయిల బొంబాయియూనివర్సిటీ వారికిచ్చెను. 1864 వ సంవత్సరమునమంగళదాసుభార్యమృతినొందెను. ఆమెజ్ఞాపకార్థ మతండుకళ్యాణనగరమున నేఁబదివేలరూపాయిలవ్యయముచేసి యొకధర్మవైద్యశాలఁగట్టించిదానిఖర్చులనిమిత్తము మఱియిరువదివేలరూపాయిలుదొరతనమువారిచేతికిచ్చెను. పునహానగరములో డేవిడ్ సాసూ ననువారుకట్టించిన ధర్మవైద్యశాలలోగతిలేనిహిందూస్త్రీలనిమిత్త మొకభాగము మూడువేలు కర్చుపెట్టి మంగళదాసు కట్టించెను.

1860 వ సంవత్సరమునగవర్నమెంటువారు క్రొత్తగావచ్చుబడిపన్ను (అనఁగా ఇన్‌కంటాక్సు) ప్రజలమీఁద వేసినప్పుడా విషయమయిన సంగతులువిచారణచేయుట కీతని కమీషనరుగా నియమించిరి. కాని యాపన్నెట్లు వేయవలయునను నభిప్రాయములోనితనికిఁదక్కిన కమీషనర్లకునుసరిపడనందున నతఁడాపనిని స్వల్పకాలములోనేమానివేసెను. మంగళదాసునకు రాజకీయవ్యవహారములయందుఁగూడఁజాల నభిలాషకలదు. అట్లుండుట చేతనే యతఁడు 1867 వ సంవత్సరమున 'బోంబె ఎసోసియేషను' అనునొకసంఘమునుస్థాపించెను. ఈసంఘము యొక్క ముఖ్యోద్దేశము హిందూదేశస్థులకు రాజకీయవ్యవహారముల

యందభిరుచి పుట్టించుటయే. ఈకార్యములుచేయుటచేతనతఁడుప్రజలవి శ్వాసమునకుఁబాత్రుఁడయిబొంబాయిగవర్నరుగారి యాలోచనసభ లోసభ్యుఁడుగాఁబ్రజలవలననేర్పరుపఁబడియెనిమిదిసంవత్సరములాపని చేసెను. ఆకాలములో జరుగుప్రతివిషయమునుగూర్చియతఁడు గాఢముగాఁ జర్చించుటయేగాక ప్రజాక్షేమముగూర్చి యధికారులతో నిర్భయముగఁ బోరాడుచువచ్చెను. 1874 వ సంవత్సరమున మంగళదాసుదేహారోగ్యము సరిగాలేక నాపని మానుకొనినప్పుడుబొంబాయిగవర్నమెంటువారీక్రిందియుత్తరమును వ్రాసిరి.

"మీరు గవర్నరుగారి యాలోచనసభలోఁజిరకాలముకష్టపడి పనిజేసి యిప్పుడుమానుకొనుచున్నందున లోకోపకారార్థముగమీరు చేసినపనినిగూర్చి మేముప్రశంసజేయకపోవుట పాడిగాదు." 1872 వ సంవత్సరము 1వ మేతారీఖునబొంబాయిగవర్నరుగారగుసర్ సేమోరీఫిర్జరాల్డుదొరగారు మంగళదాసునకు సి. ఎస్. ఐ. అను బిరుదము నిచ్చుచు నీక్రిందివిధముగాఁ జెప్పిరి.

"మంగళదాసుగారూ! ఈబిరుదమునకుఁదగినయుత్తమపురుషుల పేళ్ళు కొన్ని తెలియఁజేయుమనిపై యధికారులునన్నుఁగోరఁగా నేను శ్రీవిక్టోరియామహారాజ్ఞిగారికి సంతోషపూర్వకముగా మీపేరు వ్రాసి పంపితిని. దయాస్వరూపిణియగు శ్రీవిక్టోరియామహాదేవిగారునాచేసిన విన్నపమునాదరించినారు. మీస్వతంత్రప్రవర్తనముమీలోకోపకారపరాయణత మీరీబిరుదునకుఁదగుదురని ఋజువుచేసినవి. అందుచేత నెంతోసంతోషముతో నే నీబిరుదములను మీకిప్పుడుసమర్పించుచున్నాను. ఈబిరుదులు చిరకాలమువహించుటకు భగవంతుఁడుమీకాయురారోగ్యము లొసంగుగాక!" 1875 వ సంవత్సరమున విక్టోరియారాణిగారు వానికి సర్ అనుబిరుదము నిచ్చిరి. ఈబిరుదుపొందినహిందువుల లోనితఁడేమొట్టమొదటివాఁడు. ఆసంవత్సరమందే విక్టోరియారాణిగా

రి జ్యేష్ఠపుత్రులునుమనప్రస్తుతచక్రవర్తిగారు నగు ఎడ్వర్డుగాగప్పుడు యువరాజుగానుండి మనదేశమునుజూడవచ్చి బొంబాయినగరమునకు భోయి మంగళదాసుయొక్క యిద్దఱుకుమారుల వివాహమహోత్సవ కాలమునను స్వయముగవచ్చి వానిని గౌరవించెను. యువరాజుగారు స్వయముగ నింటికివచ్చిన గౌరవము హిందువులలో మంగళదాసునకుఁ దప్ప మఱి యెవ్వరికిని లభింపలేదు. మంగళదాసు నింటికి వివాహము నిమిత్తమువచ్చిన చుట్టములందఱు మహానందభరితులయిరి. తనకుం గలిగిన యీయపూర్వగౌరవముచేత మహానందభరితుండయి మంగళ దాసు తనకృతజ్ఞతను యువరాజునకుఁ దెలుపుకొనెను. యువరాజునుజూ చుట కాసమయమున వర్తకులనేకులు వచ్చిరి. ఆవచ్చినవారిలో లక్షా ధిపతులు కోటీశ్వరులు నగువారిం గొందఱిని యువరాజునకుఁ జూపి పి మ్మట వానికత్తరు పన్నీరు తాంబూలము లిచ్చి వారిని పంపెను. ఆస మయమున మంగళదాసునియింట పువ్వులు కుప్పలుతిప్పలయి పడెను. తనయింట జరిగిన వివాహము యువరాజదర్శనమునను నీ రెండుసంగతు లజ్ఞాపకార్థము మంగళదాసు బొంబాయినగరములో నిరువదియైదువేల రూపాయిలు మూలధనముతో నొకసత్రము వేసెను. ఆమూలధనము పేరు సర్ మంగళదాసునాథూభాయికపూలుని రాశ్రియల్ నిధి. అది గాక మఱి యిఱువదియైదువేలరూపాయిలు మూలధనమిచ్చిగుజరాతీ కోమటుల యందఱి యుపయోగమునిమిత్తము వాకేశ్వర యను గ్రామమున నొక యన్నసత్రము వేయించెను.

1877 వ సంవత్సరమున శ్రీయువరాజుగారు హిందూదేశమును జూచినందుకు కొందఱిని గౌరవింపఁదలఁచి దొరతనమువారు కొన్ని వెండిపతకములు చేయించి యందొకదానిని మంగళదాసున కిచ్చిరి. ఆపతకమును మంగళదాసున కప్పటి బొంబాయి గవర్నరుగారగు సర్ రిచార్డ్సుటెంపిల్ దొరగారు స్వయముగా సమర్పించుచునాసమయమున

 

నిట్లని చెప్పెను. "శ్రీరాణీగారిచే నీయఁబడిన యీపతకమును మంగళ దాసునకు సమర్పించుట కింతకన్న మంచిసమయము దొరకదుగనుక నిప్పుడేయీమిత్రులయెదుట దీని నిచ్చుచున్నాను. అతని నిదివఱకే నెఱిఁగియుండిన యీ తెల్లదొరలయొక్కయు స్వదేశస్థులయొక్కయు సముఖమున మంగళదాసు దేశమునకు, బొంబాయినగరమునకుఁ, దనసంఘమునకుఁ జేసినయుపకారములను వానియౌదార్యమును వారిమన శ్శుద్ధిని వేరేనేను వేయినోళ్ళఁబొగడ నక్కరలేదు. ఇంగ్లీషువారియధీన ములోనున్న హిందూస్థానములోనెల్ల శ్రేష్ఠమైనది గుజరాతీ దేశము. ఆదేశస్థులలో మిక్కిలి గొప్పదియగు కోమటి తెగలోఁ జేరినవాఁడు మంగళదాసు. అతనిసంఘమునకునతను తగినప్రతినిధియని మీరందఱు నొప్పుకొనఁదగినయంశమే. గడచిననూరుసంవత్సరములనుండివానిపూర్వులు దొరతనమువారిచేతఁబ్రజలచేతఁ జాల గౌరవింపఁబడుచున్నారు. ఏటేటవారియైశ్వర్యము వృద్ధియగుచున్నది. ఇతఁడు బొంబాయిసంఘమునకుఁబ్రధానపోషకుఁడు. ఈయనబొంబాయిరాజధానికి వెనుకటి గవర్నరుగారగుసర్ బార్టిల్ ప్రియర్ గారి యాలోచనసభలో నెనిమిదేండ్లు సభ్యుఁడుగానుండెను. అతఁడుదానములు సేయునప్పుడుకుడిచేయియిచ్చిన దాని నెడమచేయి నెఱుఁగదన్నట్లుదానము సేయువాఁడు. కళ్యాణనగరమునకట్టించిన ధర్మవైద్యశాలయు, బొంబాయినగరమునస్థాపించిన బాలికా పాఠశాలయు వానియౌదార్యమును ఘోషించుచున్నవి."

ఈమంగళదాసునాధూభాయి ఆ 1890వ సంవత్సరమునలో కాంతరగతుఁడయ్యెను. అతను మృతినొందునప్పుడొక్కమరణశాసనము వ్రాసి యందురమారమి యెనిమిదిలక్షలరూపాయిలు ధర్మకార్యములనిమిత్తము వ్యయముచేయుమని నియమించెను. అందు ముఖ్యదానములివ్వి. వాకేశ్వరగ్రామమునొద్దధర్మవైద్యశాలఁగట్టించుటకుడెబ్బదివేలరూపాయలు. వానిపేరస్థాపింపఁబడిన బాలికాపాఠశాలకు రెండు

వేలరూపాయలు. తనతెగకోమటులలో బీదలకు సాయము చేయుటకు వేయిరూపాయలు. వాకేశ్వరధర్మశాల మరమ్మతుచేయుటకయిదు వేలరూపాయలు. ఇంగ్లాండునకుబోయి చదువుకొను హిందూవిద్యార్థులనిమిత్తము దివఱకిచ్చిన ఇరువదివేలుగాక మఱియుఁ గొంతధనమిచ్చినట్లు మరణశాసనములో వ్రాసెను.



# గోకులదాస్ తేజపాలు

గుజరాతిదేశములో ప్రసిద్ధమగు కచ్చి యనుసంస్థానముగలదు. అందు కొఠారాయను చిన్నగ్రామము గలదు. ఆగ్రామమునం దొక బీదకుటుంబమున నిద్దఱుబాలురుపుట్టిరి. అందొకఁడు 1793 వ సంవత్సరమున జన్మించెను. రెండవయతఁడు 1798 వ సంవత్సరమునఁ బుట్టెను. అందు జ్యేష్ఠుఁడగు నాంజి పదియేండ్లప్రాయముననే తనపొట్టపోసికొనుటకు బొంబాయికిఁ బోవలసివచ్చెను. పాప మతఁడు పగలు వీథులవెంబడితిరిగి గుడ్డలమ్ముకొని రాత్రియొకయింటికిఁ గావలిపండుకొనిజీవయాత్ర గడపనారంభించెను. ఎన్నియవస్థలఁ బడినను రోజుకూలియైనసరిగా గిట్టకపోవుటచే నతఁడు చాలశ్రమపడుచు వచ్చెను. అతని తమ్ముఁడగు తెజపాలు రెండేండ్లతరువాత బొంబాయికిఁబోయి యన్ననుకలిసికొనియె. అతఁడుకూడఁ జాలపరిశ్రమ జేసి తన యిరువదియవయేట వర్తకుఁడయిస్వతంత్ర వ్యాపారముఁచేసి ముప్పదివేల రూపాయిలు గడించి రమారమి ముప్పదియైదేండ్లప్రాయమున ననఁగా క్రి. శ. 1833వ సంవత్సరమున కాలధర్మమునొందెను. మృతినొందునప్పటికినతనికిరమారమి పదునొకండుసంవత్సరములు వయసుగల కుమారుఁ డొకఁ డుండెను. అతఁడే గోకులదాసు తెజపాలు. ఆబాలుని దురదృష్టముచేతఁ దండ్రి పోయినకొలదికాలములోనే పెదతండ్రియగు నాంజికూడ లోకాంతరగతుఁడయ్యెను. మరణమొందునప్పటికి నాంజియొద్ద మూడులక్షలరూపాయి లుండెను. నాంజీకిఁగూడ బిడ్డలులేకపోవుటచే వానిధనమంతయుగోకులదాసునకే జెందెను. ఈగొప్పయాస్తిని సరిగాఁ జక్కఁబెట్టుటకు వానితండ్రియుఁ బెదతండ్రియు సంరక్షకు నెవ్వాని నేర్పరచిపోవలేదు. స్వయముగా జక్కఁబెట్టుకొనుటకు వానికిఁ దగినవయసుగాని విద్యగాని లేదు. ఐనను వానితల్లిమిక్కిలిబుద్ధిశాలిని యగుటచే బాలుఁడుచెడిపో



గోకులదాసు తేజపాలు.

వకుండ ధనము క్షయముగాకుండ నెంతయు జాగరూకతతో మెలంగి ప్రాయము వచ్చినతరువాత ద్రవ్యమంతయుఁ బుత్రునకప్పగించెను. అది మొదలతఁడు వ్యాపారములయందు మిక్కిలి శ్రద్ధాళువై ధనవృద్ధి జేయుటయేగాక సంఘమున కెంతో యుపకారి యయ్యెను. అతఁడు యావజ్జీవము విదేశములకు సరకు లెగుమతి సేయుటయు నచ్చటినుండి వచ్చినసరకులు స్వదేశమునకు దిగుమతీ సేయుటయు ముఖ్యవ్యాపారముగఁ బెట్టుకొనెను. ఇతఁడు గుజరాతీలలో భట్టియాకులస్థుఁడు. ఆ తెగలో భాగ్యవంతులగువారు తప్పక వస్త్రములయంత్రములనో మఱియే యితర యంత్రములనో తెప్పించి వ్యాపారము సేయుచుందురు. ఇతఁడో వారిమార్గమునను సరింపక క్రొత్తపుంత ద్రొక్కెను. అతఁడు చేసిన ప్రతివ్యాపారమున వానికి లాభము విశేషముగ వచ్చెను. ఎంతధనమును సంపాదించినను గోకులదాసు ధనగర్వమునందక సర్వజనసులభుఁడయి యెల్లవారికిష్టుడై యుండెను. అతఁడు సంఘసంస్కరణమునందభిలాషకలవాఁడని చెప్పుదురు గాని యీవిషయమున జెప్పఁదగినపని యెద్దియు జేసినట్లు కనఁబడదు. ఇతఁడు ముఖ్యముగ దానమునకు బ్రసిద్ధికెక్కెను. 1854వ సంవత్సరమున నతఁడు మొట్టమొదట జన్మభూమికిఁ బోయి యచ్చటనున్న తన తెగవారి యుపయోగమునిమిత్తము లక్షరూపాయలనొక్కమారే దానముచేసెను. ఆమరుచటిసంవత్సరమే గోకులదాసు తీర్థయాత్రలు సేయఁబోయి యాపుణ్యక్షేత్రములలో గొన్నిచోట్ల చెఱువులు త్రవ్వించి, కొన్నితావులసత్రములు గట్టించి కొన్నియెడల నన్నప్రదానములు సేయించి మొత్తముమీఁద ధర్మకార్యముల నిమిత్తము రెండులక్షలరూపాయిలు వ్యయపరచెను. అక్కడనుండివచ్చి గోకులదాసు బొంబాయిలోనున్న గుజరాతివారి విద్యాభివృద్ధినిమిత్తము రెండుపాఠశాలలు స్థాపించెను. అవిగాక బొంబాయిలో నతఁడొక ధర్మవైద్యశాల పెట్టించి దానిపోషణము నిమిత్తము లక్షయేబదివేలరూపాయల నిచ్చెను. ఆవైద్యశాలకు నింక

నుగావలసిన కర్చులుబొంబాయి మునిసిపాలిటీవారు దొరతనమువారు వహించి గోకులదాసు పేర దానినిప్పుడు జరపుచున్నారు.

బొంబాయిలో నున్న గొప్పవైద్యశాలలు మూఁడు. అందులో గోకులదాసు తెజపాలుగారి దొకటి. ఈదానములుగాక గోకులదాసు తనమరణశాసనములో మఱికొన్ని సత్కార్యముల నిమిత్తము ధనదానము చేయవలసిన దని మిక్కిలి విస్పష్టముగా వ్రాసెను. ఈ మరణశాసనము మిక్కిలిబాగుండుటచే నేఁటికిని బొంబాయిలో మరణశాసనములు వ్రాయఁదలంచువా రనేకులు దీనినే మాదిరిగా పుచ్చుకొని వ్రాయుచుందురఁట. దాని కింత ప్రసిద్ధివచ్చుటకుఁ గారణమేమన దానిలో రెండు గొప్పవిశేషము లున్నవి. అందు మొదటిది ఆమరణశాసనమునుఁ బట్టి తదనంతరము ధర్మకార్యములు జరుపువా రేధర్మమెట్లు జరుపవలయునో దేని కేయేసాధనసామగ్రులు కావలయునో యాయానిబంధన లన్నియు నందు విస్పష్టముగాఁ జెప్పఁబడియున్నవి. అందుచే దాతయొక్కముఖ్యోద్దేశమెప్పుడు జరుగక తప్పదు. రెండవది ఆశాసనములో గోకులదాసు తన బంధువులకు తనయొద్ద పనిచేసిన సేవకులకు తన్ను నమ్ముకొనియున్న యనుజీవులకు మరచిపోక వేరువేరుగ నొక్కొకనికి గొంతసొమ్మియ్యవలయు నని వ్రాసెను. ఆ శాసనములందు మొట్టమొదట చిరకాలము తన్ను సేవించినపరిచారకునకు దనయనంతరమున శ్రార్ధకర్మచేయించు బ్రాహ్మణునకుఁ దనకుఁ జాలకాలము వండిపెట్టిన వంటవానికిఁ బూర్వము తనయొద్ద సేవకుఁడయియుండి మృతినొందిన యొకవృద్ధునికుమారుల కిద్దఱకు మొత్తముమీఁద నలువదియాఱువేలరూపాయ లిమ్మని వ్రాసెను. అవి మొదటవ్రాసి తరువాత రెండు సంస్కృతకళాశాలల స్థాపించుటకు నందలివిద్యార్థుల కన్నముపెట్టుటకు నొకచెరువు త్రవ్వించుటకు నొక ధర్మశాల కట్టించుటకు నొకలక్ష పదునెదువేలరూపాయ లిమ్మని

మెను. పిమ్మట ననేకధర్మకార్యములనిమిత్తము గోకులదాసు రమారమి నెనిమిదిలక్షలరూపాయ లిమ్మనివ్రాసి పరిశిధర్మకార్యము నిర్విఘ్నముగా సాగునట్టు లేర్పాటులు చేసెను. ఈమొత్తములో తొబ్బది మైదువేలరూపాయలు వేరుగానుంచి దానిమీఁద వచ్చినవడ్డీతో నిద్దఱు గుమాస్తాలను, ఒక కార్యదర్శి (సెక్రటరి) ని వేయవలసినదనియు తాను జేసిన ధర్మకార్యము లన్నియు సరిగా జరుగుచున్నవో లేవో చూచుటయుఁ దాను ధర్మార్థమిచ్చినసొమ్ము లెఖ్ఖలుసరిగావ్రాయుటయు వారిపనిగా నుండవలసినదనియు, నతఁడు శాసనములో వ్రాసెను. ఆకార్యదర్శి సంవత్సరాంతమున లెఖ్ఖలన్నియు దొరతనమువారి గణికులచేత సరిజూపించి యింగ్లీషుభాషలోను గుజరాతీభాషలోను తప్పక యాలెక్కలను ప్రకటింపవలసిన దనికూడ నతఁడు నియమించె. దగ్గఱచుట్టములను దూరపుచుట్టములను సరిగ జ్ఞాపకముంచుకొని యెవ్వరెవ్వరి కెంతధన మియ్యవలయునో యంతధనము నిచ్చి వారిలో సంతానములేని స్త్రీలకు యావజ్జీవమనుభవించునట్లు స్వాతంత్ర్యమిచ్చి తక్కినవారికి సంపూర్ణ స్వాతంత్ర్యమిచ్చి గోకులదాసందఱిమెప్పులవడసెను. ఇవన్నియువ్రాసి కడపట నతఁడు తన యుత్తరక్రియలకు భార్యశ్రాద్ధములకు నొకవేళ తానే ముందుగాఁ బోయినయెడల తనతల్లిపరలోకక్రియలకుఁ దగినయేర్పాటులు చేసెను.

ఈమరణశాసనము వ్రాయునప్పటికి గోకులదాసునకు నలువదియైదవ సంవత్సరము. ఏవిధమైనవ్యాధియు లేక యతఁడు మంచి యారోగ్యము కలిగియుండెను. ఆశాసనము వ్రాయవలసినయవసర మేమియు లేకపోయినను గోకులదాసు "దేహము లస్థిరము లెటుపోయి యెటువచ్చునో ముందేవ్రాసియున్న మంచి" దని సుఖముగా నున్నపుడె దానిని లిఖించెను. కాని దైవవశమున నదివ్రాసిన సంవత్సరముననే గోకులదాసున కొకవ్యాధి ప్రవేశించి యేచికిత్సలకు లొంగక

తుదకాయుదారచరితుని నెత్తుకొనిపోయెను. గోకులదాసు మహాదానములనిమిత్తము వ్యయము చేసిన ధనముగాక మృతినొందునప్పటికతనియొద్ద ముప్పదియేడులక్షల రూపాయిలుండెను. కాని పాప మతనికిఁ బురుషసంతానము లేకపోవుటచే భార్యకు బెంచుకొమ్మని యధికారమిచ్చెను.

ఎంత కట్టుదిట్టముగ వ్రాసినమరణశాసనములైనను వివాదములు లేకయుండవు కదా. అట్లే,గోకులదాసు మరణశాసనవిషయమునఁ గూడ ప్రారంభమున గొన్నివివాదములు సంభవించెను. కావున నీ వివాదములువచ్చుటచేత సొమ్ము ధర్మకర్తలచేతికి వచ్చునప్పటికిఁ గొంతయాలస్య మయ్యెను. కాని యాయాలస్యముకూడ కొంత మేలేయైనది. ఏలయన తగవులన్నియుఁ దీరునప్పటికి కర్చులతోను వడ్డీతోను సొమ్ము పదునైదులక్షలయ్యెను. గోకులదాసు చేసిన ధర్మకార్యములన్నిఁటిలో మిక్కిలి యెన్నఁదగిన దొక్కటియున్నది. అదియిది. చదువుకొనఁదలఁచు బీదవిద్యార్థులకు భోజనశాలయొకటి యతఁడేర్పఱచెను. అందులో నిరువదియెనమండ్రు విద్యార్థుల కన్నము పెట్టి జీతములు పుస్తకములు కట్టుబట్టలుమొదలగున విచ్చి పట్టపరీక్షయందుఁ గృతార్థులగువఱకు వారికిఁ జదువు చెప్పించున ట్లేర్పాటులు చేయఁబడినవి. అతఁడు స్థాపించిన పాఠశాలలు ముఖ్యముగా నైదున్నవి. ఒక సంస్కృతకళాశాల యొక బాలికాపాఠశాల మగపిల్లల నిమిత్తము మూడింగ్లీషుపాఠశాలలు. ఈ యయిదు పాఠశాలలలోఁ జదువుకొను పిల్లలసంఖ్య 1,200లు. వీరిలో నూటికిరువది యయిదుగురికి ధర్మార్థము చదువు చెప్పఁబడును. ఇదిగాక తన జన్మదేశమగు కచ్ఛిలోఁ జిన్నవి పెద్దవికలిసి మఱియాఱు పాఠశాలలుకలవు. అందొకదానిలోబాలురకు సంస్కృతము మాత్రమే నేర్పఁబడును. ఇవి యన్నియుఁగాక శాస్త్రపు పరీక్షకు ప్లీడరు పరీక్షకు వైద్యశాస్త్రపరీక్ష

లకుఁ జదువుకొనఁగోరు విద్యార్థులకు సాయముచేయు నిమిత్తము కొంత మూలధన మతఁ డిచ్చెను. ఈపరీక్షలకుఁ జదువుకొనఁదలంచి వచ్చినవారిలోఁ దన తెగ వారగు భట్టియాలకే యెక్కువ ప్రాముఖ్యత నీయవలసిన దని యతఁడు వ్రాసెను. ఇట్లు విద్యాదానము నిమిత్తము సదుపాయములు పెక్కులుచేసి యూరకొనక దేవస్థానములు మొదలగువానికిఁగూడ నతఁడు కొంతధన మిచ్చెను. అందు ముఖ్యముగా నొక దేవాలయమునకు కొంతధనమిచ్చి యేటేట నచ్చట నుత్సవములు మహావైభవముతో జరుగునట్లు నియమించెను. భట్టియాశాఖలోఁ జేరిన దిక్కులేని వితంతువులను దలిదండ్రులులేని బీద బాలురను బోషించునిమిత్తము దిక్కులేని యాఁడుపిల్లలకు వివాహములు సేయునిమిత్తమును గతిలేనివారికి మరణానంతమున శ్రాద్ధకర్మలు జరపు నిమిత్తమును గోకులదాసు ప్రత్యేకముగా లక్షయేఁబదివేల రూపాయలిచ్చి దానివడ్డితోఁ బయిన చెప్పిన కార్యములు సేయుమనియెను.

బొంబాయినగరమున ధన మెంతయున్నదో ధర్మము నంతే యున్నది. ఎందరెందరో ధనవంతులు విశేషదానముల నిచ్చిరిగాని దీనులకు నెల్లవారలకు నత్యంతోపయుక్తముగా నుండునట్టిధర్మములు గోకులదాసు చేసిన ట్లెవరును జేయలేదు. ఈగోకులదాసు తెజపాలుయొక్క పేరు గుజరాతీ దేశమున నెఱుఁగనివారులేరు. అతనిపేరు చెప్పుకొనని యిల్లులేదు. ఆతని నామస్మరణముచేత నొకదానమైన చేసి యెఱుఁగని మహాకృపణులుసైతము ఔదార్యము గలవారై తెగించి తమ యర్థమున కొంతభాగము దానముచేయకమానరు. భరతఖండము గర్భమున బుట్టిన బిడ్డలలోఁ దన సత్కార్యములచేత నిజముగా జరితార్థుఁడయిన పురుషుఁడీతఁడే యని చెప్పవచ్చును.

# కృష్ణదాస్ మూల్జీ

ఇతఁడు 1832వ సంవత్సరము జూలై 25వ తారీఖున జన్మించెను. ఈతని పసితనమునందే తల్లి కాలధర్మము నొందుటచేఁ దండ్రి రెండవపెండ్లి చేసికొని మాతృహీనుఁడగు నీబాలకుని బెంచుమని తనతోఁబుట్టువు కప్పగించెను. ఈకృష్ణదాసు మేనత్త సంరక్షణలోనుండి బొంబాయిలోని యెల్ఫిన్‌స్టన్ కళాశాలలో విద్య నేర్చుకొనుచుండెను. ఆకాలమున నతఁడు రమారమి యిరువదియొక్క సంవత్సరము వయస్సు గలవాఁడై నప్పుడు వానివిద్య కంతరాయము సంభవించెను.

గుజరాతి దయాన్ ప్రసారిక మండలి యను నొకసభ గుజరాతులో నేర్పడి స్త్రీపునర్వివాహవిషయమున మంచి యుపన్యాసము వ్రాసిన వానికి నూటయేబదిరూపాయలు బహుమాన మిచ్చునట్లు ప్రకటించిరి. కృష్ణదాసు తద్బహుమానమును సంపాదింపవలయునని యుపన్యాసము వ్రాయ మొదలుపెట్టెను. కొన్నిపుటలువ్రాసిన తరువాత వాని వ్రాసినకాగితము లెవరో వానికిఁ దెలియకుండ దీసికొని మేనత్తకుఁ జదివి వినిపించిరఁట. పూర్వాచారములపై నత్యంతభక్తి గలయాయవ్వ యావ్రాతలు వినినతోడనే పిడుగడచినట్లు నిశ్చేష్టయయి స్త్రీలకు పునర్వివాహము చేయుట మంచిదని వ్రాసినపరమదుర్మార్గుని దా నన్నవస్త్రములిచ్చి పెంచుటయు మహాపాతకమేయని తక్షణమే వాని నింటనుండి యావలకు వెడలనడచెను. కృష్ణదాసున కిది పెద్దదెబ్బ. దీనిచేనతఁడు నిరాధారుఁడయి యన్నవస్త్రములిచ్చువారే లేకపోవుటచేఁ జదువుసయితము మానుకోవలసి వచ్చెను. అతఁడు కొంచెము పశ్చాత్తాపమునొంది యుపన్యాసము వ్రాయుట మాని తనయభిప్రాయములు [illegible] మేనత్తతోఁ జెప్పిసరిపుచ్చ

కొన్నపక్షమున నతఁ డెప్పటియట్ల నామె యనుగ్రహమునకుఁ బా త్రుఁడయి యుండును. కాని కృష్ణదాసుఁ డట్లుచేయువాఁడు కాఁడు. సంఘసంస్కరణాసక్తి వానిహృదయమునం దగ్నిహోత్రమువలెఁ బ్ర జ్వలించుచుండుటచేత నతఁడు మిగులధైర్యము నుత్సాహము గలిగి తననమ్మినయది సరియని యామార్గమునుండి తొలఁగ ననిచెప్పెను.

మిక్కిలి యవసరములగు నన్నవస్త్రములకే యతఁ డిబ్బంది పడుచుండుటచే నేదయినయుద్యోగము సంపాదింపఁదలంచి గోకుల దాసు తెజపాలుగారి పాఠశాలలో నుపాధ్యాయత్వము సంపాదించి కొంత మనశ్శాంతిగలిగి సంఘసంస్కరణము నభివృద్ధిజేయుటకై పూ నుకొనెను. ఆకాలమున బొంబాయిలో స్వదేశవార్తాపత్రికలు మి క్కిలిహీనస్థితిలో నుండెను. వానిని నడుపువారు తగినంత జ్ఞానముగా ని లోకానుభవముగాని లేనివా రయియుండిరి. పారసీలు నడుపు ప త్రికను తప్పులతడికలయి నీచపదప్రయోగములు గలిగి గుజరాతి భా షలోను నింగ్లీషుభాషలోను బ్రకటింపఁబడుచు వచ్చెను. ఈస్థితినిఁజూ చి వార్తాపత్రికలదురవస్థను తొలఁగించుటకు విద్యావంతులు లోకో పకారులు నగుకొందఱు పారసీలు "రాస్టుగాఫ్తర్" యను గుజరాతి పత్రికను బయలుతీసి నడిపింపఁజొచ్చిరి. దాని నసమానముగఁ జేయ వలయు నని తత్ప్రవర్తకులు సంకల్పించుటచే కృష్ణదాసుకూడ వారి కి సాయము చేయఁదలంచి కొన్నివిషయములువ్రాసి తాను పత్రికకుఁ బంపుచుండెను. కాని యప్పుడప్పు డితరులపత్రికకుఁ దానువ్రాసి పం పుచుండుటయు వా రనుగ్రహించి తనవ్రాతలు పత్రికలో వేయుట యు నతని కంతగా నిష్టములేదు. సంఘసంస్కరణమును గూర్చియు మతసంస్కరణమునుఁ గూర్చియుఁ దనకుఁ గల యభిప్రాయములన్ని యు స్వపత్రికలోనే వెల్లడింపవలయు నని సత్యప్రకాశిక యను పత్రి కను నడపింప ప్రారంభించిం మనోరథసిద్ధి చేసికొనియెను.

కృష్ణదాసు వార్తాపత్రికను నడుపుటకుఁ దగిన సామర్థ్యమును నస్వాతంత్ర్యము లోకానుభవము గలవాఁడగుటచేఁ బత్రిక మంచిదశకు వచ్చెను. హిందువుల సంఘములోఁ జిరకాలమునుండి కాపురముండి బయలుపడకుండ సంఘమును నాశనముచేయుచుండిన దురాచారముల నతఁడు పత్రికాముఖమున బయలుపుచ్చి యపహాస్యముల పాలుచేయుచుండుటచే హిందువు లందరిలోను ముఖ్యముగా భట్టియాలలోను వైశ్యులలోను మిక్కిలి కళవళముపుట్టెను. బొంబాయిలోనుండు వైశ్యులు భట్టియాలు వాణిజ్యాదులు చేయుటలోబుద్ధిమంతులే యయినను సంఘమతవిషయములలో మూర్ఖులయి గురువులకు బానిసలయి వారుగీచినగీటు దాఁట వెఱచి నీచముగ బ్రదుకుచున్నారు. ఈగురువులు మన దేశమునం దున్న గురువులవలె స్వాములవారలు సన్యాసు లని పిలువంబడక మహారాజు లనిపిలువఁబడుదురు. పేరునకు వారు సన్యాసు లయినను నిజముగా మహారాజులకంటె నెక్కువ భోగములను వైభవములను ననుభవించుచుందురు. ఈగురువులు శ్రీకృష్ణుని యవతారములని శిష్యజనులు నమ్మి భ్రష్టు లగుచున్నారు. ఈమతమువల్లభాచార్యమత మని చెప్పఁబడును. ఇదియొకవిధమయిన వైష్ణవమతము. దానిస్థాపకుఁడు వల్లభాచార్యుఁడు. ఈతఁడిప్పటికి రమారమి నాలుగువందల యేండ్లక్రిందట నుండినవాఁడు. ఈయన కొంతకాలము దక్షిణదేశము తిరిగి పిదపఁ బశ్చిమమునకుఁబోయిగుజరాతుదేశమున నొక వైష్ణవమతము స్థాపించెను. ఆమతగురువులేయీ మహారాజులు. ఈమతసిద్ధాంతమునుబట్టి శిష్యులు గురువునకు తమ తనువు మనస్సు ధనము సమస్తము నర్పించి కైంకర్యము చేయవలయును. ఈధర్మము మొట్టమొదటశిష్యులు గురువులయెడల మిక్కిలిభక్తి కలిగియుండవలయు ననుమంచియుద్దేశముతో నేర్పడియుండవచ్చును. కాని యిటీవలమహారాజు లనుపేళ్లతో బయలుదేరిన గురు

వులు దురాశాపాతకులయి శిష్యులను వంచించి మూర్ఖులను జేసివారిధనము నపహరించుటయేగాక వారిచేత నీచమైన సేవలు చేయించుకొనుటయేగాక యీశిష్యులయింట నుండు పడుచుపడంతులనయితము భర్తతోఁ గాపురమునకుఁ బంపకమునుపు వ్యభిచారమునిమిత్తము గురువులయొద్దకు పంపవలయునని శిష్యుల కుపదేశించుచున్నారు.

ఈగురూపదేశము విని యందువలన పుణ్యము వచ్చునని నమ్మి యామతస్థులు తమభార్యలను పుత్రికలను దోఁబుట్టువులను గురువుల కుం దార్చి తాముకృతార్థుల మయితిమని సంతసింతురు. ఈమూర్ఖుల భక్తి యింతతో సరిపోవలేదు. ఈగురుమహారాజులు నడిచిన నేలమీఁది దుమ్ము వారిపాదపద్మసంసర్గముచేతఁ బావనమైనదని శిష్యులామట్టి భక్షింతురు. వారిపాదుకలు వారుకూర్చుండుపీటలు పూలపూజింతురు. వారియడుగులను బంగారునగలతో నర్చింతురు. గురువులు నమిలి యుమిసిన తములపాకులనమ్మి స్త్రీపురుషులు వెలయిచ్చి కొని కన్నులనద్దుకొని తిని ధన్యులగుదురు. గురువు కాళ్లుకడుగుకొన్న నీరు త్రాగుదురు. ఆతనియుచ్ఛిష్టాన్నమారగింతురు. వేయేల? అతనిబట్టలు పిడిచిననీరునయితము పరమభక్తితో గ్రహించి పానముచేయుదురు. జనులయందున్న యీమూర్ఖతచూచిగురువులుపైనుదాహరింపబడినపనులుచేయనిచ్చినందుకుశిష్యులయొద్దనుండి చాలధనము గ్రహింతురు. ఈవిషయమున మున్నొకసారి రావుబహదూరు కందుకూరి వీరేశలింగంపంతులుగారు వ్రాసినవాక్య మొకటిం దుదాహరించుచున్నాము.

"ఈమహారాజులు శిష్యులవలన, దర్శనమిచ్చినందున కయిదు రూపాయిలును, శరీరములు ముట్టనిచ్చి నందునకు ముప్పదియైదురూపాయలును, ఉయ్యాలలోఁబెట్టి యూఁచనిచ్చినందునకు నలువదిరూపాయలును, గంధముపూయనిచ్చినందున కఱువదిరూపాయలును, ఏకశయ్యాగతులుకానిచ్చినందుల కేఁబదిమొదలుకొని యేనూరు రూ

పాయలవఱకును, కలసి రాసక్రీడ చేయనిచ్చినందునకు నూరు మొద లుకొని యిన్నూరురూపాయలవఱకును, ఉమిసినతాంబూలమును తి ననిచ్చినందునకు పదునేడురూపాయలును, తాము స్నానముచేసి న ట్టిగాని తాముకట్టుకొన్నబట్ట యుతికినట్టిగాని నీరు త్రాగనిచ్చినందున కు పంచొమ్మిదిరూపాయలును, గ్రహింతురఁట. మనుష్యజన్మమెత్తిన వా రింతకంటె నెక్కువగాఁ జెడుట సాధ్యమగునా?"

నాగరికులయినజనులు తలంచుకొనుటకైనను హేయములగు నీమరాచారములనునిర్మూలింపఁ దలఁచికృష్ణదాసుమూల్జీ యీగురుపి శాచముల వికృతచేష్టలను దనపత్రికాముఖమున బయలుపుచ్చియల్లరి చేయసాగెను. తమగుట్టు బయలుపడుటచే గురువులు భయపడి లంచ ములచేతను బెదిరింపులచేతను వానిని మిన్నకుండ చేయవలయు నని యత్నించిరిగాని కృష్ణదాసు తనసంకల్పము విడువడయ్యె. కృష్ణదాసు వ్రాయువ్రాతలు గురుమహారాజులకు భరింపశక్యముగాక యుండుటచే నామహారాజు లనేకులుగూడి తమశిష్యజను లందఱిచేత మూల్జీని వె లివేయుంచి యిబ్బందిపెట్టుటకు ప్రయత్నించి 1857 వ సంవత్సరము జనవరినెలలో నొకయొడంబడికను వ్రాసికొనిరి. అందున్న ముఖ్య ని బంధనములివ్వి.--1. వల్లభాచార్యమతములోఁ జేరినవైష్ణవుఁడెవ్వఁడు ను గురుమహారాజులను న్యాయస్థానమునకు రప్పించుటకు సమనులు చేయింపకూడదు. అట్టిసమనులను దీసికొని రాఁ గూడదు. 2. గురు మహారాజుల నేకోర్టులకు సమనుచేసి పిలుపింపఁగూడదని దొరతన మువారిచేత నొకచట్టము నిర్మింపఁజేయుటకు వలసినంతసొమ్ము పోగుచేయవలయును. 3. ఈచట్టము నిర్మింపఁబోవులోపున నీమహా రాజులశిష్యుఁడు కానివాఁడెవఁడయిన వారికి సమనులు చేయించిన పక్షమున నట్టివ్యవహారమునకుఁ గావలసినధనమంతయు శిష్య వైష్ణవులు పెట్టుకొనవలయును. 4. గురుమహారాజుల శిష్యుఁ డగు

వైష్ణవుఁ డెవండయిన వారిమీఁద చెడువ్రాతలువ్రాసినపక్షమున వెంటనే కులస్థులందఱు వానిని వెలివేయవలయును.

ఇట్లువ్రాసి యాయొడంబడికపత్రము గురువులు శిష్యు లందఱకు యథేచ్ఛముగఁ బంచిపెట్టిరి. ఆకాగితమునుజూచి మూల్జీదానికి బానిసపత్ర మని పేరుపెట్టెను. ఒడంబడిక లెన్ని వ్రాసికొన్నను శిష్యజనులు చాలమంది దానిలో వ్రాలు చేయనందున మహారాజులుతమ యిచ్ఛాప్రకారముకృష్ణదాసునుబహిష్కరింపఁజాలరయిరి. ఇటులుండ 1860 వ సంవత్సరమధ్యమున సూరతు నగరమునుండి యొకమహారాజు బొంబాయినగరమునకు విజయంచేసెను. వచ్చినకొన్నినాళ్ళకె యాగురువునకు సత్యప్రకాశికపత్రికాధిపతి యగుమూల్జీకిని మతాచారములలోఁ గొన్నిసంగిద్ధవిషయములనుగూర్చి చర్చజరిగెను. కృష్ణదాసడిగినప్రశ్నములకుఁ దగినయుత్తరములు జెప్పఁజాలక గురుమహారాజుగారు "శేషంకోపేన పూరయే" త్తను లోకోక్తి నిజముగ మహాకుపితులై మూల్జీ నాస్తికవాదములు చేయుచున్నాఁడనియు మతమునకుఁ జెరుపుగావించుచున్నాఁడనియు నిందారోపణము చేసెను. గురువులు తన కారోపించిన యీనీలాపనిందలకు మూల్జీ 1860వ సంవత్సరము అక్టోబరు 21వ తారీఖున ప్రకటింపఁబడినసత్యప్రకాశికలో సహేతుకమయిన మంచియుత్తరమిచ్చి యందు వేదములలోనుండి శాస్త్రములలోనుండి పురాణములలోనుండి యెన్నో శ్లోకముల నెత్తి వ్రాసి గురువులు చేసినవాదము లప్రమాణికములని ఋజువుచేసి ప్రపంచములో నీగురుమహారాజులకంటె దురాత్ములువంచకులు లజ్జాహీనులు వ్యభిచారులు లే రని కఠినముగ వ్రాసెను. ఆవ్రాత గురువునకు నషాళమంటితల వెఱ్ఱియెత్తించినను నెందుచేతనో వారు కొంతకాలమూరకుండి దుస్సహమయిన యీపరాభవమునకుఁ బ్రతిక్రియ జేయుటకుఁ గాబోలు 1861వ సంవత్సరము మే నెల 14వ తారీఖున

నతఁడు కృష్ణదాసు మూల్జీమీఁద ప్రతిష్టనష్టమునకు బొంబాయి హైకోర్టులో నొక యభియోగము (దావా) తెచ్చెను. కృష్ణదాసు మూల్జీ యీదోషారోపణకుఁ దాను నేరస్థుఁడు కాఁడనియు, వ్రాసినవారిత వారికప్రతిష్టాకరము కాదనియుఁ దాను వ్రాసినదానిలోఁ బ్రత్యక్షరము నిజమేయనియు వాదించెను.

అంతియెగాక వల్లభమతగ్రంథములలో వ్యభిచారము భక్తిగ చెప్పఁబడినదనియు నీమతగురువులందఱు వ్యభిచరించుచునే యుందురనియు సూరతుగురుమహారాజుగారుకూడ నట్టితెగలోనివాఁడే కాని వారికంటె భిన్నుఁడు కాఁడనియు మూల్జీ కోర్టువారికి విన్నవించెను. అనంతరము కృష్ణదాసు చేయుచున్న మహోపకారమును దెలిసికొనలేక మూర్ఖులయి భట్టియాజాతివారు సభయొకటిచేసి గురుమహా రాజులకు విరుద్ధముగ నెవ్వరుకృష్ణదాసుపక్షమున సాక్ష్యమియ్యఁగూడదని నిర్ధారణచేసికొనిరి. ఈనిర్ధారణము గురువులకు శిష్యులకు నష్టమేగాని లాభముగలిగింపలేదు. ఏలయనఁ దనకులస్థులందఱు జేరి తనపైఁగుట్రలుపన్నుచున్నవారనికృష్ణదాసువారిపై నొకయభియోగముఁ దెచ్చెను. గురువులుదెచ్చిన దావాయటుండ మూల్జీకులస్థులపై దెచ్చిన యభియోగములో న్యాయాధిపతులు భట్టియాలలోముఖ్యులగునిద్దఱికిఁజెఱియొక వేయిరూపాయలనుమఱియెనమండుగురిలోనొక్కొక్కని కైదువందలరూపాయిల చొప్పునను ధనదండన విధించిరి. ఆనాఁడు మూల్జీ కోర్టునుండి యావలకుఁబోఁగానే యోడిపోవుటచేత కడుపుమండియున్న భట్టియాలు వానిని దిట్టముగఁ గొట్టిరి. అందుచేత రాజభటులసహాయము గయికొని యింటికిఁబోవలసివచ్చెను.

గురువుదాఖలుచేసిన ప్రతిష్ఠానష్టపుదావా హైకోర్టులో నలువది దినములు విచారింపఁబడెను. న్యాయాధిపతియగు జోసఫ్ ఆర్నాల్డుదొరగారు మూల్జీనేరస్థుఁడు కాఁడని తీర్పుచేయుటయేగాక య

తేఁడు లోకోపకారి యనియు నీతిస్థాపనమునిమిత్తము చాలధైర్యము చూపె ననియు తమతీర్పులోవ్రాసిరి. ఆకాలమున నమెరికాఖండము లో గొప్పయుద్ధములు జరుగుచుండుటచే జనులు కృషివాణిజ్యాదుల యందు శ్రద్ధవిడిచినందున దూదిపంట యల్పమయ్యె. అమెరికాఖం డపుదూదియే యదివఱకు నింగ్లాండునకు నెగుమతియగుచుండెను. ఆ ఖండమునందు దూదిపంట యల్పమయినందున నింగ్లాండువర్త కులు హిందూదేశపుదూది మిక్కుటముగాఁ గొనగోరి బేరముఁ లిచ్చి రి. అప్పుడు మనదేశములో దూది వెలయెక్కువయయ్యెను. అందు చేతమూల్జీ,తనపూర్వపు వృత్తిని మాని దూదివర్తకముచేసినచో మిక్కిలిలాభమువచ్చునని కృష్ణదాసుమాధవదాసను పేర నొక వర్త కపుసంఘముపెట్టి వ్యాపారము చేయనారంభించెను. విదేశముతో వా ణిజ్యముచేయునప్పుడు వర్తకుఁడా దేశమునకుఁ బోవనిచో వ్యాపార ము సరిగజరుగదని కృష్ణదాసు పయనమై యింగ్లాండునకుఁబోయెను. కాని యెంతశ్రద్ధతో నతఁడువ్యాపారముచేసినను దైవవశమున దూది బేరములో ధరలు మిక్కిలి మందమగుటచే మూల్జీస్థాపించినవర్తక సంఘము నష్టమునొంది యంతరించెను. కాబట్టిమూల్జీయింగ్లాండులో నుండవలసిన యవసరములేక 1874 వ సంవత్సరమున మనదేశమునకు మరలివచ్చెను. ధనలాభము లేదు సరిగదా యింగ్లాండుపోయినందుకు మూల్జీకి మరియొక యుపద్రవము సంభవించెను. చిరకాలమునుండి యతనిమీఁద మిక్కిలి యక్కసుబూనియున్న గురుమహారాజు లదే సమయముగదాయని విదేశము వెళ్ళినందుకు వానికివెలివేసి బహు విధముల బాధపెట్టిరి. ఎన్నిబాధలుపెట్టినను మూల్‌జీ మేరువువంటి ధైర్యముగలవాఁడై జడియక నిలచెను. ఇటులుండ నప్పటి బొంబా యిగవర్నరుగారు మూల్‌జీయొక్క సామర్థ్యమును, నీతిని, ధైర్యము ను నెఱిఁగినవా రగుటచే నొక స్వదేశసంస్థానమునకు వానిని

దివానుగా నేర్పఱచెను. ఉద్యోగస్థుఁడయియున్న కాలమున నతఁడాపదవిలో దన్ను నియోగించిన దొరతనమువారికిని తనచేఁ బాలింపఁబడు ప్రజలకును సంతుష్టిగలుగునట్లు దేశము నేలెను. కాని యీయుద్యోగమున నతఁడుచిరకాలముండలేదు. అచిరకాలములోనె యొకవ్యాధిసంభవించి యెట్టకేలకువానిందనపొట్టబెట్టుకొనెను. ఈ సత్పురుషుని మరణమునకు బొంబాయి గవర్నమెంటువారు సయితము విచారించి తమ గెజటులో నా విచారమును తెలియపరచిరి. కృష్ణదాసు మూల్ జీ సత్యమునిమిత్తము నీతినిమిత్తముకష్టములననుభవించినశూరశిఖామణి. సంఘసంస్కరణమునం దితఁడు తనకుఁగల యభిమానము మాటలచేతగాక క్రియలచేత జూపి మొదటినుండియు తన వర్తనమున నసందర్భములు లేకుండ నేకరీతిని నడిపినవాఁడు. ఆ కాలపు బొంబాయి గవర్నరుగారేగాక యింక ననేకులు శ్లాఘాపాత్ర మగువాని చరిత్రమును మెచ్చుకొనియుండిరి. సర్ రిచ్చర్డు టెంపిల్ గారు తనకాలపుమనుష్యుల చరిత్రములను వ్రాయుచు నీతనిఁ గూర్చి శ్లాఘ్యమగు మాటలతో వ్రాసిరి.





రాజా సర్ దినకరరావు.

# రాజా సర్ దినకర రావు

ఈయన మహారాష్ట్రబ్రాహ్మణుఁడు. బొంబాయి రాజధాని యందలి రత్నగిరి జిల్లాలోనున్న దేవహూటు గ్రామ మీయన జన్మ స్థానము. ఇతఁడు 1819 వ సంవత్సరము డిశెంబరు 20 వ తారీఖున జన్మించెను. ఈయనతండ్రి పేరురకోబాదాదు. ఈయనకు దినకర రావు ప్రథమకళత్రమువలనఁ బుట్టినపుత్రుఁడు. దినకర రావుయొక్క పూర్వులు మూఁడు నాలుగుతరములనుండి సింధ్యామహారాజుగారి గ్వాలియరు సంస్థానములో నేదో యొకపరగణాకు సుబేదారులుగ నుండుచు వచ్చిరి. ఈతనియొక్క బాల్యమునుగూర్చి మన కంతగా తెలియదు. అయిదవయేటనే యక్షరాభ్యాసముచేసి మాతృభాషయగు మహారాష్ట్రమును వానికిఁ దండ్రిగారు చెప్పించుచు వచ్చుచుండిరని మాత్రము తెలియుచున్నది. స్వభాషకుఁ దోడు దినకర రావు సంస్కృత పారసీభాషలఁగూడ నేర్చెను. యుక్తవయస్కుఁ డయినపిదప నితఁడు పూర్వాచార పరాయణుండయి చేయవలసినకర్మలు కాలాతిక్రమణము కాకుండ యథావిధిగఁ జేయుటంబట్టి బాల్యమునందీతనికి మతసంబంధమయిన బోధనము గట్టిగా జరిగియుండునని తోఁచెడును. ఈయనకు హిందువుల గానమునందు మిక్కిలి యభిరుచిగలదు. హిందూ వైద్యశాస్త్రమునందుఁ జాలమట్టు కభినివేశము గలదు. బుద్ధిసూక్ష్మతగలవాఁడగుటచే నేవిద్య నభ్యసించిన నది యల్పకాలముననే రాఁదొడఁగెను. అతఁడును సమయము చిక్కినప్పుడు వదలక తనజ్ఞానాభివృద్ధి చేసికొనుటకు మిక్కిలి పాటుపడెను. ఈయనకు నలువదిసంవత్సరములు వచ్చువఱకు నింగ్లీషుభాష రాదు. చదువ నారంభించిన వెనుక నతఁడచిరకాలములోనే దానిని చక చక

మాటలాడ నేర్చెను. దినకరరావుగారికి జ్ఞాపకశక్తి మెండు.

గ్వాలియరుసంస్థానములో నితఁడు పదునైదవయేఁటనే యుద్యోగమునఁ బ్రవేశించెను. మొట్టమొదట నొకగొప్పయుద్యోగస్థుని చేతిక్రింద కొంతకాల మతఁడు లెఖ్ఖలువ్రాయుచు వచ్చెను. ఈ చిన్నయుద్యోగములో నతఁడు చూపిన చాకచక్యము పూనిక గ్రహించి మెచ్చి తండ్రి యనంతరమున నదివఱ కాయన చేయుచుండిన సుబేదారుపని దినకరరావుకిచ్చిరి. అతఁడు పరిపాలింపవలసిన పరగణా మిక్కిలి కష్టతరమయినదగుటచే దినకరరావు తనలో నడగియుండిన యద్భుతశక్తి నంతయు వెలికిదెచ్చి కడు నేర్పుతో నధికారము జేసెను. ఆపనిలోఁ బ్రవేశించినపిదప నతఁడు తనపరగణాలోనున్న పోలీసుడిపార్టుమెంటు చక్కఁజేసెను. అవసరమయినచోటుల పోలీసు స్టేషనులఁ గట్టించెను. సర్కారుసిస్తు సరిగ వసూలుచేయుటకు తగిన పద్ధతు లేర్పరచెను. క్రిందియుద్యోగస్థులు నడువవలసిన నడతయిట్టిది యని తెలియఁ జేయుట కొకనిబంధన గ్రంథము వ్రాసెను. ఈకార్యములను నతఁడుచేసిన తక్కినమార్పులనుజూచి గ్వాలియరుమహారాజుగారును వారియొద్దనుండు నింగ్లీషువారిరెసిడెంటును చాలసంతోషించిరి. ఈకార్యములే దినకరరావుయొక్క భవిష్యద్వృద్ధికి యశస్సునకు వి త్తనము లయ్యెను.

దినకరరా వొక్కఁడు సంస్థానములో నొకచిన్న భాగమును సరిగాఁ బాలించిన మాత్రమున సంస్థానమున కంతకు నేమి లాభము గలుగును? తక్కినవా రందఱు వానిలాగున పాటుపడినచో మిగుల లాభముండును. అట్లు గాకపోవుటచే 1842 వ సంవత్సరము మొదలు కొని సంస్థానము మిక్కిలి క్షీణదశకు వచ్చెను. పూర్వపుమహారాజు పోవుటచే నప్పటిమహారాజు బాలుఁడు. రాజకుటుంబము బహు కలహాభూయిష్టమయి యుండెను. వ్యవహారము సరిగ జరుగదయ్యె. అర్థ

ప్రాణములకు క్షేమము తక్కువయ్యెను. ఎచ్చటఁ జూచిన నేరములు తరుచయ్యెను. అధికారులు లంచగొండులయి ప్రజలను బాధింపఁ జొచ్చిరి. సర్కారునకుఁ జెల్లుబడి గావలసిన సిస్తు సయితము తిన్నగా వసూలుచేయు దిక్కులేకపోయె. అందుచేత ధనకోశములు వట్టివ య్యెను. ఈదురవస్థకుఁ దోడు గోరుచుట్టుపై రోకటిపోటుచందమున సంస్థానమున మన్నెములలోనున్న కొండులను వనచరులు పితూరీలు చేసి, యున్న కొంచెము నెమ్మదికి భంగము గలిగించిరి. కాఁబట్టి సంస్థాన మనునావకుఁ జుక్కాని త్రిప్పుటకు సమర్థుఁ డొకఁడు కావలసి వచ్చెను. తగినవాఁ డెవఁడని యందఱు విచారించుచుండ నంతలోఁ బ్రధానమంత్రిపదవి కాళీ యయ్యెను. వెంటనే సంస్థానము మేలుకో రినవారందఱు దినకరరావే దానికిం దగినవాఁడని వాని నాపదవి యందు 1852 వ సంవత్సరమున బ్రతిష్ఠించిరి.

ఆమహాపదవి నతఁడు బూని సంస్థానము సరిగా సిస్తు చెల్లక పోవుటచే ధనహీనతచేతఁ జిక్కుపడు చున్నదనిగ్రహించి తద్విషయ మున ముందుగాఁ బనిచేయుటకుఁ బ్రయత్నించెను. దరి యంచు లేక సంస్థానమందలి ధనమంతయు కర్చగుచుండుటచే నట్టివ్యయము నివా రించుటకు నతఁడుచేసినపని మిక్కిలియాశ్చర్యకరమయి శ్లాఘనీయమై యున్నది. నిజమయిన స్వామిభక్తిగల దినకరరావు ప్రప్రథమమున తనజీతమునైదువేలరూపాయిలనుండి రెండువేలగునట్లుతగ్గించెను. ఆత్మ లాభపరాయణుఁడుగాక కేవలస్వార్థపరిత్యాగియయినయీసత్పురుషు ని పద్ధతి నవలంబించి యనేకులు తమజీతములుగూడ తగ్గించుకొనిరి. అందుచేత ప్రతిసంవత్సరము చాలసొమ్ము కూడివచ్చెను. ఈపని యయిన వెనుక నతఁడు సర్కారుసిస్తు వసూలుచేయుటనుగూర్చి మెక్కుడు శ్రద్ధచేసెను. ఈపని చక్కఁగా నిర్వహించుటకు దినకర రావు రివిన్యూడిపార్టుమెంటును బలపరిచి లెక్కల డిపార్టుమెంటును

గూడ సృష్టించి దానిని సమర్థుఁడయిన యొక యుద్యోగస్థునిచేతి క్రింద నిలిపెను. ఇట్లు మూఁడు సంవత్సరములు పాటుపడి యామంత్రి సంస్థానపుఋణ మంతయు దీర్చివేయుటయేగాక ధనకోశములోఁ గొంతసొమ్ము నిలువఁగూడఁ జేసెను. సంస్థానమునందలి యుద్యోగస్థు లందఱు నడచుకొనవలసిన వ్యవహారధర్మములను గొన్నిఁటిని వ్రాసి యొకపుస్తకముగాఁ జేసి యానిబంధనలనుబట్టి వారందఱు నడచుకొనున ట్లాజ్ఞాపించెను. ఈపుస్తక మెంత యుపయోగకరముగా నుండెనో యీక్రింది సంగతినిబట్టి మీరే గ్రహింపవచ్చును. ఆకాలమున హైదరాబాదు సంస్థానములో రెసిడెంటుగానుండిన బుష్బీదొరగారు గ్వాలియరుసంస్థానములో రెసిడెంటుగానుండి మాక్ఫెరసను దొరగారికి జాబు వ్రాయుచు దినకరరావుగారు వ్రాసిన పుస్తకము మిక్కిలి యుపయోగకరముగా నుండుటచేతనై జాంసంస్థానమునందుఁ గూడ దాని నుపయోగింపవలెనని దన కభిప్రాయమున్నట్లు వ్రాసెను. ఈపనులకుఁ దోడు దినకరరావు 60 పాఠశాలలు సంస్థానములో స్థాపించి యొకచిన్న చదువుల డిపార్టుమెంటు కల్పించెను. పోలీసును న్యాయస్థానములును (కోర్టులు) చక్కపఱచెను. కాలువలు త్రవ్వించి చక్కని బాటలు వేయించి జనులకు ప్రయాణసౌఖ్యమును గలిగించెను. వాణిజ్యమునకు భంగకరములయిన సుంకములను గొట్టివేసి ప్రజలయొక్క స్థితిని బాగుచేయుట కెన్నివిధముల పాటుపడవలయునో యన్నివిధముల పాటుపడెను.

1857 వ సంవత్సరమునం దుత్తరహిందూస్థానమున గొప్ప సిపాయిపితూరి జరిగెను. ఆకాలమున నింగ్లీషుదొరతనమువారికి దినకరరావుచేసిన యుపకార మింతింతయని చెప్పరాదు. హిందూదేశమం దున్న సంస్థానాధిపతులందఱిలో సింధ్యావిషయముననే గవర్నమెంటువారి కాదినములలో నెక్కువ యలజడి కలిగెను. సింధ్యా

మహారాజుయొక్క సైనికులుగూడ పితూరీదార్లలోఁగలసి సర్కారు వారితోఁ బోరాడ నభిలషించుచుండిరి. సింధ్యాగూడ నొకచేయి చూచి విడుచుట మంచిదని యాలోచింపఁ దొడఁగెను. అట్టిసమయమున దినకరరావుయొక్క బుద్ధి నిపుణతచేత సింధ్యామహారాజు తన ప్రయత్నము మానుకొనియెను. సైనికు లింగ్లీషువారిమీఁదికిఁ దమ్ము పంపుమని పలుమారు వేఁడుటచే దినకరరావు మేరమీరిన వారి యుత్సాహమును మాన్పలేకపోయినను వారు పితూరిదారులతోఁగలసి దొరతనమువారిమీఁదఁ బడకుండ నెప్పటికప్పు డేవో వంకలు చెప్పి యాపఁజాలెను. అధికమయిన బుద్ధినిపుణత యుండుటచే తనే పితూరిదారులు గ్వాలియరుసంస్థానమునప్రవేశించినపుడయిన తమ సైనికులు వారితోఁ జేరకుండ నాపగలిగెను. అప్పటి రెసిడెంటుగారు దినకరరావువలననే సింధ్యామహారాజురక్షింపఁబడెనని స్పష్టముగాఁబలికెను. ఆయన చేసినపనినిగూర్చి యొకదొరగారీక్రిందివిధముగవ్రాసిరి. "ఆకళవళములో దినకరరావు తనయజమానికి జేసిన యుపకార మిట్టిదియని చెప్ప నలవిగాదు. అతఁడు తన స్వామియెడల మూర్తీభవించిన రాజభక్తియయి యడ్డము వచ్చినదాని నెల్ల దుడిచిపెట్టుచు మహావేగముతోవచ్చిన యాసంక్షోభమునకు మూర్తీభవించిన ధైర్యమయి మెలఁగెను. అత్తఱి నాంగ్లేయ ప్రభుత్వమునం దాతఁడు చూపిన యాదరము నాంగ్లేయులకతఁడు చేసిన సహాయము నప్పుడది చూచినవారు స్వయముగ ననుభవించినవారు జన్మమధ్యమున మరచి పోఁదగినది కాదు." 1859 వ సంవత్సరమున గవర్నరు జనరలుగారగు కానింగు ప్రభువుగారు ఢిల్లీలో నొకదర్బారుచేసి యచ్చటికి దినకరరావును రావించి యతఁడు చేసిన యుపకారమునకుఁ గృతజ్ఞుఁడయి వందనములు సేయుటయేగాక కాసీజిల్లాలో నొకజాగీరును బహుమాన మిచ్చెను.

1859 వ సంవత్సరముననే దినకరరావు గ్వాలియరులో మంత్రి యుద్యోగమును మానుకొనెను. అనంతరము కొంతకాలమువఱకు నతఁడు ఢోల్పూరు సంస్థానమునకు మంత్రి యయ్యెను. 1861 వ సంవత్సరమున గవర్నరుజనరలుగారి శాసననిర్మాణసభలో హిందువుల నేర్పఱచవలసి వచ్చినప్పుడు దినకరరావుగా రొక సభికుఁడుగా నియమింపఁ బడెను. అతఁ డాసభలో మూఁడుసంవత్సరములు మాత్రమే పనిచేసినను నాస్వల్పకాలమున దేశోపకారములగు పనులే చేసెను. 1866వ సంవత్సరమున నతనికి సర్ యను బిరుదము వచ్చెను. 1877 వ సంవత్సరమున జరిగిన ఢిల్లీదర్బారులో దొరతనమువారు వానికి రాజాబిరుదమునిచ్చిరి. 1884 వ సంవత్సరమున డఫ్రిన్ ప్రభువుగారు రాజాబిరుదము వారి వంశస్థు లందఱికుండునట్లు చేసెను. దికరరావు మిగిలిన దినములను నిర్వ్యాపకముగానే గడపి 1896వ సంవత్సరమున జనవరి 9 వ తారీఖున కాలధర్మము నొందెను.

దినకరరావు పలుచని మొగముగలిగి పచ్చనిచాయ గలిగి యౌవనమువ స్ఫురద్రూపియయి యుండెను. అతని యాకృతి పొట్టిగనుండును. అతనిమాటలు మిక్కిలి మృదువులయి యెదుటివారిం దనపక్షము ద్రిప్పుకొనున ట్లుండును. అతఁడు నిశ్చలమయిన చిత్త స్థైర్యము గలవాఁడు. ఇంగ్లీషు విస్తారము రాకపోవుటచే నతఁడు దొరలపద్ధతి నెప్పు డవలంబింపలేదు. స్త్రీవిద్య మొదలగు సంస్కారము లతని కిష్టములులేవు. కాని సంస్థాన పరిపాలనమునందు మంచి బుద్ధిశాలియయి సహాయుండయి పని చేసెను.





కాశీనాథ త్రియంబక తెలాంగు.

# కాశీనాథ త్రియంబక తిలాంగు

ఈతఁడు గౌడసారస్వత బ్రాహ్మణుఁడు. ఈతని పూర్వులు రమారమి నూఱు సంవత్సరముల క్రిందట గోవానగరమునుండి వచ్చి బొంబాయిలో కాపురముండిరి. ఈయన 1850 వ సం॥రం ముప్పది యవ యాగష్టున జన్మించెను. ఇతఁడు బాబురామచంద్రతిలాంగుగారి రెండవ కుమారుఁడు. ఆయన పెదతండ్రి త్రియంబక రామచంద్ర తిలాంగుగారు సంతానహీనుఁడగుటచే నీపిల్లవానిని పెంచుకొనెను తండ్రియుఁ బెదతండ్రియు నవిభక్తులై కలిసియుండినందున జ్యేష్ఠుఁడే యింటిపెత్తనము చేయుచుండెను. పెంచుకొన్న పెదతండ్రి పూర్వా చారపరాయణుఁడై మిక్కిలి నీతిమంతుఁడైనందున కాశీనాథత్రియం బక తిలాంగు నొద్దనుండిన సకలసద్గుణములువానియొద్దనుండి నేర్చి కొనినవేయని చెప్పవచ్చును. కొంతకాల మతఁడు స్వభాష చిన్న బడులలో నేర్చుకొని యింగ్లీషు చదువుటకు 1855 వ సం॥రమున నెల్ఫి న్‌స్టన్ పాఠశాలకుఁ బోయెను. ఈపాఠశాలలో నుపాధ్యాయులు కేవలము జీతములకొఱకేగాక బాలురవిద్యాభివృద్ధికై పాటుపడుచు వచ్చిరి. అప్పుడు విద్యనేర్పిన గురువులలో నారాయణమహాదేవ పరమానందుఁ డొకఁడు. కాశీనాథుఁడు పాఠశాలవిడిచిన తరువాత సయితము కార్యాలోచన మేదియైనఁ జేయవలసి వచ్చినప్పుడు తన గురువగు పరమానందుని సహాయముగోరుచు వచ్చెను.

1864 వ సంవత్సరమునఁ గాశీనాథుఁడు ప్రవేశపరీక్షయందు కృతార్థుఁడై కళాశాలలోఁ బ్రవేశించెను. ఆకళాశాలాధ్యక్షుఁడును నందలి యుపాధ్యాయులును బాలురప్పగింప వలసిన పాఠములు చదివించుటయేగాక బుద్ధిసూక్ష్మత హెచ్చుటకై యితరగ్రంథములు

గూడ చదివించుచు వచ్చిరి. అట్టి గురువులయొద్ద విద్యనభ్యసించుటచే నతఁడు రెండేండ్లకే యనగా 1866 వ సం॥రమునందు పట్టపరీక్ష యందును మఱి రెండేండ్లకే యనగా పదునెనిమిదేండ్ల ప్రాయముననే యమ్. ఎ. పరీక్షయందుఁ గృతార్థుఁ డయ్యెను. పిమ్మట మఱి రెండేండ్లకు యల్. యల్. బి. అనగా బియల్ పరీక్షలో దేరెను. పట్టపరీక్షయందుఁ దేరిన మరుసటి సంవత్సరమే యనగా పదునేడేండ్ల ప్రాయముననే యతఁడు తాను చదువుకొన్న కళాశాలలో నొక యుపాధ్యాయుఁడుగా నియమింపఁబడి బాలుర కింగ్లీషు సంస్కృతము నైదేండ్లు నేర్పెను.

1772 వ సంవత్సరమున కాశీనాథుఁడు న్యాయవాదికిఁ గావలసిన మఱికొన్ని పరీక్షలయందును గృతార్థుఁడై బొంబాయి హైకోర్టులో న్యాయవాదియయ్యెను. కుశాగ్రబుద్ధియగు నీతఁడు పరీక్షలయందుఁ గృతార్థుఁ డగుటయేగాక బహుగ్రంథములు శోధించి చదివి పలుతెఱఁగుల తన జ్ఞానము నభివృద్ధిచేసికొనుచు వచ్చెను. ఆయన యమ్. ఎ. పరీక్షయందుఁ దేరినవాఁడయ్యు దానదివఱకు నేర్చికొనిన విద్య మిక్కిలి స్వల్పమనియు "అనంతశాస్త్రం బహువేదితవ్యం అల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః" అను నార్యోక్తి నిబట్టి నేర్చికొనవలసినదే విస్తారముగ నున్నదనియుదెలిసికొని న్యాయవాది పరీక్షకుఁ జదువునప్పుడే యింగ్లీషులోనున్న భాషాగ్రంథములు తత్వశాస్త్రములు మొదలగు వానిని జాగరూకతతో జదివెను. ఇట్లు జదువుటయేగాక యతఁడు బొంబాయిలో నాకాలమున వెడలుచుండిన హిందూప్రకాశము మొదలగుకొన్ని పత్రికలకు వ్యాసములు వృత్తాంతములు వ్రాసిపంపుచు నెడనెడ జ్ఞానాభివృద్ధి కరములగు సభలకుఁ బోయి పెద్దలిచ్చు నుపన్యాసములను విని స్వయముగఁ దానుపన్యాసములువ్రాసి చదివి యెల్లవిధముల బుద్ధిని వికసింపఁజేసెను.

ఈ విధముగా నభ్యాసముచేసికొన్నఁగాని లౌకిక వ్యవహారములలోఁ దాను ప్రవేశించుటకు తగనని యట్లుచేయుచు వచ్చెను.

అదియునుఁగాక బొంబాయిలోనున్న ప్రార్థనసమాజమందిరమున కతఁడు ప్రతివారముబోయి యచ్చటజేయఁబడిన మతబోధలను శ్రద్ధతోవిని గృహమునకు జనినపిదప దాను విన్నదంతయుఁ గాగితముమీదవ్రాసి "మీరుచెప్పినదంతయు నేనుసరిగా గ్రహించివ్రాసితినోలేదో చూడుఁ"డని యుపన్యాసమిచ్చిన వారియొద్దకే మరలబంపుచుండెను. ఇతరులు చెప్పినవిషయములను సరిగా గ్రహించిసరిగాదెలియజేయుట నేఱుఁగనివాఁడుప్రపంచమునందెప్పటికినిగొప్పవాఁడు కాలేఁడనిభావించి యతఁడీవిధముగ జేయుచువచ్చెను. అవ్విధంబున నొరులయుపన్యాసములువిని జ్ఞాపకముంచుకొని మరల వ్రాయుచుండుటచేతనే యతఁడు మిక్కిలి సరసమైనశైలితో నింగ్లీషు వ్రాయుటయుమాటలాడుటయు నతనికలవడెను. ఆంగ్లేయభాషలో మిల్లు, కార్లైల్, స్పెన్సరు, మొదలగు మహాత్ముల గ్రంథములయం దతనికత్యంతమభిరుచి. సంస్కృతముమీఁద వానికున్నయభిమానమునకు మేరలేదు. బాపుశాస్త్రియనునొకపండితుఁడు విద్యార్థులకుఁబాణినివ్యాకరణము చెప్పుచుండ నతఁడక్కడకుఁ బ్రతిదినముబోయి యాశాస్త్రమునేర్చుకొనెను. ఆనందగిరివ్రాసిన శంకరవిజయము మరొకరువ్రాసినశంకరవిజయముఁజదివి కాశీనాథుఁడుశంకరాచార్యుని చరిత్రము సంగ్రహముగా నింగ్లీషునవ్రాసివిద్యార్థులసమాజమునొద్దఁజదివెను. ఈకాలముననేయీవిద్వాంసుఁడు భగవద్గీతల నింగ్లీషులోనికిభాషాంతరీకరణముచేసెను. ఈభాషాంతరీకరణముననేసస్కృతవిద్యాపారంగతుఁడగు మోక్షమూలరు పండితుఁడు తానుప్రకటించిన ప్రాచీనపవిత్రగ్రంథములలోఁ జేర్చి లోకమునకు వెల్లడించెను.

ఆదినములలోఁ జేసినమనఃపరిశ్రమమునుబట్టియే కాశీనాథుఁడు న్యాయవాదియైనపిదప నతిబుద్ధిసూక్ష్మతతో వ్యాజములనడపి ప్రతిష్ఠ

సంపాదింపఁగలిగెను. ఆతనివాగ్ధోరణియాతనియుక్తులు న్యాయాధిపతుల మనస్సులనాకర్షించుచు నతనినేర్పుస్వల్పకాలములోనేవానికి గొప్పపేరు దెచ్చెను. న్యాయాధిపతులు సయితమువలుమారువాని ప్రజ్ఞలకుఁ బొగడుచువచ్చిరి. సంస్కృతమునందతఁడు మిక్కిలి ప్రజ్ఞావంతుఁడగుటచే హిందూశాస్త్రముల మీఁద వచ్చినవ్యాజములలో నతనియాలోచనపరిమాణమైయుండెను. జడ్జీలుసయితము సందిగ్ధ విషయములలో నీతనిసహాయమపేక్షించుచువచ్చిరి. యూరపుఖండమున గ్రీసు దేశమున హోమరనుకవి ఈలియడ్డను నొకగ్రంథమువ్రాసెను. దాని యందలి కథ యచ్చముగ రామాయణమువలెనుండును. అందుచేసంస్కృతపండితుఁడగు వీబరను దొరగారు రామాయణమురచించినవాల్మీకిమహర్షి హోమరుకవి వ్రాతలను దొంగిలించెనని వ్రాసిరి. కాశీనాథతిలాంగు హోమరుకవిత్వమువాల్మీకికవిత్వము, జాగ్రత్తతో బరిశోధించినచదివివీబరనుగారివ్రాతలు వట్టితప్పులని ప్రమాణములతో జూపుచు నొకవ్యాసమువ్రాసెను. ఆవ్యాసమును హిందూదేశస్థులేగాక యింగ్లాండువారు సయితము చాలమెచ్చిరి.

అతఁడు 1873 వ సం॥రమున మొట్టమొదటబహిరంగమైనసభలోనికివచ్చి యొక్కయుపన్యాసమిచ్చెను. ఆసభయప్పుడుక్రొత్తగాబుట్టిన యుప్పుచట్టమునుగురించి చర్చించుటకు జరిగెను. అతఁడునాఁడిచ్చినయుపన్యాసము నింగ్లీషుపత్రికలు స్వదేశపత్రికలుసమానముగఁ గొనియాడెను. అతనినోటినుండి యాంగ్లేయభాష వెలువడునప్పు డాంగ్లేయులుసయితము తమభాషకిట్టిసౌకుమార్యముగలదాయని తెల్లబోయి చూచెడువారు. న్యాయవాదియై విశేషపరిసిద్ధిగాంచుచు రాజకీయవ్యవహారములలో మిక్కిలిపనిచేయుచుఁదీరికలేకయున్నను గాశీనాథతిలాంగు సంస్కృతభాష పరిశ్రమము మరువలేదు. భర్తృహరినీతిశతకము, ముద్రారాక్షసనాటకము నింగ్లీషుటిప్పణము వ్రాసిప్రకటించెను. అంత

దృష్టినొందక యతఁడుపురాతనతామ్రశిలాశాసనములశోధించి వాని లోఁగలవిషయములనులోకమునకు తెలియజేయుచువచ్చెను. 1876వసం॥రమున నతఁడు బొంబాయి యూనివరిసిటీలోసభికుఁడయ్యెను. 1877వ సం॥రమున నీదేశమందున్న తెల్లవారినిమాత్రముఁవాలంటరీకోరు'అను పేరుగల యొకవిధమయినసేనలోఁ జేర్చుకొనవలసినదనియునల్లవారిని మాత్రమందుఁజేర్చికొనగూడదనియుదొరతనమువారిని వేడుకొనుటకు బొంబాయిలో నొకసభజరిగెను. ఈతిలాంగుగారును ఫిరోజిషామెహతాగారును మఱియొక సభచేసి నల్లవారినందుజేర్చికొనకపోవుటవారి నవమానించుటయని నొక్కిచెప్పి యుపన్యాసమిచ్చిరి.

1878 వ సం॥రమున గవర్నరుజనరల్ గారగు లిట్టను ప్రభువుగారు స్వభాషలలోఁ బ్రకటింపఁబడువృత్తాంతపత్రికలనడచివేయుట కొకచట్టము నిర్మించిరి. ఆకాలమున నీతిలాంగుగారట్టిచట్టముధర్మవిరుద్ధమని హిందూప్రకాశపత్రికలో పలుమారు వ్రాసిరి. 1879 వసం॥రమున లిట్టను ప్రభువుగారు దూదెసరకులమీఁదకట్టినసుంకములనుగూర్చి తిలాంగుగారాపన్నులు దేశానర్థకములని యుపన్యాసములిచ్చియీ ప్రభువుపరిపాలనము దేశాభివృద్ధి పరాఙ్ముఖమని తెలియజేసిరి. 1880వ సంవత్సరమున నప్పటిగవర్నరుగారుతిలాంగుగారికిజాయంటుజడ్జీపని నిచ్చెదమని చెప్పఁగా నతఁడక్కరలేదనియెను. పిమ్మటదొరతనము వారాయనకులాకాలేజిలోనుపాధ్యాయత్వమిచ్చిరి. ఈపనియదివఱకుదొరలకేగాని స్వదేశస్థులకిచ్చుటలేదు. 1882 వ సం॥రమునగవర్నరుజనరలుగారగు రైఫన్‌ప్రభువుగారు వానిని "ఎడ్యుకేషనల్ కమీషను లో సభికుఁడుగా నేర్పరచిరి. హిందూదేశములోవిద్యాభివృద్ధియెట్లుగఁచున్నదో కనుగొనుట కీసభ యేర్పడినది. ఈసభలోఁగూర్చుండి యతఁడుపడినపరిశ్రమకురైఫన్ ప్రభువుగారు మిక్కిలి సంతసించి వానికి సి. ఐ. యి. అనుబిరుదమునిచ్చిరి. ఆసభలో నతనిసహకారులైపనిజేసిన కొం

దఱుపాఠశాలలో నీతిపుస్తకములు కొన్నిటిని బాలురచేతఁజదివించి నీతిప్రత్యేకముగా నేర్పవలయునని నాదరింపనీతిబాలురుచదువుచున్న ట్టి ప్రతిగ్రంథములో నున్నదనియుఁ బ్రత్యేకముగానేర్పనక్కఱలేదని యుఁ దిలాంగుగారు వారివాదములఁ బూర్వపక్షముచేసి వ్రాసిరి.

1883 వ సంవత్సరమున ఇల్బర్టుబిల్లుఅనునదిహిందూదేశమునం దంతటఁ జర్చింపఁబడెను. దొరలేవైన నేరములు చేసినప్పుడునల్ల న్యాయాధిపతులు వారినివిచారింపవచ్చుననియీచట్టముయొక్కముఖ్యాభిప్రాయము. ఇది దొరల కనిష్టమై వివాదకారణమయ్యెను. ఆదినములలో నీతిలాంగుగారు బొంబాయిలో నొకసభచేయించి యాబిల్లుచాల శ్రేయోదాయకమని న్యాయమనియుపన్యసించెను. ఈయుపన్యాసము నువానిప్రతిపక్షులుసయితముఁ గొనియాడిరి. 1884 వ సంవత్సరమున నీతఁడుబొంబాయి గవర్నరుగారి శాసన నిర్మాణసభలో సభికుఁడుగా నియమింపఁబడిహైకోర్టుజడ్జియగువఱకు నాసభలోఁబనిచేసెను. ఆసభలోనుండిమహారాష్ట్రదేశమునకుముఖ్యముగాబొంబాయినగరమునకుఁ జాల నుపకారముచేసెను. 1885 వ సంవత్సరమున నితఁడుహ్యూమ్‌దొరగారితోఁగలసి దేశీయమహాసభాస్థాపనకుఁబాటుపడిప్రథమసభ బొంబాయిలోఁజరిగించెను. 1888వ సం॥రమున నలహాబాదులోఁ జరిగిన దేశీయమహాసభకితఁడుపోయి శాసననిర్మాణసభలలో స్వదేశీయసభికులనుమునుపటికంటెనెక్కువగాఁజేర్పవలసినదని దొరతనమువారికి విన్నవించుచు నుపన్యసించెను. ఇదియాతనియుపన్యాసములలో శ్రేష్ఠమయినది. 1889 వ సం॥రమున దొరతనమువారీయనను బొంబాయిహైకోర్టులో జడ్జిగా నేర్పరచిరి. ఈయుద్యోగమున కీయనసర్వవిధములచేతఁ దగినవాఁడని యాకాలమునఁ దెల్లవారునల్లవారునను భేదములేక యెల్లవారుఁగొనియాడిరి. అతఁడెంత మంచిన్యాయాధిపతియోవానితీర్పులెంతశాస్త్రబద్ధములుగనెంతయుక్తియుక్తములుగనున్నవోవానినిజది

వినవారందఱు నెఱుంగుదురు. హిందూదేశములో రాయల్ ఏషియాటిక్కు సొసయిటీలనుపేరఁగొన్ని సమాజములుగలవు. సంస్కృతము మొదలగుప్రాగ్దేశవిద్యలనుగూర్చి పరిశ్రమజేయుటయు తామ్రశిలాశాసనాదుల త్రివ్వించిచక్కఁ జేయుటయునీసభయొక్క ముఖ్యోద్దేశము. ఈసమాజమొకటి కలకత్తాలోను మఱియొకటిబొంబాయిలో గలదు బొంబాలోనున్నసభకు శ్రీతిలాంగుగారినిదక్కినసభకు లగ్రాసనాధిపతిగజేసిరి. ఈగౌరవము నల్లవారికెవ్వరి కనిదఱకు గలిగియుండలేదు. అతఁడుహైకోర్టుజడ్జియైదొరతనమువారి కొలువులోఁబ్రవేశించినను దేశీయమహాసభమీఁదనాతనికిగల యభిమానమురవంతయేనియుఁగొఱతపడదయ్యె. 1892 వ సం॥రాంతమందు వానిదేహస్థితి చెడిపోయెను. అదిమొదలొక సంవత్సరము రోగపీడితుఁడై 1893న సం॥ శెప్టెంబరు 1వ తారీఖున నీమహాపురుషుఁడు లోకాంతరగతుఁడయ్యెను.

అతని మరణమునుగూర్చి తెల్లవారు నల్లవారుననుభేదములేక హిందూదేశస్థులగు జనులందఱు మిక్కిలి దుఃఖించిరి. ఈసచ్చరిత్రుని జ్ఞాపకార్థము బొంబాయినగరములో నొకపెద్దసభచేయబడెను. ఆసభకప్పటి గవర్నరుగారగు హారిసుప్రభువుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. ఆకాలమున బొంబాయిహైకోర్టులో మొదటిజడ్జిగారు తిలాంగునుగూర్చి చెప్పినమాటలలోఁ గొన్నిఁటి నిం దుదాహరించుచున్నాము. "తిలాంగు విషయమున నేనుచెప్పవలసిన ముఖ్యాంశ మొకటియున్నది. హిందువులలో నిప్పుడనేకు లింగ్లాండు మొదలగు దేశములకుఁబోయిరి. అచ్చట నాగరికతను జనుల యాచారములను వ్యవహారధర్మములను స్వయముగఁజూచి నేర్చికొనుచున్నారు. తిలాంగు స్వదేశమునెన్నడు విడిచిపెట్టకపోయిన కేవలము పాశ్చాత్యుల గ్రంథముల సహాయముననే వారి యాచారవ్యవహారాదులను నాగరికతనుజూచిన వారికంటె నెక్కుడుగ గ్రహించెను. ఈయన స్వదేశమగు బొంబా

యి రాజధానిని దఱచుగ విడిచియుండలేదు. నేనెఱిఁగినంతవఱకీయ న స్వదేశము నొక్కసారిమాత్రము విడిచెను. ఈవిధముగ నతఁడు పశ్చిమదేశ గ్రంథములంజదివి ప్రాగ్దేశాచారముల నవలంబించి ప్రవర్తించుటచే జనుల కందఱకతఁడు సర్వదాయిష్టుఁడై మెలంగెను. ఈతని మరణముచేత హిందూదేశమంతయుమహానష్టమునుబొందినది.

కాశీనాథతిలాంగు న్యాయవాదియై యుండుట రాజకీయవ్యవహారములలోఁ బ్రవేశించి ప్రతిష్టగాంచుట మొదలగు పనులతోనే కాలముబుచ్చక సంఘసంస్కారముపై చాలనిష్టముగలిగియుండెను. హిందూ వితంతువుల వైధవ్యమునుగూర్చి యాయన పలుమారు దుఃఖించెను. అతిబాల్య వివాహములు వాని కిష్టములేదు. ప్రస్తుతము హిందూదేశమునందున్న వర్ణభేదము దేశమున కరిష్టదాయకమని యతఁడు తలంచెను. అతఁడు చనిపోవుటకుముందు పదియేండ్ల క్రిందటివఱకు దొరతనమువారు మన సంఘవిషయములలో జోక్యము కలుగఁజేసికొనఁగూడదని యభిప్రాయపడుచు వచ్చెను. కాని యిటీవల 1890 వ సంవత్సరమందు 12 సంవత్సరముల లోపుబాలికలకు గర్భాదానము చేయఁగూడదని దొరతనమువారు చట్టము నేర్పఱచినప్పుడు హిందువులంద ఱదికూడదని వాదించుచుండ నప్పుడు తిలాంగుగారు తన తొంటి యభిప్రాయమును మార్చుకొనియెను. దేశాధిపతులు ప్రజలను సర్వవిధముల గాపాడవలసిన భారము వారిపై నున్నది గనుక దురాచారముచేత బాధపడు ప్రజలనుగూడ రక్షింపవలసినదే యని యాయన యభిప్రాయము. అందుచే దురాచారముల నడచుచట్టముల నేర్పఱచుటలో దొరతనమువారు మంచిపనియే చేసెనని యాయన సంతోషించెను. బొంబాయి నగరమందు స్థాపింపఁబడిన స్త్రీపునర్వివాహసంఘమునకు సభాధ్యక్షుఁడుగా నుండెను. సంఘసంస్కారముమీఁద నభిమాన మెంతయున్నను తిలాంగు తన సంస్కారపద్ధ

తుల నాచరణములోనికిఁ దెచ్చినవాఁడుకాఁడు. అతిబాల్యవివాహము లిష్టములేకున్నను 1893 వ సంవత్సరమున నితఁ డెనిమిదేండ్ల వయస్సుగల తనకూఁతునకు వివాహముచేసెను. హిందూదేశస్థు లనేకు లిదివిని యైకకంఠ్యముగ వాని నధిక్షేపింప నప్పుడాయన తానుచేసినది తప్పేయనియుఁ దనశరీరస్థితి చెడిపోవుటచే తాను బ్రతికియుండగానే కూఁతురు వివాహము చేయవలయునని యట్లుచేసితిననియు జాలవిచారించెను. "ప్రమాదో ధీమతామపి" యన్నట్టు లెంతవారికైన లోపము లుండకపోవుగదా! ఇది తప్ప యతనియం దేవిధమయిన లోపములు లేవు. ఈయన మరణమువల్ల హిందూదేశమున కంతకు గొప్పనష్టము గలిగెనని జనులు భావించిరి.

---

# విశ్వనాథనారాయణమండలికుఁడు

మహారాష్ట్రమందలి కొంకణగిరి జిల్లాలో మురుదా యనునొక గ్రామముగలదు. విశ్వనాథనారాయణమండలికుఁడు 1833మార్చి 8వ తారీఖున జన్మించెను. ఈమండలీకకుటుంబము పూర్వకాలమునందు శ్రీమంతులగు పిష్వాలతో సంబంధబాంధవ్యంబులు కలిగియుండుటచే మిగుల గౌరవాస్పదమైనది. ఈతనిముత్తాత పీష్వాలయొద్దనొకమండలమునకు సుబేదారుగానుండెను. ఈమండలికుఁడు మొట్టమొదట నక్షరాభ్యాసము తనతాతయగు దుండిపంతునొద్దచేసి యనంతరము గ్రామపాఠశాలలోఁజేరెను. అక్కడ కొన్నినాళ్ళు గడచుటయుఁ దలిదండ్రులు వాని కింగ్లీషుచెప్పించుటకై రత్నగిరికిఁ బంపిరి. అతని యదృష్టవశమున నచ్చటపాఠశాలలో నుపాధ్యాయశిరోమణియగు రావుబహదూరు రామచంద్రబాలకృష్ణుఁ డనునతఁడు ప్రధానోపాధ్యాయుఁడై యుండుటచే నక్కడ యున్నంతవఱకు విద్యఁ జక్కఁగనేర్చి పిమ్మట బొంబాయికిఁబోయి యెల్ఫినిష్టనుపాఠశాలలో నతఁడుచేరెను. పూవుపుట్టగానే పరిమళించునన్నట్లు మండలికుఁడు విద్యార్థియై యున్ననాఁడె తెలివికిఁ బ్రసిద్ధికెక్కి పీజుస్కాలరుషిప్పను పేరుగల విద్యార్థివేతనమును సంపాదించెను. అక్కడ నుపాధ్యాయులుగనున్న దొరలనేకులు తెలివితేటలంబట్టి యాబాలునిమీఁద నెంతయు నభిమానముఁబూనిరి. ఆపాఠశాలలోని యొజ్జల కతనిమీఁద నెంతయభిమానము నెంతగౌరవముఁ గలవో యీక్రింది పనివలనం దెలియవచ్చును.

ఆబడిలోనున్న గణితశాస్త్రపండితుఁ డొకమాసము సెలవుపుచ్చుకొనెను. మండలీకుఁ డప్పటికింకను విద్యార్థియై యుండినను పాఠశా

లాధికారు లామాసముదినములు పనిచేయుటకు బాలుఁడని యెంచక వానినే నియమించిరి. పాఠశాలాధికారులు వానిప్రజ్ఞకు మిక్కిలి సంతసించి 1851-52 సంవత్సరములకు వ్రాసిన సంవత్సరచర్యలో వానినిగూర్చి యిట్లువ్రాసిరి. "విశ్వనాథనారాయణ మండలికుఁడు మిక్కిలి చురుకుగల విద్యార్థియని మేము నిరుడే వ్రాసితిమి. ఈసంవత్సరపు విద్యార్థులలోఁగూడ నతఁడే ప్రసిద్ధుఁడు. ఈసంవత్సరము పేటన్ పండితుఁడు సెలవుదీసికొనిన నెలలో నితఁడాపనిచేసెను. చేసినపని మిక్కిలి తృప్తికరముగా నున్నది."

ఆకాలమున బి. ఏ. మొదలగు పరీక్షలులేవు. అప్పుడున్న పరీక్షలలోఁ గొప్పదానియందు మొదటివాఁడుగ మండలికుఁడు కృతార్థుఁడయ్యెను. విద్యాసమాప్తమగునప్పటి కతనికిఁ బందొమ్మిదవయేడు. అందుచే నతని గురువులలో నొకఁడు సీమకుఁబోయి శివిలుసర్వీసుపరీక్షకుఁ జదువుకొమ్మని వాని నెంతయుఁ బురికొల్పె. కాని వాని కుటుంబ మట్టియున్యయమును బూనినియ్యకపోవుటచే నతఁడు చిన్నతనమందే యుద్యోగము సంపాదింపవలసి వచ్చెను. సింధుదేశమున దొరతనమువారి యేజంటుగానుండి 'సర్ లిగ్రాండుజేకబుదొర'గారు కార్యనిర్వాహకమందుఁ దనకు సహాయకుఁడొకఁడు కావలయునని కోరఁగాఁ గొందఱుదొరలు మండలీకు నప్పగించిరి. ఆజేకబుదొరగారు తనక్రిందపనిచేయుచున్న మండలికునిమీఁదజాలనభిమానముగలిగి యాకాలపు గొప్పదొరల పరిచయము వానికిఁ గలుగఁజేసెను. మండలీకుఁడు తనయొద్ద కనఁబడు సుగుణముల కన్నిఁటికిఁ గారణమాదొరలతోఁ దానుచేసిన స్నేహమేయని పలుమారు చెప్పుచువచ్చెను. అతఁడు వారియొద్దనుంచి నేర్చికొనిన గుణములివి—పట్టుదలతోఁ బనిచేయుట. కార్యదీక్ష. సంపూర్ణ స్వతంత్రబుద్ధి. మఱియు నీగుణంబులగు మెఱుగుబెట్టిన దొకటిగలదు. అదియేమన తనయర్థ్వాకృత్యము

నం దేమరిపాటులేక పనిచేయుట.

ఈతఁడు కొంతకాలము పాఠశాలలుపరీక్షించు సహాయపరీక్షకుఁడుగా, బిదపసబుజడ్జీగాఁ బిమ్మట దొరతనమువా రచ్చువేయించిన పుస్తకముల విక్రయించు నుద్యోగస్థుఁడుగ ననంతరము వచ్చుబడిపన్నునుగూర్చి యేర్పడిన కమీషనరుగారికి సహాయుఁడుగానుండి యుద్యోగములుచేసెను. కాని దొరతనమువారి యుద్యోగములో నున్నంత కాలముతన తెలివితేటలు బయలుపడవనియు దొరతనమువారుమిక్కిలి దయగలిగి యిచ్చినపక్షమున నింకనొకటిరెండుగొప్పయుద్యోగములే యిచ్చెదరనియు నల్లవారికి తెల్లవారితో సమానముగ నుద్యోగములీయరనియు నతఁడునిశ్చయముగ నమ్మి హైకోర్టులో న్యాయవాదిగ నుండుట మంచిదనితలంచి సర్కారుపనిమాని న్యాయవాదిపరీక్షయందుగృతార్థుఁడై 1863 వ సంవత్సరమున హైకోర్టులో వకీలుగఁ జేరెను. అప్పుడుహైకోర్టులో బుద్ధిసూక్ష్మత గల న్యాయవాదులు లేనందున మండలీకునివంటి నేర్పరికి వ్యాపకమున కవకాశముండెను. అప్పటిన్యాయవాదులలో నింగ్లీషునేర్చినవారు మిక్కిలితక్కువ. జడ్జీలలో సహితముహిందూధర్మశాస్త్రము నిశ్శంకముగా నేర్చినవారులేరు. అందుచేత నతఁడు స్వల్పకాలములోనే చాలధనము సంపాదింప గలుగుట యేగాక జడ్జీల గౌరవమునుగూడ సంపాదించెను. ప్రజలు తనకిచ్చిన వ్యాజ్యములలోనున్న సంగతులు శ్రద్ధతోఁ జదివి వచ్చినవారి కేదో యుపకారము చేయవలయునని తలంచువాఁడు. వేళమీరి యెన్నడు కోర్టునకుఁబోవలేదు. ఒకానొరి పునహాకోర్టునకుఁ బోవలసియుండ బొంబాయిహైకోర్టులోనున్న పనితొందరవల్ల జాగుచేసి యతఁడుపొగ బండి నందుకొనలేకపోయెను. బండిమించినది నేనేమిచేయనని వంకబెట్టక సొమ్ముమాచుకొనక బొంబాయినుండి పునహాకు తనకు బ్రత్యేకముకపొగబండి నేర్పరచుకొని యుచితసమయమున కక్కడకుబోయి

వానిపక్షమువాదించెను. మరియొకసారి కొంకణదేశమున రత్నగిరికిఁ బోవలసియుండి యక్కడ బాగయోడ దొరకక యుండుటచే ప్రత్యేకమొకపొగయోడ తననిమిత్తము దెప్పించుకొని చాలసొమ్ముమవ్యయముచేసికొని యాయూరు చేరెను.

అతఁడు న్యాయవాది శబ్దమును సార్థకము చేసిన న్యాయవాది వ్యాజ్యములు తనయొద్దకుఁదెచ్చినవారికి రుసుమెన్నడునీయలేదు. తన కెంతెంత ధనమిచ్చెదనన్నను సరేయోడినవారిపక్షముననెన్నడునతఁడు పనిచేయువాఁడుకాఁడు. ఆకాలమందు హైకోర్టులో నసలువ్యాజ్యములవిచారణకు నప్పీళ్లవిచారణకుఁ గొంతభేదముండెను. అప్పీళ్ళవిచారణలోనున్నంతేసులువు అసలువ్యాజ్యములలో లేదు. అందుచేత రెండింటికి సమానమైన సౌకర్యములు సేయుమని మండలీకుఁడు జడ్జీలను వేడెను. వారట్టివిధముగా నందఱకుఁ జేయుట కిష్టపడక కావలసినయెడల మండలీకునకు మఱియొకరిద్దరికి నుపకారముచేయుదు మనిరి. మండలీకుఁడు స్వప్రయోజనపరుఁడు గాకపోవుటచే నందఱకు లేని సౌకర్యము తనకొక్కనికి నక్కరలేదని నిరాకరించె. 1884 వ సంవత్సరమున గవర్నమెంటువకీలుగానుండిన నానాభాయి హరిదాసు హైకోర్టు జడ్జీగా నియమింపబడెను. అందుచే దొరతనమువారు మండలీకుని తమ వకీలుగా నియమించుకొనిరి.

మండలీకునిగొప్పతనము చాలధనము సంపాదించిన న్యాయవాదియనియేగాదు. అతఁడుబొంబాయిలో మునిసిపల్ కమీషనరుగా నుండెను. అదియునుగాక గొప్పసంస్కృతపండితుఁడు. మఱియు దేశభాషనుజక్కనేర్చియందనేకగ్రంథములువ్రాసెను. కొంతకాలమువార్తాపత్రికలనుగూడ నడపెను. దొరతనమువారి శాసననిర్మాణ సభలోఁ జాలకాలము సభికుఁడై యుండెను. వేయేల! అతఁడు జనులవిశ్వాసమునకుఁ బాత్రుఁడై యెల్లవిషయముల వారి కాలమందు నాయకుఁడై

యుండెను. 1865వ సం॥ దొరతనమువారతనికి "జస్టిసుఆఫ్‌దిపీస్" అను గౌరవోద్యోగమునిచ్చిరి. ఇది బెంచిమేజస్ట్రీటు మునిసిపల్‌కమీషనరు మొదలగు నుద్యోగములవలె జీతములేనిదై గౌరవమున కధికారము గలదై యుండెను. ఆకాలమందు బొంబాయిలో మునిసిపాలిట్టీ యే ర్పడనందున నగరముయొక్క పారిశుధ్యమును విచారించు నధికార మీజస్టిసునందేయుండెను. ఈజస్టిసులందఱికి నొకప్రధాన పురుషుని దొరతనమువారేర్పరచి కార్యనిర్వాహకమంతయు వానికప్పగించిరి. అతఁడు మిక్కిలి బుద్ధిశాలియు లోకానుభవము గలవాఁడునయినను ధనమనావశ్యకముగా వ్యయము చేయుటయు నప్పుడప్పుడపహరించు టయు మొదలగుదురభ్యాసముల కలవడెను. విశ్వనాధ నారాయణ మండలికుఁడు వాని చెడుచేఁతలకిష్టపడక యెదిరించి వానిగుట్టు బయ లుపెట్టఁజూచెను. స్థితిగతులు బొత్తుగ చెడిపోయినవని దొరతనమువా రుగ్రహించి 1872వ సంవత్సరమున మునిసిపాలిటీయేర్పరచి బొంబా యినగరమును జస్టిసుచేతిలోనుండి తప్పించి యామునిసిపాలిటికి నప్ప గించిరి. మండలీకుఁ డీసభలో ప్రధానసభికుఁడై యుండెను.

1879వ సంవత్సరమందును మరల నెనుబదియవ సంవత్సరమం దును మండలీకుఁడు బొంబాయి మునిసిపల్ చేర్మెన్‌గా నియమింపఁ బడెను. బొంబాయివంటి మహానగరమందు నంతటియధికారముచేయు టమిక్కిలికష్టమైనను మండలీకుఁడు నిష్పక్షపాతముగను న్యాయము గను జనసమ్మతముగను వ్యవహరించెను. 1862వ సంవత్సరమం దతఁ డుబొంబాయి యూనివర్సిటీలో సభికుఁడయ్యెను. అందుండిపలుమా రు లాయన మహారాష్ట్రభాషలోను సింధుభాషలోను గుజరాతు భాషలోను పదునాలుగు సంవత్సరములు బియల్ పరిక్షలోను బరీక్ష కుఁడుగానుండెను.

1874వ సంవత్సరమునం దాయన బొంబాయి దొరతనము

వారి శాసననిర్మాణసభలో సభికుఁడయ్యెను. ఈసభలో నిదివఱ కనే కులు సభికులై యుండిరికాని ప్రజలపక్షమువాఁడితఁడే. అదివఱకు దొరతనమువారు సాధారణముగా మహారాజులను జమీందారులను నేర్పరచుటచేవారందరు గంగిరెద్దులవలె దొరలేమాటలాడిన నామాటలకే తలలూఁచుచుండెడివారు. మండలీకుఁడు గవర్నమెంటువారిచే నేర్పరుపబడినను ప్రజలకు నష్టమువచ్చు శాసనము లేర్పరచునప్పుడు ప్రజాపక్షముఁబూని పోరాడుచు ధైర్యశాలి యెంతపనిచేయగలఁడో యదిచూపెను. శాసన నిర్మాణసభకుఁ మండలీకునట్లు మఱియొకరు తగియుండరు. ఏలయన నతఁడు పరిపూర్ణపండితుఁడు బుద్ధిశాలియగు న్యాయవాది. గొప్పయనుభవశాలి. దేశస్థితిగతులు చక్కఁగానెఱిఁగిన వాఁడు. మఱియుస్వతంత్రుఁడు. అధికారులు కన్నెఱ్ఱజేసిన మాత్రమున వెఱచి తన యభిప్రాయములను దాఁచుకొనువాఁడుకాఁడు. ఒకసారి వానినొక గవర్నరు బెదరించెనఁట. మండలీకుఁడు వానియాటలు తనయొద్ద సాగిరావని మెల్లగఁ జెప్పి మందలించెనఁట. అతఁడు బొంబాయి శాసననిర్మాణసభలో వరుసగా మూఁడుసారులు సభికుఁడుగా నేర్పరుపఁబడెను.

1884 వ సంవత్సరమునం దతఁడు గవర్నరుజనరల్‌గారగు రిపన్ ప్రభువుగారిచేత వారి శాసననిర్మాణసభలో సభికుఁడుగా నియమింపఁబడెను. బొంబాయిదేశస్థుఁడు గవర్నరుజనరలుగారి యాలోచన సభలో సభికుడగుట కదియే మొదలు. ఆసభలోఁ గూర్చుండుట కతఁడు బొంబాయినుండి పోవునప్పుడు పౌరులు వాని నుత్సవముజేసి మన్నించిరి. కలకత్తా చేరినతోడనే యానగరవాసులుగూడ వానిని సన్మానించిరి. రైపన్‌ప్రభువుగారి తరువాత వచ్చిన డఫిరిన్‌ప్రభువుగారును వానికి శాసననిర్మాణసభలో సభికత్వమిచ్చి గౌరవించిరి. అతఁడు సభికుఁడుగా నున్నకాలమున వచ్చుబడిపన్ను కట్టుట మొద

లగు కార్యము లనేకములు జరిగెను. అట్టిపన్నులు కట్టఁగూడదని యతఁడు శక్తివంచన లేక దొరతనమువారితోఁ బోరాడెను. దేహా రోగ్యము సరిగా నుండక పోవుటచే నతఁడు 1887 వ సంవత్సరమున దనసభికత్వము మానుకొనెను. కలకత్తానుండి యతఁడు వచ్చినతోడనే దేశమునకతఁడు చేసినయుపకారంబులంబట్టి వానిపేరు స్థిరముగా జ్ఞాపకముండునటులేపని జేసిన బాగుండునని యోచించుటకు బొంబా యిలో నొకసభ జరిగెను. ఏటేట నొకబంగారు పతకమతని పేరచేయిం చిసంస్కృతభాషావిషయమున మంచి యుపన్యాసమువ్రాసిన విద్యా ర్థికి బహుమానమిచ్చుటకును వానిప్రతిమనొకటి తెప్పించి జనులంద ఱువచ్చుచుఁ బోవుస్థలమున నుంచుటకును నాడు జనులునిశ్చయించిరి. పునహానగరమందుఁగూడ నట్టిసభ యేజరిగెను. అక్కడిజనులును వేద శాస్త్రపండితునకు మండలీకునిపేర నేటేట బహుమానమీయ నిశ్చయించిరి.

మండలీకుఁడు విద్యాభిమాని,గ్రంథకర్తయని యీవఱకేచెప్పి యుంటిని. మొదటనతఁడు దేశభాషలోఁ గొన్నిగ్రంథములురచించెను. అతఁడు విద్యార్థియైయుండిననాడే యింగ్లీషులో లాటరీయను పేరనున్న చిన్నినీతికథను మరాఠీభాషలోనికిమార్చి బహుమానమందెను. తరు వాత రాజకీయవ్యవహారములందెలుపు నర్థశాస్త్రమును భాషాంతరీకరిం చెను. సింధుదేశమున నున్నకాలమున సింధుభాషను నేర్చుకొని దాని లోఁ జిన్నవ్యాకరణమును వ్రాసెను. గుజరాతీభాషలోఁజాలపరిశ్రమ జేసియాయన ఎల్ఫినిష్టను దొరగారుచేసిన హిందూదేశచరిత్ర నాభా షలోనికి మార్చెను. ఈగ్రంథము పాఠశాలలో విద్యార్థులకు బఠనీయ గ్రంథముగా నేర్పరుపఁబడెను. 1867 వ సంవత్సరమున నతఁడు హిం దూలాసంగ్రహమనునొకగ్రంథమునింగ్లీషున వ్రాసిదానికిగుజరాతిలో నర్థమువ్రాసెను. అదియేయిప్పు డనేకులు జదువుచుందురు. మఱియు

నతఁడు కిండరసులేదొరగారు రచించిన సాక్ష్యశాస్త్రమును స్వభాష లోనికిమార్చెను. సివిలధికారము క్రిమినలధికారము కలక్టర్ల చేతులలో నుండి తప్పింపవలసినదని యాయన యభిప్రాయపడితద్విషయమున నాయన కొంతవ్రాసెను. ప్రాచీన శాసనాదులఁగూర్చి బొంబాయిలోనున్న యాసియాఖండ సంఘమువారియెదుట నతఁడొకయుపన్యాసముల్ చదివెను. నీలకంఠ వ్యాఖ్యానముతోనున్న యాజ్ఞవల్క్యస్మృతిని నిర్దోషముగా నతఁడచ్చువేయించి దానికింగ్లీషున భాషాంతరీకరణము గావించి ప్రచురించెను. అదిహిందూధర్మశాస్త్రమును గరతలామలకముగ దెలుపునని యాకాలమున నెల్లవారు గొనియాడిరి. ఆగ్రంథమునకు మండలీకుఁడు చక్కనిపీఠికవ్రాసి దానిలోహిందూధర్మశాస్త్రముయొక చరిత్రము దానిస్వభావము నిర్వచించి స్మృతులను విభాగించి స్మృతిప్రమాణములకుననుగుణముగా కోర్టులిచ్చినతీర్పులం దుదాహరించిభిన్నములగు నాచారవ్యవహారములను జేర్కొని యెల్లవిధముల గ్రంథమత్యంతోపయుక్తములగునట్లు చేసెను. అతఁడు పత్రికాప్రవర్తకుఁడని కూడనీవఱకుఁజెప్పియుంటిని. అతఁడు"స్వదేశీయులయభిప్రాయ"మను పేర నొకయింగ్లీషుపత్రికను 1864 వ సంవత్సరమున స్థాపించి 1871 వ సంవత్సరమువఱకుఁ బ్రకటించెను.

అతఁడుచేసిన దేశోపకారమునెఱింగియెదొరతనమువారుగూడ వానిని చాలగౌరవించిరి. అతఁడుస్మాల్కాజ్ కోర్టులో స్పెష్టసుపని మానుకొనినప్పుడు దొరతనమువారదివఱ కతనికి నుద్యోగవశమున నిచ్చిన రావుసాహేబుబిరుదము యావజ్జీవముంచుకొనవచ్చుననియుత్తరువిచ్చిరి. గవర్నరుగారి యాలోచనసభలోసభికుఁడుగనున్న కాలమునబొంబాయినగరమునకు షరీఫుగనుండుమని యతనిని గోరిరి. కాని యతఁడు రెండు పనులుఁ జేయుటకుఁ వీలులేదని యాయుద్యోగము వద్దని చెప్పెను. 1876 వ సంవత్సరమున గవర్నరుజనరలుగారగు లిట్టనుప్రభువుగారుబా

లురపాఠశాలలలోఁ జదువవలసినపుస్తకముల నిర్ణయించుటకొక్కసభ కూర్పఁదలచి యందు మండలీకు నొకసభికునిగ నియమించెను. కాని యతఁడు శరీరదార్బల్యముచేత నందుండుటకు వీలులేదనిమానుకొనెను 1877వ సంవత్సరమున విక్టోరియారాణిగారుచక్రవర్తినిబిరుదమువహించినప్పుడు "హిందూదేశమిత్రజ్యోతి" యనునర్థమువచ్చు సి. యస్. ఐ. యను బిరుదును దానితో నొకవెండిపతకమును దొరతనమువారతని కిచ్చిరి.

మండలీకుఁడు 1889 వ సంవత్సరము మేనెల తొమ్మిదవతేదిని కాలధర్మమునొందెను. ఆదినమునందే బొంబాయి మునిసిపాలిటీవారు సభగూడి విశ్వనాథనారాయణమండలికుఁడుమునిసిపల్ కమీషనరుగా నుండియు జస్టిసుగానుండియు బొంబాయినగరమునకు జేసినమహోపకారమునకు గృతజ్ఞులై యతనిమరణమునకు విచారించిరి. అతనిమరణమునుగూర్చి శోకించుచు జనులు మహారాష్ట్రదేశమునందంతటసభలు జరిపిరి. ఆతనికిసంఘసంస్కరణమిష్టములేదుకానివితంతువులకుఁదలగొరిగించుటయతఁడొప్పుకొనలేదు. పూర్వాచారములన్నియు నతనికిష్టములయినను విదేశీయములుమరల గొన్నికట్టుబాటులమీఁదసంఘమున జేర్చుకొనవచ్చునని యతఁడు చెప్పుచువచ్చెను. అతనిభార్య యెల్లప్పుడు రోగిష్ఠయైయుండెను. అయినను మండలీకుఁడు సత్ప్రవర్తకుఁడైదయాళువై యామెకుపచారములుచేయించుచు నేకపత్నీ వ్రతస్థుఁడై కాలముబుచ్చెను. ఆతఁడు బంధువులకు చాలధనసహాయము జేసెను. భార్యకోరికమీఁద నామెయుం దాను వెండితోఁ దులాభారముదూఁగియా సొమ్మదానముచేసెను. ఆకాలమం దెల్లవిధముల నంతవాఁడు లేఁడని యెల్లవారు నంగీకరించిరి.

---

# మహాదేవగోవింద రెనడీ

మహాదేవగోవింద రెనడీ 1842 వ సంవత్సరం జనవరి 20 వ తేదీని జన్మించెను. ఈయన మహారాష్ట్రబ్రాహ్మణుఁడు. తండ్రి కొల్లాపుర సంస్థానములో నుద్యోగస్థుఁడు. రెనడీ ఎల్ఫినిష్టనుకాలేజీలోచేరి క్రమముగా విద్యాభ్యాసముచేసి 1862 వ సంవత్సరము బి. ఎ. పరీక్షయందును 63వ సంవత్సరమందు యమ్, ఎ. పరీక్షయందును గృతార్థుఁడై బంగారుపతకమును బహుమానము బడసి 1866 వ సంవత్సరమున యల్.యల్.బి. పరీక్షయందుఁ దేరెను. విద్యముగించినపిదప నతఁడు గవర్నమెంటువారికిమహారాష్ట్రభాష నింగ్లీషులోనికి భాషాంతరీకరించునుద్యోగమునం బ్రవేశించెను.తరువాతనతనికిఁగొల్లాపురసంస్థానములో జడ్జీపనియైనది. 1868వ సంవత్సరమందు మున్నుదాను చదువుకొన్న కళాశాలలోనేఇంగ్లీషుభాషాపండితుఁడుగ నతఁడు నియమింపబడుటచే జడ్జీపని స్వల్పకాలములోనే మాను కొనెను. హిందూదేశస్థు నొకనిని దొరతనమువా రింగ్లీషుభాషా పండితుఁడుగ జేయుటమనకుపూర్వగౌరవము చూపుటగదా! బొంబాయిరాజధానిలో విద్యాశాఖకధిపతిగాఁ (ననఁగా డైరెక్టరుగ) నుండినసర్ అలగ్జాండరుగ్రాంటుదొరగారు సీమకుబోవునపుడు రెనడీగారిని గూర్చి మాటలాడుచు నతఁడాకళాశాలకు భూషణమనియు నతనిబుద్ధిసూక్ష్మత నిరుపమానమనియుమిక్కిలికొనియాడెను. ఒకసారి రెనడి విద్యార్థిగానున్నప్పుడు గ్రాంటుదొరగారు వానిని దేశచరిత్రలలలోబరీక్షించితనప్రశ్నలకతఁడిచ్చినయుత్తరముల నుమున్నుదానుచదువుకొన్న యాక్స్ఫర్డుకాలేజీకి పంపెను. హిందూవిద్యార్థుల తెలివితేటలు సీమలోనున్న దొరలకుఁదెలుపుటకైయతఁడీపని జేసెను. చెన్నపట్టణములోనుండిన పూండిరంగనాథము మొదలియారు

గారికి నిట్టిగౌరవమే జరిగెను. ఆయనను గణితశాస్త్రములో బరీక్షించి డైరక్టరుగారు ఉత్తరపుకాగితములను సీమ కంపిరఁట. రెనడీగారి కద్భుతమైన జ్ఞాపకశక్తి గలదు. ఏపుస్తకమయిన నొకసారి జదివి యందలి ముఖ్యసారాంశమును మరల వ్రాయగలిగినవాఁడఁట. కళాశాలలో నతఁ డుపాధ్యాయుఁడుగనుండి బాలురకిచ్చు నుపన్యాసములు మిగుల మనోహరములుగను బహుశాస్త్రార్థ సమేతములుగ నుండుటచే తోడియుపాధ్యాయులు డైరక్టరుదొరగారుఁగూడ వాని కడకుఁబోయి విద్యార్థులతోపాటు గూర్చుండి యాయుపన్యాసములను వినుచుండెడివారఁట. ఏశాస్త్రమునుగూర్చియైన స్వయముగా నాలోచింపఁదగిన శక్తిగలవాఁడు హిందూదేశములో రెనడీయొక్కఁడే యని మఱియొక దొరగారు పలికిరఁట. 1871 వ సంవత్సరమున రెనడీగా రుపాధ్యాయపదవి మాని పునహానగరములో సబుజడ్జిగా నియమింపఁబడెను.

ఆ సంవత్సరమందే రెనడీ యడ్వొకేటు పరిక్షయందుఁ గృతార్థుఁడయ్యెను. దీనిచేత నతనికి నింగ్లీషుబారిష్టరుతో సమానమైన గౌరవముగలిగెను. అదిమొదలుకొని యతఁడు మృతినొందు వఱకు న్యాయాధిపతి పదవియందేయుండెను. 1871 వ సంవత్సరము మొదలుకొని పదిసంవత్సరములవఱకు నక్కడక్కడ సబుజడ్జిగానుండి 1881 వ సంవత్సరమందు పునహాసతారా చిన్నచిన్న కోర్టులను బరీక్షచేయుటకు జడ్జిగా నేర్పరుపబడెను. 1884 వ సంవత్సరమున నతఁడు స్మాలుకాజుకోర్టు జడ్జిగా నియమింపఁబడెను. అక్కడనున్నప్పుడె డక్కను కాలేజీలో రెనడీ ధర్మశాస్త్రవిషయమై కొన్ని యుపన్యాసముల నిచ్చెను. 1886 వ సంవత్సరమం దతఁడు గవర్నమెంటు వారిచేత హిందూదేశముయొక్క యాదాయ వ్యయములనుగూర్చి యేర్పరుపఁబడిన సంఘములో సభికుఁడుగా నియమింపఁబడి యప్పుడుగావించిన

యుత్కృష్ట సహాయమునకు దొరతనము వారిచేత సి. ఐ. ఇ. అను బిరుదము నందెను. అదియునుగాక దొరతనమువారు వానినెన్నియో పర్యాయములు గవర్నరుగారి శాసననిర్మాణ సభలో సభికుఁడుగ నేర్పఱచిరి. 1893 వ సంవత్సరము నవంబరు నెలలో కాశీనాథత్రియం బక తిలాంగుగారు లోకాంతరగతుఁ డగుటచే దొరతనమువారా నెల 23 వ తేదీని రెనడీగారిని హైకోర్టు జడ్జిగా నియమించిరి. నాఁడు మొదలుకొని రెనడీ తన మరణపర్యంతము నాయుద్యోగము మిక్కిలి సామర్థ్యముతో నిర్వహించెను.

ఆయన 1901 వ సంవత్సరము జనవరి 17 వ తారీఖున మృతి నొందెను. అతని మరణమునుగూర్చి హిందూదేశస్థులు తెల్లవారు సమానముగ శోకించిరి. దానింబట్టియే జనులకతనియం దెంత యను రాగము గలదో తెలియఁగలదు. ఇటీవలవారిలో నెవరిమరణము జను లకు రెనడీ మరణమంత విషాదమును గలిగింపలేదు. ఏలయన రెనడీ తన దేశస్థులయొక్క హృదయానురాగమునే సంపాదించు కొనెను. హిందూదేశముననున్న ప్రతిపట్టణమందు వానిమరణముగూర్చి శోకిం చుటకును వానికుటుంబమును పరామర్శచేయుటకును సభలుజరుపఁ బడెను. ఆ సభలలో హిందువులొక్కరే గాక సర్వమతములవారు సర్వాభిప్రాయములవారును వానియున్నత గుణములనుమెచ్చి తమ విషాదముం దెలిపిరి. బొంబాయి హైకోర్టు జడ్జీలు వానిమరణము తమహైకోర్టునకేగాక యావద్దేశమునకు నష్టకరమని వక్కాణించిరి. ఇండియాగవర్నమెంటువారు సయితము వానిమరణమునకు వగచుచు వాని సామర్థ్యాదులంగూర్చి యీ క్రిందివిధముగ వ్రాసిరి. అత్యధిక సామర్థ్యము పాండిత్యము స్వతంత్రస్వభావము గలిగిన రెనడీగారి మరణముచేత దేశమంతయు గొప్పనష్టముపాలైనది. అతఁడు హైకో ర్టుజడ్జీ యగుటచేత నతనికంతకీర్తి రాలేదు. అతని యితరగుణముల

ముందర నున్నతపదవి నెంతమాత్రమును బనికిరాదు. ఆతఁడుపరి పూర్ణపండితుఁడు. స్వతంత్ర స్వభావుఁడు. గాఢదేశాభిమాని. రాజనీతి విశారదుఁడు. గొప్పసంఘసంస్కారి. మతసంస్కారకుఁడు. ఇంకప్రవ ర్తనమును గురించి విచారించితిమా కేవ ము ఋషియని చెప్పవల యును. అతఁడు ప్రార్థన సమాజములో సభికుఁడు. మనస్సునందితఁడు బ్రహ్మసమాజ మతస్థుఁడు. అతని మరణానంతరము ప్రస్తుతము బొంబాయి హైకోర్టులో జడ్జిగానున్న చందావర్కరుగారు చిన్నమత విషయికోపన్యాసముచేసి రెనడీగారి జీవితము గొప్పదగుటకుఁ గార ణము నీ క్రిందివాక్యములతోఁ జెప్పెను.

"రెనడీగారన నెట్టివారనియు నతని జీవితమునందు బ్రధాన కీలక మేదనియు నన్ను మీ రడుగుదురేని యొక్కమాటలో జెప్పె దను. అతని యమితమైన భక్తియే గొప్పతనమునకుఁ గారణము. అతని యభిప్రాయప్రకారము మతమనఁగా నేజోక్యమునకుఁ బోక ముక్కుమూసికొని యొకమూలఁగూర్చుండుటగాదు. రాజకీయ విషయ ములలోను సాంఘిక విషయములలోను మతవిషయములలోను విద్యా విషయములలోను మనుష్యుఁడు ప్రవేశించి శక్తివంచనలేక దుర్గతిలో నున్నజనుల కుపకారముచేయుటయే మతమని యాయన యభిప్రా యము. ఏపనిలో నతఁడు ప్రవేశించినను దానిని మనఃపూర్వకముగా చేయువాఁడు. రెనడీ యొక్కొక్కప్పుడే దేవాలయమునందో పురాణార్థ ముల జనులకు బోధించుటయు మఱియొక్కప్పు డార్యసమాజము వారిపక్షమున నుపన్యాసమిచ్చుటయు యావజ్జీవము బ్రహ్మసమాజ సిద్ధాంతముల ప్రకారము నడచుకొనుటయుఁ బ్రార్థన సమాజములో సభికుఁడై యుండుటయు మన మెఱుంగుదుము. అదిచూచి కొందఱు రెనడీయొక్క మతమేదో తెలియక యతని చరిత్రము పరస్పర విరుద్ధ మని తలఁచి యతని మొగముమీఁదనే మాటలనుచు వచ్చిరి.

కాని దానియర్థము వారు గ్రహింపఁలేదు. ఆతని చరిత్రము విరుద్ధ
ముగాదు. మంచిమతములన్నిఁటియందు నతనికి సమానాదర ముండు
టచే నతఁ డేమతములోను జేరినవాఁడు కాఁడనుకొనుటకంటె యత
నిది విశాలహృదయమనియు నతఁడు సర్వసమానుఁడనియు మనము
భావింపవలసియున్నది. అతని యభిప్రాయ మేమనగా ప్రపంచము త్త
రోత్తర వృద్ధిగలదగుటచే క్రొత్త మతము లనేకములు పొడమినప్పుడు
వైరుద్ధ్యములులేక సామ్యముగల విషయములలో నన్నిమతములవారుఁ
గూడి పని చేసి దేశమునుద్ధరింపవలయునని."

అతఁడు తక్కిన రాజకీయాది విషయములలో జేసినపని
యటుండనిండు. ఆయన సంఘసంస్కార విషయమున జేసినపనికే
దేశస్థు లందఱు మిగుల కృతజ్ఞులై యుండవలయు. అన్ని సంస్కార
ములకంటె సంఘ సంస్కారమందే యతఁ డత్యాదరము గలిగి
యుండువాఁడు. ఈవిషయమున నతఁడు తన యావచ్ఛక్తిని ధార
వోసెను. ప్రతిసంవత్సరము దేశీయమహాసభ జరిగినపట్టణములోనే
సంఘసంస్కరణసభగూడ గావించుచు నచ్చటికి విధిగాదానుబోవుచు
నచ్చట సాంఘిక విషయమైన యుపన్యాస మొకటి తానుచేయుచు
నా సభలో జరిగిన చర్చలను స్వధనము వెచ్చపెట్టి ముద్రింపించుచు
మరణకాలమువఱకుఁ (ననగా బదునైదుసంవత్సరములు) ఆ మహా
త్ముఁడు పాటుపడెను. ఆయన నిజముగా మూఢాచారపరాయణులతో
యుద్ధముచేయుచునే ప్రాణములు విడిచెనని చెప్పవచ్చును. ఏలయన
నతనిమరణమునకు నిరువదిదినములక్రిందట దేశీయసభతోటిపాటు
లాహోరునగరములో సంఘసంస్కరణ సభజరిగెను. రెనడీరోగపీడి
తుఁడై కదలలేక మంచమెక్కి యుండుటచే నక్కడకెప్పటియట్ల పో
లేక వాగ్జాలముగ దానియ్యవలసిన యుపన్యాసమును వ్రాసి యొక
రిచే జదువ బంపెను. ఆరోగము మరల తిరుగనేలేదు. ఇతఁడు సంఘ

సంస్కారపక్షమువాఁడగుటచే వాని యభిప్రాయములు మతాంతరులగు తెల్లవారియభిప్రాయములేయని భావించి. దేశస్థులలోఁ గొందఱు తమకతఁడుచేయు నుపకారమెఱుంగక వానిని నవనాగరికుఁడని పూర్వాచార ద్వేషియని దేశమునకు శత్రువని యీ ప్రాంతముల సంస్కర్తల నిచ్చటివారు నిందించినట్లె నిందింపఁజొచ్చిరి.

సంఘసంస్కారము యుక్తమైనదని తగిన హేతువులుచెప్పి మన స్వదేశస్థులను మెప్పించుటకే యతఁడెంతో కష్టపడుచుండ కొందఱాంగ్లేయులుగూడ నవనాగరికుల నధిక్షేపించుచు వచ్చిరి. రెనడీ వారికిఁగూడ దగిన యుత్తరములు చెప్పవలసివచ్చెను. కాశీనాథ త్రియంబక తిలాంగుగారు కొన్నియెడల పూర్వాచారపరాయణుఁడై కొన్ని విషయముల నవనాగరికుఁడై రెనడీవలెనే యుండి సంఘసంస్కారమునకై పాటుపడెను. అతనిని బూర్వాచార పరాయణులుఁ గొందఱు తెల్లవారుగూడ విరుద్ధవర్తనుఁడని యధిక్షేపించిరి. ఆ యధిక్షేపణలకు రెనడీ ప్రత్యుత్తరముల జెప్పుచు తిలాంగుగారి వర్తనమందు విరుద్ధమేమియులేదని యీ క్రిందివిధముగ మాటలాడెను. ఈసంగతులతఁడు ముఖ్యముగఁ దెల్లవారినుద్దేశించియేపలికెను. "పరిపూర్ణమైన నాగరికతగలిగిన మీరు ప్రస్తుతప్రాచీననాగరకతల మధ్యమునబడి పరస్పరవిరుద్ధములగు రెండుమతములసందుననిరికియగచాట్లపడుచున్న మమ్ముంజూచి మావర్తనమునర్థముచేసికొనలేకయున్నారు. అట్టిద్విభావమక్కర లేదనితలంచువారుమాలో కొందఱున్నారు. వారియభిప్రాయమే మన దేశకాలపాత్రములబట్టి మనకేమార్పులు రాలేదనియుమనపూర్వులున్నట్లెయితరప్రపంచ సంబంధము లేక మనముగూడ నుండవచ్చుననియు, వారిమాట యటుండనిచ్చి రెండవపక్షము జాతము ప్రాచీనమైనదంతయు జచ్చినదనియు దానితో మనకేసంబంధము లేదనియుప్రస్తుతనాగరికతనుభవిష్యత్కాలమందువచ్చు

నాగరికతనుసమగ్రిముగ నవలంబించిబ్రితుకుటయే మనకు గార్యమని యు దలంచువారును మనలో ననేకులుగలరు. ఈయిరువురకు నడుమ మరియొక జిన్న తెగగలదు. ప్రాచీననాగరికతలో మంచినంతను మన మవలంబించుచు నీశ్వరేచ్ఛచేత మన దేశమున వ్యాపించుచున్న నవనాగరికతనుగూడవదలక దానిలోనున్న మంచినిగూడ గ్రిహించియారెంటికి సమన్వయముచేసి మనములాభమునొందవలయుననియునీ తెగవారు దలంచుచున్నారు. ఇట్లు మే ముభయ పక్షములు నవలంబించుటచే మామిత్రిలు శత్రిువులుగూడ మాయభిప్రాయమునర్థముచేసికొన లేక యున్నారు. గతించిన మనమిత్రుఁడు వేదాంతమార్గప్రదర్శకుఁడుధీరుఁడు నగు తిలాంగునిశ్చయముగనీ తెగలో జేరిననాఁడే. ఆసచ్చరిత్రుఁడు క్రొత్తనాగరికతను వదలి పూర్వాచారపరాయణుఁడై యుండినను లేక పూర్వాచారములనువదలినవనాగరికుఁడై ప్రాచీనమంతయువదలుకొని యుండినను పాపమింత స్వల్పకాలములో మృతినొందక దీర్ఘకాలముజీవించియుండునని నేను తలంచుచున్నాను. అట్లయినచో నతనికి విచారము లుండకపోవును. దేహస్థితిత్వరగా చెడకయుండును. తిలాంగువానిమిత్రులు పడియెడుమనఃపరితాపమునుమనయింగ్లీషుమిత్రులెఱుఁగక ద్విభావము గలవారని వారి నధిక్షేపించుచుందురు.

రాజకీయ వ్యవహారములయందునువానికిమిక్కిలిప్రవేశముగల దు. అతఁడుగవర్న మెంటువారి యుద్యోగస్థుఁడైనను దేశీయమహాసభ నుస్థాపించినవా రనేకాంశములలో నితనియాలోచనమును గ్రిహించుచువచ్చిరి. బొంబాయిరాజధానిలో నతనిచేతసవరింపఁబడనిగొప్పమహాజరులు వానియాలోచనము పుచ్చుకొననిఘనకార్యములువానిచేతనుపదేశముపొందని ఘనపురుషులు లేరఁట. ఆతనికి దేశచరిత్రములయందుమిక్కిలి యభిరుచి. కడసారియతఁడుచదివినపుస్తకముగూడనొక దేశచరిత్రియే. స్వదేశపువ్యాపారమును వృద్ధిపొందుటయుశిల్పవిద్యాదు

లుమనవారు నేర్చుకొనుటయునున్నప్పుడే మన దేశము బాగుపడునని యాయనతలంచెను. మహారాష్ట్రబలోదయమను పేర రెనడీ యింగ్లీషులో నొకచరిత్రమువ్రాసెను. అందుఁ బ్రథమభాగముమాత్రమే ముగిసినది. రెండవభాగము ముగియకమునుపే మృత్యుదేవతయొక్క క్రూరహస్తమువానినెత్తుకొనిపోయెను. ఆగ్రంథముముగిసినపక్షమున హిందువులకెంతయోలాభముకలిగియుండును. హిందువులు మిక్కిలి దురదృష్టవంతులగుటచేతనేయాయుదారశీలుఁడంతత్వరలోఁజనిపోవుటయు నట్టియుద్గ్రంథము ముగియకపోవుటయుసంభవించెను. అతనియుద్యోగముకన్న పాండిత్యముకన్న వానిసద్గుణము లేజనులకతనియందనురాగమును బెంచినవి. మహాధికారియయ్యు నతఁడందఱికినొదిగియుండును. మహాపండితుఁడయ్యు శిష్యుఁడట్లువినయమున నేర్చుకొనఁజూచును.పరులమనస్సులునొవ్వకుండ తనయభిప్రాయమును జెప్పుచుండును. ఈతఁడు,రామమోహనరాయలు,విద్యాసాగరుఁడు, దేవేంద్రనాథటాగూరు కేశవచంద్రసేనుడు, ఆనందమోహనబోసు మొదలగుమహనీయులవలె మతాదిసంస్కారములలోఁగార్యశూరుఁడుగానుండలేకపోయినను మనసులో సంస్కారమన్న మిక్కిలియిష్టముగలవాఁడు.ఈయనచరిత్రము హిందూదేశస్థులు చిరకాలము జ్ఞాపకముంచుకోఁదగినది.

---




నవాబు సర్ సలార్ జంగు.

# నవాబు సర్ సలార్ జంగు

సలారుజంగు 1829 వ సంవత్సరమున హైదరాబాదునగరమున జన్మించెను. ఈయన సంపూర్ణమైన పేరు మీర్తురాలలీఖాను. ఈయన గొప్పకుటుంబములోనివాఁడు. ఈయనపూర్వులు మహమ్మదుగారికి బ్రియపట్టణమగు మదీనానగరమునుండిహిందూస్థానమునకువచ్చి హైదరబాదులో కాపురముండిరి. ఇంగ్లీషువారికిమైసూరుప్రభువగుటిప్పూ సుల్తానునకు 1799 వ సంవత్సరమున యుద్ధముజరిగినకాలమున సలారుజంగుయొక్క ముత్తాతమీరాలమ్మనుసతఁడు హైదరాబాదునిజాముగారియొద్ద దివానుగానుండెను. హైదరబాదుసంస్థానమునకు చందూలాలు దివానుగానున్నప్పుడుసలారుజంగుయొక్క తాతమనీరుల్ముల్కు వానితోఁగలసి రాజ్యతంత్రమునడిపెను. అనంతరము చందూలాలు మంత్రిపదమును మానుకొన్నపుడుసలారుజంగుపినతండ్రిసురాజుల్ముల్కు నిజాముచే దివానుగా నియమింపఁబడెను. కాబట్టిహైదరాబాదుదివానుపదవికి సలారుజంగునకు న్యాయమైన హక్కుగలదు. హక్కున్నను దనకది యంతటి పిన్నవయస్సులో వచ్చునని యాయన యెన్నడు తలంపలేదు.

సలారుజంగుపాఠశాలకుఁబోయియెన్నఁడువిద్యనేర్వలేదు. వచ్చినచదువేమోయింటియొద్దనేచదువుకొనెను. చిన్నతనమందేయతఁడరబ్బీ పారసీ భాషలయందు బ్రవీణుఁడై యింగ్లీషొకవిధముగానేర్చుకొనెను. కుమారదశయందే తండ్రియుఁ దాతయుమృతినొందుటచేవానివిద్యాభ్యాసమునకు విఘ్నములుగలిగియుండవచ్చును. అతనికి బాల్యమున నుపాధ్యాయు నేర్పరచియింటివద్దనేడుసంవత్సరములువిద్యనేర్పించెను. ఆకాలమునందతఁడు బుద్ధికుశలతనుగానియేకార్యమైనచేయుటకుతేమకమునుగానిజూపినట్లుగనపడదు. అతఁడుజదువుకొన్నగ్రంథములనుబట్టివి

చారించితిమాయతఁడుమంత్రిపదములోనుండిగనఁబరచిన రాజనీతి చాతుర్యము మొదలయినవివానికెక్కడినుండివచ్చెనో తెలియదు. ఆతనితండ్రితల్లి లెక్కలలో వానిని నేర్పరిగ జేయుటకు వారిగ్రామములమీఁద నేఁటేటవచ్చుశిస్తులమొత్తము మొదలయినసంగతులు తెలియఁజేయుచుండినను సలారుజంగువానినంతశ్రద్ధచేసివినినట్లుకనఁబడదు హైదరాబాదులోనుండుగొప్పవారికొడుకులువిశేషవిద్యావంతులుకాకపోయినను గొప్పయుద్యోగములలోఁజిన్నతనమందే నియమింపఁబడుదురు. అందుచేతనే యిరువదియేండ్లప్రాయమున సలారుజంగు తాలూకాదారుగ నేర్పరుపఁబడెను. తాలూకాదారనగా జిల్లాకలక్టరని యర్థము. ఈయుద్యో మునందతఁడెనిమిదిమాసములుమాత్రమేయుండినను నాస్వల్పకాలములోనే హైదరాబాదు రాజ్యములో నేనేలపన్నులవిషయమైజ్ఞానమంతయు సంపాదించెను. 1853 వ సంవత్సరమందువాని పినతండ్రి మృతినొందఁ నిజాముమంత్రిపదమువహించి రాజతంత్రము నడుపుటకు సలారు జంగును బిలిచెను. బాలుఁడగు సలారుజంగు శుభమైన యీవార్త విన్నప్పుడు మనసులో నెట్లుతలంచెనో తనమిత్రునకువ్రాసిన యీయుత్తరమువలన దేటపడును. "రాజ్యతంత్ర నిర్వహణమువలన ముఖ్యముగా నిటువంటి సమయమునసంభవించు మనోవ్యథలకు లోనుగాకుండ నాపినతండ్రిజాగీరుగ్రామములఁ జక్కఁబెట్టుకొనుచు నేను హాయిగానుండినబాగుండును. ఈయుద్యోగము నేను మనసారనంగీకరించుటలేదు. ఇది యంగీకరించనిపక్షమున నేను నాకుటుంబము పూర్తిగ చెడిపోవుదుము. ఇదిగాక తెల్లవారు నల్లవారు సమానముగనీయుద్యోగమునంగీకరింపవలసినదని నన్ను బ్రేరణము చేయుచున్నారుగావునసంస్థానమునఁజిక్కులలోనుండి పయికి లేవనెత్తుటకును గ్రమత లేనిస్థలముల గ్రమత నిలుపుటకు నాయావచ్ఛక్తి వినియోగించి పనిచేసెదను."

అతఁడిన్నట్లె చేసెను. ఆకాలమున హైదరుబాదుసంస్థానమెంత

యధమస్థితిలోనుండవలెనోయంతయధమస్థితిలోనుండెను. ఖజానాలో ధనమూలేదు. నేలపన్ను వసూలుచేయుపద్ధతి మిక్కిలిపాడుగనుండెను. బేరారు రాచూరు మూలదుర్గము మొదలగుజిల్లా లప్పటికి గొన్ని దినములకిర్రిందటనే పాతఁబాకీక్రింద నింగ్లీషువారి కీయఁబడెను. ఈజిల్లాలలోనున్న జాగీరుదారులు జమీందారులు వారివారి జాగీరుల నింగ్లీషువారికి లోఁబరచవలసినదని యాజ్ఞాపింపఁబడియు దానికొప్పు కొనక తమకుఁగలిగిన నష్టములకు నిజాముగారిమీఁద వ్యాజ్యముల వేయఁ దలంచిరి. నిజాముగారి బంధువులజీతముల నిచ్చుటకుఁ గావల సిన సొమ్ము వచ్చుట కాధార మేదియు గానఁబడదయ్యె. నిజాము గారి సొంతనగలు సీమలో తాకట్టుపెట్టఁబడెను. మొత్తముమీఁద హైదరాబాదు రాజ్యముమీఁద నప్పటికున్న ఋణము మూఁడుకోట్లు. మహాంధకారపుంజము వలెనున్న యాసంస్థానమును బ్రకాశమాన ముగజేయ సలారుజంగు పూనుకొని మొగమోటము భయము నన్నవి విడిచి వినినవారందరు మహాద్భుతము నొందునట్లు వ్యవహా రము నడిపెను. ఇరువదియవయేఁట మంత్రియై యంతపని నెవ్వఁడు నిదివరకుఁ జేసియుండలేదు. అతఁడు చేసిన మొట్టమొదటి మార్పే మన సంస్థానములో మిగుల బలవంతులై యెవరి లక్ష్యములేని యర బ్బులను లొంగతీయుట. వారిజీతములక్రింద నేఁటేఁట విశేషధన మగుచుండును. వారు చేయుపని రవంతయు లేదు. అందుచే నతఁడు వారికొలువు వక్కరలేదని తీసివేసెను. అంతతోఁబోక సలారుజంగు తాలూకాలలోను జాగీరులలోను గొలువుండిన యరబ్బులను రోహి లాలను పఠానులను దీసివేయవలసినదని తాలూకాదారులకు జాగీరుదారులకు నుత్తరువులు వ్రాసెను. అట్లుద్యోగములు భూ ములు పోయిన యరబ్బులహక్కులు విచారించి న్యాయమిచ్చుట కతఁడొకకోర్టు గట్టించెను. మఱియు నరబ్బులకున్న జాగీరులు

ముఖాసాలు జమీందారీలు లాగుకొనుటకు నిశ్చయించుకొనెను. ఈవిధమునఁ గృతనిశ్చయుఁడై సలారుజంగు తాను మంత్రిపదమును బూనిన సంవత్సరములోనే రెండువేల యరబ్బులను, రెండువేల పఠానులను మఱియందరి యితరసేవకులను గొలువునుండి తొలఁగించి యేడాదికి నలువదిలక్షల రూపాయలు శిస్తువచ్చు జాగీరులను సంస్థానమునకు గలిపెను. పూర్వ మాసంస్థానములో గుత్తదారీపద్ధతి ప్రకారము శిస్తువసూలుచేయఁబడుచు వచ్చెను. అనఁగా తాలూకాదారు ప్రతిగ్రామము నొక్కొక్కనికి శిస్తునిమిత్త మిజారాకిచ్చుట. ఈపద్ధతివలన గుత్తదారులు పన్ను లెక్కువ కట్టుటయు రహితు లవియిచ్చుకొనలేక బాధపడుటయు సంభవించెను. సలారుజంగు దాని నివారింపఁదలఁచి నమ్మఁదగిన మనుష్యులను శిస్తువసూలుచేయ నియమించి గుత్తదారీపద్ధతి తగ్గించెను. తాలూకాదారు లదివఱకు రయితులవద్ద వసూలుచేసిన శిస్తులో నాలుగవ వంతు మూఁడవవంతు నొకప్పుడు సగము హరించుచు వచ్చిరి. క్రొత్తమంత్రి యట్టిద్రోహులను నిజోద్యోగములనుండి తప్పించెను. అదివరకు సంస్థానములోఁ బ్రబలియుండిన దొంగతనము బందెపోటు మొదలగు దౌర్జన్యములను మహాకఠినుఁడై యడంచెను. సమర్థమైన యీపరిపాలనముచేత 1856 వ సంవత్సరమునాఁటికి సంస్థానమునకు భూమివలన వచ్చుశిస్తు హెచ్చెను. గొప్పఖజానా యొకటి స్థాపింపఁబడెను. హైదరాబాదు సర్కారువారియందు బ్రజలకుఁ గౌరవ మతిశయించెను. సంస్థానమంతటను మంచి మార్పులు పొడసూపెను.

1857 వ సంవత్సరమున నింగ్లీషుదొరతనమువారిమీఁద సిపాయిలు పితూరీ చేసిరి. ఇదియే నానాసాహేబు పితూరి యనికూడ చెప్పుకొందురు. ఆకాలమున నింగ్లీషువారికి సలారుజంగు చేసిన సహాయ మింతింత యనరానిది. ఉత్తరహిందూ స్థానమంతయు

బెద్దకాలుచిచ్చువలె నుండెను. మధ్య హిందూ దేశములోను, దక్షిణ హిందేశములో నున్న స్వదేశ రాజులు హైదరాబాదు వారు కొంచెమాత్ర యిచ్చినయెడల దొరతనము వారి మీఁద తిరుగఁబడుటకుఁ సిద్ధముగ నుండిరి. హైదరాబాదు ప్రజలు వీధులలో గుంపులుగూడి యింగ్లీషువారిమీఁద యుద్ధమునకుఁ బోవుదమని కేకలువేయుచు వచ్చిరి. ఇంగ్లీషువారి ప్రభుత్వమెంత యపాయస్థితిలోనుండెనో బొంబాయి గవర్నరుగారు హైదరాబాదు రెసిడెంటుగారికిచ్చిన యీక్రింది టెలిగ్రాపువలనఁ దెలియవచ్చును. "నిజాము శత్రుపక్షమునఁ జేరెనా హిందూదేశము మనకుపోయినదే గావున జాగ్రత్తపెట్టుము" ప్రజ లింగ్లీషువారిమీఁద నెంతద్వేషము చూపినను నిజాము మనస్సు మఱియొకలాగుండినను సలారుజంగు మాత్రము యెవరిమాటలువినక నిశ్చలుఁడై యింగ్లీషువారి రాజ్యమును రక్షించెను. అప్పటి మంత్రి సలారుజంగు కనుక నింగ్లీషువారి కంతటిమేలు చేసెను. మఱియొకఁడైనచో నావిధముగాఁ జేయకపోవును. ఏదియెటులయినను సలారుజంగుమాత్ర మింగ్లీషువారి పక్షముండుటకే నిశ్చయించుకొనెను. ఆపితూరి సమయమున సలారుజంగు చేసిన యుపకారమునకుఁ గృతజ్ఞులై గవర్నమెంటువారు వానికి ముప్పదివేలరూపాయిలు వెలగల ఖిల్లతు నొకదానిని బహుమానమిచ్చిరి. గవర్నరుజనరలుగారు వానిసహాయమునకుఁ సంతసించి యతఁడు హైదరాబాదుసంస్థానమును నిజామును నిష్కారణముగా నాశనముచేయక నిశ్చలబుద్ధి వహించినందుకు నింగ్లీషువారి పక్షమున నుండినందుకు ననేకవందనములఁ జేసి గవర్నమెంటువారి కాప్తమిత్రుడుగ నెంచుకొనిరి.

వెనుక నరబ్బులు మొదలగు బండవాండ్రను వెడల నడచుట చేతను శిపాయి పితూరీలో నతఁ డింగ్లీషువారి పక్షము వహించుట

చేతను దేశమందు విరోధులనేకు లతనికి బయలుదేరిరి. ఆవిరోధ మతని కొకసారి ప్రాణాంతమగుటకు సిద్ధమయ్యెను. 1859 వ సంవత్సరమున మార్చినెల 15 వ తేదీని సలారుజంగు రెసిడెంటుతోఁగలసి నవాబు దర్బారునుండి యింటికిపోవుచుండ జహంగీరుఖానని మెడు నొకతురక వానిమీఁద తుపాకి పేల్చెను. దైవవశమున నాదెబ్బ వానికిఁ దగులక తప్పిపోయెను. ఆనరహంతకుఁడు తన గుఱి తప్పిపోయె నని వగచి రోషావేశపరవశుఁడై ఖడ్గముదూసి సలారుజంగుమీఁదికిఁ బరుగెత్తెను. కాని వాఁడు తలఁచుకొన్న దౌర్జన్యము చేయకమునుపే రాజభటులు వానిని దుత్తునియలుగ నరికిరి. 1860 వ సంవత్సరమునం దింగ్లీషుదొరతనమువారు తొల్లి తాము ఋణవిమోచనము నిమిత్తముపుచ్చుకొన్న షోలాపురము, రాయచూరు ధారాశీను మొదలగు తాలూకాలను మరల నిజామున కిచ్చిరి. 1861 వ సంవత్సరమునఁ గొందఱు విరోధులు సలారుజంగును మంత్రి పదవినుండి తొలగింప గుట్రలుపన్ని రెసిడెంటుదొరగారు సలారుజంగును మంత్రిపదవినుండి తప్పింప దలఁచుకొన్నారని నిజాముగారితోఁ జెప్పిరి. మాయమర్మము నెఱుఁగని యానిజాము వారికల్పనలు నమ్మి రెసిడెంటుగారి యభిప్రాయ మదియే యనుకొని తనయొద్దకు రెసిడెంటు వచ్చినప్పుడు "మీ యిష్టప్రకారము నేను సలారుజంగును దీసివేయుట కిష్టముగ నున్నా" నని చెప్పెను. రెసిడెంటు మితిలేనియాశ్చర్యమునొంది తెల్లబోయెను. తరువాత వారొండొరుల యభిప్రాయములను గ్రహించి సలారుజంగునే మంత్రిపదములో నిలుప నిశ్చయించిరి. అతఁడు మునుపటియట్లె పలుమార్పులం జేయుచు సంస్థానమును మంచిదశకుఁ దెచ్చెను. అందు ముఖ్యముగ వ్యవహార సౌలభ్యముకొఱకు సంస్థానము నైదుభాగములుగను బదునేఁడు జిల్లాలుగను విభజించెను. అదివఱకు రయితులు దివాణము పన్ను రొక్కముగ నీయలేక ధాన్యరూపకముగ

నిచ్చుచుండిరి. అతఁడాపద్ధతి గొట్టివేసెను. భూములు గొలిపించి సరి యైన వైశాల్యము దెలిసికొనెను. మఱియు రయితులకు భూములు శాశ్వతముగా నుండునట్లు శిస్తు హెచ్చింపకుండునట్లు చాల మార్పులఁ జేసెను. సలారుజంగు సంస్థానమునందుఁ జేసిన యభివృద్ధిని రెసిడెంటుగానుండిన సాండర్సుదొరగారు వ్రాసిన యీక్రింది వాక్యముల వలన మనము తెలిసికొన వచ్చును. "ఇప్పటి హైదరాబాదు సంస్థానమునకు వెనుకటి నలువదియేండ్ల క్రిందటనున్న సంస్థానమునకు భేదముచూడ నిప్పటి యింగ్లండునకు రెండువందలయేండ్ల క్రిందటి యింగ్లండునకునుగల భేదము కలదు. ఈయభివృద్ధి కంతకు సర్ సలారుజంగు పడిన పాటు నాపూర్వపు రెసిడెంట్లు వానికిఁ జేసిన సహాయము ముఖ్యకారణములు. ఖజానా ధనముతోనిండియుండును. ప్రతిసంవత్సరము వ్యయముపోగా సంస్థానమున కెనిమిదిలక్షుల రూపాయల యాదాయ మిప్పుడున్నది. శిస్తువసూలుచేయుటకు మునుపటి యిజారాపద్ధతి నీదివాను గొట్టివేయుటచే గ్రామములలో నిప్పుడు మునుపటివలె నల్లరులులేవు." హైదరాబాదుసంస్థానములోని జనులు నాగరికతలేని మోటవాండ్రగుటచే సలారుజంగు తమకుఁ జేసిన మహోపకారములనుగుర్తెఱింగికృతజ్ఞులై యుండలేకపోయిరి. అందుచేతనతఁడు క్రమక్రమముగా జనులచేత ద్వేషింపఁబడెను. వ్యవహారములోఁ గఠినముగా నున్నవారందఱకు నట్టియవస్థయే ప్రాప్తించునుగదా! అనేకులకు విరోధియగుటచే నతనిప్రాణము తీయుటకు మఱియొక ప్రయత్నము జరిగెను. 1868వ సంవత్సరమందు సలారుజంగొకనాఁడు దర్బారునకుఁబోవుచుండ నొక దురాచారుఁడు వానిమీఁద తుపాకి రెండుసారులు గాల్చెను. అదృష్టవశమున నా రెండుగుళ్లులుఁగూడ మంత్రికిఁ దగులక తప్పిపోయెను. వెంటనే సేవకులా దురాత్మునిఁ బట్టుకొనిరి. నిజాము వారికి మరణదండనవిధించెను. దుష్టుఁడైనను

వానికి మరణదండన విధింపవల దనియు గారాగృహబంధనము విధిం పుఁడనియు సలారుజంగు నిజామును వేఁడుకొనెనుగాని నిజాము పట్టు విడువక తన మొదటియాజ్ఞ చెల్లించెను.

1869వ సంవత్సరమున నప్పటి నిజాముగారు మృతినొందిరి. ఆయన కొకచిన్నకుమారుఁ డుండుటచేత నింగ్లీషుదొరతనమువారుపౌ ర్వాపర్యములు చక్కఁగ బరిశీలించి సలారుజంగుగారిని షమ్సుల్ ఉమ్రా అమీర్ కాబీరీగారిని బాలునిపక్షమునఁ బ్రజాపరిపాలనముఁ జే య్యుమని నియోగించిరి. 1872వ సంవత్సరమున నాయిరువురుమంత్రు లు మునుపు తమనిజామునొద్దనుండి పుచ్చుకొన్న బేరారుపరగణా మరల నీయవలసిన దనియు దానికై సొమ్మొక్కముగ ధరావతు నిలుపుదు మనియు జెప్పి యడిగిరి. కాని గవర్నమెంటువారు పుచ్చు కొనుటలోనేకాని యిచ్చుటలోఁ జులుకుతనము లేనివారగుటచే దా ని కంగీకరింప రయిరి. 1875వ సంవత్సరమున మన ప్రస్తుతచక్రవర్తి యగు నెడ్వర్డు రాజుగారప్పుడు యువరాజుగానుండి మన దేశముఁ జూ డవచ్చిరి. అప్పుడు సలారుజంగు బొంబాయికిఁబోయి వారిని స్వయ ముగ సన్మానము చేసెను. ఆయువరాజుగారు సలారుజంగును సీమ కురమ్మని యాహ్వానముచేసిరి. 1876వ సంవత్సరమున సలారుజంగు వారు కోరినరీతిగా నింగ్లాండునకుఁబోయి యచ్చటి జనులచే నమిత మైనసన్మానము నందెను. ఇంగ్లాండునకుఁ బోవుటలో నతని ముఖ్యో ద్దేశము బేరారుపరగణా నెటులయిన మరలసంపాదించి తనప్రభువున కీయవలయు నని యతఁడు మృతినొందు వఱకు దీనివిషయమునఁ బ్రయత్నించుచునే వచ్చెను. అతఁ డీప్రయత్నమున నింగ్లాండులోఁ గృతకృత్యుఁడుకాకపోయినను స్వదేశరాజులలోనైన నెవరికిం జరుగ ని యఖండగౌరవము తనకక్కడ జరిగినదని సంతుష్టినందెను.

అనంతర మతఁడు స్వదేశమునకువచ్చి 1883వ సంవత్సరము

వఱకు హైదరాబాదు సంస్థానమును న్యాయముగ బరిపాలించెను. 1883వ సంవత్సరమున విశూచిజాడ్యముచేత నతఁడుమృతినొందెను. మరణకాలమున కతనికి యేబదేండ్లవయసు. వాని మరణమునకు వగ వనివారు లేరు. హిందూదేశస్థులు దుఃఖించిరని చెప్పుట యొకగొప్ప కాదు. ఇంగ్లాండుదేశస్థులుఁగూడ బిట్టువగచిరి. విక్టోరియారాణిగారు తత్కుమారుఁడు యువరాజుగారు మొదలగు ననేకులు వాని మర ణమునకు శోకింపుచు తత్కుటుంబమునకు జాబులువ్రాసిరి. ఇండి యాగవర్న మెంటువారు ప్రత్యేకముగా నొకగెజెటీలో నీక్రింది విష యమును వ్రాసిరి. "ఈనెల 8వ తేదీని హైదరాబాదు సంస్థానము నకు మంత్రియగు సర్ సలారుజంగుబహదూరు విశూచిజాడ్యము వలన మృతినొందె ననిదెలియఁజేయుటకు మాకు మిక్కిలి దుఃఖకర ముగా నున్నది. ఆతని మరణముచేత నిండియాగవర్న మెంటువారికి వి శ్వాసపాత్రుఁ డగుమిత్రుఁడు పోయెను. నిజాముగారికి యోగ్యుఁడగు మంత్రిపోయెను."

సలారుజంగు పొట్టియుపొడుగుకాని విగ్రహము కలవాఁడు. సుకుమారదేహుఁడు. కాని గంభీరాకారము గలవాఁడు. వేషభాషల లో నతఁడు సామాన్యుఁడువలె నుండును. గొప్పదర్బారులు తీర్చిన ప్పుడుతప్ప తదితరసమయముల నతఁడు నగలు దాల్చువాఁడు కాఁడు. అతని పద్ధతులన్నియు మంచివి. అతఁడు జనులకు సులభుఁడు. తోఁ టలు వేయించుటయం దతనికి యెక్కువయిష్టము. అతనికి యూరో పియనుల సహవాసమే యెక్కువయిష్టము. వానియునికియు దొరల పద్ధతి ననుసరించియే. అతఁడు గావించిన సత్పరిపాలనము నొక్కదా నిబట్టియే వానిసామర్థ్యమును మన మెంచఁగూడదు. అతనికున్న వి రోధులంబట్టియు వారినిగ్రహమం దతఁడు చూపిన నేర్పుంబట్టియుఁ గూడ జూడవలెను. అతనివిరోధులమాటయటుండనిండు. అతఁడు ఛే

సిన ప్రతిసత్కార్యమందు వానిప్రభువగు నిజాము సయితము చెప్పుడు మాటలు విని యెన్నో విఘ్నములు కలిగించుచు వచ్చెను. పాపము సలారుజంగు తనకావించిన పనిని తన యేలిక యెన్నఁడైన మెచ్చుకొనునేమోయనియాటలూరుచువచ్చె.ఎప్పుడోగానిననాబుమెచ్చుకొనుటలేదు. అతఁడు సంపూర్ణుఁడైన యోగ్యుఁడు. అంతటియోగ్యుఁడైనను సంస్థాన మంతబాగుచేసినను వెనుకటినిజాము వాని నెప్పుడు సరిగానమ్మక యేదోయనుమానముతోనేజూచుచువచ్చెను. కోటఁదాఁటి యావలకుఁ బోవలసివచ్చినప్పుడు నూరుబయటనున్న వసంతగృహాము నందు దొరలకు విందుజేయఁదలఁచుకొన్నప్పుడు సైతము సలారుజంగు నిజామువారి సెలవును బొందవలయునఁట. అట్టిసమయములందు నిజాముసెలవిచ్చవచ్చినపుడిచ్చి యిష్టలేనప్పుడియ్యకపోయెను. రెసిడెంటుతోఁబలుమాఱు కలుసుకొన్నను నిజామున కనుమానమే. రెసిడెంటుమిక్కిలి యవసరములయిన కాగితములు పెట్టెలోవేసి పంపినను నిజామునకు సందేహమే. వేయేల తనరెసిడెంటు తనమంత్రి కలుసుకొనుట నిజామున కిష్టములేదు. తన యేలిక యిన్ని జేసినను సలారుజంగు స్వామిభక్తి మెండుగ గలవాఁడగుటచే తనకష్టముల నొకరితోఁ జెప్పుకొనఁడు సరికదా యెన్నఁడు సణుగుకొననైన లేదు. వెనుకటినిజాము వానిం దలఁచుగా సమక్షమునకుఁ బిలుచుటయే లేదు. ఎప్పుడైన బిలిచెనా సలారుజంగు వానికడ నున్నంతనే పేమిమూఁడునోయని వెలవెలఁబోవుచునేయుండును. అయినను తన రాజు విషయమున నతఁడు శక్తి వంచనలేక పాటుపడుచు వచ్చెను. 1867 వ సంవత్సరమువఱకు నతఁడు హైదరాబాదు తప్ప మఱి యేపట్టణమును జూచియెఱుఁగడు. సంస్థానమందయిన నాయాతాలూకాలకు జల్లాలకుఁబోయి యెఱుఁగడు. అందుచేత తాలూకాదారులు తక్కిన యుద్యోగస్థులు స్వకార్యముల నెట్లునిర్వహించుచున్నారో ప్రజలనె

ట్లు పరిపాలించుచున్నారో పరీక్షించి చూచుట కతనికి వీలులేకపో యెను. అటుపోయిచూడవలయునన్న నిజాము వానినివెళ్ళనియ్యఁడు. ఎట్టకేల కింగ్లీషువారు బలవంతముపెట్ట నిజాము వాని నొకటిరెండుసా రులు రాజధాని విడిచిపోవనిచ్చెను. అతఁడు సత్కులసంభవుఁ డగు టచేత శరీరమునందు సహజముగ దుర్బలుఁడయ్యు నవసరమైనప్పు డు కావలసినంత శాంతమును దెచ్చుకొని యెంతో యోపిక గలిగి న్యాయదృష్టితో పరిపాలించెను. అతని సమకాలికు లగు రాజామా ధవరావు, రాజా దినకరరావులను నిద్దఱుదివానులతో బోల్చినప్పుడు సలారుజంగు వారికి దీసిపోడని యనేకు లనుచున్నారు. పరిపాలనా శక్తిలో నితఁడు వారికొకవేళ దీసిపోయినను శిస్తులు వసూలుచేయు ట వ్యవహారము చురుకుగ జేయుట మొదలగుకొన్నినేర్పులలో ని తఁడే వారిని మించునని చెప్పకదప్పదు. ఆతని బుద్ధినిపుణత యెట్టి దోకాని యింగ్లీషువారు తమరాజ్యములో చేసిన మంచిమార్పు లన్ని యు వెంటనేగ్రహించి సలారుజంగు తమసంస్థానములోఁ బెట్టుకొను వాఁడు. మార్గస్థులనిమిత్తము సత్రములుకట్టించుట ధాటలువేయించు ట మురికినీరు పోవుటకు తగినయాధారములు నిర్మించుట మొదలగు నవి గూడ నతఁడే జెప్పివేయించుచు వచ్చెను. అతఁడు సహస్రాక్షుఁ డువలె సర్వకార్యములయందు దానేప్రవేశించి చూచువాఁడు. ఈయ నయందు హిందువులకు మహమ్మదీయులకు గూడఁ సమానగౌరవ ముండదగును. హైదరాబాదు సంస్థానమున కితఁడు మంత్రికాకపో యిన పక్షమున నదిమిక్కిలి దురవస్థలో నుండియుండును.



# సర్ సయ్యదు అహమ్మదుఖాను

సయ్యదమహమ్మదుఖాను 1817వ సంవత్సరము అక్టోబరు 17వ తారీఖున ఢిల్లీలో జన్మమొందెను. అతనిపూర్వులు మొగలాయచక్రవర్తులయొద్ద గొప్పయుద్యోగములు చేయుచువచ్చిరి. ఆతనితండ్రిసయ్యదు మహమ్మదుటక్కీ. ఢిల్లీచక్రవర్తియగు రెండవయగ్బరునకుఁ బ్రాణమిత్రుఁడై యుండెను. ఈటక్కీమహమ్మదుగారే యాచక్రవర్తియొద్ద మంత్రియైయుండెను. ఆమంత్రిమృతినొందినప్పుడుచక్రవర్తియైన రెండవ షాలం గతించిన మంత్రియొక్క బిరుదులు మొదలగునవి మహమ్మదు టక్కీకి నియ్యదలంచెను. కాని టక్కీ యవి తనకక్కర లేదని చెప్పెను. మహమ్మదుటక్కీ 1836 వ సంవత్సరమున మృతినొందెను. అప్పటికి సయ్యదుమహమ్మదుఖాను పందొమ్మిదేండ్లప్రాయముగలఁవాఁడైన నుఁ గడపటిఢిల్లీచక్రవర్తియగు బహదూరుషా మాతామహునిబిరుదు లన్నియు వానికిచ్చి యనుగ్రహము చూపెను.

అహమ్మదుఖానుపసిబిడ్డయైనప్పుడుతల్లినోటనుండియే చదువునేర్చుకొనెను. ఆతఁడు పగలు నేర్చుకొన్న చదువంతయు వాని తల్లి రాత్రి వానియొద్ద నప్పగించుకొనుచువచ్చెనఁట. అతఁడు యింగ్లీషు నేర్చుకొనలేదు. నేర్చుకొన్న స్వభాషావిద్యయు పితృమరణమువలనఁ గాబోలు 1837 సంవత్సరమున సమాప్తియయ్యెను. అందుచేత నతఁడా సంవత్సరమున నుద్యోగమునకై బ్రయత్నించి ఢిల్లీలోనున్న సర్కారువారి సాదరమీనుకోర్టులో సిరస్తదారుగబ్రవేశించెను. ఆతఁడుద్యోగమున బ్రవేశించిన స్వల్పకాలములోనే యభివృద్ధి పొందెను. ఆపనిలోఁ బ్రవేశించిన రెండేండ్లకే యాగ్రాకమీషనరుగారియొద్దవానికి నాయబుమునిషీపని యయ్యెను. 1841వ సంవత్సరమం దతనిని దొరతనమువారు

సిక్రీపట్టణమున మునసబుగా నియమించిరి. 1846 సంవత్సరమునమున సబుగానే డిల్లీకిబోయి పనిచేసెను. 1850 వ సంవత్సరమందు వానికి రహతకుపట్టణమున సబుజడ్జీపనియయ్యెను. సిపాయిపితూరీ జరుగుటకు రెండేండ్లముందు దొరతనమువారువానిని బిజనూరునకుమార్చిరి. అతఁ డక్కడనుండఁగానే యాపితూరీ బయలుదేరెను. ఆసమయమున నతఁడు గవర్నమెంటువారికి జేసినయమితోపకారమునుబట్టి వానికీర్తియంతయు హిందూస్థానమందంతట వ్యాపించెను. పితూరీబయలుదేరిన వార్త తెలియునప్పటికి బిజనూరులో నింగ్లీషువారు స్త్రీలుపురుషులు బాలురు గలసి యిరువదిమందియుండిరి. షేక్స్పియరను నొకదొర యాగ్రామము వారిలో గొప్పయుద్యోగస్థుఁడు. పితూరీదారులుకనఁబడిన తెల్లవారినెల్ల నఱకుచుండుటచే యా తెల్లవారు భయభ్రాంతులై యుండ మహమ్మదు ఖానునూరుమందిపటానుగుఱ్ఱపు రౌతులనుసిద్ధముచేసి పితూరీనిగూర్చి నిజమైనవార్త నెప్పటికప్పుడే తెలియుటకు నమ్మికగల వేగులవాండ్రను బెట్టెను. కాని యాపటానులుసయితము పితూరీదార్లలోగలసి కుట్రచేయుటచే నొకనాఁడాయిరువదిమంది తెల్లవారినిపితూరీదార్లెనిమిదివందలమందివచ్చి చుట్టుముట్టిరి. అహమదుఖాను దొరలనివాసమురహస్యముగఁబ్రవేశించి వారిలోసత్వరముగ నాలోచనజేసి తాను స్వయముగాఁ పితూరీదార్లసేనాపతియొద్దకుఁబోయి తెల్లవారినినిరపాయముగ బారిపోవనిమ్మని వేడుకొనెను. ఆసేనాపతియు నాపాంతభూమిడిల్లీచక్రవర్తిస్వాధీనముచేసినట్లు తెల్లవారిలో ముఖ్యులు పత్రము వ్రాసి యిచ్చినయెడల బోవనిత్తునని చెప్పి యట్లవ్రాయించుకొని వారినిబోవనిచ్చెను. ఆపత్రమువ్రాయించునప్పు డహమ్మదుఖాను మరల నింగ్లీషువారీభూమి పుచ్చుకొనుటకు వచ్చువఱకుననుమాట లాకాగితమందు మెలకువతోఁ జేర్పించెను. పిమ్మటనింగ్లీషువారు నిరపాయముగ బోవ నాయూరుపితూరీదారు లాక్రమించిరి. పితూరిదార్లులలో ననేకులు తుర

కలుగుటచేఁదెల్లవారితోఁ జేరియామహమ్మదుఖానుతమప్రయత్నమువిఫలముచేయుచున్నాఁడని స్వమతస్థులు వానిపై ద్వేషముబూనియుండిరి. అదికారణముగఁ బ్రాణభీతిజెంది యహమదుఖాను మొదటహోలుదారు గ్రామమునకుఁ బిదప మీరతుపట్టణమునకుఁ బారిపోయి యచ్చటగూడ సురక్షితుఁడు గామి ఢిల్లీయింగ్లీషువారి స్వాధీనమైనపిదప యక్కడికిని బారిపోయెను. ఈసిపాయి పితూరీలో నితఁడు చేసినయుపకారమునకు కృతజ్ఞులై దొరతనమువారు రెండుతరములవఱకు నెలకు రెండువందల రూపాయలచొప్పున వానికుటుంటమునకు భరణమేర్పఱచి వానికిఁజాల బిరుదులనిచ్చిరి. ఈవిధములైన సత్కారములు వానికిఁ జేయవలసినదని షేక్స్పియరు దొరగారు దొరతనమువారికి గట్టిగా సిఫారసుచేసిరి.

ఆపితూరీ ముగిసినవెనుక నహమదుఖాను పితూరీవచ్చుటకుముఖ్యకారణముల నొకపుస్తకముగ హిందూస్థానీభాషలో వ్రాసెను. ఆ గ్రంథమున నతఁడుపేర్కొన్న ముఖ్యకారణము లివి. 1 ప్రజలు దొరతనమువారి యభిప్రాయములను దెలిసికొనక యపోహపడుట. 2 ప్రజల పూర్వాచార వ్యవహారములకు విరుద్ధముగ, నుండునట్టిచట్టములను దొరతనమువార నిర్మించుట. 3 ప్రజలు యాలోచనలనువారి యాచార పద్ధతులను గవర్నమెంటువారు తెలిసికొనకపోవుట. 4 మంచిపాలనమునకు ననుకూలములగు విషయములను దొరతనమువారు శ్రద్ధచేసికనుఁగొనకపోవుట. 5 సైన్యమునందు దొరతనమువారిమీఁద నసహ్యము కలుగుట. అయోధ్యారాజ్యమునునవాబుల స్వాధీనమునుండితప్పించి యింగ్లీషువారుకలుపుకొనుట పితూరీకిముఖ్యకారణమని హిందూదేశములోగొప్పవారభిప్రాయపడినను ఖానుగారదియొకకారణముగఁదలంపరైరి. ఈవిధముగ సిపాయిపితూరిలో దొరలకుఁ జేసినసాయమునుబట్టి యతఁడుమహాప్రఖ్యాతుఁడైనను గేవలమదియేయతనిప్రఖ్యాతికిఁగారణమనిదలఁపఁగూడదు. బాల్యమునుండియు నతనికివిద్యావ్యాసంగము

మీఁదియభిరుచిచేతను తనతోడి తురకల యవస్థను విద్యాభ్యాసాదుల యందు వృద్ధిచేయుటకుఁ బడినపాటుచేతను వానికి మహాప్రసిద్ధిగలిగె ను. పురాతన శిలాతామ్రశాసనములను వెదకి పూర్వచరిత్రముల నర యుటలో నతనికి బాల్యమునుండియు నభిరుచిగలదు. ఆవిషయమున జాలప్రయత్నముచేసి యతఁడు 1847 వ సంవత్సరమున ఢిల్లీ ప్రాచీన చరిత్రమును వ్రాసిప్రకటించెను. ఈగ్రంథమును ఫ్రెంచివాఁడొకఁడు తనభాషలోనికి మార్చుకొనెను. అందువలననతనికి యూరపుఖండము నందుసయితము మేలుకలుగ లండనుపట్టణములోని రాయలేసియాటి క్కుసంఘమువారు వానిని దమసభలోఁ జేర్చికొనిరి. అహమ్మదుఖాను స్వమతాభిమాని. అందుచేతస్వదేశాభిమానియనిగూడ చెప్పవచ్చును. అట్టియభిమానముండుటచేతనే 1860 వ సంవత్సరమందతఁడుహిందూ దేశపు మహమ్మదీయుల రాజభక్తియనుపేరు పెట్టి యొకచిన్నపుస్త కమును వ్రాసెను. మహమ్మదీయులు చాల విశ్వాసముగలవారనియు వారిలోఁ గొందఱు సిపాయిపితూరిలో దొరతనమువారికిజాలసాయము జేసిరనియుఁ దెలుపుటయే యాగ్రంథరచనలో వాని ముఖ్యోద్దేశము. తనతోడితురకలు మిక్కిలి దీనదశలో నుండుటకుఁగారణము నతఁడు చి రకాలము విచారించి విద్యావిహీనతయే వారిభ్రంశమునకు హేతువని సిద్ధాంతీకరించెను. చదువేతురకలకుసర్వార్థసాధకమనియతనినిశ్చితా భిప్రాయము. హిందూదేశములో సాంఘిక రాజకీయవిషయములలోఁ బ్రజలకుగలలోపములకంతకు విద్యాహీనతయే మూలమని యతఁడు నమ్మెను. వేళ్లుబాగుచేయుడు వృక్షము దానంతటదియేవృద్ధిపొందునని యతఁడు పలుమారు చెప్పుచువచ్చె.అట్టినమ్మకము నిశ్చయముగనుం డుటచేతనే యతఁడు 1858 వ సంవత్సరమునమహమ్మదీయులు దేశచరి త్రములను జదువుకొనుటకు మురదాబాదులో నొకపాఠశాల పెట్టిం చెను. దేశచరిత్రాబోధకములగు గ్రంథములు హిదూస్థానీభాషలోలే

నందున నాగ్రింథదారిద్ర్యమును నివారించుటకతఁడుభాషాంతరీకరణ సంఘము నొకదానిని నేర్పరచెను. ఇంగ్లీషులోని చరిత్రలనుహిందూ స్థానీలోనికి మార్చుటయే వాని ముఖ్యోద్దేశము. 1863వ సంవత్సరము న నతఁడు షాజిపురమందు సబుజడ్జిగానుండి యాకాలమందేక్రైస్తవవే దమగు బైబిలునకు వ్యాఖ్యానమువ్రాసెను. అతనికింగ్లీషురాదు గా వున బైబిలుమీఁదనున్నగ్రంథములన్నియుముందుహిందూస్థానిలోనికి మార్పింపఁజేసి పిదప నీవ్యాఖ్యానమును ప్రారంభించెను. పైనచెప్పినభా షాంతరీకరణసంఘము నతఁడు షాజిపురముననుండగానే 1864 వ సంవ త్సరము జనవరి 9వ తారీఖున స్థాపించెను. ఈసంఘమే పిదపకొంతకా లమునకుఁ బ్రకృతిశాస్త్రసంఘమనుపేర నల్లిఘురుపట్టణమున బయలు దేరెను. ఈసంఘము మంచియుపకారముచేసెను. ఏలయన నింగ్లీషు భాషలోనున్న సద్గ్రంథములెన్నో హిందూస్థానీభాషలోనికి మార్చఁ బడెను. ఆసంవత్సరమే దొరతనమువారు రహమ్మదుఖానును ఆలీఘురు పట్టణమునకు సబుజడ్జిగా బదిలిచేసిరి. ఈపట్టణముననే యతఁడుకావిం చిన సత్కార్యసంతతికి జన్మభూమి. ఈపట్టణము పేరు దలంచినప్పు డు ప్రతిమనుష్యుఁడు సయ్యదుఅహమ్మదుఖాను పేరు తప్పక దలం పవలసియుండును. 1866వ సంవత్సరమందు గవర్నరుజనరలుగారగు లారెన్సుప్రభువుగా రీతఁడుచేసిన విద్యాభివృద్ధికి సంతసించి యొక బంగారుపతకమును మెకాలే కవిరచితమైన గ్రంథమును వానికి బహు మాన మిచ్చిరి. ఆపతకముమీఁద నిట్లువ్రాయఁబడియున్నది. "తన స్వదేశస్థులలో ప్రకృతిశాస్త్రాదివిద్యలు వ్యాపింపఁజేయుటకుఁ బడిన పరిశ్రమమునకు సంతసించి సర్ సయ్యదు అహమ్మదుఖానునకు గవ ర్నరుజనరలు బహుమానముచేసిన పతకము."

ఇట్లు దొరతనమువారు తగినప్రోత్సాహము నిచ్చుటచే నతఁ డు మునుపటికంటె కార్యలోలుఁడై విదేశములయందలి పద్ధతులఁ

జూడఁదలఁచి 1869 వ సంవత్సరమున నింగ్లాండునకుఁబోయెను. అత నికి లండనుపట్టణమునం దున్నపుడె సి. యస్. ఐ. యను బిరుదము వచ్చెను. మరియు నింగ్లాండుదొరతనమువారు వానియందుఁ బ్రీతి గలిగిసంవత్సరమునకు మూఁడువేలరూపాయలచొప్పున రెండేండ్లుబహు మానమిచ్చిరి. అక్కడనుండగనే యతఁడు స్వమతగురువగు మహ మ్మదువారి చరిత్రమును మఱికొన్ని యితరగ్రంథములను వ్రాసిప్రక టించెను. ఆదేశమును స్వయముగ జూచుటచేత నతనికింగ్లీషువారి మీఁదను వారివిద్యాశాలలు మొదలయినవానియందును మిక్కిలి మంచియభిప్రాయముగలిగెను. లండనుపట్టణమునుండి యతఁడు హిం దూదేశములోనున్న యొకమిత్రునిపేర వ్రాసిన యీక్రిందిజాబును బట్టి వాని కింగ్లీషువారియెడగల గౌరవము తేటపడును. "హిందూదే శములోనున్న మనము జ్ఞానములేని పశువులమని యింగ్లీషువారనుకొ నుటకుఁ గారణములున్నవి. ఈవిధముగా నేనువ్రాయుటకు మనయొద్ద నున్న విశేషలోపము లేవి, వారియొద్దనున్న యనంతసద్గుణములేవియని సందేహించి నామీఁద మీరు కోపమువహింపవచ్చును. వచ్చిననేమి? నేను చెప్పునది నిజము. ఇక్కడ నున్నదంతయు మనవారు తలంచు టకైన నూహించుటకైన సమర్థులుగారు. నేను ప్రతిదినము చూచు నది నిశ్చయముగ నూహించుటకైన హిందూదేశస్థుల తరముగాదు. నేనుచెప్పునది మనదేశస్థులు నమ్మని యెడల పరమమూర్ఖులని మీర నుకొనవలసినదే. పుట్టుగ్రుడ్డి సూర్యతేజస్సును గాని మనోహరమైన చంద్రప్రకాశమును గాని మన మెన్నివిధముల చెప్పినను భావింపఁ గలఁడా?"

అహమ్మదుఖాను తనకుమారుఁడైన సయ్యదు మహమ్మదును విద్యాభ్యాసమునిమిత్తము కేంబ్రిడ్జిపట్టణములో దిగవిడిచి 1870 వ సంవత్సరమున హిందూదేశమునకు వెడలివచ్చెను. ఆబాలుఁడగు స

య్యదుమహమ్మదు తరువాత నలహాబాదు హైకోర్టులో జడ్జియయ్యె ను. అహమ్మదుఖాను సీమనుండివచ్చినపిదప కాశీపట్టణములో జడ్జి యయ్యెను. ఇంగ్లండునకుఁబోయి వారియాచారముల జూచుటచేత నతఁడు సంఘసంస్కర్తయై మహమ్మదీయులలోనున్న మూఢవిశ్వా సములు దురాచారములు తొలంగించుటకు మహమ్మదీయ సంఘ సంస్కర్తయను పేర నొకపత్రికను బ్రకటింపఁజొచ్చెను. నిష్పక్ష పాతముగ నిర్దాక్షిణ్యముగ దురాచారములను ఖండించుటచేఁ బూ ర్వాచారపరాయణులగు మహమ్మదీయులు వారిని ద్వేషించిరి. ద్వే షించినను బత్రిక బ్రకటింపఁబడిన తొమ్మిదిసంవత్సరములలో సంఘ స్థుల యభిప్రాయములు చాలమారెను. తురకలు రాజద్రోహులని యెవరైన నన్నప్పు డహమ్మదుఖాను వారి వాదమును కఠినముగ ఖండించుచుండువాఁడు 1872 వ సంవత్సరము సర్ విలియము హంట రుదొరగారు హిందూదేశపు మహమ్మదీయు లనుపేర నొక చిన్న గ్రంథమింగ్లీషులో వ్రాసి మహమ్మదీయులకు రాజభక్తిగలదా యని యందు సందేహముగనబరచిరి. అహమ్మదుఖానా గ్రంథముఁజదివి మహమ్మదీయులయం దట్టిలోపము లేదని తెలుపుచు దానికుత్తరము గ మఱియొకపుస్తకము వ్రాసెను.

ఇంగ్లాండునుండి వచ్చినదిమొదలు సయ్యదహమ్మదుఖాను మ హమ్మదీయుల యుపయోగమునిమిత్తము కేంబ్రిడ్జిలోనున్న కాలేజీ వంటి కాలేజీనొకటి స్థాపింప నుద్యుక్తుఁడై యుండెను. ఆకోరిక కొనసాగించుట కతఁడు ముందుగా నొకచిన్నసభ నేర్పఱచి దానిము ఖ్యోద్దేశము తురకలకు విద్యావ్యాప్తి నెక్కువజేయుటగ నేర్పఱచెను 1872 వ సంవత్సరము మేప్రియల్ 15 వ తారీఖున నాసభకు మహ మ్మడన్ ఆంగ్లో ఓరియంటల్ కాలేజి కమిటీయని పేరుపెట్టించెను. అదిమొదలుకొని పనిచేసి 1875 వ సంవత్సరమున నాసభ

వారు చిన్నపాఠశాలను స్థాపించిరి. ఆరంభము స్వల్పమైనను సయ్యదు మహమ్మదు గొప్పయూహలు మనసులో పెట్టు కొని దానికి మూలధనము సంపాదింపఁదలఁచి గవర్నమెంటుక్రింది యుద్యోగము మానుకొన్నపక్షమున తనసంకల్పము సులభముగ నెరవేరునని 1876 వ సంవత్సరమున నుద్యోగము మాని పించను పుచ్చు కొనెను. అనంతరమతఁడు కొంతమూలధనము సంపాదించి కళాశాల ప్రారంభింప నప్పటిగవర్నరుజనరలుగారగు లిట్టనుప్రభువుగారు 1877 సంవత్సరము జనవరి 7 వ తారీఖున దానిస్థాపనోత్సవము జరిపిరి. 1878 వ సంవత్సరమున దొరతనమువా రతనిని గవర్నరుజనరలుగారి శాసననిర్మాణసభలో సభికుఁడుగ నేర్పరచిరి. అతఁడట్లు సభికుఁడుగ రెండుసారులు నియమింపఁబడెను. అతని జీవితవిశేషమంతయు నలీఘురుపట్టణమున మహమ్మదీయుల నిమిత్తము స్థాపింపఁబడిన యాకళాశాలకు మూలధనమును బోగుచేసి వృద్ధిచేయుటకే వినియోగింపఁబడెను. 1882 వ సంవత్సరమున హైదరాబాదు దివానగు సర్ సలారుజంగు కాలేజిని సందర్శించెను. అహమ్మదుఖాను వానినిమరల చూచుటకుఁబోయి వానియొద్దనుండి కాలేజికి కొంతధనమును స్వీకరించెను. 1884 వ సంవత్సరమం దతఁడు మూలధనము సంపాదించుటకు పంజాబుదేశమందు సంచారముచేసెను. ఎక్కడకుఁ బోయినను మహమ్మదీయులు వానిని విశేషముగ గౌరవించుచు వచ్చిరి. అతఁడును వట్టిగౌరవములతో సంతసింపక కళాశాలయం దభిమానముగల వారు తమయభిమానమును ధనరూపముగాఁ జూపవలసినదని చెప్పి విశేషధనము సంపాదించెను. ఆసంవత్సరమే గవర్నరుజనరలుగా రగు రైఫన్‌ప్రభువుగారు కళాశాలనుజూచి సయ్యదహమ్మదుఖాను చేసిన యద్భుతకార్యములను జాల శ్లాఘించిరి. 1888 వ సంవత్సరమున సతనికి కె. సి. యస్. ఐ. యను బిరుదము నిచ్చిరి. తనపూనిన సత్కార్య

మును మిగులఁ బరిశ్రమచేయుచు నతఁడు మఱి పదిసంవత్సరములు జీవించి 1898 వ సంవత్సరము మార్చి 27వ తారీఖున మృతినొందెను.

ఈయహమ్మదుఖాను చరిత్రము చిత్రమైనది. ఆతని కింగ్లీషు రాకపోయినను దానిని గట్టిగ చదివినవాఁడువోలె వర్తమానవ్యవహారములనన్నియుఁ జక్కఁగ నెఱిఁగి యతఁడు కాలోచితముగఁ బని చేసెను. హిందూదేశస్థులు స్థాపించిన దేశీయమహాసభ కితఁడు విరోధియని మనవారు నమ్మెదురు. ఆసభ దొరతనమువారికి విరుద్ధమైనదని నమ్మి మహమ్మదీయు లాసభకుఁ బోఁగూడదని యతఁడుశాసించెను. ఆతనిమాట శిరసావహించి మహమ్మదీయు లానాఁటికి దేశీయ మహాసభలోఁ దఱుచుగఁ జేరుచుండుటలేదు. ఈతఁడు స్వమతస్థుల యభివృద్ధికొఱకు మిక్కిలి పాటువడియెను. హిందూదేశస్థులలోని సత్పురుషులలో నితఁడొకఁడని చెప్పవచ్చును. ఇంగ్లీషువారు దయామయులనియు వారినినమ్మి దయకుఁ బాత్రులమైతిమేని, వారుమనకు సర్వసౌఖ్యములు నీయఁగలరనియు నీతని నమ్మకము. ఈతని పేరు విన్న మహమ్మదీయుల కిప్పటికిఁ జాల గౌరవము.





గాజుల లక్ష్మీనరుసు సెట్టి.

శ్రీ




(మూఁడవభాగము- చెన్నపట్టణము)

# గాజుల లక్ష్మీనర్సుసెట్టి

గాజుల లక్ష్మీనర్సుశెట్టి చెన్నపట్టణమందలి పెరియమెట్టయను పేటలో 1806 వ సంవత్సరమందు జన్మించెను. అతని తండ్రిపేరుసిద్ధుల శెట్టి. ఆయన నీలిమందు వర్తకముచేసి సంపన్నుఁడయ్యెను. కావున వానికుమారుని విద్యాభ్యాసమునకు ధనదారిద్ర్యము లేదు. కానియా దినమునలో మన దేశస్థు లింగ్లీషు చదువుకొనుటకుఁ దగిన పాఠశాల లేవియుఁ జెన్నపట్టణమున లేవు. స్వదేశస్థులు పాఠశాలలుస్థాపించి విద్య వ్యాపింపఁజేయుటకు స్వల్పముగఁ బ్రయత్నించిరిగాని యాప్రయత్న మొక లెక్కలోనిదిగాదు. అయినను లక్ష్మీనరుసు మొట్టమొదట స్వదేశస్థులు స్థాపించిన యొక చిన్న పాఠశాలకేబోయి చదువుకొనెను. ఆపాఠశాలలో లక్ష్మీనరుసు నిప్పటివలె శాస్త్రవిద్యలు నేర్చుకొనలేదు. తననీలిమందువ్యాపారము సరిగా చేసుకొనుటకు లాభము వచ్చునట్లు బేరమునిచ్చి సరుకులమ్ముటకు సరిగ లెక్కలువ్రాయుటకుఁ దగినంత చదువువచ్చినఁ జాలునని సిద్ధులశెట్టి యప్పుడున్న చదువైనఁ గుమారునకు జెప్పింపలేదు. అందుచేత లక్ష్మీనర్సు చదువుట వ్రాయుట లెక్కలువేయుట మాత్రమే నేర్చుకొనెను. లక్ష్మీనర్సు పెద్దవాఁడై గా

పున్నా(డై నప్పుడు వానియొద్ద గన(బడుచువచ్చిన ధైర్యసాహసములు స్వాతంత్ర్యమునం దపేక్ష మొదలగు సుగుణములు చిన్ననాఁడె కన(బడెనని కొందఱువ్రాసియున్నారు. అతఁడు బాలుఁడై నప్పుడు విద్యార్థులతో( గలసి యానాటిరాజకీయ వ్యవహారముల(గూర్చి చర్చించుచుండునఁట. చదువు ముగిసినపిదప లక్ష్మీనరుసు తండ్రిదుకాణమున( గొంతకాలము పనినేర్చుకొని వర్తకములోని మర్మములన్నియు నేర్చుకొనిన పిదప "సిద్ధులసెట్టి కంపెనీ" యను పేరుపెట్టి తండ్రియుఁ దానునుగలసి వాణిజ్య మారంభించిరి. ఆకంపెనీవారు నీలిమందు నమ్ముటయేగాక చెన్నపట్టణపు రుమాళ్లుగూడ నమ్మి చాలలాభము సంపాదించిరి.

అనంతరము కొంతకాలమునకు సిద్ధులుసెట్టిమృతినొంద లక్ష్మీనరుసు స్వతంత్రుఁడై విరివిగా వ్యాపారమును జేసెను. ఆకాలమున నమెరికాఖండములోని దేశములుకొన్ని యంతఃకలహములు గలిగి యుండుటచే నచట ముఖ్యముగా పైరగుచుండిన దూదిపంట చెడిపోయెను. ఆకారణమున హిందూదేశమునందు నీజిప్టుదేశమునందు ననేకులు దూది వర్తకముమీఁద బడిరి. లక్ష్మీనరుసుశెట్టియు దానియద నెక్కిగి విశేషముగా దూదివర్తకము చేసెను. అతని యదృష్టము బాగుండుటచేఁ జేసిన బేరమెల్ల లాభకరమయ్యెను. అందుచేత నతఁడు స్వల్పకాలములోనే లక్షలకొలఁది ధనముసంపాదించెను. కావలసినంతధనమున్నది గదాయని సంతుష్టుఁడై యతఁడు మునుపటివలె వ్యాపారముమీఁద నంతశ్రద్ధనిలుపక తనదేశస్థులకు రాజకీయ వ్యవహారములలో నెక్కుడు స్వాతంత్ర్యమును గలుగఁజేయవలెనని దృష్టి యంతయు దానియందే నిలిపెను. ఆనాఁటి హిందువులు బొత్తిగా నింగ్లీషు తెలియనివారగుటఁ దమపరిభుత్వ మెట్టిదియో బొత్తిగ నెఱుంగని మూఢులై యుండి చెన్నపట్టణములోనున్న యధికారులే సర్వస్వ

తంత్రాధికారులని భావించి సీమలో వారిపైయధికారులున్నారని యు వీరన్యాయములు చేసినప్పుడు వారికప్పీళ్లు పంపుకొనవచ్చునని యు నెఱుంగకయిక్కడియధికారులచేత ననేక బాధలు పడుచుండిరి. లక్ష్మీనరుసుసెట్టి మాత్రమే యాదొరల యన్యాయము లెఱింగినవాఁ డగుటచే "చెన్నపట్టణ స్వదేశసంఘ" మనుపేర నొక సంఘము స్థాపిం చెను. దాని ముఖ్యోద్దేశము జనులందఱికి నప్పటి దేశ స్థితిగతులు తెలి పిప్రజలకష్టసుఖములు దొరతనమువారికి వినయపూర్వకముగాఁ దెలు పుకొనుటయే. ధనవంతులగు వర్తకులుదొరతనము వారిక్రింద నుద్యో గములుచేయని పెద్దమనుష్యులు పలువు రాసంఘములోఁ జేరిపనిచేసిరి. ఆసంఘమువారు పలుమారు సభలుచేసి ప్రజలు పడియెడు కష్టములఁ జర్చించి తన్నివారణార్థము సీమలోనున్న యధికారులకు మహజ రులనంపిరి.

ఈసెట్టిగారి మొదటి పోరాటము క్రైస్తవమతబోధకులతో సంభవించెను. అప్పటికిఁగ్రీస్తుమత బోధకులు కొందఱు మన దేశము నకు వచ్చి పాఠశాలలుపెట్టి యింగ్లీషులోని శాస్త్రవిద్యలు మనవారి కినేర్పి యుపకారము చేయుచువచ్చినను పాఠశాలలోని బాలకులను దమ మతములోఁ గలుపుకొనుచు వచ్చిరి. ఆకాలమున మనవారిలో ననేకుల కింగ్లీషు రాకపోవుటచేతను రాజభాషయగు నింగ్లీషువచ్చినఁ గాని యుద్యోగములు దొరకకపోవుటచేతను మనవా రుద్యోగముల మీఁదిమాఁశచేయ తమబిడ్డలను గ్రైస్తవుల పాఠశాలలకే బంపవలసి నవారైరి. ఆమతబోధకులు తమబడికి వచ్చినవిద్యార్థులలో మిగు లలేబాలియము గలవారిని సయితము స్వమతమునం గలుపుకొనిరి. గొప్పయుద్యోగములలోనున్న తెల్లదొరలందరు క్రైస్తవ మతబోధ కుల కీకార్యమునందుఁ దగిన సహాయము జేసిరి. అందుముఖ్యులగు వారిఁ గొందర నిందు బేర్కొనుచున్నారము. తిరునల్వేలి జిల్లాకలక్

టరగు థామసుదొరగారు క్రైస్తవ మతబోధకులు తమతమ వ్యా ప్తికిఁజేయు పనులకు బహిరంగముగఁ జాలసహాయము చేసిరి. అందు చెన్నపట్టణము సాదరు కోర్టులో జడ్జీయగు సర్ విలియంబర్టనుదొ రగారు మతబోధకులమీఁద తనకుఁగల యభిమానమును స్పష్టముగఁ దెలుపుటయేగాక కోర్టులో ధర్మపీఠమునఁగూర్చున్నప్పుడు సయితము తానే హిందువుల కప్పుడు క్రైస్తవ మతము బోధింపఁజొచ్చెను. అ ప్పుడు గవర్నమెంటు సెక్రిటరీగారగు మరియొక థామసుదొరగారు హిందువుల కుద్యోగములీయక క్రైస్తవమతములోఁ గలసినవారికే వి శేషముగా నుద్యోగము లీయఁజొచ్చెను. చెంగల్పట్టు జిల్లాజడ్జీగారొక నాఁడు వ్యాజ్యములో విచారణ చేయుటమాని తమ కచేరీ యొక మత బోధకుని యుపన్యాసము నిమిత్త మెరువిచ్చెను. క్రింది యధికారు లిట్లధర్మముగా ప్రవర్తించుచుండ దొరతనమువారేమయిన వారి నదపులోనుంచిరో యన నదియు లేదు. మిఁగుమిక్కిలి వారుమతబో ధకులకు వ్యతిరేకముగాఁ బనిచేసిన నెల్లవారి కపకారములుచేయసాగి రి. చెన్నపట్టణపు సాదరుకోర్టులో నొకజడ్జి దొరతనమువారు చెప్పిన ట్లువినక న్యాయదృష్టి గలిగి మతబోధకులకు వ్యతిరేకముగా బనిచేసి నందున వారు వాని యుద్యోగమును దీసివేసిరి. ఆజడ్జీగారిని హిందు వులు గౌరవించి వానికి దమకృతజ్ఞతను దెలిపినప్పు డాదొరగారీక్రింది విధముగ దెలిపిరి.

"సాదరుకోర్టు జడ్జీల కిష్టములేని కార్యములు దొరతనము వారు చేయుమని వారినడిగినప్పుడు జడ్జీలు నోరు మూసుకొని యూర కొన్నపక్షమున దొరతనమువారికముందు స్పష్టముగా హిందువు లందరు క్రైస్తవులలో గలియవలయునని యాజ్ఞాపింతురు. చెన్నపట్ట ణపు గవర్నరుగారు తమకట్టి యభిప్రాయము లేదని తెలిపినను గవ ర్నమెంటు సంబంధముగల కొందఱు పెద్దమనుష్యుల కట్టి సంబంధము

లుగలవనియు వారు తలంచుకొన్నంత పని చేయగలరనియు ననుభవ ములవలన దెలియవచ్చుచున్నది. గవర్నమెంటువారి ప్రవర్తనముబట్టి సాదరుకోర్టు జడ్జీలు వారియుత్తరువులం గొన్నింటిని మన్నించుట కు వీలు లేకపోయినది. అట్టి యుత్తరువులను న్యాయదృష్టి గల యేజడ్జీయు మన్నింపఁడు. న్యాయస్థానము యొక్క గౌరవమును ధర్మమును నిలువబెట్టుటకుఁ గృతనిశ్చ యుఁడైనందునకే దొరతనమువారునన్ను తీసివేసిరి. క్రైస్తవమతబోధకు లు నీతినియమములు లేక బాలురను గలుపుకొనుటయు వారికిరహస్య ముగ దొరతనమువారు దోడ్పడుటయునెఱిఁగిహిందువులందఱువిశేష ముగ మనస్తాపమునొందుటచేతఁ లక్ష్మీనరుసుసెట్టి,స్వదేశస్థుల మతవిష యములలో నింగ్లీషువారు సంబంధముకలుగ జేసుకొనమనిమొదటప్ర తిజ్ఞచేసి పిదప జేయరానిపనులు చేయుచుండినందున వానినివారించు టకుఁ దనసర్వశక్తిని వినియోగించి పనిచేయవలయుననికృతనిశ్చయుం డయ్యెను. ఆకాలమునఁ జెన్నపురియందు నేటివుసర్క్యులేటరను నొక పత్రిక యింగ్లీషులోప్రకటింపఁబడుచుండెను. దానికినారాయణస్వామి నాయుఁడను నతఁడు పత్రికాధిపతి. లక్ష్మీనరుసు వానియొద్ద నాపత్రికను ముద్రాయంత్రమును వెలకుగొని "క్రెసెం" టను క్రొత్తపత్రికను ప్రచురింపఁదలఁచి దానికి హార్లేయను నొక దొరగారి సభపతిగానేర్ప రచెను. క్రిసెంటు శబ్దమునకుఁ జందమామయని యర్థము. హార్లే దొర యంతకుమున్ను సైన్యములో బనిచేసినవాఁడు గావున నతఁడు పత్రికనునడపునప్పుడు సయితము వెనుకటి వీరరౌద్రములు చూపుచు నందరకు భయంకరుఁడై యుండెను. ఆపత్రికయొక్క మొదటి సం చిక 1814 వ సంవత్సరము 2వ అక్టోబరు తారీఖున బయలు వెడలె ను. అప్పటికి మనసెట్టికి ముప్పదియెనిమిదేండ్లవయస్సు. హిందూదేశ స్థులను సమున్నతస్థితికిఁదెచ్చుటయే యాపత్రికయొక్కముఖ్యోద్దేశమ

ని యందు వ్రాయబడెను. ఆదినములలో రికార్డు అను నొకపత్రికను బ్రకటింపుచు వచ్చిరి. క్రిసెంటుపత్రిక రికార్డుపత్రికలోని తప్పులను జూపుచు క్రైస్తవ మతబోధకుల దురాచారములను ఖండించుచు వారి యవకతవకలను వెలిపుచ్చుచు వచ్చెను. మొట్టమొదట క్రిసెంటు పత్రికమీద ననేకులకుఁ గోపమువచ్చెనుగాని యెవరికిగోపమువచ్చినను లెక్కసేయక యది తన పనిచేయుచు కాలూది నిలచెను. దొరతనము వారి గొప్పయుద్యోగస్థులు వారియాజ్ఞావర్తులగు జడ్జీలు క్రిసెంటు పత్రికలోనిసూదిపోటులవంటిమాటల కుడికి బహిరంగముగ దాని నేమి యుఁజేయజాలక లోలోపలమతబోధకులకుఁ దొంటికంటెనెక్కుడు సహాయముఁ బ్రోత్సాహము చేయసాగిరి. ఆకాలముననున్న యితరపత్రికలకుఁజూపిన యాదరమును దొరతనమువారు క్రిసెంటుపత్రికకుజూపరైరి. దీనికొక్క తార్కాణముగలదు. క్రిసెంటను పేరుతో నొక పత్రికయున్నదని లోకులకు దెలియఁజేయుటకు గెజిటులో వేయుమనిపత్రికాధిపతి గవర్నమెంటువారికి విజ్ఞాపనముచేయ దక్కినపత్రికలన్నిటికి నట్టి యాదరముచూపిన గవర్నమెంటువారు దీనిపేరుతమగజిటులో వేయుటకు వీలులేదని తెలియజేసిరి.

ఈనడుమ దొరతనమువారు క్రైస్తవులలోగలసిన హిందువులకు కష్టములు లేకుండుటకు నొకచట్టము నిర్మింపఁదలఁచిరి. ఆచట్టమును బట్టి క్రైస్తవమతములోగలసిన హిందువులకు స్వమతములోనున్నప్పుడువచ్చునట్లె పిత్రార్జితమగు నాస్తిలోఁ దమవంతు భాగము నిరాటంకముగ వచ్చును. ఈచట్టము ధర్మవిరుద్ధమనియుఁబ్రజలకుహానికరమనియుఁదలంచి లక్ష్మీనరుసుసెట్టి 1845 సంవత్సరము 9వ యేప్రియల్ తారీఖునఁ జెన్నపురములో మహాజనుల నందఱిని బిలిచి సభచేసిసీమలోనియధికారులకు మహజరు బంపుట కందఱనొప్పించెను. ఆసభకు సమస్తజనులు వచ్చి దొరతనమువారు చేయఁదలఁచుకొన్న చట్టము

హిందువుల యాచారవ్యవహారములకుఁ విరుద్ధమనియు దానినినిర్మింప నీయవద్దనియుఁ బ్రార్థించుచు గొప్పమహజరువ్రాసి యింగ్లాండునకు బంపిరి. చెన్నపురిదొరతనమువారికి సీమలోనియధికారులకుగొంతకాల ముత్తరప్రత్యుత్తరము జరిగిన పిదప నట్టిచట్టము నిర్మించుట లేదని యింగ్లాండులోని యధికారు లభయమిచ్చిరి. ఈకార్యమున విఫలప్రయత్నులై క్రైస్తవమతబోధకులు తమమత వ్యాప్తికిమరియొకదారి వెదకికొనఁదలఁచి దృష్టిపాఠశాలలవంకఁ ద్రిప్పిరి. అదివఱకు దొరతనమువారి పాఠశాలలలో శాస్త్రాదివిద్యలేగాని మతముచెప్పుటలేదు. మతబోధకులు వారిప్రోత్సాహకులగు దొరలు బాలురనుబరీక్షించునప్పుడు వారు నేర్చిన శాస్త్రవిద్యలలోఁ బ్రశ్నలు వేయుటకు మారుగ మున్నెన్నఁడు వారు చదివియెఱుఁగని క్రైస్తవమత గ్రంథములలోను తత్వశాస్త్రములలోనుగల విషయములంగూర్చిప్రశ్నలువేసి యవిచెప్పలేనివారు గవర్నమెంటువారియుద్యోగమున కనర్హులనితోసివేయుచు వచ్చిరి. అట్లుచేయుట న్యాయమాయనిహిందువులుపాఠశాలాధికారుల నడుగ బైబిలుగ్రంథము బాలురచే పాఠశాలలో జదివించిన పక్షమున నిట్టిచిక్కులు రావనియు నట్లుచేయుటకు సమ్మతింపవలసినదనియు వారు చెప్పిరి.

లక్ష్మీనరుసుశెట్టియీదుర్నయమునడంపఁదలఁచి 1846వ సంవత్సర మక్టోబరు నెల 7 వ తారీఖున గొప్పసభచేసి యింగ్లాండులోనున్న డైరెక్టర్లకు గొప్పమహజరు వ్రాసి తమకుగలిగినయాయుపద్రవము నివారింపుమని ప్రార్థించుచుచాలమందిచేవ్రాళ్ళుచేయించియామహజరును బంపెను. ఆమహజరునందున్న ముఖ్యాంశములివి 1. మొదట హిందువుల మతవిషయముల జోలికిరామని గవర్నమెంటువారు వాగ్దానముజేసినను వెనుకటిగవర్నరుగారు తద్విషయమునవిరుద్ధముగ బ్రవర్తించిరి. 2 మతబోధకులు హిందువులబిడ్డలను స్వేచ్ఛగా స్వమ

తములోఁ గలుపుకొనుచున్నారు. దొరతనమువారి యుద్యోగస్థులునా రిం బురికొల్పుచున్నారు. 3 మతబోధకులు హిందూబాలకులపరీక్షల లోఁగృతార్థులై యుద్యోగమునుసంపాదించుకొనకుండప్రయత్నిం చుచున్నారు. 4 చెన్నపురి రాజధానిలోని జిల్లాలలో పాఠశాలలుపె ట్టించి గవర్నరుగారుజనులుకింగ్లీషుచెప్పింపకున్నారు. 5గవర్నమెంటు వారు తమకచేరీలలో హిందువులకు విశేషముగా బనులిచ్చుటలేదు. 6 న్యాయస్థానములగు కోర్టులఁ దరుచుగ నన్యాయమే జరుగుచున్న ది. 7 ఇదిగాక యానాటివారనుభవించెడు ననేకకష్టములనుగూర్చియు వ్రాయఁబడియున్నది. ఆసభకు లక్ష్మీనరసుసెట్టి యగ్రాసనాధిపతి య య్యెను. సభ మొదటినుండియు చివఅవఅకునిశ్శబ్దముగఁగ్రమముగరా జభక్తికి లోపములేనట్టుగా జరిగినను గొందఱుదొరలు సభలోనల్లరిజ రిగెననియు నగ్రాసనాధిపతి రాజద్రోహగర్భితములగుమాటలనుపన్య సించెననియువానిమూలమున జనులు పితూరిచేయుదురనియు జాటజొ చ్చిరి.. ఆసభలో, సెట్టి "మనకష్టములను పైయధికారులకు వినయపూ ర్వకముగా విన్నవించుకొందుమేని వారు మనయాపదలనునివారింపక పోరని చెప్పెనేకాని చెప్పఁగూడదనినేమియునుపన్యసింపలేదు. ఆమహ జరులో వ్రాలుచేయవలదని దొరతనమువారిపక్షమువారు కొందఱుజ నులను భయపెట్టిరి. గాని యెందఱు బెదరించినను దానిలోబండెరెండు వేలజనులు వ్రాలుచేసిరి. అతఁడా మహజరు చెనపురి గవర్నరుగారి ద్వారా సీమకుబంపెను. గవర్నరుగారా మహజరు తనయొద్దకువచ్చిన ప్పుడు దానిమీఁద "జనులు గవర్నమెంటువారు చేయు కార్యములు నెఱుఁగక మిడిమిడిజ్ఞానముగలవారి ప్రేరణమున నిట్టిపనులు చేయు చున్నా"రని వ్రాసి యింగ్లాండునకు బంపిరి. గవర్నరుగారు వ్రాసిన వ్రాతలనుబట్టి యామహజరు సీమలో బుట్టదాఖలయ్యెను. జనులు మహజర్లంపుచున్నారని సందేహించి దొరతనమువారు పాఠశాలలో

బైబిలు చదివించుట కొంతకాలము మాని 1853 వ సంవత్సరమున వెండియుఁ దద్విషయమునఁ బ్రయత్నించిరి. కాని నార్టనుదొరగారు, లక్ష్మీనరుసుసెట్టిగారు కలసి పాటుపడి యాపని సాగనియ్యరైరి.

ఆకాలమందే యింగ్లాండుపార్లమెంటుమహాసభలోనొకసభికుఁడగు డాంబిసేమరుదొరగారు హిందూదేశమును జూడవచ్చిరి. సెట్టిపంపినమహజర్లవల్ల నతనిపేరింగ్లాండులో నిదివఱకే పార్లమెంటుసభికులకు బరిచితమైనందున సేమరుదొరగారు నావదిగినతోడనే లక్ష్మీనరుసుసెట్టి బాగున్నాఁడాయనియడిగెను. సెట్టియు వానిదర్శనముచేయవారిరువురకునొండొరులపై గౌరవము ననురాగము జనియించెను. సెట్టి దొరగారిని దనయింటగొంతకాలము విడియించి సమయముదొరికినప్పుడెల్లగవర్నమెంటువారు మతవిషయములలోను రాజకీయవిషయములలోనుజనులకుచేయుచుండిన యపకారములను మనస్సునకునాటునట్లు చెప్పుచువచ్చెను. సేమరుదొరగారు సెట్టిని వెంటబెట్టుకొని కడలూరుకుంభకోణము కోయంబత్తూరు మొదలగు దక్షిణహిందూస్థానములోని ముఖ్యపట్టణములకుఁబోయి సర్కారుకట్టిన దుర్భరములగుపన్నులిచ్చుకొనలేక రహితులుపడియెడు బాధలను స్వయముగాజూచెను. అతఁడు కొన్ని పట్టణములలో పన్నులిచ్చుకొనలేని రహితులీక్రింద చెప్పఁబడిన విధమున దారుణ బాధల పడుచుండ జూచెను. కొందరు రహితులు మిట్ట మధ్యాహ్నపుయెండలో నడుములువంచుకొని నిలిచియుండిరి. వారి వీపులమీఁద సర్కారునౌకర్లు పెద్దరాళ్ళెత్తిరి. కొందఱికాళ్ళకు బొండవేసిరి. కొందఱిని మెడకుం గాలికి నంటకట్టి చెట్లకో స్థంభములకో వ్రేలదీసిరి. ఆ బాధలు పడలేక యా రహితులు గోలుగోలుమని యేడ్చుచుండిరి. ఇదియంతయుఁ తాలూకాకచ్చేరీయెదుటనే జరుగుచున్నను మేజస్ట్రీటుగారు తహస్సీలుదారుగారు వారివంక కన్నెత్తియైన జూడక వారిమొరలు వినిపించుకొనక

సుఖముగా సంతోషముగా బని జూచుచుండిరి. సేమరుదొరగారు బ్రిటీషు గవర్నమెంటువారు పన్ను వసూలుచేయుటకు రహితులను బెట్టుచున్న యా దారుణబాధలను కన్నులారచూచి జ్ఞాపకార్థమొక పుస్తకములో వ్రాసికొని యాదారుణకృత్యములలో నుపయోగింపఁ బడు పనిముట్లు కొన్ని పుచ్చుకొని కట్టగట్టి తనవారికి జూపుటకు సీమకు తీసుకొని పోయెను.

1854 వ సంవత్సరము జూలై నెలలో సేమరుదొరగారు పార్లమెంటులో హిందూదేశ ప్రసంగమువచ్చినప్పుడు హిందువులు హానికరములగు దుష్కార్యములు చేసినందుకేగాక పన్నులిచ్చుకొనలే నందుకుగూడ గవర్నమెంటువారిచేత క్రూరముగ బాధింపబడు చున్నారని చెప్పెను. దేశము చూచివచ్చిన సేమరుదొర యట్టి బాధలున్నవని చెప్పుచుండ మనదేశమెన్నడెఱుఁగని పార్లమెంటుసభికులు చాలమంది యట్టిపీడలు హిందూదేశమున లేవని వాదించి యంతతో తనివినొందక వ్యర్థదోషారోపణములఁ జేయుటకు దేశమందలి మారుమూలలు తిరిగితివి గాఁబోలునని సేమరుదొరను నిందించి యధిక్షేపించిరి. ఇండియాబోర్డున కప్పుడు ప్రసిడెంటుగానుండిన వుడ్డుదొరగారు మాత్రమది యబద్ధమై యుండదని దానింగూర్చి విచారణచేయఁ దలఁచి తద్విషయమున సాక్ష్యములు పుచ్చుకొమ్మని ప్రత్యేకమొక చిన్న సభ నేర్పఱచెను. ఆ సభవారు కొన్ని ప్రదేశములు తిరిగి యా విషయమున సాక్ష్యములు తీసుకొని పార్లమెంటు మహాసభకు పంపిరి. దొరతనమువారి విచారణ జరుగుచుండ యా విషయమున ప్రజల యభిప్రాయమునుగూడ యధికారులకుఁ దెలియజేయవలయునని లక్ష్మీనరుసు సెట్టి చాలమందిచేత వ్రాళ్ళుచేయించి యొక మహాజరు పంపెను. ఇవియన్నియుఁ జేరిన

తోడనే పార్లమెంటువారు పన్ను లిచ్చుకొనలేని జనులను బాధించుట దౌర్జన్యమని యట్టి దురాచారము నడంచిరి.

1852 వ సంవత్సరమున లక్ష్మీనరసుసెట్టి ప్రేరణమున చెన్నపురి స్వదేశసంఘమువారు తమకష్టములన్నియుం జేర్చుకొని వానిని నివారింపుమని వేడుచు పార్లమెంటువారికి మఱియొక మహజరంపిరి. ఆ మహజరులో నున్న ముఖ్యాంశములివి. హిందూదేశమున వచ్చు బాధలన్నియు మితిమీరిన పన్నులవలనను వానిని వసూలుచేయు క్రూరపద్ధతుల వలనను గవర్నమెంటువారి కోర్టులలో జరుగు నాలస్యము దుర్వ్యయము మొదలగు వానివలనను సంభవించుచున్నవి. మాకు ముఖ్యముగా గావలసినవి మంచిరోడ్లు వంతెనలు చేల కదును దప్పకుండ నీరిచ్చు కాలువలు పల్లెటూళ్ళ బాలురకు విద్యనేర్పు పాఠశాలలు మొదలగునవి. గవర్నమెంటు పరిపాలనా విషయమునఁ జేయు వ్యయము తగ్గింపవలయును. దేశమభివృద్ధి పొందునట్లు ప్రజలు సుఖపడునట్లు గవర్నమెంటువారు ప్రభుత్వము చేయవలయును. పై సంగతులన్నిఁటిని వ్రాసి వారా మహజరులలో చిట్టచివర నీక్రింది వాక్యములఁ బొందుపరచిరి. “హిందూదేశ పరిపాలన మిప్పుడున్నట్లు కంపెనీవారి చేతిలోనున్నను సరే, లేక మరియొకరిచేతిలో నున్నను సరే, పాలించు పద్ధతిలో మార్పులు కాలాను సారముగ నభివృద్ధులు తప్పకనుండవలయును. ఆమార్పులు మూఁడేండ్లకొకసారిగాని లేనిచో నైదేండ్లకొకసారిగాని దేశముయొక్క స్థితినిబట్టి యవసరములనుబట్టి చేయుచుండవలయును. విశాలమైన యీ దేశమునందుండు ప్రజలు తమపడు సంకటములు తెలిసికొను పైవారికిఁ దెలుపుకొనుటకును, దెలుపుకొనినపిదప తగిన విచారణ జరుగుటకు పార్లమెంటు మహాసభలో నప్పుడప్పుడు హిందూదేశ విషయమున చర్చలు జరుగుచుండవలయును. ఇక్కడ దొరతనముచేయువారు జాగ్రత్తతో ప్రజాపాల

నము చేయుచున్నవారో లేదో కనుగొనుటకు సీమలోనున్న పైయధి కారులు వీరుచేయు పనులను శ్రద్ధతో విమర్శించు చుండవలయును"

ఈ పై మహజరు 1853 వ సంవత్సరము ఫిబ్రేవరునెల 25 వ తారీఖున పార్లమెంటు ప్రభుసభలో నెల్లింబాప్రభువుగారు దాఖలు చేసిరి. ఆ సభలో మఱియొక ప్రభువు హిందూదేశ విషయమునఁ బ్రసంగించుచు సభికులతో నిట్లని చెప్పెను. "ఈ మహజరులోనున్న సంగతులు సత్యములని తెలుపుటకు హిందూదేశస్థులవలన వ్రాయఁ బడిన యుత్తరములు రెండు నాయొద్దనున్నవి. ఆయుత్తరములు వ్రాసిన వారు పెద్దమనుష్యులు యోగ్యులు. మనవలెనే వారు నింగ్లీషు చక్కఁగా వ్రాయగలరు మాటలాడఁగలరు. ఆయిద్దరిలోనొకరు లక్ష్మి నరుసు సెట్టిగారు. ఆయన 1853 వ సంవత్సరం జనవరి 24 తారీఖున నా పేర నీక్రింది విధముగా నుత్తరము వ్రాసినారు. "మేము పడు చున్న బాధలను విచారణ సేయుట కొఱక ప్రత్యేక సభ యేర్పడు నేని మేముచెప్పిన విషయములన్నియుఁ కన్నులకు గట్టినట్లు ఋజువు కాగలవు. అవి వివరించుటలో మే మతిశయోక్తిని విడిచినాము. వాని సత్యము ప్రత్యేకసభవారు సాక్ష్యములు తీసికొనుటవలననేగాని మఱి యొక లాగున యూరపుఖండమువారికిఁ దెలియదు."

అని యాప్రభువు లక్ష్మినరుసుసెట్టి మాటలయందు మిక్కిలి గౌరవము నమ్మిక గలిగి మాటలాడెను. ఆసంవత్సరమే పార్లమెంటు సభలోఁ బ్రధానసభికుఁడు లోకానుభవము గలవాఁడు నగు బ్రైటు దొరగారు లక్ష్మినరుసుశెటి వ్రాసిన యుత్తరములు తాను జూచినట్లు వాని మాటలు తనకు సత్యములని తోఁచినట్లుచెప్పి హిందూదేశస్థులు పడు బాధలను విచారణసేయుటకుఁ బ్రత్యేకసభ నొకదాని నేర్పరుప వలసినదని పట్టుపట్టెను. లక్ష్మినరుసు సెట్టి వెనుకపంపించిన మహజర్ల తో దృప్తినొందక హిందూదేశప్రభుత్వము కంపెనీవారియొద్దనుండి

తీసుకుని యింగ్లాండు రాజుగారుస్వయముగా బరిపాలించిన బాగుండు నని ప్రార్థించుచు పదునాలుగువేల జనులచేత వ్రాళ్ళుచేయించి పార్ల మెంటుకు మఱియొక మహజరు పంపించెను. చెన్నపట్టణమందు లక్ష్మీ నరుసుసెట్టియు, బొంబాయియందు కొందరు, బంగాళమునందు మఱి కొందరుఁ బడిన పరిశ్రమచేత పార్లమెంటువారు మనదేశప్రభుత్వము కంపెనీవారియొద్దనుండి తీసికొనక పోయినను కొన్ని మార్పులఁజేసిరి. అందు ముఖ్యమైనవి: "హిందూదేశములో గొప్ప యుద్యోగములు పరీక్షలయందుఁ గృతార్థులైనవారికే గాని యధికారులకుఁ దోఁచిన వారికియ్యఁగూడదు. అదివఱకున్న సాదరుకోర్టులుపోయి హైకోర్టులు వాని స్థానమందు వచ్చెను." అంతలో హిందూదేశమున గొప్ప సిపా యిపితూరీ 1847 వ సంవత్సరమున బుట్టుటచే 1858 వ సంవత్సరమున హిందూదేశప్రభుత్వమును స్వయముగా నింగ్లాండు దేశపు రాణీగా గారగు విక్టోరియాగారే వహించిరి.

పచ్చయ్యప్ప మొదలియారను సత్పురుషుఁ డొకఁడు సత్కా ర్యముల నిమిత్తము లక్షలకొలఁది రూపాయలిచ్చి చనిపోయెను. ఆ ధనమునకుఁ గొందఱు ధర్మకర్తలేర్పడి పాఠశాలలు మొదలైనవి పెట్టించిరి. లక్ష్మీనరుసుసెట్టిగారు పరోపకారపారీణుఁడగుటచే ధర్మ కర్తగా నుండఁదగినవాఁడని తక్కినవారు వానింగూడ నందు చేర్చు కొనిరి.

ఇట్లు ప్రజాపక్షము వహించి పనిచేయుటచే లక్ష్మీనరుసుసెట్టి రాజద్రోహియనియు విశ్వాసపాత్రుఁడు గాఁడనియుఁ దొరతనము వారు భావించి యతఁడిచ్చిన యుపన్యాసములను మిక్కిలి శ్రద్ధతో శోధించుచు నతఁ డెక్కడికిఁబోయిన నక్కడకు వెంటవెంట పోలీసు వారిని బంపుచుండిరి. 1857 వ సంవత్సరమున జరిగిన సిపాయి పితూ రీకిఁ గారణము దొరతనమువారు మతసంబంధము కలుగజేసికొను

టరే. అటుపిమ్మట నట్టిమత సంబంధము కలుగఁజేసికొనవద్దని సెట్టి గవర్నమెంటువారి కొక మహజరు పంపించెను. ఆమహజరు మిక్కిలి బాగుండెనని శ్లాఘించి యింగ్లాండులోని యధికారులు వారి యాలోచనము నంగీకరించిరి. ఇట్లు కొంతకాలము గడచునప్పటికి మునుపు సెటిగారిమీఁద ద్వేషము పూనిన దొరలు క్రమక్రమముగ నుద్యోగములు ముగించుకొని స్వదేశములకుఁ బోవుటచేతను సెట్టిగారిమీఁద లోకుల కంతకంత కనురాగము హెచ్చుచుండుటచేతను దొరలలోఁ గొందఱు సయితము వాని ధైర్యమునకు వానిపరోపకారచింతకు నద్భుతము నొంది శ్లాఘించుటచేతను,అప్పటి చెన్నపురిదొరతనమువారు వానిని నిందింపఁమానిరి. మానుటయేగాక యాదొరతనమువారు వానిచేసిన దేశోపకారముల మెచ్చుకొనుచు వానికి C. S. I. అను బిరుదము నిచ్చి గవర్నరుగారి శాసననిర్మాణసభలో నొక సభికుఁడుగ 1863 వ సంవత్సరమున నేర్పఱచిరి. ఆపదవియందు వాని నుంచుట సమస్తమతములవారికిసమస్తజాతులవారికిఁ దృప్తికరముగ నుండెను.

అటుమీఁద లక్ష్మీనరుస్సెట్టి తనదృష్టి మైసూరురాజ్య వ్యవహారములవంక నిలిపెను. ఇంగ్లీషువారు మైసూరును జయింపఁబోయినప్పుడు హైదరాబాదు నిజాముగారి సహాయముఁ బడసి మైసూరు సంస్థానము స్వదేశరాజుల కీయకపోయినపక్షమున నిజామును దామును గలిసి పంచుకొనునట్లొడంబడిక చేసుకొనిరి. లక్ష్మీనరుస్సెట్టి మైసూరుసంస్థాన మింగ్లీషువారు దానిరాజున కప్పగింప నిష్టము లేకున్నవారని తెలిసికొని స్వయముగ మైసూరువెళ్ళి వృద్ధరాజును దర్శించి వంశపరంపరగ నుండునట్లుపుత్రుం బెంచుకొమ్మనియుఁ బెంపుస్థిరపరప దొరతనమువారిని నొక్కి యడుగవలసినదనియు వానికి హితోపదేశముచేసెను. ఒకవేళ యింగ్లీషువారు మైసూరురాజుయొక్క పుత్రి

స్వీకారము నంగీకరింపకబోవుదు రేమో యనుభయమున లక్ష్మీనరుసు హైదరాబాదు నిజాముగారి మంత్రియు సుప్రసిద్ధుఁడు నగు సలారు జంగును గలిసికొని మైసూరు సంస్థానము రాజునకు దొరతనము వారియ్యసియెడల వెనుకటి యొడంబడికను బట్టి నిజామునకు సమముగా బంచిపెట్టవలసినదని యడుగుమని యాయనంబురికొల్పెను. అప్పుడింగ్లీషువారు మైసూరురాజుయొక్క పుత్రస్వీకారము నంగీకరించుటయో లేక నిజామున కందులో భాగము పంచిపెట్టుటయో రెంటిలో నేదోయొకటి చేయనలసివచ్చినందున రాజునకు సంస్థానమిచ్చుట యెక్కుడు గౌరవమని దత్తపుత్రుఁడు యుక్తవయస్కుఁడైన పిదప రాజ్యమిచ్చునట్లొప్పుకొనిరి. సెట్టి జాన్ బ్రూస్ నార్టనుదొరగారితోఁగలిసి రాజ్యభ్రష్టుఁడైన తంజావూరి మహారాజుభార్యల దురవస్థను గొంతవఱకు చక్కపఱచి మృతినొందిన కర్నాటకనవాబు యొక్క కుటుంబ మనుభవించు కష్టములను జాలవఱకు తగ్గించెను. ఈపనులు 1864 వ సంవత్సరమున జరిగెను.

అప్పటికి సెట్టిభాగ్యము క్షీణించెను. క్రిసెంటుపత్రిక నడపుటకే వాని ధనమంతయు వ్యయమయ్యెను. అతఁడు తన వ్యాపారము కుమారున కప్పగించుటచేత వాని తెలివితక్కువవలన నదిబొత్తిగచెడిపోయెను. కావలసినధనములేమి క్రిసెంటుపత్రిక ప్రకటింపఁబడుట మానెను. అది మొదలుకొని లక్ష్మీనరుసుసెట్టి జీవితకాలశేషము పేదయై గడపెను. ఆయన 1868 వ సంవత్సరమున మృతినొందెను. ఆయన దేహము నశించినను కీర్తిదేహ మిప్పటివఱకు దక్షిణహిందూస్థానమునయున్నది. ఆయన మృతినొందిన కొన్నినాళ్ళకు చెన్నపురిమహాజనులు పచ్చయ్యప్పగారి పాఠశాలలో సభగూడి వానిమరణమునకు మిక్కిలి విచారించి వానిపేరు చిరకాలము జ్ఞాపకముండుటకు వానిబొమ్మయొకటి నిర్మింపఁజేసి యదియాపాఠశాలలో బెట్టుటకు

ను ప్రెసిడెన్సీకాలేజీలో సంస్కృతము జదువుకొను బాలురలో సూ క్ష్మబుద్ధిగలవానికి నెలకుకొంతసొమ్ము విద్యార్థి వేతనముగ నిచ్చుట కును గృతనిశ్చయులైరి. ఆ రెండు కార్యములకుఁ గావలసినధనమునా కాలపు గొప్పవారందఱిచ్చిరి. తిరువాన్కూరుమహారాజుగారు, వారి మంత్రి సర్. టి. మాధవరావుగారు సెట్టిగారిమరణమునఁ దమ కుఁగలిగిన సంతాపము నెఱిఁగించుచు గొంత చందాసొమ్ము బంపిరి. ఈయన దేశాభిమానులలో బ్రథమగణ్యుఁడని చెప్పనచ్చును. సాధా రణముగ దేశోపకారము జేయఁబూనువారు ప్రజలమెప్పుకొఱకు దొ రతనము వారిచ్చు బిరుదులకొఱకు నెదురుచూతురు. ఈసెట్టి గారు సంపాదించిన ధనమంతయు లోకహితముకొఱకు వ్యయముచేసి దొరలకోపమునకు పాత్రుఁడై ప్రజాపక్షముబూని పాటుపడి కడకు ని రుపేదయై చచ్చెను. దొరతనమువారి లోపములను మొగమోటము లేక ఖండించి చెప్పుట కీదినములలో సయితముగొప్ప విద్యావంతులు ధనవంతులు భయపడుచుండ నేబది యఱువది యేండ్లకిందట నింగ్లీ షువిస్తారము రానివాఁడు గొప్పపరీక్షల గృతార్థుఁడుకానివాఁడు దొ రతనమువారితో బ్రతికక్షబూని నిర్వహించుట యెంతకష్టమో యో చింపుడు. మొదట వాని మంచితన మెఱుగక దొరలు వానినే వం చించుకొన్నను నిజము నిలుకడమీఁద తెలిసికొని బ్రాఁచుబామను కొన్నది పూలదండయయ్యెనని తలంచి దూషించినవారె భూషించి రి. ఆతఁడు నిజమైన లోకోపకారబుద్ధిగలవాఁడగుటచే స్తోత్రముల కుబ్బక నిందలకు వెఱువక తాను మంచిదని నమ్మినపనిచేసెను. ఈ తఁడు రాజకీయవ్యవహారములయందేగాక సంఘసంస్కరణమునందు నిష్టముగలవాఁడె. వితంతువివాహములు మంచివని యీయన యభి ప్రాయము. స్త్రీవిద్యాభివృద్ధికి స్వధనములోఁ గొన్ని పాఠశాలలు పె ట్టించెను. అరవపండితులకుఁ దెనుఁగు పండితులకుఁ జాలసహాయము చేసెను. వేయేల! లక్ష్మీనరసు సెట్టియేలోకోపకారి. అతఁడేధన్యుఁడు.

# సీ. ఏ. రంగనాథశాస్త్రి.

కలమూరు వీరవల్లి రంగనాథశాస్త్రి చెన్నపురిరాజధానిలో ని చిత్తూరుపట్టణమునకు సమీపమున నున్నయొక గ్రామములో 1819 సంవత్సరమున జన్మించెను. అతనితండ్రి మిక్కిలిదరిద్రుఁడు. సంస్కృతమునందు గొప్ప పండితుఁడు. నిరుపేదతనమునకు నిలయమైన యింటఁ బుట్టి పెరుగుటచే దల్లిదండ్రులా బాలునకు సంస్కృతవిద్యతప్ప మరియొకవిద్యనేర్పింపలేకపోయిరి. బాల్యమందతఁడు కుశాగ్రబుద్ధియని చెప్పుదురు. ఎనిమిదేండ్లయీడుననే సంస్కృతము చక్కఁగ మాటలాడుటకు శ్లోక మన్వయించుటకు నతఁడు సమర్థుఁడయ్యెను. ఆటలయందు వానికి మిక్కిలి యభిరుచి కలుగుటచే నతఁడు వీధిబాలురతోఁగలిసి గంతులువేయుచుండును. పదియేండ్లకాలమున నతఁడు గ్రామములోని పొడవైనచెట్లన్ని యెక్కి యెత్తయిన గోడలన్నిదాఁటి యాటలాడుచువచ్చెను. అతఁడు పన్నెండుసంవత్సరముల వయస్సువాఁడైనప్పుడు ముందుముందువానిగొప్పతనమునకుఁ గారణమైన యొక సంగతి జరిగెను. అతనితండ్రి దొరతనమువారియొద్ద గొన్నిగ్రామముల నిజారాకుబుచ్చుకొని పంటలు చెడిపోవుటచే దాను చెల్లించవలసినసొమ్ము చెల్లింపలేకపోయెను. ఆకాలపు పద్ధతినిబట్టి దొరతనము వారు శిస్తు చెల్లించనందున వానినిచెరసాలలోఁబెట్టిరి. తండ్రి కారాగృహమునందుండఁగా రంగనాథుని తండ్రిగారియాబ్దీకదినము సమీపించెను. రంగనాథునితల్లి యేమిచేయుటకుఁదోఁచక యేడువసాగెను. రంగనాథుఁడు తల్లికడకుఁబోయి యామెదుఃఖకారణము, దెలిసికొని మిక్కిలిజాలినొందిచెఱనుండితండ్రినివిడిపించి తెచ్చుటకై చిత్తూరుపట్టణమునకుబోయెను. పోయిజల్లాజడ్జిగారిదర్శనముచేసి తనవచ్చినపనిమనవిచేసితండ్రినివిడిపింపుమనిప్రార్థించెను. ఆమనుష్యునిమరలదీసికొనివచ్చి

యప్పగించుటకుఁ దగినవారు జామీనుగానున్నపక్షమున చెఱనుండి విడువనగుననియు లేనిదేవలనుపడదనియు జడ్జి బాలకునితోఁ జెప్పెను. అప్పుడురంగనాథుఁడు జడ్జితో "నేనుతప్ప జామీనిచ్చువారెవరులేరు. మాతండ్రి యాబ్దీకముబెట్టి మరలవచ్చువఱకు వానిబదులు నేనాచెఱసాలలోఁగూర్చుండెద" నని ప్రత్యుత్తరముగఁ బలికెను. పండ్రెండేండ్లబాలుని నోటనుండి వచ్చిన యాసాహసపుఁబలుకులు జడ్జి మనస్సు వెంటనే కరగించెను. తక్షణమే యాజడ్జి వానితండ్రిని జెఱనుండివిడువవలసినదని యుత్తరువుఁజేసి రంగనాథునిఁగూడ తండ్రితో నప్పటికిఁ బొమ్మనిజెప్పి మఱునాఁడొకసారి తనకుఁ గనఁబడుమని యానతిచ్చెను. తండ్రిని విడువవలసినదని జడ్జివ్రాసిన యుత్తరువు రంగనాథుఁడే స్వయముగ కారాగృహాధికారులయొద్దకుఁ దీసికొనిపోయి తండ్రిని విడిపించుకొని రాత్రిపొద్దుపోవునప్పటి కిల్లుజేరెను. తలవనితలంపుగ భర్తబందెనుండి విముక్తుండై వచ్చుటఁజూచి యాయిల్లాలు మిక్కిలి యక్కజపడి వానివిడుదలకుఁ దనచిన్నబిడ్డఁడే ముఖ్యకారకుఁడని విని పట్టరాని యానందమునొంది బాలుని పలుమారు ముద్దుపెట్టుకొని మెచ్చుకొనెను. ఆనాటిరాత్రి తలిదండ్రులు తనకుఁజేసిన గారామును తనయెడఁజూపిన యాదరమును రంగనాథశాస్త్రి పెద్దయైనపిదపఁగూడఁ దలంచి మిత్రులతోఁజెప్పి సంతసించుచువచ్చెను. మఱునాఁ డుదయమున రంగనాథుఁడు దొరగారియాజ్ఞ మరువక చిత్తూరునకుఁబోయి వేళమీఱకుండ జడ్జిదర్శనము చేసెను. ఆదొర వానినెంతయు గౌరవముతో నాదరించి సంసారస్థితినడిగి "కర్చులన్నియు నేనే పెట్టుకొని యింగ్లీషు చెప్పించినచో నీవు చదువుకొందువా?" యని యడిగెను. తల్లిదండ్రులతో నాలోచింపక నేయుత్తరము నిచ్చుటకు వీలులేదని పితృవిధేయుఁడగు నాబాలుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అది విని వెంటనే వానితండ్రిని బిలిపించి కుమారుఁ డింగ్లీషు చదువుకొను

టకు సెలవొసంగుమని బ్రతిమాలి యెట్టకేల కతని నొడంబఱచి జడ్జి స్వయముగా రంగనాథున కింగ్లీషక్షరములు ప్రారంభించి చెప్పెను. రంగనాథునిబుద్ధి పాదరసమువలె ప్రవహించెను. ఆఱంభించిన యా ఱుమాసములకే యతఁడింగ్లీషు చక్కగా జదువనేర్చెను. జడ్జి కార్య భారముచేత తీరుబడిలేక బాలుని గ్రహణశక్తికిఁ దగినంతవిద్యనేర్పుటకు దనకు వీలులేనందున జిత్తూరు పట్టణములో నివసించుచుండిన క్రైస్తవమతబోధకుఁడగు గోవిసుదొరగారికి బాలు నప్పగించి విద్యనేర్పి బాగుచేయుమని చెప్పెను. గోవిసుదొరగారు ప్రాతఃకాలమంతయు రంగనాథునకు విద్యనేర్పుటలోనే గడపుచు వాని ననేకవిధముల నా దరించుచువచ్చెను. దొరసానియు వానినిబిడ్డవలెజూచెను. రంగనాథు నిబసకు గోవిసుదొరగారిబసకు నయిదుమైళ్ళుండెను. ఒకనాఁడుదయ మున రంగనాథుఁడు కాళ్ళీడ్చుకొనుచు నైదుమైళ్ళు నడచిరా దొర సాని వానింజూచి చల్దియన్నముఁ దినివచ్చితివాయని వాని నడిగెను. లేదని బాలుఁడుత్తరముచెప్ప నాదయామయి తన సేవకునిం బిలిచి "యీబాలుఁ డూరినుండిరాఁగానే ప్రతిదినము వానికి మూఁడుసోలల పాలియ్యవలసిన"దని యానతిచ్చెను. రంగనాథుఁడుపెద్దయైగొప్పవాఁ డైనపిదపఁగూడగోవిసుదొరయుదొరసానియుఁదనకప్పుడప్పుడుగావిం చుచువచ్చిన మితిమీరినమహోపకారముల నెన్నుచు వారియెడఁగృత జ్ఞుఁడై యుండెను. గ్రోవసుదొరకు గణితశాస్త్ర మభిమానశాస్త్రము. రంగనాథునకు దానియందభిరుచి మెండుగఁ గలిగెను. గణితశాస్త్ర ప్రవేశముచేత రంగనాథునకు జ్యోతిశ్శాస్త్రమునందుఁ జాలయభిమా నము పుట్టెను. ఈయభిమానము వాని జీవితకాలాంతమువఱకు నుం డెను. కాలక్రమమున రంగనాథుని జ్ఞానము మిక్కిలి యభివృద్ధినొం దెను. వాని మేలుకోరిన జడ్జిగారు గోవిసుదొరయొద్దనతఁడుచదివిన చ దువుతోఁ దనివినొందక యింకనెక్కుడు విద్య నేర్పింపవలయునని వా

నిం జెన్నపట్టణమున కంపఁదలంచెను. తలిదండ్రులు మొదట దాని కిష్టపడరైరి. కాని జడ్జిగారి ప్రేరణవలన తుదకువారొడంబడజడ్జి చెన్న పట్టణములో గ్రామర్‌స్కూలులో ముఖ్యోపాధ్యాయుఁడుగా నున్న కెర్‌దొరగారివద్దకు రంగనాథశాస్త్రిని కొన్నియుత్తరములు వ్రాసి యిచ్చి పంపెను. కెర్‌దొర బాలుని విద్యాసక్తిజూచి యాశ్చర్యపడెను. కెర్‌దొరగారు మొదటకొంతకాలము చెన్నపట్టణములోను పిదప కొంతకాలము కలకత్తానగరములోను నుపాధ్యాయుఁడై యుండి హిందువుల కనేకుల కుపకారములుచేసి స్వదేశమునకుఁబోయి యచ్చట హిందువులగృహ్యాజీవితములనుపేర నొకగ్రంథమువ్రాసి ప్రచురించెను. ఆగ్రంథములో సందర్భవశమున నతఁడు రంగనాథశాస్త్రి నిఁగూర్చి యిటులవ్రాసెను. "రంగనాథుఁడు నేను కలుసుకొనుట మాపరస్పరాభివృద్ధికే యని చెప్పవచ్చును. పగలు నిర్వహింపవలసిన కార్యములు నిర్వహించి మేమిరువురము సాయంకాలము యేదోవిషయముంగూర్చి చర్చలో దిగుచుండువారము. తెలివిగల దొరబుద్ధికిని రంగనాథుని బుద్ధికిని నాకేమియు భేదము కనఁబడలేదు. బుద్ధియటుండ వాని సౌజన్యము సత్యగౌరవము మిక్కిలిశ్లాఘనీయములు."

రంగనాథశాస్త్రి చెన్నపట్టణములో చదువుచుండినకాలమున జడ్జిగారు వానినిగూర్చి మునుపటికంటె నెక్కువశ్రద్ధవహించిరి. ఆయన కెర్‌దొరపేర వ్రాసిన యొకయుత్తరములోని యీక్రింది సంగతులు చూచిన వానియభిమానము తెలియును. "నీదగ్గఱ రంగనాథుఁడు చదువుకోవలసినంతకాలము జ్ఞానాభివృద్ధికై జదువుకొనవలసినదని నాయభిప్రాయము. నీదగ్గఱనుండుటచేత వాని యదృష్టము బాగున్నదని నే దలంచెదను. ఆసంగతి యెఱిఁగి యతఁడుఁగూడ నీ బోధనవలనఁ గలుగులాభము పొందుగాక! అతఁడు నిఘంటువులు గొప్ప పుస్తకములుఁ జదువుకొనఁగల సమర్థుఁడైన పక్షమున నెట్టి

యాటంకములేక వానికిఁ గావలసిన పుస్తకము లన్నియు నీయవల యును కాని యాపుస్తకము లతనికిఁ బూర్తిగా నిచ్చినట్లు చెప్ప వద్దు. ఎవరు పుస్తకము లిచ్చినారో వారిపే రంతకుమున్నే చెప్ప వద్దు. పుస్తకములన్నియు మొదట నెరువిచ్చినట్లిచ్చి చదువుమాని వెళ్ళునప్పుడు వానికి సొంతముగ నీయవలయును."

1839 వ సంవత్సరమున చిత్తూరులోనున్న యాజడ్జికిఁ జెన్న పట్టణమందు సుప్రీముకోర్టులో జడ్జిపని యయ్యెను. కెర్ దొరగారు కలకత్తాకు వెళ్ళిరి. జడ్జిగారు రంగనాథుని వెనుకటిపాఠశాలలో నుం చుట కిష్టపడక దొరతనమువారి హైస్కూలునకు పంపఁదలఁచి ప్రధానోపాధ్యాయుఁడగు పవెల్ దొరగారి కుత్తరమిచ్చి బాలకు నంపె ను. రంగనాథుని జేర్చుకొన్న స్వల్పకాలములోనే వానిబుద్ధియెట్టిదో పవెల్ దొరకు తెలిసెను. ఆబాలునకు గణితశాస్త్రములోనున్న ప్రజ్ఞను బట్టి పవెల్ దొరగారు వానిచేతఁ గ్రిందితరగతుల కాశాస్త్రములోఁ బాఠములు చెప్పించుచు వచ్చిరి. రాజా సర్. టి. మాధవరావుగా రప్పుడు చిన్నతరగతిలోనుండి రంగనాథశాస్త్రియొద్ద చదువుకొనిరి. 1842వ సంవత్సరమున రంగనాథశాస్త్రి హైస్కూలు పరీక్షకుఁబోయి శ్లాఘనీయముగఁ గృతార్థుఁ డయ్యెను. ఆపరీక్షకుఁ బోయినవారిలోఁ నతఁడె మొదటివాఁడు. కృతార్థులైనవారిలోను మొదటివాఁడె. అ తనిపే రిప్పటికిని జెన్నపురి ప్రెసిడెన్సీ కాలేజిలోఁ గృతార్థులైన బాలకుల పట్టికలో మొదటనున్నది. పరీక్షయందుఁ గృతార్థుఁ డైన పిదప నతఁడు తనకు మహోపకారియైన జడ్జినిఁ జూడఁబోయెను. ఆ దొరగారు వానినిఁజూచి లేచి చేతులు చాచి కౌఁగిలించుకొని "రంగ నాథా! నాకు మాట దక్కించితివి. నేను ధన్యుఁడనైతిని. నిన్ను దేవుఁడు రక్షించుగాక!" యని బహూకరించెను.

ఏపనిలోఁ బ్రవేశించుట బాగుండునని పిమ్మట వారిద్దఱుమో

చించిరి. రంగనాథున కుపాధ్యాయుఁడుగ నుండవలయునని కోరికకల దు. అందుచేత జడ్జిగారు పవెల్ దొరగారు చెన్నపురిలో లాయరుగా నుండిన నార్టనుదొరగారు రంగనాథున కాయుద్యోగమీయవలసిన దని దొరతనమువారికి సిఫారసు చేసిరి. ఎవరెంత ప్రయత్నముచేసి నను వానికాయుద్యోగము దొరకలేదు. అందులోఁ దండ్రికిఁ బ్రాణ ముమీఁదికి వచ్చినదని వర్తమానము తెలియ రంగనాథుఁడు చిత్తూరు పోవలసివచ్చెను. పోవునప్పుడతఁడు జడ్జినిజూచి వార్ధకమునందు తం డ్రింగనిపెట్టుకొని యుండుటకు వీలగునట్లు చిత్తూరులో నేదయిన యు ద్యోగమిప్పింపుమని యడిగెను. ఆదొరగారు రంగనాథుఁడేమడిగిన నది చేయుటకు సిద్ధముగ నున్నందున వెంటనే చిత్తూరు కలక్టరుకొకజాబు వ్రాసి యిచ్చెను. ఆజాబు కలక్టరు చూచుకొన్న కొన్నినాళ్ళలోనే రంగనాథునకుఁ జిత్తూరు సబుకోర్టులో నెలకు డెబ్బది రూపాయలు జీతముగల హెడ్డుగుమస్తాపని యయ్యెను. ఆపనిలోనుండగ నతనికి నెంతో తీరిక కలిగినందున గాలము వృధసేయక యతఁడు జ్ఞాననిధిని వృద్ధిపరచుకొనఁ దలఁచి తెలుఁగు కన్నడము హిందూస్తానీ పారసీ భాషలఁ జదువ నారంభించెను. ఆభాషలలోనున్న కోర్టుకాగితము లన్నియు నతఁడే స్వయముగ నింగ్లీషులోనికి మార్చుచు వచ్చెను. ఆయఖండశక్తిఁ జూచి పైయధికారు లందరు విస్మితులగుచు వచ్చిరి.

అతనికి చెన్నపట్టణమందు హైకోర్టులో నుద్యోగము చేయ వలయునని మహాభిలాష యుండెను. దానికిఁదోడుగ వానితండ్రియు మృతినొందుటచే నతఁడు చిత్తూరు విడువఁదలఁచి యదనువెదకుచుండ నంతలో హైకోర్టులో భాషాంతరీకరణము చేయువాని యుద్యోగము కాళీ యయ్యెను. హైకోర్టువారు పరీక్షచేసి తగినవారి కాయుద్యోగ మీయదలఁచిరి. రంగనాథుని ప్రాపకుఁడగు జడ్జీ హైకోర్టులోనే యున్నందున వెంటనే యతఁడాసంగతి రంగనాథున కుత్తరమువ్రాసి

తెలిపి శీఘ్రముగ దరఖాస్తు పంపుమనియెను. రంగనాథశాస్త్రి తన దరఖాస్తులోఁ దాను ద్రావిడము తెనుఁగు మరాటి కన్నడము హిందూస్తానీ పారసీ ఇంగ్లీషను నేడుభాషలలో లేశమైన దడుముకొనక తర్జుమాచేయగలిగినట్లు వ్రాసెను. దరఖాస్తుదారులలో నంతటివాఁ డెవ్వఁడు లేనందున నుద్యోగము వానికే నీయఁబడెను. హైకోర్టు తర్జుమాదారగుటచే రంగనాథుని ప్రజ్ఞలు వెల్లడియగు నవసరములనేకములు వచ్చెను. హైకోర్టు జడ్జీలు ప్రత్యక్షముగ వాని భాషాంతరీకరణముఁ జూచుచుండుటచే వానిసామర్థ్యము త్వరలోనే తెలిసెను. అందుచేత వారు తరుచుగ కోర్టులోనే వానిసామర్థ్యమును మెచ్చి పొగడుచువచ్చిరి. దక్షిణహిందూస్థానములోని భాషలన్నియు నేర్చి రంగనాథశాస్త్రి, విద్యాశక్తి యధికముకాగా యూరపుఖండములోని భాషలను చదువనారంభించెను. ఆరంభించిన స్వల్పకాలములోనె ఫ్రెంచిలాటినుభాషలలో దృఢపరివేశము కలిగెను. ఒకనాడు ఫ్రెంచిభాష మాటలాడగల మనుష్యునికొఱకు హైకోర్టువారు వెదకుచుండిరి. అప్పుడు రంగనాథశాస్త్రి సిద్ధమయ్యెను. ఫ్రెంచి యతనికి వచ్చునని యెవ్వరెఱుంగకపోవుటచే వాని సాహసమునకు జడ్జీ తెల్లబోయి కానిమ్మని యవలీలగను స్వచ్ఛముగను రంగనాథుఁడుచేయు తర్జుమా చూచి యద్భుతమునొందెను. అదిమొదలు జడ్జీలు వాని నొక తాబేదారుగఁ దలఁపక సమానుఁడగు మిత్రుఁడుగా భావింపసాగిరి. తరుచుగ వారు వానిని దమ గృహములకు సగౌరవముగ రావించి సెలవుదినములలో ననేకవిషయములనుగూర్చి వానితో జర్చింపుచు వచ్చిరి.

ఆదినములలో హైకోర్టులోఁ దర్జుమాదారుగ నున్నవారికిప్పటివలె జీతమిచ్చుటగాక తర్జుమాచేసిన కాగితములకు రుసుము ముట్టుచువచ్చినందునను రంగనాథునకుఁ జాలభాషలలోఁ బ్రవేశముండుట

చేత నెలకు రమారమి రు 2,500 లు వానికి వచ్చుబడి యుండెను. అప్పటికతనికి సంస్కృతమునందుఁ బాండిత్యము పరిపూర్ణమగుటచే హైకోర్టులో హిందూధర్మశాస్త్ర విషయములుగల వ్యాజ్యములుగల వ్యాజ్యములన్నిఁటిలోను జడ్జీలు వాని యాలోచనమును ముఖ్యముగ గ్రహించుచు వచ్చిరి. 1857 వ సంవత్సరమున చెన్నపట్టణపు యూనివర్సిటీ స్థాపింపఁబడినప్పుడు రంగనాథుఁ డొక ఫెల్లోయయ్యెను. 1859 వ సంవత్సరమున సర్ చార్లెసు ట్రివిలియన్ దొరగారు చెన్నపట్టణపు గవర్నరుగా వచ్చినప్పుడు కొందఱు దొరలు రంగనాథశాస్త్రిని దీసికొని స్వదేశస్థులలో గౌరవనీయుఁడని గవర్నరుగారికిఁ బరిచితునిఁ జేసిరి. ఆదినము మొదలు గవర్నరుగారు రంగనాథశాస్త్రిసామర్థ్యము మెచ్చుకొని వానిం దరుచుగఁ దనమందిరమునకుఁబిలిచి హిందువుల సంఘస్థితినిగూర్చి పలుమారు వానితో జర్చించుచు వచ్చెను.

1859 వ సంవత్సరముననె చెన్నపట్టణము స్మాలుకాజుకోర్టులో నొకజడ్జీపని కాళీ వచ్చెను. అది రంగనాథశాస్త్రి కిచ్చిన బాగుండునని కొందఱనిరి. స్వదేశస్థుఁడగుటచే నతనికీయఁగూడదని దొరలందఱుఁ గంఠోక్తిగ వాదించిరి. కాని గవర్నరుగారు తెల్లవారి యాలోచనలు వినక యాయుద్యోగము రంగనాథునకే యిచ్చెను. ఆపనిలో నతఁడు చూపిన చాకచక్యమునుబట్టియు సామర్థ్యమునుబట్టియు మొదట నతఁడనర్హుఁడని వాదించువారు సిగ్గుపడవలసి వచ్చెను. పట్టణమం దెచ్చట విన్నను రంగనాథుని యద్భుతశక్తి వర్ణనములే వినంబడుచువచ్చెను. ఈపని ఖాయమైనప్పుడు రంగనాథశాస్త్రి హైకోర్టులోఁ దనకున్న తర్జుమాదారు పనిని మానుకొనగా హైకోర్టులో మొదట జడ్జీయగు సర్ స్కాట్లండు దొరగారును మరియొకజడ్జీగారును గలసి వానికి గొప్పయుద్యోగమైనందుకుసంతసించుచుంటిమనియుఁ దమయొద్దనుండి యతఁడు వెళ్ళవలసివచ్చినందుకు విచారించితిమనియు నొకజాబు

వ్రాసిపంపిరి. రంగనాధశాస్త్రి సమర్థుఁడు చాకచక్యముగలవాఁడు నగుటచేఁ దనచేయవలసినపని నతిశీఘ్రముగ జేసికొనితక్కినకాలము గ్రంథావలోకనమునందు గడపసాగెను. అందఱియెడ గౌరవముగలిగి యందఱకు సులభుఁడై యుండినందున జనులిప్పటికి రంగనాధశాస్త్రి వంటి జడ్జీలు స్మాలుకాజు కోర్టులకు రాలేదని చెప్పుకొనుచుందురు. ఈయుద్యోగమైన తరువాత నతఁ డరబ్బీభాష గృషిచేసి యల్పకాలములోనే మంచిపాండిత్యము సంపాదించెను. పారసీభాషలో మంచి కవీశ్వరులగు సాదీ మొదలగువారి పుస్తకములనుండియెన్నోపద్యములతఁడు కంఠపాఠముగ వల్లించెను. అతఁ డేభాషలోఁ గృషిచేసినను దేనినిఁ బూనినను రక్కసిపట్టుపట్టి దానిని తుద ముట్టించును. జనులతనిని పురుషసింహమని వేనోళ్ళం బొగడుచు వచ్చిరి. అతని సర్వతోముఖపాండిత్య మాకాలమున నెల్లవారికిఁ బ్రశంసనీయమయ్యెను. గవర్నరు లందఱు వాని ననూన గౌరవముతో నాదరించుచు వచ్చిరి. చెన్నపురి గవర్నరులలో సంస్తవనీయుఁడు, ధాత సంవత్సర కాటకములో నన్నములేక చచ్చిపోవు బీదలకుఁ బని గల్పింపఁదలఁచి బెజవాడనుండి చెన్నపట్టణము వఱకు నొకగొప్ప కాలువ త్రవ్వించిన దయాళువునగు బక్కింగుహాం ప్రభువుగారు రంగనాధశాస్త్రి వైదుష్యమును మెచ్చి జర్మనీభాషగూడ జదువుమని ప్రేరణ చేసిరి.

1867 వ సంవత్సరమున రంగనాధుఁడు పచ్చయప్ప మొదలియారుగారి ధర్మకార్య నిర్వాహక సభలో నొకసభ్యుఁడుగ నియమింపఁబడి యందు మిక్కిలి శ్రద్ధతో బనిచేసెను. 1877 వ సంవత్సరమున ఢిల్లీదర్బారు జరిగినప్పుడు గవర్నరు జనరలుగారు రంగనాధశాస్త్రి నక్కడకు సగౌరవముగ రావించి యొకపతకమును యోగ్యతాపత్రికను స్వయముగా వానికిచ్చి పంపిరి. ఇట్లు సర్వజన శ్లాఘనీయముగ దొరతనమువారియొద్ద గొలువుచేసి రంగనాధశాస్త్రి 1880 వ సం

వత్సరం పిబ్రేవరు 16 వ తారీఖున పించను పుచ్చుకొని యుద్యోగము మానుకొనెను. అతఁడు చేసిన ప్రశస్తసేవను గుర్తెఱింగి దొరతనము వారు వానిని చెన్నపట్టణపు గవర్నరుగారి యాలోచన సభలో సభ్యుఁడుగ నేర్పఱచిరి. ఆసంవత్సరమే జూలై నెలలో హైదరాబాదు దివానుగారగు సర్ సలారుజంగుగారు రంగనాధశాస్త్రిని నెలకు 2,500 రూపాయలజీతముమీఁద తనకు ప్రయివేటు శక్రెటరిగా నుండుమని కోరిరి. కాని శాస్త్రిగారు ధనమే పావనమని యెంచక తన జీవితకాలములో సాయంసమయములు విద్యావ్యాసంగములతోను దనమనుమల విద్యాబోధనములతోను గడుపఁదలఁచి యాయుద్యోగ మక్కరలేదని వ్రాసెను. కాని యతఁడు చేయఁదలఁచిన రెండుకార్యములు నిర్వహించు నదృష్ట మతనికి లేకపోయెను. మృత్యుదేవత మనుష్యులను గొప్పతనమునుబట్టి గౌరవింపదుగదా! పాప మాయన 1881 వ సంవత్సరం జూలై నెల 5 వ తారీఖున గాలధర్మము నొందెను.

రంగనాధశాస్త్రి సాధారణ మనుష్యులకంటె పొడగరి. అతని దేహదార్ఢ్యముజూచి తెల్లవారు సయితము మిక్కిలి విస్మితులగుచు వచ్చిరి. అతని దేహచ్ఛాయ యించుమించుగ తెల్లవారి దేహచ్ఛాయ వలెనే యుండును. వానిఁజూచినవారందఱుతప్పక యతఁడుగొప్పవాఁడనుకొని తీరవలయును. అతని ఫాలము మిక్కిలి విశాలమై యుండెను. అతఁ డెన్నివేలమందిలో గూర్చున్ననువానిముఖవర్చస్సందఱకుదర్శనీయమై గంభీరమై కానంబడుచు వచ్చెను. అతనికంఠధ్వనిగంభీరమై యెల్లవారిని విధేయుల జేయునట్లుండును. ఏవిషయమందైననభిప్రాయభేదము వచ్చినప్పు డతఁడు ప్రతిపక్షుల హేతువులువిని తనయభిప్రాయమును మార్చుకొనును. మంచిసబబులుచెప్పి యతఁడు తరుచుగనితరులఁ దనతో నేకాభిప్రాయులఁ జేయుచుండును. అతనిప్రవర్తనము

తయు గడియారమువలెనె జరుగుచుండును. అనగా ప్రతిదినముఁ బ్రతి కార్యమునకు నతఁడుకొంతకాలము నేర్పరచియాపనియాకాలమందె సరిగ జేయుచుండును. అతని నెఱిఁగినవారు గడియారములో నెన్నిగంటలైనదో తెలిసికొననక్కరలేదు. రంగనాథశాస్త్రి యాసమయమున నేపని చేయుచుండునో యాపని జ్ఞప్తికిఁదెచ్చుకొనిన మొదలకాలము తెలియును. అతఁడు దేహపరిశ్రమయందు మిక్కిలి నిష్ఠకలవాఁడై ప్రతిదినముప్రాతఃకాలము నాలుగుమొదలైదుగంటలవఱకు హిందూదేశపుకసరతు తప్పక చేయుచుండువాఁడు. వ్యాయామము ముగిసినవెనుకనైదుమొదలేడుగంటలవఱకు గుఱ్ఱపుసవారు చేయుచుండును. గుఱ్ఱముమీఁద నతఁడు నిశ్చలుఁడై కూర్చుండినయొప్పిదముఁ జూచితీరవలయునని యెల్లవారభిప్రాయపడుచువచ్చిరి. ప్రతిదినము సాయంకాల మాయన చాలదూరము కాలినడకను షికారు పోవుచుండును. ఇట్లుదయము సాయంకాలము తప్పక దేహపరిశ్రమ చేయుటచేరంగనాథశాస్త్రి మంచిదేహారోగ్యముఁ గలిగియుండి యొకనాఁడైన జబ్బుపడి మంచముమీఁదబండుకొని యెఱుఁగడఁట. దినమున కాఱుగంటలురంగనాథశాస్త్రిచదువునకై వినియోగించుచువచ్చెను. ముసలితనమందుఁ గూడచదువుకొనుచుబుస్తకముచేతఁబట్టుకొనిప్రాణములువిడిచినహిందువుఁడితఁడొక్కడేయని చెప్పవచ్చును. అతఁడేదిచేసినను సగముసగముచేయకసంపూర్ణముగఁజేయును. ఆతఁడు మనోవాక్కాయ కర్మములందు సత్యమే యాచరించుచు వచ్చినందున యబద్ధమును బరమశత్రువునట్లు ద్వేషించును. 185లెవ సంవత్సరమున నార్టను దొరగారింగ్లాండులో పార్లమెంటుసభవారియొద్దహిందూదేశస్థితిగతులఁగూర్చిసాక్ష్యమిచ్చినసందర్భమున రంగనాథశాస్త్రి ప్రశంస రాఁగా "నతఁడు బుద్ధికుశలతయందు నెల్లవారితో సమానుఁడనియు నింగ్లాండు సర్వకళాశాలలో జదివినపక్షమున నతఁడు మిక్కిలి గొప్పవాఁడై యుండు" ననియుఁ జెప్పెను.

ఇంగ్లీషులో నతఁడు సులభశైలిని మనోహరముగ వ్రాయఁగలఁడు. ఏభాష నతఁడు చదివినను మంచికవుల గ్రంథములనుండి యెన్నో పద్యములు కంఠపాఠముగ వల్లించును. ఆతని గ్రంథభాండారములో మూడువేలపుస్తక సంపుటములుండెను. ప్రతిపుస్తకమునందు జదివిన ట్లానవాలుగా చేతిమరకలుఁగూడనుండును. అతఁడేదైన నొకసారి చదివిననర్థమగును. రెండవసారి చదివెనా కంఠపాఠముగ వచ్చును. మూడవసారి చూచెనా మనసులో నొకమూలస్థిరమైయుండిపోవును. అతఁడరబ్బీపారసీభాషలను మహమ్మదీయపండితుఁడట్లవలీలగ మాటలాడగలఁడు. ఇంగ్లీషులో మంచికవులు లేరనియుఁ గవులనఁబిరుదునకుఁ దగినవారు మనయాసియాఖండములోనే గాని యూరపులో లేరనివాని యభిప్రాయము. విద్యను ధనముకొఱకుగాక కేవలముజ్ఞానముకొఱకే యతఁడు నేర్చుకొనెను. అందుచేతనే యతఁడు చనిపోవు నప్పటికి పదునాలుగు భాషలలోఁ బండితుఁడై పదునేనవభాషయగు హీబ్రూనేర్చుకొనుచుండెను. సంస్కృతమతనికిఁ బ్రాణపదమైనభాష. ఆభాషలో నతఁడు చదువనిపుస్తకములేదు. ఒక్కొక్కదానికెంతో సొమ్మిచ్చి యతఁడు తాటియాకుల పుస్తకముల నెన్నియో తెప్పించెను. అతఁడు పండితపక్షపాతి. ఒకపండితున కతఁడప్పుడప్పు డిచ్చిన బహుమానములమొత్తమైదువందలరూపాయలు. ఫ్రెంచిలాటినుభాషలనునేర్చుకొనుటకై పుదుచ్చేరినుండియతఁడుప్రత్యేక మొకదొరను నెలకు నూరురూపాయలజీతముమీఁద బిలిపించి చదువుకొనెను. ఒకరియొద్ద తానుచదువుకొనుటయో తానొకరికిఁ జెప్పుటయో యతనికి మిక్కిలి యిష్టము వానిచుట్టు నెల్లపుడు పలుభాషలునేర్చినపండితులుపరివేష్టించి యుండ వారినడుమ నతఁడు పరమసంతోషముతో కాలము బుచ్చుచుండును. పేదబాలురకు నింట నన్నముపెట్టి యతఁడువిద్యచెప్పించుచువచ్చెను. ఒకప్పు డతనియింట నట్లు జదువుకొను బాలు రాఱుగురుండిరి. సంఘ

సంస్కరణమం దతనికి ప్రీతిగలదు. ఆతఁడు మనలోనున్న దురాచారముల జనులకుఁ దెలియపరచి వాని నవలంబించుట చేతనే మనమింత యధమస్థితిలో నున్నారమని చెప్పుచు వచ్చెను. అతఁడు దురాచారముల నడఁచుటకుఁ బ్రియత్నించెను కాని యసహాయుఁడగుటచే నెరవేర్చ లేకపోయెను. చెన్నపురిలో మొట్టమొదట షరాయి బూట్సు తొడిగిన బ్రాహ్మణుఁ డతఁడే. ప్రథమమున బంధుమిత్రులు వాని నెగతాళిచేసి చిట్టచివరకు వానిమార్గమునే యనుసరించిరి. స్త్రీవిద్య వానికిష్టము. ఆవిషయమును గూర్చి యతఁడు చదువుకొనుచున్నపుడెయొకయుపన్యాసమువ్రాసి యందుఁ దుట్టతుద నిట్లువ్రాసెను. "ఇతర దేశములలో ముందు పురుషవిద్య ప్రబలినవెనుక స్త్రీవిద్య ప్రబలెను. పురులు విద్వాంసులైనం గాని స్త్రీలు విద్యావంతులు కారు. కావున మన దేశములోగూడ మగవారి విద్య మిక్కిలివ్యాపించునట్లు చేయవలయును."

అతఁడు చెప్పినట్లాచరించువాఁడు. అందుచేతనే తనకుమార్తె కరవము సంస్కృతము తెనుఁగు స్వయముగ జెప్పెను. అతఁడు వేదములుబైబిలు ఖురాను చక్కగ నేర్చినవాఁడై యాయామతస్థులతో వాదములుచేయుచు హిందూమతమే యుత్కృష్టమైనదనిసిద్ధాంతము జేయుచువచ్చెను. హిందూమతము మనవృత్తికి నడ్డుగ నుండఁగూడదని దానిని బ్రస్తుత నాగరికతకు సరిపుచ్చవలయునని వాని యభిప్రాయము. అతనికి హిందూమతముమీఁద నత్యంతమైన యభిమానముగలదు. ఒకప్పుడు క్రైస్తవమతములో గలిసినబ్రాహ్మణబాలకు నతఁడు మరల హిందూమతములోగలిపించెను. వర్ణభేదమం దతనికివిశేషగౌరవము లేదు. ధర్మమార్గమున మనమునడచుకొంటిమా దేవుఁడే మనలరక్షించుననియతని మతము. సత్యమే వాని దేవత. అతఁడు జన్మమధ్యమందెప్పుడు నొక యబద్ధమైన నాడి యెఱుంగఁడనివానిశ

తుప్రివులుసయితము చెప్పుదురు. ఆసద్గుణమాతనికిఁ జిన్ననాటినుండి యుఁగలదు. ఆయనమితభాషి. అతనికి మిత్రులు కొందఱు మాత్రమే యుండిరి. పరిచితుల నందరను మిత్రులుగ భావించువాఁడు కాఁడు. వ్యర్థప్రసంగములు డంబములు వానికిఁ గిట్టవు. మితభాషి యగుటచే మొదట నతనిఁ జూచినవారు గర్వి యనుకొందురుకాని పరిచయమైన వెనుక నట్లనుకొనరు. అతనికి మరియాదలలో మిక్కిలి పట్టుదల గల దు. అవమానమన్న మాట యతఁడు సహింపలేఁడు. అమర్యాదమ నుష్యుల నతఁడు మిక్కిలి యేవగించును. అతఁడు తెల్లవారు నల్లవా రనను భేదములేక యెల్లర సమగౌరవముతోఁ జూచువాఁడెకాని వారి నౌకరీతి వీరి నౌకరీతి గౌరవించువాఁడు కాఁడు. అంత గొప్పవాఁడ య్యు నిగర్వచూడామణి. అతఁడు మిక్కిలి స్వతంత్రస్వభావముగల వాఁడెకాని చేతులు నలుపుకొనుచు నక్కవినయములను జూపి యుప కారములను యాచించువాఁడు కాఁడు. తెల్లవారతనిని సమానుఁడుగ భావించిరి. చెన్నపట్టణపు హైకూర్టులలోఁ జదివి పరీక్షలోఁ గృతా ర్థుఁడైన హిందువులలో నతఁడే ప్రథముఁడు. మదరాసు యూనివరుసి టీలో సభ్యుఁడైన హిందువులలోఁ బ్రథముఁడు. స్మాలుకాజు కోర్టు లలో జడ్జీలుగా నూర్చుండిన హిందువులలోఁ బ్రథముఁడు. అనేకభాష లు నేర్చిన స్వదేశపండితులలోఁ బ్రథముఁడు.

ఉదరపోషణమునిమిత్త మొక్క భాషకష్టముగానేర్చుకొనుట యే చాల శ్లాఘనీయము. రెండుమూడు నేర్చుకొనుట మిక్కిలి యు త్కృష్టము. అట్టియెడ పగలెల్ల కార్యభారముచేత దీరికయించుకయు లేనివాఁడు పదునెనిమిది భాషలలోఁ బ్రజ్ఞావంతుఁడగుటమహాశ్చర్యక రముకాదా? ఉద్యోగమైనతరువాత మనలో విద్యావ్యాసంగము చే యువారులక్షకొక్కరైన నుందురో యుండరో సంశయింపవలసి యు న్నది. రంగనాథశాస్త్రిహిందువుఁడయ్యుఁదక్కినహిందువులవలె కేవ

లముదరపోషణార్థమే విద్యనేర్చుకొనక జ్ఞానాభివృద్ధినిమిత్తమై బహుభాషాపరిశ్రమముచేసి దక్షిణహిందూస్థానమునకు వన్నె తెచ్చెను. ఈనాటియుద్యోగస్థులు విద్యార్థులు రంగనాథశాస్త్రి జూపిన మార్గము నవలంబించి క్రొత్తభాషలు నేర్చుకొందురు గాక! నేర్చుకొని యాభాషలయందలి మంచిగ్రంథములను స్వభాషలోనికి భాషాంతరీకరించి లోకోపకార మొనర్తురు గాక! రంగనాథుడువలెనే యీనాటి యుద్యోగస్థులు తమ యధికారులను తెల్లవారియెదుట స్వతంత్రభావమునుజూపి వర్తింతురు గాక! నక్కవినయములు సేయకపోవుదురు గాక!



# మహారాజా సర్ రామవర్మ

ఈరామవర్మ వెనుకటి తిరువాన్కూరు మహారాజు. ఈయన 1837 వ సం॥రం మేనెల 19 తారీఖున జన్మించెను. ఆయనతండ్రి గొప్ప సంస్కృత పండితుఁడు. ఇంగ్లీషుగూడ సాధారణముగ నతఁడు వ్రాయఁ జదువ నేర్చుకొనెను. ఆయన తల్లి రుక్మిణీభాయి సంస్కృతమునందు మంచి సామర్థ్యముగలదై మృదుమధుర శైలిని కవిత్వముఁ గూడ చెప్పుచు వచ్చెను. ఆదంపతుల కేనుగురు బిడ్డలు కలిగిరి. అందు మువ్వురు చిన్నతనమందె మృతినొందిరి. ఇద్దరు పిచ్చివారైరి. రామవర్మ కడసారపు బిడ్డఁడు. ఆమృతినొందిన పిల్లలు మువ్వు రొక్కమారే రామవర్మజననమున కొలుదినములు ముందుగ గతించిరి. అందుచేత రామవర్మతల్లి యీబిడ్డనిం గనునప్పటికి మహా దుఃఖసముద్రములో మునిఁగి యుండెను. తల్లి యవస్థ యట్లుండుటచే నపు డుద్భవించిన రామవర్మ దుర్బలశరీరముతోఁ బుట్టెను. ఈతఁడు పుట్టిన రెండునెలలకే తల్లిమరణమొందెను. దీనిచేత నతఁడు మఱింత దుర్బలశరీరుఁడయ్యెను. అందుచేత నాబాలుని సంరక్షణము పెద్దమేనత్తయగు రాణీ పార్వతీభాయిపాలఁ బడియెను.

రామవర్మ మైదేండ్ల బాలుఁడైనప్పు డక్షరాభ్యాసము చేసి తండ్రి సంస్కృతము మళయాళము వానికిఁ జెప్పింప నారంభించెను. అతఁడు తొమ్మిదవయేఁట వెనుకటిదివానగు సుబ్బారావనువానియొద్ద నింగ్లీషు చదువఁ బ్రారంభించెను. ఈసుబ్బారావు కొంతకాల మీ సంస్థానములోనే దివానుపనిచేసి యుద్యోగము మానిన పిదప రామవర్మ మేనమామల కింగ్లీషు చెప్పెను. అతని నిప్పటికి నాప్రాంతపు జను లింగ్లీషు సుబ్బారావని చెప్పుకొనుచుందురు. బాల్యమునందు

రామవర్మ రోగపీడితుఁ డైనందున చదువు సరిగా జరుగలేదు. కాని చదివినపుడెల్ల నతఁడు మిక్కిలి పూనికతోఁ బని చేయుచువచ్చెను. ఏపనియయిన సగము సగము చేయుట వానికిఁ జిన్ననాటనుండియుఁ గిట్టదు. తండ్రి శిక్షలో నుండుటచే నీగుణము వానికి మఱింత వృద్ధి నొందెను. అట్లు కఠినమైన పితృశిక్షలో నుండుటచేత వానియందు స్వతంత్రబుద్ధి వర్ధిల్లెను. ఈస్వాతంత్ర్యియము సత్కార్యములు గావించు వారియెడల వినయమై యకార్యములు గావించు వారియెడల యవినయమై నానాట వృద్ధి నొందెను.

1849 సం॥ర మందు వానియందు క్షయరోగ చిహ్నము లంకురించెను. ఆరోగబలముచే నతని శరీరము కృశించినను మనోదార్ఢ్య మంతకంత కతిశయించెను. ఆరోగము కొంచె ముపశమించిన పిదప రామవర్మకుఁ దగిన యుపాధ్యాయు నేర్పరపఁదలఁచి తిరువాన్కూరు మహారాజు మంచియొజ్జను బంపుమని చెన్నపట్టణపు దొరతనము వారికి వ్రాసెను. ఆదొరతనమువారు శ్రీమాధవరావుగారిని బంపిరి. ఈయనయే రాజా మాధవ రావనుబిరుదమునొంది బరోడాసంస్థానమునకు మంత్రియైన ఘనుఁడు. ఈమాధవరావుగారి తండ్రియుఁ బినతండ్రియుఁగూడ తిరువాన్కూరులో బూర్వము మంత్రులయి యుండుటచేతను మాధవరావు కాలపు విద్యావంతులలోఁ బ్రథమ గణ్యుఁ డగుటచేతను తిరువాన్కూరు యువరాజున కుపాధ్యాయుఁడగుట కతఁడే తగినవాఁడని దొరతనమువా రంపిరి. 1849 వ సంవత్సరమున మాధవరావు రామవర్మ కొజ్జగా నియమింపఁబడి శిష్యునకు నాలు గేండ్లు విద్యఁ గఱపెను. మాధవరావు శిష్యున కింగ్లీషులోని సాహిత్య గ్రంథములు మనోవికాసముఁ గలించు ప్రకృతిశాస్త్ర సంగ్రహములు నేర్పెను. రామవర్మ విషయమున గురువుచేసిన శ్రద్ధకుఁ దోడుగఁ దండ్రియుఁ జాల శ్రద్ధచేసి విద్యాబీజములు బాలుని మనస్సు

మీఁద నాటునట్లు చేసెను. 1853 వ సంవత్సరమున మాధవరావు సంస్థానములో నొక యుద్యోగస్థుఁడుగ నియమింపఁబడినందున రామ వర్మ విద్యాభ్యాస మంతటితో ముగిసినదని చెప్పవచ్చును. గురువు నొద్దశిష్యుఁగా విద్య జెప్పుకొనుట మానినను రామవర్మ విద్యావ్యాసం గము మానక జ్ఞానాభివృద్ధి నిమిత్తము బహు శాస్త్ర గ్రంథములు తెప్పించి మునుపటికంటె నెక్కుడు తమకముతోఁ జదువ నారంభించె ను. ఆయన విద్యాసక్తిని వానిచేత సంపాదింపఁబడిన గ్రంథ భాండా రమే వేయినోళ్ళఁ జాటును. ఆగ్రంథావళిలో నాయనఁ జదువని పుస్త కము లేదు.

ఇంగ్లీషులో వచన రచనమునం దాయనకు మిక్కిలి యాసక్తి యుండెను. అది వృద్ధిఁ జేసికొనుటకై రామవర్మ "యుద్ధక్రౌర్యములు- పరిశాంతిలాభములు" ననుశీర్షికతో నొక యుపన్యాసము వ్రాసెను. అవి యాకాలమున జరుగుచున్న క్రిమియాయుద్ధమునుగూర్చి యు ద్దేశింపఁబడినవి. తిరువాన్కూరులో నప్పుడు రెసిడెంటుగా నున్న కుల్లెన్ దొరగారు వాని యుపన్యాసమునుఁజూచి చాలమెచ్చి యంతటి చిన్నవయసువాఁ డట్టి మంచి యుపన్యాసము వ్రాయుట కష్టమని యభిప్రాయపడిరి. వ్రాసిన ప్రథమోపన్యాసము శ్లాఘనీయముగ నున్నందున రాజకుమారుఁడు సంతసించి వెండియు వ్రాయవలెనని యుత్సాహముగలిగి వార్తాపత్రికలకు వ్యాసములు వ్రాసి పంపుచు వచ్చెను. ఆకాలమున నిప్పుడున్న పత్రికలులేవు. ఈకాలపుపత్రికలలో జాన్ బ్రూస్ నార్టనుగారిచేఁ బ్రకటింపఁబడుచు వచ్చిన యథీనేయ మనునది ముఖ్యమయినది. దానికి రామవర్మ బహు విషయములం గూర్చి వ్రాసి పంపుచు వచ్చెను. అతఁడు వ్రాసినవన్నియుఁ బత్రికా ధిపతి వందనములతో నందుకొని ప్రకటింపుచు వచ్చెను. రామవర్మ యీవ్యాసములతోనే కాలము గడుపక ప్రకృతిశాస్త్రపఠనమం దభి

రుచికలవాఁడయి జ్యోతిశ్శాస్త్రము ప్రకృతిశాస్త్రము రసవాదశాస్త్ర
ము వృక్షశాస్త్రము మొదలగు ననేకశాస్త్రములలోఁ గృషి చేసెను.

ఈనడుమ రామవర్మ కనేక కష్టములు సంభవించెను. 1853వ
సంవత్సరమున తల్లిలేని పసికూనయగు తన్నుఁదల్లికంటె నెక్కుడుగ బెం
చిన రాణీ పార్వతీభాయి పరమపదము నొందెను. 1857 వ సం॥ వాని
కున్న యొక్కతోఁబుట్టువు యొకకుమారునింగని మృతినొందెను.ఆకు
మారుఁడే యిప్పటి తిరువాన్కూరు మహారాజు. 1858 వసం॥రమున
రామవర్మకుఁ దల్లిలేని వెలితిలేకుండ సకలవిధములఁ గనిపెట్టి పెంచిన
తండ్రి లోకాంతర గతుఁడయ్యెను. ఈయశుభములన్నియు నైనపిదప
1859 వ సంవత్సరములో రామవర్మకు వివాహమయ్యెను. తనకు
సహధర్మచారిణిగ యావజ్జీవము నుండవలసినకాంతను దననిమిత్తము
పరులు వెతకి తెచ్చుట మంచిదికాదని రామవర్మ పూర్వబాంధవ్యము
గల యొక సత్కుటుంబమునుండి కన్యను స్వయముగా నేరుకొని వరిం
చెను. ఈసమయములోనే సంస్థానములో గొప్పమార్పుజరిగెను. 1857
సంవత్సరము డిసంబరునెలలో నంతవఱకు దివానుగానుండిన కృష్ణారా
వుగారు మృతినొంద మాధవరావుగారా మంత్రిపదమున నియోగిం
పఁబడెను. వెనుకటి రెసిడెంటగు కల్లెను దొరగారికి బదిలీకాఁగా
నతనిస్థానమందు మాల్టుబీ దొరగారు నియుక్తులైరి. ఆమంత్రియు నా
రెసిడెంటును గలిసి సంస్థానమునకుఁ గావలసిన మంచిమార్పులన్నిఁ
టినిఁ దెచ్చిరి. వారు చేయఁదలఁచిన మార్పులన్నిఁటిలో యువ
రాజగు రామవర్మ వారికుపదేష్టయయి సహకారియై యుండువాఁడు.
చెన్నపట్టణమందు ప్రచురింపఁబడు వార్తాపత్రికలలో రామవర్మ
మారుపేరుఁబెట్టుకొని తిరువాన్కూరు సంస్థానవిషయముల నెన్నిఁటినో
గూర్చి యితరులు వ్రాసినట్లు వ్రాసి మాల్టుబీదొరగారికి దోఁచని
సంగతులు చాలవరకు తెలిపెను. ఆపత్రికను చదువుకొని మాల్టుబీ

దొరగారు తానుచేయు మార్పులెంతవఱకు కుపయుక్తములో యెంత వఱకు కావో తెలిసికొని మెలకువతో మెలఁగుచు వచ్చెను.

ఆసంస్థానములో దక్షిణభాగమున గొందఱు క్రైస్తవమతబోధకులుండి వారిపాఠశాలలో మతము బోధించుట యావశ్యకమని చట్టము నేర్పర్చమని తిరువాన్కూరు ప్రభుత్వమువారిని బీడింపఁజొచ్చిరి. పాఠశాలలో, మతబోధవిషయమున దొరతనమువారు జోక్యము కలుగఁజేసికొనకపోవుటయే శ్రేయస్కరమని రామవర్మ యొకచిన్నపుస్తకమును వ్రాసెను. అది యిప్పటికిని మనవారందఱు జదువుకొనవలసిన గ్రంథమే. అది వ్రాసిన పిదప క్రైస్తవ మతబోధకులు తమవాదము గొంతవఱకు విడిచిరి. సంస్కృతవిద్యయొక్క యావశ్యకతను గూర్చి రామవర్మ చెన్నపట్టణములోనున్న నార్టనుగారికిమంచియుపన్యాసము వ్రాసి పంపెను. అది చదివి యతఁడు మిక్కిలి సంతసించెను.

1861 వ సంవత్సరమున రామవర్మ చెన్నపట్టణమునుజూడబోయి యచట గవర్నరుగారి దర్శనము చేసెను. తిరువాన్కూరు రాజకుమారులు చెన్నపురికిఁబోవుటకుగవర్నరునుజూచుటకునదియె మొదలు. ఆయనను జూచి గవర్నరు మిక్కిలి సంతసించి యటువంటి హిందువును దానెన్నఁడు జూచియుండలేదని మాల్టుబీ దొరగారికి వ్రాసెను. రామవర్మ చెన్నపురిలో నుండినపుడు గవర్నరుతోడను మఱికొందఱు తెల్లవారితోడనుకొందఱుస్వదేశస్థులతోడనుస్నేహముచేసి స్వదేశమునకుఁ బోయినపిదపఁగూడ నుత్తరప్రత్యుత్తరములమూలమున నామైత్రి నిలుపుకొనెను. గవర్నరు రాజకుమారుని వైదుష్యమునకు మెచ్చి చెన్నపట్టణపుయూనివర్సిటిలో వానినొక సభ్యునిగఁజేర్చెను. ఈగౌరవ మిప్పుడు చవుకయయినను వెనుక మిక్కిలి యరుదయి యుండెను. చెన్నపుర సందర్శనమువలన దేశాటనమునందుఁ గుతూహలము కలుగ రాజకుమారుఁడు స్వదేశముఁజూడవలయుననిసంకల్పించెను. సంకల్పిం

చి బయలుదేరి యతఁడు పూనికతో నన్నికొండలను నన్నినదులను నన్ని జలపాతములను జూచెను. చిత్రిమనస్కులైన పురుషులు తిరువాన్కూరులో నెక్కడికైనఁబోయి యొకపాడుదేవాలయమును బ్రాతకోటను యొకపురాతన శాసనమును మఱియేపూర్వకాల చిహ్నమునో జూచి తాము దానినిక్రొత్తగాఁ గనిపెట్టినామని చెప్పుకొన్నపుడు తత్ప్రదేశముల నున్నవారు వారిపలుకులు విని నవ్వి "ఇదియీవఱకు మా వైశాఖం తిరునల్ కనిపెట్టినదే. క్రొత్తదికా" దని తెలియఁజేయుచుందురు. వైశాఖం తిరునల్లను నది రామవర్మయొక్క రెండవపేరు. ఈదేశయాత్రిలో నతఁడు చిత్రచిత్రములగు మొక్కలను విత్తనములను రాళ్ళను లోహములను వన్నెపురుగులను వింతపిట్టలను చిన్నచిన్నక్రిమిజాతులను బోగుచేసికొని బండ్లమీఁద వేయించి స్వగృహమునకుదెప్పించుచుండును. మఱియు నతఁడంతతోఁ దృప్తినొందక స్వదేశమునఁ బెరిగెడునోషధులయొక్కయుఁ బుష్పములయొక్కయు లతలయొక్కయుఁ జిత్రివస్తువులయొక్కయు జిత్తరువు తన కొలువులోనున్న చిత్రికారులచేతవ్రాయించి దగ్గరనుంచుకొనును. ఇట్లుపోగుచేసిన వస్తుసముదాయములనుండి కొన్నివస్తువులుతీసి యతఁడు విదేశస్థులకిచ్చి వారియొద్దనుండు విచిత్రవస్తువులను తనవానికి బదులుగ గ్రహించుచుండును.

ఆతఁడు ప్రకృతిశాస్త్రములనుజదువుటయేగాక వానియందనుభవము కలుగునట్లు పరిశ్రమ చేసెను. ఆయనకు వృక్షశాస్త్రమునందు మిక్కిలి యభిమానము కలదు. దానికిందోడుగ వ్యవసాయమునందును మిక్కిలి యభిరుచియుండెను. ఆయభిరుచిచేతనే రామవర్మ వటక్కుకొత్తరముపేర నొకమందిరమును నిర్మించి దానిచుట్టు మంచి పండ్లతోఁటలు పూఁదోఁటలు పంటచేలు వేయించి రాజయ్యుఁ గృషీవలుఁడైయుండెను. వటక్కుకొత్తరమనగా నల్లునిమందిరమని యర్థము. ఈ భవనమందు రామవర్మ జీవితమునఁ జాలకాలము గడపెను. అన్యదేశ

ములలోఁ బండు ధాన్యములు, దుంపలు, పొగాకు మొదలగునవి తె ప్పించి స్వదేశమున నాటించి యతఁడు కృషివృద్ధిచేసెను. చిత్తరువులు వ్రాయుటలో నభిరుచి గలవారికావిద్యల నేర్పించి ముఖ్యముగా నీటి తో రంగులువేయుట చమురుతో రంగులువేయుట నను రెండు కళల విషయమునఁ జాలపని చేసెను.

ఈనడుమ మాధవరావుగారు కొన్నికారణములచేతసంస్థానము లో దివానుపనిని మానుకొనిరి. రామవర్మ కాయన గురువగుటచేతగు రుభక్తినిఁ జూపుచు నతఁడు మాధవరావుగారి బుద్ధివిశేషమును గొని యాడుచు కలకత్తా రివ్యూయను పత్రికకు మనోహరమయిన యుప న్యాస మొకటివ్రాసి పంపెను. ఆవ్రాత యానాటి విద్యావంతుల మ నస్సుల నాకర్షించెను. అప్పటి గవర్నరుజనరలుగారగు నార్తుబ్రూకు ప్రభువుగా రది చదివి మాధవరావు రాజనీతి విశారదుఁడనిగ్రహించి యిందూరు సంస్థానప్రభువగు హోల్కారునకు మంత్రి కావలసి యుండఁగా మాధవరావు నంపిరి. ఆగవర్నరుజనరల్ గారే రామవర్మ బుద్ధికుశలతగూడగ్రహించి తనయాలోచనసభలో సభ్యుఁడుగా నుం డుమని యాయనను గోరిరి. కాని యనారోగ్యముచేత రామవర్మ దాని నంగీకరింపలేదు. 1874వ సంవత్సరమున రామవర్మకు జబ్బుచేసి ప్రాణ ము మీఁదికివచ్చెను. అతఁడు జీవింపఁడని కొన్నిదినములుబంధువులు నిరాశచేసుకొనిరి. ఎట్టెటో దైవానుగ్రహమున జాడ్యవిముక్తుఁడై బ్రతి కెను. బలము చేరినది మొదలు రామవర్మ యెప్పటియట్లె చదువునందు వ్రాతయందు తనకాలము గడుపుచు వచ్చెను. మాధవరావు దివాను గానుండిన కాలమున తిరువాన్కూరులోనుపయుక్తములగుమళయాళ గ్రంథములు వ్రాయించుటకు చిన్నసభ యేర్పడెను. ఆసభకు రామవ ర్మ మిక్కిలి తోడుపడి సత్యము, విద్య, యారోగ్యము మొదలగువిష యములఁగూర్చి తాను స్వయముగ చిన్నగ్రంథములు వ్రాసి యాసభ

వారికిచ్చుచువచ్చెను. మహారాజు కుమారుఁడయినను పాటుపడవలసి నదనియుఁ బాటుపడినందువలన గౌరవలోపములేదనియుఁ దానప్పటికి యువరాజయ్యు కాఫీతోఁట వేయించి స్వయముగ పనిచేయించెను. ఆతఁడు పండించినకాఫీ తక్కినకాఫీలకంటె శ్రేష్ఠతమమైనది చెన్నపురమందు జరిగిన వస్తుప్రదర్శన సభవారు వారికొక బంగారు పతకమును బహుమానమిచ్చిరి. బుద్ధికుశలతగల వారితోడను విద్యావంతులతోడను రామవర్మ తరచుగ సహవాసముచేయ నభిలాష గలవాఁడు. ఈయభిలాష బంధముచేతనే యతఁడు సర్వకలాశాలలోఁజదువుకొనుచుండిన కుశాగ్రబుద్ధులగు విద్యార్థులఁ దన మందిరమునకు రావించి వారితో విద్యాగోష్ఠిం దేలుచుండెను. ఇప్పు డాసంసారమున గొప్పయుద్యోగములోనున్న పురుషులనేకులు మొదట రామవర్మచేరదీసినవారే. మైసూరు సంస్థానమున మంత్రి పదవినొందిన రంగాచార్యులవారు కూడ మొదట రామవర్మచేత బెంపఁబడినవారే.

1880 వ సం॥న సంస్థానమును బాలించు మహారాజు మృతినొంద రామవర్మ తిరువాన్కూరు మహారాజయ్యెను. అతనిపట్టాభిషేకము 1880 వ సంవత్సరము జూను 17 వ తేదిని జరిగెను. ఈయనవలెసర్వజనులకు నిష్టముగ గద్దెయెక్కిన మహారాజుమఱియొకఁడుండఁడు. సకలకలావిశారదుఁడయి సచ్చరిత్రుఁడగు రామవర్మసింహాసనమెక్కినతోడనే సంస్థానమందలి ప్రజలందఱు తామదృష్టవంతులమనుకొనిరి. దక్షిణహిందూస్థానమందలి విద్యావంతులందరు వానిమంచియేలుబడిచేత వానిసంస్థానమేగాక-యామార్గమనుసరించితక్కినసంస్థానములు గూడ బాగుపడునని తలంచిరి. రామవర్మ గద్దెయెక్కినతోడనే వెంబాకము రామయ్యంగారిని మంత్రిగాజేసికొనెను. రామయ్యంగారిస్వభావము రామవర్మ స్వభావమువంటిదేయగుటచే వారి కొండొరులమీఁద నంతకుముందే యిష్టముండెను. ఆయన మంత్రియయినతోడనే రాజు మం

త్రియుఁ గలిసి సంస్థానములోఁ బలుమార్పులుచేసిరి. కోర్టులలోను రివిన్యూవ్యవహారములలోను పోలీసులోను నుప్పుడిపార్టుమెంటులోను పాతపద్ధతులఁ జాలవఱకు తొలఁగించి యాయన క్రొత్తపద్ధతులఁ బెట్టెను. ఇది యది యని చెప్పనేల? ఆమహారాజు గుఱ్ఱములు నేనుఁగులు మొదలగు జంతువుల సంరక్షణమునుగూర్చి సయితము స్వయముగ మార్పులఁ జేసెను. చేయదలఁచిన మంచియేర్పాటులన్నియు సత్వరమే చేయవలెనని యతఁడు కోరుచువచ్చెను. ఏలయన రామవర్మనుర్బలుఁడగుటచే నెప్పుడు తనకు మరణము సంభవించునోయని భయపడుచువచ్చెను. ఆసందేహము మనస్సులోనుంచుకొని యతఁడొకసారిమంత్రి కిట్లువ్రాసెను. "నాకిప్పుడు నలువదియాఱేండ్లున్నవి. ఒక్కరు తప్ప నాపూర్వులెవ్వరు నేఁబదియేండ్లుదాఁటి బ్రతుకలేదు. కాఁబట్టినేఁడుచేయవలసిన పనిని రేపటికాపవద్దు" అట్లుత్వరపడి సంస్థానవ్యవహారమంతయుఁ జాలఁ గట్టుదిట్టముచేసెను. ఆమార్పులుచేసిన పిదప మహారాజుదృష్టి నేలకొలత (సర్వే) పన్నునిర్ణయము (సెటిల్‌మెంటు) అను రెండుక్రొత్తపద్ధతులమీఁదికిఁబోయెను. తిరువాన్కూరుసంస్థానములో భూములలెక్కలు చిరకాలమునుండి యుండవలసినవిధముగాలేవు. అవి చక్కఁజేయుట చాలశ్రమకరమని వెనుకటి మహారాజులు దానిజోలికింబోరైరి. రామవర్మ తనయావచ్ఛక్తి వినియోగించి పంటనేలలన్నియుఁ గొలిపించి వానికిం దగినట్లు పన్నులుగట్టించెను. అదియైన పిదప రామవర్మ చిరకాలమునుండి కొచ్చిను సంస్థానప్రభువులకుఁదనకుఁగలసరిహద్దులవివాదమును బరిష్కరించుకొనఁదలఁచి మధ్యవర్తులనేర్పఱచుకొని వారు చెప్పినట్లువినుట కొడంబడి యావివాదమునంత మొందించెను. మహారాజున కీమార్పులుచేయుట యొకయెత్తు, సంస్థాన మందలి యుద్యోగస్థుల నడుపులోనుంచుట యొకయెత్తుగనుండెను. రామవర్మ గద్దెనెక్కినప్పుడులంచగొండులుండఱుసడుగంటెదరనినాగరికులగుపౌ

రులేగాక కొండవాండ్రుసయితము సంతోషించిరి. వారికోరికలుసఫల ములయ్యెను. సర్కారుజీతములు తినుచు దురాశాపాతకులయి లంచ ములకై ప్రజలం బీడించు దుర్వినీతుల నతఁడు నిష్కారుణముగదండిం చి రహితులబాధ తొలఁగించెను. దుర్జనుల దౌర్జన్యము నడఁచుటలో వాని కెంతజాగ్రతయుండెనో సన్మార్గులయోగ్యతనుమెచ్చి బహుమా నముచేయుటలో నంత జాగ్రతవానికుండెను. రాచరికము చేయుచు న్నాఁడని పేరెగాని రామవర్మచేసినంతపనియాసంస్థానములో నేయు ద్యోగస్థుఁడు చేసియెఱుఁగఁడు. దివానుపంపించెడి కట్టలకొలఁదికాగిత ముల నవలీలగజూచి విషయములు గ్రహించి వానిమీఁద వేయవలసి న యుత్తరువులువేసి రామవర్మయించుకేని యాలస్యముచేయకమరలఁ బంపుచుండును. అన్నికాగితములను జూచుకొనుటయేగాకప్రపంచము లో ననేకదేశములందున్న తన మిత్రులకుఁ బ్రతిదినము పలుజాబులు వ్రాయుచుండును. వేయేల! సామాన్యుఁడగుగుమాస్తాయెట్లుపనిచేసెనో యతఁడు నట్లె పనిచేసెను. ఈమహారాజు ప్రాతఃకాలమున సూర్యుని కంటె ముందే మేల్కొని బండిమీఁదషికారుపోయి తిరిగివచ్చునప్పుడుమధ్య మార్గమున నుదయభానునిం గలిసికొనును. షికారు ముగించియతఁడు గృహమునకుఁబోయి స్నానము సంధ్యావందనము జపము మొదలగు పారలౌకికకృత్యములు నెఱవేర్చుకొనిభోజనముచేసిపదిగంటలకుపదునొ కండు గంటలకు రాచకార్యములనిమిత్తము దర్బారునకుఁ బోవును.

అదిమొదలు రెండుగంటలువఱకు తనమందిరవ్యవహారములు దేవస్థానవ్యవహారములు కనుఁగొని చక్కఁజేసి తక్కినవ్యవహారముల లో లేశలేశములుగూడ పరిశీలించుచుండును. అనంతరము కాఫీత్రా గుటకుఁబోవును. రెండుగంటలు మొదలుకొని యుద్యోగస్థులువ్రాసి పంపు రిపోర్టులు చదువుకొనును. కోరినవారికి దర్శనమిచ్చును. సా యంకాలమైనతోడనే మరల నతఁడు సంధ్యావందనము, మొదలగు

కాలకృత్యములను దీర్చుకొనును. దేహారోగ్యము సరిగా నుండనప్పుడు సయితమతఁడు సంధ్యావందనాదికమును భక్తిశ్రద్ధలతోఁ జేయుచుండును.

గవర్నరులు తనదేశమువచ్చినపుడు దేవతోత్సవములైనప్పుడు విందులు జరిగినప్పుడు సయితము రామవర్మ రాజ్యకార్యములనిమిత్తము తానేర్పఱచుకొన్న కాలము వానిక్రింద వృథసేయక తనవిశ్రాంతి నిమిత్తమేర్పడిన కాలమునందే తత్కార్యములు నెరవేర్చుచుండును.

రామవర్మ యిరువదియైదేండ్లప్రాయము మొదలు మరణ పర్యంతము దినచర్య వ్రాయుచువచ్చెను. ఎంత ప్రొద్దుపోయినను పండుకొనుటకుఁ బోవక మున్నతఁడు దినచర్య వ్రాసితీరును. ఇన్ని పనుల నడుమ రామవర్మ యింగ్లీషుగ్రంథము లనేకములు చదువుటకును నింగ్లీషుతో నెన్నోయుపన్యాసములు వ్రాయుటకును దీరికగలవాఁడయ్యెను. తనసంస్థానమందున్న పాఠశాలలలోఁజదువుబాలకుల యుపయోగము నిమిత్తము రామవర్మయింగ్లీషులోనుండిసత్పురుషులయొక్కయు మంచి స్త్రీలయొక్కయు చరిత్రములనేరి మళయాళభాషలో వ్రాసెను. మఱియు స్వభాషాభివృద్ధిఁ జేయుటకతఁడు "విద్యావిలాసిని" యనుపేర నొకమాసపత్రికను స్థాపింపఁ జేసి జ్యోతిశ్శాస్త్రాది విషయములనుసులభశైలితో మళయాళభాషతో వ్రాసి యందుఁ బ్రకటించుచు వచ్చెను. చిన్నతనమునుండియు వానికి దేశయాత్రాభిలాష మెండుగనుండుటచేరాజ్యభారముపై బడినకతమున వెనుకటియట్లు స్వేచ్ఛగాదిరుగవలనుపడకున్నను రామవర్మ యుత్తరహిందూస్థానమును జూచివచ్చెను. తీరికచాల లేకపోయినందున నతఁడు 1882 వ సంవత్సరమున జనవరినెలలో బయలుదేరి ముఖ్యస్థలములఁ గొన్నిఁటినిమాత్రమే చూచి మార్చినెల ముగియకమున్నె రాజధాని జేరెను. అతఁడుచూచిన ప్రతిపట్టణమునందు జనులు వానిదర్శనము జేయవచ్చి వానియుదార గుణములఁ గొని

యాడుచు స్వాగతపత్రికల సమర్పించిరి. 1883వ సంవత్సరమునన తఁడు చెన్నపురమునకుఁబోయి వెనుక చేసిన కాశియాత్ర సఫలముచేయుటకు రామేశ్వరయాత్ర చేసెను. రామేశ్వరమునుండి సేతువునకుబోయినపుడు రామవర్మ మహానందభరితుఁడై దినచర్యలో నిట్లువ్రాసెను. "నేను నేఁటియుదయమున సముద్రపుబాయదాఁటితిని. పూజ్యమైన రామసేతువుఁ జూచితిని. ప్రకృతియో దైవమహిమయో నేనెఱుఁగనుగాని యిది మిక్కిలిదర్శనీయమైనది. సమానమైన వెడల్పుఁగలిగి యదిగీటుగీచినట్లు తిన్నగ నున్నది. ఈభాగమే మాదేశమును సింహళద్వీపమునుగలుపుచున్నది." రామవర్మ తనరాజ్యములోఁగూడ బూర్వులుకంటెనెక్కుడుసారులు పయనములుచేసి పలుతావులుచూచెను. ఆయన తనరాజ్యమునందుఁగల ప్రతిగ్రామమునకుఁబోయి చేతిపనులకుగాని ప్రకృతి వినోదములకుగాని పేరువడసిన గ్రామముల పేర్లు జ్ఞాపకార్థముతనపుస్తకములో వ్రాసికొని యాయాగ్రామములందు కళావిశారదులగుబుద్ధిమంతులు గానఁబడినప్పుడు వారికేవో పనులుగల్పించి ధనసహాయముజేయుచుండును. చేతిపనులకుఁ దగినప్రోత్సాహముఁ గలుగఁజేయుట కాయన యాపనులునేర్పు పాఠశాల నొకటి స్థాపించెను. అతని ప్రోత్సాహముచేతనే క్విలనుపట్టణమందువస్త్రములునేయు యంత్రములుస్థాపింపఁబడెను. అతని ప్రోత్సాహముచేతనే పూనలూరుగ్రామమున కాగితములుచేయు యంత్రములుస్థాపించుటకు ప్రయత్నముగలిగెను. ప్రకృతిశాస్త్రమునం దతనికిఁగల యభిరుచి నానాటికి హెచ్చతనరాజధానిలోనున్నకలాశాలలోరసవాదశాస్త్రము (కెమిస్ట్రి) ప్రకృతిశాస్త్రము నేర్పింపఁదలఁచియుపాధ్యాయులనేర్పఱచెను. అతనిశాస్త్రపరిశ్రమలను బట్టి యూరపుఖండములో నింగ్లాండు మొదలగు దేశములలోనున్న ప్రకృతిశాస్త్రీయసంఘము లనేకములు వానినిసభ్యునిగఁజేర్చుకొనియెను. సంస్కృతపాండిత్యమునుబట్టి రాయల్ఏష్యాటిక్కుసంఘమువారు

వానిని దమసంఘములోఁ జేర్చుకొనిరి. భూగోళశాస్త్రపరిజ్ఞానమును బట్టి భూగోళశాస్త్రీయసంఘమువారు జేర్చుకొనిరి. ఇట్లతనికీర్తి స్వదేశమందెగాక దేశాంతరములయందు ద్వీపాంతరములయందు ఖండాంతరములయందుఁగూడ వ్యాపించెను. ఈసంఘములవారందఱు వానినట్లు గౌరవింపకమునుపే శ్రీవిక్టోరియాచక్రవర్తినిగారు వారికి "సర్. కె. సి. యస్. ఐ." అను బిరుదము నిచ్చిరి. ఈవిదేశపు బిరుదులకుఁ దోడుగ నతఁడుస్వదేశపుబిరుదులఁగూడగొన్నిఁటి నందెను. అతనిపూర్వులందఱు తులాభారముఁదూఁగి కులశేఖరపెరుమాళ్ళను బిరుదమునువహించుచువచ్చిరి. ఆవిధముగానె రామవర్మయు నాబిరుద మందెను. అనంతరము కీర్తిపతి యను బిరుదము బడయవలెననిప్రయత్నముచేయుచుండ నంతలో మృత్యువు వానిం దనవాతఁ బెట్టుకొనియె.ఆయన 1884 వ సంవత్సర మైదవ యాగష్టున కాలధర్మము నొందెను.ఆయన యనుకొన్నట్లె పూర్వుల విధమున నేఁబదియేండ్లునిండగానెమృతినొందెను. కర్మలయం దాయనకు సంపూర్ణమయినవిశ్వాసముకలదు.కర్మలు చేయఁదలఁచినప్పుడు సగము సగముచేయకసంపూర్ణముగఁ జేయవలెనని యాయన యభిప్రాయము. ఏదేశమునకుగాని రామవర్మవంటి మనుష్యులు ప్రభువులగుట జనుల యదృష్టమని చెప్పవలయును. అంతటి మహారాజును దీర్ఘాయురారోగ్యములిచ్చిరక్షింపక భగవంతుఁడు నట్టనడుమ ద్రుంచివేయుట జనుల భాగ్యదోషముననేకదా.

తిరువాన్కూరు మళయాళదేశములోఁజేరినది. అక్కడతండ్రియాస్తి కొడుకునకురాక మేనయల్లునకుఁ జెందుచుండును. రామవర్మయు వెనుకటి రాజునకు మేనల్లుఁడగుటచేతనే రాజ్యప్రాప్తిగలిగెను. ఇప్పటి మహారాజు రామవర్మకు మేనల్లుఁడు గావుననే గద్దెయెక్కెను అక్కడ ధర్మశాస్త్రము మనధర్మశాస్త్రమువంటిది కాదు.

―――

# రాజా సర్ మాధవరావు

మాధవరావు 1828వ సంవత్సరమునఁ గావేరీ తీరమండలికుంభకోణ పట్టణమందు జన్మించెను. ఈయన కుటుంబము మిక్కిలిగౌరవనీయమయినది. ఆయన తండ్రి రంగారావు కొంత కాలముతిరువాన్కూరు దివానుగా నుండెను. ఆయన పినతండ్రి రాయరాయరాయ వెంకటారావుగూడ తిరువాన్కూరు సంస్థానమున మంత్రియైయుండెను. తండ్రి మాధవరావును జిన్నతనమందే చదువునిమిత్తము చెన్నపట్టణమున కంపెను. మాధవరా వప్పటి చెన్నపట్టణపు హైస్కూలులోఁ జేరిపవెలుదొరయొద్ద విద్యారసముం గ్రోలెను. ఈయన సహాధ్యాయులందరు మిక్కిలి సుప్రసిద్ధులైరి. మాధవరావు మిగులజాగరూకతయుశ్రద్ధయు గలిగి విద్యాభ్యాసము చేసెను. ఆయన గణితశాస్త్రము ప్రకృతి శాస్త్రము నేర్చుటయేగాక యుపాధ్యాయుఁడగు పవెలు దొరగారిమేడమీఁద జ్యోతిశ్శాస్త్రము నభ్యసించెను. దాని నభ్యసించు నప్పుడు మాధవరావు వెదురుగొట్టముల కద్దపుబిళ్ళ లదికి గ్రహసంచారమును జూచుటకై సూక్ష్మదర్శకయంత్రములుదూరదర్శకయంత్రములుఁ జేసి గురువునకుఁ బరమానందముఁ గలిగించుచువచ్చెను. మాధవరావు 1846వ సంవత్సరమందుఁ బట్టపరీక్షలోఁ గృతార్థుఁడై విద్యాభ్యాసము ముగించెను.

పవెలుదొర శిష్యునియం దధికాభిమానముఁ గలవాఁడగుటచే వానిని విడువనిష్టములేకతనపాఠశాలలో వానికుపాధ్యాయత్వమిప్పించి వానిచేత గణితశాస్త్రముఁ బ్రకృతిశాస్త్రముఁ జెప్పించెను. ఆయుద్యోగమునం దతఁడు చిరకాల ముండలేదు. ఏలయన నల్పకాలమునందే తిరువాన్కూరు రాజకుమారున కింగ్లీషు నేర్పుటకుపాధ్యాయుడు కావలసివచ్చినందున మాధవరా వాయుద్యోగమున బడసెను. స్వ

దేశ సంస్థానములలో నితఁ డుద్యోగస్థుఁడై పేరువడయుటకిదియే ప్రా
రంభము. మహారాజా రామవర్మయు మఱికొందఱు రాజకుమారులు
వానిశిష్యులై విద్యనేర్చిరి. తిరువాన్కూరు సింహాసనమెక్కినరాజుల
లో రామవర్మవంటివారు తరుచుగ లేరు. రామవర్మ నంతవానిం జేసిన ది
మాధవరావే యని నిశ్చయముగఁ జెప్పవచ్చును. అట్లు రాజకుమారుల
కు గురువై మాధవరావు నాలుగు సంవత్సరములుండి యాపనిమానిది
వానుక్రింద మఱియొక యుద్యోగము వహించెను. అందుగొంతకాల
మున్న పిదప నతనికి దివాను పేష్కారుద్యోగమిచ్చి సంస్థానములో దక్షి
ణభాగమును బరిపాలింపఁ బంపిరి. ఆకాలమందా దక్షిణభాగములో
జనుల పరస్పర కలహములు పోరాటములు ప్రబలియుండెను. మాధవరా
వు తనయందలి శాంతరసముచేతను బుద్ధిసూక్ష్మతచేతను దేశమందలి
కలహాగ్ని త్వరలోనే చల్లార్చెను. తన కుద్యోగమయినసంవత్సరము
లోనే నెమ్మదిలేనిచోట నెమ్మదిగలిగించెను. ఆర్తులగువారికి నిష్పక్షపా
తముగ న్యాయమొసగి నేరస్థులను నిర్భయముగ దండించెను. బందిపోటు
దొంగల రూపుమాపెను. ప్రజలకు బాధలేకుండ శిస్తులు హెచ్చించెను.
ఆయన వ్యవహారపుఁ గాగితములు దినచర్యలు జూచితిమా యతఁడెం
దధైర్యముతో నట్టికష్టదినములలోఁ బనిచేసెనో తెలియును. రాజ్య
ము నాశనము కాకుండ రక్షించెను. రాజు కృతజ్ఞతకుఁ బాత్రుఁడయ్యె
ను. ఆయనయే మంత్రియగునేని సంస్థానము మహాభివృద్ధి నొందునని
యానాటివారందఱభిప్రాయపడిరి. విద్యనేర్చిన స్వదేశస్థులు దేశపరిపా
లనమందు దమకు సమానులగుదురని వివేకులగు తెల్లవారు గ్రహించిరి.

ఆకాలమునందు తిరువాన్కూరు సంస్థానముస్థితి చక్కగా నరసి
పనిచేయలేని మంత్రిపాలనమున నుండెను. అప్పటి మహారాజు దుర్బ
లుఁడు. ఆయన దేవాలయమునకుఁ బోవుట నిత్యకర్మలు సేయుట
మొదలగు పనులకే యలవడెను గాని రాజ్యవ్యాపారములమీఁద దృష్టిని

లుపుటకలవడలేదు. సంస్థానమందలి యుద్యోగస్థులు జీతముస్వల్పమ
గుటచేతను స్వల్పజీతములైన సరిగా నియ్యక యాఱు నెలలకొకసారి
యేఁడాదికొకసారి యిచ్చుటచేతను వారు లంచగొండులై ప్రజలనుబీ
డింపఁజొచ్చిరి. ఖజానాకొట్లు వట్టివయ్యెను. ఇంగ్లీషువారికి రాజుకిప్ప
ముచెల్లింప లేకపోయెను. మార్గములు సరిగ లేకపోవుటచేవాణిజ్య
మడుగంటెను. దేశస్థులవృద్ధి దిగనాఱెను. ఆకాలమునందు హిందూ
దేశమునకు డల్‌హౌసీప్రభువుగవర్నరుజనరలుగానుండెను. స్వదేశరా
జులను సింహాసనభ్రష్టులఁజేసి వారిరాజ్యముల గలుపుకొనుటలో నీప్ర
భువునకుంగల ప్రజ్ఞ యింతింతయనరాదు. మనదేశములో స్వదేశసం
స్థానమన్న పేరులేకుండ జేయవలయునని యీయనతలంపు. ఏసంస్థాన
మందైనఁ గొంచెము గడబిడయల్లరిజరుగునేని యావంక బెట్టిసంస్థానమ
క్రమముగఁ బరిపాలింపఁబడుచున్నదని ప్రజలు బాధలుపడుచున్నారని
వారి యిడుమలార్చువాఁడుతీర్చువాఁడుబోలె నాయనయాసంస్థానము
గలుపుకొనుచువచ్చెను. వారసులు లేనివారికి దొరతనమువారే వార
సులని బిడ్డలులేక మృతినొందిన మహారాజు సంస్థానములన్నియునీతఁ
డింగ్లీషువారికే జేర్చెను. ఆయనదృష్టి యాకాలమున తిరువాన్కూరు
సంస్థానముపైఁబడెను. క్రమపరిపాలనము లేదను నెపమున దానినతఁ
డు కలుపుకొనఁదలఁచి చెన్నపట్టణపుదొరతనమువారితోనాలోచించు
టకు నీలగిరికిఁబోయెను. అప్పుడు మహారాజు మేలుకొని మాధవరా
వును మంత్రిగాఁ దీసికొనెను. మాధవరావు తన కేఁడుసంవత్సరములు
గడువిచ్చినపక్షమునసంస్థానమునుమంచిస్థితిలోనికి వచ్చునని దొరతన
మువారికి వ్రాసెను. ఎట్టటో వారు దానికంగీకరించిరి. 1857వసంవ
త్సరమున మాధవరావుతిరువాన్కూరుమంత్రియయ్యెను. మాధవరా
వు ముప్పదియేండ్లయిన నిండకమునుపే బుద్ధిబలము నీతిబలమువిద్యా
బలముఁ గలవాఁడగుటచే గొప్ప సంస్థానమునకు మంత్రిత్వమువహిం
పఁ గలిగెను.

మాధవరావు మొట్టమొదట కొన్ని ప్రజాపీడకరములుగా నున్న పన్నులఁ దగ్గించి మార్పుచేయుటలోఁ గడఁపెను. క్రమము మితి మేఁగలేక వెనుకటిమంత్రులు పన్నులుగట్టుచువచ్చినందున దేశస్థులు మిక్కిలి దరిద్రులైరి. సంస్థానమునందుఁ బ్రతివస్తువుఁగూడ నిజారా చేయఁబడుచువచ్చెను. పన్నులు ప్రజలను విసికించెను. అన్నిఁటిలో మిరియాల యిజారా జనులకు మిక్కిలిబాధకరముగ నుండెను. ఆయిజారా మాధవరావు ముందుగాఁ గొట్టివేసి యందువలన సంస్థానమునకుఁ గలుగు ధననష్టముఁ గూడదీయుటకై నూటికిబదునైదు వంతున దానిమీఁద నెగుమతిపన్ను విధించెను. అదియుఁ బ్రజలకు భారముగా నున్నందున గొంత కాలము గడచిన పిదప నతఁడు నూటికి తొమ్మిదివంతున బన్ను విధించెను. మఱికొన్నాళ్ళ కదియే నూటి కైదుపాయలవం తగునట్లు చేసెను. ఆసంస్థానమునం దదివఱకు పొగాకువర్తకము జనులు చేయుటకు వీలులేదు. సంస్థానప్రభుత్వమువారే విదేశవర్తకులయొద్దనుండి పొగాకుకొని నిలువఁజేసి చిల్లరగ నమ్మి లాభముదీయుచువచ్చిరి. మాధవరావు పొగాకుయిజారా కొట్టివేసి యావర్తకము జనులే చేసికొనవచ్చు నని యుత్తరువుచేసి దానిమీఁద కొంతపన్ను విధించెను. ఆపన్ను మొదట కొంచెము హెచ్చుగానున్నందున నతఁడే కాలక్రమమున దానిని తగ్గించెను. ఇట్లు చేయుటచే దేశమున వర్తకము హెచ్చుటయుఁ బ్రజలు బాగుపడుటయు సంభవించెను. అట్లుమాధవరా విజారాలను రూపుమాపి తక్కినపన్నులు తగ్గింప సంకల్పించి చిల్లరపన్నులు నూఱు తీసివేసెను. ఈనూఱుపన్నులు సంస్థానమునకుఁ గలుగఁజేయు లాభము తక్కువ, ప్రజలకుఁ గలిగించు పీడ యెక్కువ. నేలపన్ను హెచ్చుగానున్న స్థలములఁ దగ్గించి యతఁడు 1863-64 వ సంవత్సరములలో నెగుమతి దిగుమతి సరకులమీఁద విధింపఁబడిన పన్నులుగూడ స్వల్పముచేసెను.

మరుసటి సంవత్సరము కొచ్చినురాజుతోడను ఇంగ్లీషుదొరతనము వారితోడను నతఁడు వాణిజ్యవిషయమున నొక యొడంబడిక చేసు కొనెను. ఆయొడంబడికనుబట్టి యింగ్లీషు రాజ్యమునుండి కొచ్చిను సంస్థానమునుండి తిరువాన్కూరునకుఁ బోవు సరకులను తిరువాన్కూరునుండి యాదేశమునకుఁబోవు సరకులకును బన్నులు లేవు.

అట్లుమాధవరావు తిరువాన్కూరుసంస్థానమునకుఁ జేసినయమితోపకారమునకు నింగ్లీషుదొరతనమువారు సంతసించి కె.సి.యస్.ఐ. యనుబిరుదము వాని కిచ్చిరి. అప్పుడు చెన్నపట్టణపు గవర్నరుగానుండిన నేపియర్ ప్రభువు మాధవరావును చెన్నపట్టణమురావించి యాబిరుదమును స్వయముగానిచ్చి యిచ్చునప్పుడు విక్టోరియారాణీగారు వానిచేసినపనులకు మిక్కిలి సంతసించిరని చెప్పి పలుదెఱఁగుల వాని గుణములఁ బొగడెను. ఆసంవత్సరమే మాధవరావు చెన్నపట్టణపు యూనివరుసిటీలో సభ్యుఁడయ్యెను. అట్లు చిరకాలము మంత్రిపదమువహించి దేశము క్రమస్థితిలోనికిఁదెచ్చి మాధవరావు హాయిగా నుండఁదలఁప వాని తలఁపునకు వ్యాఘాతము సంభవించెను.మాధవరావుమీఁదఁ గిట్టనివారు మహారాజుతో నెన్నోకొండెములు చెప్పి యాయనమనస్సు విఱిచిరి. ఆకొండెములు విని మహారాజు మునుపటియట్లు నమ్మఁడయ్యె. అందుచేత మాధవరావు 1872 వ సంవత్సరమున మంత్రియుద్యోగమును మానుకొనెను.

ఆమహామంత్రి చరిత్రమునందు బ్రథమాధ్యాయ మింతతో ముగిసె నని చెప్పవచ్చును. మాధవరావు తిరువాన్కూరులో నంధకారమయములగు ప్రదేశములందు వెలుతురు ప్రకాశింపఁజేసెను. అరాజకము ప్రబలినతావుల రాజరికమునెలకొల్పెను. బందిపోటుదొంగలబారినుండి తప్పించి ప్రజల ధనప్రాణముల రక్షించెను. మట్టిగుడిసెలతో నిండినపట్టణమున సుందరమందిరములు గట్టించి రాజధాని

యనుపేరునకుం దగినట్లు చేసెను. కాలువలు త్రవ్వించెను. వంతెనలు కట్టించెను. బాటలు వేయించెను. దుర్గమపరిదేశములకు బయనము సులభము చేసెను. కాఫీతోఁటలు మొదలగు నూతనవ్యవసాయములపై జనుల కభిరుచి కలిగించెను. వేయేల! దేశమంతయు పాడిపంటలు సిరిసంపదలు గలిగి కనులపండువై యుండెను. మాధవరావు మంత్రిపదముం బూనుకాలమున నింగ్లీషువారు సంస్థానము గలుపుకొందురని క్షణక్షణము భయముకలుగఁజొచ్చెను. అట్టి సంస్థానము మాధవరావు విడుచునప్పుడు స్వదేశసంస్థానములలో నగ్రగణ్యమని చెప్పఁదగియున్నది. మహారాజు మాధవరావునకు నెలకు వేయి రూపాయలు పకారవేతనము నేర్పఱచెను. ఆ భరణము గ్రహించుచు మాధవరావు చెన్నపట్టణమునఁ గాపురముండి జీవితకాలశేషముఁ గడుపఁదలఁచెను. అట్లు చెన్నపట్టణమున నున్నకాలమున గవర్నరు జనరలుగారు తనయాలోచనసభలో మాధవరావు నొకసభ్యుఁడుగ నుండుమని కోరిరి. కాని మాధవరావుగారు సభ్యత్వ మక్కఱలే దనిరి. మాధవరావు తిరువాన్కూరులో నుద్యోగముమానిన వార్త యింగ్లాండులోఁ దెలిసినప్పుడు హెన్రిఫాసెట్టనునతఁడు తిరువాన్కూరుసంస్థానమునంతప్రజ్ఞతోఁ బరిపాలించినమంత్రి యుద్యోగము లేక యుండవలసివచ్చెనా. ఇంగ్లీషువారు తమరాజ్యములో నాయన కేదయిన నుద్యోగ మియ్యఁగూడదా యని యిండియా శెక్రిటరీ నడిగెను.

ఆ దినములలోనే కలకత్తారివ్యూ యనుపత్రికలో మాధవరావును గూర్చి యాతనిప్రియశిష్యుఁ డగు రామవర్మ యొకవ్యాసమువ్రాసి ప్రకటించెను. అందుమాధవరావు సహజముగా గట్టిదార్ఢ్యము గలవాడనియు నిప్పటికి నలువదియైదేండ్లవయసున నుండుటచే మరిపదియేండ్లు పనిచేయఁ గలఁడనియు సంస్థానవ్యవహారములయం దతనికిఁగలనేర్పసమాన మనియు స్పష్టముగా దెలుపఁబడెను. ఆసమయముననే

యిండియా సెక్రిటరి మాధవరావునకుఁ దగు నుద్యోగము నీయవల
సిన దని గవర్నరుజనరలునకు వ్రాసె. దాని కనుగుణముగా నింహూ
రు సంస్థాన ప్రభువగు తుకాజీరావుహోల్కారు తన సంస్థానమునకు
మంచి మంత్రిని బంపవలయు నని గవర్నరుజనరలు కోరెను. ఆయు
ద్యోగ మంగీకరింపు మని గవర్నరు జనరలు మాధవరావును గోర
నతఁ డందుకు సమ్మతించి 1873 వ సంవత్సరమున నిందూరులో మం
త్రిపదస్థుఁడయ్యె. ఇందూరులో మాధవరావు రెండుసంవత్సరములే
యుండుటకొప్పకొని పనిఁబూనెను. ఆకాలమున నతఁడు చేసినగొప్ప
కార్యము లంతగా లేవు. ఇందూరు సంస్థానమున కదినఅనుశిక్షాస్మృ
తిలేదు. అదిమాధవరావు చేయనారంభించెను. ఈయనజ్ఞాతియగు ది
వాను బహదరు రఘునాథరావు తరువాత నిందూరు మంత్రియైయా
పుస్తకము పూర్తిచేసెను. రెండుసంవత్సరములు గడువుకాగానేమా
ధవరావు మంత్రిపదము మానిపోవఁదలఁప హోల్కారు మఱియొ
కయేఁ డుండవలయునని ప్రార్థించెను. ఆప్రార్థన మంగీకరించి యతఁ
డక్కడనుండ 1878 వ సంవత్సరమునబరోడాసంస్థానాధిపతి యగు ము
రహరరావు గైక్వారురెసిడెంటునకు విషము పెట్టఁదలఁచినాఁ డను నే
రముమీఁద గవర్నరుజనరలు వానిని సింహాసనభ్రష్టునిఁ జేసి యుక్త
వయస్కుఁడుకానియాతని కుమారునకు రాజ్యమిచ్చి యాసంస్థాన
మునకు మాధవరావును మంత్రిగా యువరాజునకు సంరక్షకుఁడుగ నే
ర్పఱిచెను.

ఆకాలమున బరోడాసంస్థానస్థితి మిక్కిలి శోచనీయమై భ
యంకరమై యుండెను. ద్రోహము రాజద్రోహము నరహత్య రాజ్యమం దె
ల్లచోటుల నిరంతరాయముగ గానంబడుచు వచ్చెను. ఉద్యోగస్థులు
పరస్పర మత్సరముచేత నొండొరులనాశనము చేయఁదలఁచి గుట్రల
పైఁ గుట్రలుపన్ని సంస్థానమునకుఁ జాలనష్టముఁ గలుగఁజేయుచుండిరి.

వారి నడచుటకు, సంస్థాపము, జక్కఁజేయుటకు మంచి యినుపమన స్సు, యినుపచేయి గలమనుష్యుఁడు గావలయు. అట్టివాఁడు మాధ వరావుగాక యన్యుఁడు లేఁడు. అక్కడ నింగ్లీషురెసిడెంటు మాధవ రావునకు సమస్తవిషయముల సహాయముచేసి వానిపూనిక గడ ము ట్టించెను. మాధవరావు దాఁటవలసిన మొదటి కష్టసముద్రము బరో డాసంస్థానపు శిస్తువ్యవహారము. బరోడా దొరతనమువారు శిస్తువసూ లు నిమిత్తము గ్రామములను సరదారులనఁబడు కొందఱుజమీందా రుల కమరకముచేయుచువచ్చిరి. ఆసరదారులు స్వయముగ వ్యవహ రింపక కొందఱుషాహుకార్లకు గ్రామములను దిరిగి యమరకములఁ జేయుచువచ్చిరి. ఆషాహుకారులు దయాదాక్షిణ్యములు లేక పంటలు పండిన యేఁడనక పండని యేఁడనక ధనము స్వీక రించుటయే ప్రధానవృత్తి చేసికొని కత్తులు కఠారులుఁ బుచ్చు కొని పరిజనలపైఁబడి శిస్తు లీయని వారినిఁ దిట్టి కొట్టి చంపి సొ మ్ము దోఁచుకొనుచు వచ్చిరి పన్నులు పోఁగుచేయు నెపమున షాహు కారులు దేశమున నరహత్యలు, దోపుడులు యథేచ్ఛముగఁ గావిం పుచు వచ్చిరి. సరదారులు సొమ్మేకావలసినవారగుటచే నీదుష్కార్య ములఁ జూచియుఁ జూడనట్లుండిరి. మహారాజు మంత్రులు సరదారుల జోలికిఁ బోయినచో శిస్తు కొంచెమైనఁ జేఁ జిక్కదని భయపడి యూరకుండ వలసిన వారైరి. ఆస్థితిఁజూచి మాధవరావు సహింపలేక యేమైనను సరే యాదౌర్జన్య మణపఁదలఁచు కొనెను. కాని సరదా రులు వానికిఁ లోఁబడుటకు సామాన్యులు కారు. వారు మహారాష్ట్రి లు. భుజబలము, టక్కరితనము గల ప్రవీణులు. వారిని లోఁబరచు కొనుటకు మాధవరావు కొన్ని క్రొత్తచట్టములఁ జేసెను. కాని వా రు లొంగక యిండియా సెక్రిటెరి కప్పీలుచేసియుఁ గుటిలుఁ పన్ని యుఁ జాల తొందర కలిగించిరి, అప్పుడు మాధవరావు ధైర్యముఁ

బూని కొందఱుసరదారులను దేశమునుండి యావలకుఁ బంపి కొంద ఱిని బెదిరించి కొందఱిని బ్రతిమాలి దేశము మంచిస్థితిలోఁ బెట్టి జనుల దురవస్థఁ దొలఁగించెను.

ఈసంస్థానమం దుండిన సరదారులు మహారాజునెడ నెట్లు నడ చుకొనవలయునో సంస్థానమునం దెంతయధికారము గలిగియుండవల యునో మొదటినుండియు సరిగా నేర్పాటు చేయఁబడలేదు. సరదా రులు మహారాజు కోరినప్పుడు యథాశక్తిగా సైన్యమునుగానిధనము నుగాని సమర్పింప వలయునని యొకవిధముగా నేర్పాటు కలదు. విశే షించి వారలేఁటేఁటఁ గొంత శిస్తుఁగూడ నీయవలయును. సంస్థాన ప్రభుత్వము బలహీనముగా నుండుటఁజేసి యాసరదారులు తామీా యవలసిన సొత్తు నీయక జమీానులను స్వేచ్ఛగా ననుభవించుచు నిరం కుశాధికారులై యెవరిమాట వినక సంస్థానమునకుఁ గంటకులై యుం డిరి. వారి నడఁపకపోయిన పక్షమున సంస్థానమునకు క్షేమములేదని మాధవరావు తెలిసికొని యాపనిఁ బూనెను. కాని యది సులభసా ధ్యము గాదు. వారి భూముల నూడదీసికొనుట యధర్మము. ఊడఁ దీసికొనక పోయినచో వారు లోఁబడరు. అందుచేత మాధవరావు ప్రాఁత లెక్కల వెతికించి ప్రతిసరదారు సంస్థానమున కీయవలసిన ప్రాఁతబాకీ నిమ్మని బలవంతముపెట్టెను. అది యిచ్చుకొనలేక కొం దఱు తమ భూముల వదలుకొనిరి. కొందఱు తమ జమీానులు సంస్థా నమునకే యమ్మిరి. ఎందుకు నొడంబడక ప్రతిఘటించిన సరదారుల ను మాధవరావు బలిమిని బట్టించి కాశీమొదలగు పట్టణములకు బంపించి, దేశము నిష్కంటకము చేసెను. అంతతో సరదారుల బాధ కొంతవఱకుఁ దొలఁగెను. ఇదిగాక మాధవరా వెక్కవలసిన కష్టపుగట్టు మఱొకటి యుండెను. అది సైన్యసంబంధమైనది. సంస్థా నములో నిరర్థకముగ గొంతసేన యుండెను. ఈసేనకగు కర్చు లెక్క

వ, వారివలనగుపని తక్కువ. పనులటుండఁగా సైనికు లాయుధపాణు లై యెక్కడికిఁ బోయిన నక్కడ జనులను బలు బాములఁ బెట్టుచుం డిరి. మాధవరావు వ్యర్థమగు సైన్యవ్యయము తగ్గింపఁ దలఁచి యాపటాలములను విడగొట్టి సేనాపతులకుఁ దక్కిన సైనికులకు సం స్థానములో నితరోద్యోగము లిచ్చెను. ఇవియే గాక మాధవరావు మఱియు ననేక కార్యములుచేసెను. ప్రజలకు భారముగనుండు పన్ను లు తీసివేసెను. పాఠశాలలు స్థాపించెను. కోటుకలు బెట్టించెను. ము రికి సందులలోనున్న యిండ్లు పడగొట్టించి వీథులు వెడల్పు చేయించి మంచియిండ్లుగట్టించెను. పట్టణమునకలంకారముగనుండుగొప్ప మేడలు భవనములు గట్టించెను. సంస్థానములో గొప్ప యుద్యోగమునకుఁదగిన సమర్థులు లేనందున మాధవరావు సమర్థులను బొంబాయి నుండి చెన్న పట్టణము నుండి పిలిపించెను. ప్రజలకు భారము లేకుండగనే శిస్తులు మునుపటికంటె హెచ్చెను. సమర్థులు దొరకుటకును దొరకినవారికి లంచముల మీఁదికి బుద్ధి పోకుండుటకును మాధవరా వుద్యోగస్థుల జీతములు హెచ్చించి ప్రతిమాసమునందు సరిగానిప్పించుచువచ్చెను. ఈయన మంత్రిగానున్నపుడె ప్రస్తుతము హిందూదేశ చక్రవర్తి గా నున్న ఎడ్వర్డురాజుగారు యువరాజుగానుండి హిందూస్థానము సందర్శింపవచ్చి బరోడాకుఁ బోయి మాధవరావుచేత సత్కృతుఁడై చాల సంతసించెను.

అతఁడెన్ని మార్పులజేసినను మునుపటివాని నాధారముగా నుంచుకొనియే చేసెను. కాని వెనుకటి వన్నియు నిర్మూలించి క్రొత్త పద్ధతి పెట్టలేదు. వెనుక మైసూరు సంస్థానములో దివానుపనిచేసిన పూర్ణయ్యయను మహామంత్రివంటి బుద్ధికుశలతమాధవరావునొద్ద లే కపోయినను నితఁడు పూర్ణయ్యకంటె స్థిరమనస్కుఁడు సత్ప్రవర్త కుఁడు నని చాలమంది తెల్లవా రభిప్రాయపడిరి. హిందూదేశ ధనా

దాయ విషయమున నింగ్లాండులో నొకసభవారి యెదుట సాక్ష్య మిచ్చుటకు మాధవరావుగారి నాదేశమువెళ్లుమని యప్పటిగవర్నరు జనరలుగా రాయనపేరవ్రాసిరి. కాని మాధవరావు విదేశయాత్ర తన మతమొప్పదని మానుకొనెను.

1877 వ సంవత్సరము ఢిల్లీలో జరిగిన దర్బారునకు సగౌరవముగ బిలువఁబడి మాధవరావు తన చిన్నరాజును వెంటబెట్టుకొని పోయెను. అక్కడ మాధవరావునకు విశేష గౌరవము జరిగెను. అప్పుడే గవర్నరుజనరల్ లిట్టను ప్రభువు వానికి రాజా బిరుద మిచ్చెను. మాధవరావు తన యాలోచన చెప్పుటకు రెసిడెంటు మఱికొందఱు గొప్ప యుద్యోగస్థులు గల యొక సభ నిర్మించి దాని యాలోచనముం బట్టి నడుచు చుండెను. చిన్నరాజునకు విద్య నేర్పుటకు బొంబాయినుండి యీలియెట్టను నొక తెల్లవానిని పిలిపించి శ్రద్ధతో విద్య చెప్పించుట యెగాక విద్యాభివృద్ధినిగూర్చి స్వయముగాఁ గనుగొనుచువచ్చెను. 1882 వ సంవత్సరమునఁ నాచిన్నరాజునకు యుక్తవయస్సు వచ్చినందున నింగ్లీషువారు వాని నాసంవత్సరమే సింహాసన మెక్కించిరి. గద్దె యెక్కినతోడనే మహారాజునకు మంత్రికి మనస్పర్థలుపుట్టెను. అందుచేత మాధవరావు 1882 వ సంవత్సరమున సెప్టెంబరునెలలో నుద్యోగము మానుకొనెను. బరోడా మహారాజు మంత్రి తనయొద్ద నుద్యోగము మాని పోవునపుడు మూడులక్షలరూపాయలు బహుమాన మిచ్చెను. ఇట్లు మాధవరావు యొక్క చరిత్రలో రెండవ యధ్యాయ మముగిసెను.

అనంతరము మాధవరావు రాజ్యవ్యాపార విహీనుఁడై చులుకనగు హృదయముతోఁ దనజీవిత శేషమును జెన్నపట్టణమునఁ గడపెను. ఆయన కాంగ్లేయులలోను స్వదేశస్థులలోను మిత్రు లనేకులుండినందున నిర్వ్యాపారజీవనము భారమనిపింపలేదు. అప్పటికి రాజకీ

యవ్యవహారములలో వాని కభిరుచి విశేషముగ నుండెను. ఇంగ్లాండు పత్రికలు, స్వదేశపత్రికలు చాల దెప్పించి యితఁడు చదువు చుండెను. ఆదినములలో నతనికి సంఘసంస్కరణమునం దభిమానము కలిగెను. అతిబాల్య వివాహమువలన కలుఁగు నష్టములఁ దొలగింపవలెనని యతని ముఖ్య సంకల్పము. తక్కిన సంస్కరణములలోఁగూడ మన ము శాస్త్రములనేబట్టి పోఁగూడదనియు శాస్త్రములే కొన్నిస్థలముల లోమార్పు చేయఁబడఁదగియున్నవనియు నతఁ డభిప్రాయపడెను. అట్లభిప్రాయపడియు మాధవరావు సంస్కరణము వేగిరపడక జాగ రూకతతో జేయవలెనను తలంపుగలవాఁడు. పూర్వాచారములు నాశనముచేయఁ గూడదనియు వానిని చక్కఁగామార్చుకొని యన లంబింపవలయుననియు నతఁడు జెప్పుచువచ్చెను.

1885 వ సంవత్సరమందు చెన్నపట్టణపు గవర్నరగు గ్రాండు డఫ్ప్రభువు కోరికమీఁద మాధవరావు మలబారు నేలపన్ను విష యమున నేర్పడిన సభ కగ్రపీఠస్థుఁడై దొరతనమువారికి సాయము జేసెను. 1887 వ సంవత్సరమున గవర్నరగు కానిమరా ప్రభువు శా స్త్రబ్రహ్మచారులకు శాస్త్ర పండితులకు హితోపదేశము చేయుటకు మాధవరావును నియోగించెను. అప్పుడాయన యిచ్చిన యుపన్యాస మువలన దక్షిణహిందూస్థాన మంతను వెలిగించిన యాతని జ్ఞానజ్యో తియొక్క తేజస్సు నెల్లవారు జూడఁగలిగిరి. 1887 వ సంవత్సరమున నేషనల్ కాంగ్రెస్సనఁబడు దేశీయ మహాసభ చెన్నపట్టణమునం గూ డెను. మాధవరావు దాని సన్మాన సంఘమున కగ్రాసనాధిపతియై కార్యనిర్వాహము జేయుటయే గాక దేశీయసభతో గవర్నరుల యొక్కయు, గవర్నరుజనరల్‌యొక్కయు నాలోచనసభలు పెద్దవి చేయవలయునని చక్కగా ముచ్చటించెను. మాధవరావు తన జీవిత కాలములో గడపటి నాలుగైదేండ్లు హెర్పట్ట

స్పెన్సరను మహాతత్వవేత్తయొక్క గ్రంథమునుజదివిసాంఘిక రాజకీయ విషయములలో వానిమతమే మంచిదనియనుసరించుచువచ్చెను. ఇట్లు చదువుటతో తనివినొందక యతఁడుచెన్నపురమందలివార్తాపత్రికలకు తఱచుగా వ్యాసములు వ్రాసి పంపుచువచ్చెను. ఆకాలమం దాయన వ్రాతలకు మిక్కిలి గౌరవముండుటచే బత్రికాధిపతులు వానిలేఖలను గన్నుల నద్దుకొని గ్రహించుచువచ్చిరి. ఇప్పుడే కాదు. మాధవరావుద్యోగములో నున్నప్పుడుసయితము మెట్లోతీరికచేసికొని పత్రికల కుపయుక్తమయిన సంగతులువ్రాసి పంపుచువచ్చెను. 1875వ సంవత్సరమం దీయన శుక్రగ్రహ సంచారమునుగురించియుపన్యాసముఁవ్రాయ దాని జదివి పశ్చిమఖండ జ్యోతిశ్శాస్త్రజ్ఞులు స్వదేశదైవజ్ఞులు వాని ఖగోళశాస్త్రపాండిత్యమున కిచ్చెరు వడిరి.

1888 వ సంవత్సరమున గవర్నరు జనరలగు డఫిన్‌ప్రభువుతన యాలోచనసభలో మాధవరావు నొకసభ్యుఁడుగనుండుమనికోరెను. మాధవరావు వయస్సుముదిరినకారణమునదానికొప్పుకొనలేదు. 1889వ సంవత్సరమున మాధవరావు స్వదేశబాలురకువిద్యనేర్పువిధమనుపేరు పెట్టి యొకచిన్నపుస్తకమునువ్రాసెను. అది మన బాలురకు మిక్కిలి యుపయుక్తమయినది. ఆచిన్నపుస్తకమిప్పటికిద్రావిడమహారాష్ట్రమళ యాళభాషలలోనికిఁదర్జుమా జేయఁబడినది. ఆసంవత్సరమందే యితఁడు జర్మనీవారి యాఫ్రికాఖండాక్రమణమునుగూర్చి యొక చిన్నవ్యాసమువ్రాసిజర్మనీరాష్ట్రమంత్రియగు బిస్‌మార్కుప్రభువునకుఁ బంపెను. బిస్మార్కువ్యాసములోనున్నవిశేషాంశమునుగ్రహించిసంతసించి స్వహస్తముతో మాధవరావునకుస్తోత్రపూర్వకముగా నొకజాబువ్రాసి యావ్యాసమును జర్మనీభాషలోనికి తర్జుమాచేయించి ప్రతిసిపాయికిఁ బంచిపెట్టించెను.

మాధవరావు స్వభాషయగు మహారాష్ట్రమందుజాలగ్రుషిచేసి

కవిత్వముచెప్ప నేర్చెను. ఆభాషలోనున్న కవిత్వము కఠినపదములు లేక స్త్రీలకు బాలురకు నుపయుక్తముగ నుండును.

సిండు యవ్వనమున మాధవరావు తిరువాన్కూరుబరోడాసంస్థానములనుగూర్చి మిక్కిలి కష్టపడుటచేత వాని దేహస్థితిత్వరలోచెడిపోయెను. అతనికి 1890 వ సంవత్సరం డిశెంబరు 22 వతారీఖున పక్షవాతము ప్రవేశించెను. ఆరోగముచే నతఁడు రమారమిమూడుమాసములు తీసికొని 1891 వ సంవత్సర మేప్రియలునాలుగవతారీఖునగాలధర్మము నొందెను. ఇంగ్లాండులో హిందూదేశములో నఖండఖ్యాతిని సంపాదించినయీమహాత్మునిగూర్చి వేరువ్రాయవలసిన దేమియు లేదు హిందూదేశస్థులు దేశపరిపాలనమునకుఁబనికి రారని తెల్లవారుపలికెడు పలుకులు వట్టిబూటకములనియీయనచరిత్రమువలన దెలిసికొనవచ్చును. హిందూదేశమునకు గవర్నరుజనరలుగా మాధవరావునియోగింపఁబడిన పక్షమున నీతెల్లగవర్నరుజనరలులలోననేకులకంటెమిక్కిలి చక్కగాఁ బరిపాలనముఁ జేసియుండును. అతఁడుసంపాదించినధనములో నొకగవ్వయయిన నన్యాయార్జితములేదు. చిన్ననాట నుండియు నతఁడు మహోన్నతపదవులలో నుండుటంబట్టి యతఁడు కొంచెము బెట్టుసరిగ నుండునట్లగపడుచువచ్చెను. కాని చూడవచ్చినవానిని గౌరవించుట కలసి మెలసి మాటాడుటమొదలగుగుణముల కేలోటులేదు. చిత్తరువులను వ్రాయించుట వ్రాసిన వానిని దెప్పించితనమందిరమున నుంచుకొనుట వానికి మిక్కిలి యిష్టము. మతసంబంధములగువ్యాసంగములలోఁ గాలమువిస్తారము గడపుట వాని కిష్టములేదు. మనుష్యులు సత్ప్రవర్తన గలిగియుండి సుందరమయిన యీప్రపంచమందుభగవంతుడిచ్చినపదార్థముల జూచి యానందించిన చాలుననివానియభిప్రాయము. జ్యోతిశ్శాస్త్రమందు మాధవరావుచాలకృషిచేసిసిద్ధాంతభాగ మొకటే నమ్మదగినదికాని, జాతక ముహూర్తభాగములునమ్మదగినవి కావని యభిప్రాయపడి తన యభిప్రాయమును లోకమునకు వెల్లడించెను. రాజా సర్ మాధవరావు భరతఖండమాతకన్నపుత్రరత్నములలో సమూల్యమణి యని చెప్పవచ్చును.

# సర్ తిరువఱ్ఱూరు ముత్తుస్వామి అయ్యరు

తిరువఱూరు ముత్తుస్వామి అయ్యరుగారు తంజావూరుజిల్లాలోని ఉచువడి గ్రామములో 1832 వ సం॥రం జనవరి 28 వ తారీఖున నొక బీదబ్రాహ్మణకుటుంబమున జన్మించెను. ఆతనిదురదృష్టముచేత దండ్రియగువెంకటనారాయణశాస్త్రి స్వల్పకాలములోనే మృతినొందుటచే బాలకుని బెంచుభారమంతయు నిరాధారయగుతల్లి మీఁదబడెను. అప్పటికి ముత్తుస్వామి కొకతమ్ముఁడుగూడ నుండెను. తల్లి బాలకులనిరువురిఁ దోడ్కొని తిరువఱూరు గ్రామమునకుఁబోయి విద్యాభ్యాసము చేయింపసాగెను. అక్కడబడిలో బాలకులిద్దఱు స్వల్పముగనఱవము నేర్చికొనిరి. ఆచదువైనఁ జాలకాలము చెప్పించుటకుఁదల్లికిశక్తి లేనందున ముత్తుస్వామి కుటుంబపోషణార్థముమిక్కిలిపిన్నవయసుననే యుద్యోగముసంపాదించుకొనవలసివచ్చెను. అందుచేత నతఁడు గ్రామకరణమువద్ద నెల కొక రూపాయ జీతముమీఁదలెక్కలువ్రాయుటకు కుదిరెను. కొడుకు సంపాదించునట్టి యాస్వల్పజీతమునైనఁ దిని బ్రతుకుటకుఁ దల్లికి ప్రాప్తములేకపోయెను. ఈచిన్నయుద్యోగమైన స్వల్పకాలములోనే యామె మృతినొందెను. ఆమె బ్రతికియున్నకాలమున కుమారునకు విద్యమీఁద నధికాసక్తి గలిగించెనఁట.ఆమెచేసిన ప్రోత్సాహము చేతనే తానంతటివాఁడయ్యెనని ముత్తుస్వామియయ్యరు పలుమా రిటీవల చెప్పుచువచ్చెను. ఆయుద్యోగమున నతఁడు పదునాలుగు వత్సరముల వయసు వచ్చువఱకుండెను. దైవముగొప్పవారు కావలసినవారిని జిరకాలము హీనస్థితిలో నుంచఁడుగదా.

1846 వ సం॥ముత్తుస్వామి తనతాలూకాతహసీలుదారగు ముత్తుస్వామినాయకన్ ననువాని ప్రాపకము గాంచెను. ఈతనికి బట్లరు

తహసీల్‌దారను పేరుగూడ గలదు. తంజావూరు కలెక్టరుగారగు మాంటుగొమరీ దొరగారికి ముత్తుస్వామినాయకన్ కొంతకాలముబట్లరుగా నుండి తరువాత తహసిల్‌దారయినందున బట్లరు తహసిల్‌దారని పేరు గలిగెను. చిన్నముత్తుస్వామి తహసిల్‌దారు ముత్తుస్వామియొక్క ప్రాపకము సంపాదించుకొనుటకు నీక్రింది కారణముచెప్పుచున్నారు.

ఒకనాఁడా తహసిల్‌దారునకుసమీపమందున్న నదిగట్టువరదచేత గండిపడినదని వర్తమానము తెలిసెను. తోడనే యతఁడుకచేరీకి బోయి దానివిషయమున గొన్ని సంగతులుకనుగొనుటకుగుమాస్తాను రమ్మని వర్తమాన మంపెను.గుమాస్తా లెవరు నప్పుడుకచేరిలో లేనందున బాలుఁడగు ముత్తుస్వామి తహసీల్‌దారుకడకుఁబోయియేమిసెలవని యడిగెను. తహసిల్‌గారు తనకు వచ్చినకాగితము ముత్తుస్వామిచేతిలోఁబెట్టి యాగండి విషయమున కొన్నిసంగతులు గావలయునని చెప్పెను. ముత్తుస్వామి తానదికనుఁగొని వత్తునని చెప్పి తత్క్షణమేయా నదియొడ్డునకుఁబోయి గండి కొలుచుకొనిదానినిపూడ్చుటకుఁగావలసిన మట్టి మొదలగునవి యెంతకావలయునో తెలిసికొనిమరలతహసిల్‌దారునొద్దకువచ్చెను. తహసిల్‌దారు మొట్టమొదట ముత్తుస్వామికట్టిన లెక్క నమ్మఁదగిన కిష్టములేనివాఁడయ్యు నవసరమున నతఁడువ్రాసినకాగితముమీఁద వ్రాలుచేసిపంపెను. పంపి యాతహసిల్‌దారుముత్తుస్వామి వ్రాసినలెక్క సరియగునో కాదో తెలిసికొనుటకు తన హెడ్‌గుమాస్తానుగండియొద్దకుపంపెను. అతఁడదిచూచివచ్చి ముత్తుస్వామివ్రాసినలెక్క సరిగానున్నదనిచెప్పెను. మఱియొకనాఁడుమిరాశీదారుఁడొకఁడు తహసిల్‌దారు కడకుఁబోయితానుసర్కారుకీయవలసినపన్నెంతయని యడిగెను. ఆతని నిరువదియూళ్లలో భూములుండుటచేత తహసిల్‌దారు వెంటనే వానిప్రశ్న కుత్తరము చెప్పుటకువీలులేక లెక్కలు చూడవలయునని చెప్పి దాపున నిలువబడియున్నముత్తుస్వామినిజూచి

యావిషయమున నీవేమైననెఱుఁగుదువాయనియడిగెను. ముత్తుస్వామి యేలెక్కలు చూడకయే మిరాశీదారుఁ డీయవలసిన పన్నుమొత్తము చెప్పెను. తహసిల్దారుఁడది సరియగునో కాదో యని ఋజువు చూపించి సరియేయని గ్రహించెను.

పైనుదాహరింపఁబడిన రెండుసంగతులం బట్టి ముత్తుస్వామి యద్భుతమగు బుద్ధి సామర్థ్యము గలవాఁడని తహసిల్దారు గ్రహించెను. ఈకాలమున ముత్తుస్వామి తహసీల్దారు కచ్చేరీలో ను మేజువారుగా నుండెనని తోఁచుచున్నది. ముత్తుస్వామి తన తెలివికిఁ దగని యీయుద్యోగముతోఁ దనివినొందక యాగ్రామమున చొక్క లింగమను నతఁడు పెట్టినబడికి మధ్యాహ్నము పదునొకండు గంటలు మొదలు రెండుగంటలవఱకుఁ దనకు పనిలేనుగావున నాసమయమున నక్కడకుఁబోవుచు, పోయి యూరకొనక యింగ్లీషక్షరముల నేర్చుకొనెను. పాపమతనికి రాజభాషయగు నింగ్లీషు చదువుకొనవలె నని కుతూహలముండెఁ గాని స్థితిగతులు బాగు లేక పోవుటచే నట్లు చేయుటకు వీలు లేకపోయెను. తహసిల్దారునకు మేనల్లుఁ డొకఁడుం డెను. అతని నెట్లయిన బాగుచేయవలెనని మేనమామ వానికి స్వయముగాఁ జదువుచెప్ప నారంభించి ముత్తుస్వామినిగూడ వానితోఁజేర్చి యిరువురకు నింగ్లీషు మొదటిపాఠపుస్తకము చెప్పెను. పుస్తకము ముగిసిన పిదప తహసిల్దారు వారి నిరువురఁ బరీక్షింపఁదలఁచి యొక వారము గడుపిచ్చి గడువులోపల పుస్తకమంతయుఁ జదువుఁడని వారి కానతిచ్చెను. వారము గడచినపిదప తహసిల్దారు పరీక్షించు నప్ప టికి బ్రాహ్మణ బాలుఁడు గ్రంథము సమగ్రమముగ నప్పగించెను. తహసిల్దారు మేనల్లుఁడు కొన్నిపుటలు మాత్రమె చదువఁగలిగెను. బ్రాహ్మణబాలుని బుద్ధికుశలత కచ్చెరువడి తహసిల్దారు వానిని జదివించి వృద్ధికిఁ దేవలయునని నిశ్చయించుకొని నాగపట్టణము మి

షను స్కూలులోఁ జదువుకొనుట కిష్టపడుదువా యని ముత్తుస్వామి నడిగెను. అందుకు ముత్తుస్వామి సమ్మతించినందున తహసిల్దారు వానిని నాగపట్టణము పంపించి బడిలోఁ బ్రవేశపెట్టించి వానికిసంరక్షకుఁడుగ నాగపట్టణములోనున్న తన తమ్మునే నియమించెను. ముత్తుస్వామి నాగపట్టణములోఁ బదునెనిమిది మాసములు చదివి యాకాలములోఁ దన్నుగుఱించి యందఱకు మంచియభిప్రాయము కలిగించెను. అందుచేత దయాళువగు తహసిల్దారు ముత్తుస్వామిని విద్యాభ్యాసమునిమిత్తము చెన్నపట్టణము హైస్కూలున కంపెను. అప్పటికి రాజామాధవరావుగారు విద్యాభ్యాసము ముగించి యాపాఠశాలలోనే యుపాధ్యాయుఁడుగ నుండెను. వెనుక తంజావూరు కలెక్టరుగానుండిన మాంటుగొమరీ దొరగారుఁ గూడ గొప్ప యుద్యోగముమీఁద జెన్నపట్టణములో నుండిరి. బట్లరు తహసిల్దారు మాధవరావుగారి కిమ్మని యొక యుత్తరమిచ్చి ముత్తుస్వామిని జెన్నపట్టణమంపినందున మాధవరావుగా రాయుత్తరము జూచుకొని బాలుఁడగు ముత్తుస్వామియం దభిమానముగలిగి శ్రద్ధతో విద్యాభ్యాసము చేయింపఁదొడఁగెను. మాంటుగొమరీదొరగారు తంజావూరుజిల్లా జనులమీఁద మహాభిమానము గలవాఁడగుటచే నాజిల్లానుండివచ్చి చెన్నపట్టణమునఁ జదువుకొను బాలురక్షేమము స్వయముగాఁగనుగొనుచు వచ్చెను. ముత్తుస్వామియుఁ దంజావూరువాఁడగుటచే దొరగారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను. ఆయిరువుర దక్షతలోనుండి ముత్తుస్వామి యద్భుతముగ విద్యాభ్యాసము చేసెను.

అప్పుడు చెన్నపట్టణము హైస్కూలునకు పవెలుగారు ప్రథమోపాధ్యాయులై యుండిరి. దక్షిణ హిందూస్థానమునకు విద్యావిషయమున నితఁడు చాల యుపకారముచేసెను. ఆయన శిష్యుఁడైన ముత్తుస్వామి దినదినాభివృద్ధినొంది యేఁటేఁట బహుమానములను

విద్యార్థి వేతనములను బడయుచు వచ్చెను. వానిబుద్ధి గణితశాస్త్ర మునందు మిక్కిలి ప్రవేశించెను. అందులో జ్యోతిశ్శాస్త్రమునందు వానికి మహాభిమానము. విద్యార్థులకు నుపాధ్యాయులకు నీదినము లలో నుండెడి పరస్పర సంబంధములకంటె నాదినములలో సంబంధమెక్కుడుగ నుండెను. ఈకాలమున విద్యార్థులు పాఠశాలలో నున్నంతసేపేకాని యవ్వల నుపాధ్యాయులను దఱచుగ కలిసికొనరు. ఆకాలమున నట్లుగాదు. పవెలుగారు పాఠశాలలో నోడలు దాచుకొనక యెంతో శ్రమపడి బాలురకు విద్యజెప్పుటయె గాక శిష్యుల నింటికి దీసికొనిపోయి వారికిఁ గావలసిన శాస్త్రములు చెప్పుచు వచ్చెను. ముత్తుస్వామి మిక్కిలి చదువు తమకముగలవాఁడగుటచే బలుమారు పవెలుగారి యింటికిఁబోయి రాత్రి తొమ్మిదిగంటలవఱకు జ్యోతిశ్శాస్త్రము మొదలగునవి నేర్చికొనుచు వచ్చెను. చీఁకటి రాత్రిలలో శిష్యుఁడొక్కఁడు గృహమునకుఁ బోలేఁడని పవెలుగారు ముత్తుస్వామిని దనబండిమీఁద నెక్కించుకొని వాని నింటికితీసుకొని పోయిదిగవిడుచుచుండును. తనశిష్యుఁడు ప్రతినెలకు వ్యయముచేయు సొమ్ము సరిగా వ్యయముచేయుచున్నాఁడో లేదోయని వానిలెక్కలు సయితము మాదొర నెలనెలకుఁ జూచుచు వచ్చెనఁట. ముత్తుస్వామి బుద్ధిసూక్ష్మతకుఁ దోడుగ మిక్కిలి పాటుపడుచు వచ్చినందున నెన్నో బహుమానములఁ బడసెను.

1856 వ సంవత్సరమున విద్యాధికారు లింగ్లీషులో మంచి వ్యాసము వ్రాసిన వానికి నైదువందల రూపాయలు బహుమానమిచ్చుటకుఁ బ్రతిజ్ఞచేసిరి. చెన్నపురిరాజధానిలోనున్న విద్యార్థులందఱు దానికిఁ బ్రయత్నింపవచ్చునని వారుసెలవిచ్చిరి. అప్పుడనేకులు వ్యాసములు వ్రాసిరి. అప్పుడు బహుమానము ముత్తుస్వామికే వచ్చెను. ఆవ్యాసములో వ్రాసినవిషయము, "మనజాతిలోఁగల దుర్గుణ

ములు, వానినిసవరించుకొనవలసిన విధములు." అతఁడు వ్రాసిన వ్యాసమును బరీక్షించినవారిలో నప్పుడు హైకోర్టు జడ్జీగానుండిన హాలోవేగారొకరు. ఆయన ముత్తుస్వామి వ్రాసిన యావ్యాసమును మిక్కిలి మెచ్చెను. బహుమాన ధనముగు నైదువందల రూపాయల ధనమొత్తము ముత్తుస్వామి కిచ్చునప్పుడు పవెలుగారీకింది విధముగఁ బలికిరి. "ఈరూపాయలు నీవు ముందుముందదృష్టవంతుఁడవై సంపాదించు ధనరాసులకు విత్తనములై యుండుఁగాక" ముత్తుస్వామి యారూపాయలను మిక్కిలిజాగ్రత్తగా దాఁచి మృతినొందువఱకు నెన్నఁడు నందులో నొకరూపాయయైనఁ దీసి వాడుకొనలేదు. అప్పుడు దొరతనమువారు ముత్తుస్వామిపేరు గెజటీలో బ్రకటించి యతఁడేయుద్యోగమునకైనఁ దగినవాఁడని వ్రాసిరి. శిష్యుని వైదుష్యముఁ జక్కఁగ నెఱింగి పవెలుగారు వాని నింగ్లాండు పోయి సివిలు సర్వీసు పరీక్షకుఁ జదువుకొమ్మని పురికొల్పిరి. అందఱు విద్యార్థులవలెనే ముత్తుస్వామియు నప్పటికి వివాహమాడి కాలిసంకెళ్ళు తగిలించుకొన్నందున సముద్రయానమువలన వర్ణభ్రష్టత గలుగునను భయమునను దేశమువిడిచి బోవడయ్యె. అందుచే విద్య ముగిసినతోడనే ముత్తుస్వామి యఱువది రూపాయల జీతముమీఁద నుపాధ్యాయుఁడయ్యెను. అందులోనుండఁగా మాంటుగొమనీగారు తంజావూరు కలక్టరు కచేరీలో వానికి రికార్డుకీపరుపని యిచ్చిరి. అందులోనుండగా నప్పటివిద్యాధికారి (డైరక్టరు) యగు నర్బతునాటుగారు వానిని డిపూ్యటీఇన్స్పెక్టరు (పాఠశాలపరీక్షకుఁడు) గా నియమించిరి. ఈయుద్యోగమున నెలకు నూటయేబదిరూపాయలు జీతము. కాని ముత్తుస్వామి యయ్యుద్యోగ చిరకాల మందుండ లేదు. ఏల యన నాకాలమున గవర్నమెంటువారు ప్లీడరుపరీక్షం గ్రొత్తగఁబెట్టిరి. అందుఁ గృతార్థులైన వారు చెన్నపట్టణపు సాదరుకోర్టులో తక్కిన యన్ని జిల్లాకోర్టు

లలోను బనిచేయుటకు యోగ్యులని ప్రకటించినందున ముత్తుస్వామి యాపరీక్షకుఁజదివెను.ఆసంవత్సరముపరీక్ష కుంభకోణములోజరిగెను.అనేకులు పరీక్షకువచ్చిరి. అందులో ముత్తుస్వామి యయ్యరు మొదటివాఁడుగఁ గృతార్థుఁడయ్యెను. రెండవయుత్తముఁడుగ దివాను బహద్దరు రఘునాథరావు కృతార్థుఁ డయ్యెను.

అప్పటి ప్లీడరుపరీక్ష యిప్పటివలెఁగాదు. ఆకాలమునఁ బరీక్షితులు (పరీక్షకు వచ్చినవారు) కోర్టులోనుండి తెచ్చిన పాతరికార్డు నెవరోయొకరుచదువఁగా విని తామువిన్న యాసంగతులంబట్టి యావ్యాజ్యములోనొకతీర్పు నక్కడనే వ్రాయవలయును. కుంభకోణములోజరిగినయాపరీక్షకును తంజావూరుజిల్లా జడ్జీ స్వయముగా వచ్చి నడపి పరీక్షితులు తీర్పు వ్రాయవలసిన విషయమున నొక పాతవ్యాజ్యము రికార్డు దెప్పించి యది చదువుమని సిరస్తదారున కాజ్ఞాపించెను. సిరస్తదారుమిక్కిలివడివడిగాఁజదివినందునముత్తుస్వామివిస్పష్టముగాజదువుమని వానితో ఘర్షణముపడెను. జడ్జీ యదివిని సిరస్తాదారును మెల్లగాఁ జదువుమని మందలించి తానుగూడ పరీక్షింపఁబడవచ్చినవారిలో నొకఁడుగా భావించుకొని బల్లదగ్గఱ గూర్చుండి సిరస్తాదారు చదివిన యంశమునకు తానుగూడ నొకతీర్పు వ్రాయ సమకట్టెను. ఆయంశములమీఁద ముత్తుస్వామియయ్యరు, వ్రాసినతీర్పు జడ్జీవ్రాసినతీర్పు సరిగానుండెను.

ఆతని శాస్త్రజ్ఞానమునకుమెచ్చియాజడ్జిస్వల్పకాలములో నేముత్తుస్వామి యయ్యరును టాంక్వెబారుపట్టణములో డిస్ట్రిక్టుమునసబుగా నియమించెను. ఆయుద్యోగములో ముత్తుస్వామి యయ్యరు చూపిన బుద్ధికుశలత నెల్లవారు మెచ్చి పొగడిరి. ఆజడ్జీ యొకసారి యామునసబుగారికచ్చేరి యాకస్మికముగా బరిక్షింపవలెననితన రాకవానికిఁ దెలియఁబఱచకుండ ట్రాంక్వెబారునకు బోయెను. ఆతని రాకఁ విని మునసబు

వాని దరిశనముచేసి తనకోర్టుశోధింని పరిక్షింపవలయుననియుఁ దాను వ్యాజ్యమును విచారణ చేయుచుండఁగా దగ్గరకూర్చుండివినవలయునని యు నధికారిని గోరెను. అతనికోరికప్రికారము జడ్జీ కోర్టు పరీక్షించి వాని ప్రక్కనుగూర్చుండి వ్యాజ్యములవిచారణవిని చాలసంతోషించి తంజావూరువెళ్ళి ముత్తుస్వామియయ్యరు తనతోసమానముగాజడ్జీపని చేయదగినవాఁడనియు వాని తెలివి యసాధారణమైనదనియువాసెను.

ముత్తుస్వామియయ్యరు చిరకాలమాయుద్యోగమునం దుండలేదు. ఆకాలమున దొరతనమువారు మనరాజధానిలోనున్న యీనాములను స్థిరపఱచి యీనాముదారులకు సర్వాధికారము నీయవలయునని యాపనిచేయుట కీనాముకమీషనరునేర్పఱచి వానికి సహాయముగాకొందఱు డిపుట్యాటికలెక్టరుల నేర్పఱచిరి. అందులో ముత్తుస్వామయ్యరొక్కరా యీనాము కమీషనులో దేశస్థులకు దన యధికారులకు సంతుష్టి కలుగునట్లు బనిచేసెను. తరువాత దొరతనమువారతనికి డిపుట్యాటికలక్టరుపని స్థిరపరచి మేజస్ట్రీటునధికారమిచ్చిరి. ఈయుద్యోగమందుండగా నొకసారి యొకగొప్ప షాహుకారు మోసముచేసినాఁడని నేరస్థుఁడుగఁజేయబడెను. అది ముత్తుస్వామియయ్యరు విచారణచేయవలసివచ్చెను. షాహుకారుపక్షమున న్యాయవాదులలో నగ్రగణ్యుఁడగు నార్టనుగారు వచ్చి పనిచేసిరి. ముత్తుస్వామియయ్యరు పదునైదుదినములు విచారణచేసి యానేరమును జిల్లాజడ్జీగారు విచారణచేయవలసినదని యాకోర్టునకుబంపెను. నార్టనుగారుచెన్నపట్టణమునకుఁబోయి తనమిత్రుఁడు హైకోర్టుజడ్జీయునగు హాలోవేగారిని గలుసుకొని ముత్తుస్వామియయ్యరువంటి మేధావంతుని రివిన్యూవ్యవహారములలో నిలుపుటచే వాని తెలివి వ్యర్థమగుచున్నదని చెప్పెను.

ఆకాలమున దక్షిణకన్నడపు జిల్లాలో ధర్మశాస్త్రములోజక్కనిప్రవేశముగల సబుజడ్జీయొకఁడు కావలసివచ్చెను. ఆయుద్యోగము

నకు ముత్తుస్వామియయ్యరుకంటె దగినవాఁడు లేఁడని దొరతనమువా రతనినే నియమించిరి. ఈయుద్యోగము మూడేండ్లుచేసినపిదప 1868వ సంవత్సరమునదొరతనమువారుముత్తుస్వామినిఁజెన్నపట్టణమున పోలిసుమేజస్ట్రీటుగా(ప్రెసిడెన్సీ మేజస్ట్రీటుగా)నియమించిరి.ముత్తుస్వామియయ్యరువద్దనున్నముఖ్యగుణమేమనగానతఁడుభయముగానిపక్షపాతముగాని లేకశ్రద్ధాళువై తనవిధికృత్యములఁదీర్చుచువచ్చెను. దీనికుదాహరణముగా నొకకథగలదు. ఒకహిందువుఁడు హైకోర్టుజడ్జీలలో నొకని గృహావరణములోఁ బ్రవేశించినాఁడని యాజడ్జివానిందిట్టముగఁగొట్టెను. ఆహిందువుఁడు,మనయయ్యరుగారియొద్ద నాజడ్జీమీఁద నభియోగము తెచ్చెను. గొప్పవారిమీఁద నిటువంటియభియోగములు వచ్చినప్పుడధికారులు ముందుగా వారికి సమనులుచేయక "మీకుసమను లేల చేయఁగూడదో తెలియఁజేయుఁ"డని ముందుగా వ్రాయుదురు. అయ్య రట్టిపని చేయక యాజడ్జీగారికి ముందుగా సమనుచేసెను. హైకోర్టు జడ్జీయంతవానినంత స్వల్పనేరముమీఁదఁ దనకోర్టుకురప్పించుటభావ్యముగాదని తనపైయధికారి హితోపదేశము చేసినను వినక యయ్యరువానినిఁ దనయెదుటకు రప్పించుటయేగాక నేరస్థునిజేసిమూఁడురూపాయలు ధనదండన విధించెను. ఈయుద్యోగమునందున్నపుడేముత్తుస్వామియయ్యరు బి యల్ పరీక్షకుఁజదివి యందు మొదటితరగతిలోఁ గృతార్థుఁడయ్యెను.

అనంతరముదొరతనమువారు ముత్తుస్వామియయ్యరునుస్మాలుకాజుకోర్టు జడ్జిగా నియమించిరి. ఈపదవిలోనుండి యాయన దొరతనమువారికిఁగలుగజేసిన సంతుష్టి యింతింత యనరాదు. అప్పుడుగవర్నరుగానుండిన సర్ అలగ్జాండరు అర్బతునాటుముత్తుస్వామియయ్యరునకు తంజావూరుజిల్లా జడ్జీపని నీయఁదలంచెను. కానికలకత్తాలోఁజెన్నపట్టణములోనుండిన తెల్లవారు వలనుపడదనిచెప్పినందునమానవలసివ

చ్చె. 1878 వ సంవత్సరమునజనవరినెలలో జరిగిన ఢిల్లీదర్బారునకుదొ రతనమువారు ముత్తుస్వామియయ్యరునాహ్వానముచేసి జ్ఞాపకార్థము గా వాని కొకపతకమును బహుమానమిచ్చిరి. ఆసంవత్సరమే వానికి సి. ఐ. యి. అనుబిరుదమునిచ్చిరి. అప్పటికి చెన్నపట్టణపు గవర్నరు గారగు బకింగుహాంప్రభువుగారు వానికాబిరుదుచిహ్నములనుస్వయ ముగానిచ్చి శ్లాఘించిరి. 1878 వ సంవత్సరమందే దొరతనమువారు ముత్తుస్వామియయ్యరును హైకోర్టుజడ్జీని చేసిరి. చెన్నపురిరాజధాని లో స్వదేశస్థులు హైకోర్టుపీఠ మెక్కుట కదియేప్రథమము. ఆగవ ర్నరుగారు ముత్తుస్వామియయ్యరునుగూర్చి యొకయుపన్యాసములో నీక్రిందివిధముగ జెప్పిరి. "ఆనరబుల్ శేషయ్యగారిని గవర్నరుజనరల్ గారియాలోచనసభలో సభికునిచేయుటయు, హానరెబుల్ ముత్తుస్వామి యయ్యరుగారిని హైకోర్టుపీఠ మెక్కించుటయు వారిని దగనిపదవిని నిల్పుటగాదు. తగనిగౌరవము చేయుటగాదు. అట్టివారనేకులు కావల యుగావున వారి నవలంబించుటకు మీరు ప్రయత్నము జేయుఁడు".

ముత్తుస్వామియయ్యరు హైకోర్టుపీఠ మెక్కినక్రొత్తలో దన సామర్థ్యము దానెఱుఁగక కార్యనిర్వహణముఁగూర్చి కొంత కాలము భయపడజొచ్చెను. ఆతనిభయమునకుఁ దోడుగ మొదటనె తెల్లవారి వ్యాజ్యమొకటి విచారణకు వచ్చెను. ఒక తెల్లవాఁడు వాగ్దానమును దప్పినాఁడని వారిమీఁద నభియోగము తేఁబడెను. ఇంగ్లీషువారి యాచారవ్యవహారము లెఱుఁగనివాఁడగుటచేఁ బ్రమాదవశమున నెట్టి గొప్పతప్పుచేసి యపనిందపాలు కావలసివచ్చునోయని భయపడి జాగ్ర త్తతో విచారణచేసి తీర్పు రెండుమూడుసారులువ్రాసి చింపివేసి మర లవ్రాసి కోర్టులోఁ జదివెను. చదివినతోడనే తెల్లవారు తీరుపుమిక్కి లియుక్తియుక్తముగానుండెనదని శ్లాఘించిరి. అదిమొదలుకొని యతని ప్రతిష్ట క్రమక్రమముగ హెచ్చెను. హైకోర్టుజడ్జీపదవికెక్కిన స్వదేశ

స్థులలో నింతవాఁడు లేఁడని యిప్పటికి జనులుచెప్పుచున్నారు. ఆయన శాంతము నిష్పక్షపాతము మేనుదాఁచని పరిశ్రమ సత్యమును గ్రహించు సూక్ష్మబుద్ధి విశేషించి ధర్మశాస్త్రజ్ఞానము వానికి శాశ్వతమైన సత్కీర్తిం దెచ్చినవి. విస్తారము బుద్ధిపరిశ్రమ గావలసినచిక్కు వ్యాజ్యములన్నియు సాధారణముగా నాతనియొద్దకే విచారణకువచ్చుచుండెడివి. న్యాయాధిపతి యొక్క కృత్యము మిక్కిలి పవిత్రమైనదని యతఁడు నమ్ముచు వచ్చెను. ఆనమ్మికనే యొకసారి కాన్వొకేషను మహాసభలో నతఁ డీక్రిందిమాటలతో వక్కాణించెను. "న్యాయస్థానము (హైకోర్టు) పవిత్రమైన దేవాలయము. అక్కడకూర్చుండు న్యాయాధిపతులు (జడ్జీలు) మనుష్యులైనను సత్యదేవతయొక్క సేవకులు. ఆపవిత్రదేవాలయమును దురాలోచనలతోను దుష్కార్యములతోను, ప్రవేశించువారు తప్పక యీశ్వరద్రోహులు దేశద్రోహులు. మీలో నెవ్వరైన నట్టిపీఠమెక్కి మీరాజుపక్షమున న్యాయము జేయవలసి వచ్చినప్పుడు దైవముఖమునుజూచి చేయుఁడు."

ఆయనతో సమానముగఁ బీఠముమీఁదఁగూర్చుండినయూరోపియను జడ్జీలు వానిని మిక్కిలిగౌరవముతోఁజూచుచు ధర్మశాస్త్రములయందు వానిని మహాధికారిగా భావించిరి. వానితీర్పులు మిక్కిలిపెద్దవిగానుండినను శాస్త్రాంశములనుసమగ్రముగాచెరిగివేయుచుండును. కోర్టులలోజరుగు వ్యవహారధర్మశాస్త్రముల సంబంధమగు గ్రంథములకు వానితీర్పులు మంచియలంకారములనిచెప్పవచ్చును. ఈప్రకారము స్వదేశస్థులయు దొరలయు మెప్పులుబడయుచు ముత్తుస్వామియయ్యరు పదునాలు సంవత్సరములు హైకోర్టు జడ్జిగనుండి యానడుమ 1893 వ సంవత్సరమం దొకసారి ప్రధానన్యాయాధిపతిత్వమునందు మూఁడుమాసములు ప్రతిష్ఠింపఁబడి యాదొరతనమువారి యేలుబడిలో స్వదేశీయుఁ డధిష్ఠింపఁదగిన మహోన్నతపదవిని బ్రాపించెను. దొర

తనమువారు వాని రాజభక్తికి మెచ్చి కె. సి. ఐ. యి. అను బిరుద మునుగూడ నిచ్చిరి. అంతటి కీర్తి తేజముతోఁ బ్రకాశించుచుండిన యాతని జీవితకాలము 1895 వ సంవత్సరము జనవరి నెలలో ముగిసెను.

ఆయన జడ్జిగా నుండుటచేత నితరలౌకిక వ్యవహారములలోఁ బ్రవేశించుటకుఁ దగిన వీలులేకపోయెను. గాని యూనివరుసిటీ యని పిలువఁబడు విద్యాపరిషత్తునందు సభికుఁడై విద్యాభివృద్ధివిషయమునఁ జాల పాటుపడుచు వచ్చెను. విద్యార్థులు బి. యే. బి. యల్. ఎం. యే. యమ్. ఎల్. మొదలగు పరీక్షలలోఁ గృతార్థులైనపిదప వానికి విద్యాపట్టము లిచ్చుటకుఁ బ్రతిసంవత్సర మొకసభ జరుపఁబడును. ఆసభపేరు "కాన్వొకేష" నంమరు. అప్పుడు విద్యాభ్యాసము ముగించిన యాశాస్త్ర బ్రహ్మచారులకు శాస్త్రాధిపతులకు రాజధాని లోనున్న గొప్పవాఁడొకఁడు హితోపదేశముచేయుట యాచారముగ నున్నది. అట్టియుపదేశ మదివఱకు తెల్లవారే చేయుచువచ్చిరి. స్వదేశస్థులనుగూడ కొందఱి నిటీవల తత్కార్యమునకు నియమింపఁబడుచు నచ్చిరి. అందు మొదటివాఁడు ముత్తుస్వామియయ్యరు. ఆతని యుపదేశము సర్వవిధముల శ్లాఘనీయముగనుండెనని యదివిన్న వారంద అభిప్రాయపడిరి. తనకు విద్యాగురువగు పవెలుగారియెడల నతఁడెంతో కృతజ్ఞుఁడై యుండెను. పవెలుగారివంటి మిత్రుఁడు హిందువులకు మఱియొకఁడు లేఁడని యతఁడు పలుమాఱు చెప్పుచు వచ్చెను. కుంభకోణముకాలేజీ ప్రధానోపాధ్యాయుఁడగు తండాళం గోపాలరావుగారి విషయమున నతఁడిట్లు చెప్పుచువచ్చెను. "నాజీవితకాలములో నేను సంపూర్ణముగా మెచ్చుకొన్న మనుష్యుఁ డితఁ డొక్కఁడే." గోపాలరావుగారి మీఁదనున్న గౌరవముతో సమానముగ రంగనాథం మొదలియారుగారిమీఁద నతనికి గౌరవముండెను.

ముత్తుస్వామియయ్యరు సంఘసంస్కారమున కేవిధమయిన

నుపకారముఁ జేయలేదని పలుమారాతని నెన్నుచుందురు. సంఘసంస్కరణము గావలయునని యతఁడభిప్రాయపడెనఁట గాని మెల్లగను జాగరూకతతోను జేయవలెనని యాయనమతము. మన విద్యార్థికులనేకులు వీరి విధముననే సంస్కరణము కావలెనని మాటలఁ జెప్పుచు నాచరణమున వెనుక దీయుచుందురు. మనదేశ స్త్రీలస్థితి యుండవలసిన విధముగా లేదనియు నెంతో మార్పుజెందవలయునని యు నతఁడభిప్రాయపడి పురుషులు తమతమ సంరక్షణమందున్న స్త్రీలకు విద్య నేర్పుచుండవలసినదని యుపదేశముచేసెను. ఆయన విదేశప్రయాణమునకు విరోధికాఁడు. ఆవిషయమున నతఁడొకసారి యిట్లు చెప్పెను. "మీలో యూరపుఖండమునకు వెళ్ళగల సామర్థ్యముగలవారు తప్పక యక్కడకుఁబోయి యచటి సంఘస్థితులు నాగరికతలు దెలిసికొని జ్ఞానాభివృద్ధిఁ జేసుకొనుఁడు."

బాల్యవివాహము కూడదని యతఁడీక్రిందివిధమునఁ జెప్పెను. "రజస్వలానంతరవివాహము కన్య కశాస్త్రీయముకాదు. అయినను సంఘమట్టిపని మహాపాతకమని యూహించి తండ్రి యొకవేళ యట్టి వివాహము చేసినయెడల కూఁతును బాధించును." స్త్రీపునర్వివాహ విషయమున నాయన యభిప్రాయమిది. 'స్త్రీ' యొక్కవివాహమునకే యనర్హురాలయ్యున్నను పురుషుఁడు బహుభార్యలు జీవించియున్నప్పుడు సయితము తన యిచ్చవచ్చినట్టు వివాహ మాడవచ్చునఁట. స్త్రీ పురుషుల స్వాతంత్ర్యములలోఁ గనఁబడుచున్న యీ యసమత్వము మన కుటుంబపద్ధతులవల్ల మఱింత బాధాకరముగా నున్నది. స్థితిగతు లిట్లుండుటచేత నభివృద్ధి పక్షమువారు మన సంఘపద్ధతి వానికాధారమయిన ధర్మశాస్త్రము క్రూరములుగ నున్నవనుట యొక యాశ్చర్యముగాదు. నీతిసంబంధము నాలోచించితిమా బాలవితంతు వివాహములు మన దేశమం దెంత యవసరములో కొలఁదికాలము

కాఁపురముచేసిన వితంతువులకు సంతతియ యవసరమని నాయభిప్రా
యము.

అట్లభిప్రాయపడియుముత్తుస్వామియయ్యరుహైకోర్టుజడ్జిగానుం
డి సంఘసంస్కరణమును ముఖ్యముగా వితంతువివాహమును వృద్ధిజే
యుటకు మారు దానికి వ్యతిరేకముగఁ దీర్పులుచెప్పెను. అట్లుచెప్పు
ట తగదని కొందఱు తన్ను నిందింప నతఁ డీక్రిందివిధముగా వారి
కుత్తరముఁ జెప్పెను.

కోర్టులు నడపవలసివచ్చిన హిందూధర్మశాస్త్రము జనులయం
గీకారమును బట్టికాని వేదకాలములోను స్మృతులకాలములోను నుం
డిన యాచారములనుబట్టి కాదు. అట్లు చేసితిమా తీర్పులు ధర్మస
మ్మతములుగావు. యుక్తియుక్తములుగావు. ఇట్టిమతము గలిగినవాఁడ
య్యు నతఁడు సంఘపురోవృద్ధికి విఘ్నకారిగాఁడని కొంద ఱభిప్రా
యపడుచున్నారు. ముత్తుస్వామియయ్యరుగారి యభిప్రాయప్రకార
ము ప్రతిమనుష్యునకు మతముండవలయును. ఆయన పూర్వాచార
పరాయణుఁడు. బ్రాహ్మణుఁడు. చేయవలసిన నిత్యానుష్ఠానములను
తప్పక నెరవేర్చువాఁడు. వేదాధ్యయనము జేసినవారియెడ నాయన
కు మిక్కిలి గౌరవముండెను. వేదశాస్త్రముల యభివృద్ధికై యతఁ
డొకపాఠశాలఁగూడఁ బెట్టించెను. ఆతని జ్ఞాపకశక్తి యద్భుతమైనది.
అతఁడు దేనినైన ముమ్మారుచదివిన యావజ్జీవముజ్ఞాపక ముండునఁట.
ఒకవ్యాజ్యమువిని తరువాత నాలుమాసములకైన జ్ఞాపకముంచుకొని
తీర్పు వ్రాయఁగలఁడఁట. ఆకాలమందలి విద్యార్థులు కొన్నిపుస్తక
ములను కంఠపాఠముగఁ జదివి దానిని మరల చూడకుండ వ్రాయఁ
గల సామర్థ్యము గలవారు. ముత్తుస్వామియయ్యరు నట్టివాఁడే.
చిన్ననాటనుండియు నితఁడు చాల కష్టములకోర్చి విద్యనేర్చినవాఁడు.
శాంతసముద్రుఁడు. నీతిమంతుఁడు. ఉపాధ్యాయులందఱు వానినెక్కు

డు గారముచేయుటంబట్టి విద్యార్థియైననాఁ డతఁడు కొంచెము గర్వియైయుండెను. గాని యుద్యోగమునందు జేరినపిదప కార్యభారము కలిగినకాలఁది "విద్యయొసగును వినయ" మన్నమాట కుదాహరణమై యుండెను. ఈయనకు సంగీతవిద్యయం దత్యంతమైన యభిమానము. ఈనాటి గొప్పయుద్యోగస్థులలో ముఖ్యముగ మనయాంధ్రులలో నిది యరుదుగదా! ఈయన మహాధనసంపన్నుఁడయ్యు దానధర్మములు విస్తారము చేసినట్లు కనఁబడదు. స్త్రీపునర్వివాహాది సంఘసంస్కారములు తనకిష్టము లని పలుమారు వచించియు నాంధ్రదేశశంకరాచార్యస్వామికిని శ్రీమాత్మారి లక్ష్మనరసింహముగారికిని జరిగిన వివాదములో నితఁడు స్వాములవారికి రెండువందలరూపాయలు ధనదండన విధించి యాయనయధికారమును మాత్రము బలపఱచెను. ఇందుచేతనే యతఁడు సంఘసంస్కారమునకు మంచిప్రాపు కాఁడని తలంచిరి. సంస్కారాభిలాష యెట్లున్నను దక్షిణహిందూస్థానములోఁ బుట్టిన గొప్పహిందువులలో నితఁడొకఁడు. ఈయన తన పరిశ్రమవలననే నెలకొకరూపాయ జీతగాఁడై యెట్టకేలకు నెలకైదువేలరూపాయలజీతము పుచ్చుకొనువాఁడయ్యెను. ఈయన సత్ప్రవర్తనము నిష్పక్షపాతబుద్ధి పరిశ్రమాసక్తి శ్లాఘనీయములు.

---

# తంజాలం గోపాలరావు

తంజాళం గోపాలరావుగారు కావేరినదీతీరమున కుంభకోణమునకు సమీపమందున్న గణపతియగ్రహారమున 1832 వ సంవత్సరమున జన్మించెను. ఈయన మహారాష్ట్రబ్రాహ్మణుఁడు. పదునేడవ శతాబ్దమందు మహారాష్ట్రులు స్వదేశమువిడిచి తంజావూరునకు వచ్చినప్పుడు వీరికుటుంబముకూడ దక్షిణదేశమునకువచ్చి యచ్చట స్థిరముగ నుండెను. ఈయన తాతపేరు తంజాళం జీవన్న. ఆయనకు రామచంద్రపండితుఁడను నామాంతరముఁగలదు. ఆయన కొంతకాలము తంజావూరు మహారాజునొద్ద పనిచేసి పిదప నింగ్లీషుదొరతనమువారియొద్ద తహసిల్దారయ్యెను. ఆయనకుమారుఁడు గోపాలరావు తండ్రియు రాఘవపంతులను నామాంతరముగల బావాపండితుఁడు. సుప్రసిద్ధుఁడైన శరభోజి మహారాజునొద్ద కొన్నినాళ్ళు పనిచేసెను. ఆయన కైదుగురు కుమారులు. గోపాలరావందుఁ గడపటివాఁడు. బావాపండితుఁడు గణపతియగ్రహారమున మూఁడుసంవత్సరము లుద్యోగవశముననుండి పిమ్మట తిరువడియను గ్రామమున గొంతకాలముండి యాకాలమున తిరువాన్కూరు సంస్థానమున మంత్రియు, రాజా మాధవరావుగారి తండ్రియు నగు దివాను రంగారావుగారి యాదరణమునఁ దిరువాన్కూరునకుఁబోయెను. బావాపండితుని కుమారులకిద్దఱకు వెంటనేయాసంస్థానమున నుద్యోగములయ్యెను. తిరువాన్కూరులో నున్నపుడె బావాపండితుఁడు కాలధర్మమునొందెను. కాలధర్మమునొందుటచే వానికుటుంబము తంజావూరునకుఁ దిరిగి వచ్చెను.

గోపాలరావు తక్కినసోదరులవలెనే తండ్రియొద్ద బాల్యమున

సంస్కృత మహారాష్ట్రభాషల నేర్చికొనెను. ఆకాలమున నింగ్లీషులో గొంతపరివేశముగల దేవాజీరావనునతఁడు గోపాలరావునకింగ్లీషులోఁ బరివేశముఁ గలిగించెను. కాలక్రమమున నాంగ్లేయభాష నితఁడు తన వశము చేసుకొనుట స్వయంకృషివల్లనేగాని పరసహాయముచేతగాదు. ఆతఁడు మరణమొందుటకు నాలుగేండ్లక్రిందట నొకరితో నిట్లుచెప్పెను. "నాచదువొక పాఠశాలలోఁగాని కళాశాలలోఁగాని నేర్చుకొన్నదికాదు. నేను పదునైదేండ్లవాఁడనైనప్పుడు నాపాట్లు నేబడి నేర్చుకొనవలసినవాఁడనైతిని. ఆభాషాపరివేశము మొట్టమొదట నాకొక పల్లెటూరిలోనైనది. ముప్పదియైదేండ్లక్రిందట పల్లెటూళ్లలో నెంతపాటి యింగ్లీషువిద్యయుండునో మీరేయూహించుకొనుఁడు. పశ్చిమఖండ భాషలు ప్రకృతిశాస్త్రములు నేనునేర్చికొనుట పరసహాయమెంతమాత్రములేక నాస్వయంకృషివల్లనే. స్వయంకృషియనినచో నిందతిశయోక్తి యేమియులేదు. నాపుస్తకములు మాత్రమే నా గురువులు."

పదునేడేండ్ల ప్రాయమువాఁడైనప్పుడు గోపాలరావు తంజావూరు కలక్టరుకచ్చేరీలో నుద్యోగము సంపాదించుకొని రెండుసంవత్సరములు ముగియకమునుపె యొక యింజనేరు కచ్చేరీలో మేనేజరయ్యెను. ఈయుద్యోగమున నతఁడు మూడుసంవత్సరములుండెను. ఆ కాలములో నట్టియుద్యోగస్థుల కెంతెంతలాభ ముండెడివో విస్తరించి వ్రాయనక్కఱలేదు. గోపాలరావు తానున్న మూడేండ్లలో శక్యమైనంతవఱకు లంచగొండితనము నణచుటకుఁ బ్రయత్నముచేసెను. చెన్నపట్టణపు హైకోర్టులో జడ్జీయై చాలప్రసిద్ధికెక్కిన హాలోవేదొర యాకాలమునఁ దంజావూరుజిల్లాలో నసిస్టంటు కలక్టరుగానుండి గోపాలరావుయొక్క ధర్మతత్పరత, సామర్థ్యముఁ గనిపెట్టి చాలమెచ్చి తాను చెన్నపట్టణమునకు వచ్చినపిదప గోపాలరావునకుఁ జాలసహా

యము చేసెను. 1854 వ సంవత్సరమున గోపాలరావు విద్యాశాఖ లోఁ బ్రవేశించి కుంభకోణమందలి దొరతనమువారి పాఠశాలలో సహోపాధ్యాయుఁడయ్యెను. 1857 వ సంవత్సరమున చెన్నపట్టణపు యూనివరుసిటీ స్థాపింపఁబడెను. ఆసంవత్సరమే గోపాలరావు ప్రవేశపరీక్ష (మెట్రిక్యులేషను) కుఁబోయి యందుఁగృతార్థుఁడయ్యె. తరువాత రెండేండ్లకే యనఁగా 1859 వ సంవత్సరమందే యతఁడు పట్టపరీక్ష (B. A.)కుఁ జదివి యందు మొదటితరగతిలో మొదటివాఁడుగఁ గృతార్థుఁ డయ్యెను. అట్లు గోపాలరావు పరీక్షలోఁ బ్రథమగణ్యుఁడై వచ్చుట మిక్కిలి కష్టసాధ్యము. ఏలయన నతఁ డుపాధ్యాయుఁడగుటచేఁ బ్రతిదినము పాఠశాలలో నాలుగంటలు పనిజేసి యలసి యింటికిఁబోయి గృహకృత్యములు నెరవేర్చుకొనుచుఁ దీరికయున్నపుడు స్వయముగా గ్రంథములఁ జదువుకొనుచు వచ్చెనేగాని యొకపాఠశాలలోఁ జేరలేదు. ఒకగురువుయొద్ద పుస్తకముఁబట్టి చదువలేదు. అహహా! స్వయంకృషి సహజపాండిత్యము నను శబ్దములు గోపాలరావునందే సార్థకము లైనవిగదా! అప్పుడు గవర్నరుజనరలుగారి యాలోచనసభలో సభికుఁడైన ఘోర్బరునుదొర కలకత్తానగరమందుండఁగా నీతఁడు పట్టపరీక్షం దేరినట్లు విని గోపాలరావున కీక్రిందివిధమున జాబువ్రాసెను.

"నీవు నాకు వ్రాయకపోయినను బి. ఏ. పరీక్షలో నీనడుమ మొదటివాఁడుగఁ గృతార్థుఁడవై నవాఁడవు నీవేయనుటకు నాకు సందేహములేదు. నేను నీయభివృద్ధియం దిష్టముగలవాఁడనని నీవుతలంపకపోయినందుకు నాకు విచారముగ నున్నది. ఈపరీక్షలోఁ దేరినందుకు నిన్ను నేను బహూకరించుచున్నాను. ఈకృతార్థత నీపరిశ్రమకు నీబుద్ధికిఁ దగియున్నది. ఈవిజయము పునఃపునః ప్రయత్నములకు నిన్నుఁ బురికొల్పుఁగాక." హాలోవేదొర యాసమయమున నీ

క్రిందిలేఖవ్రాసెను "నేను చాలజాబులువ్రాయఁజాలను. అయినను నీ సంతోషసమయమున నాయానందమును దెలియఁజేయకుండుటకు నీ పురోభివృద్ధి గోరకుండుటకు నామనసొప్పినదికాదు."

అదిమొదలు గోపాలరావుయొక్క జీవితమంతయు విద్యాశాఖలోనే గడుపఁబడెను. అందుఁ జాలభాగము కుంభకోణకళాశాలలోనే జరిగెను. కుంభకోణకళాశాలయొక్క కీర్తి యిద్దఱివల్ల దేశమంతట వ్యాప్తమైనది. అందొకఁడు పోర్టరుదొర. రెండవయతఁడు గోపాలరావు. ఆకళాశాలలో నింగ్లీషుభాష గణితశాస్త్రము విద్యార్థులకుఁ బోధించుభారము చాలవఱకు గోపాలరావుమీఁదఁ బడెను. దక్షిణహిందూస్థానమున నాంగ్లేయవిద్యా ప్రాబల్యమునకుఁ బ్రథమ పురుషుఁడైన పవెలుదొర గోపాలరావును మించినవారు సాధారణముగా నుండరని పలుమారుచెప్పెను. 1870-71-72 సంవత్సరములలో దొరతనమువారు గోపాలరావును పాఠశాలాపరీక్షాధికారి (ఇనస్పెక్టరు) గా నియమించిరి. ఈయుద్యోగము తెల్లవారికెగాని నల్లవారికిచ్చెడువాడుక పూర్వములేదు. అట్టి గొప్పయుద్యోగము స్వదేశస్థులలో మొట్టమొదట గోపాలరావునకే యిచ్చిరి. ఆయుద్యోగములోనుండి గోపాలరావు పాఠశాలలో నేర్పఁబడు విద్య మిక్కిలి యుపయుక్తముగా నుండునట్లు చేయుటకై పాటుపడెను.

చెన్నపురి దొరతనమువారుగూడ స్వదేశస్థుఁడు పాఠశాలాపరీక్షాధికారిగా నుండఁదగునో లేదోయని మొదట సంశయించి యాయుద్యోగ మాయనకిచ్చిరి. ఆయన మూఁడేండ్లధికారముజేయునప్పటికి దొరతనమువారు సంశయనివృత్తులై గోపాలరావు పని మిక్కిలి నేర్పుతోఁ జేసెననియు స్వదేశస్థు లీయుద్యోగమునకుఁ దగుదురనియు వ్రాసిరి. చెన్నపట్టణపు యూనివరుసిటీవారు వాని సామర్థ్యమును మెచ్చి యాయన నొక ఫెల్లోగాఁజేసిరి.

1872 మొదలు 74 వఱకు గోపాలరావు కుంభకోణము కాలేజీకిఁ బ్రిధానోపాధ్యాయుఁడై (ప్రిన్సిపలు) యుండెను. ఆసంవత్సరములలో కుంభకోణ కళాశాలయొక్క పరిక్షాఫలితములు వెనుక పోర్టరుదొరగారి కాలములోకంటె నెక్కువతృప్తికరములుగా నుండెను. ఆనాటిడైరక్టరు గవర్నమెంటువారికి వ్రాయుసంవత్సరచర్యలో గోపాలరావునుగూర్చి ఈక్రిందివిధమున వ్రాసెను. "మనరాజధానిలో రెండవకళాశాలకుఁ బ్రధానోపాధ్యాయుఁడై గోపాలరావు తత్పదవికిఁ దనయర్హతను సంపూర్ణముగ స్థాపించియున్నాఁడు. కావున కాలీవచ్చినప్పుడాయనకీయకతప్పదు.ఆయనసామర్థ్యమెట్టిదె సనుపరీక్షాఫలితములెంతతృప్తికరములుగానున్ననుమెచ్చవలసిన యధికారులెంతగామెచ్చినను దొరతనమువారుమాత్రము వానికాకళాశాలలోఁ బ్రధానోపాధ్యాయత్వము ఖాయముగ నీయఁజాలరైరి. 1878 వ సంవత్సరమున దొరతనమువారాయననుకుంభకోణమునుండి చెన్నపట్టణకళాశాలకుమార్ఫియర్థశాస్త్రమందు దేశచరిత్రమందుఁబండితునిగఁజేసి తెల్లవారితో సమానమైనజీతముగలగౌరవస్థితికిఁదెచ్చిరి. అంతటివిద్యావంతునకునంతటిసమర్థునకు గవర్నమెంటువారాయుపకారముఁ జేసినందుకుజనులుసంతసింపక యదివఱకే జేయనందుకు కుంభకోణముకళాశాలలోఁబ్రథమపండితోద్యోగమీయనందుకుఁ జాలవగచిరి. తెల్లవారితోసమానమైన యుద్యోగ మీయకపోయినను జీతము వారితోసమముగనిచ్చి మఱియుఁ గన్నీళ్ళుదుడుచుటకు దొరతనమువారు వానికి రాయబహదూరను బిరుదమునిచ్చిరి.

గోపాలరావుయొక్క కడపటిదినములుచెన్నపట్టణము రాజకీయ కళాశాలలోనె గడుపఁబడెను. 1883 వ సంవత్సరమున నతఁడు శక్తికి మించినపని చాలకాలమునుండిచేసినందునదారుణజ్వరపీడితుఁడై బాధపడెను. అతని శరీరస్థితి తృప్తికరముగా నుండనందున 1885వ సంవత్స

రమున నతఁడాఱుమాసములు సెలవుపుచ్చుకొనికుంభకోణమునకుఁ బోయెను. ఈసెలవునుండి యాయన తిరిగియెన్నఁడు బనిలోఁ జేరలేదు. కుంభకోణమునఁ గొన్నినాళ్ళుండునప్పటికి రోగము క్రమక్రమముగ తగ్గుటకుమారు పరిబలముకాఁగా తగినచికిత్సకొఱకు బంధువులు వానినిఁ జెన్నపురికిఁ దోడ్కొనివచ్చిరి. గోపాలరావు చెన్నపట్టణమందె 1886 వ సంవత్సరం మేనెల 11 వ తారీఖునఁ గాలధర్మము నొందెను.

ఆయనమరణ మెల్లవారినిదుఃఖింపఁజేసెను. చెన్నపురి రాజకీయ కళాశాలాధికారులు వానిశక్తికి వానిచేసినపనికి మెచ్చుచుమరణమును గూర్చి మిక్కిలి విచారించిరి. అప్పటిడైరక్టరగు డాక్టరు డంకను వాని మరణముంగూర్చి దొరతనమువారికి వ్రాయుచు నీక్రిందివిధమున వానింగూర్చి పరిశంసించెను. "గోపాలరావు విద్యాశాఖలో 1884 వ సంవత్సరమునఁ బ్రవేశించియిప్పటికి ముప్పదిరెండేండ్లు సేవచేసెను. ఈ దీర్ఘకాల మతఁడు దొరతనమువారికి లోకమునకుఁ జాలమేలుచేసెను. అతఁడు గొప్పశాస్త్రజ్ఞుఁడయ్యు నాంగ్లేయభాషాపాండిత్యమునకుమిక్కిలి పరిశంస చేయఁబడుచువచ్చెను. ఇంగ్లీషుభాషాగ్రంథావళి బోధించుటలో గొప్పయూరపియనులతో బోల్చినపుడుగూడ నతఁడుప్రథమగణ్యుఁడై యుండువాఁడు. కొన్నిసంవత్సరములనుండి ప్రెసిడెన్సీకాలేజీలోను యూనివరుసిటీలోను వానితోఁ గలిసియుండుభాగ్యము నాకు లభించినందున వానిమరణమువలనగలిగిన విశేషనష్టమును నేను తెలిసికొనఁ గలిగితిని." ఆసంవత్సరమే మేనెల 26వ తారీఖున డాక్టరు డంకను గోపాలరావు జ్యేష్ఠపుత్రునకీక్రిందిజాబువ్రాసెను. "నేను ఆయనను చాలసంవత్సరములనుండి యెఱుఁగుదును. వాని సద్గుణములకు నీతికిఁ జాల సంతసించువాఁడను. ఇటీవల ప్రెసిడెన్సీకాలేజీలో నాయదృష్టము వల్ల వానికిఁ బరిచితుఁడనైతిని. ఒక్కసారియైన మాస్నేహమైత్రికి భంగము గలిగినట్లు నేఁదలఁపను. ఏదాని కతఁ డతింకారమెయుండునో యట్టి

విద్యాశాఖలోనున్న యుద్యోగస్థులందఱు మీతో సమానదుఃఖితు లై మీదుఃఖము వారిదుఃఖముగ నెంచుకొనుచున్నారు.

ఈవిధముగానే గోపాలరావుకుమారునకు విద్యావంతులనేకులు పరామర్శ జేయుచు జాబుల వ్రాసిరి. "మీతండ్రియ కాలమరణమునకు గలిగినంతదుఃఖము మఱియొకరికిఁ గలుగ" దని రంగనాథము మొదలి యారువ్రాసెను. హైకోర్టుజడ్జీయైన ముత్తుస్వామియయ్యరు గూడ నీ క్రిందివిధమునఁ జెప్పెను. "నేను మొట్టమొదట వానిని 1854వ సంవత్సరమునఁ గలిసికొంటిని. అది మొదలు చివరవఱకు నొక్కవిధముననే వానియందు గౌరవముభక్తియు గలిగియుంటిని. ఆయనబుద్ధి మిక్కిలి గొప్పది. దానిని ముప్పదియేండ్లుకృషిచేసి వృద్ధిబొందించెను. ఆయన విద్యాసామర్థ్యము పాఠశాలలోఁ జదువుకొనుటవలన గాక స్వపాండిత్యమువలనను బరిశ్రమవలనను గలిగెను. ఆబుద్ధికి నా పాండిత్యమునకు నిష్కళంకమైన సత్ప్రవర్తనముందోడుచేసి తనవిధికృత్యమును శ్రద్ధతో నెరవేర్చెను. ఆయన మహావిద్యావంతు లెట్లుండవలయునో యట్లుండెను." చెన్నపురి క్రిష్టియన్ కాలేజీప్రధానోపాధ్యాయుఁడగు రివరెండు డాక్టరు మిల్లరు తనకాలేజీపక్షమునఁ బ్రకటింపఁబడు క్రిష్టియన్ కాలేజీ పత్రికలో గోపాలరావునుగూర్చి ప్రశంసించెను. దక్షిణహిందూస్థాన వాసుల యభిప్రాయమున మిక్కిలిగొప్పవాఁడగు గోపాలరావుమరణమునుగూర్చినవిచారములో నే నితరులలోఁ గలియుచున్నాను. కీర్తిశేషుఁడైన యాతఁడు తన దేశస్థుల ప్రవర్తనమును సరిగాఁ బోతబోయుటలోఁ జాలకృషిచేసెను. పాఠశాలాపరీక్షకుఁడుగాను మంచియుపాధ్యాయుఁడుగాను గోపాలరావు తానుచేయఁదలఁచిన పని సంపూర్ణముగఁ జేయుటయెగాక యితరులచేతఁ జేయింపవలసివచ్చినప్పుడుకూడ మిక్కిలి పట్టుదలతోఁ జేయించెను. పూనికతోఁ బనిచేయుటయె యాతనివంతుగాని ఫలితములను బహుమానములను ముందు లెక్కజూచుకొనుట

వాని పనిగాదు. తనవిధికృత్యములఁ దానుచేయుటయెవానికిఁ బ్రథమ కార్యము. ఏపనినైన నెరవేర్చుటలో నతని కతఁడె యాలోచించు కొనునుగాని రెండవవానితో నాలోచింపఁడు. తనచేయఁదలఁచినపని న్యాయమనితోఁచెనా యాయన యది జనసమ్మతమైనను గాకపోయి నను దానిని నెరవేర్చితీరును.

అతనిమార్గమునుదక్షిణహిందూస్థానమందలివిద్యావంతులంద ఱు నవలంబింపఁపలయు. ఆయనజీవితకాలమంతయు నుపాధ్యాయత్వ మునందె గడపుటచేత వానినెఱిఁగినవారందఱు వానిబోధనాశక్తి,సా మర్థ్యమునుగూర్చియే పలుకుదురు. ఆయననుగూర్చి యాయనశిష్యుఁ డొకఁడు కుంభకోణము నగరమందిరమున నీక్రిందివిధమునఁ బలికెను. "అతండు సంపూర్ణుఁడైనయుపాధ్యాయుఁడు. పాఠపుస్తకమునుపద్యా ర్థులకు బోధించునప్పుడు పుస్తకములలోనున్న సంగతులనేగాకవాటికి సంబంధించిన విషయము లనేకములుదెచ్చి లోకానుభవము గలిగించు చుండును. ఆవిషయములెవ్వియనఁగానుత్సాహముగలిగించు ప్రాచీన కవిత్వములు జతికథలుమహాత్ములయొక్కయు యోగ్యులయొక్కయు చరిత్రములు. అప్పుడప్పు డతఁడు చెన్నపురిరాజధానిలోమహావిద్వాం సులైన సుబ్రహ్మణ్యం అయ్యరు రంగనాథం మొదలియారు మొదలగు వారింగూర్చి వారిమార్గము ననుసరించి ప్రవర్తింపుఁడని విద్యార్థులం బురికొలుపుచుండును. పక్షి తనకుఁ బుట్టినపిల్లలుగ్రమక్రమంబున నా కాశముమీఁది కెగురునట్లుచేయుట కెంతశ్రమపడునో యావిధముననే తనవిద్యార్థులను లోకయాత్రిలో నిరపాయముగ నడుచువారిగఁ జేయు టకతఁడు పాటుపడుచుండును." ఆయనకుమహారాష్ట్రభాషలో మంచి ప్రవేశము గలుగుటచేఁ జిన్నతనమునుండియు నతఁ డందుఁగవిత్వము చె ప్పెను. బాల్యమునందాయన వ్రాసిన పద్యములుదొరకలేదు. మరణ మునకుఁ గొన్నిమాసములక్రిందట నాంగ్లేయభాషలో గోల్డుస్మిత్తు మ

హాకవివ్రాసిన దానప్రస్థుఁడని యర్థమువచ్చు "హెర్మి" ట్టను పద్యకావ్యమును మహారాష్ట్రమునకుఁ దర్జుమాచేసెను. అది యిప్పటికిని మహారాష్ట్రజనులచేత సంతోషపూర్వకముగాఁ జదువఁబడుచున్నది. ఆయనకు సంస్కృతమునుండియు మహారాష్ట్రమునుండియుఁ బ్రాచీనమహాకవులు రచియించిన శ్లోకములెన్నియో గంతపాఠముగఁజదువఁగలశక్తి యుండెను. స్వకుటుంబములోనున్న వారి నీగోపాలరావప్పుడప్పుడు చిత్రిచిత్రశ్లోకములుచదివి సంతోషపెట్టుచుండును. గోపాలరావునకు సంగీతశాస్త్రమునందును గొంతప్రజ్ఞగలదు. మంచిపాటనువిని యాయన మిక్కిలి మెచ్చువాఁడు. గోపాలరావు పాఠశాలలలో బాలురకు విద్య చెప్పి వారిమనస్సుల నెంతవికసింపఁజేసి జ్ఞానవంతములుగఁజేసెనో యావిధముగా బడిలేనప్పుడు గృహమందుఁగూర్చుండి తనతో మాటలాడవచ్చిన పరిచితులను మిత్రులను విజ్ఞానగర్భితములగు తనసంభాషణములచేత వచ్చినప్పటికంటె నెక్కువవివేకులుగఁజేసి పంపుచుండును. ఆయనతో మాటలాడుట యెంతో లాభకరముగానుండును. ఆయన యేది మాటలాడినను ముందుగ యోచించి యుక్తియుక్తముగ సర్వజనగ్రాహ్యముగ నుండునట్లు మాటలాడును. జ్ఞానమితరులకు నుపదేశించుట వానికెంతయిష్టమో నేర్చుకొనవలసిన యంశములుండిన నితరులయొద్దనుండి యవినేర్చుకొనుటయు వానికంతయిష్టము. నిరంతరము గ్రంథపఠనమందాసక్తి యుండుటచేతను నూతనజ్ఞాన మార్జింప నభిలాష గలుగుటచేతను గోపాలరావు యావజ్జీవము విద్యార్థియే యని చెప్పవచ్చును.

గోపాలరావుబుద్ధి యెంతసూక్ష్మమైనదో నడత యంత పవిత్రమైనది. జను లాయనప్రజ్ఞ కెంతసంతోషించిరో యోగ్యతకు నంతయె సంతోషించిరి. పాండిత్యమునకుఁ బావనచరిత్రముతోడగుట బంగారునకు దావి యబ్బుటగదా! సత్యమునందు ధర్మమునందు నాయనకుఁ గల యధికప్రీతిచేత నతఁడొకప్పుడు కఠినముగ మాటలాడు

చుండును. అందువలన దోషములు చేయువారు వానియెదుటకు వచ్చుటకు భయపడి గడగడ వడంకుచుందురు. ఇట్లనుటచేత నతఁడు సర్వజనసులభుఁడు కాఁడనియుఁ గఠినస్వభావుఁడనియుఁ దలపఁగూడదు. ఆయన యందఱకు సులభుఁడు దయావంతుఁడు తత్వజ్ఞుఁడు.

గోపాలరావు గొప్పసంఘసంస్కర్తలలోఁ జేరినవాఁడు కాఁడు. కాని వాని యభిప్రాయము లన్నియు సంఘసంస్కారమున కనుకూలముగానే యున్నవి. ఆయన మతమున సంస్కారము గావలసిన ముఖ్యవిషయములు నాలుగున్నవి. స్త్రీవిద్య దేశమందు విశేషముగా వ్యాపింపవలయుననియు బాల్యవివాహము లడఁగిపోవలయుననియు నిర్బంధవైధవ్యము లుండఁగూడదనియు ప్రతివర్ణములోనున్న యంత శ్శాఖలణగిపోవలయుననియు నాయన తలంచెను. అన్నిఁటిలో బాల్యవివాహమే మిక్కిలి నష్టకరమని యాతఁడు తలంచెను. అదియే హిందూసంఘవృక్షమును నాశనముచేయు వేరు పురుగు. అది యేవర్ణము లో మిక్కిలి వ్యాపించియున్నదో యావర్ణము నసఁగా బ్రాహ్మణుల ను నానాఁటికి క్షీణదశకుఁ దెచ్చుచున్నది. ఆ యగ్రవర్ణమున నీకాలమున జనించెడు బాలికాబాలకులు తమ పూర్వులట్లు దేహదార్ఢ్యము గలిగియుండక పొట్టివాండ్రై దుర్బలులై స్వల్పరోగములకైన నాగలేక యకాలమృత్యువుల పాలగుచుండుటచే నిట్టి దురాచారము ప్రప్రథమమున నవారింపఁబడవలసిన దనియు నదియే సంస్కారములలోకెల్ల సంస్కారమనియు గోపాలరావు కంఠోక్తిగఁ జెప్పుచువచ్చెను. ఈనాటిబ్రాహ్మణులలో పడుచువాండ్రు మనఃపరిశ్రమముగాని దేహపరిశ్రమముగాని చేయలేక చేసినమాత్రమున సొక్కి సోలిపోవుచుండుటయు పదునాలు పదునేడేండ్లు వయసువఱకు గట్టిగా కృషిచేసి విద్యాభ్యాసముచేసిన బాలురు రోగులగుటయు నాతఁడు కన్నులారఁజూచి యిట్లు దలంచెను. "వ్యవసాయము చేయు

వాఁడు తనవిత్తులు మిక్కిలిమంచివై మందమశాగత్తులతో నేల సారముగలదై యున్నప్పుడె నాటును. బుద్ధిసూక్ష్మతగల హిందువుఁడు తనశరీరమున కీపోలిక సరిపోవునని గ్రహింపలేకపోవుట మిక్కిలి యాశ్చర్యముగానున్న"దని యాయన చెప్పును. నిర్బంధ వైధవ్యముపాప హేతు వనియు దుస్సహమనియు గోపాలరావు మతము. బాలిక ల కాలమున వితంతులగుట కతిబాల్య వివాహమే ముఖ్యకారణమనియు నట్టి వివాహములు బాలికాబాలకుల యిష్టములు బడయకుండఁ దలితండ్రులే చేయుచుండుటచేత వధూవరు లుత్తరవాదులు కారనియు నాయన వాదించుచువచ్చెను. సంఘసంస్కారమందు గోపాలరావు నేఁటి విద్యార్థికులలో ననేకులకంటె స్థిరాభిప్రాయములు కలిగి యుండెను. దక్షిణహిందూస్థానమను నాకాశమండలమున సూర్యచంద్ర మండలములవలె గోపాలరావు రంగనాథమొదలయా రనువారిద్దరు నుదయించి చాలకాల మజ్ఞానాంధకారమును బారఁదోలి దేశస్థులభాగ్యదోషమున నకాలమున నస్తమించిరి.



# పూండి రంగనాథము మొదలియారి

పూండి రంగనాథము మొదలియారి చెన్నపట్టణమున 1847వ సంవత్సరమున జన్మించెను. అతని తండ్రి సుబ్బరాయ మొదలియారి. ఆంగ్లేయభాషలోఁ బరిచయముగలవాఁడై పొలములకు నీరు పంపుకాలువలమీఁద నధికారముగల యొకకంపెనీయొద్దనుద్యోగస్థుఁడుగా నుండెను. సుబ్బరాయ మొదలియారి రాజభాషయగు నింగ్లీషుచెప్పించుటవలనఁ గలిగెడు లాభముల నెఱిఁగినవాఁడుకావున బాల్యమునందె మిక్కిలి చాకచక్యము బుద్ధికుశలతఁ గనఁబఱచుచున్న తన కుమారున కావిద్యఁ జెప్పింపఁ నారంభించెను. రంగనాథము బాలుఁడై యుండఁగాఁ దండ్రికిఁ జెన్నపట్టణమునుండి యవనాపి యను గ్రామమునకు బదిలి యయ్యెను. కానియాగ్రామమున నతఁడు చిరకాలముండలేదు. అక్కడ నుండఁగా నొకనాటి రాత్రి వానియింట బందిపోటు దొంగలు పడిరి. ఆ మొదలియారి ప్రియపుత్రుఁడగు రంనాథమునకు దొంగలవలన మహాపాయము సంభవించునని భయపడి వాని నటుకమీఁద దాఁచి కూఁతునుం దీసికొని దొంగలయెదుటికిఁ బోయి యింటనున్న సర్వస్వము వానికి సమర్పించెను. కాని దొంగలు తనివిఁగొందక "యింకను నీవు సొత్తు దాఁచితివి. అది చూపవేని నీప్రాణములు నీకుఁదక్కవుసుమీ" యని వానినిబెదిరించిరి. అప్పుడు తండ్రి గడగడవడంకుచు నటుకమీఁద బిడ్డనుదాఁచుట తప్ప వేరు సొత్తు దాఁచలేదని చెప్పెను. చోరులు బాలకునిఁ బయినుండి క్రిందికి దింపిరి. అప్పుడు రంగనాథము తన ప్రాణము నిమిత్తముమిక్కిలిదయనీయములగు మాటలతో దొంగలను బ్రతిమాలుకొనెను. దొంగలెవ్వరికి హానిచేయకుండ నెట్టెటో యిలు వెడలిపోయిరి. సుబ్బరాయ

మొదలియారి యుద్యోగము వెంటనే మాని మరునాఁడే యవనాషి విడిచి చెన్నపురికిఁబోయి యక్కడ కాఁపురముండెను.

రంగనాథునికిఁ దండ్రి యింటియొద్ద శ్రద్ధతోఁ జదువు చెప్పుచుండెను. రంగనాథము మొదలియారునకు ద్రవిడభాషలో నిరుపమానమైన ప్రవేశముకలదు. అట్లుకలుగుటకుఁ దండ్రి యింటియొద్ద స్వభాషలోఁ జేయించిన పరిశ్రమయె కారణమని మన మూహింపవచ్చును. 1850 వ సంవత్సరమున రంగనాథము పదుమూఁడేండ్ల ప్రాయమువాఁడైనప్పుడు తండ్రి పచ్చయ్యప్పగారిబడికిఁ జదువనంపెను. అప్పుఁడతఁడు మూఁడవతరగతిలోఁ జేరెను. అది యిప్పటికి నాలుగవఫారమునకు సమానము. ఆనాటి హిందువులకు పచ్చయ్యప్ప పాఠశాలమీఁద మిక్కిలి యభిమాన ముండినందున బాలురందఱు నక్కడికే బంపఁబడుచు వచ్చిరి. రంగనాథుని బుద్ధికుశలత సంపంగి పూపరిమళమువలె వ్యాపించుటచే నాపాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయుఁడు (ప్రిన్సిపల్) వానింగూర్చి విని మిక్కిలి శ్రద్ధబూనెను. ఆసంవత్సర మతఁడఱువది రూపాయల విద్యార్థివేతనము సంపాదించెను. సంవత్సరాంతమందైన పరీక్షలో రంగనాథము జూపిన తెలివికి సంతసించి యధికారులు నడుమతరగతిలోఁ జదువకుండఁగనే వానిని బ్రవేశపరీక్షతరగతిలోఁ (మెట్రిక్యులేషన్) జేర్చిరి.

ఈతరగతిలోనుండి యతఁ డనేక బహుమానములం బడసెను. రాజా మాధవరావుగారు గణితశాస్త్రమునందు నింగ్లీషుభాషా పాండిత్యమునందు మొదటివాఁడగు వానికి నొకబహుమాన మియ్యఁదలఁచి యాతరగతి బాలుర నందఱఁ బరీక్షింపఁ జేసెను. ఆ పరీక్షలో రంగనాథుఁడే మొదటివాఁడుగఁ గృతార్థుఁడై బహుమానము గ్రహించెను. ఆకాలమున రంగనాథ మొక చిన్న సాహసము చేసెను. దానింబట్టి యాతనికి దనసామర్థ్యమం దెంత విశ్వాసముకలదో

యెంతనిర్ణయత్వము స్వతంత్రబుద్ధి వానికడ నున్నవో మనము తెలిసికొనఁగలము. ఒకసారి స్త్రీ విద్యనుగూర్చి యొకయుపన్యాసము వ్రాయుమని యుపాధ్యాయుఁడు తరగతిలో బాలురకందఱ కాజ్ఞాపించెను. అది సర్వోత్కృష్టముగ వ్రాసినవారికి గొప్పబహుమాన మిచ్చునట్లు నిర్ణయము. అనేక బాలకులా విషయములంగూర్చి యుపన్యాసములవ్రాసిరి. పరీక్షకులచే వ్రాయఁబడినయుపన్యాసముల నన్నిఁటినిజదివిరంగనాథముయొక్కయు కుప్పురామశాస్త్రియనుమఱియొక బాలకునియొక్కయువ్రాతలు ప్రశస్తములనియారెంటిలో నేది ప్రశస్తతమమోనిర్ణయింపలేక చెన్నపురిలో గొప్పన్యాయవాదులైన నార్టను, మెయిను దొరలకుఁ జూపిరి. మెయినుదొరరంగనాథుని దేప్రశస్తతరమనెను. నార్టనుకుప్పురామశాస్త్రివ్రాసిన దానిని మెచ్చెను. పరీక్షకులుసరిగానప్పటికి నిర్ణయింపలేక హైకోర్టు జడ్జియగు హాలోవేగారి కుభయుల వ్రాతలం జూపిరి. ఆయన రంగనాథమునకే బహుమాన మీయఁదగునని చెప్పెను. కాని యేకారణముచేతనో తుదకు బహుమానము రంగనాథమునకు రాలేదు. అందుకు రంగనాథుఁడు కుపితుఁడై తనకెందుచేత బహుమానమురాలేదోయా కారణమానుపూర్వికగఁ గనుఁగొననిశ్చయించుకొనెను. అంతలోనతని పాఠశాలయొక్క సంవత్సరోత్సవమువచ్చెను. అయ్యవసరమునజరిగిన సభకు చెన్నపురి గవర్నరుగారగు హారిసుప్రభువుగా రగ్రాసనాధిపతులయిరి. ఆయన వచ్చికూర్చుండిన పిదప రంగనాథుఁడులేచి తన యుపన్యాసముఁ జేతపట్టుకొని దానినిగవర్నరుగారికిఁజూపి యాయనచేతనే తగవు పరిష్కరింపఁజేసికొన వలయుననిబయలు దేర నుపాధ్యాయుఁడు బాలుని యుత్సాహమునకనిపెట్టి తగవు న్యాయముగాఁ బరిష్కరింతుననట్లొడంబడి బలవంతముగ వాని ప్రయత్నము నివారించెను.

1862 వ సంవత్సరమున రంగనాథము మొదలియారి ప్రవేశపరి

క్షయందు మొదటివాఁడుగ గృతార్థుఁడయ్యె. ప్రసిడెన్సీకాలేజీలో బై పరిక్షల జదువుటకుఁ జేరెను. పచ్చయ్యప్పపాఠశాలాధికారులు చదువు కొనుటకు వానికి నెలకు కొంతసొమ్ము నీయ వాగ్దానముచేసిరి. ప్రసిడె న్సీకాలేజీ యాదినములలో మిక్కిలి యున్నతస్థితిలో నుండెను. సాహి త్యమునందు సముద్రుఁడని చెప్పఁదగిన థామ్సనుదొరగారు దానికిప్రధా దోపాధ్యాయులై యుండిరి. అదివఱ కాకళాశాలలో బుద్ధిలో బృహస్ప తులవంటి విద్యార్థు లనేకులు చదివి కీర్తిమంతులైరి. కానిరంగనాథ ము వారినందఱ నణఁగఁద్రొక్కెను. లోకమం దెవరికైన నొకశాస్త్ర మందు విశేషాభిమానముండును. రంగనాథుని కన్ననో తత్వశాస్త్ర మందు గణితశాస్త్రమందు నాంగ్లేయ సాహిత్యమందు విశేషించి స్వభాషయగు ద్రావిడమందు మహాభిరుచి కలదు. ఆనాల్గిటిలో నతని కతండె సాటియని చెప్పఁదగి యుండెను.

థామ్సను దొరయుఁ దక్కిన యుపాధ్యాయులు రంగనాథుని యభివృద్ధినెంతో శ్రద్ధతోఁజూచినారను టదియొకయాశ్చర్యము కాదు. అప్పటి డైరక్టరయిన పవెలుదొరగారు హాలోవేదొరగారు నయితము రంగనాథుని బుద్ధికుశలతవిని వాని యభివృద్ధిని విన నుత్సాహపడుచు వచ్చిరి. విద్యార్థిగానున్న కాలముననే మహాపురుషులయాశ్చర్యము నకు బాత్రుఁడయినవాఁడు మనలో నితఁడొక్కఁడేయని చెప్పవచ్చును. అతనికి గణితశాస్త్రమందు నపారమైన ప్రజ్ఞయున్నను నాంగ్లేయ సా హిత్యమందుఁగూడ నాంగ్లేయులనేకులే వానికిఁదీసిపోదురు. అతనితో సమానముగ నింగ్లీషువ్రాసి మాటలాడ గల తెల్లవారిసంఖ్యతక్కువ యని యనేకుల యభిప్రాయము. తిరువాన్కూరు రాజవంశస్థుఁడగు రామవర్మ తాను మహారాజు కాకమునుపే చెన్నపురి రాజధానిలో పట్టపరీక్షయందు మొదటితరగతిలో నెవఁడుకృతార్థుఁడగునో యావి ద్యార్థికి మూడువందలరూపాయలువిలువగలబంగారుపతకముబహు

మూసముఁ జేయవలసినదని యామొత్తమును వడ్డీవల్ల గూర్చునట్టి మూలధనమును జెన్నపురియూనివరుసిటీవారికి 1862 వ సం॥రమునం దిచ్చెను. పట్టపరీక్షయందు మొదటితరగతిలో నెవరుకృతార్థులు కానందున 1863-64 సంవత్సరములలో నెవరికి నీయఁబడలేదు. 1865 వ సం॥ రంగనాథము మొదలియారిపట్టపరిక్షయందు మొదటితరగతిలోఁ గృతార్థుఁడైనందున పతకము వాని కీయఁబడెను.

ఈపతక మొక్కటియేకాదు. రంగనాథుఁడుబహుపతకములను బహుపుస్తకములను బహుమానముగాఁ బడసెను. రంగనాథునియపారమేధాశక్తికి గురువగు థామ్సను మిక్కిలి సంతసించి వానినివిడువలేక విద్యాభ్యాసము ముగియఁగానే గణితశాస్త్రమునందు సహోపాధ్యాయుఁడుగఁ దన కళాశాలలోనే నియమించెను. రంగనాథము యొక్క మిత్రులు గురువులు విశేషముగ నాంగ్లేయులే యగుటచేత వారిమార్గమునసరించి యతఁడు తన కనేకపర్యాయము లితరోద్యోగములు సంపాదించుకొనుటకు వీలు కలిగినను యవి నిరాకరించి విద్యాశాలయందె యావజ్జీవముఁగడపెను. చెన్నపురి దొరతనమువారు సమయమువచ్చినప్పుడెల్ల రంగనాథుని ప్రజ్ఞాదులం గొనియాడుచు వచ్చినను ప్రజ్ఞకుం దగునట్టి ప్రోత్సాహముమాత్రము సరిగా నీయలేదు. ఏలయన ప్రసిడెన్సీకాలేజీలో రంగనాథుఁడు గణితశాస్త్రోపాధ్యాయుఁడుగా స్థిరపడునప్పటికి రమారమి పదియారు సంవత్సరములు పట్టెను.

1872 వ సంవత్సరమున రంగనాథుఁడు చెన్నపురి యూనివరుసిటీలో నొకఫెల్లో జేయఁబడెను. అదిమొదలుకొని యతఁడుచనిపోవువఱకు నేఁటేఁట నీగౌరవముపొందుచునేయుండెను. విద్యావిషయమున రంగనాథమొదలియారిగారి యభిప్రాయమునకుఁ జూపఁబడు గౌరవము మఱియేహిందువుని యభిప్రాయమునకుఁ జూపబడుటలేదు. ఏయభిప్రా

యమయిన@ జెప్పవలసివచ్చినప్పుడు రంగనాథము మొదలియారి యొక మనుష్యునకుగాని యొక తెగకుగాని లాభముకలుగునట్టిపక్షపాతపు బలుకుల@ బలుకక సర్వవర్ణములవారి యభివృద్ధికి ననుకూలములగు వచనముల@ జెప్పుచువచ్చెను. విద్యాశాఖలో నేసభగూడినను నేచిన్న కమిటీ యేర్పడినను రంగనాథము మొదలియారి యందుండవలసిన దే. ఏచిన్న తీరుమానమైనను వానిచేతిదిద్దుబాటుబడయనిపక్షమున నదివ్యాసప్రోక్తముకానట్లె కమిటీలలోని మెంబర్లు తలఁచుచువచ్చిరి. 1890 వ సంవత్సరమందు దొరతనమువారు ద్రవిడిభాషాంతరీకరణము@ జేయుటకు వానినేర్పఱచుకొనిరి. 1892వ సంవత్సరమున@ జెన్నపట్టణమునకతఁడు షరీఫుగా నియమింప@ బడెను.

ఒక్కవిద్యావిషయమందేగాక ప్రజాక్షేమకరములయినసమస్త వ్యవహారములందు దొరతనమువారు ప్రజలు రంగనాథునియాలోచన ముగైకొనుచువచ్చిరి. చెన్నపురి మునిసిపాలిటీయం దతఁడొక సభికుఁడై యనేకోపన్యాసములనిచ్చెను. అవి మెంతో మనోహరములుగనుండెను. చెన్నపురమందు స్వదేశీయులచేత స్థాపింప@ బడినకాస్మాపాలిటన్ క్లబ్బునకు రంగనాథము మొదలియారి ప్రాణమనిచెప్పవచ్చును. అతని మృదుమధురసంభాషణములచేత ప్రతిసాయంకాలము సభయంతయు గలకల లాడుచుండెనని వాని నెఱిఁగినవా రిప్పటికి@ జెప్పుదురు. 1890 వ సంవత్సరమందు@ బట్టపరీక్ష మొదలగు శాస్త్రిపరీక్షలయందు@గృతార్థులైన విద్యార్థులకు శిష్టాచారమున జరుగుచున్న హితోపదేశమును జేయునట్లు గవర్నరుగారు రంగనాథము నేర్పఱచిరి. అప్పుడతని నోటనుండివచ్చిన యింగ్లీషుభాష మార్దవ మేమనిచెప్పను! అప్పుడొక వార్తాపత్రికలో వానియుపన్యాసమునుగూర్చి నీక్రిందివిధముగ వ్రాయఁబడెను. "ఎదుటనుండి రంగనాథము మొదలియారి చేయునుపన్యాసము వినినవారుతప్పక యాతఁడు స్వదేశస్థు@ డనుకొందురు.

కాని చాటుననుండి వినినపక్షమున శైలింబట్టి పదప్రయోగమునుబట్టి యుచ్చారణముంబట్టి మాటలాడుచుండిన వాఁడాంగ్లేయుఁడనుకొనవలసినదేకాని నల్లవాఁడనుటకుఁ వీలులేదు." ఆయుపన్యాసమును మనవారు తెల్లవారుఁగూడ బహువిధములు శ్లాఘించిరి.

రంగనాథము నిజముగాహిందూసంఘమున కొకయలంకారమనిచెప్పవచ్చును. ఈయలంకారము 1893 వ సం॥ డిశంబరునెల 10 వ తేదీని దేశము శోకమగ్నమగునట్లునేలపాలయ్యెను. ఆయనకొద్దిదినములు జ్వరముచేత బాధపడిలోకాంతరగతుఁడయ్యెను. ఆజ్వరము వానిం దుదముట్టించునని యెవ్వరుఁదలంపలేదు. మరణమునకుముందునాలుగు దినములకిందటివఱకు నతఁడు పాఠశాలకుఁబోవుచునే యుండెను. అతఁ డతిపరిశ్రమవలననకాలమృత్యువువాతఁబడెనని లోకులుతలంచిరి. వాని మరణమునకు వగవని హిందువులుకాని మహమ్మదీయులు కాని యూరోపియనులుకాని లేరు. ప్రెసిడెన్సీకాలేజీ కౌన్సిలువారు కాలేజీకి రంగనాథము మొదలియారిచేసిన మహోపకారము నుగ్గడించి గణితశాస్త్రమునందెగాక తత్వశాస్త్రమందుఁజరిత్రాశాస్త్రమందువానికసమాన ప్రజ్ఞగలదని, వానిమరణమువలన దమకాలేజీకి గలిగిననష్టమునకు మిక్కిలివిచారించిరి. అప్పుడు డైరెక్టరుగానుండినడాక్టరుడంకనుదొరగారు రంగనాథముతో గలిసి చిరకాలము పనిచేసిన సహకారియగుటచే వానిమరణమునకు మిక్కిలివగచి వానిపెద్దకుమారునిపేర నొక జాబువ్రాసెను. అందులో నీక్రిందిసంగతులున్నవి. "కొట్టకొనవఱకునీతండ్రి నాయభిప్రాయమున మిక్కిలియున్నతపదమునాక్రమించెను. చెన్నపట్టణములో నుండిన యేయూరపియనుఁడునీతండ్రికినావంటిచిరమిత్రుఁడు కాఁడు. నావలె నతనిహృదయమనోగతములైన గుణములనుప్రజ్ఞలను నెఱిఁగినవారులేరు. అతఁడుమహాపండితుఁడు. రాజభక్తుఁడు. ఆలోచన చెప్పునప్పుడు దూరదర్శి. జ్ఞాని. మరియాదలకునిధి. ఇట్లుండుటచేత నతఁ

డు సర్వసమ్మతుఁడై యుండెను. ఆయన పేరు శాశ్వతముగా జ్ఞాపకముం డునటులఁ జేయుటకు బ్రయత్నములు జరుగుచున్నవని వినుచున్నాము. అతఁడు మనకుఁ జూపిన మార్గము ననుసరించుటయే నకికి గౌరవము చేయుట. జ్ఞాపకార్థమే దేని నిర్మించుటయని నాయభిప్రాయము."

1894 వ సం॥రం ఫిబ్రేవరు నెలలో రంగనాథము మొదలియారి పేరు శాశ్వతముగా నుండుటకుఁ జెన్నపురమందొక్క మహాసభ జరిగెను. ఆసభకు గవర్నరుగారగారి సనాధిపతులైరి. ఆసమయమున చెన్నపురము హైకోర్టులోఁ జిరకాలము జడ్జీపనిచేసిన సర్. టి. ముత్తుస్వామియ య్యరుగారు క్రిష్టియన్ కాలేజీలోఁ బ్రధానోపాధ్యాయులుగనుండిన డాక్ట రు మిల్లరుదొర గారు మొదలగు నేకులు రంగనాథమునుగూర్చి ప్రసం గించిరి. అప్పుడు ముత్తుస్వామియయ్యరుగారు చేసిన యుపన్యాసములో ని కొన్నివాక్యములిందుదాహరింపఁ బడుచున్నవి. వానితో గాఢమైన పరిచయము స్నేహము జేయుటవలన నతనిప్రజ్ఞలు నిరుపమానములని నేను తెలిసికొంటిని. అతఁడుపాధ్యాయుఁడుగా విద్వాంసుఁడుగా దేశాభి వృద్ధికారకుఁడుగ నుండిచేసిన యుపకారము విలువలేనిది. అతనిపరిశ్ర మము పూనిక మిక్కిలి యద్భుతములైనవి. తన యహర్కృత్యము నె రవేర్చుచు నిరంతరము గ్రంథపఠనమందె యతఁడు కాలముపుచ్చుచుం డును. ఒకసారి నేను చాలసేపు షికారు దిరుగగా నన్నతఁడుచీవాట్లు పెట్టెను. అది నాకిప్పటికి జ్ఞాపకమున్నది. ఈకాలము మీరు పాడుచే యక మంచిపనిక్రింద నుపయోగించుచున్న బాగుండునని నాకాయన యుపదేశము చేసెను. రంగనాథునకుఁ గలిగిన మహాఖ్యాతి వానిబుద్ధి విశేషముచేతనేగాని నిరంతరము పాటుబడుటవలనఁ గాదు. దీనింబట్టి యాతఁడు పాటుపడువాఁడు గాఁడని మాయభిప్రాయము గాదు. కొం దఱు మేధావంతులు కాకపోయినను విశేషపరిశ్రమము జేసి గొప్పవా రగుదురు. రంగనాథము మొదలియారి నిరుపమానమైన బుద్ధిసూక్ష్మ

తగలిగి దానికిందోడుగఁ బరిశ్రమజేసి ఖ్యాతిగాంచినవాఁడు. రంగనాథము మొదలియారి సంభాషించుచుండఁగా విన్నవారు మహానందభరితు లగుచుందురు. అతనిభాషాశైలి మనోహరమై చాకచక్యము గలిగి మనస్సు నానందవార్ధి నోలలాడించుచుండును. ప్రసంగములో నడుమనడుమ నతఁడు మహాకవుల యుద్గ్రంథములలో నుండి సంతోషజనకము లైన పద్యములను వాక్యములను దీసి కంఠపాఠముగఁజదివి వినువారి వీనులకెంతయు విందుచేయుచుండును. ఆంగ్లేయభాషలో నతనికి షేక్స్పియరు మహాకవియొక్క కవిత్వము మిక్కిలిప్రియమైనది.

సాధారణముగ నింగ్లీషుభాషలోఁ బ్రవీణతగల విద్వాంసులకు స్వభాషాపరిచయముండుటయరిది.రంగనాథము మొదలియారి విషయమట్లుగాదు.ద్రావిడభాషయందుమహాపండితులతోసమానమైనపాండిత్యము వానికిఁగలదు. ప్రసంగమువచ్చినప్పుడు సందర్భశుద్ధిమెఱిఁగి యతఁడుద్రావిడభాషలోనున్న కంబరామాయణమునుండికొన్ని పద్యములనుదీసి చదివి దానిలోనుండుభావాదులను మిత్రులకుబోధించుచుండును. ఈకాలమున నింగ్లీషుభాషలోఁ గృషిచేయు విద్యార్థులు స్వభాషను బొత్తుగనెఱుఁగక చెడిపోవుచున్నారని యాయన పలుమారు మిత్రులతోఁజెప్పి విచారించుచుండును. ఆయనసర్వవిధములచేతమిక్కిలి పెద్దమనుష్యుఁడు. తఱచుగా గొప్పవారితో సహవాసము చేయుటచేత నాతనిపద్ధతులు మిక్కిలి మంచివైయుండెను. ఆతనిహృదయము మిక్కిలి మెత్తనిది. ఆయనజీవితములోఁ జాలభాగము పేదలగువిద్యార్థుల విద్యనిమిత్తము ప్రతిమాసము వ్యయముచేయుచుండెను. అట్టి దానములు గుప్తములైయుండెను. ఇతరులయందున్న బుద్ధిసూక్ష్మత

ల నతఁడు మెచ్చి సంతసించుచుండెను. ఆయనకు ముత్తుస్వామి యయ్యరును గూర్చి యీక్రింది యభిప్రాయముగలదు. "బుద్ధిసంప దనుబట్టి చూడఁగా నీకాలమున హిందూదేశమునఁ బుట్టినవారిలో ముత్తుస్వామియయ్యరే శ్రేష్ఠుఁడు." రంగనాథము మొదలియారుచేసిన గ్రంథమొకటికలదు. అది కంచికాలందకమను ద్రవిడభాషా పద్య కావ్యము.



# సెట్టిపాణీయం వీరవల్లి రంగాచార్యులు

ఈరంగాచార్యులు 1831 వ సంవత్సరమున చెంగల్పట్టుజిల్లాలో నొకగ్రామమున జన్మించెను. ఈయనతండ్రి రాఘవాచార్యులు చెంగల్పట్టుకలెక్టరు కచ్చేరిలో నొకగుమస్తాగా నుండెను. రంగాచార్యులు పసిబిడ్డయైనపుడు గొప్పగండ మొకటితప్పెను. తల్లితోఁగలసి పయనముచేయుచుండ దారిలో బండిబోల్తపడెను. బండి పడిపోవుటకు సిద్ధముగా నున్నపుడు రంగాచార్యునియన్న వేగముతోఁ దల్లియొడి నున్న తమ్ముని నీవలకులాగియాతని ప్రాణములు కాఁపాడెను. కానిచో రంగాచార్యులేమయియుండునో! ఆతనితండ్రికిసర్కారుజీతముతప్ప మరి యేయాస్థియు లేదు. కుమారునకింగ్లీషువిద్యజెప్పింపవలయునని రాఘవాచార్యులు తలంచెనుగాని సంసారస్థితి చక్కగా నుండకపోవుటచేఁ జదువు మాన్పింపఁజూచెను. అంతలో రాఘవాచార్యుని సోదరులలో నొకఁడు రమారమి యెనిమిదివందల రూపాయిలు బాలుని చదువు నిమిత్తమిచ్చి మృతినొందెను. ఏయాధారములేని రాఘవాచార్యున కిదికొంతసహకారిగా నుండెను. కాని కొమరునిఁ జెన్నపురికిఁ బంపి విద్యాభ్యాసము సంపూర్ణముగఁ జేయించుటకిది చాలదయ్యెను. ఏమిచేయనగునని రాఘవాచార్యు లాలోచించుచుండ వానిబంధువుఁడు చెన్నపట్టణమున మేజస్ట్రీటుగానియమింపఁబడిన మొదటిహిందువుఁడునగు, వి. రాఘవాచార్యులనునతఁడు బాలుని విద్యాభ్యాసమునఁ గొంతసాహాయ్యముఁ జేయునట్లు వాగ్దానముచేసెను. అంతట రంగాచార్యులు చెన్నపట్టణమునఁ జదువనారంభించెను.

విద్యార్థిగానున్న కాలమున రంగాచార్యులువయసునకుఁదగని తెలివిగలవాఁడని పేరుబడెను. పెద్దవాండ్రు చదరంగమాడుచుండ

నీ బాలుఁడు నిశ్శబ్దముగ వారి సమీపమునఁ గూర్చుండి మెలకు వతో నయ్యాటలోని చమత్కృతులన్నియు గ్రహించి యల్పకాల ములోనే దానియందు మిక్కిలి ప్రౌఢుఁడయ్యెను. అతని ప్రౌఢిమ మెచ్చి చదరంగమాడు పెద్దలు మంచియెత్తులు తమకుఁ దోఁచ నప్పుడు, తమయాట చిక్కులలోఁ బడినప్పుడు పలుమాఱు బాలుఁ డగు రంగాచార్యుని సాయ మపేక్షించుచు వచ్చిరి. అడుగుటయే తడవుగ నీ కుశాగ్రబుద్ధి యసమానములగు నెత్తులుచెప్పి వారియాట చిక్కుల విప్పుచు వచ్చెను. రంగాచార్యునకు విద్య మీఁదకంటె నాటపాటలయం దెక్కువ తమక ముండెను. అట్లున్నను స్వల్ప పరిశ్ర మము మాత్రముచేసి చదువులో తోడిబాలుర మించుచు వచ్చెను. అతఁడు మొట్టమొదట పచ్చయ్యప్ప పాఠశాలలోఁ బిరియజ్ఞాన మొదలియారి యను నాతనియొద్ద చదివెను. పెద్దవాఁడైన తరువాత నైత మీ యాచార్యులు తన చిన్ననాఁటి యుపాధ్యాయునియెడ గౌరవము, ప్రేమయుఁ గలిగి, చిన్న బిడ్డలకు మొదటి తరగతులలో నుపాధ్యాయులుగా నుండగోరువా రాయనవలె నుండవలెనని చెప్పు చువచ్చెను. పిరియజ్ఞాన మొదలియారి వయోవృద్ధుఁడయి యుద్యో గము మానుకొని యింట నిబ్బందులు పడవలసివచ్చినప్పుడు ప్రాఁత శిష్యుఁడైన రంగాచార్యులు గురుభక్తి గలిగి ద్రవ్యసహాయము చేయుచువచ్చెను. పచ్చెయ్యప్ప పాఠశాలలోఁ జదువు ముగిసిన పిదప రంగాచార్యులు చెన్నపట్టణపు హైస్కూలులోఁ బ్రవేశించెను. దాని ప్రధానోపాధ్యాయుఁడగు పవెలుదొర బాలుని మేధాశక్తికి సంత సించి నెలకుఁ బదునాలుగు రూపాయలు విద్యార్థివేతనముగ వాని కీయఁ దొడఁగెను. పవెలు దొరయొద్ద బుద్ధి సంపూర్ణముగ వికసింప నతఁడు ప్రజ్ఞలోఁ దక్కిన విద్యార్థుల నందఱ మించుటఁజేసి వారు వానితో సమానముగ నుండఁగోరక వాని తరువాతవారుగా నైన

నుండినం జాలునని కోరవలసినవారయిరి. ఆ హైస్కూలులో నతఁడు 1849 వ సంవత్సర ప్రారంభమువఱకు విద్యాభ్యాసముచేసి యప్పుడు ప్రొఫిషెంటు పరీక్షలో మొదటితరగతిలోఁ గృతార్థుఁడయి గౌరవాస్పదుఁడయ్యెను. తరువాత రంగాచార్యులు దొరతనమువారి కొలువులోఁ బ్రవేశించుటకు మఱియొక్క పరీక్షకుఁ జదువుచుండుట విని పవెల్‌దొర వానియెడ మంచియభిప్రాయముఁ గలవాఁడు కావున వాని కీక్రింది విధమున వ్రాసెను. "నీవు పరీక్షారంగముపఁ బ్రివేశించుచున్నాఁడవనియు మా పాఠశాల పరువు నిలువఁబెట్టఁ బ్రయత్నింతువనియు విని చాల సంతసించితిని. నీ యందు సామర్థ్యము, దానికిందోఁడు చాకచక్యము, వివేకముఁగలవు. కావున నీవు తప్పక జయము నొందెదవు."

విద్యార్థిదశలో నతనికిఁ గలిగిన యద్వితీయ విజయము వలన వానికీర్తి చుట్టుప్రక్కల వ్యాపించుటచే నతఁడు విద్యముగింపఁగానే చెన్నపురమం దప్పుడు కలెక్టరుగానున్న యెల్లిసుదొర వానికిఁ దనకచ్చేరీలోఁ నొకనికి బదులుగా కొన్నాళ్లు గుమాస్తాపని యిచ్చెను. అనంతర మతండు చెంగల్పట్టుజిల్లా కలెక్టరు కచ్చేరీలో ఖాయపు గుమస్తాగా నియమింపఁ బడెను. అక్కడ కొన్నాళ్లుండిన తరువాత నతఁడు సేలంజిల్లా కలెక్టరు గారికచ్చేరిలో హెడ్‌క్లర్కుగా హెచ్చుజీతముమీఁదఁ బంపఁ బడెను. ఈ కాలమున నతఁడు రెండు చిన్నపుస్తకములను వ్రాసెను. అందొకటి రివిన్యూ డిపార్టుమెంటులోని యుద్యోగస్థులు లంచములను పుచ్చుకొనుటఁగూర్చి. రెండవది యాకాలములో నందఱుఁ దీవ్రముగాఁ జెప్పుకొనుచున్న సేలము తంజావూరు జిల్లాలలోని మిరాసీహక్కులనుగుఱించి. పిమ్మట నతఁడు సైదాపేట తహసీలుదారుగా వెళ్ళి యాపనిలో రెండేండ్లుండెను. అక్కడనుండి నెల్లూరుజిల్లా సిరస్తెదారుగాఁబోయెను. 1859 వ

సంవత్సరమున గవర్నమెంటువారు చెన్నపురిరాజధానిలో నేర్పరచిన యీనామ కమీషనుయొక్క ప్రెసిడెంటగు బెయిలరుదొరవారియొద్ద స్పెషల్ అశిష్టాంటుగా నియమింపఁబడెను. రంగాచార్యులు తన వివేక సామర్థ్యములవల్ల బెయిలరు దొరకు విశ్వాసపాత్రుఁడై యేను సంవత్సరము లాడిపార్టుమెంటులోఁ బనిచేసెను. ఈనాముల పరిష్కారము ముగిసిన పిదప దొరతనమువారు మన దేశములోనున్న యినుపదారుల (Railways) పద్ధతి యెట్లుజరుగుచున్నదో తెలియఁ జేయవలయునని బెయిలరు దొరవారిని నియోగించిరి. ఈ పనికి బాగుగ లెక్కలు తెలిసినవారు కావలసివచ్చినందున బెయిలరుదొర రంగాచార్యునిఁ దనకు సహకారిగాఁ దీసికొనెను. రంగాచార్యులు ప్రధాన మిత్రులతోను, ముఖ్య బంధువులతోను గలసి యాలోచింప కుండ నీ యుద్యోగములోఁ బ్రవేశించుట కొడంబడెను. గృహము నకుఁ బోయి యావార్త చుట్టముల కెఱిఁగింప వారు బెయిలరు దొరతో నతఁడు చేసిన వాగ్దానమునుండి వానిని మరల్పఁ బ్రయత్నించిరి. ఏలయన నతఁడు కలకత్తాకు సముద్రముమీఁద నోడప్రయాణము జేయవలసి వచ్చెను. ఆనాఁడు పూర్వాచార ప్రియులగు బ్రాహ్మణులు రంగాచార్యులవంటి యగ్రకులజుఁడు సముద్రముమీఁద నావికా యాత్ర చేసినపక్షమున బ్రాహ్మణ్యము చెడిపోవుననియు నటుమీఁద నందఱు నదే మొదలుపెట్టి వర్ణాశ్రమ ధర్మములు పాడుచేయుదురనియు గోలుపెట్టిరి. కాని రంగాచార్యులు నాగరికతా విషయమునఁ దనసాటివారి తలదాఁటిన వాఁడగుటచే వారు పెట్టిన గోలు సరకుసేయక, వెలికి జంకక బెయిలరుదొరతోఁ గలసి యోడ మీఁద కలకత్తాకును, బనియున్న యితరస్థలములకునుఁ బోయెను. పోయి చాలయోపికతో నీతితోఁ దనపని నిర్వర్తించుకొని తనపై యధికారి నమ్మకకు మునుపటికంటెను మిక్కిలిగా పాత్రుఁడయ్యెను.

తనకు నధికారులకు సంతుష్టికలుగునట్లు కార్యనిర్వాహముచేసి రంగాచార్యులు స్వదేశమునకు మరలె. మెయిలరుదొరకు రంగాచార్యుని మీఁద నెంత గౌరవమున్నదో వాని స్వహస్తలిఖితమైన యీజాబు వలనఁ దెలియును." ఆతఁడు (రంగాచార్యులు) పాఠశాలను విడిచి, 1849 వ సంవత్సరములో దొరతనమువారి కొలువులోఁ బ్రవేశించి నది మొదలుకొని మేమిరువుర మెడతెగని సంబంధము గలిగి యుంటిమి. మా కొండొరులయెడఁగల గౌరవము రవ్వంతయు డిందు పడలేదు. పరిపరిథములుగ నేనతనికిఁ బనిచేయ్పుటలోను, బిమ్మట గొప్ప యుద్యోగములిప్పించి వృద్ధికిఁ దెచ్చుటలోను గొంతసహాయము చేసి నను రంగాచార్యుఁడు నాయెడలఁ జూపిన భక్తివిశ్వాసములచేత నా ఋణమంతయుఁ దీర్చెను. మా యిరువురకు నుద్యోగ సంబంధ మున్నంతకాలమంతయు రంగాచార్యులు స్వదేశస్థుల ప్రవర్తనల గూర్చి యతనికిఁగల జ్ఞానము, వానియుత్కృష్టవివేకము, యద్భుత మైన యతనికార్య నిర్వాహక సామర్థ్యము విసుగుకొనక యతినిపు ణముగా నా నిమిత్తమె వినియోగించెను. వేయేల! మా కిరువురకు సంబంధముగల సమస్త వ్యవహారములలోను నేను కృతకృత్యుఁడ నగుట యెల్ల రంగాచార్యుని సహాయ సంపత్తిచేతనే యని దృఢ ముగాఁ జెప్పఁగలను." అనంతరము కొంతకాలమునకు మెయిలరు దొర చెన్నపురిరాజధాని పక్షమున గవర్నరు జెనరలుగారి శాసన నిర్మాణ సభలో సభికుఁడై, చట్టములు నిర్మించినపుడు రంగాచా ర్యుని యాలోచన మడుగుచు నీతఁడిచ్చిన సలహాలను విస్పష్టముగ గవర్నరు జెనరలుగారి సభలోఁ జెప్పుచువచ్చెను. కలకత్తానుండి చెన్నపట్టణము తిరిగివచ్చినతరువాత రంగాచార్యులు మదరాసు రెయిల్వేకంపెనీకి కమీషనరయ్యెను. దొరతనమువారు కాకితపు నాణె ములు (అనగా కరెన్సీనోట్లు) క్రొత్తగా వ్యవహారములలోనికిఁ

దెచ్చి, 1864 వ సంవత్సరమున రంగాచార్యుని పశ్చిమదేశముననున్న కల్లికోట జిల్లాలో ట్రేజరీ డిప్యూటీ కలెక్టరుగా వేసిరి. ఆకాలమున నచ్చటి జిల్లాకలెక్టరగు బాలర్డు దొరకు రంగాచార్యునియెడ( జాల నమ్మిక కలిగెను. ఆదొరయే యవ్వల గొంతకాలమునకు తిరువాన్కూరు, కొచ్చి సంస్థానములలో దొరతనమువారి పక్షమున రెసిడెంటయ్యెను.

ఈ నడుమ మైసూరు సంస్థానస్థితి చాల శోచనీయముగా నుండెను. దొరతనమువారు వెనుకటి మహారాజగు కృష్ణరాజ యొడయరును గద్దెమీ(ది నుండి దింపి వాని దత్తపుత్రు(డు యుక్తవయస్కు(డయిన పిదప రాజ్యము స్వీకరింపవచ్చునని శాసించిరి. స్వదేశ సంస్థానములతో నేకాడికైన సంధినేజేసికొని, వాటిజోలికి(బోక నెమ్మదిగా దేశమును( బాలింపవలయునను తలంపు గల లార్డు విలియం బెంటిక్కు వంటి మంచి గవర్నరు జెనరలుకూడ తన నియమమునకు విరుద్ధముగా జోక్యము కలిగించుకోవలసినంత దుర్దశకు మైసూరు సంస్థానము మరల నెన్న(డు రాకుండ జేయ(దల(చి, యే(బదిలక్షల జనులకు రాజుకా(దల(చియున్న చిన్నమహారాజునకు నిరంతరము ప్రజానురంజనముగా, ప్రజాక్షేమంకరముగ పరిపాలనము జేయించునట్టివిద్యను జెప్పింప నింగ్లాండులోనిదొరతనమువారునిశ్చయించుకొనిరి. హిందూదేశపుకార్యదర్శిగా నింగ్లాండునుండి పం(పినయా యుత్తరువు అమలులోనికి( దెచ్చుటకు మైసూరులో( గొన్నిమార్పులు జరుగవలసివచ్చెను. అపుడు మైసూరులో నింగ్లీషుదొరతనమువారిపక్షమున నధికారముచేయుచున్న బౌరింగుదొర మహారాజుగారియంతఃపురపులెక్కలు పరీక్షించుటకు నమ్మికయుంచ(దగిన చెన్నపట్టణపుమనుష్యు నొకనిని సిఫారసుచేయుమని యెల్లిసుదొరకు వ్రాసెను. ఎల్లిసు రంగాచార్యుని( బంపెను. 1868 వ సంవత్సరమున రంగాచార్యులు మైసూరుకొలువులో చేరెను.

ఈపనిలోఁ జేరిన యచిరకాలముననే వానికి మఱియొకపనికూడ యధికారు లప్పగించిరి. ఆరెండవపని యిది. మైసూరుమహారాజుగారియంతఃపురముననున్న చరాస్తికంతకు జాబితా తయారుచేసి, ప్రతివస్తువుయొక్క విలువ దాని కెదురుగా వ్రాసి, యట్టిజాబితా సంపూర్ణమైనపిదప మహారాజుగారిరత్నసువర్ణాభరణములు మొదలగు గొప్ప సరకులు నిరపాయముగ నుండున ట్లేర్పాటు చేయుట. ఈరెండు కార్యము లతఁడు మెలకువతో నిర్వహించెను.

అనంతర మాచార్యుఁడు మహారాజుగారి కోటలో జరుగుచున్న దురభ్యాసముల నివారింపఁదొడంగెను. కోటనాశ్రయించి పనిపాటలులేక మహారాజుగారిడబ్బుతిని కొంద్వి స్తోత్రపాఠములుచేసి కాలక్షేపము చేయుసోమరిపోతుల ననేకుల రంగాచార్యుఁడు తీసివేసెను. ఆకాలమునఁ జిన్నమహారాజునకు మాలిసన్‌దొర చదువు చెప్పుచుండెను. అతఁడు రంగాచార్యుని యార్జవము, మనస్థైర్యముఁజూచి సంతసించి వానియం దిష్టముకలవాఁ డయ్యెను.

1874 వ సంవత్సరమున రంగాచార్యుఁడు "మైసూరులో నాంగ్లేయపరిపాలన" మను శీర్షికతో నొకచిన్నపుస్తకమునువ్రాసి దానిని లండనుపట్టణములో నచ్చువేయించి యచిరకాలములోనే యట్టిగ్రంథము మఱొకటివ్రాసి సంస్థానములోఁ జేయవలసిన మార్పులనం దుదాహరించునట్లు వాగ్దానము చేసెను. కాని రెండవగ్రంథ మెన్నఁడు వెలువడ లేదు. ఏలయన యాగ్రంథము వ్రాయకమునుపే యాచార్యుఁడు మైసూరుసంస్థానమున గొప్పపదవినొంది యేమార్పు లావశ్యకములని తాను రెండవగ్రంథమునందు వ్రాయఁదలఁచెనో యామార్పులు తాను స్వయముగాఁ జేయుటకు నితరులచేతఁ జేయించుటకుఁ దగిన యధికారమును వహించెను. మొదటిగ్రంథము వెలువడినతోడనే రంగాచార్యుఁ డసాధారణ బుద్ధిశాలి, శక్తిమంతుఁడు —

నని యెల్లవారలకుఁ దెల్లమయ్యెను. అందుచేత నప్పుడు మైసూరులో మొదటి కమీషనరుగా నుండినగార్డనుదొర రంగాచార్యునిఁ దనకు రివెన్యూ సెక్రటరీగా దీసికొనెను. అదిమొదలు వా రిరువురుఁ గలిసి సంస్థానమునందుఁ జాలమార్పులంజేసి యనేక నూతనపద్ధతులం జొనిపి సంస్థానవ్యయములు తగ్గించిరి. అదివఱకు కమీషనర్లుగానున్న ముగ్గురు తెల్లవారిని తొలఁగించి వారిబదులిద్దఱు స్వదేశస్థులనియమించిరి. అంతకుమున్ను వేయిరూపాయలు మొదలుపదునాఱువందలవఱకుఁగల డిప్యూటీకమీషనరుపదవి నిప్పుడేడువందలుమొదలు వేయిరూపాయలువఱకుఁగల యుద్యోగముగఁ జేసిరి. ఇరువదియేడసిస్టాంటుకమీషనరు పనులలోనెనిమిదనావశ్యకమనితగ్గించియామిగిలినపందొమ్మిదిపదవులనయిన మునుపటివలెఁ దెల్లవారికీయక సమర్థులయిన స్వదేశస్థులకుఁ దక్కువజీతములమీఁద నిచ్చిరి. పాతజీతములమీఁద నలుగురు డిప్యూటీకమీషనరుల మాత్రము నిలిపి తక్కినయందరినిఁ దక్కువజీతములమీఁద నల్లవారినే వేసిరి. అడవి, చదువులు, రివెన్యూ మొదలగు నెల్లడిపార్టుమెంటులలోను దెలివితేటలలో, సామర్థ్యములోఁ దెల్లవారికి రవ్వంతయుఁ దీసిపోని స్వదేశస్థులు తక్కువజీతములమీఁద దొరకుచుండఁగా నెక్కువజీతములమీఁద దెల్లవారి నేల నియోగింపవలయు నను నియమముమీఁద తక్కువజీతములమీఁద నెక్కువసామర్థ్యముగల దేశస్థులనే నియోగించుచు వచ్చెను. ఈమార్పులచేత నీ మితవ్యయముచేత నా సంవత్సరము రెండులక్షల యేఁబదివేల రూపాయలు మొత్తము ఖర్చులో తగ్గెను.

ఈమహాకార్యములకు వానిని మెచ్చి 1880వ సంవత్సరము దొరతనమువారు వానికి సి. ఐ. ఇ. బిరుదము నొసంగిరి. మైసూరునకు విదేశీయుఁడై యుండియు నాసంస్థానమున మహోన్నతపదవులనందుటచే నా దేశస్థులకు రంగాచార్యునిమీఁద నసూయ పొడమెను.

అందుచేత వారు వానిమీఁదఁగొన్ని చెడువాడుకలు బుట్టించిరి. అందుఁ బ్రధానమైన దిచ్చట నుదాహరించుచున్నాను. వెనుక రంగాచార్యుఁడు రాచనగరునందలియాభరణముల లెక్కవ్రాయ నియమింపఁబడెను గదా! ఆపనిముగిసిన యెనిమిదేండ్లతరువాత నమూల్యాభరణములు కొన్ని రాచనగరులో కనుపించుటలే దనియు, నందుకు వెనుక పనిచేసిన రంగాచార్యుఁడే జవాబు చెప్పవలయుననియు వార్తాపత్రిక లాక్రోశింపఁజొచ్చెను. వానివిరోధు లావ్రాత నాధారముచేసికొని వానిని నిందింపసాగిరి. ఈవిషయమున మైసూరుదేశమంతయు నట్లుడికిన ట్లుడికెను. ఇది వాని విరోధులుచేసిన కల్పనమేకాని సత్యము కాదు. ఆతఁ డప్పుడు మేజరుయిలియట్ అనుదొర చేతిక్రిందఁ బనిచేసినే కాని స్వతంత్రముగాఁ బనిఁజేయలేఁడు. ఆదొరయు,గార్డను మొదలగు తక్కినదొరలు వానియార్జవమును వేనోళ్ళఁగొనియాడిరి. ఈనగలు కానఁబడకపోవుట యబద్ధమనియు, గుమాస్తాలవ్రాతపొరబాటువలన జాబితాలోఁ గనఁబడ లేదుగాని నిజముగానగలుండెననియు నట్టిపొరబాటునకాగుమాస్తాలేకానిరంగాచార్యుడుత్తరవాదికాడనియు, నతనిపవిత్రవర్తనము నిర్దుష్టమనియు మైసూరుసంస్థానములో నప్పుడుండిన విల్సన్ మొదలగు గొప్పదొరలు నొక్కివ్రాసిరి.

1881వ సంవత్సరముమార్చి 25వ తేదిని రంగాచార్యుఁడుమైసూరునకు మంత్రియయ్యెను. అమాత్యుఁడై రంగాచార్యుఁడు చేసిన కార్యముల గొప్పతనమును మనము తెలుసుకొనవలయునన్న నతఁడా యుద్యోగమునంబ్రవేశించు నప్పటికి సంస్థానస్థితియెట్లుండెనోయించుక తెలియవలయును. సరిహద్దుల నున్న యింగ్లీషురాజ్యమున నున్నట్లే యన్నిడిపార్టుమెంటులలోని యుద్యోగస్థులజీతములు మితిమీఱి యుండుటచేతను, 1877 వ సంవత్సరమందు (అనఁగా ధాతసంవత్సరమందు) గొప్పకాటకముచేతను దేశను సంస్థానమునందలి ధనా

గారముగూడవట్టిపోయెను. ఆదేశమునందున్న యేబదిలక్షలజనములో పదిలక్షలను క్షామదేవత తనపొట్టపెట్టుకొనియెను. ఆచచ్చినవాండ్రం దఱు చేతిపనులు మొదలగు కాయకష్టములవలన జీవించువారగుట చే నట్టిపనులుఁగూడ నశింప దేశము మరింత పేద యయ్యెను. అతిభ యంకరమయిన యాక్షామమునఁ బనులకుఁ బంటలకుఁ గలిగిన నష్ట ము రమారమి పదునయిదుకోట్లరూపాయ లని యంచనా వేయఁబ డెను. అంతకుమున్ను చేసిన మార్పులవలన మిగిలిన స్వల్పధనము కుమారమహారాజుగారి పట్టాభిషేకమహోత్సవమునకు, నంతఃపుర వ్యయములకు విధిగా చేసికొనవలసివచ్చిన కొన్నిమార్పులకు వెచ్చిం పఁబడెను. కాటకమునకు ముందు మైసూరుగవర్నమెంటున కేఁటేఁట వచ్చు శిస్తుకకోటి పదిలక్షలరూపాయలు. అదివృద్ధిచేయుటకుఁ గా లస్థితి యనుకూలముగ లేకపోయెను. క్షామమువలన వర్తకము, చేతి పనులు మొదలగునవి క్షీణించెను. ఆంగ్లేయగవర్నమెంటువారికి మై సూరు దొరతనమువా రియ్యవలసిన యెనుబదిలక్షలరూపాయలకు నేఁ టేఁట నాలుగులక్షలరూపాయలు వడ్డిరూపకముగాఁ బోవుచుండెను. సంస్థాన మివ్విధమున దుస్థితిలో నున్నపుడు రంగాచార్యుఁడు మంత్రి గావలసివచ్చెను. ఆస్థితిని పాఱచూచిన నెంతధైర్యవంతుని మనసైన చెదరిపోవునుగదా! కీడులో మే లగునట్లు రంగాచార్యుని కీయవస్థలో నొక్కసంతోషముమాత్రము గలుగుచు వచ్చెను. కొత్తగా గద్దె యెక్కిన కుమారమహారాజునకు స్వయముగా నాలోచనముఁ జెప్పి రాజతంత్రము నడుపుటకు శక్తి లేకపోయినను మంత్రిచెప్పిన యాలో చనము గ్రహించి యతఁడు చేసిన మంచిని మెచ్చుటకైన సామర్థ్య ము గలవాఁడగుటచే రంగాచార్యుని ప్రయత్నములన్నియు నిర్విఘ్న ములుగ సాగెను.

రంగాచార్యుఁడు మంత్రియైన తోడనే వెనుక గార్డనుదొరమొ

దలు పెట్టిన మార్పులను గొనసాగింపఁ బూనుకొనెను. హాస్సాను, చిత్రదుర్గ మండలములు సివిలుక్రిమినలు వ్యవహారములనిమిత్తము వేఱువేఱు జిల్లాలుగఁ బరిగణింపఁబడెను. 9 తాలూకాలుడిప్యూటీతహసీలుదారుల యధికారముక్రింద నుంచబడెను. మూఁడుమునసబుకోర్టులు 4 సబుకోర్టులు తీసివేయఁబడెను. 8 జిల్లాల చెఱసాలలలో నైదు తీసివేయఁబడెను. బాటసారులు బసలుదిగు బంగాళాలమీఁద నదివఱకేర్పడిన జీతగాండ్రు చాలమంది తగ్గింపఁ బడిరి. ఈతగ్గింపులవలన సంస్థానమునకు సంవత్సరమునకు రమారమి రెండు లక్షల రూపాయలు మిగిలెను. ఆమార్పులు ముగిసినపిదప రంగాచార్యులు సంస్థానములోని యడవి డిపార్టుమెంటువైపు తనదృష్టిని మరల్చెను. ఆసంస్థానములో నడవులు చాలభూమి నాక్రమించియుండెను. కలపవిశేషముగ జనులకుఁ గావలసియుండెను. అందునియోగింపఁబడిన యుద్యోగస్థులదుర్నీతివలన, సరకువచ్చుటకు సులువైనమార్గములు దేశమునలేకపోవుటవల్లమహారాజున కాడిపార్టుమెంటులో రావలసినంత సుంకమువచ్చుటలేదు. ఆరాజ్యములో దొరకెడు మంచిగంధపుఁగఱ్ఱల జనులెవ్వరమ్మగూడదు. కొనఁగూడదు. దొరకినమంచిగంధపుదారువులన్నియు రాచనగరులలోనే యేదోవిధముగనుపయోగింపఁబడుచువచ్చెను. రంగాచార్యుఁ డాపద్ధతిమాన్పి చందనమందఱకు సులభసాధ్యముచేసెను. ఈపనులవలన నడవులనుండి సంస్థానమునకు హెచ్చుసుంకము రాఁజొచ్చెను. ఈవిధమునఁ గొంతద్రవ్యముమిగిల్చి యామంత్రిపదునొకండు లక్షలరూపాయలు పెట్టుబడిపెట్టి మైసూరుపరిభుత్వమువారు చిరకాలముక్రిందట తలపెట్టి నెఱవేర్పలేకపోయిన యినుపదారిని గొనసాగించెను. పొగబండ్లునడచు నినుపదారివలవలె దేశమంతట నలముకొనునట్లు వేయించవలయుననియు తని సంకల్పము. ఏలయన నవిజనులకుఁ బ్రయాణసౌకర్యముగలిగించుననియు వాణిజ్యమునభివృద్ధిజేయుననియు నింగ్లీషువారిరాజ్యముతో

మైసూరు రాజ్యముకలసి విశేషలాభప్రదమగునని యునాతఁడునమ్మెను మైసూరు రాజ్యమునందు నీటిసాగుబడికిఁ జాలవీలున్నను భూమివిశేష భాగము సాగుబడికి రాక, వచ్చినఁ జక్కఁగా సాగుబడి చేయఁబడక యుండెను. దానికిఁ గారణము వ్యవసాయము చేయువారికిఁ దగిన సహాయము లేకపోవుటయేయని రంగాచార్యులు నిశ్చయించి యిచుప దారులు దేశమునఁబ్రబలిన నీలోపము నివారింపఁ బడునని తలఁచి తత్ప్రియత్నములఁ జేసెను. సంస్థానము లేమిలోనున్నను రంగాచార్యులు దానికి భారములేకుండ నినుపదారి విశేషముగ దేశమున వేయించెను.

మైసూరుప్రభువు లింగ్లీషుదొరతనమువారి కీయవలసిన యెనుబదిలక్షలరూపాయల ఋణమును దీర్చుటనుగూర్చి యతఁడు పెమ్మట ప్రియత్నించెను. సంస్థానముయొక్క ధనస్థితినిఁబట్టి చూడఁగానీయప్పు తరతరములవఱకు దీఱునట్లు కనఁబడలేదు. ఆఋణముమీఁదనేఁటేట చెల్లుఁగువడ్డియే పెద్దమొత్తమై యసలుమాట యటుండఁగానీవడ్డియైన దీఱినంజాలునని పించు చున్నట్లుండెను. అప్పటిస్థితులంబట్టి చూడఁగా నిండియాగవర్నమెంటువారు వారిందోఁచినప్పుడుఋణముదెమ్మనిమహారాజును నిలువదీసి యడుగవచ్చును. అట్టి చిక్కు సంభవించెనా, ఋణవిమోచనమునకై సంస్థానమునకు భంగములైన పనులఁజేయవలసివచ్చునని దూరదృష్టిగల రంగాచార్యుఁడుగ్రహించి, యాయప్పును గురించి యేవోస్థిరమైనయేర్పాటులు చేయఁదలచి, యిండియాగవర్నమెంటుతో లేఖాప్రసంగ మారంభించెను. ఈజాబులలో నతఁడు మైసూరు దరిద్రదశలోనున్నదని వ్రాయుటయేగాక వెనుకటిమహారాజుల దౌర్బల్యము కతమున సంస్థానమాంగ్లేయుల యేలుబడిలోనున్నపుడు జరిగినదుష్పరిపాలనమువలనఁ జెడిపోయి యాదశకువచ్చెననినిర్భయముగా వ్రాసెను. అంధ్ఘలివిషయము లప్పటిగవర్నరుజనరలగు లిట్ట

నుపరిభువుకూడ నొప్పుకొనియె. ఈయుత్తర ప్రత్యుత్తరములవలన నింగ్లీషు గవర్నమెంటువారు మైసూరువారి ఋణముమీఁదకొంతవడ్డీ తగ్గించిరి. అనఁగా మునుపు సంవత్సరమునకు నూటికై దురూపాయలు న్నవడ్డీ నాలుగురూపాయలఁజేసిఋణమునలువదియొక్క సంవత్సరము లలో దీర్చుకొనుట కంగీకరించిరి. రంగాచార్యుఁడు తెచ్చినక్రొత్త పద్ధతు లన్నిఁటిలో నుత్కృష్టమైనదిజనప్రతినిధిసభ. స్వదేశసంస్థానములలో నిట్టిసభ యపూర్వము. ఈసభాస్థాపనకీర్తి మనదేశమున రంగాచార్యునకేదక్కెను. అతఁడీసభకు రాజ్యపరిపాలనాధికార మిచ్చుటకుఁ గాక సర్కారువారి యుద్దేశములఁ బ్రజలకెఱిఁగించుటకును సర్కారుచేయఁబోవుచట్టముల వారికి ముందుగాఁ దెలుపుటకును రాజునకుఁ బ్రజకు నెడతెగని సంబంధముగలించుటకు రాజక్షేమమే ప్రజాక్షేమము ప్రజాక్షేమమే రాజక్షేమము నను మాటలు వారి మనంబున నాటించుటకు నీసభ సృష్టించెను. ఈసభక్రొత్తగాఁ బెట్టినప్పుడు దాని ననేకులుగహించి రంగాచార్యులదివఱకు దేశస్థులనేకులకువిరోధియై నందున నెట్లైన వారి యనురాగము పడయుట కీపని జేసెనేకానియది నిలుచునదికాదని జనులు గోలుపెట్టిరి. కాని యిప్పటికి నీసభసాగుచు నేయున్నది. అతఁడింకను చాలమార్పులుదెచ్చి దేశమునకు మేలు చేయఁదలఁచెను. కాని 1882 వ సంవత్సరాంతమున జబ్బుపడి చెన్నపురికిఁబోయి యచ్చట మృతినొందెను. అతని నెఱిఁగిన తెల్లవారు నల్లవారు వాని మరణము మైసూరునకేగాక దేశమునకంతకు నష్టకారియని వగచిరి. బ్రతికియుండఁగానతని మీఁద నెన్నోయపనిందలు మోపి వేధించిన మైసూరుజనులు తరువాత వాని సుగుణసంపద తెలిసినవారై బిట్టు వగచిరి.

# సేలము రామస్వామి మొదలియారి.

రామస్వామి మొదలియారి 1852 వ సం॥రము 6 వ శెప్టెంబరు తారీఖున సేలములో జన్మించెను. అతఁడు సేలములో మిక్కిలిగౌరవముగల కుటుంబములోఁ జేరినవాఁడు. ఈతని ముత్తాతయగు వెంకటాచలము మొదలియారి మన దేశమును పూర్వము పాలించిన యీస్టిండియాకంపెనీయొద్ద దుబాసిగానుండెను. ఈయనతండ్రి గోపాలస్వామి మొదలియారి, గొప్పయినాందారై యుండుటయేగాక చాలకాలము తహసిలుదారుగనుండి 1867 వ సంవత్సరమందు పించనుపుచ్చుకొనెను.

రామస్వామి మొదలియారి యాఱవయేఁటనే విద్యాభ్యాసము నిమిత్తము చెన్నపట్టణమునకంపఁబడెను. ఈతఁడు మొట్టమొదట చెన్నపట్టణపు హైస్కూలులోఁ జేరి చదువనారంభింప నాపాఠశాలలోఁ గ్రిందితరగతులు తీసివేసినందున పచ్చయ్యప్పపాఠశాలలోఁ జేరిచదివెను. అక్కడ కొంతకాలముచదివి రామస్వామిప్రసిడెన్సీకాలేజిలోఁ జేరి విద్య ముగియువఱకు నక్కడనేచదివెను. ఆకాలమున నతఁడుమిక్కిలి చురుకుతనముగలవాఁడై యుపాధ్యాయుల దయకుం బాత్రుఁడై బుద్ధికుశలతవల్ల ననేకబహుమానములనందెను. ప్రవేశపరీక్షలోఁ గృతార్థులైన మొదటిపదునైదుగురిలో నొకఁడై యుండుటం జేసియతనికిదొరతమువారు విద్యార్థివేతనము నిచ్చిరి. ప్రథమశాస్త్రపరీక్షయందతఁడాసంవత్సరము మొదటివాఁడుగఁగృతార్థుఁడయ్యెను. అనంతరము పట్టపరీక్షయందుఁగూడనతఁడుమొదటితరగతిలో మొదటివాఁడుగ దేఱెను. రామస్వామియొక్క పూనికకుబుద్ధికుశలతకుసత్ప్రవర్తనమునకుఁబ్రధానోపాధ్యాయుఁడగుథామ్సనుదొరమిక్కిలిసంతసించి పట్టపరీక్షయందుఁ గృతార్థుఁడైనవెంటనే యాతనికిఁ దనకళాశాలలోనిం

గ్లీషు పండితోద్యోగ మిచ్చెను. కాని తనకంటె తక్కువగా (అనఁగా రెండవవాఁడుగఁ) బట్టపరిక్షయందుఁ గృతార్థుఁడైన యొక మిత్రుఁడు చాల పేదతన మనుభవించుచు నుద్యోగమునకుఁ బ్రియత్నించుట యెఱింగి రామస్వామి దయాళువగుటచేఁ దన కాయుద్యోగ మక్కఱలేదని చెప్పి యామిత్త్రున కిప్పించెను.

ఇట్లు 1871 వ సం॥మున నతఁడు పట్టపరిక్షయందుఁ గృతార్థుఁడై విద్యాసక్తి యప్పటికినిఁ బోనందున నాకళాశాలలోనే యుండి యం. యె. (అనఁగా సర్వకళాధికారి) పరిక్షకుఁ జదివి యందు 1873వ, సంవత్సరమునఁ గృతార్థుఁడయ్యెను. అనంతరము బి. యల్. పరిక్షకుం జదివి 1875 వ సంవత్సరమున దానియందును మొదటివాఁడుగఁ దేఱెను. 1876 వ సం॥ ము హైకోర్టు వకీలుగాఁ జేయఁబడి రామస్వామి మొదలియారి స్వగ్రామము నగు సేలములోనే న్యాయవాదిగ నుండఁదలఁచి యక్కడ పనిచేయనారంభించెను. నిగర్వియై పనిజేయుటలో మిక్కిలి పూనిక గలిగియుండినందున రామస్వామి జిల్లాజడ్జికిష్టుఁడగుట యే కాక సేలములోనున్న స్వదేశస్థుల కందఱకు మిక్కిలి యిష్టుఁ డయ్యెను. అతఁ డక్కడ కొన్నిమాసములుమాత్రమే పనిఁ జేసి దొరతనమువారి కొలువులోఁ జేర నిచ్ఛ గలవాఁడై డిస్ట్రిక్టు మునసబుపనికిఁ బ్రియత్నముఁ జేయ నిశ్చయించుకొని జిల్లాజడ్జిద్వారా దరఖాస్తు పంపఁగా నా దరఖాస్తుమీఁద జడ్జి యాతని నిరుపమానబుద్ధికుశలతనేగాక సత్ప్రవర్తనమునుంగూడ శ్లాఘించి యన్నివిధములచేత నతఁ డాయుద్యోగమునకుఁ దగినవాఁడని వ్రాసెను. అనంతర మతఁడు 1876 వ సం॥ ననే తిరుచునాపల్లిలో డిస్ట్రిక్టుమునసబుగాఁ జేయఁబడెను. ఈయన నిష్పక్షపాత బుద్ధికి సత్యసంధతకుఁ బేరువడెను. వ్యవహారములలో స్వతంత్రముగాను మనసునకుఁ దోఁచిన విధముగాను పక్షపాతరహితముగాను వర్తింపవలయుననియే యాతని సం

కల్పము కాని యితరులు సిఫారసులుచేసి తనవ్యవహారములలో జో క్యముఁ గలుగఁజేసికొనుట యాతని కెంతమాత్రము నిష్టము లేదు. ఈయన నిష్పక్షపాతబుద్ధిం దెలుపుట కొక చిన్న కథ గలదు. ఒక నాఁ డీయన కోర్టులో నొక వ్యవహారమునం దగులుకొని యున్న యొకమనుష్యుఁడు రామస్వామి మొదలియారి కెవనియెడ మిక్కిలి గౌరవముగలదో యట్టి గొప్పగృహస్థునియొద్దనుండి యొక సిఫారసు జాబుఁదెచ్చి వ్యాజ్యము తన పక్షముఁ జేయుమనికోరెను. మొదలి యారి యామనుష్యుని సగౌరవముగ నాదరించి తనయింటనే బసయి చ్చి తనబండిమీఁదనే గూర్చుండఁ బెట్టుకొని కోర్టునకుఁ దీసికొని పోయెను. ఆ గౌరవము నా యాదరణముం జూచి జాబుఁ దెచ్చిన మ నుష్యుఁడు న్యవహారము తనపక్షముగానే తీర్పుచేయఁబడునని యది యెప్పుడు విందునాయని యూఁటలూరు చుండెను. అంతలో మునస బు బెంచియెక్కి యామనుష్యున కాశాభంగముఁ గలుగునట్లు వ్యతి రేకముగాఁ దీర్పుఁ జెప్పెను. అదివిని యామనుష్యుఁడు సిగ్గుపడి గా మస్వామి మొదలియారి మొగమైనం జూడక పాటిపోయెను. ఇట్లు చేయుటయేగాక మొదలియారి యొకటి రెండుసారులు బెంచి మీఁ దనుండి వ్యవహారములం జిక్కువడినవారు పెద్దమనుష్యులయొద్దనుండి సిఫారసులందెచ్చి న్యాయాధిపతుల మనస్సుల ధర్మమార్గములనుం డి త్రిప్పఁ బ్రయత్నించుట ఘోరమనియు దూష్యమనియు నొక్కి పలికెను. ఈవిధముగా నతఁడు మంచిగంధములో నొకయడుగు, నగ్నిహోత్రములో నొకయడుగు బెట్టెనను సామెత నిజముగా నెడ మపక్క కొరుగక కుడిపక్క కొరుగక న్యాయమార్గమున ముక్కు కుసూటిగఁ బోయెను.

ఒకసారి తనకచేరిలో సర్కారుసొమ్ముకొంతపోఁగా గుమాస్తా లలో నెరరికే యిబ్బందిరాకుండఁ దనచేతి సొమ్మిచ్చి యాసొమ్ముఁ

బూర్తి చేసెను. అటులాఱు సంవత్సరములు ముసనబుగానుండి దొర తనమువారి కొలువులోఁ దన తెలివి తేటలు విశేషముగాఁ బ్రకాశిం చుట కవకాశము లేదని గ్రహించి యాకొలువు మానుకొనెను. అత ని కాశాభంగము కలిగినను దొరతనమువారి కొలువుసేయుటవలన నతని సామర్థ్యము న్యాయదృష్టి మొదలగునవి పైయధికారులకు లోకులకుఁ దెలియుటవలన గీర్తిలాభము కలిగెను. ఆతఁ డుద్యోగము రెండుసారులు మానుకొనఁదలఁచినను దమకట్టి యుద్యోగస్థుఁడు దొ రకఁడని పైయధికారు లాతని విడువరైరి. ఎట్టకేల కతఁడు దృఢని శ్చయుఁడై మూఁడవసారి యుద్యోగమును విడిచి 1882 వ సంవత్సర మునఁ జెన్నపట్టణమున హైకోర్టులో వకీలుగాఁ బనిచేయుటకుఁ బోయెను. ఆయన హైకోర్టులో సాధారణముగ నప్పీళ్ళు పుచ్చు కొని వాదము చేయుచుండెను. ఆయనకుఁ దెలిసినట్లు ధర్మశాస్త్రము (లా) మఱియొకరికిఁ దెలియదని యాకాలమున ననేకు లభిప్రాయ పడిరి. ఆయన తన పొట్టపోసికొనుటకు మాత్రమే ధర్మశాస్త్రముల నభ్యసింపక యాశాస్త్రమర్మములను సమూలముగాను సమగ్రముగా ను దెలిసికొన నభిలాషగలవాఁడై చదివి లాపత్రిక నొకదానిని స్థాపిం చి దానికి తానే ప్రధాన పరివర్తకుఁడుగా నుండి 1891 వ సంవత్సర ము వఱకు నడపెను. చెన్నపట్టణము యూనివరసిటీవారు రామస్వా మి మొదలియారియొక్క ధర్మశాస్త్ర పాండిత్యమును ద్రవిడభాషా పాండిత్యమును దెలిసికొని యాయనను బి. యల్. పరీక్షకు, యం. యల్ పరీక్షకు ద్రవిడభాషలో బి. యే. పరీక్షకుఁ బరీక్షకుఁడుగా నియమించిరి.

1887 వ సంవత్సరమున యూనివరిసిటీలో నతఁడు ఫెల్లోగా నియమింపఁబడెను. న్యాయవాదిగ నుండి ధనమార్జించుటతోఁ దని వినొందక మొదలియారి దక్షిణహిందూస్థాన రాజకీయ వ్యవహారము

లలోఁ బ్రవేశించి దేశాభివృద్ధికిఁ జాల కృషిఁజేసెను. ఈవ్యవహారము లలోఁ నతఁడెంత ధైర్యశాలియో యీక్రింది పనివల్లఁ దెలిసికొనవచ్చును. 1883 వ సంవత్సరమునఁ జెన్నపురి గవర్నరుగారి యాలోచన సభలోని సభికుఁడొకఁడు పించనుపుచ్చుకొని యింగ్లాండునకుఁ బోవ నుద్యుక్తుఁడై యుండఁ జెన్నపురవాసు లాయనను గౌరవించి యుత్సవములఁ జేయఁ దలంచిరి. అట్టియుత్సవములఁ జేయుట కూడదని రామస్వామి మొదలియారి నిరాఘాటముగాఁ బలికెను.

చెన్నపట్టణములో స్థాపింపఁబడిన మహాజనసభ, తెల్లవారు నల్లవారిని మునుపటియట్లనాదరము సేయక గౌరవముతోఁ జూచునట్లు చేయుటకు దక్షిణ హిందూస్థానమున స్వదేశస్థుల మొఱలు ధైర్యముతో దొరతనమువారికి విన్నవించుటకు ముఖ్యాధారమయ్యెను. ఆమహాజనసభలో రామస్వామి మొదలియారి ప్రధానపురుషుఁడన్న మాట యెల్లవారికి విదితమే.

హిందూదేశ పరిపాలమునుగూర్చి నిజమయిన స్థితిగతుల నెఱుఁగక యింగ్లాండులోనుండు నాంగ్లేయులకు, యథార్థస్థితిఁ దెలియఁ జేయుటకు మన దేశస్థులలోఁ గొందఱింగ్లాండునకుఁ బోవుట యుచితమని మన దేశాభిమాను లనేకులు తలంచి చెన్నపట్టణమునుండి రామస్వామి మొదలియారిగారిని మనరాజధానికిఁ బ్రతినిధిగాఁ బంప నిశ్చయించుకొనిరి. ఈపనినిమిత్తమే బంగాళమునుండి బాబు సురేంద్రనాథ బెనర్జిగారును బొంబాయినుండి మఱియొకరును బంపఁబడిరి. రామస్వామియు సహ ప్రతినిధులుఁ గలిసి యింగ్లాండులోఁ జాల సభలుచేసి హిందూదేశ వ్యవహారములను వారికి సుబోధకములుగఁ జెప్పిరి. ఇతఁ డక్కడనున్న దినములలో నాదేశస్థులలోఁ గొందఱితని సహాయమున హిందూదేశరాజకార్యములను గూర్చి చర్చలు సలుపుట కొకసభ స్థాపించిరి. ఈతఁడును దక్కినప్రతినిధులుఁ జేసిన యు

పన్యాసములనుబట్టి యాకాలమున హిందూదేశ పాలనముగూర్చి మె
క్కువపని జేయవలయునని యాంగ్లేయులకుఁ దోఁచెను. తక్కినవారి
యుపన్యాసము లటుండగా రామస్వామి మొదలియారి యుపన్యాస
ములు విశేషప్రీతి నింగ్లాండుజనులకొనంగెను. ఏలయన నాయన
మొగము కాటుక కన్నులు గలిగి మంచి తేజస్సుగలిగి యెంతో సుం
దరమై చూచినంత మాత్రముననే యెల్లవారలకు నాతనిమీఁద నాద
రము గలుగఁ జేయునట్లుండెను. అతని సంభాషణ మాకారమునకు
దగినట్లె గంభీరమైయుండెను. ఇంగ్లాండులోఁ గొంతకాలముండుటచేత
రామస్వామి మొదలియారి యాంగ్లేయ భాషాప్రవీణతయు వాగ్ధోర
ణియు మిక్కిలియధికము లయ్యెను. హిందువులయెడల నమ్మికయుం
చి యాదరముతో రాజ్యపరిపాలనము జేయుఁడని యాతఁడు కృపార
సముట్టిపడునట్లు జేసినయుపన్యాసములు వారిహృదయములమీఁద
ముద్రితములైనట్లుండెను.

రామస్వామి మొదలియారి సముద్రయానముఁ జేసి విదేశము
లఁ గొంతకాలము గడిపినను హిందూధర్మములకు విరుద్ధములుగనెన్నఁ
డు నాచరింపక మనదేశపు సేవకునొకని వెంటఁబెట్టుకొనిపోయి వాని
చేతియన్నమే తిని కాలక్షేపముఁ జేసెను. ఇంగ్లాండు దేశస్థు లనేకు
లతనిని విందులకుఁ బిలువగా బోవక పోకతప్పనప్పుడు పోయి వారిచే
తి మాంసాదులు భక్షింపక కాయగూరలు పండ్లుమొదలగువానిభ
క్షించుచువచ్చెను. ఆతనికులస్థులుగూడ నాతని నియమము లిట్టివని
మెచ్చెంగి సణుగుకొనక గొణుగుకొనకయనుచితములై యర్థములేనిప్రా
యశ్చిత్తముల నిధింపక రాఁగానే యతనింగులములోఁ జేర్చుకొనిరి.
రామస్వామి మొదలియారి తిరిగి స్వదేశమునకు వచ్చినప్పుడు చెన్న
పురవాసు లాయనయెడఁ జూపిన సన్మానమిట్టిది యని వర్ణింపరా
దు. సేలములోఁ జరిగిన సన్మానము చెన్నపురిలో జరిగినదానికంటె వి

శేషముగా నుండెను. ఇంగ్లాండునుండి స్వదేశమునకు వచ్చినతోడనే యాతనిపై మఱియొక కార్యభారము పడెను.

188౬ వ సంవత్సరమున గవర్నమెంటువారు పబ్లికు సర్వీసు కమీషన్ అనుపేర నొకసభ నేర్పఱచిరి. ఆసభలోఁ గొందఱు తెల్లవారు మేటికెక్కిన స్వదేశస్థులుకొందఱు సభ్యులుగా నియమింపఁబడిరి. సర్ రొమేశ్చంద్రమిత్తర్ బంగాళమునుండియు, సర్గాకరనునతఁడు బొంబాయినుండియుఁ జెన్నపురమునుండి రామస్వామిమొదలియారియు మఱియొకచోటనుండి భీంగారాజు సభికులుగా నియుక్తులయిరి. ఈసభ చేయవలసినపని యేమనఁగా దొరతనమువారి కొలువులో నదివఱకు స్వదేశీయు లెందఱున్నారో విశేషముగా వారినిఁగొలువులోఁ జేర్చుకొనవలయునా, లేదా యెట్లు చేర్చుకొనవలయు ననువిషయములంగూర్చి విచారణచేసి దొరతనమువారికి రిపోర్టుపంపుట. రామస్వామి మొదలియారి యప్పటికి ముప్పదియారేండ్ల వయసు గలవాఁడయినను మిక్కిలిలోకానుభవము గలపెద్దలతో సమానముగఁ గార్యనిర్వహణముఁ జేసెను. ఎంతోగొప్పబుద్ధిశాలియైనం గాని దొరతనమువా రంత చిన్నవానినంత గొప్పకమీషనులోఁ గూర్చుండఁబెట్టరు. పెట్టినందు కతఁడు తీసిపోక తగినట్లు పనిచేసెను.

ఈయన దేశీయమహాసభమీఁదఁగూడ చాలనభిమానముకలిగి పనిచేసెను. ఒకసంవత్సర మీయనను దెశియమహాసభ కధ్యక్షుఁడుగా నుండవలయు నని తత్సభానిర్వాహకులు కోరఁగా నితఁడాగౌరవంబునకుఁదగినవారు తనకంటె పెద్దలున్నా రని నిరాకరించెను. అంత దేశాభిమానము నంతవిద్య నంతయోగ్యత యంతధైర్యముఁగలయీ సత్పురుషుని నలువదియేండ్లు నిండినతోడనే మృత్యుదేవత 1892 వ సంవత్సరము దనపొట్టం బెట్టుకొనియె. ఇందుచేత దక్షిణహిందూదేశము దురదృష్టవంతమని చెప్పనొప్పు.

# సర్. కె. శేషాద్రి అయ్యరు

ఈయనబొమ్మ దొరకలేదు. శేషాద్రియ్యరు చెన్నపురిరాజధానిలో మలబారుజల్లాలోనున్న పాలఘాటునకు సమీపమందున్న కుమారాపురముగ్రామమున 1845 వ సంవత్సరము జూనునెల యొకటవ తేదీని జన్మించెను. ఆయన కళ్లికోటలోనున్న దొరతనమువారి పాఠశాలలో మొట్టమొదట విద్యాభ్యాసము చేసెను. ఆపాఠశాల గోడలమీఁద నిప్పటికిని నీయనపేరు బంగారువర్ణములతో వ్రాయఁబడి మెఱయుచున్నది. అక్కడ చదువు ముగిసినపిదప నతఁడు చెన్నపురికిఁబోయి ప్రిసిడెన్సికాలేజీలోఁ జేరి 1866 వ సంవత్సరమునఁ బట్టపరీక్షయందు గృతకృత్యుఁడయ్యెను. తరువాత కొన్నియేండ్లకాయన బి. యల్. పరీక్షలోఁగూడ కృతార్థుఁడయ్యెను. విద్యముగిసినపిదప శేషాద్రియయ్యరు మలబారుజల్లాకలెక్టరగు బేలర్దు దొరచేత నతనికచేరీలో భాషాంతరీకరణముఁ (తర్జుమా) జేయునుద్యోగస్థుఁడుగా నియమింపఁబడెను. కాని శేషాద్రి చిరకాల మాయుద్యోగములో నుండలేదు.

శేషాద్రి చదువుకొన్నకాలమునందే రంగాచార్యులతో స్నేహము చేసెను. అందుచేత రంగాచార్యులు మైసూరు సంస్థానమున నుద్యోగము సంపాదించినప్పుడు శేషాద్రినిఁ బిలిపించియష్టగ్రామమండల మండలాధికారియొద్ద శిరస్తాదారుగ నేర్పరిచెను. శేషాద్రి మైసూరు సంస్థానమున గొప్పపేరు నంపాదించుటకు మిక్కిలియవకాశ ముండెను. సహజముగబుద్ధిసూక్ష్మతయుమంచిపూనికయుఁగలవాఁడగుటచే నయ్యరు తనపాలఁబడిన కృత్యములెల్ల నతిశ్రద్ధతో నెఱవేర్చుచు వచ్చెను. ఆయన ప్రవేశించు నప్పటికి మైసూరుప్రభువు బాలుఁడై సం

దున నాంగ్లేయదొరతనమువారి పాలనలో నుండెను. ఈయనచేరినప దమూఁడేండ్లకు యుక్తవయసు ప్రాపించినందున సంస్థానము మహారాజున కప్పగింపఁబడెను. ఈ పదమూఁడేండ్లలో శేషాద్రియ్యరు చాల డిపార్టుమెంటులలోఁబనిచేసి పరిపాలనవిధాన మంతయు నేర్చుకొనెను. 1873 వ సం॥రమునందు మైసూరులో జ్యూడిషల్‌కమీషనరుగానుండిన సర్ జేమ్సుగార్డన్‌దొర శేషాద్రినితనకోర్టులోఁ బెద్దశిరస్తదారుగ నియమించెను. అనంతర మతఁడా సంస్థానమున నశిస్టాంటు కమీషనరుగా నేర్పరుపఁబడెను. ఆయుద్యోగమున మూఁ డేండ్లున్నపిదప నాయనమహారాజుగారి మందిరమునకు కంట్రోలరుగ నేర్పఱుపబడెను. ఆయుద్యోగములోనుండి యతఁడు తుముకూరుజిలా డిప్యూటి కమీషనరుగాను జిల్లామేజస్ట్రీటుగాను మార్పఁబడెను. ఈయుద్యోగమునందు శేషాద్రియ్యరు దేశపరిపాలనమునందు తనకుఁగల సామర్థ్యమునుఁజూపుటకు విశేషముగా నవకాశము గలిగెను. ఆ సామర్థ్యమును జూచి పైయధికార్లు శేషాద్రిజిల్లాకలెక్టరు పదవియందేగాక దానికంటె నెక్కువపదవులయందు నిలుపఁబడఁదగినవాఁ డని గ్రహించిరి.

సంస్థానము మహారాజుగారి కప్పగింపఁబడిన తర్లువాత రంగాచార్యులు మంత్రియయ్యెను. మంత్రియైనతోడనే యాయనచట్టములు శిక్షాస్మృతులు నిబంధనలు మొదలగునవి వ్రాయుటకు బుద్ధిశాలియగు శేషాద్రయ్యరు నేర్పఱచెను. రంగాచార్యులు సుఖించుటకు మంత్రి కాలేదు. ఆతఁడు చేయవలసినకార్యములు విశేషముగానుండెను. రంగాచార్యులు మిక్కిలి సమర్థుఁడు. విశేషించి సత్పరిపాలనము చేసి సత్కీర్తి సంపాదింపవలయుననుకోరిక గలవాఁడు. కావున నెంతోఁ జేయవలయునని కొండంతయాశతోఁ బరిపాలన మారంభించెను. దేశముయొక్కధనస్థితిబాగుచేయుట కాయన యెన్నోక్రొత్తయేర్పా

టులు జేసెను. మంత్రిగానున్న రెండేండ్లలోనే తానుబ్రతికియున్న పక్షమునజనులకుఁగలుగుసౌఖ్యముఁ లెట్లుండునోకొంతవఱకురుచిచూపెను. కానిమైసూరుసంస్థానవ్యవహారములనునడపుటకు మిక్కిలిగడితేరినద్రిట్టకావలసినసమయమందే దేశస్థులదురదృష్టమున రంగాచార్యుఁడు కాలధర్మమునొందెను. రంగాచార్యుఁడు బ్రతికియున్నప్పుడే శేషాద్రయ్యరు ముందుమిక్కిలి కాగలవాఁడని యాతనిమీఁద నెంతో యాస పెట్టుకొనియుండెను. రంగాచార్యుఁడు పోయినపిదప శేషాద్రి యాస్థానమునఁ గూర్చుండుట కర్హుఁడగునా కాఁడా యని గొప్ప సందేహము కలిగెను. కాని కాలమే యెల్లసందేహములనుబాపి శేషాద్రియ్యరు మొదట జనులనుకొన్నదానికంటె నెక్కువసమర్థుఁడని నిరూపించెను. 1883 వ సంవత్సరము ఫిబ్రేవరు 12 వ తారీఖున శేషాద్రయ్యరు మైసూరు సంస్థానమునకు మంత్రిగా నియమింపఁబడెను.

మంత్రియగు నప్పటికతఁడు పడుచువాఁడగుటచేతను వెనుకటి మంత్రిచేయవలసిన మార్పులకెల్ల దారిఁజూపించుటచేత నీతనికిఁబరిపాలనము సులభమయ్యెను. అప్పటికాయనముప్పదియెనిమిదియేండ్లవాఁడు. కావున తానుచేసిన మార్పుల ఫలములు కన్నులారఁ జూచుటకు ననుభవించుటకుఁ జిరకాలముజీవించెను. ఆకస్మికముగాగొప్పరాజ్యమను నావయొక్క చుక్కానను ద్రిప్పవలసిన వాఁడగుటచే నతఁడు క్రొత్తదారులంబోవక రంగాచార్యుఁడుచూపిన మార్గములనేనడచి యతఁడు వేసినపద్ధతులనే యవలంబించిపరిపాలింపఁదొడఁగెను. సంస్థానము మహారాజున కప్పగింపఁబడకపూర్వము 1877 వ సంవత్సరమున దేశమున గొప్ప కాటకముసంభవించెను. ఆకఱవుబాధల నివారించుటకు సంస్థానమునకు ముప్పదిలక్షలరూపాయ లప్పయ్యెను. ఈయప్పు నింగ్లీషు దొరతనమువారే యిచ్చిరి. అందుచేత నేఁటేఁట దానివడ్డి నిచ్చుకొను భారమేకాక మఱియొకసారికాటకముసంభవించునప్పుడు జనక్షయము

కాకుండుట కేర్పాటులుచేసికొనవలసిన భారముగూడ సంస్థానముపైఁ బడెను. కాటకములనివారించుటకురంగాచార్యులు దేశముననినుపదారి ప్రబలముగా వేయింప నారంభించెను. శేషాద్రియ్యరుగూడ నాతని మార్గమే యవలంబించి యినుపదారులను వేయింపసాగెను. ఆయన మంత్రియైన రెండుసంవత్సరములలో పున దేశమున రమారమి నూట నలువదిమైళ్లపొడవుగల యినుపదారి వేయఁబడెను. దానినిమిత్తమైన కర్చులలో నిరువదిలక్షలుమాత్రమే ఋణమయ్యెను. తక్కినధనము సంస్థానపుటాదాయమునుండియే వ్యయముచేయఁబడెను. ఈయినుప దారివలనఁ బోగుపడినధనము నతఁడు మఱికొన్ని మండలములలో నినుపదారులు వేయించుటకుగావిని యోగించెను. నాలుగేండ్లతరువాత బెంగుళూరు హిందుపూరినుపదారిసమాప్తమయ్యెను. అదివఱకు క్షా మములకు మిక్కిలిజడిసిన మండలములన్నియు నినుపదారులచేతజుట్టు వడి యెన్నికఱవులువచ్చినను భయములేని స్థితిలోనుండెను. ఆయన యధికారమును బూనసప్పటికి దేశమున రమారమియేఁబదియెనిమిది మైళ్ళయినుపదారియుండెను. 1901 వ సంవత్సరమందాయనయుద్యో గము మాను నప్పటికి నాలుగువందల మైళ్ళ యినుపదారి వేయఁబడి యుండెను.

ఈయన చేసినపని యొక్కయినుపదారియేకాదు. పొలములకు జక్కని నీటిపాఱుదలఁ గలిగించుట కీయన విశేషశ్రమపడెను. ఆయన పరిపాలన మారంభించిన మొదటిపన్నెండుసంవత్సరములలోనురమా రమి కోటిరూపాయలను ఖర్చుపెట్టించి మూడువందలయేఁబదియైదు చదరపుమైళ్లభూమిని దంపసాగుబడిక్రిందికిఁదెచ్చెను. ఇట్లు తెచ్చుటవల్ల సంస్థానమునకు సంవత్సరమున కెనిమిదిలక్షలరూపాయల శిస్తు లధిక ముగాఁ జెల్లుచువచ్చెను. ఖర్చులుతగ్గించుట, క్రొత్తమార్పులు చేయు యుట, యేకకాలముననే జరుగుచువచ్చెను. అందుచేత సంస్థానముధ

సవిషయమున దినదినము మహాద్భుతముగావృద్ధిపొందెను. ఆయనయ ధికారమును బూనునప్పటికి సంస్థానమునకున్న ముప్పదిలక్షలఋణము 1888 వ సంవత్సరమున ననఁగా నైదేండ్లనాఁటికి సంపూర్ణముగఁ దీర్చివేయఁబడెను. తరువాత నేఁడేండ్ల కనఁగా 1895 వ సంవత్సరమున శేషాద్రియయ్యరు జనప్రతినిధిసభనుబిలిపించి యాసభికులతో సంస్థానముయొక్క స్థితిగతులఁజెప్పునవసరమున నప్పటికిసంస్థానపుఖజానాలో నొకకోటి డెబ్బదియాఱులక్షలరూపాయలు నిలువయున్నవనిచెప్పెను. 1883 వ సంవత్సరమున ననఁగా నీతఁడు క్రొత్తగామంత్రియైనసంవత్సరము సంస్థానమునకువచ్చిన శిస్తొకకోటిమూఁడులక్షలు. శేషాద్రియ్యరు మంత్రిపదవినిమానుకొనినప్పుడు సంస్థానముయొక్క శిస్తొకకోటియెనుబదిలక్షలు. ఇట్లతిశయమైన శిస్తుపన్ను లెక్కువకట్టుటవలనఁగాని ప్రజలంబీడించుటవలనంగాని రాలేదు. శేషాద్రయ్యరు నిరంతర మభివృద్ధిమీఁదనే దృష్టినిలిపి, పన్నులయొత్తుడు ప్రజలకుఁగలుగనీయక సంస్థానమునకు ధనలాభముకలుగు నుపాయములు వెదకుచు నట్టిపనులందుఁ జొరవతోఁ బ్రవేశించుచువచ్చెను. ఇంజినీరింగు డిపార్టుమెంటువారినిఁ జాలప్రోత్సాహముఁజేసి క్రొత్తజలాధారములు దేశమునకుఁ గల్పించెను. ఎక్కువజాగ్రత్తయుఁ దక్కువ ధైర్యముగల మంత్రులుసాధారణముగాఁ బ్రవేశింపనొల్లని దుర్లభకార్యములలో నీతఁడవలీలగాఁ బ్రవేశించెడువాఁడు. ఈయనచొరవఁజేసి ప్రవేశించుటచేతనే బెంగుళూరు జనులు హాయిగాఁద్రాగుటకు నీమంచినీరు లభించెను. ఈయన చొరవచేయనిచో హగారినదిమీఁద నానకట్టుకట్టఁబడక యుండును. ఈ యానకట్టువలన ముప్పదియైదుమైళ్లు చతురముగలచెఱువేర్పడెను. ఈ చెఱువువలన నెన్నోయకరములనేల సాగుబడియగుచున్నది. ఇవిగాక యీయన యుద్యోగముచాలించుకొనకమును పు మఱియొకపెద్దయెత్తునెత్తెను. కావేరీనది కొండలనుండి క్రిందికిదిగుచోటనుండియంత్రాది

సాధనములవలన నదీజలమును మైసూరు సంస్థానమునకుఁ జక్కఁగాఁ బరినమింప జేయవలయునని యాయన సంకల్పించెను. దీనివలన మైసూరు సంస్థాన మిప్పటికంటె రెట్టింపు భాగ్యవంతమగును. ఈయన మంత్రిగానుండిన పదునెనిమిది సంవత్సరములలోను నీటిపాఱుదలం గూర్చి యాయన ఖర్చుచేసినసొమ్ము రమారమి నాలుగుకోట్లరూపాయలు. కాలమున కనుగుణముగా నుండునట్లు శేషాద్రియ్యరుఁగూడ నెన్నియో క్రొత్తడిపార్టుమెంటులఁ గల్పించి వాటిలోఁ బనిచేయుటకుఁ దన దేశమున సమర్థులు లేనపుడు విదేశములనుండి ప్రకృతిశాస్త్రజ్ఞానము లోకానుభవముంగల సత్పురుషులం బిలిపించుచు వచ్చెను. మునుపున్న డిపార్టుమెంటులంగూడ పైనుండి క్రిందివఱకు సంపూర్ణముగా మార్చివేసెను. మైసూరు సంస్థానమున కోలారుజిల్లాలో బంగారపు గనులు కలవు. ఈగనులను యూరోపియనులు కౌలుకుఁ బుచ్చుకొని పూర్వము సంవత్సరమున కేబఁదివేల రూపాయలచొప్పున మహారాజావారి కిచ్చుచుండువారు. శేషాద్రియ్య రాగనులను ద్రవ్వుటలో మఱింత ప్రోత్సాహము గలిగించి యిపుడు సంవత్సరమునకుఁ బదునైదులక్షల రూపాయలు రాఁబడివచ్చునట్లు చేసెను. ఎంతబుద్ధిశాలియైన నెంతబలవంతుఁడైన మనుష్యుఁడు మతజ్ఞుఁడేగాని సర్వజ్ఞుఁడు కాఁడుగదా! అందుచే శేషాద్రియ్యరు రాజ్యపరిపాలనములోఁ బెక్కులోపములు చేసియుండవచ్చు. రైతులకుపయోగకరముగా నుండుటకీయన కృషినిధులను స్థాపించెను. కృషినిధులనఁగా రైతులకుమిక్కిలి తక్కువ వడ్డిని యప్పులిచ్చెడు బ్యాంకులు. పంటకాఁపులు సాధారణముగా నూటికి రూపాయి యెనిమిదణాలు రెండురూపాయిలు వడ్డికి సొమ్ము దెచ్చుకొని యాఋణము దీర్చలేక నానాఁటికి దుస్థితిలోనికి వచ్చుటఁ జూచి వారి స్థితి బాగుచేయుటకీయన యీనిధులఁ గల్పించెను. కాని యవి యనుకొన్నంత

కార్యకారులు కాలేదు. ఇంక నతఁడు చేసిన ప్రయత్నములలో నెఱ వేఱనివి కొన్ని యున్నవి. కాని నెఱవేఱిన కార్యము లనంతములుగా నుండుటచేఁ జెప్పబోయినవానిని మనమెత్తుకొన నక్కఱలేదు. మైసూరు నిప్పుడున్న స్థితికిఁదెచ్చిన మహనీయుఁ డీయనయే యనినిశ్చయముగాఁ జెప్పవచ్చును. శేషాద్రియ్యరుయొక్క సత్పరిపాలనము మైసూరు ప్రభువునొద్దనుంచి ప్రజలయొద్దనుంచి మెప్పులుదెచ్చుటయేగాక యాంగ్లేయప్రభుత్వము వారియొద్దనుంచికూడ నాయనకు మెప్పులు తెచ్చెను.

1887 వ సంవత్సరము ఫిబ్రేవరు నెలలో గవర్నరు జనరలుగా రగు ఢఫిరిను ప్రభువుగారు మైసూరుసంస్థానమునకుఁ బోయి మంత్రికి సి. యస్. ఐ. యను బిరుదమిచ్చిరి. అనంతరము 1893 వ సంవత్సరమున గవర్నరు జనరలుగారగు లెన్సిడౌను ప్రభువుగా రాయనకు కె.సి. యస్. ఐ. యను బిరుదమిచ్చిరి. వెనుకటి మైసూరుమహారాజుగారు శేషాద్రియ్యరుకు రాజ్యధురంధరుడను బిరుదమిచ్చిరి. ఆమహారాజుగారు1894 వ సంవత్సరమున మృతినొందగాఁ గుమారుఁడు బాలుఁ డయినందున నిండియాగవర్నమెంటువారు దేశపరిపాలనముజరుపుటకు కవున్సిలు ఆఫ్ రీజన్సీయను నొకసభనేర్పరచి యాసభకు శేషాద్రయ్యరు నధ్యక్షునిగ నేర్పఱచిరి. చెన్నపురి యూనివరుసిటీవారు1887 సంవత్సరమున నాయన నొక ఫెల్లోగాఁ జేసిరి. నిరంతరమగు కార్యభారముచేత నాయన శరీరారోగ్యము క్రమక్రమంబునం జెడుటంజేసి యాయన 1900 సంవత్సర ప్రారంభమున నుద్యోగము మానుకొనెను. మొత్తముమీఁద నీతఁడు మైసూరుసంస్థానములో ముప్పదిరెండేండ్లు పనిజేసెను. అందుబదునేడేండ్లు మంత్రిపదవియందేయుండెను. చిరకాలమునుండి యాయనశరీరమునకుగావలసిన విశ్రాంతి యిప్పుడు లభించుటచేత శేషాద్రియ్యరు చాలకాలము జీవించుననియు నాయన జీవితములో భుక్తశేషముఁగూడ లోకోపకారార్థమే వినియోగపడుననియు

నెల్లవారలుఁ దలంచిరి. కాని దైవమది యోర్వఁడయ్యె. సరిగా రెండుసంవత్సరము లైనను విశ్రాంతి సౌఖ్యము లనుభవింపక ముందె 1901 సెప్టంబరు పదమూడవ తారీఖున మిత్రమండలమునకును బంధుకోటికి నపారదుఃఖము కలుగునట్లు శేషాద్రియ్యరుస్వర్గస్థుఁడయ్యెను.

శేషాద్రియ్యరు మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఆయనచరిత్ర మంతకన్న ప్రసిద్ధము. దక్షిణదేశము మంత్రులకుం బుట్టిన యిల్లని భరతఖండమున వాడుక కలదు. ఏలయన నీదక్షిణ దేశముననే గదా దివాను రంగారావు రాజా మాధవరావు, వెంబాకం రామయ్యంగారు దివాను రంగాచార్యులు మహామంత్రి శేషాద్రయ్యరు మొదలగువారు పుట్టి పెరిఁగి మహాధికారముఁ జేసినది. పైనుదాహరింపఁబడినవారందఱుమంత్రులుగానుండినను వారియందఱికంటె శేషాద్రియ్యరునకు రెండులాభము లెక్కువకలిగెను. అందు మొదటిదేదన శేషాద్రియ్యరు మైసూరుసంస్థానమునఁ జిరకాలము పనిజేయుట కవకాశముగలిగెను. తక్కినవారి కీయవకాశముగలుగలేదు. రంగాచార్యులు రెండు సంవత్సరములుమాత్రమే మంత్రిపనిఁ జేసెను. మాధవరావు తిరువాన్కూరునందుఁ గొంతకాలము బరోడాలోఁ గొంతకాలము మంత్రియైయుండెను. కాని నిరంతరాయముగ నొక్కచో నింతకాముపనిచేయలేదు. శేషాద్రయ్యరు పదునేడువత్సరములు మంత్రిగాను తత్పూర్వము పదునైదువత్సరములు వేరువేరు పదవులలో నుద్యోగిగాను మైసూరునందేయుండుటచేత సంస్థానముయొక్క గుట్టుమట్టులు దేశస్థుల యాచారవ్యవహారములు దెలిసికొనుటకు, తెలిసికొని వలయునెడల దేశకాలపాత్రముల ననుసరించి మార్పులఁ జేయుటకు నవకాశము కలిగెను. రెండవలాభమిది. హిందూదేశమునందు మంమంత్రులైన మహనీయులు విద్యావిషయమున ముత్తెగలుగ నున్నారు. అది యెట్లన్న నాంగ్లేయువిద్య జక్కగా నేర్వక మంత్రులై

యనంతర మాబాసనేర్చికొని మొత్తముమీఁద స్వభాషతోనే వ్యవహారము నడిపినవారు కొందఱు. ఇందులో గ్వాలియరు మంత్రియైన దినకరరావు, హైదరాబాదునకు మంత్రియైన సలారుజంగును జేరుదురు. బి. యే. బి. యల్. మొదలగు పరీక్షలయందుఁ గృతార్థులు కాకపోయినఁ దమకాలమునాఁటికున్న యాంగ్లేయవిద్యనభ్యసించివ్యవహారమింగ్లీషులోనే కట్టుదిట్టముగ నడిపినవారు కొందఱు. మాధవరావు రంగాచార్యులు రామయ్యంగారుమున్నగువారీ తెగలోనివారు బి.యే; బి.యల్ మొదలగుపరీక్షలయందు గృతకృత్యులైమంత్రులై నవీనపద్ధతుల ననుసరించి వ్యవహారముల నడపినవారు కొందఱు. శేషాద్రియ్య రీ తెగలో జేరును. పరికృతిశాస్త్రాదులు నేర్చికొన్న ఫలము శేషాద్రయ్యరు తనపరిపాలనమునం గనఁబఱచెను.

ఎవరిమంత్రిత్వమేవిధముగనున్నదో పోల్చి చెప్పుటచాలకష్టము కాని శేషాద్రయ్యరుకు దక్కినమంత్రులకునెంతైనభేదమున్న పక్షమున నదిముఖ్యముగ నొకదానియందగపడుచున్నది. దినకరరావుమాధవరావు మొదలగుప్రాచీనమంత్రులుతమయధికారముక్రిందికివచ్చిన దేశములలోఁ గ్రిమస్థితి లేనిచోట్లఁగ్రిమస్థితినెలకొలుపుచు జెడియున్న తావులను జక్కజేయుచువచ్చిరి. శేషాద్రియ్యరన్నో యతఁడువచ్చునప్పటికి దేశము క్రిమస్థితిలోనే యున్నందునఁ జేతిపనులు వాణిజ్యము మొదలగునవి వృద్ధిజేసి సంస్థానముయొక్క ధనస్థితి బాగుపఱచి రాజ్యమును ధనవంతముగఁ జేసెను.

శేషాద్రియ్యరు స్థిరమనస్సుగలవాఁడు ఎవరైననెదిరించిన కొలఁది నాతనిపట్టుదల యధికమయ్యెడిదఁట. పరేంగితజ్ఞాన మాయనకున్నట్లు మఱెవ్వరికి లేదనిచెప్పుదురు. అందుచేతనే లక్షణములంగనిపెట్టి తగినవారినే తనక్రిందియధికారులుగ నేర్పఱచుకొనెను. ఒకరిమీఁదక్రోధము నుఱియొకరిఁమీఁద దయ యనుపక్షపాతము లాయనకడ లేవు.

అన్నియుఁ దెలిసినవాఁడయ్యు నీతఁడొక చిన్న పొరపాటుఁ జేసెను. గొప్పయుద్యోగములలో మైసూరులోఁబుట్టిన జనులను బ్రవేశపెట్టకయా తఁడు తఱచుగాఁజెన్నపురిరాజధానిలోని వారినే తెచ్చి పరివేశపెట్టెను. ఆదేశస్థులనే బరివేశపెట్టినచో వారిజాతిమత పక్షపాతముగలిగి వర్తింతురనియు విద్యలోవిశేషముగనారితేరినవారుగాకపోవుటచేననర్హులనియుఁ దలంచి యాయన విదేశస్థులఁ దెచ్చినచో వారుపక్షపాతము లేక ప్రజ్ఞాఢ్యులైయుందురని తలంచి యట్లుచేసెననియు నది పొరబాటుకాదనియు నాయనపక్షమువారు తలంతురు. కారణమేమయినను శేషాద్రయ్యరు మైసూరుజనుల కిష్టుఁడు గాకపోయెను. ఇందతఁడు సంస్థానముయొక్క క్షేమమునే గోరెను. స్వలాభముఁజూచుకొని పని చేయలేదని శత్రువులైన నొప్పుకొందురు.

ఆయనయెల్లప్పుడు నీతిపరుఁడై వ్యవహరించెను. రాజకార్యములతో స్వకార్యముల నెన్నఁడు నాయనకలిపి యెఱుఁగడుఁ. తనసొంత సొమ్మయినఁ జెన్నపురములో నన్ను బ్యాంకులో వేసికొనెనేకాని మైసూరుసంస్థానపు బ్యాంకులో నెన్నఁడు వేసికొనలేదు. చిరకాలము వేలకొలఁది రూపాయలు గల యుద్యోగములు చేసినను శేషాద్రియ్యరు పనిమానుకొనునప్పటికి దనపదవి వహించిన వారియందఱికంటె పేదవాఁడుగ నుండెను. అందుచేత మైసూరుమహారాజుగారాయనకు నాలుగు లక్షలరూపాయలు రొక్కమును నెలకు రెండువేల రూపాయ లుపకారవేతనమును దయచేసిరి. మాధవరావు మొదలగు వారు తాము మంత్రులై యున్న దేశములలో జీవితకాల శేషమును గడపక స్వదేశములకుఁ బోవుచు వచ్చిరి. శేషాద్రియ్యరట్లుచేయక యేదేశపుసొమ్ము తాను తినెనో యాదేశమునందే తన ధనమంతయు ఖర్చుపడవలయునని యుద్యోగమును మానిన వెనుకఁగూడస్వదేశమునకుఁబోవక మైసూరులోనే గాఁపురముండెను. ఈయన గొప్పపరీ

కులయందుఁ దేజినను మతవిషయమునఁ బ్రాచీనులలోఁ జేరిన వాఁడు. ఇంటియొద్ద పరమనిష్ఠుఁడై వ్యాఘ్రచర్మముఁగప్పుకొని విభూతిపిండికట్లు బెట్టుకొని మహేశ్వధ్యానము సేయుచుండును. మృతినొందునప్పుడు నయితమాయన తనశరీరము బులితోలుతోఁ గప్పి దహనము జేయుమని బంధువులను బ్రార్థించెనఁట. మతవిషయమునందింత పట్టుదల కలదని యీతఁడు వ్యవహారవిషయములలో నెన్నఁడు జాతి మత భేదములను బాటించినవాఁడు కాఁడు. వ్యవహారములలోఁదురక, క్రైస్తవుఁడు, మాలవాఁడు, బ్రాహ్మణుఁడు కూడనాయన దృష్టికి సమానులే.

---

# పెంబాకం రామయ్యంగారు

ఈయన 1826 వ సంవత్సరమందుఁ జెన్నపట్టణమున జన్మిం చెను. సర్ తామస్ మన్రోగారు గవర్నరుగానున్న కడపటి దినము లలో నీయనతండ్రి రివిన్యూబోర్డులో రికార్డుకీపరుగా నుండెను. ముగ్గురన్నదమ్ములలో రామయ్యంగారు కనిష్ఠుఁడు. తక్కిన సోదరు లిద్దఱు మేనమామయైన పెంబాకం కృష్ణయ్యంగారియొద్దఁ బెరుఁగుచు వచ్చిరి. ఈకృష్ణయ్యంగారు మన దేశము కంపెనీవారు పరిపాలించెడు దినములలోఁ దూర్పుసముద్రపు రేవులలో ధాన్యాదులవర్తకముఁ జేయుచుండెను. చిన్నప్పుడు రామయ్యంగారు మంచియారోగ్యము లేక తఱుచుగ జబ్బుపడుచు వచ్చినందునఁ దలిదండ్రు లాయనను గొన్నిసారులు పాలారునదీ తీరమందు నీవరము గ్రామమందున్న మేనమామయొద్దకును గొన్నిసారులు చెంగల్పట్టుయొద్దనున్న స్వగ్రామ మగు పెంబాకమునకును నీటిమార్పు గాలిమార్పుల నిమిత్తము పం పుచువచ్చిరి. చిన్నజీతములు పెద్దకుటుంబములుఁ గల గృహస్థుల కే దినములలో నైనను బిడ్డలకు గొప్పవిద్యఁ జెప్పించుట కష్టముగదా. కాని ముందు వెనుకలు చక్కగాఁ దెలిసినదియు మితవ్యయము యొ క్క యుపయోగ మెఱిఁగినదియుఁ బరమశాంతయు యోగ్యురాలు నగు రామయ్యంగారితల్లి సొమ్ము క్లుప్తముగా వ్యయముఁజేసి కుటుం బముఁ గడపి కుమారున కాదినములలో నున్న మంచివిద్యఁ జెప్పిం చెను. 1841 వ సం॥ న నెల్ఫినిస్టన్ ప్రభువు గవర్నరుగా నున్నప్పుడు చెన్నపట్టణమందు గవర్నమెంటువా రొక హైస్కూలు స్థాపించిరి. అది బయలు దేఱఁగా నందులో నాలుగురు విద్యార్థులు చేరిరి. అందులో రామయ్యంగా రొక్కరు. ఆయన సహాధ్యాయులైన

తక్కినవైదుగు రెవరనఁగా 1. మహామంత్రియైన రాజా సర్ టి. మాధవరావుగారు, 2. చెన్నపట్టణపు హైకోర్టులో మొదటిప్లీడరు, గవర్నరుగారి శాసన నిర్మాణ సభలో మొదటి స్వదేశసభికుఁడు నగు శ్రీశఠగోపాచార్యులు, 3. దక్షిణహిందూస్థానమున విద్యాధికుఁడని పేరు వహించిన లారీదొరగారు, 4. తిరువాన్కూరు సంస్థానమందలి హైకోర్టులో జడ్జిగాఁ జిరకాల ముండిన సదాశివపిళ్ళగారు, 5. గొప్పవిద్వాంసుఁడని పేరుపొంది బ్రతికినన్నాళ్ళు రోగములతోఁ దీసికొనుచు స్వల్పకాలమేజీవించిన దీనదయాళు నాయఁడు.

ఈ యాఱుగురు విద్యార్థులుఁ బరీక్షలో ఘనముగాఁ గృతార్థులైరి. ఆహైస్కూలు ప్రధానోపాధ్యాయుఁడగు పవెలుదొర తన విద్యార్థుల బుద్ధివిశేషముఁ గనిపెట్టి వారికిఁ బాఠశాలలోఁ జెప్పెడు చదువుగాక యింటియొద్దగూడ ప్రకృతిశాస్త్రము మొదలయినవి చాలవఱకుఁ జెప్పెను. ఆదినములలోనె రామయ్యంగారు ప్రకృతి శాస్త్రమును జ్యోతిషశాస్త్రమును నేర్చి వాటియందు మిక్కిలి యభిరుచి గలవాఁ డయ్యెను. రామయ్యంగారు పెద్ద పుస్తకములకట్ట చేతఁబట్టుకొని ముత్యాలు పేటనుండి ప్రతిదినము మిక్కిలి దూరమున నున్న తన పాఠశాలకుఁ బోవుచు వచ్చెను. ఈకాలమం దీయనకుఁ బరమమిత్త్రుఁ డీయన జ్ఞాతి యగు శఠగోపాచార్యుఁడు. ఈ కాలములో రామయ్యంగారి కొక కష్టము సంభవించెను. ఈయనయన్నయు సర్వజనులకు నిష్టుఁడు గొంత కుటుంబభారము వహించినవాఁడు నగు పార్థసారథి యయ్యంగారు కాలధర్మము నొందిరి. ఆయన మరణము చేత దుఃఖులైన తల్లిదండ్రులకు తన విద్యాభ్యాస వ్యయము భారముగా నుండకుండ రామయ్యంగారు తన స్కూలుజీతము తానే తెచ్చుకొనవలసి వచ్చెను. ఆకాలములో శ్రీ పచ్చయ్యప్ప మొదలియారిగారి పాఠశాల పరిపాలనముఁ జేయు సభవారు, ఆంగ్లేయ శాస్త్ర

విద్యలను జదువుకొను విద్యార్థులలో మొదటివానికిఁ గొంత నెల వేతనమీయఁ దలఁచిరి. రామయ్యంగారు కష్టపడి చదివి తన ప్రజ్ఞచే తనే యీవిద్యార్థి వేతనము సంపాదించెను. తలిదండ్రులకు నిర్బాధకముగా దాను జదువుకొనుట కాధారమై యీవిద్యార్థి వేతనము దనకు మహోపకారము చేసెనని యాయన యిటీవల పలుమాఱులు చెప్పుచు వచ్చెను. అట్లు తానుపుచ్చుకొన్న విద్యార్థి వేతనపు సొమ్మును రామయ్యంగారు ఋణముగా నెంచుకొని దానిని దీర్పఁ దలఁచి కొంత మూలధనమును తన్నిమిత్తమిచ్చి దానివడ్డివల్ల పట్టపరీక్షకుఁ బ్రకృతిశాస్త్రముఁ జదువదలఁచు విద్యార్థికి సహాయముఁ జేయవలసినదని యేర్పాటు జేసి విద్య ముగిసినతోడనే యాకాలమున రివిన్యూబోర్డువారికి సెక్రిటెరిగా నుండిన పైక్రాఫ్టుదొర రామయ్యంగారిని తనకచేరీలో మహారాష్ట్రభాషకుఁ దర్జుమాదారుగ నేర్పఱచెను. రివిన్యూబోర్డులో నిట్లు కొంతకాలము పనిఁ జేయుట చేత రివిన్యూపద్ధతులఁ దెలిసికొనుట కాయన కెన్నో యవకాశములు కలిగెను. క్రమక్రమముగా రామయ్యంగారు పూనికతోఁ బనిఁజేయుటవలనఁ జాలమంది కలక్టర్ల కనుగ్రహపాత్రుఁడయ్యెను. 1850 వ సంవత్సరమందు నెల్లూరుకలక్టరు తనకచేరీలోనున్న హెడ్డుమున్షీ పని రామయ్యంగారి కిచ్చెను. ఈయుద్యోగములో నీతఁడు నాలుగు సంవత్సరములుండెను. 1854 వ సంవత్సరమందు గవర్న మెంటువారు ఇంజనీరింగు డిపార్టుమెంటుకొత్తగానిర్మించి యాశక్రిటెరిగారియొద్ద రామయ్యంగారినిఁ బనిచేయఁ బంపిరి. అందులోఁ గొంతకాల మున్నపిదప1855వసంవత్సరమున నాయనయధికారులు రెండుద్యోగములకనఁ బఱచి యాయన యిష్టమువచ్చినదానిలోనికివెళ్ళుమనిరి. మొదటిది నెల్లూరుజిల్లాలోనాయబుసిరిస్తదారుపని. రెండవదికృష్ణాజిల్లాలోనప్పుడే క్రొత్తగా నేర్పడిన సబుకలెక్టరునొద్ద సిరస్తాదారు పని. రామయ్యం

గారు తానదివఱకు కొంతకాలముపనిఁజేసిన నెల్లూరుజిల్లాకే వెళ్ళియక్కడి కలక్టరు నమ్మకమునకుఁ బాత్రుఁడై శీఘ్రగాఁ పనిఁజేసెను. ఈయుద్యోగమున రెండేండ్లున్న పిదప నతఁడు తంజావూరుజిల్లా కలక్టరు కచేరీలో హెడ్డుశిరస్తాదారుగ నియమింపఁ బడెను. నెల్లూరు విడిచిపోవునప్పు డాజిల్లాకలక్టరు రామయ్యంగారి సామర్థ్యాదులం గొనియాడుచు నొకజాబు వ్రాసెను. ఆజాబులో నితరవిషయములు విడిచి నాలుగుమాటలు మాత్ర మిందుదాహరించుచున్నాను. "నీవంటి మనుష్యులే దేశమునకు నిజమైనమిత్రులు. వారే యీదేశమును దక్కిన యెల్ల దేశములలోఁ బేరుకల దానినిగాను యెల్లసజ్జనుల స్తోత్రమునకుఁ బాత్రమైనదానిఁగాను జేయఁగలవారు." ఈయుద్యోగమునం దొక సంవత్సర మున్న పిదప నాయన యాజిల్లాలోనే డిప్యూటీకలెక్టరయి హెడ్డుకలక్టరునకు నమ్మఁదగిన సహకారియై యుండెను. 1859 వ సంవత్సరమందు తంజావూరుజిల్లాలోనున్న యీనాము భూములు పరిష్కరింపఁదలఁచి గవర్నమెంటువారు యీనాము కమిషనరయిన మెయిలరుదొరతోఁ గలిసి మాటాడుటకై రామయ్యంగారినిఁ జెన్నపురముఁ బిలిపించి మెయిలరు నొద్ద నుద్యోగ మిచ్చిరి. ఆయన చెన్నపట్టణమందుండఁగానే సర్ ఛార్లెసు ట్రెవిలియన్ దొరగారాయనం బిలిచి కావేరీనదిపాఱెడి భూములలోఁ గొంత భూముల పరిష్కారము గావలసియుండెను. కనుక యచ్చోటికి వెళ్ళవలసియుండునని యాయనతోఁ జెప్పెను. తంజావూరుజిల్లాలో కావేరీనదిపారెడి భూములలో రహితుల యొద్దశిస్తువసూలుచేయుట కొలుంగుపద్ధతియని యొకపద్ధతి యుండెను. ఈపద్ధతింబట్టి దేశమున పండిన పంట హెచ్చుతగ్గులననుసరించి రహితులయొద్ద శిస్తు హెచ్చుగాను తగ్గుగాను వసూలు చేయఁ బడుచు వచ్చెను. స్థిరమైన పద్ధతిలేక యేయేటి కాయేఁడు మాఱుచువచ్చిన యీపద్ధతిని మాన్పి శాశ్వతమైన శిస్తు కట్టవలసిన

దని రామయ్యంగారిని నియమించిరి. అయ్యంగారు వెంటనే యాప నిలోఁ బ్రవేశించి కలెక్టరుగారి యుత్తరువులంబట్టి యెనిమిది మాస ములలో నీపనిఁబూర్తిఁ జేసెను. ఈపని కొంత జరుగుచుండఁగానే బ్రె మిలియన్ దొరగారు దక్షిణపు జిల్లాలను జూడ బయలుదేఱి తంజా వూరు జిల్లాలో రామయ్యంగారు చేయుచున్న పనిఁ బరీక్షింపఁగోరి చాల పట్టుదలతో శోధించి యాతఁడు చేసినపని మిక్కిలి బాగున్న దని మెచ్చుకొనిపోయెను.

1860 వ సంవత్సరమున ప్రెసిడెన్సీకాలేజీ సంవత్సరోత్సవ సమ యమున ప్రసంగించుచు బ్రెమిలియన్ దొరగారు రామయ్యంగారి నీ క్రిందివిధమునఁ బ్రశంసించిరి. "పైఁ జెప్పిన తరగతిలోఁ జేరిన మఱి యొక స్వదేశీయుఁడగునుద్యోగస్థుఁడుతంజావూరుజిల్లాలో మిక్కిలికష్ట మైనపనినినేర్పుతోనెఱవేర్చెను. ఈకార్యసాధనమందితఁడుజూపినసామ ర్థ్యము, నీతియు నతనికేగాక హిందూజాతికెల్ల గౌరవముఁదెచ్చుచున్న ది." 1870 వ సం॥రమందు స్వదేశస్థులకుఁ గొప్పయుద్యోగములియ్య వచ్చునని పార్లమెంటుసభలో నొకచట్టముపుట్టునపుడుయీదొరగారే రామయ్యంగారి కీక్రింది విధమున వ్రాసిరి. "హిందువులకిప్పుడు గొ ప్పయుద్యోగము లీయవచ్చునను మంచిస్థితికివచ్చితిమి. ఇపుడుపార్ల మెంటులోనున్న బిల్లు హిందువులుగూడ నింగ్లీషువారితోసమానముగ జూడవలయునను న్యాయపద్ధతిమీఁద నిలిచియున్నది. ఇదివఱకు గ వర్నమెంటు కొలువులోనుండుటచేతఁ గాని లేక గౌరవమైనస్వతంత్ర వృత్తులలో నుండుటచేతఁగాని గొప్పయుద్యోగములకుఁదగియున్నస్వ దేశస్థులందఱ నట్టియుద్యోగములలో గవర్నమెంటువారుప్రవేశపెట్టు దురు. ఈసమయమున గవర్నమెంటువారు నిన్నట్టి గొప్పయుద్యోగ ములోఁ బ్రవేశపెట్టకపోయినపక్షమున నాకు విషాదముగ నుండును. నీవునూఱుసంవత్సరములు దొరతనమువారికొలువుచేసినను తంజావూరు

లోని కొలుంగు వ్యవహారములవంటి కష్టమయినవ్యవహారము మరల చేయవలసియుండదు. నీవు చెన్నపురి రాజధానిలోనున్న స్వదేశస్థుల కంటె తెల్లవారికంటె నాపనికిఁదగినవాఁడవని నీవిషయమైసిఫారసుచేసిరి. తంజావూరుమండలములో సగముభాగములోనున్న జనుల యదృష్టములు నీచేతిలోనున్నను నీపూర్వప్రవర్తనముమీఁద నెక్కడ నొకమచ్చ లేకుండ ననుమానపునీడమైన నీమీఁద సోఁకకుండ నీవా వ్యవహారమున్యాయైకదృష్టితో నెల్లరకుఁదృప్తికరముగఁ బరిష్కరించితివి." తంజావూరులో వ్యవహారము ముగియఁగానే యీనామకమీషనులోఁ జేరవలసినదని యదివఱకు రామయ్యంగారికుత్తరువులువచ్చెనుగాని తంజావూరుకలక్టరాయనను విడువక తనకుసహాయుఁడుగ నేర్పఱచుకొనెను. ఇక్కడనుండఁగానే గవర్నమెంటువా రాయనను మఱియొక వ్యవహారముఁ బరిష్కరింపుమని పంపిరి.

1858, 59 వ సం॥రములలో కావేరీనదివలన దేశమునకు గొప్పనష్టముకలిగెను. అప్పుడు చెడిపోయిన ప్రదేశములకు మరమ్మతులు చేయుటకై గవర్నమెంటువారుమిరాశిదారులకుగుత్తదారులకు వేలకొలఁది రూపాయలిచ్చిరి. ఆమరమ్మతులుసరిగా జరిగినవో లేదో తెలిసికొని గవర్నమెంటువారికి గుత్తదారులకుఁగల వ్యవహారముఁ బరిష్కరించుటకు రామయ్యంగా రేర్పడెను. ఈకృత్యము నతఁడు శ్రద్ధతో నెఱవేర్చి గుత్తదారులవల్ల దొరతనమువారికి రావలసినసొమ్మువిశేషముగా రాఁబట్టెను, తరువాత నతఁడుతంజావూరుజిల్లాలో నేయున్నవల్లతాడిగ్రామ వ్యవహారముఁ బరిష్కరించుటకై నియమింపఁబడెను. ఈ గ్రామము చెన్నపట్టణపునివాసులైన యొకకుటుంబమువారికి మొఖాసాగానుండెను. గవర్నమెంటుకు గ్రామముమీఁదఁ జెల్లవలసినశిస్తు మితిమీరియుండుటచే మొఖాసాదారుల్ దానిమొగముఁజూడక పాడుపెట్టిరి. రామయ్యంగారు శిస్తుతగ్గించి క్రొత్తపద్ధతిగా శిస్తునేర్పఱచి

కలెక్టరు యొక్కయు దొరతనమువారి యొక్కయు నంగీకారమునంది గ్రామము బాగుచేసెను.

1861 వ సంవత్సరమున సేలముజిల్లాకు సేలము పట్టణమే ముఖ్యపట్టణముగా నేర్పడెను. అదివఱకు కోసూరులోనున్న పెద్దకలెక్టరు కచ్చేరి సేలమువచ్చెను. ఆజిల్లాలోని నామకాలుపట్టణమందు సబుకలెక్ట రొకరుండున ట్లేర్పాటుచేయఁబడెను. గవర్నమెంటువారు రామయ్యంగారిని మొదటితరగతి డిపుట్యాటీకలెక్ట రుద్యోగమున ఖాయపఱచి నామకాలులో సబుకలెక్టరుగా నుండవలసినదని పంపిరి. అక్కడ సబుకలెక్టరుగా నాయన 1864 వ సంవత్సరమువఱకు నుండిరి.

ఈసమయమున నిండియాగవర్నమెంటువారు కాగితములనాణెమును గ్రొత్తగా నిర్మింపఁదలంచిరి. కాగితములనాణెములనఁగా బ్యాంకునోట్లు. ఇవియు రూపాయలు కాసులు వలెనే యిప్పటికి దేశమున నాణెములుగఁ జెల్లుచున్నవి. రామయ్యంగారు నమ్మఁదగిన మనుష్యుఁడగుటచే నిండియాగవర్నమెంటువా రాయననీడిపార్టిమెంటులోఁ బెట్టఁదలఁచి తిరుచునాపల్లిలో నెలకాఱువందలు మొదటజీతముఁ గలిగి క్రమాభివృద్ధిగా నెనిమిదివందలవఱకుజీతముగలయశిస్టెంటుకమీషనరుగా నియమించిరి. ఈయుద్యోగములో నతఁడు 1865 వ సంవత్సరప్రారంభమందుఁ బ్రవేశించెను. ఒకసంవత్సరములోఁ బనిచేయునప్పటికి తనకుఁ దగినంతపని లేదని తెలిసికొని జీతముపుచ్చుకొనుచు సుఖముగాఁ గూర్చుండుట కిష్టములేక యాసంగతి నతఁడు గవర్నమెంటువారికిఁ దెలియఁజేసెను. గవర్నమెంటువారు వెంటనే యాయనను బ్రధానపుసెక్రటరిగారి యాఫీసునకు మార్చి యతఁడదివఱకుచేయుచున్న యుద్యోగమవసరమే లేదని తీసివేసిరి. 1866 వ సంవత్సరమంతయు నితఁడా యుద్యోగమునం గడపెను. 1867 వ సంవత్సరమందు స్టాంపుల సూపరెంటెండెంటగు టెంపిలుదొర కాలధర్మమునొందఁగా దొరతనమువారు

నెలకు వేయిరూపాల జీతముమీఁద రామయ్యంగారి నాయుద్యోగ మునం బ్రివేశపెట్టిరి.

మఱుసటిసంవత్సరము గవర్నరుగారి శాసననిర్మాణసభలో నొకసభికుఁడుగ నతఁడునియమింపఁబడెను. ఈసభలో నతఁడు పండ్రెండు సంవత్సరములు సభికుఁడుగనుండి క్రొత్త చట్టములునిర్మించునపుడుగవర్నమెంటువారికెంతో సహాయముఁ జేయుచువచ్చెను. అతఁడు ముఖ్యముగ శ్రమపడి పనిజేసినవి రెండువిషయములుగలవు. అది యేమనగా మునిసిపలులోకలుఫండు సంబంధమయిన పన్నులుకట్టుటకు గవర్నమెంటువారు నిర్మించిన చట్టములో నితఁడుమిక్కిలిసహాయముఁచేసెను. ఆచట్టమునిర్మించిన అలెగ్జాండరుఆర్బత్తునాటుదొరగారు వ్రాసిన యీక్రిందిజాబుఁ జదివినయెడల రామయ్యంగారెంతసాయముచేసెనో తెలియును. "ఇవి యిప్పుడు చట్టములైనవి గనుక నిదివఱకు నేనన్న నోటిమాటలే యిప్పుడు కాగితముమీఁదఁబెట్టుచున్నాను. ఈశాసన నిర్మాణములో నీవుచేసిన యపార సహాయమునకుఁజెప్పినయాలోచనకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడనై యున్నాను. జాగ్రత్తతో సమలుజరుపఁబడినపక్షమున నీరెండుచట్టములు జనులకు మిక్కిలి లాభకరములుగనుండునట్లు నిర్మింపఁబడినవని నాయభిప్రాయము. మన మనుకొన్నట్లేనిజముగా జరిగినపక్షమున మొదటశాసనము నిర్మాణము జేయునపుడు రెండవసారి దానిం దిరగవేయునపుడు నీవుచేసినసహాయమేదానికిఁగారణము." రామయ్యంగారు చదువుకొన్న పాఠశాలయొక్క సంవత్సరోత్సవము రాఁగా నర్బతునాటుదొరగా రాసమయమున మాటలాడుచు రామయ్యంగారినిఁగూర్చియిట్లుప్రశంసించిరి. ఆకాలమున నీపాఠశాలలో నొకస్వదేశస్థుఁడనఁగా నిప్పుడు గవర్నరుగారి శాసననిర్మాణసభలోసభికుఁడుగానున్న యొకపెద్దమనుష్యుఁడు విద్యఁ గఱచుచుండెను. ఆబడి యిట్టివానిఁ బ్రభవింపఁ జేయఁగలదనియెన్నఁడనుకోలేదు. ఆయ

స సత్ప్రవర్తనముం బట్టియు బుద్ధికుశలతంబట్టియు నీతినింబట్టియుఁ గార్యాచరణమునందుఁజూపెడు స్వతంత్రభావముంబట్టియుఁజూడఁగా మనహిందూరాష్ట్రమందున్న శాసననిర్మాణసభలలో నెక్కడ నింత వాఁడులేఁడని ధైర్యముతోఁ జెప్పఁగలను. రామయ్యంగారు చెన్నపట్టణము మ్యునిసిపల్ సభలో నెనిమిదిసంవత్సరములు సభికుఁడుగ నుండెను. ఆకాలములో నతఁడుపట్టణాభివృద్ధికిమిక్కిలి పాటుపడెను. ఒకసారియప్పటి గవర్నరు రామయ్యంగారికి మునిసిపల్ ప్రసిడెంటుపనినియ్యఁదలంచెనుగాని రామయ్యంగారే దానినంగీకరింపఁడయ్యె. 1871వసంవత్సరమందు విక్టోరియారాణిగా రాయనకు సి. యస్. ఐ. యనుబిరుదమిచ్చిరి. ఆసమయమందు గవర్నరుగారగు నేపియర్ ప్రభువు రామయ్యంగారికీ క్రిందియర్థము వచ్చునట్లింగ్లీషుతో నొకజాబు వ్రాసిరి. "నీకు సి. యస్. ఐ. బిరుదువచ్చినది. అదికొద్దిదినములలోనే యథాగౌరవముగా గవర్నమెంటు సెక్రటెరిచేతనీకీయఁబడును. సత్ప్రవర్తనచేతను యోగ్యతచేతనుగవర్నమెంటువారి చిరకాలసేవచేతనుమిక్కిలి తగినవాఁడవగు నీకువిక్టోరియారాణిగారు దీనిని దయచేసినందుకునేను నిన్ను బహూకరించుచున్నాను. 1873 వ సంవత్సరమందుహిందూదేశపు ధనస్థితినిఁగూర్చి పార్లమెంటుసభవారేర్పఱచిన కమిటీయెదుట సాక్ష్యమిచ్చుటకై యింగ్లాండు వెళ్ళవలసినదని దొరతనమువారు రామయ్యంగారి నడిగిరి. కాని రాజా మాధవుగారివలెనే రామయ్యంగారుకూడ వర్ణధర్మము చెడిపోవునను భయమున సీమకు వెళ్ళననిరి. 1875వ సంవత్సరమందు రిజస్ట్రారుజనరలుపని కాళీరాఁగా దొరతనమువారు రామయ్యంగారి కాపనినిచ్చిరి. 1877వ సం॥రము జనవరి యొకటవ తేదీని ఢిల్లీనగరమున జరిగినగొప్పదర్బారునకుఁ జెన్నపురిగవర్నరుగారు రామయ్యంగారి నాహ్వానముసఁ జేసిరి. ఆదర్బారునకుఁబోయి యాయన గవర్నరుజనరలుగారివలన బంగారుపతకమును

బహుమానము వడసిరి. రామయ్యంగారు కాలానుసారముగ నెన్నో కమిటీలలో సభికుఁడై మిక్కిలి యుపయోగము లగుపనులఁ జేసెను. ఆకమిటీలలోఁ గొన్ని యిక్కడ పేర్కొనఁబడును. 1. ఇంజనీరింగు డిపార్టుమెంటు స్థాపించుటకై యేర్పడిన కమిటీ. 2. చెన్నపట్టణము మునిసిపలు చట్టము మార్పుచేయుట కేర్పడిన కమిటీ. 3. చెన్నపట్టణము మునిసిపాలిటీలో టీకాల స్థితిగతులఁగూర్చి రిపోర్టుచేయుట కేర్పడిన కమిటీ. 4. చెన్నపురిరాజధానిలోనున్న పాఠశాలలలో బాలురచేత నుపయోగింపఁబడు పుస్తకములను నిర్ణయించుటకేర్పడిన కమిటీ. 5. హిందూమత స్థానములు, అనఁగా దేవాలయములు మఠములు మొదలగువాటిపరిపాలనము సరిగా నుండునట్లు చేయుట కేర్పడిన కమిటీ. 6. గ్రామమునసబులు నిబంధనలను వ్రాయుటకయి యేర్పడిన కమిటి.

రామయ్యంగారు స్టాంపుల యధికారియైనతరువాత నతఁడు చెన్నపట్టణములో స్థిరముగ నుండునని తెలిసిన పిదప నార్టనుదొరగారాయనను పచ్చయ్యప్పమొదలియారుగారియాస్తికి ధర్మకర్తగాఁ జేసెను. అట్లుధర్మకర్తగానుండి యాయన యింతింతనరాని పనిఁజేసెను. పచ్చయ్యప్పగారి పాఠశాలను ధర్మములను మొదలంట నాశనము చేయునట్టి యొకవ్యాజ్యము తేబడెను. ఆవ్యాజ్యములో రామయ్యంగారుపడిన పాటువలననే పచ్చయ్యప్పగారి పాఠశాల నిలచెను. విద్యాశాలలయందు రామయ్యంగారికి మిక్కిలియభిమాన ముండుటచే పచ్చయ్యప్పపాఠశాల నాయన స్వదేశస్థులయొక్కయు నాంగ్లేయులయొక్కయు నుపాధ్యాయులయొక్కయువిశ్వాసమునకు,గౌరవమునకుఁ బాత్రమైనదానిగాఁ జేసెను. రామయ్యంగారు ధర్మకర్తగానున్నకాలమందె పచ్చయ్యప్పపాఠశాలసమర్థుఁడగుప్రధానోపాధ్యాయుఁడుగలిగి మంచి హైస్కూలులలో నొకటై క్రమక్రమముగ రెండవతరగతికాలే

జీ యయ్యెను. ఈయన సభికుఁడుగానున్న కాలమందె చెంగలరాయ నా యకుఁడను నతఁడు ధర్మకార్యముల నిమిత్తము వినియోగింపవలసిన దని మరణశాసనము వ్రాసియిచ్చినయాస్తి ధర్మకర్త యధీనమయ్యె ను. ఈమరణశాసన మనేకసంశయములతోఁగూడియుండెను. తక్కిన ధర్మకర్తలు రామయ్యంగారియాలోచనము మన్నించి విని యేసత్కార్యములనిమిత్త మాయాస్థి యుద్దేశింపఁబడినదో యాసత్కార ముల నిమిత్తము వినియోగించిరి. 1880వ సంవత్సరమందు రామయ్యంగారు దొరతనమువారికొలువు విడిచిపెట్టి తిరువాన్కూరు మహారాజుగారి యాహ్వానమువీఁద యాదేశమునకుమంత్రియయ్యె ను. ఈయన మంత్రికాకమునుపే యామహారా జుత్తరప్రత్యుత్తర ముల మూలమున రామయ్యంగారి విద్యాసంపత్తి వివేకము గౌరవము పరిపాలనాసామర్థ్యమునఁ దెలుసుకొనుచు వచ్చెను. మహారాజు రామ య్యంగారినిఁ గూర్చి పడినయభిప్రాయమంతయు నాయన మంత్రియై నపిదప సరియె యని స్పష్టమయ్యెను. ఆయనతిరువాన్కూరులో నేడు సంవత్సరములు మంత్రియైయుండి యాకాలమందు సంస్థానమం దలి ప్రతిడిపార్టుమెంటులోను చాలమార్పులు చేసెను. ఆయన వె ళ్ళునప్పటికి సంస్థానమందలి క్రిమినల్‌కోర్టు లేచట్ట మాధారము లేక యేపద్ధతి ననుసరింపక నియమితమయినమార్గము లేక వ్యవహారములు జరుపుచుండెను. అదిగ్రహించియాయనయింగ్లీషుప్రభుత్వములోనున్న శిక్షాస్మృతి(పీనలుకోడ్డుచర్యస్మృతి(క్రిమినలుప్రొసిజ్యూరుకోడు) తెప్పిం చి సంస్థానమందలి కోర్టులలో వాడుక చేయించెను. అదివఱకు సంస్థానమందలిపోలీసుబలగముతక్కువజీతములుగలిగితగినశిక్షలేక నేరస్థు లను సరిగాఁ బట్టుకొనలేక మిక్కిలిదుస్థితిలో నుండెను. రామయ్యం గా రీలోపముల నివారించుటకుఁ జెన్నపట్టణపు పోలీసుచట్టముఁ దె ప్పించి సంస్థానమందు వాడుకచేయించెను. అనంతరము రామయ్యం

గారు న్యాయస్థానములను జక్కఁజేయఁబూనెను. ఆ దేశములో స్టాంపు డ్యూటి యెక్కువ పెట్టవలసివచ్చినను జనులువిశేషముగా వ్యాజ్యము లు వేయుచు వచ్చిరే కాని తగ్గలేదు. అందుచేత పని తెమలక కోర్టు లు వ్యాజ్యములతో నిండియుండెను. అందుచేత మునసబులకు స్మా లుకాజుల యధికారమిచ్చి వారిజీతములు వృద్ధిచేసి జిల్లాజడ్జీలసంఖ్య తగ్గించి మొత్తముమీఁద న్యాయాధికారుల కందఱకు జీతములు వృ ద్ధిచేసి మేజస్ట్రీటులకు పోలీసధికారము తీసివేసి యనవసరముగ న ధికసంఖ్యగనున్న మేజస్ట్రీటులను తగ్గించి వారికి యెక్కువయధికార ము లిచ్చి తిరువాన్కూరులోనున్న హైకోర్టును దగినస్థితిలోఁ బె ట్టెను. అనంతర మతఁడు రివెన్యూవ్యవహారములఁ జక్కఁజేయ నారం భించెను. ఈడిపార్టుమెంటులో న్యాయస్థానములోనున్న పద్ధతుల కంటె పురాతనపద్ధతులు చెడుపద్ధతులుప్రబలియుండెను. ఈరివెన్యూ శాఖలోనున్న కొలువుగాండ్రకు జీతములు తక్కువ, పనిచేయుటకు సామర్థ్యము లేకపోవుట యను రెండు దోషములు పట్టియుండుటచే రామయ్యంగా రుద్యోగస్థుల సంఖ్య తగ్గించి జీతములు వృద్ధిజేసియా డిపార్టుమెంటు నంతను స్థిరమైన పునాదిమీఁదఁ బెట్టెను. ఉప్పుకొ ఠారులమీఁద తగినంత యదుపు గలుగునట్లా డిపార్టుమెంటు నంత ను మంచి స్థితిలోనికిఁ దెచ్చెను. వీని యన్నిఁటికంటె శ్లాఘనీయమైన కార్యమేమనఁగా రామయ్యంగారు తిరువాన్కూరు సంస్థానమంత యుఁ గొలిపించి భూములయొక్క శిస్తు స్థిరపఱచెను. అనఁగా సర్వేసెటి లుమెంటును జేయించెను. ఈసర్వే లేకపోవుట సంస్థానమునకు మిక్కి లి నష్టకరముగానుండె ననియు నదిచేయించుటచేఁ జాలలాభములు గ లుగుననియు నయ్యంగారితర్వాత వచ్చిన మంత్రులుగూడ నొప్పుకొ నిరి. వెనుకటినేలకొలతలు రివెన్యూలెక్కలు సరిగా నుండనందున వ్యవహారము చక్కఁగ జరుపుట యవశ్యమయ్యెను. అందుచేత రా

మయ్యంగా రాకొఱంత నివారించుటకు సమగ్రముగా నేలసర్వే చేయించుటయే యుత్తమసాధనమని తగువిధమున నట్లుచేయించెను. ఈసర్వేసెటిలుమెంటులు నేలయొక్క పరిమితిని సారమును నిరూపించెను. శిస్తువృద్ధిచేసెను. ఖజానా ధనముతో నింపెను. భూమివిషయమై వివాదములు వచ్చినప్పుడు వెనుక నెట్లున్నదో చూచుకొనవలయు నన్న తగినయాధారములుగ నేర్పడెను. తిరువాన్కూరుచెఱసాలలో నున్న ఖైదీలచేత నదివఱకు పురవీథులలోఁగూడ పనిచేయించుచు వచ్చిరి. రామయ్యంగా రట్టివాడుక మానిపించి ఖైదీలు చెఱసాలలోనే పనిచేయునట్లు విధించెను. సంస్థానమందలి ప్రజలదివఱకు చిల్లర పన్నులనేకము లిచ్చుకొనుచువచ్చిరి. ఇవిప్రజలను వేదించునవి,సర్కారునకు లాభములేనివి యగుటచే వానిని రూపుమాపెను. ఇవిగాక యాసంస్థానములో మఱియొక చిత్రమయినవాడుక యుండెను.పన్నులిచ్చుకొనలేని పేదజనులు కొన్నివస్తువులను సర్కారున కుచితముగాఁ గాని లేక మిక్కిలి స్వల్పధరకుగాని తెచ్చియిచ్చుచుండవలెను. అట్టివాడుక యుండఁగూడ దని దాని నితఁడు నిర్మూలించెను. ఆదేశమునందలి చేతిపనులను విశేషముగ వృద్ధిచేసినూతనవస్తునిర్మాణయంత్రములన బెట్టించెను. ఇందుముఖ్యమైనవి పంచదారచేయుయంత్రము, కాగితములుచేయుయంత్రము, దూదియంత్రము, వెండియు నతఁడు స్టాంపుచట్టము నొకటి నిర్మించి కాఫీగింజలుపండెడు నేలలకు పన్నులు కొట్టివేసి చిల్లరసరకులమీఁద నెగుమతిపన్నులు తీసివేసి భూమిలో పండిన వస్తువులనేటేట పరిదర్శనములు పెట్టించి జనులకుఁ జూపి కృషి నభివృద్ధిఁజేసి జనులు పెట్టుకొన్న చిన్నపాఠశాలలకు నేటేటఁ గొంతధనసహాయమిచ్చి విద్యాభివృద్ధిఁజేయుచు నార్మలుపాఠశాలలు స్థాపించుచు నల్లమందుమీఁద దిగుమతిపన్ను గొట్టివేసి తిరువాన్కూరులోనున్న జలాధారములను వృద్ధిపఱచి శాశ్వతమైనయుపకారముఁ

జేసెను. వేయేల! సంస్థానమంతటను బాగుచేయని డిపార్టుమెంటొ కటియు లేదు. అతని ప్రజ్ఞయే మోగాని యాతఁడు సంస్థానపుసొమ్ము ఖర్చుపెట్టిచేయించిన పనులలో నొకటియు సొమ్మువంఁడుగ యగునట్లు నిష్ఫలముకాలేదు. అట్లు తానుచేసిన యనేక సంస్కారములచే త సంస్థానమంతయు రత్నగర్భయయి ధనముతోఁ దులదూఁగు చున్నందునఁ దనకార్యముల ఫలితములం జూచుచుఁ జిరకాలము సంస్థానమునందుఁ బనిచేయవలయు నని రామయ్యంగారు తలంచిరి. కాని యట్లు చేయుటకు వీలుపడదయ్యె.

ఇప్పటి మహారాజుగారియొద్ద నొకసంవత్సరము పనిచేసితాను ప్రారంభించిన సర్వేసెటిలుమెంటు రెండుతాలూకాలలో మాత్రమే సమాప్తమగునప్పటికి నతఁడుతిరువాన్కూరు వదలిపెట్టవలసివచ్చెను. రామయ్యంగారు సంస్థానమును విడిచివెళ్ళుటకు కొన్నిదినముల పూర్వమందు ప్రస్తుత మహారాజుగారు మంత్రిపేర నొకజాబు వ్రాసిరి. ఆజాబులో రామయ్యంగారు జనులయభివృద్ధికై యాఱు సంవత్సరములు పాటుపడినట్లు వ్రాసిరి. ఈవిధముగానే యింగ్లీషువారి రెసిడెంటుకూడవ్రాసెను. 1887 వ సం॥మున రామయ్యంగారు తిరువాన్కూరు సంస్థానమువిడిచి తనజీవితకాలశేషము మతవ్యాసంగములలోఁ గడుపఁదలఁచి చెన్నపురముం జేరెను. కాని యాసంవత్సరము చెన్నపట్టణములోఁ గాసిన యెండలవేఁడిమి యాయన శరీరమునకుఁ బడక జ్వరబాధఁగలిగించెను. ఎన్నిచికిత్సలుచేసిన నదినివారితముగాక యెట్టకేల కాయన ప్రాణముఁదీసి చెన్నపట్టణమునకు సత్పురుషవియోగముఁ గావించెను.

రామయ్యంగారు పుస్తకములు చదువుటయందు మిక్కిలి తమకముఁగలవాఁడు. చెన్నపట్టణపు పుస్తకముల దుకాణములలో గ్రంథములు కొననినెల సీమనుండి పుస్తకములు తెప్పింపనినెల లేద

ని చెప్పవచ్చును. ఆయన మరణానంతరము భార్య యాతని గ్రంథ భాండారము శ్రీపచ్చయ్యప్పగారి కళాశాలకు బహుమానముగ నిచ్చెను. అక్కడనిప్పటికి రామయ్యంగారు శ్రద్ధతో జదివయానవాళ్లుగల పుస్తకములు మనమిప్పుడు చూడవచ్చును. తనయొద్దకు వచ్చినవారి కందఱకు నతఁడు మంచిపద్ధతుల నేర్పఱచు సంభాషణమందుఁ గాని వ్రాతయందుఁగాని యతిశయోక్తి గర్హించుచుండెను. రామయ్యం గారు మితభాషి. ఏసంగతినిగాని జరిగిన యథార్థమంతయుఁ దెలిసి కొనకముందతఁడునమ్మువాఁడు కాఁడు. ఈసంగతియాయనజాబులుచూచినవారికిఁదెలియును. ఆయనకుస్వభావముచేతనే కొన్నివిషయములం దిష్టము కొన్నివిషయములం దనిష్టము గలుగుచువచ్చెను. కాని తన తప్పులను తనకు సహేతుకముగ నెవరయిన నెఱిఁగించిన నవియొప్పు కొని తననడతదిద్దుకొనుచు వచ్చెను. అతఁడు తాబేదారుల యొద్దనుండి కఠినముగఁ బనిపుచ్చుకొనునట్టి యజమానుఁడు. తన పైయధికారులయొద్ద తానుకూడ నట్లె పనిచేసెను. వ్యవహారములలోఁ గఠినుఁడగుటచేత నతని యాప్తులైనవారే యనేకులు తమ్మతఁడు గౌరవభంగముచేసెనని విచారించుచువచ్చిరి. అతఁడు ప్రాచీనపద్ధతులయం దభిమతముగలవాఁడైనను నూతనపద్ధతులమీఁద మార్పులను మెల్లగాఁ జేయ నిచ్చగలవాఁడు. తనయిల్లు యూరోపియనుల గృహములవిధము ననుంచుకొని తనయాఁడువాండ్రకు నింగ్లీషుభాషయు నింగ్లీషుసంగీతముఁ జెప్పించి యింగ్లీషు వారిని తనయింటికి విందునకుఁబిలిచి వారితో నెక్కువమైత్రినడపిన స్వదేశస్థులలో నితఁడే మొట్టమొదటివాఁడు. యూరోపియనులకు స్వదేశస్థులకు సాంఘికసంబంధములను వృద్ధిజేయుట కప్పటి గవర్నరుగారగు నేపియరుప్రభువు కాస్మాపాలిటను క్లబ్బను పేరనొకసభ స్థాపింపుమనిచెప్పనట్టిసభ స్థాపించినయతఁడితఁడే. దానికి మొదటికార్యదర్శి యితఁడే. గవర్నరుగారి శాసననిర్మాణసభ

లో స్వదేశసభికుల నెక్కువమందిని చేర్పవలసినదనియు బడ్జెటువిషయ మయిన చర్చ జరిగించుటకు నవసరమయినపుడు గవర్నమెంటువారిని పరిశ్నలడుగుటకు సభికులకధికార మీయవలసినదనియు దొరతనము వారిని మొట్టమొదట నడిగిన ధైర్యశాలియితఁడే. ఇవియన్నియుఁ గ్రిమక్రిమమున మనదేశస్థులకు లభించినవికాని యీయన మరణానంతరమందుననఁగా నీయనయడిగినచాలకాలమునకులభించినవి. తిరువాన్కూరులోనున్నప్పుడీయన "పరలోకమే మన మనోరథము" అను నర్థమువచ్చునట్టి యింగ్లీషుమాటలను బంగారపు టక్షరములతో నొక్కొక్కయక్షర మొక్కొక్క బొమ్మగా నుండునట్లచ్చు వేయించి ప్రతిదినమది తన కగపడునట్లు గృహమునం గట్టుకొనియెను.



రాజమహేంద్రవరము

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు

పోతాప్రగడ శేషగిరిరావుగారిచేఁ

ముద్రింపఁబడియె.

1927.

